ఇతిహాసతరంగిణీ గ్రంథమాల. ౧.

సంపాదకుడు:

చిలుకూరి వీరభద్రరావు.

# ఆంధ్రుల చరిత్రము

ఐదవ సంపుటము.



గ్రంథకర్త:

చిలుకూరి వీరభద్రరావు.

# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము

చిలుకూరి వీరభద్రరావుచే

రచింపఁబడినది



నూతన ముద్రణము.

రాజమహేంద్రవరము.

1936

వెల రెండు రూపాయలు.

TO

**The Late Komarraju**
**Lakshmana Rao Pantulu Garu, M.A.**

The Founder of

Vignana Chandrika Mandali

and

The Editor of

The

Andhra Vignana Sarvasvam

THIS BOOK IS MOST RESPECTFULLY DEDICATED
BY HIS FRIEND

**THE AUTHOR**

విజ్ఞానచంద్రికామండలి సంస్థాపకులును,

— విజ్ఞానచంద్రికామండలి —

— ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము —

సంపాదకులుగానుండి

నాచే నీమహాకార్యమును నిర్వహింపఁజేసిన

— నామిత్రులు, కీర్తిశేషులైన —

కొమర్రాజు లక్ష్మణరాయ

= సుధీమణికి =

నీగ్రంథము నంకిత మొనరించుచున్నాను.

viii

# రాజపోషకులు

౧. తహావార్ – ఓ – జలదత్ – దస్తఘు, మన్నెసుల్తాన్, శ్రీశ్రీశ్రీ మేకా వేంకటాద్రి అప్పారావు బహదూర్ గారు, జమీందారు, ఉయ్యూరు, ఎస్టేటు నూజివీడు.

౨. శ్రీయుత జి. పి. సి. హెచ్. శ్రీరామకృష్ణులు. హైదరాబాదు, దక్కన్.

## పోషకులు.

౧ శ్రీయుత పింగలి కోదండరామిరెడ్డిగారు, దేశముఖ్, హైదరాబాదు, దక్కన్.

౨ ,, వేలూరు రంగధామనాయుఁడుగారు, రిటైర్డు ఇంజనీరు, సుల్తాను బజార్, హైదరాబాదు, దక్కన్.

౩ ,, సింగంసెట్టి వేంకటస్వామిగారు, హైకోర్టువకీలు, గొల్ల ఖిడికి, హైదరాబాదు, దక్కన్.

౪ ,, ఎం. నరసింగరావుగారు బి. ఏ., రిటైర్డు సీనియర్ అసిస్టాంటు ఆడిటరు, యన్. జి. రెయిల్వే. దిహెర్మిటేజి, నాయిన్నగరు, హనుమకొండ.

౫ ,, వావిళ్ళ రామస్వామి శాస్త్రుర్లు అండ్ సన్సు 293 ఎస్ప్లనేడు, మదారాసు.

## అభిమానులు.

౧ ,, దేశభక్త, ధర్మవీర, వామనరామచంద్ర నాయక్ గారు, బారిస్టరు, జాగీర్దార్, గౌలిగూడెం, హైదరాబాదు దక్కన్.

౨ ,, గడ్డంపల్లి రామకృష్ణారెడ్డిగారు, దేశముఖ్, వనపర్తి రాజాగారి బంగాళా, జాంబాగు, హైదరాబాదు, దక్కన్.

౩ ,, కొండా వేంకటరంగారెడ్డిగారు, హైకోర్టు వకీలు, పీల్ ఖానా, హైదరాబాదు, దక్కన్.

౪ ,, వైద్యభూషణ, హకీం జనార్దనస్వామిగారు, గౌలిగూడెం హైదరాబాదు, దక్కన్.

viii

" తాళ్ళ దానయ్యా గౌడుగారి కుమారుడు శంకరయ్యాం గౌడుగారు, ఆబ్కారీకంట్రాక్టరు, సైదబాదు, హైదరాబాదు, దక్కన్.

౬ " పొన్నాల అంతన్నగారు, జనరల్ కంట్రాక్టరు, సికింద్రాబాదు, దక్కన్.

౭ " తోట అప్పయ్యగారు, జనరల్ కంట్రాక్టరు, సికిందాబాదు, దక్కన్.

౮ " గుమ్మళ్ళ నారాయణస్వామిగారు, మక్తేదార్, గొల్లఖిడికి హైదరాబాదు, దక్కన్.

౯ " గూటాల వీరన్నగారు, సాహకార్, పీల్‌ఖానా, హైదరాబాదు దక్కన్.

౧౦ " అమరం రాజయ్యగారు, పాలవంచ రాజాగారి కంట్రాక్టరు, సికింద్రాబాదు, దక్కన్.

౧౧ " మాసెట్టి హనుమయ్యా గుప్తగారు, మర్చెంటు, ఇస్లామియాబజారు, హైదరాబాదు, దక్కన్.

౧౨ " తుంగా రామన్నగారు, మర్చెంటు ఇస్లామియాబజారు హైదరాబాదు, దక్కన్.

౧౩ " ఎఱ్ఱం సత్యనారాయణగారు, మర్చెంటు, ఇస్లామియాబజార్ హైదరాబాదు, దక్కన్.

౧౪ " బి. వి. కృష్ణారావుగారు, వరంగల్.

౧౫ " ఓగిరాల సుబ్బారావు పంతులుగారు, పండిట్, సిటీ కాలేజి, హైదరాబాదు, దక్కన్.

౧౬ " శీరిపి ఆంజనేయులుగారు, ప్లీడరు, అనంతపురం.

౧౭ " గోగినేని వెంకటసుబ్బారావుగారు, ప్రెసిడెంటు తిలకు గ్రంథాలయము, నడింపల్లి గుంటూరుజిల్లా.

౧౮ " రావూరి హనుమంత దుర్గాప్రసాదరావు పంతులుగ్గారు రావూరు, తెనాలితాలూకా, గుంటూరుజిల్లా.

# అవతారిక.

“ క. వినఁదగు నెవ్వరు సెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁ దగున్
కనికల్ల నిజము దెలిసిన
మనుజుఁడె పో నీతిపరుఁడు మహిలో సుమతీ ”

ఇరువది మూఁడేండ్లక్రిందట అనఁగా 1912 సంవత్సరము జూను నెలలో విజ్ఞాన చంద్రికామండలివారు నేను వ్రాసిన యాంధ్రుల చరిత్రము రెండవభాగమును నాలుగువేల ప్రతులను ముద్రింపించి ప్రకటించియున్నారు. విజ్ఞానచంద్రికా గ్రంథమాల సంపాదకులగు లక్ష్మణరావుపంతులుగారు “తమ సంపాదకీయ భూమిక” లోనిట్లు వ్రాసియున్నారు.

“ చరిత్రలు వ్రాయుట సులభసాధ్యముగాదు. అందును నిదివఱకు మార్గమేర్పడని పట్టులను సాధించుట కష్టతరము. ఆంధ్రజాతి చరిత్రమునకు రాచబాటనైన మొదట వేసినవారు మాగ్రంథకర్తలగు శ్రీచిలుకూరి వీరభద్రరావుగారు అని నుడువుటలో సాహసం బేమియును లేదు. దుర్గమ ప్రదేశములకు మార్గమేర్పఱుపఁబూనువారు అనేక తరులతాదుల భేదింపవలసియుండును. అందొకకొన్ని నైజముగ మిక్కిలి యుపయోగకారులయి యుండవచ్చును. అట్టివానిని మహత్తరోపయోగమునకై త్యజింపవలసి యుండును. మార్గనిర్మాత ప్రమాదవశంబున నొక్కొక్కెడ నుపయోగ పరిమితి నిర్ణయించుకొనలేకపోవచ్చును. పరిస్థితి వైపరీత్యంబువలన నుపయుక్తంబగు పదార్థంబు విషమంబుగఁ గాన్పించుటగూడఁ గలదు. ఈవిధమున బొసఁగులోపంబుల కన్నింటికిని మార్గనిర్మాత

యుత్తరవాది యనుట లెస్సయగునే? అట్లే ఆంధ్రచరిత్ర ప్రపంచం బునంగూడ ప్రాథమికోద్యమంబగు నీగ్రంథరాజంబున నెఱసులుండిన యెడల నవ్వానిని బుధులు సంస్కరించిన నాంధ్రదేశంబునకు గ్రంథ కర్తతోఁబాటు లాభము కలుగఁజేసినవారే యగుదురు. ఆనమ్మకము మాకు కలదగుటనుజేసి మేమీ మహాకార్యమునకు గడంగి యున్నారము. ఆంధ్రచరిత్రాధ్యయన పరులెల్లరును మాకు సాయపడ బ్రార్థితులు."

నేనుగూడ నాగ్రంథములోని యవతారికలో నీక్రిందివాక్యములను వ్రాసి యున్నాను.

సమగ్రము- సప్రమాణము.

"సమగ్రమును సప్రమాణము నగునాంధ్రదేశచరిత్రము వ్రాయుట మిక్కిలి యగత్యమె కాని యొకసారిగా సమగ్రమును సప్రమాణము నగు చరిత్రము వ్రాయుట సాధ్యముగాదు. ఒకనికి సప్రమాణముగఁ గన్పట్టినది యింకొకనికి నప్రమాణముగఁ గన్పట్టు చుండును. ఒకకాలమునందు సమగ్రమనిపించుకొన్నది మఱియొక కాలమునం దసమగ్ర మనిపించుకొనును. కాలము గడచిన కొలఁది, జనసామాన్యమునకు స్వదేశ చరిత్రమునం దభిరుచి పుట్టిన కొలఁది, విద్యాభివృద్ధి కలిగిన కొలఁది, చరిత్రసాధనములు పెంపొందిన కొలఁద, చరిత్రపరిశోధన మభివృద్ధిగాంచిన కొలఁది, ఉత్కృష్టమేధావంతులు జనించిన కొలఁది, దేశచరిత్రము దినక్రమప్రవర్ధమానమై వన్నెగాంచుచుండును. అంతియకాని సమగ్రమునుసప్రమాణమునగు చరిత్ర మొకనిచేగాని బహుజనులచే గాని యేకకాలమునందు వ్రాయ నలవి కాదని తెలిసికొనవలయును.

ఆంధ్రదేశచరిత్రము వ్రాయుటకు శాసనములు ముఖ్యాధారములు. ఇయ్యవి వేలకొలఁది గలవు. కొన్ని ప్రకటింపఁబడినవి. మఱికొన్ని ప్రకటింపఁబడవలసియున్నవి. ఇంకను వేలకొలఁది ప్రతులెత్తుకొనఁబడవలసియున్నవి. వీని నన్నిటిని పరిశోధించి సమన్వయించుకొనవలయును. ఇంకను భావికాలమున శిలాశాసనములు తామ్రశాసనములు బయలుపడి క్రొత్తచరిత్రాంశములను వెల్వరింపవచ్చును. అట్లగుటవలన సమగ్రమయినట్టియుఁ సప్రమాణమైనట్టియు దేశచరిత్రము వ్రాయుట కెవ్వనికి సాధ్యమగును? నా యాంధ్రులచరిత్రము సమగ్రమయిన దని నేనెప్పుడును చెప్పియుండలేదు. నేనపేక్షించున దెల్లఁ జరిత్రజ్ఞు లగువారు నాగ్రంథమును జదివి గుణదోషపరిశీలనముచేసి యనురాగముతో నాకుఁ దెలిపి సుకరమైన మార్గమును జూపి తోడ్పడవలయు ననియె. ”

ఏ యదృష్టవశముననో యెఱుంగరాదు గాని ఆ రెండవ భాగము వెల్వడిన వెనువెంటనే దేశమున మున్నెన్నఁడెఱుంగని కల్వరము పుట్టి అదివఱకు నిద్రాముద్రితములైన యాత్మలో కుక్కుమ్మడి మేల్కొనుట సంభవించి పదనైన విమర్శజ్ఞాన ముదయించి యాంధ్రోద్యమ రూపమునుదాల్చి మేల్కొన్న యాత్మలను స్వేచ్ఛావిహారమునకుఁబోనీయక యరికట్టగలిగినది. ఆ గ్రంథము వ్రాయునప్పుడు కాకతీయచరిత్రమున కత్యావశ్యక మగు నుపకరణములు చాల స్వల్పముగ నుండెను. అయినను ఆ స్వల్పసాధనములతోనే కాకతీయచరిత్రము గూర్పవలసి వచ్చినది. ఏ కార్యమునైనను క్రొత్తగా పూనుకొని పనిచేయుట కష్టము. చేసినదానిలో తప్పులుపట్టుట సులభమైనపని. ఇఁకఁ జరిత్రము విషయమున చెప్పనక్కఱ లేదు. విమర్శగ్రంథములు వెలువడినవి. పత్రికలలో చర్చలు ప్రబలినవి. కాని యివియన్నియుఁ గులస్పర్ధలతోఁ గూడుకొన్నవియై నూత్న

చరిత్రాంశములను బయల్పఱచుట కశక్తములై యుండినవి. ఎవరెంత చర్చచేసినను నేను మున్ను బయల్పఱిచిన సాధనములనుబట్టి కుతర్కములకు తావిచ్చి శబ్దములకు విపరీతార్థములను గల్పించి కల్పనా కౌశలమును జూపుచుఁ బెనఁగులాడుటయే గాని న్యాయమైన కృషి చేసి నూత్న చరిత్రాంశములకై సంశోధన గావించి దేశచరిత్రమును విస్తరింపఁ జేయుటకు మాఱుగా వ్రాసినదానినే తలలుమార్చి వ్రాయుచు నన్ను నారంగమునుండి త్రోసిరాజనిపించుటకుఁ బ్రయత్నము సేయుట గానుపించుచుండెనే కాని యంతకంటె వేఱు ప్రయోజనము గానుపించకుండెను. అందువలన సత్యధర్మములు తల క్రిందుగాలేదు. చరిత్రము తలక్రిందుగాఁలేదు. దేశము తలక్రిందుగా లేదు. అవియన్నియు యథాస్థితి యందేనిలిచి యున్నవి. దేశచరిత్రము యొక్క ప్రయోజనమును గూర్చి పాఠకులకు నెక్కువగఁ జెప్ప నక్కరలేదు. కాని మన యాంధ్రదేశ మీ విషయమునఁ జూపు చున్న విముఖత్వభావమునుబరిశీలించినపుడు మాత్ర మెట్టివ్యక్తికైనను నిరుత్సాహమును విచారమును గలిగింపక మానదు.

ఇట్లుండినను అల్పసంఖ్యాకుల కృషిమూలమున దేశమునఁ బూర్వముకంటెఁ జారిత్రకజ్ఞానము విస్తరించుచునే యున్నది. క్రమముగాఁ బూర్వముకంటె చరిత్రపరిశోధకుల సంఖ్య పెఱుగుచునే యున్నది. ఇదియెంతో సంతోషకరమైన విషయమెగాని వీరిలో శిక్షణ శీలములు లేకున్నయెడల వారభివృద్ధికివచ్చుట కష్టము. చరిత్ర పరిశోధకులుగ నుండ దలచినవారు సత్యమునకు బద్ధులయి యుండక తప్పదు. తమకు పూర్వము పరిశోధనమం దాఱితేఱిన వారిపట్ల కృతజ్ఞతాబుద్ధి యుండవలయును. కృత్రిమోపాయములచేత పేరు వచ్చునని కొనుట విపరీతవిషయము.

## కాకతీయసంచిక.

యీనాయాంధ్రుల చరిత్రము రెండవభాగము ప్రకటింపఁబడిన యిరువదిమూఁడు సంవత్సరములకుఁ బిమ్మట కాకతీయ చరిత్రమును దెలుపు నగ్రంథము రాజమహేంద్రపురములోని ఆంధ్రేతిహాస పరిశోధకమండలి వారిచేఁ బ్రకటింపఁబడిన "కాకతీయసంచిక" యను నదొక్కటే గానుపించగలదు. ఇట్టి యుద్గ్రంథముండఁగామరల "కాకతీయాంధ్రరాజయుగచరిత్ర" మనుపేరుపెట్టి చర్విత చర్వణముగా నీగ్రంథమేల ప్రకటింపవలసి వచ్చెనని కొందఱుఁదోఁచి ప్రశ్నింప వచ్చును. అట్టి ప్రశ్నముపుట్టక మునుపే యిందునుగూర్చి యొకింత చమత్కారకథ విన్పింప నవసరము పట్టినది. ఇతిహాసమండలిని ప్రతిష్ఠాపించిన నల్వురలో నేనొక్కఁడను. 1925 సంవత్సరములో మొలకెత్తిన మండలివారి యాంగ్లత్రైమాసిక పత్రిక ప్రథమ సంపుటము ప్రథమసంచికలో నిట్లు వ్రాయఁబడినది.

The Society owes its inception and existence to the inspiring work and guidence of Mr. C. Veerabhadra Rao, the premier Historian of the Andhras whose book was published in 1908 (1910) and from which many a learned scholar has drawn material help for the construction of an otherwise difficult and still unexplored history of the Andhras, Mr. M. Somasekhara Sarma, Mr. Bhavaraju V. Krishnarao and Mr. C. Narayana Rao.

ఎవరిగ్రంథము 1908 లో ప్రకటింపఁబడినదో ఎవరి గ్రంథమునుండి కష్టతరమైనట్టియు, పరిశోధింపఁ బడనట్టియు నాంధ్రచరిత్ర నిర్మాణమునకై ప్రతివిద్యాధికుఁడును సాధనసంపత్తిని బడయుచున్నాఁడో అట్టి ప్రధానాంధ్ర చరిత్రకారులగు చి. వీరభద్రరావు గారి యావేశపూరితమైన కృషిపోషకత్వముల క్రిందను వారిచేతను, మ. సోమశేఖరశర్మ, భావరాజు వెం॥ కృష్ణరావు, చి. నారాయణ రావుగార్ల చేతను మండలిస్థాపింపఁబడినది.

ఈమండలివారు "కళింగ సంచికను" ప్రకటింపఁబూని కార్యదర్శిగానుండిన రాళ్ళబండి సుబ్బారావు ఎం. ఏ. గారిని సంపాదకులుగా నియమించిరి. అప్పుడు నేను మండలివారి కార్యనిర్వాహక వర్గములో సభ్యుఁడనుగా నుంటిని. తమ సంపాదకత్వమునఁ దయారు కాఁబడు "కళింగ సంచిక" విషయమై నేనెట్టి జోక్యము కలిగించు కొనకుండుటకై యొకయుక్తి గనుపెట్టి నన్ను గౌరవసభ్యునిగా నెన్ని కొనుటకై యొక తీర్మానమును బ్రవేశపెట్టి కృతకృత్యులైరి. గౌరవ సభ్యునకు కార్యనిర్వాహక సభలో నుండుటకు మండలివారి నిబంధనల ననుసరించి యవకాశములేదు. తరువాత నేను 1932 సంవత్సరములో భారతి పత్రికలో "కళింగ సంచిక"ను తీవ్రముగా విమర్శించుటచేతను, మండలివారు "కాకతీయసంచిక"ను బ్రచురించుటకుఁ బ్రకటించియున్నారు గనుకను, కార్యదర్శిగాను, కార్యనిర్వాహకసభలో నూతనముగ జేరిన శ్రీయుత మారేమండ రామారావుగారు బి. ఏ. (ఆనర్సు) ను కర్తచేసి కార్యనిర్వాహకసభ్యులు 9గురులోను మఱిముగ్గురను వశ్యులను గావించుకొని నేను మద్రాసులోనున్నకాలమున నన్ను "గౌరవసభ్య" పదవినుండి తొలగించిరి. ఈవిషయమును నాకుఁ దెలియపఱచలేదు. తమ త్రైమాసిక పత్రిక యందును బ్రకటింపలేదు. నేను మద్రాసునుండి వచ్చువఱకు నాకు దెలియనేలేదు. అటుపిమ్మట కార్యనిర్వాహక వర్గమువారు మారేమండ రామారావు బి.ఏ. (ఆనర్సు) బి. ఇడి. గారిని సంపాదకులుగా నియమించిరి. తరువాత శివయోగసార గ్రంథావతారికనుగూర్చి నేను 'సుభాషిపత్రిక' లో వ్రాసి ప్రకటించిన "అన్నయదేవుఁడు వింత చరిత్రాంశములు" అను వ్యాసములోని విషయమును మండలివారి త్రైమాసిక పత్రిక యందుపయోగ పరచుకొనియు, అచట "సుభాషి" పేరు, నాపేరు నెత్తియుండియు, నన్ను గౌరవ పదవినుండి తప్పించిన తరువాతనే ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలో

ఆంగీరస సం॥ ర॥ మార్గశీర్ష పుష్యమాస (1933) సంచికలో "శివయోగసారము" అను శిల్పకళ్ళో నొక సశేషవ్యాసమును బ్రకటించి అందు చరిత్రమునకును, మతమునకును గూడ మిక్కిలి ముఖ్యమగు నీగ్రంథము చరిత్రకారుల దృష్టినాకర్షింపలేదని వ్రాయ సాహసించినారు. దేవరకొండలోనో మఱియొక ప్రదేశమునందో జరిగిన హైదరాబాదు రాష్ట్రము ద్వితీయాంధ్రసభలో నేనువ్రాసిన యాంధ్రులచరిత్రము నిజమైనచరిత్రము కాదనియు తాము నిజమైనచరిత్రము వ్రాయఁబోవుచున్నామని యుపన్యసించినట్లుగా నాకుఁజెప్పిన మిత్రుడే సాహిత్యపరిషత్పత్రికలో నతఁడు వ్రాసిన వ్యాసమును జూచియుఁ నాపట్లచూపిన చర్యనుగూర్చియు నేనసహ్యించు కొనుచున్నానను సమాచారమును జేరవేయుటచేతను గాఁబోలు నావ్యాసమును సశేషముగానే నిలిపివేసి నాయందు తమకాదరభావమున్నట్లుగా నాకుఁదెలుఁపగోరి 9-4-1933 తేదీని ఈక్రింది జాబును నాకు వ్రాసిరి.

"ఆర్యా! నమస్కారములు. మండలివారు కాకతీయసంచికను ముద్రింపించుచున్న విషయము దమకు దెలిసియే యుండును. ముద్రణముచాల భాగమైనది. మండలిసిస్థాపించినవారిలో దామొకరు. ఆంధ్రచరిత్ర పరిశోధనమునకు మార్గదర్శులు. పండితులు, విజ్ఞాన సేవకులు మండలి తమ బిడ్డ. ఈబిడ్డను శోభింపఁజేయుటకై నిర్మింపఁబడు నలంకారమునకు పితరులగు తామొక వ్యాసాఖ్యమగు మణిరాజమును బ్రసాదించుట ధర్మము. ఈ ఏప్రియలు నెలాఖరులోగా వ్యాసముల నన్నిటిని సేకరింపవలెనని సంపాదకీయ సంఘమువారు తీర్మానించి యున్నారు. ఆంధ్రులచరిత్రకారులగు తమరు కాకతీయచరిత్రమున కూలంకషమగు బరిశోధనను గావించి తమ "ఆంధ్రులచరిత్రము" రెండవభాగమున సగమునకు పైగా గాకతీయ యశోగానము నొనర్చి

యున్నారు. గాన వస్తుపరిచయమును బట్టియు, మండలిస్థాప కత్వమును బట్టియు, దమరిని సంచికకు గాకతీయులను గూర్చియే దే నొకవ్యాసరాజము నొసంగ ప్రార్థించెదను. ఈనెలాఖరులోగా సాధ్య మైనంత త్వరలో దయచేయుడని మనవి. విద్వాంసులును, విద్వజ్జన పరిశ్రమాభిజ్ఞులునగు తమరు తప్పక నీ విషయమున మండలికి సహా యము చేయుదురుగాక. ప్రప్రథమమున నాంధ్రదేశచరిత్రము రచించి యాధునిక పరిశోధకులకు మార్గమును జూపి తాము యాదర్శకకార్య భారమును వహించిరి. ఆంధ్రదేశ చారిత్రకసంబంధములగు పరిశ్రమల నొనర్చు ప్రతివారును దమకు శ్రమనిచ్చుటయు, దమమార్గదర్శిత్వము వలన దమకు గలుగు బాధకములు. గాన తమ కియ్యదిధర్మము. వయోవృద్ధులగు తమకు శ్రమగల్గించుట తప్పే. అయినను తమ విద్యావృద్ధత్వము తమకిట్టిశ్రమను గల్గించును. తప్పక తమరు మండ లికి పైసహాయము నొనర్తురని తలచెదను తమవ్యాసనామమును ముందుగ దెల్పినచో సంతసించెదను. శ్రమయిచ్చినందులకు క్షమింప వలెను. చిత్తగించవలెను. కృతజ్ఞుడు మారేమండ రామారావు. కాకతీయ సంచికా సంపాదకుడు.”

ఇట్టిజాబు వ్రాసినందు కేడ్వనా? సంతసింపనా? ఏమి యీకృ తజ్ఞతా లక్షణము? ఆత్మగౌరవమును బాటించి కాకతీయ సంచికకు నే నేవ్యాసమును వ్రాసియుండలేదు. భూమిదేవి యెట్టివారినైన భరిం తును గాని కృతఘ్నుని భరింపలేనని పురాణగాథ దెలుపుచున్నది. ఈయనతో మైత్రిగాని విరోధముగాని యింతవఱకు లేవు. నాజీవిత ములో వీరితోటి పరిచయము ఒకటి రెండు గంటలుమాత్రమె యని మనవి చేయుచున్నాను. కాకతీయసంచికలో విడిచిపెట్టబడిన యనేక నూత్న విషయము లిందు చర్చింపబడినవి. సందిగ్ధములుగానున్న పెక్కువిషయములు నిర్ధారింపబడినవి. ఈరెంటికిని అనగా కాకా

తీయాంధ్రరాజయుగ చరిత్రమునకును, కాకతీయ సంచికకును గల భేదమెక్కడెక్కడ గలదో చరిత్రపరిశోధకులు గనిపెట్టగలరు. అయినను కాకతీయ సంచికకు పోటీగా రచించినదికా దీకాకతీయాంధ్ర రాజయుగచరిత్రము. ఈయైదవసంపుటముముందు ప్రకటించుటకిదియే కారణమని మాత్రము చెప్పెదను కాని, ఇతిహాస మండలిలోని వారెల్లరు నిట్టివారేయని నాయభిప్రాయమెంతమాత్రముగాదు. అనేకులు విద్యాధికులయిన పెద్దమనుష్యులున్నారని నేనెఱుంగుదును. ఒకరిద్దఱుచేయు కుఱ్ఱతనపు చేష్టల మూలమున మండలికి గౌరవము పోగలదు గావున మండలి సభ్యులు మండలి గౌరవమును నిలుపువారుగా నుండవలయును. ఇకముందు మండలివారు ప్రకటించు సంచికలకు సంపాదకులుగ తగిన సమర్థతగలవారిని నియమింతురని విశ్వసించుచున్నాను. తప్పులుండరాదని కాదు. ఇట్టి సంచికలు ప్రకటించునపుడు తప్పులుండకమానవు. తప్పులు సవరించుకోవచ్చును గాని గౌరవహీనములై, కృత్రిమములైన మార్గములను గట్టిపెట్టించవలయును.

శ్రీలక్ష్మణరాయ పరిశోధక మండలివారు.

కాకతీయాంధ్ర రాజయుగచరిత్రము సమగ్రముగాను, సంపూర్ణముగను నుండవలెనన్న కాకతీయులచేఁ బరిపాలింపఁబడిన సామ్రాజ్యములోని మధ్యభాగమగు నాంధ్రమండలము లన్నియు నేఁడు "తెలంగాణా" అని వ్యవహరింపఁబడుచు మహోఘనత వహించిన నైజాముగారిచేపరిపాలింపఁబడుచుండిన హైదరాబాదురాష్ట్రంబున నొక ప్రధానభాగమై యుండుటచేత నాభాగమునందు వెల్వడిన శాసనముల యాధారముననే వ్రాయఁబడవలసి యుండెను. ఇరువది మూడు సంవత్సరములకుఁ బూర్వము బ్రిటీషు ప్రభుత్వమువారివలె నైజాము ప్రభుత్వము వారు పురాతత్త్వశాఖాకార్యస్థానము

(Archeological Department) నేర్పాటు చేసియుండనందున నా ప్రదేశమునందలి శాసనములబరిశోధించుభాగ్యమునాకబ్బినదికాదు తరువాత హైదరాబాదు రాష్ట్రమునందు బ్రిటీషుప్రభుత్వమునందువలె నొక శాఖ యేర్పడి యిటీవల పని ప్రారంభింపఁబడి అభివృద్ధికరముగా జరుగుచున్నది. 1927 వ సంవత్సరమున శ్రీలక్ష్మణరాయ పరిశోధకమండలి యను పేరిట హైదరాబాదు రాజ్యమున సుప్రసిద్ధ చరిత్రపరిశోధకాగ్రగణ్యులై, "విజ్ఞానచంద్రికా మండలి" సంపాదకులుగాను, "ఆంధ్రవిజ్ఞాన సర్వస్వ" సంపాదకులుగ నుండి యనేక గ్రంథరాజములం బ్రకటించి మన యాంధ్రదేశము యొక్క దురదృష్టవశమున నడివయస్సుననే కీర్తిశేషు లయిపోయిన కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారి స్మారకచిహ్నముగా నొక పరిశోధకమండలి ప్రతిష్ఠాపింపఁబడి వారివిషయమునఁ గృషిచేసి "శ్రీశేషాద్రి రమణకవు" లను వారిని నియమించి 123 శాసనములవఱకు సంపాదించి వీనిని "తెలింగానాశాసనములో ప్రథమ సంపుటముగా 1935 సంవత్సరమునఁ బ్రకటింపఁ గలిగినారు. ఈ గ్రంథమును బ్రకటించుటకు నీమండలివారికి 8 సంవత్సరముల కాలము పట్టినది. ఈయాలస్యమునకుఁ గారణము మండలివారి యుపేక్షాభావమని తలంపరాదు. అయినను ఈకార్యమును నిర్వహించుటకు నియమింపఁబడిన "శ్రీశేషాద్రి రమణకవులు" పండితులైనను, కవులైనను, భాషాచరిత్ర మెఱింగిన వారును, చరిత్రపరిశోధనమందుగాని, లిపిశాస్త్రము నందుగాని యనుభవజ్ఞులు గాకుండుటచేతను, సంపాదకులుగ నియమింపఁబడిన మారేమండ రామారావు బి. ఏ. (ఆనర్సు) అను వారు గూడ యాంగ్లవిద్యా పట్టభద్రులయిన యువకులయినను, పై పండితులవలెనే ఈ విషయమున అనుభవజ్ఞులు గాకుండుటచేతను నీప్రకటన కార్యమునందు దోషములు పెక్కులు గాన్పించుచున్నవి. శ్రీ

లక్ష్మణరాయ పరిశోధక మండలివా రెంతో వ్యయప్రయాసల పాలయి యీ మహాకార్యమునకు సమకట్టినను చరిత్రపరిశోధకులకుఁ దృప్తికలుగకుండుటకు గారణము పైనఁ జూపినవియె. ఇట్టికార్యమును నిర్వహించుటకుఁ దగినవారు పట్టభద్రులు గాకపోయినను కీర్తిశేషు లయిన లక్ష్మణరావుగారిచేతిక్రిందఁ దరిబీతుగాంచి యీ విషయమున మంచి యనుభవజ్ఞానమును సంపాదించిన శ్రీయుత మల్లంపల్లి సోమ శేఖరశర్మగారిని నియమించి యున్నయెడల నెంతో తృప్తికరముగా నుండి యుండును. అయిన దానికేమి చేయఁగలము. ఇఁక ముందయి నను పై మండలివారు తలపెట్టు నిట్టికార్యములం దనుభవజ్ఞులయిన వారిని నియమించుట ప్రయోజనకరముగా నుండును.

హైదరాబాదు రాష్ట్రీయ శాఖవారు (Archeological Department) ఇంతకుఁ బూర్వమె తమ రాష్ట్రీయ శాసనము లం బ్రకటించుటకై డాక్టరు పుట్టపర్తి శ్రీనివాసాచార్యులను విద్యా వంతుని అనుభవజ్ఞానము గలవారిని నియమించిన వారనియు, వీరి శాసనముల సంపుటగ్రంథము త్వరలోనే వెలువడుననియు విను చున్నాను. అట్టి గ్రంథము వెలువడక పూర్వమె యీ "కాకతీయాంధ్రరాజయుగచరిత్రము" ప్రకటింప వలసివచ్చినందు కొకింతవిచా రించుచున్నాను. ఆ గ్రంథమువలన మఱికొన్ని క్రొత్తవిషయములు మనకుఁ దెలియవచ్చును. ఇట్టి మహాకార్యమును నా ప్రభుత్వము వారు నిర్వహించుచున్నందుకు హైదరాబాదు రాష్ట్రీయాంధ్ర ప్రజ లే గాకుండ బ్రిటీషురాష్ట్రీయాంధ్రప్రజలుకూడ కృతజ్ఞులై యుండక మానరు.

కావున నెట్టి లోపములున్నను శ్రీ లక్ష్మణరాయ పరిశోధక మండలివారి "తెలింగానా శాసన సంపుటమె" నాయీ గ్రంథము

నందు నెక్కు నగా నుపయోగించుకొనబడినందున శ్రీ మండలివారికి సామనఃపూర్వక కృతజ్ఞతా వందనము లర్పించుకొనుచున్నాను.

శ్రీ శేషాద్రి వెంకటరమణకవులు.

ఇట్టి యపూర్వభాగ్యము శ్రీ శేషాద్రిరమణ కవులకు లభించినది మొదలుకొని, అనఁగా 1923 సంవత్సరము మొదలుకొని పత్రికలలో పలువ్యాసములు వ్రాసి ప్రకటించుచు నప్పటప్పట నీసడింపు వాక్యములతో నన్నును, నాచరిత్రమును బరిహాసము చేయుచు, తమ యాధిక్యతను, అహంభావమును జూపుచున్నను "పిచ్చుకమీద నా బ్రహ్మాస్త్రప్రయోగ" మని శాంతము గల్పించుకొని మౌనమువహించి ప్రత్యుత్తరము లీయక యూరకొనుచుంటిని. ఇట్టినా పద్ధతిని జూచి తాము గొప్పచరిత్రకారులమైపోతిమను భావముతోఁ దమకు గల హద్దును గూడ మీఱి వ్రాయసాగిరి. శ్రీశేషాద్రిరమణ కవులతో నాకెట్టి స్నేహముగాని విరోధముగాని లేదు. వీరిలో శేషాచార్యులుగారిని నేనుచూచి యున్న జ్ఞాపకమే లేదు. రమణాచార్యులవారి నే నెఱుంగుదును గాని కించిత్పరిచయము మాత్రమె గలదు. వీరితో వివాదమెందుకొని మిత్రులందఱకు వలెనె నాప్రకటనమును బంపి వారి సహాయము నపేక్షించితిని.

అందుకుఁ బ్రత్యుత్తరముగా నీక్రింది జాబును వ్రాసిరి.

"తాము దయతో వ్రాసినజాబు చేరినది. జవాబువ్రాయుటలో జరిగిన ఆలస్యమునకు మన్నింపుడు. తమకు మూడంశములు వ్రాయఁదలంచి కొంటిని. మొదట చరిత్రాంశములను గుఱించి.

ఈమధ్యహనుమకొండలోని రుద్రదేవుని శాసనముఁ తెలంగాణాశాసనమును, కాకతీయసంచిక వెలువడినవిగదా. రుద్రదేవునిశాస

నములో చాలచరిత్రమునకు సరిపడని అంశములుగలవు, వానిచిత్త గించితిరా! లేక ఒక ప్రతికావలెనన్నఁ బంపుదును. కాకతీయుల ప్రత్యర్థులనుగూర్చి ఆ శాసనములోని వానిని నేనొక విధముగ నిర్ణయించితిని. దాని పట్టికపంపుమందురా? మీ సంపుటములోనికి ఏయే యంశములు కావలయునో తెలిపిన వానిని సముకూర్చి పంపుదును. ఖాజీపేట దర్గాలో (1వ బేతరాజు 1వ ప్రోలరాజు 2వ బేతరాజు త్రిభువమల్లుఁడు) అనువారి వృత్తాంతములుగల శాసనములభించినది. ఇదకొంతవరకే నేనొ సంగ్రబచురించిరి. పూర్తిపాఠము కావలయునా! గూడూరు శాసనముశిల అసమగ్రము. అందుచేత విషయము సయిత మసమగ్రము. నగునూరు నందనరునిశాసనము రుద్రదేవుని నాటిది. విలువగలది. ఇవియన్నియు తెలింగానాశాసన సంపుటములోఁ గలవు. వలయుచో ఒక తెలంగానాశాసనసంపుటము బంపుదును. ఇంతకు నన్ను ఏ యంశములపై విషయము వ్రాయమందురో తెలిపినచో విపులముగఁ దెలిసినంతలో వ్రాయుదును. అవసరమున్నంతలోఁ బరిగ్రహింపవచ్చును. మిగిలినది విడువవచ్చును. మీ సంపుటమునకు వలయుసేవ నానుండి మీరు గొనుటకు సంశయింపవలదని నామనవి.

తామ ఒకమారు ఈసంపుటము ముగియులోగా ఓరుగల్లు నకు దయచేయ గలుగుదురా? వలయు చరిత్రాంశములు స్థానికవిశేషములు గమనింపవచ్చును. అట్లు రాజాలరేని మీకుఁ గావలసిన చిత్రపటములపట్టిక వలసిన చరిత్రాంశము లనియు, వాని విమర్శనాభిప్రాయములయు జాబితా నైనను బంపినచో మేము పంపు విపుల ప్రత్యుత్తరములు మీకు గొంతయేని తోడ్పడగలదు. కాన అన్ని సంగతులు స్పష్టముగా వ్రాయుఁడు.

పోషకుల రాజపోషకులఁ జేర్చుట కష్టసాధ్యము. కాని చందాదారులను 20 లేక 25 మందినిజేర్చి ధనము మీకు నేను వసూలు చేసి పంపుదును. మీరు స్వయముగావచ్చిన నింక గొంతపని జరుగ వీలు కలుగునేమో నామిత్రులతో సంప్రతించి ఈచందాలు సాధ్యమగునంతత్వరలో సమకూర్చి పంపుటకు ప్రయత్నము చేయుదును. అల్పశక్తిగల నేనుచేయగల ఆర్థికసహాయమింతియ. ఇంతకు ఎక్కుడు చేయుగల్గుదునేని ధన్యుఁడ గ్రంథమునకు క్రియధనము ముట్టినట్లుగల రశీదులున్నచో 25 పంపుదు.

ఇచట తమజాబుపయి నింకొకరు చందాలకుఁ బ్రయత్నము చేయుచున్నట్లు తెలియచున్నది. అట్లుకాదేని నేనేస్వతంత్రించి సమకూర్పగలను. నాకంటె వారు ముందుగనేగినను నేను వారు ఒకచోట తారసిల్లినను పనిసాగుట కష్టము. కాన నింకొరు ప్రయత్నించుచున్నది లేనిదిగూడ తెలుపగోరుచున్నాను. మీజవాబుచూచినమీదట ఇంకను విపులముగా జవాబు వ్రాసికొందును. వరంగల్లు యీచుట్టుపట్టులనుండి యేయంశము గావలసినను సమకూర్చి పంపుదును. అంతియగాదు చరిత్రాంశములలోఁ గొన్ని ప్రశ్నములు మీరు సూచింపుడు. వానికి జవాబులు ఇంక నట్టిసంగతులు మఱియొక కొన్ని పట్టిక వ్రాసి పంపించెదను. దయచేసి విపులముగ సాధ్యమగు నంతత్వరలో జవాబు దయచేయఁ గోరెద.

విధేయుఁడు దూ. వేంకటరమణాచార్యులు."

ఇట్టి మహత్తరమైన జాబును హీరణ్యాక్ష వరములతోఁ బ్రసాదించిరి. ఈజాబుచేరిన మఱునాఁడే 10-10-35 తేదిని వారికి జవాబు పంపుకొంటిని. అందులో "ఖాజీపేట శాసన మత్యవసరమైనదనియు, దయచేసి దాని పూర్తిపాఠము పంపించవలసినదనియు, తెలిదిగ్నా

శాసనములు, నేయిస్తంబాలగుడి శాసనము (రుద్రదేవుని శాసనము)
కాకతీయసంచిక, నేతద్గ్రంథ సంపాదకులచే నాకందజేయఁబడిన
వనియు, వానిని తాము పంపనక్కర లేదనియు, చందాలు వసూలు
చేయవలసినదని నేనెవ్వరి కింతవఱకు వరంగల్లునకు రశీదుపుస్తకము
పంపలేదని మీకు వ్రాసినట్లుగనే నామిత్రులగు విద్వాన్ కంభంపాటి
అప్పన్నశాస్త్రిగారికి మాత్రము జాబువ్రాయుచు వారు వారి గ్రంథ
ములో ముద్రించిన చిత్రపటముల నేను ముద్రించుకొనుటకు దయ
చేయించవలసినదని కోరితి ననియు ఆచార్యులవారికి పంపిన జాబులో
జవాబువ్రాసి 25 రశీదు కాగితములుగల బుక్కునుగూడ బంపించి
యున్నాను. మీరిర్వురునాకుసమానమిత్రులేగావునజాబులువ్రాయుట
సంభవించినదనియు, నానిమిత్తము మీరు తగవులాడవలదనియుఁ
గూడ నాచార్యులుగారికి వ్రాసిన జాబులో వ్రాసియున్నాను. ఇంక
నాకుఁ బ్రత్యుత్తరము లేదు సరిగదా వెంటనే యాచార్యులవారు
"కాకతీయాంధ్రయుగ" మను పేరిట నొక విచిత్ర వ్యాసము
శేషాద్రిరమణకవులు 26-10-1935 తేదిగల కృష్ణాపత్రికలోఁ బ్రక
టించిరి. వీరా వ్యాసములో ఖాజీపేట దర్గాసమగ్రశిలా శాసనము
తాము ప్రచురించినట్లుగా వ్రాసినారు. ఆవ్యాసమును జూచి నేనచ్చె
రువుఁ జెందితిని. 17-11-35 తేదిగల ప్రజామిత్ర పత్రికలో "కాకతీ
యాంధ్రచరిత్ర" అను పేరిట వీరివ్యాసములోని చరిత్రాంశములను
ఖండించుచుఁ బ్రత్యుత్తర వ్యాసమును శాస్త్రిగారు ప్రకటించినారు.
నేను నా "కాకతీయాంధ్రరాజయుగ చరిత్రమును ముద్రించుటకుఁ
బ్రారంభించితిని. ఇర్వురి వ్యాసములు నాకమితమైన ప్రయాసను గల్గిం
నవి. "కాకతీయాంధ్ర చరిత్ర" తామే గుత్తకు గొన్నట్లు తమతమ
ప్రశ్నంబులకు వాదోపవాదములకుఁ బ్రత్యుత్తరము లిచ్చినఁగాని
కాకతీయాంధ్ర చరిత్రము సమగ్రము కాదని తలంపుతో నాబోతుల

వలె అంకెలువేసి కొనుచు డీకొని పోరాడుచు నడుమ లేగదూడ కాళ్ళ విఱుగదొక్కినట్లు నామీఁద పడుటచేత నాపని యాలస్యమై నా గ్రంథము పెఱిగిపోయినది. 400 పుటల గ్రంథము 600 పుటలకు పైగా నైపోయినది. ఎంతవఱకును రుద్రదేవుని శాసనముచుట్టును "గుడుగుడు గుంచము, గుంజారాగములు" దీయుటయె వీరి పనిగా నుండి వీరు ఓరంగల్లులో వెఱియొక పరిశోధకమండలి స్థాపించిరి. వీరుచేయు పనికన్న యార్భాటములు మెండు. హైదరాబాదు "లక్ష్మణరాయ పరిశోధకమండలిలోఁ జేరి వీరు పనిచేయుట యుక్తమమార్గముకాదా? ఉండెపో రెండు సంఘము లెందుకు? ఒకటి చాలదా? చేయునది స్వల్పము; ఆర్భాట మెక్కువ. ఇది చరిత్ర పరిశోధనమునఁ గృషిచేయువారి లక్షణముగా నుండరాదు.

శ్రీమూపాటి రమణాచార్యులవారు 23 కడనుండి రూపాయి చందాలనుఁ ఒక అభిమాని కడనుండి రు 12 లును వసూలుచేసి నా జాబునకుఁ బ్రత్యుత్తరము లేకపోయినా కడపట పంపినందుకు వారికిని, 6 చిత్రపటములను దయతో నొసంగినందుకు విద్వాన్ కంభంపాటి అప్పన్న శాస్త్రిగారికిని నామనఃపూర్వకవందనములాచరించుచున్నాను.

నా వలన నెట్టి ప్రతిఫలమును కోరక నాపత్రికటనమును బ్రకటించిన, ఆంధ్ర, కృష్ణా, త్రిలింగ, ప్రజామిత్ర, భారతి, ప్రబుద్ధాంధ్ర, సమదర్శిని, గోల్కొండ పత్రికాధిపతులకు నామనఃపూర్వకవందనము లాచరించుచున్నాను.

అందఱికన్న మిన్నఁగా హైదరాబాదు రాష్ట్రీయాంధ్రులకు, అందు ముఖ్యముగా నా చిరకాలమిత్రులును, శ్రీలక్ష్మణరాయ పరిశోధకమండలి కార్యదర్శిగారును, నగు శీయుత ఆదిరాజువీరభద్ర రావు పంతులుగారును, గోల్కొండ పత్రికాసంపాదకులగు శ్రీయుత

సురవరము ప్రతాపరెడ్డిగారును, హైదరాబాదుసిటీకాలేజి పండితులు శ్రీయుత ఓగిరాల సుబ్బారావుపంతులుగారును, చేసిన సహాయమును నే నెన్నఁడును మఱువఁజాలను. వీరి తోడ్పాటువలననే నే నీ సంపుటమును ముద్రింపఁగలిగితినన్న నతిశయోక్తిగాదు. వీరలుమువ్వురకు నామనః పూర్వకవందనము లాచరించుచున్నాను. నాకు తాము ప్రకటించిన "కాకతీయసంచికను, 6 చిత్రపటములను నొసంగిన రాజమహేంద్రపుర The Andhra Historical Research Society వారికిని, శ్రీ కాకతీయ సామ్రాజ్యపటము నొసంగిన శ్రీయుత ఋాళ్ళబండి సుబ్బారావుపంతులు ఎమ్. ఏ. ఎల్. టి గారికిని గూడ నామనఃపూర్వకవందనము లాచరించుచున్నాను.

నామిత్రులును, చరిత్రపరిశోధనా నిపుణులునగు శ్రీయుతులు భావరాజు వేంకటకృష్ణారావుపంతులు బి. ఏ. బి. ఎల్. వడ్డాది అప్పారావుపంతులు బి. ఏ. బి. ఎల్. (ఆంధ్రేతిహాస పరిశోధక మండలి కార్యదర్శి) గార్లకు నాకు కావలసిన గ్రంథములప్పటప్పట నొసంగి తోడ్పడినందుకు నామనఃపూర్వక వందనములాచరించు చున్నాను.

నాయీ కార్యమునకు పోషకులుగను, అభిమానులుగను జేరి ప్రోత్సాహపఱచిన వారి నామముల నీ సంపుటములోఁ బ్రకటించి యున్నాను. వారలకెల్లరకు నా నమస్కృతులు.

మహారాజపోషకులు.

నా యీ "కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము" ను ముద్రణమున కిచ్చుటకును, ముద్రణమున కిచ్చినది మొదలుకొని నేనుపంపుకొన్న విజ్ఞాపనములను మన్నించుచు నీక్రింది యుత్తరవులను బ్రసాదింపుచు మితిమీఱిన యుత్సాహమును గల్పించి ప్రోత్సహించిన "తహవార్ - ఓ- జలదత్ - దస్తఘు, మన్నెసుల్తాన్ శ్రీ శ్రీ శ్రీ ఎం. వేంకటాద్రి అప్పారావు బహదుర్, జమీందారు, ఉయ్యూరు ఎస్టేటు, నూజివీడు, వారికి నా మనఃపూర్వక వందనము లాచరించు చున్నాను.

(1) " మీ తే 10-9-35 ది వుత్తరం ప్రవేశమయినది. యిందును గురించి మీకు లోగడ యెంతమొత్తం యిచ్చుటకు అంగీకరించినది తెలియగల రిఫరెన్సు trace కాబడి యుండలేదు. సదరు ఆర్డరు మీవద్దకు పంపబడిన యెడల అందులనకలు రిఫరెన్సు నిమిత్తము పంపించకోర్తాము. ఆంతర్యమునకు తేవలెను. " (14-9-35)

(2) ఆంధ్రుల చరిత్ర ముద్రణమును గురించి మీరు తే 15-9-35 ద్ని వ్రాశ్ని వుత్తరం చేరినది-
ఆంధ్రుల చరిత్ర ముద్రణమునకు (రు 200-0-0) రెండు వందల రూపాయలు sanction చేయించబడినది. ప్రస్తుతం సందర్భములనుబట్టి యింతకంటె జాస్తీగా సహాయం చేయుటకు అవుకాశం లేదు. ముద్రణకొఱకు కావలశ్ని యితరప్రయత్నములు చేసికొని ముద్రణప్రారంభం చేయబోవుటకు ముందు పయికంకొఱకు తిర్గి వ్రాయించకోర్తాము. ఆంతర్యమునకు తేవలెను. (17-9-35)

(3) మీ తే 3-10-35 ది వుత్తరం ప్రవేశమయినది. మీకు ముట్టవలసిన పయికం డిశంబరు నెలలో చేరులాగున రేలంగి, గణపవరం ఠాణాలకు ఆర్డరు పంపించుచున్నాము. ఆంతర్యమునకు తేవలెను. (11-10-35)

(4) మీరు ది 9-12-35 తేదిని వ్రాయించిన వుత్తరం ప్రవేశమైనది. ఆదాఖలా లోగ్డమీకు వ్రాయించిన ప్రకారం డిశంబరు నెల 15 వ తేదీలోగా గాని 20 తేదీలోగాగాని, పంపించుట కవకాశంలేదు. తిర్గి మీరు డిశంబరు 20 తేదీ దర్మిలాను రిమైండు చేయవలెను. ఈజాబు ననుసరించి 23-12-35 తేదిని వారికి జ్ఞాపకమును జేయుచు విజ్ఞప్తి పంపుకొన్నాను. మరల ప్రత్యుత్తరము బడయుభాగ్య మబ్బినది

కాదు. అయినను, ఇట్టి సందిగ్ధసమయమున నేనుజేసిన ప్రకటన ప్రకారము రు 116 లు గాని, అంతకుపై గాగాని విరాళమిచ్చినవారిని రాజపోషకులుగ గ్రహించుట విధ్యుక్త ధర్మము గావున శ్రీవారిని రాజపోషకులుగ నీసంపుటమునం బ్రచురించి యున్నాను.

## అంకితము.

1896 సంవత్సరమునుండి నాకత్యంత మిత్రులుగానుండి నా స్వరూప స్వభావాదులను, గుణశీలములను బాగుగా గుర్తెఱింగి యాంధ్రచరిత్ర రచనకాలమున నేను బడుచున్న కష్టములను జూచుచు, ఒక్కొకప్పు డధైర్యమును, నిరుత్సాహమును నన్నలముకొని కాళ్ళుచేతు లాడనీయక బాధింపుచున్నకాలమున నాకు ధైర్యమును నుత్సాహమును బురికొల్పుచుం దమకు సాధ్యమగునంత సహాయసంపత్తిని సమకూర్చి సర్వవిధముల తోడ్పడి నాచేత నీకార్యము నిర్వహింపంజేసి నాశ్రేయోభివృద్ధి కంతకు మూలకారకులయిన విజ్ఞానచంద్రికా గ్రంథమాలయొక్కయు, ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము యొక్కయు సంపాదకులుగనుండి యాకస్మికముగాం గీర్తిశేషులయిన, కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారియెడ, నాకృతజ్ఞతను దెలుపుకొనుట కవకాశము గలుగనందున నీ పునర్ముద్రణకాలమున నట్టియవకాశము దొరకినందున నీ సంపుటములను వారికంకిత మొనరించుచున్నాఁడను.

## ముగింపు.

అదియేమి చిత్రమోకాని 1911 వ సంవత్సరమున నేనాంధ్రుల చరిత్రము రెండవభాగము రచించుచు రచించిన దానిని ముద్రించుచున్నకాలమున నాకాప్త బంధువు మా అల్లుడు శ్రీయుత మామిడన్న వేంకట సుబ్బారావు పంతులుగారికి జబ్బుచేసి నాకు చిత్తసంక్షోభమును గలిగించిన విధముగానే "యీ కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రమును" రచింపుచు ముద్రించుచున్న యీకాలమునందు సుయితము వారికి రెండుమాసముల కాలము జ్వరపీడితులై

యుండుటచేత నాకు చిత్తసంక్షోభము సంభవించినది. ఈచిత్త సంక్షోభమునకు పత్రికలలోఁ గొందఱు మిత్రులు చేయు నార్భాటములు తోడ్పడి యినుమడింపఁ జేయుటయు, నాజీవిత కాలములో నెన్నఁ డెఱుంగని సమస్యలు నన్నెదు ర్కొని యేటికెదురీదవలసిన కష్టము సంభవించి దినమునకు 3 గంటలుమాత్రము నిద్రకిందను 14 గంటలకాలము చరిత్రము కొఱ కును వినియోగింపవలసి వచ్చినది. అరువది నాలుగేండ్ల వయస్సు గలిగి యున్న నావంటి వృద్ధుఁడు, ఈకాకతీయాంధ్ర రాజయుగ చరి త్రము యొక్క ప్రూపులు రాత్రిళ్ళు 12—2 గంటలనడుమనే దిద్దుకొనుట తప్పని యుద్యోగ మైనందున నీగ్రంథమునందు నచ్చు తప్పులు పెక్కులు పడినవి. వానిని దెలియఁజేయు తప్పొప్పులపట్టిక యిందు చేర్పఁబడినది కావున చదువరులు నాయం దనుగ్రహముంచి యాప్రకారము సవరించుకొని చదువుకొన వలయునని ప్రార్థించు చున్నాను. ఇతర విధములయిన ప్రతిబంధకములు పెక్కులు గలిగినవి గాని వాని నిందు పొందుపఱచుట నిష్ప్రయోజనము నవర్థదాయకము నగునని యిచ్చట దెలుపఁబూనుకొనలేదు. నేను వాగ్దత్తము చేసిన ప్రకారము గ్రంథము వెల్వడుకుండుటకు పైఁజెప్పిన వన్నియుఁ గారణములు. ఇందుకు శిక్షగా నేను చెప్పిన ప్రకారము 400 పుటలుగాక 640 పుటల గ్రంథము చదువరులకు నంగఁజేయుచున్నాను గాన నాలోపములన్నిటిని క్షమింపవలయునని ప్రార్థించుచున్నాను. ఇఁక ముందు ప్రకటించు సంపుటమునకు నట్టిలోపము గలుగకుండ సకాల మునఁ బ్రకటించుటకుఁ బ్రయత్నింతునని మనవిచేయుచు విరమించు చున్నాను.

అనివార్యములయిన కారణాంతరముల వలన నీగ్రంథముద్ర ణమున కాలస్యము తటస్థించుచున్నను సదయహృదయులైన శ్రీ సుజనరంజనీ ముద్రాశాలాధికారులు ఓపికతో ముద్రణమును ముగించి గ్రంథసమాప్తినొందించి యొసంగి నందుకు మనఃపూర్వక వందనములాచరించుచున్నాను.

చిలుకూరి వీరభద్రరావు.

# విషయసూచిక.

## మొదటిప్రకరణము.

పేజీ నెం.

## రెండవ ప్రకరణము.



## మూఁడవ ప్రకరణము.

నాల్గవ ప్రకరణము.



ఐదవప్రకరణము.

## ఆఱవప్రకరణము.

## ఎనిమిదవ ప్రకరణము.

## పదియవ ప్రకరణము.



## పదునొకండవ ప్రకరణము.

పదుమూడవ ప్రకరణము.



పదునాల్గవ ప్రకరణము.

పదునైదవ ప్రకరణము.

# చిత్రపటములు.



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## మొదటి ప్రకరణము

ఈ కాకతీయాంధ్ర సామ్రాజ్యమును దక్షిణాపథమున నాంధ్ర దేశమున మొట్టమొదట పునాదులువేసి స్థాపించినవాఁడు కాకతి ప్రోలరాజను నాతఁడు. కనుకనే యీసామ్రాజ్యము చరిత్రమున కాకతీయాంధ్రసామ్రాజ్యమని వ్యవహరింపఁ బడుచున్నది. ఈ కాకతి ప్రోలరాజు పండ్రెండవ శతాబ్ది మొదటను సత్యాశ్రయకుల తిలకుఁడును, పశ్చిమ చాళుక్యకులాభరణుఁడును, సమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమ భట్టారక బిరుదాంచితుడునైన యాఱవ విక్రమాదిత్య చక్రవర్తికి సామంతుఁడై యాంధ్రదేశములోని సబ్బిసాహిర మండలమును బరిపాలించుచుండెను. ఇతఁడు రాజ్యతంత్రజ్ఞుఁడైన మహా యోధుఁడు. ఇతఁడా పశ్చిమచాళుక్యచక్రవర్తి లోకాంతరగతుఁడైన వెనుక అనఁగా క్రీ. శ. ౧౧౨౬ నకుఁ దరువాత స్వతంత్రుఁడై యీ మహా సామ్రాజ్యమునకుఁ బునాదు లేర్పఱచి ప్రఖ్యాతిఁగాంచిన వాఁడు. ఈమహాసామ్రాజ్యము పేరుప్రఖ్యాతులతో నిన్నూఱు సంవత్సరములు ప్రవర్ధమానముగ వర్ధిల్లినది గావున నీకాలమునాటి యాంధ్రదేశ పరిస్థితుల పరిణామ చరిత్ర మెట్లుండెనో తెలిసికొన వలెనని యెల్లవారు నపేక్షించుచుందురు. ఇందునుగూర్చి నా కుష

లభ్యములయిన యుపకరణములనుబట్టి శక్తికొలదిఁ దెలిసికొనఁ బ్రయత్నించి తెలిసికొన్నదానిని నీగ్రంథరూపమున దేశీయులకు నివేదించుచున్నాను.

## కా క తు లు, కా క తీ యు లు.

ఈ కాకతి ప్రోలరాజు కాకతి రాజవంశమున జన్మించినవాఁడని స్థానిక గాథలవలనఁ దేటపడుచున్నది. ఇంతియగాక యీ కాకతిరాజవంశము కాకతీయ రాజవంశమనియు, కాకత్య రాజవంశమనియు, మరియు కాకర్త్య రాజవంశమనియుఁగూడ వ్యవహారనామములతో నొప్పుచున్నట్టు శాసనములంబట్టియు, గ్రంథములను బట్టియుఁ దెలిసికొనుచున్నాము. కాని, ఇందలి "కాకతి" శబ్దమెట్లు వచ్చినదో బోధపడక యిది వంశనామమా, కులనామమా, జాతినామమా లేక యేదైన నొక తెగ నామమా యని చరిత్రపరిశోధకులలో నొక ప్రశ్నముపుట్టి పలువిధాభిప్రాయములు వెలువరింప నారంభించిరి. ఈకాకతీయరాజవంశ చరిత్రమును వివరించుటకు ముందు ముఖ్యముగా నీశబ్దవిచారము చేయవలసియుండును. కాకతిశబ్దమునకు వరుసగ కాకత్తి, కాకన్ది, కాకన్డి, యనునవి పూర్వరూపాంతరములని జైనవాఙ్మయమునుబట్టియు, బౌద్ధవాఙ్మయమును బట్టియు, ప్రాచీన శాసనములనుబట్టియుఁ గన్పట్టుచున్నది. వీని నన్నిటిని బరిశోధించిచూచునపు డత్యంత ప్రాచీనకాలముననే యీ పేరిటి తెగ యొకటి భారతవర్షము నందంతటను వ్యాపించియుండినటుల మనము తెలిసికొనఁ గలుగుచున్నాము. ఆధ్యాత్మిక శాస్త్రమునందు "కాకి" యను శబ్దము జీవునకుఁ బర్యాయపదముగ వాడఁ బడియుండుటచేతఁగూడ నీప్రాచీనత్వమును స్థిరపఱచు

చున్నది. 1 ఆధ్యాత్మికశాస్త్రముమాట యటుండనిచ్చి చారిత్రకముగ జూచినను నీపేరిట నొక ప్రత్యేక సంఘమున్నటుల గన్పట్టుచున్నది. ఇట్టి సంఘముండుటచేతనే భారతవర్షమున నాసేతుహిమాచలము నేరాష్ట్రభాగమునఁ జూచినను నాపేరిటి గ్రామములో, పురములో, నగరములో యుగయుగముల నుండి వినవచ్చుచున్నవి.

---

1 శ్లో, కాకీముఖ కకారాన్తము కారశ్చేతనాకృతిః
మకారస్యతు లుప్తస్యకోఽర్థః సంప్రతిపద్యతే.

(ఉత్తరగీత. ప్ర అ. శ్లో ౭,)

తా. క + అక - అనునది "కాకి" అనఁబడును. సుఖదుఃఖములు దేనికి యుండునో అది 'కాకీ' అనఁబడును. కాకీ అనఁగా జీవుఁడు. మఱియు ఆ కాకిశబ్దముయొక్క ముఖమునందు (ఆదియందు) గల క కారము కడపటనుండు ఆ కారము విరాట్టనఁబడును కాకీముఖశబ్దమునందలి మకారముమీదనుండు ఉకారము చేతనమైన హిరణ్యగర్భస్వరూప (వాచక) మగుచున్నది. మఱియు ఈ కాకీముఖశబ్దమునందలి ఉకారమునకు ముందుండు మకారము అవ్యాకృతమనఁబడును. ఉకారమునందు అకారమును మకారమునందు ఉకారమును, ఓంకారమునందు మకారమును ఐక్యమైనపిదప అర్ధాలినే పదార్థమని చెప్పవలయును. అనఁగా, అఖండానందాద్వైతసచ్చిదానందరూప లక్ష్యార్థమైన బ్రహ్మమే ఆపదార్థమని చెప్పవలయును. కావున ఈప్రణవైక్యానుసంధానమును చేయువాఁడు ఆబ్రహ్మమును బొందుచున్నాఁడు. (వావిళ్ళ రామస్వామిశాస్త్రుల్లు అండ్ సన్సు)

(2) The word "Kakin" is tho compound of ka-ak-in. The first syllable Ka means happiness, the second Ak means misery, and the third In denotes possessing: therefore one that possesses happiness and misery - the Jiva - is called "Kakin" or "Kaki". Again the vowel 'a' at the end of the syallable Ka is the conscious manifestation of Mula-Prakriti or the Jiva form of the Brahma, therefore when 'a' disappears, there remains only the K which is the one great indivisible Bliss- Brahma- Translated by D. K. Lahiri, F. T. S, Bombay, Tatwa Vivechaka Press.

ఉత్తర మధురానగరమునందు క్రీస్తుశకము ౧-౨ శతాబ్దుల నాటి మిశ్రభాషలో వ్రాయఁబడిన రెండు శాసనములు కనిపెట్టఁబడి నవి. వానిలో నొకటి కాకతీయగణమును, రెండవది కాకతికుల విహారమును (Monostery) పేర్కొనుచున్నవి.* ఇవి రెండును జైన బౌద్ధమతములతో సంబంధించినవి. భారతవర్షమున సుప్రఖ్యాతమైన సాంచీస్తూపము క్రీస్తుశకమునకు పూర్వము రెండవ శతాబ్దిలో పరిపాలన చేయుచున్న యాంధ్రరాజులలో నొకరగు శాతకర్ణిరాజుచే నిర్మాణము చేయఁబడినటుల దెలుపు శాసనమొకటి యాస్తూపము యొక్క దక్షిణద్వారమునఁ గన్పట్టుచున్నది. గుప్తరాజశక కాలమున అనగా క్రీస్తునకు వెనుక 412, 450 సంవత్సరములనాటి రెండు దానశాసనములలోను "కాకనాడబోతా" యను పేరిట గొప్ప విహారము (Monostery) కలదని తెలుపుచున్నవి. మఱియు కుషణ రాజులలో జుస్క లేక వాసుదేవుని కాలమునాటి శాసనములలో నా ప్రదేశమునకు "కాకనాడ లేక కాకనవ" అను పేరున్నటుల వ్రాయఁబడియున్నది. ఎక్కడను "సాంచి"యను పేరున్నట్టు చెప్పఁబడియుండ లేదు. ఈకాకతీయ గణమువారి విహారమగుటచేతనే యావిహారమునకు "కాకనాడబోతా" యనియు, నాప్రదేశమునకు పాలీ భాషలో "కాకనాడనవ" యనియు పేళ్లుగలిగి యుండవచ్చును† ఇంతియగాక మధురానగరము నందలి బౌద్ధ శాసనములోని "కాకతికుల విహార" మనునది యీ "కాకనాడ బోతా"

* 1 29 S. 20. Mathura (Kankali Tila, now Lucknow Provincial Museum) Jaina image inscription. 1891 Bühler Ep, Ind. Vol. I P. 383 P. No. 4.

2 140 Mathura Buddhist inscription on large slab 1870 mentioned by Dowson. Jour. Royal, As. Soc. New Series Vol I. P. 188 No. 28.

† Sanchi Bhopal State Imperial Gazetter of India Central. India p. 269

యను గొప్ప విహారమేమై యుండవచ్చును. కాకతిశబ్దమునకు పూర్వరూపములలో కాకన్దిశబ్దము కలదని చెప్పియున్నాను. అప్పుడు కాకతు లనువారు కాకన్దులని గూడ వ్యవహరింపఁ బడుచుండ వచ్చును. కనుకనే పాణిని తన "అష్టాధ్యాయిలో" త్రిగర్తషట్కా-ముతో "దామన్యాది" ఆయుధజీవికగణమును జేర్చి చెప్పియున్నాఁడు. ఆదామన్యాది గణములలో "కాకన్ది" గణమునుగూడఁ బేర్కొని యున్నాఁడు.1 జైన తీర్థంకరులలో తొమ్మిదవ వాడగు సువిధి నాథుఁడు లేక పుష్పదంతునకు జన్మస్థానము లేక దీక్షాస్థానము కాకణ్డీ లేక కాకన్ది నగరమని తెలియుచున్నది. కడపటి తీర్థంకరుఁ డయిన శ్రీమహావీరవర్ధమాన తీర్థంకరునకు ౧౫ తరములకుఁ బూర్వపువాఁడయిన సువిధినాథుఁడు నేటికించుమించుగా మూఁడువేల సంవత్సరముల క్రిందట కాకన్దినగరమున నున్నట్లు విదితము కాగలదు. స్థవిరులలో వశిష్ఠగోత్రియుఁడయిన ఋషిగుప్త కాకండకుఁడను నాతఁడు, కాశ్యపీయ, గౌతమీయ, వాసిష్ఠీయ, సౌరాష్ట్రిక - అను నాలుగు శాఖలును, ఋషిగుప్తిక, ఋషిదత్తిక, అభిగసస, అను మూఁడు కులములును గల మానవగణమును స్థాపించినవాఁడు. కౌతిక యను వంశనామమును ధరించిన సుస్థితుఁడును, కాకండక యను వంశనామమును ధరించిన సుప్రతి బుద్ధుఁడును వ్యాఘ్రాపత్య గోత్రము గలవారు. భారద్వాజగోత్రుఁడైన భద్రయశస్సను నాతఁడు ఉదే మాతిక గణములోఁ నాల్గుశాఖలలో "కాకండిక" యను శాఖగలదు బుద్ధుని మరణానంతరము నూఱు సంవత్సములకు బౌద్ధసిద్ధాంత ములలోఁ బండ్రెండు శాస్త్రార్థ విషయములనుగూర్చి వైశాలి నగరములోని భిక్షువులలో వివాదము పొసఁగినపుడు నచ్చటికి

1. సూ. దామన్యాది త్రిగర్తషష్ఠాచ్ఛః, పా. 5-3. 116 (బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి మహాభారతచరిత్రము పేజీలు 290-91 చూడుఁడు)

కాకండకుని పుత్రుఁడగు యశుఁడనువాఁడు విచ్చేసి మహావనము లోని కూటాగారమను కొండపై నివసించెనని చెప్పఁబడియున్నది.1 గుంటూరు మండలములోని "కాకాని" యను నామములుగల గ్రామములకుఁ బూర్వము "కాకాండి" యను నామమె వ్యవహ రింపఁ బడుచున్నట్లు గన్పట్టుచున్నది.2 భారతవర్షమున కాకతులు, కాకన్దులు, కాకణ్డులు ననుపేరిట నొకమానవ గణమున్నట్లు బుజు వయినన్నప్పుడా తెగవారి పేరిట గ్రామములుకూడ నున్నవనుటలో నసత్యమేమియు నుండఁజాలదు. ప్రాచీన కాలమున భారతవర్షములో తమ తెగలపేరిటి శక్తులను పూజించెడి శాక్తేయ మతము విస్తరించి యుండినపుడు కాకతీయ గణములవారు తమ పేరిట "కాకతి" యను శక్తిని ప్రతిష్ఠాపించి పూజించెడువారని చెప్పుట సత్యమునకు దూరము గాదు. అట్టిశక్తి పూజింపఁబడుచుండుటచేతనే "కాకతి" యను నామమును ముఖ్యముగా స్త్రీలును, రాణులు మొదలగు వారికిఁ బెట్టి వ్యవహరించుట వింతవిషయముకాదు. ఈ "కాకతి" యను శక్తినే జైనులు కూష్మాండిని, పద్మావతి యనియు, బౌద్ధులు తార యనియు, శైవులు దుర్గయనియు మాఱు పేర్లతో వ్యవహరించి యుండిరేమో యని యనుమానించుటకు వారివారి వాఙ్మయములనుబట్టి యవకాశ

1 The Indian Sect of Jains by Johaun George Buhler C. I. E. L. L. D Ph. D.. edited with an outline of Jaina Mythology by Jas Burgess C. I. E. L. L. D, F. R. I. E.

2 No. 702 (A. R. No. 250 of 1892)

On a Pillar in a front of the Veerabhadra Temple Kakandipuram. Renturi Chitteyamantri constructed the Temple of Veerabhadra in the time of Krishnadevaraya.

కాకాండిపుర వీరభద్రనగర ప్రాకారసన్మంటప
ద్వార శ్రీకరగోపుర ప్రవిల సత్కల్యాణివేదాఢ్యయః."

మిచ్చుచున్నది. బౌద్ధజాతకకథలలో "కాకాతి" యను జాతకకథకలదు.1 ఇందు కాశీదేశపు రాజగు బ్రహ్మదత్తుని కుమారుని భార్యపేరు "కాకాతి" యని గలదు. ఈకథను బుద్ధుఁడు తనకు పూర్వముజరిగిన కథను తనశిష్యునకుఁ జెప్పినట్లుగా గలదు. ఈపైనుడివినవిషయముల నన్నిటిని పరిశీలించినపుడు బుద్ధునకు పూర్వమునుండియు "కాకతి" శబ్దము వ్యవహారమున నేదోరూపమున వ్యవహరింపఁబడుచుండి నటుల బోధపడఁగలదు. కాఁబట్టి "కాకతి" యనునది యొకగ్రామ నామమును బట్టి యేర్పడిన వంశనామముగాఁ గన్పట్టదు. "కాకతి" యనుపేరుగల దుర్గ కులదేవతగా నారాధించు వారగుటచేత నేకశిలా నగరేశ్వరులకు కాకతీయ సంజ్ఞకలిగినట్లు విద్యానాథకవి "ప్రతాపరుద్రయశోభూషణ" మని నామమిడి తానురచించిన యలంకార శాస్త్రగ్రంథము నందును, తద్గ్రంథమునకు "రత్నాపణ" మను పేరిడి వ్యాఖ్యరచించిన కుమారస్వామి సోమయాజి తన రత్నాపణ వ్యాఖ్యాన గ్రంథము నందును, వక్కాణించియున్నారు,2 మఱియు కాకత్యయను పరశక్తియొక్క కృపచేత గుమ్మడితీగెకు నొకపుత్త్రుఁడు పుట్టగా నతనికులము కాకతీయ సంజ్ఞఁ బరగుచుండెనని అని తల్లి కలువచేఱుశాసనమునఁ బేర్కొనఁబడియుండెను.3 ఇట్లు రెండవ ప్రతాపరుద్రుని యాస్థాన విద్వత్కవియగు విద్యానాథుఁడుమాత్రమె

---

1 Vol. VIII, No. 327 Kākāti Jataka, By Professor E. B. Cowell.

2 "కాకతీయ కులదుర్గాదేవీసమారాధనేన విజయప్రస్థాన మంగళంకృత్వా." (ప్రతాపరుద్రీయము, నాటకప్రకరణము, ప్రథమాంకము)

కాకతిర్నామ దుర్గాశక్తిరేకశిలానగరేశ్వరానాం
కులదేవతాసాశక్తిర్భజనీయాస్యేతి కాకతీయః"

(ప్రతాపరుద్రీయ వ్యాఖ్యానము)

3 కాకత్యాః పరశక్తేః కృపయా కూష్మాండవల్లి కాకాచిత్
పుత్త్రిమసూత తదేత్కుల మనఘం కాకతీయసంజ్ఞమభూత్.

(ఆం. సా. ప. సంపుటము ౨)

గాక యాతనికి నూటేండ్లతరువాత, అనగా, పదునేనవ శతాబ్ది మొదటిభాగమునను మధ్యభాగమునను న్న అనితల్లియు, కుమారస్వామిసోమయాజియు కొంచె మించుమించుగా సమకాలికులైయుండుటచేత వారిచే లిఖింపబడియున్న లేఖనములనుబట్టి "కాకతి" యనునది తద్వంశీయులయిన రాజులకు "కులదేవత" గా నుండెననుమాట విశ్వసింపఁదగినది గాని చులకనఁగాఁ ద్రోసివేయఁ దగినదికాదు. మఱియు నాకాలమున నేకశిలానగరమున "కాకతమ్మ" దేవాలయమున్నట్టును, ఆమె తన్నగర పౌరవులచే సేవింపఁ బడుచున్నట్టును వల్లభామాత్య ప్రణీతమగు క్రీడాభిరామమను గ్రంథమునఁగూడ వర్ణింపఁబడియుండెను.* ఈకాకతమ్మపాటను గొల్లలు పాడుచుందురు. ఈమె పార్వతియొక్క యవతారముగఁ జెప్పఁబడుచున్నది. మెదకుమండలములో అల్లాదుర్గముకడ కాకతమ్మ గుడి కలదని చెప్పుదురు. ఓరుగల్లులో కాకతమ్మ బావి కలదని వినుచున్నాము. ఇదియునుంగాక మంజరీ ద్విపదలలో వ్రాయఁబడిన కాకతమ్మ కథ

---

* సీ. పద్మలోచన భృగు బ్రహ్మసంయమివంశ
పరిపాటికభినవాభరణమయ్యె
రమణి త్రేతాద్వాపరముల సంధ్యావేళ
మగనితోఁ బెక్కేండ్లు మనువుమనియె
నెలతకానకకన్న నెయ్యంపుఁగొడుకుచే
జంపించె మున్యేదుసారు లరుల
తరుణి హైహయరాజ దంతాస్థిపటలంబు
గవడపేరుఁగఁజేసి కట్టె నలుత
గీ. మండపాకను బెనుపాక మాహురమున
నాగవరమున పోలాసననిచె నిండి
యోరగంట వసించె నీలోత్పలాక్షి
కాకితమ్మకు సైదోడు ఏకవీర. ''

(క్రీడాభిరామము.)

"మాతపురాణ" మనుపేరిట జానపదులచే నిప్పటికిని నాంధ్రదేశ మున బాడుకొనఁ బడుచుండుటను మనము కనుగొనుచున్నాము. ఈకథ కేవలము పుక్కిటి పురాణగాథలతోఁ గూడుకొని విశ్వాసార్హ ములుగాని విషయములతోఁ గూడుకొని యున్నను కాకతమ్మకు కాకతీయులకుఁ గల సంబంధమును సూచించుచునే యున్నది.*

ఇట్లుండినను కాకతీయసంచికా సంపాదకులు "కాగతి" యను నది మైసూరు రాష్ట్రమునందలి షిమోగమండలములోని యొక గ్రామమనియు, ఆగ్రామమునకు పెద్ద (అధికారి) గానున్న పురుషుఁ డొకఁడు రాజ్యమును సంపాదించుకొనుట కాంధ్రదేశమునకు వచ్చి తనగ్రామ నామమును మఱచిపోకుండుటకై జ్ఞాపకార్థము "కాకత్య" యను విశేషణమును తననామమునకు తగిలించుకొన్నాఁడనియు, అతఁడే యీవంశమునకు మూలపురుషుఁ డగుటచేత నాతనివంశము వారెల్లరును "కాకతీయ" సంజ్ఞఁ బరగుచున్నారనియు నపహాస్య భాజనమగునట్లుగాఁ దమ యపూర్వ పరిశోధన మను నూత్న తేజస్సు బత్రికలలోఁ బ్రజ్వలింపఁజేసిరి. ఈయపూర్వ పరిశోధకుఁడిట్లు రాజ మహేంద్రపురమునఁ బ్రచురింపఁబడు నాంధ్రేతిహాస మండలివారి త్రైమాసిక పత్రిక యందిట్టి నూత్న తేజస్సును బ్రజ్వలింపఁ జేయు టతో మాత్రము తృప్తిఁజెందియుండక తమయపూర్వ చరిత్ర పరి శోధనా కౌశల్యమును మండలివారిటీవలఁ బ్రకటించిన "కాకతీయ సంచిక" లో "కాకతీయుల చరిత్ర" మను సంపాదకీయ వ్యాసమున నీక్రింది పంక్తులలోఁ జూపియున్నారు.

"సాధారణముగ గృహనామములు నివాసస్థానములనుండియే పరిగ్రహింపఁబడుచుండును. పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి, వెల్నాటి కులోత్తుంగ చోడ గొంకరాజు, ఓరుగంటి ప్రతాపరుద్రదేవమహారాజు మున్నగు

* శ్రీమాతపురాణము. R. No. 693; K. 2. 68.

నామములిందులకుఁ దార్కాణములు. అటులనే కాకతీయ పదము నకు సరియగు పదమే నామముగాగల గ్రామమేదైన నున్నదియా యని చూచినచో మనకు మైసూరు రాజ్యమున "కాగతి" యను నొక గ్రామము గన్పడుచున్నది. దీనినుండి గుండ్యనయు నాతని పూర్వులును మొదట నీకాగతి గ్రామమునందుండెడి వారనియు, నీతఁడాగ్రామ నామమునే పరిగ్రహించెననియు దోఁచుచున్నది."

ఈతమవాదమునకు బలము నొసంగుటకై ఈగ్రామమాంధ్ర దేశపు సరిహద్దుల నున్నదనిగూడఁ దెలిపియున్నారు*.

ఈకాకతియను నామముతో నొప్పెడుగ్రామములు పెక్కులు భారతవర్షమునందంతటను గన్పట్టుచుండఁగా మైసూరు రాష్ట్ర మునందలి షిమోగమండలములోని గ్రామమొక్కటియే వీరికి గన్ప ట్టుట వింతగా దోఁచుచున్నది. కాకతీయసంచికా సంపాదకుని యను భవములో దొలిసారి వినఁబట్టిన గ్రామ మిదియే యైయుండుటను గాఁబోలు నిట్టి యభిప్రాయమును వెల్వరించుటకు సాహసించిరి.

విశాఖపట్టణమునకుఁ బశ్చిమముగా నైఋతిమూలను ౪౮ మైళ్ళదూరమున "కాకిత" యను గ్రామము గలదు. బొంబాయి రాష్ట్రములో సాంగ్లీసంస్థానములోని మహారాష్ట్రజాగీరులో బెల్గా మునకుత్తరముగా ౯ మైళ్ళదూరమున "కాకతి" యను గ్రామము గలదు. ఈకాకతీయ సంచికా సంపాదకునివలెనే చరిత్ర పరిశోధన మున కించిదనుభవముగల మఱియే యువకుఁడైనను పైనేదేని నొక గ్రామమునుండి యాగ్రామాధికారిగా నున్న పురుషుఁడొకఁడు రాజ్య మును సంపాదించుకొనుటకై యాంధ్రదేశమునకు వచ్చి తనగ్రామ నామమును మఱచిపోకుండుటకై జ్ఞాపకార్థము "కాకత్య" యను విశేషణమును దననామమునకుఁ దగిలించుకొన్నాఁడనియు, అతఁడే

* కాకతీయసంచిక, పేజీ ౮.

యీవంశమునకు మూలపురుషుఁడగుటచేత నాతని వంశమువారెల్లరును కాకతీయ సంజ్ఞను బరఁగుచున్నారనియు నపహాస్యజనకముగా నూత్న తేజస్సును పత్రికలలోఁగాని చరిత్ర గ్రంథములలోఁగాని పఱపిన యెడల నెట్లు ప్రత్యుత్తరమిచ్చి యీ కాకతీయ సంచికాసంపాదకుఁడు తన వాదమును సమర్థించుకో గలుగునో నేనూహింపఁజాలకున్నాను. సంస్కృతాంధ్ర భాషలలో వ్రాయఁబడిన శిలాతామ్ర శాసనములలోను, శాస్త్ర కావ్య గ్రంథములలోను వ్యక్తీకరింపఁబడిన "కాకత్య, కాకర్త్య" శబ్దముల వ్యుత్పత్త్యర్థములను వీరు గ్రహింపఁగలిగి యున్న యెడల నిట్లు వ్రాయుటకు సాహసించియుండరు. * ఇయ్యది (వీరిసిద్ధాంతము) కాకతీయరాజుల సంప్రదాయ విశేషములకు విరుద్ధముగాఁ గల్పింపఁబడిన వ్రాఁతయని నిస్సంశయముగా నుడువగలము. కాకతీయసంచికా సంపాదకున కిట్టి యూహ జనించుటకు నీక్రింది విషయము కారణమై యుండవచ్చును. కాకతి గణపతి దేవచక్రవర్తి పరిపాలన కాలమునఁ అనఁగా క్రీ. శ. 1260 సంవత్సరమున నాతని మంత్రియగు దేవరాజుయొక్క నల్వురుపుత్త్రులలోను రెండవవాఁడగు తిక్కచమూపతి యేఁబదిమంది బ్రాహ్మణులకు గారవపాడు (గారపాడు) గ్రామము నగ్రహారముగా నొసంగి దానశాసనము వ్రాయించెను.† ఆశాసనములో గణపతిదేవచక్రవర్తి వంశము వర్ణింపఁబడియెను.

---

* కాకణ్డియ - కాకణ్దియ - కాకణ్తియ - కాకత్తియ=కాకత్య. కాకణ్డి శబ్దముయొక్క సంస్కృతస్వరూపపరిణామమును దెలుపునట్టి శబ్దమే కాకత్యశబ్దము.

కాకరణ్డియ - కాకరణ్దియ - కాకరణ్తియ - కాకరత్తియ - కాకరితియ= కాకర్త్య= కాకరణ్డియశబ్దముయొక్క సంస్కృతస్వరూప పరిణామమును దెలుపునట్టి శబ్దమె కాకర్త్యశబ్దము.

† Ep. Ind. Vol. XVIII, No. 41, the Garavapadu Grant of Ganapathideva, Saka 1182. pp. 346 to 355. Annual Report on Epigraphy for 1916 17, page 122.

విష్ణునాభి కమలమునందుండి బ్రహ్మ జనించెననియు, నాతని కంటినుండి యాదిత్యుఁ డుదయించెననియు, నాతని వంశమున మను వుద్భవించెననియు, నామనువంశమున కరికాళచోళదేవుఁడుపుట్టి యా ఖేటఖేలనార్థము నానాదేశములు సంచారముచేసి తుదకు దక్షిణా పథమునకు విచ్చేసి "కాకతిపురమును" జేరి తన విస్తృతమగు స్కంధావారమునకునావిస్తృతప్రదేశమునునిలయముగాఁ జేసికొనియె ననియు నతనివంశమున రణదుర్జయుండగు దుర్జయరాజు జనించె ననియు నతని ప్రతిష్ఠాపనమె తద్వంశ్యులయినరాజులను కాకతిరాజు లనుగాఁ జేసెననియు ప్రజలు చెప్పుకొనుచున్నారని యందు వ్రాయఁబడియుండెను.*

ఈతామ్ర శాసనమునుగూర్చి దొరతనమువారి శాసనపరి శోధన కార్యాలయమువారు 1916-17 సంవత్సరమున దొరతనము వారికి నివేదించిన నివేదికయందు సంగ్రహముగాఁ దెలిపియున్నారు. దీనినిగాంచి కాకతీయ సంచికా సంపాదకుఁడు పిమోగమండలము లోని "కాగతి" గ్రామమును తాను మొట్టమొదట వినియుండుటచేత పై శాసనములోని కాకతిపురమె తామువినియున్న "కాగతి" గ్రామ మై యుండునన్నభావముతో తామ్రప్రయత్నముగాఁ గనుగొన్న నూత్న తేజస్సు తమనుండిగాక యితరులనుండి యెక్కడవ్యాప్తిగాం చునోయని భయంపడి తొందరలో వెల్వరించినట్లు గన్పట్టుచున్నది గాని సంగతి సందర్భములను పూర్వాపర సందర్భములను గుర్తించి వ్రాసినట్లు గన్పట్టదు. అదట్లుండనిండు.

---

* తదభిజనస్తస్మా (ధ)రిత్రీమణి (ష)రిమాంకరికాలచోళదేవః
దిశిదిశిమృగయాచ్ఛాలేన ఖేలన్నుపగతవానయాదక్షిణాపథం (౧౧)
పురంస కాకతిరితి ప్రఖ్యాతం తత్రభూపతిః
ప్రాప్యా(స్య)నన్తమహిస్తీర్ణం స్కంధావారమకల్పయత్. (౧౨)
ఆసీత్తదన్వయే రా(జా) దుర్జయోరణదుర్జయః.
యమపజ్ఞం వదంత్యస్య వంశ్యాన్ కాకతిభూభృతః. (౧౩)

ఈ గారవపాడు తామ్రశాసనమును శ్రీమాౝ. సి. ఆర్. కృష్ణమాచార్యులవారు (Archeological Superintendent for Epigraphy, Southern Circle Madras) "ఎపిగ్రాఫియా ఇండికా" అను పత్రికలోఁ బ్రకటించి ఈశాసనములోని విషయములపై కొంతవ్యాఖ్యవ్రాసి కాకతీయులనాటి సంప్రదాయపద్ధతులను పోఁదోఁచి యొకనూత్న మార్గమును ద్రొక్కియున్నారు. అదెంతవఱకు సమంజసముగా నుండఁగలదో విమర్శించి తెలిసికొనఁ బ్రయత్నింతము.

"ఈవంశము వారిశాసనములలోఁ గొన్నిటఁగరికాలచోళుఁడు వారి పూర్వీకులలోఁ బరిగణింపఁబడియున్నను, కరికాలచోళుఁడు దక్షిణాపథములోని కాకతిపురమును రాజధానిగఁ జేసికొనియె నన్న విషయము మఱియే శాసనమునందును గానరాదు. కొన్ని శాసనములలో మాత్రము కాకతిపురముతోడ పూర్వులలోఁ గొందరకు సంబంధముగలదని తెలుపఁబడియెను. ఇదవఱకుఁ బ్రకటింపఁబడని యొకశాసనము కాకతివంశమునకు "కాకతి" యనునది "కులపుర" మని తెలుపుచున్నది. * అటువంటిదే మఱియొకశాసనము "కాకతీయ

* No. 204 of the Madras Epigraphical collection for 1905. ఈశాసనము త్రిపురాంతకములో త్రిపురాంతకేశ్వరుని దేవాలయములో వంటమిద్దెకు నుత్తరభాగముననున్న లింగమున కెదురుగానున్న స్తంభమునకు నలుప్రక్కలను వ్రాయఁబడియున్నది. ఈశాసనము నాతవాటిసీమాధిపతియైన బుద్ధరాజు రెండవకొడుకయిన వక్కడిమల్ల బిరుదాంచితుఁడగు రుద్రదేవుని వివాహముఁ జేసికొన్నట్టియు కాకతిగణపతిదేవచక్రవర్తి తోఁబుట్టువునగు మేళాంబిక త్రిపురాంతకేశ్వరుని దేవాలయసామీప్యమున మేళాంబికేశ్వరుని ప్రతిష్ఠాపించి యాలయము గట్టించినది. ఆమె తీర్థాములను గ్రామములోని చెఱువుక్రిందను కొంతభూమిని, దీపముకొఱకు 25 గొఱ్ఱెలను దానము చేసియున్నది. ఈశాసనములో కాకతీయరాజవంశము వర్ణింపఁబడియున్నది.

పురవరాధీశ్వరుఁ" డని తెలుపుచున్నది.* ఇంతవఱకుఁ బ్రకటింపఁబడని యొక తామ్రశాసనములో (క్రీ. శ. 945 సంవత్సరములోనిది) కాకర్త్యగుండ్యన యను నాతఁడు తూర్పుచాళుక్యరాజయిన రెండవ అమ్మరాజునకు సామంతుఁడుగ చేర్కొనఁబడియుండెను. వాని కుటుంబము "సామంతవృద్ధి" వంశమునకు సంబంధించినది "కాకర్త్య" అను విశేషణపదము "కాకత్య" యను పదమునకు రూపాంతరమెకావున నయ్యది యాసామంతునకు సంబంధించిన ప్రదేశమని గ్రహింపఁదగును. కాకతియనునది యొక పురాతనస్థలమనియు "కాకతి కాకత్య, కాకెత లేక కాకతీయ" వంశనామము కలుగుట యాపేరుతో నొప్పెడు నొక పురనామముతో సంబంధించి, వది కాని కుమారస్వామి సోమయాజి యూహించినట్లొక యేదియేని కులదేవత నారాధించుటవలన నేర్పడినదిగాదనియు దాదాపుగా సత్యమనియు చెప్పవచ్చును వారు (ప్రతాపరుద్రీయ ప్రఖ్యాత వ్యాఖ్యాత) చెప్పినదే సత్యమగునేని నావంశము వారియసంఖ్యాక శాసనములలోఁ గొన్నిటినైనను ప్రస్తావింపఁబడుటగాని ప్రస్తుతింపఁబడుటకాని జరిగియుండును. మఱియు నావ్యాఖ్యాతకు నట్టికులదేవత యుండెనని తెలిసియున్నప్పుడు, పరిచయముగలిగి యున్నప్పుడు, అట్టికులదేవత "కాకతి" యను స్థలమునుబట్టియె వచ్చియుండును.

---

* No. 111 of 1902.

ఈశాసనము కాకతీయగణపతిచక్రవర్తిచేతనే ఓరుగల్లులోని 'మట్టివాడ' నుండి పోవు రోడ్డుమార్గమున ఫర్లాంగుదూరములో రోడ్డుప్రక్కను, ఎడమచేతిప్రక్కను (ఖానుసాహెబు తోటప్రక్కను గుండుబావిచెంతనున్న) రాతిస్తంభమువిాదను లిఖింపఁబడియున్నది. ఇందు శ్రీవీరభద్రేశ్వరదేవరకు అంగరంగభోగాలకై కొన్ని సుంకములను దానము చేసినట్లు వ్రాయఁబడియున్నది. ఇందే "శ్రీమన్మహామండలేశ్వర కాకతీయపురవరాధీశ్వర గణపతిదేవమహారాజులు" అని వర్ణింపఁబడియున్నది.

గ్రామనామమునుబట్టియె గ్రామదేవతలకుఁగూడ నానామముగలిగిన దృష్టాంతము లనేకములు నిరూపింపవచ్చును.

కాంకెర్ కాకతిపుర మగునా?

ఈపై నిరూపించిన యపూర్వవాదమంతయు నాచార్యుల వారిది. అనఁగా "కాకతి" యను పురనామమునుబట్టి వంశమునకుఁ గూడ నానామమువచ్చినదికాని "కాకతి" యను కులదేవతనారాధించుటవలన వచ్చి యుండలేదని వీరియభిప్రాయము. ఈగారవపాడు శాసనమును చదివెదమేని శాసనమును వ్రాయించినవారి యొక్కయు వ్రాసినవారియొక్కయు నుద్దేశ్యము "కాకతిపుర" మనునది యెక్కడిదియోగాక గణపతిదేవ చక్రవర్తికి రాజధానిగానున్న యేకశిలానగరమే యని విస్పష్టము కాఁగలదు. అదెక్కడనోయుండె నన్న భావముతో వ్రాసియుండలేదు. ఈపురనామమునుబట్టియె వారి వంశమున కానామముకలిగెనని యందెచటను సూచింపఁబడి యుండలేదు. ఆశాసనమునువ్రాసినవారి యభిప్రాయమున నేకశిలా నగరముగాక కాకతిపురమనునది ప్రత్యేకముగా నెచ్చటనోయుండె నన్నభావమెచ్చటను గన్పఱచియుండలేదు. ఇదంతయు వీరిస్వకపోలకల్పనముగాని వేఱొండుగాదు. వీరుమాత్రము పైశాసనము లోని విషయముల నన్నిటిని నొప్పుకొనుచు బస్తరురాజ్యమునకు నుత్తరముననున్న కాంకెరు సంస్థానమునకుఁ బ్రధానస్థానమగు "కాంకెరు" అను పురమె "కాకతి" పురముగానుండెనని నిర్ధారణ చేయుటకు సాహసించుట వింతవిషయము. వారు తమవాదమును సమర్థించుకొనుటకై యీక్రింది హేతువులను జూపుచున్నారు.

(1) "కాంకెరు" నకుఁ బ్రాచీననామముగానున్న "కాకెరా, కాకైయ్యరా, కాకరాయా" అనుశబ్దములు "కాకతిపుర" మను

దానిలో "కాకతి" శబ్దమునుబోలియున్నవని కాకతిశబ్దముయొక్క యుచ్చారణములని.

(2) క్రీ. శ. ౬వ శతాబ్దిలోనున్న దాక్షిణాత్యరాజగు కరికాళచోళునితో కాకతిరాజులకుసంబంధము, కరికాళచోళుని సామంతుఁడుగాఁ జెప్పుకొన్న చోళసామంతుఁడు చందాదిత్యమహారాజు క్రీ. శ. ౧౧౬౧ సంవత్సరప్రాంతమున (శా. శ. ౯౮౩) నాసామివ్యమున బస్తరురాజ్యమునఁ బరిపాలించుటయుఁగూడ "కాంకెరు" "కాకతి" యని గుర్తించుటకు సాధ్యమగుచున్నదని.

(3) రెండవప్రతాపరుద్రునితరువాత నాతనితమ్ముడు అన్నమరాజు తనపూర్వులరాజ్యమును తిరిగిరాబట్టుకొనుటకై బస్తరు రాజ్యమునకువచ్చి యారాజ్యమునాక్రమించి తాను బరిపాలించుట.

(1) ఇందు మొదటిహేతువునుగూర్చి ప్రప్రథమమున విచారింతము. ఎపిగ్రాఫియా ఇండికా పత్రికా సంపాదకులగు హీరానాంద శాస్త్రిగారు వీరుచూపినశబ్దసామ్యమును నధిక్షేపించియున్నారు. ఏల యధిక్షేపింపకుందురు? కాకతి యనుపేరుగల గ్రామములె పెక్కులు దక్షిణాపథమునందు గన్పట్టుచుండఁగా కాంకెరును బ్రఖ్యాతమైనదానిగానెన్ని ఆశబ్దమునకు కాకతిశబ్దముతో సామ్యముగలదని ముడిపెట్టుటకు పలుత్రిప్పులు త్రిప్పనేల? శబ్దసామ్యమునకుఁ బలుపంచలకుఁ బరువులెత్తనేల? కరికాలచోళుఁడు దక్షిణాపథమునకువచ్చునప్పటికె కాకతిపురము ప్రఖ్యాతమైనదిగను, విశాలమైనదిగను శాసనముబట్టి స్పష్టపడుచుండెను. అట్టిప్రఖ్యాతి కాకతిపురముగాఁ దామునిరూపించెడి "కాంకెరు" నకుఁగలదని నిరూపింపవలదా? కాకతిపురమునకును, కాకతీయపురమునకు గలభేదమును గుర్తింపఁజాలకున్నారు. కాకతిపురమనఁగా నేపురము కాకతిశబ్దవిశేషణముచే నొప్పుచున్నదో యది కాకతిపురము. కాకతీయులచేఁ బరిపాలింపఁబడునట్టి

యేపురమైనను కాకతీయపురమనంబడును. గణపతిదేవుని యోరుగల్లు శాసనమునఁ గాకతీయపురవరాధీశ్వరుఁడని యున్నదిగావునఁ గాకతీయపురమనునది కాకతీయులకు రాజధానిగ నున్న యేకశిలానగరమునకే వర్తించునుగాని కరికాళుఁడు నివసించిన దక్షిణాపథములోని కాకతిపురమునకు వర్తింపఁజాలదు. ఏకశిలానగరము గణపతిదేవునకు పూర్వము కాకతీయరాజులచేఁ బరిపాలింపఁబడుటగాని, నిర్మింపఁబడియుండుటగాని జరిగియుండుటచే గణపతిదేవుని కాకతీయపురవరాధీశ్వరయని చెప్పియుండుట వీరివాదమున కెంతమాత్రము తోడ్పడఁజాలదు. గణపతిదేవుని తోఁబుట్టువగు మేళాంబిక త్రిపురాంతక శాసనములో కాకతీయపురము "కులపుర" మని చెప్పుటకుఁ గూడ నిదియె కారణమై యుండును. ఈరెండు శాసనములు వీరి వాదమును బలబఱచునవి కావు. పురనామమునుబట్టి రాజవంశమునకు "కాకతీయ" సంజ్ఞ యేర్పడినయెడల కాకతిపురమునకు కాకతీయపురమనుట యెంత మాత్రము నొప్పదు. కరికాలచోళుని వంశమునఁబుట్టిన దుర్జయుని సంతతి వారెల్లరును కాకతీయులమని చెప్పుకొనియుండకపోవుటకుఁ గారణమేమి ? ఈగారవపాడు తామ్రశాసనము నాధారపఱచుకొని యిట్టిసిద్ధాంతములు చేయునపుడిందు తెలుపఁబడిన తదితర విషయములనుగూడ ప్రాధాన్యములుగానెంచి సమన్వయింపవలసియుండునుగదా. ఇందలి విషయమనఁగా దక్షిణాపథమునందు కాకతిపుర మున్నదని విశ్వసించినపుడు కరికాళచోళుఁడుత్తరదిగ్భాగమునుండి దక్షిణాపథమునకు వచ్చినవాఁ డనుదానిని గూడ వీరువిశ్వసించియుండిరనియే యేర్పడుచున్నది. ఆఱవశతాబ్దిలో కరికాలచోళుఁడు దక్షిణహిందూదేశచరిత్రమున సుప్రఖ్యాతిఁ గాంచినవాఁడని వీరువ్రాయుచున్నారు. అప్పటికే కాకతిపురము గూడ సుప్రఖ్యాతమైనదిగానుండెనని శాసనమె తెలుపుచున్నది. ఈ

విశ్వాసము ననుసరించి కరికాలచోళుఁడు తెలుఁగువాఁడేకాని యన్యుఁడుకాఁడని సిద్ధాంతమగుచున్నది. ఇయ్యది తమిళగాథలకుఁ దమిళగాథలవిశ్వ దాక్షిణాత్యచరిత్ర పరిశోధకుల స్వాభిమానము నకుఁ గొంతయుం దలవంపు గలిగింపక మానదు.

ఎవరికెట్లున్నను సత్యాన్వేషణపరులగువారు పక్షాభిమానము నకో నిమిత్తములేకుండ సత్యమును వెలికిఁ దీయవలసినవారై యుం దురు. ఐక్ష్వాకులు మొట్టమొదట నయోధ్యాపుర ప్రాంతదేశమున వర్ధిల్లినవారుగాని తామ్రపర్ణీతీరమునఁగాని, కావేరితీరమునఁగాని వర్ధిల్లినవారు గారు. ఐక్ష్వాకులలోనివాఁడగు కల్మాషపాదుఁడు పురాణములలో వర్ణింపఁబడి యున్నాఁడు. కరికాలచోళుఁడు గూడ నైక్ష్వాకులలోనివాఁడే. కల్మాషపాదుఁడన్నను, కరికాళుఁడన్నను శబ్దార్థ మొక్కటియనియే బోధపడుచున్నది. కరికాలచోళుఁ డిక్ష్వా కువంశీయుఁడని చెప్పినమాత్రముచేత కరికాళుని వంశమువారే యైక్ష్వాకులుగాని తక్కినవారు కారని తలంపరాదు. అనఁగా నైక్ష్వా కులలో నూఱుశాఖలున్నవని వారిభావమై యుండును. ఆఱవశతాబ్ది లో కరికాలచోళుఁడు దక్షిణాపథమునందలి కాకితపురమునకు రాక పూర్వమే యైక్ష్వాకులలో పుంకియ, సగర, చలికి, తలవార శాఖల వారు మూఁడవ శతాబ్దిలోనే యాంధ్రదేశమున నున్నారని, అమ రావతి, జగ్గయ్యపేట, నాగార్జునకొండ, రామరెడ్డిపాలెము, గుమ్మడి దొరువు ప్రదేశములయందు ప్రాకృతభాషలో వ్రాయఁబడిన వారి శాసనములు గొన్ని బయలుపడుటమూలమున మనము దెలిసికొను చున్నాము.

కరికాలచోళుఁడు దక్షిణాపథమునుండి కాకతిపురమునకు వచ్చెనో లేక శాసనములో చెప్పినట్లు ఉత్తరదిగ్భాగమునుండి దక్షి ణాపథమునకువచ్చి కాకతిపురమున వసించెనో, ఏసిద్ధాంతము నను

సరించి యీవాదమునకుఁ దొడంగుచున్నారో ఆచార్యులవారు తెలియఁజెప్పలేదుగాని ధోరణిమాత్రము శాసనములోఁ జెప్పినదానిని విశ్వసించినట్లు గన్పట్టఁగలదు. ఈవిశ్వాసమునే వారు కలిగియున్నయెడల నతఁడు దక్షిణాపథవాస్తవ్యుఁడై యుత్తరమున గంగానదివఱకు దండయాత్రలు సలిపెనన్న తమిళగాథల నన్నిటిని ఖండించియుండవలయును. అట్టిపని యేమియుఁ జేసియుండలేదు. ఈశాసనములోని తక్కినవిషయముల నప్రమాణముగఁ దలంతురేని పైవిషయమునుగూడ నప్రమాణముగనే గ్రహింపవలసి యుండును. సత్యమును దెలిసికొనుటకు బదులుగా నీక్రొత్త వాదమును దెచ్చిపెట్టి పరిశోధకులకు వృథాశ్రమమును గలిగించుచున్నారు. గారవపాడు శాసనములో నుదహరింపఁబడిన కాకతిపురము కాంకెరు మాత్రము కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును.

ఇంక రెండవ విషయము, చంద్రాదిత్యుఁడు కరికాళుని తన పూర్వునిగాఁ జెప్పుకొనుటయు, శాసనకర్తకూడ కరికాలుని కాకతీయులకు బూర్వునిగాఁ జెప్పుటయు, కాంకెరును కాకతిపురముగా మార్చుటకెంతమాత్రము తోడ్పడఁజాలవు. కాకతీయులు దుర్జయుని వంశమునఁ బుట్టినవారమని తెలుపుకొని యున్నారు. చంద్రాదిత్యుని పూర్వులయిన రేనాటిచోడులుగాని కరికాళచోళుని తమపూర్వునిగాఁ జెప్పుకొనియున్నవారుగాని దుర్జయుని తమపూర్వునిగాఁ జెప్పుకొని యుండలేదు. చంద్రాదిత్యుఁడు బస్తరురాజ్యమును బరిపాలించినంత మాత్రముచేత చంద్రాదిత్యుఁడు కాకతీయుఁడు కాఁజాలఁడు. కాకతీయులు వరాహలాంఛనముగలవారు. చంద్రాదిత్యుఁడు సింహలాంఛనము గలవాఁడు. దీనివలన కాంకెరు కాకతినగరము కాఁజాలదు. ఇంతకంటె తేలికవాదము మఱియొకటి యుండఁబోదు.

ఇంక మూఁడవ విషయము. రెండవప్రతాపరుద్రుని సోదరుఁడని చెప్పఁబడిన అన్నమదేవుఁడు బస్తరురాజ్యమునకుఁ దమరాజ్యము

పోయినతరువాత వలసపోయినవాఁడుగాని తమపూర్వులు రాజ్యము చేసినదానిని సంపాదించుటకుఁ బోయి యుండలేదనుట స్పష్టము. రెండవ ప్రతాపరుద్రుఁడు చంద్రకులమునందు బుట్టినను సూర్యవంశీయుల దయిన కాకతిరాజ్యమును గైకొని అవక్రపరాక్రమముతోఁ బరిపాలించినవాఁడు. అన్నమదేవుఁడట్లు చెప్పుకొనకుండుటకుఁ గారణము తాను చంద్రవంశీయుఁడుగ నుండుటయె ఆచార్యులవారి కీవిషయము బోధపడియుండలేదు.

కాకతీయసంచికాసంపాదకుఁడు పైయాచార్యులవారి వాదమును దెలిసికొని కాంకెరును కాకతిపురముగాఁ జేయుటకు మనస్సు గొలుపనందున షిమోగమండలములో కాగతి గ్రామమున్నదని కంటఁబడగానే పైయపూర్వకల్పనమునకుఁ దొడంగెను. గణపతిదేవచక్రవర్తి కాలమున పుట్టిన కొన్నిశాసనములలో కాకతీయవంశమునకు మూలపురుషుఁడు కరికాలచోళుఁ డను విషయము ప్రస్తావింపఁబడినది గాని యాతనికిఁ బూర్వమునఁ బరిపాలించిన వారిశాసనములలో దుర్జయుని ప్రశంసగాన నగునుగాని కరికాలుని ప్రశంసయె గానరాదు. తెలుఁగు చోడులెల్లరును కరికాలుని తమపూర్వునిగాను, అతఁడు కావేరితీరమునందలి యొరయూరుపురవరాధీశ్వరుఁడని చెప్పుకొన్నది వాస్తవమనుటకు సందియము లేదుగాని కాకతీయులెన్వరు నొరయూరు పురవరాధీశ్వరులమని చెప్పుకొనకుండుటకుఁ గారణమేమో యోచించలేదు.

## కాకతీయాన్వయ నిరూపణము.

కాకతిపురముబట్టియే కాకతీయాన్వయమేర్పడినదను వాదమును గ్రొత్తగాఁదెచ్చిపెట్టిన వారి లేఖనములనుజూచిన వైఖరిఁ గొంతవఱకు చదువరులు గ్రహించియుందురు. కాని కాకతిపురము

నొకరు మైసూరు రాష్ట్రమునకును, మఱియొకరు బస్తరురాజ్యమున కుత్తరభాగముననుండు కాంకెర్ సంస్థానమునకుఁ గొంపోయిరి. ఇంతకంటె విపరీతవాద మింకొకటి యుండఁబోదు. ఆచార్యులవార నుభవజ్ఞులై యుండియు వేఱుకారణమును బురస్కరించుకొని యట్లు వ్రాసియుందురు "కాకతి"యను పేరిటి పరశక్తిని దుర్గను కులదేవతగా నారాధించుటచే నాకాకతీయాన్వయ మేర్పడినదని చెప్పుట నొక న్యూనతగా భావించి యామర్యాదమును జక్కపఱుపనెంచి యీ క్రొత్తవాదమును దెచ్చిపెట్టియుందురు. ఇంతియగాక గారవపాడు తామ్రశాసనమునందు కాకతిపుర ముదహరింపఁబడి యుండుటచేత కాకతిపురమునకై వెదకులాడి యెక్కడను గానరాక తమ దృష్టిని కాంకెరుపైఁ బఱపిరి. కాకతీయసంచికాసంపాదకుని దృష్టి యట్టిది కాదు. ఆంధ్రేతిహాసమండలివారి త్రైమాసిక పత్రికయందువ్రాసిన వ్రాఁత కేవల మసంబద్ధమె యయ్యెది కాకతీయరాజుల సంప్రదాయ విశేషములకు విరుద్ధముగాఁ గల్పింపఁబడిన వ్రాతయని నిస్సంశయ ముగా నుడువఁగలము. ఈయువకుఁడు "గుండ్యన రాష్ట్రకూటపద మును విడనాడి "కాకర్త్య" యను నుపసర్గను గృహనామమునకు సరియగునటులఁ బరిగ్రహించుటకుఁ గారణమేమియో తెలియదు" అని వ్రాసి యంతటితో నూరకొనక " మనకు మైసూరురాజ్యమున "కాగతి" యను నొక గ్రామము గన్పడుచున్నది. దీనినుండి గుండ్య నయు నాతని పూర్వులును మొదట నీ కాగతిగ్రామమునం దుండెడి వారనియు నీతఁ డాగ్రామనామమునే పరిగ్రహించెననియుఁదోఁచు చున్నది." అనువాక్యములను నుటంకరించి యటుపిమ్మట నడుగు భాగమున (foot note) "నిర్దుష్టములగు నితరప్రమాణములు దొరకి నఁగాని దీనిని విశ్వసింప వలనుపడదు" అను వాక్యమును చల్లగాఁ జారవిడిచిరి. ఆంధ్రేతిహాసమండలివారి త్రైమాసిక పత్రికయందు

కాకతీయులనుగూర్చి తాము గరువముతోఁ బఱపిన నూత్న తేజస్సును గూర్చిన వ్యాసము తమ "కాకతీయసంచిక" యందు పేరెత్తనైన సాహసించినవారుకారు.* ఈయపూర్వపరిశోధకుఁడు తిక్కచమూపతి గారవపాడు తామ్రశాసనమునుగాని, కాకర్త్యగుండ్యనార్యుని మాఁగల్లు తామ్రశాసనముగాని సరిగాఁ బూర్తిగాఁ బఠించినట్లు గన్పట్టదు.

ఇంతకంటెను విచారకరమగు మఱియొక్క విషయము నిచట తెలుప వలసియుండెను. "చోళులు మొదట దాక్షిణాత్యులుగనుండి పిమ్మట నాంధ్రదేశమున స్థిరపడి యాంధ్రులయినటులే గాకతీయులును దత్తమండలప్రాంతమందలి రాష్ట్రకూటవంశజులై యుండ రెండవ అమ్మరాజు కాలమునాటి యాంధ్రదేశమున స్థిరపడి యాంధ్రులై యుండవచ్చును. కర్ణాటకదేశమునందలి కళ్యాణి చాళుక్యవంశజులగు కుబ్జవిష్ణువర్ధనాది సంతతివారలు కొన్నిపురుషాంతరములకుఁ బిమ్మటఁ దమ కర్ణాటకోత్పత్తిని మఱచి "జన్మభూమి శ్చలుక్యానాం దేశో వేంగీతివిశ్రుతః" యని చెప్పుకొనియుండుటయు పై యూహకు మఱియొక తార్కాణము. ఏది యెటులున్నను తెలంగానా ప్రాంతమున రాజ్యాధికారమును నెఱపి దిగంతవిశ్రాంతి గాంచిన చక్రవర్తులుగనుండిన ప్రోలరాజాదులుమాత్ర మాంధ్రులనుట నిర్వివాదాంశము." అను వాక్యములు వీరి కెంతచరిత్రజ్ఞానము కలదో చెప్పకయె దెలుపఁగలవు. చరిత్రపరిశోధకునకు సత్యమునందు విశ్వాసముండి సత్యాన్వేషణమునకుఁ గడంగవలెను గాని వట్టి యార్భాటములతోఁ బ్రయోజనము లేదని యీయువకుఁ డెఱుంగకుండుట మిక్కిలి శోచనీయము. కాకతీయుల చరిత్రమును

* కాకతీయసంచిక — కాకతీయులచరిత్రమును సంపాదకీయవ్యాసములోని ౨ దవ పుటలో foot note లో 7 వ సంఖ్యగలదానిని చూడుఁడు.

వ్రాసి, కాకతీయసంచికను ప్రకటించిన సంపాదకుఁడు కాకర్త్య గుండ్యన శాసనమును నుదహరించియు కాకర్త్యగుండ్యన తనవంశ మునుగూర్చి "సామన్తవృద్ధిసంజ్ఞకులమాసీత్" అని చెప్పుకొని యుండఁగా నదేమిటో చక్కఁగాఁ బరిశోధించి విమర్శించి సత్యము దెలిసికొనక మైసూరునకుఁ బఱువెత్తుట యెందులకో బోధపడదు. సామన్తవృద్ధికుల మనుటవలన నేదేని యొక తెగఁగా భావింతమన్నను "తద్వంశవారినిధి వృద్ధికరః" అనికూడఁ చెప్పఁబడియున్నదే. ఇదేమిటో తెలిసికొనకుండ దీనిని విస్మరించి "కాకతీయసంచిక" యని పెద్దపేరు పెట్టి వారివ్రాతఁలు వీరివ్రాఁతలు కలగాపులగముగావించిముందుండ వలసినది వెనుకను, వెనుకనుండవలసినవి ముందునుబెట్టి చెప్పవలసిన వానినివిడిచిపెట్టి యనవసరములయిన వానినిపెంచి కాకతీయుల కాలమునకు సంబంధించని రెండు మూఁడువందల సంవత్సరములతరువాత జరిగిన చరిత్రవిషయముల నెన్నెన్నో చేర్చసాహసించుట నేలవిడిచి సాముచేయుటవంటిదై అపహాస్యజనకమగుచున్నది. కాకర్తగుండ్యనార్యుఁడు తన తండ్రిని తాతను శాసనములోఁ జెప్పుకొనియున్నాఁడు గాని కరికాలచోళుని వంశమునఁగాని, దుర్జయుని వంశమున గాని జనించిన వాఁడనని చెప్పుకొనకుండుటయు, సామంత వృద్ధివంశమని చెప్పుకొనుటయు, దుర్జయుని సంతతివారమని చెప్పుకొన్న కాకతిబేత రాజువంశీయులకు నీతనికి నెట్టిసంబంధము కలదో నేశాసనమునందును గానరాకుండుటయు, కాకర్త్యగుండ్యనదక్క కాకతీయ రాజులు మఱెవ్వరు తమది సామన్తవృద్ధికులమని చెప్పుకొనకుండుటయు, తాతకు, తండ్రికిలేని కాకర్త్యవిశేషణమును దనకుమాత్రమే చేర్చుకొనుటయు, చాల వింతగాఁ గన్పట్టకమానదు. దుర్జయుని వంశమువాఁడనని చెప్పుకొనకుండుటకుఁ గారణము పూర్వచాళుక్యుఁడయిన రెండవ అమ్మరాజువిజయాదిత్యునకు సామంతుఁడై నాతవాటిసీమను బరిపాలించు చున్నవాఁడగుటచేఁ జెప్పుకొనియుండకపోవచ్చును. సామ

న్తవ్రెడ్డికులమును సామన్తవ్రెడ్డి వంశముగానే చెప్పియుండుటచేత "వ్రెడ్డి" యనుదాని కర్థమును గనుగొనవలయును. అయ్యది "ఒడయండు" అనుదాని సంక్షిప్తరూపమై "ఒడ్డి" పామర జనోచ్చారణములోఁ "వ్రెడ్డి" గా మాఱుటగా సంభవింపవచ్చును గావున "వ్రెడ్డి" అనఁగా ప్రభువనియు, సామన్తవ్రెడ్డివంశమనగా సామన్తప్రభువంశమనియు నే నభిప్రాయ పడుచున్నాను. ఈయర్థము గ్రాహ్యము గాకున్నయెడల సామన్తశబ్దమున కర్థము దురూహ్యమగును. ఇతనికి ప్రభువయిన శ్రీ మన్మహారాజాధిరాజ, పరమేశ్వర, పరమభట్టారక, పరమబ్రహ్మణ్య బిరుదాంచితుఁడైన రెండవ అమ్మరాజవిజయాదిత్యుఁడను తూర్పు చాళుక్యరాజు శా. శ. ౮౬౭ వ సంవత్సర మార్గశిర బ ౧౩ శుక్రవారమునాఁడు అనఁగా, క్రీ. శ. 945 సంవత్సరము డిశంబరు 5 వ తేదీని పట్టాభిషిక్తుఁడై 970 సంవత్సరము వఱకు వేంగీదేశమును బరిపాలనముచేసిన వాఁడు గావున నాతనికి సామంతుఁడుగా నతవాటిసీమను కాకర్త్యగుండ్యనార్యుఁడు పరిపాలన చేసియుండుటచేత నాకాలమునందుండెనని మనము విశ్వసింపవచ్చును. ఈఅమ్మరాజవిజయాదిత్యుఁడు కళింగదేశమునకు బోయినప్పుడు వానిసవతి సోదరుఁడయిన దానార్ణవుఁడు వేంగీదేశమును బరిపాలించు కాలమున మొదటివాని యనుమతిగైకొని కాకర్త్యగుండ్యనార్యుఁడు సూర్యగ్రహణ పుణ్యకాలమున కృత్సగోత్రీయుఁడును వెలివట్టు గ్రామవాస్తవ్యుఁడును తనకు సంతోషము కలుగునట్లుగా "కార్పటీ" వ్రతమును జేసినవాఁడు నగు ధర్మన్నయను బ్రాహ్మణునకు ఎరియరాష్ట్రకూటునకు వంద్యమాంబకుఁ బుత్రుడైన యీకాకర్త్యగుండ్యనార్యుఁడు నతవాటిసీమలోని (యిప్పటి పశ్చిమ కృష్ణామండలము) మాంగల్లు (మాగల్లు) గ్రామమును దానముచేసి యుండెను.

కార్పటి వ్రత మనఁగా శాసనములో నిట్లు చెప్పఁబడియున్నది. త్రిరాత్రము లుపవాసముతో ప్రతిదినము పెందలకడ నిద్రనుండి

లేచి యథావిధిగా స్నానముచేసి బ్రహ్మచర్యమును సలుపుచు, సత్యమును పలుకుచు, పారిశుద్ధ్యత నవలంబించి ప్రీతి, వదాన్యత్వము, దయగలిగియుండి, చేసిన తప్పును క్షమించుట మొదలగు లక్షణములను గలిగి దీక్షతో గడుపవలయును.*

## కాకర్తుఁడా ? రాష్ట్రకూటుఁడా ?

ఈసామన్త వృద్ధివంశమున జనించిన గుండ్యనార్యుఁడుతక్క కాకతీయ రాజవంశమున జనించిన మఱియేరాజును తమ శాసనములలో నెచ్చటను రాష్ట్రకూటులమని చెప్పుకొనియుండకపోవుటమె గాని రాష్ట్రకూటశబ్దవిశేషణమును దమనామములకుఁ జేర్చుకొన్నట్టు గానరాదు. రట్టగుడయొక్క సంస్కృతి రాష్ట్రకూటశబ్దము. రట్టగుడులను ప్రజాసంఘమొకటి మన దేశమునందుఁ బ్రాచీనకాలమునుండియు, నభివృద్ధిగాంచుచున్నది. వీనినుండియే రాష్ట్రకూట రాజవంశీయ శాఖలుత్పన్నమయినవి. రాష్ట్రకూట రాజవంశములనుండి రట్టగుడు లవతరింపలేదు. ఎప్పుడును ముందు సంఘములు పుట్టి తరువాత వానినుండి రాజవంశము లుద్భవిల్లి వర్ధిల్లుచువచ్చినవని ఋజువు గలదు కాని రాజవంశములనుండి యాపేరిటి సంఘములుద్భవించినటు లంతగా ఋజువు గానరాదు. రాజవంశీయులను రాజులందురు. మనోరంజకముగఁ బరిపాలనముచేసి ప్రజలను రంజింపఁజేసిన వారిని మాత్రమే రాజులని వ్యవహరించిరి. కాకతిగణమునుండి కాకతీయ రాజవంశమును, రట్టగుడులనుండి రాష్ట్రకూట రాజవంశములును బుట్టినవని దృఢముగాఁ జెప్పవచ్చును. కాని రాష్ట్రకూట రాజవంశమునుండి కాకతీయ రాజవంశము పుట్టినదని "కాకతీయసంచికా"

* Report on Epigraphy 1917, page 118, para 24
(No. 1 of Appendix A) 1916-17. Deposited in the Government Museum, Madras.

సంపాదకుఁడు వ్రాసిన దానిని విశ్వసింపరాదని యీశాసనము దెలుపఁగలదు. కాకతీయశాఖ వేఱుగను, రాష్ట్రకూటశాఖ వేఱుగను జాటుచున్నది. కాకర్త్యగుండ్యన తండ్రితాతలకుఁ జేర్చిన రాష్ట్రకూటశబ్దమును జాతిపరమైనదిగ నూహింపరాదని తోఁచుచున్నది. పూర్వచాళుక్యుల తామ్రశాసనములలో "రాష్ట్రకూట ప్రముఖాన్ సర్వేకుటుంబిన స్సమాహూయ" యనెడు వాక్యమునకు "రాష్ట్రప్రజలలో ప్రముఖులుగానుండి రాష్ట్రములో నుద్యోగస్థులుగానుండు వారను విశేషార్థమునే గ్రహింప వలసియుండును. ఇచట జాతిపరముగ నర్థము చెప్పరాదు. ఇదువది మూఁడు సంవత్సరముల క్రిందటనే నాంధ్రుల చరిత్రము రెండవభాగమును బ్రకటించిన కాలమున కాకర్త్యగుండ్యన శాసనము బైలకు రానందున నీకాకతీయ రాజవంశమును రెడ్డివంశమునుగా భావించి తదనుకూలము లగు నభిప్రాయములను దెలిపినది వాస్తవమె. కాని నాతరువాతి వారెల్లరు నామార్గమునే యవలంబించిరి గాని యిందలి యాథార్థ్యమును గ్రహింపఁ జాలకపోయిరి. కాకతీయసంచికా సంపాదకుఁ డీ శాసనము నెత్తుకొని యుండియు, కాకర్త్యగుండ్యన తనది "సామన్తవొడ్డె" వంశమని చెప్పుకొనియున్న దానిని సమన్వయింపఁ బ్రయత్నింపక వొడ్డెవంశము రెడ్డివంశ మెట్లయినదో వివరింపక, తెలిసికొనుటకునైన ముందుకురాక యావిషయమునే చల్లగా జారవిడిచి నేను చెప్పినదానినే మరలచెప్పి దీనివలన "గాకతీయులు మొదట రెడ్లు తరువాత కమ్మవారు" నను శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి వ్రాఁతలకు బాధకలుగుచున్నది." యని నాపై దండయాత్ర సాగించిరి. కాకతీయులు రెడ్లని నేను వ్రాసినదానిని నొప్పుకొనుచు కమ్మవారనుటకు నధిక్షేపించి యుండఁబోలు. కమ్మనాటి రెడ్లను నేను కమ్మవారని భావించి యపుడట్లు వ్రాసినమాట సత్యమైనను,

వీరి యభిప్రాయము ప్రకారముగా ఎఱ్ఱయగుండయలు రెడ్లయిన యెడల వారలు కమ్మనాటి రెడ్లనక మైసూరు రెడ్లనవలయునా? వీరిని నిజముగా రెడ్లేయైనయెడల కమ్మనాటి రెడ్లని చెప్పుట నాకంత విపరీతముగాఁ గనుబట్టదు. క్రీస్తుశకము మూడవ శతాబ్దిలో "మాఢవీపుత్త్ర పురుషదత్తుఁ"డను నిక్ష్వాకువంశపు రాజు పరిపాలనముచేయుచున్న కాలమున నీప్రాంతము "కమ్మకరాఠ" మను పేరఁ బరఁగుచున్నట్టు జగ్గయ్యపేట స్తూపములోని వానిశాసనము తెలుపుచున్నది.* కర్మకరాఠమె సంస్కృతములో కర్మకరాష్ట్రముగను తెలుఁగులో కమ్మనాడుగను వ్యవహరింపఁబడినది. ఇప్పుడు రెడ్డి వంశమును కమ్మవంశమును గాదు; "వృద్ధివంశ" మని స్పష్టమగుచున్నదే. బహుశః కాకతీయసంచికా సంపాదకులీ శాసనమును జదివియుండలేదని సందేహింపవలసి వచ్చుచున్నది. ఇయ్యది వారికి దృష్టిగోచరమై యుండునేని నైరీతిని వ్రాయుటకు సాహసించి యుండరు. కాకర్త్యగుండ్యన తండ్రి తాతలకు రాష్ట్రకూట శబ్దమును జేర్చి తనకుఁ జేర్పకుండుటయును, వారికిఁ జేర్పని కాకర్త్య శబ్దమును తాను చేర్చుకొనుటయుఁ జూచినప్పు డీ కాకతీయసంపాదకుని కాశ్చర్యము కలిగించినదే గాని "సామన్తవృద్ధి" వంశమనునది వారికెట్టి భ్రమమును పుట్టింపఁజాలక పోయినది. ఏకమూర్తిలో మూర్త్రితయము గన్పట్టుచున్నది. మఱియు "గుండ్యనార్యః, కాకర్త్య గుండ్యన నామధేయః" అని చెప్పుకొన్నాఁడు. ఈశాసనము వ్రాసినది పోతనభట్టను బ్రాహ్మణుఁడే. ఏది యెట్టిదనను బ్రహ్మాస్త్రమును, దివ్యాస్త్రములను సంపాదించుటకై మహేంద్రగిరిమీఁద తపస్సుచేసికొనుచున్న పరశురాముని వద్దకు బ్రాహ్మణవేషముతోఁ బోయి బ్రాహ్మణుఁడని చెప్పి యస్త్రవిద్యాభ్యాసము

* Burgess Amrawati & Jaggayyapeta Stupas P. III.
ఆంధ్రులచరిత్రము, ప్రథమభాగము (పూర్వముద్రణము) పే. ౧౫౬.

గావించిన మహాభారతములోని సూర్యపుత్రుఁడయిన కర్ణుని వలెనే యీకాకర్త్యగుండ్యయన సామాన్య వృద్ధికులమునఁ బుట్టిన వాఁడయ్యును సూర్యోపాసకులయిన యార్యగురువర్యుల వలన దీక్షావ్రతములను గావించి యార్యత్వమును, సామంతత్వమును బొందిన సృష్టికరణ కమ్మ వంశసంజాతుఁడేమో యని సందియము కలుగుచున్నది గాని యథార్థము నింకను బరిశోధించి తెలిసికొనవలసి యున్నది. ప్రాచీన కళింగదేశమున పాత్రసామంతులుగ నుండిన వారు సృష్టికరణవంశ సంజాతులె. ఈకాకర్త్యగుండ్యన యీవిధముగా వేంగీదేశమున వెలుంగు గాంచిన సామన్తమండలాధీశ్వరుఁడనుటకు సందియము గానరాదు. కాని దుర్జయ వంశీయు లయిన కాకతీయులకు నీతనికి నెట్టిసంబంధము గలదను విషయము మాత్రము దురవగాహముగ నున్నది. ఇతఁడు తన శాసనములో దుర్జయుని గాని చోడులకు మూలపురుషుఁ డయిన కరికాలుని గాని పేరెత్తి స్మరించి యుండ లేదు. అందువలన సుప్రసిద్ధమైన కాకతీయ రాజవంశమునకు మొదటి వానిగాఁ భావించుటకు బుజుభారమును వహించునట్టి ప్రామాణికమగు సాధన సామగ్రి యెద్దియు నింతవఱకుఁ గన్పట్టలేదు. ఒక్క కాకర్త్య శబ్దమె భ్రమను గొలుపుచున్నది.

## దుర్జయవంశము.

శాలివాహనశకమునకు వెనుక పదునొకండు పండ్రెండవ శతాబ్దులలోని యనేక శాసనములలో దుర్జయుని కూటస్థునిగాఁ జెప్పుకొన్న రాజవంశము లనేకములు వర్ణింపఁబడి యున్నవి. ఇతఁ డేకాలమునందో ప్రముఖుఁడై యుండినగాని యాకాలమున నంత ప్రఖ్యాతప్రశంసాపాత్రుఁడై యుండఁడు. కాని యింతవఱకు నితని నిజమైనచరిత్రము తెలియరాకుండెను. ఒక్క గణపతిదేవ

చక్రవర్తి కాలమునాటి యేవో యొకటిరెండు శాసనములలో మాత్రము సూర్యవంశీయుఁడయిన కరికాళచోళుని వంశమునఁ బుట్టినవానిగాఁ బేర్కొనియున్నవి. అంతకుఁబూర్వమున నేశాసనము నందును దుర్జయుని కూటస్థుఁడుగాఁ దెలుపుకొన్న యేరాజవంశ మును కరికాళచోళునితో ముడివెట్టి యుండలేదు. ఈకాకతీయ రాజవంశములో గణపతిదేవచక్రవర్తికిఁ బూర్వముననున్న రాజు లెవ్వరును దుర్జయుని తమ పూర్వునిగా దెలిపి యున్నారుగాని కరి కాళచోళుని ప్రశంసించి యుండలేదు. కాకర్త్యగుండ్యను విడిచి పెట్టి యింతవఱకు వెల్వడిన కాకతీయరాజులలో మొదటివాఁడగు బేత రాజు "దుర్జయకులాబ్ధిచంద్రుఁడని, కాకతిపురాధినాథుఁడని ఖాజీపేటశాసనములలోఁ దెలుపఁబడియుండెను.*

## అనుమకొండ కాకతిపురమగునా ?

ఈమొదటి బేతరాజుకాలమునాటికే అనుమకొండ (హనుమ కొండ) పురమునకు కాకతిపురమని పేరుకలదాయని వీని మనుమఁ డగు రెండవ బేతరాజు శాసనము భ్రమగొలుపుచున్నది. కాని యందే తనతండ్రి ప్రోలరాజు శత్రురాజులను బెక్కండ్రను జయిం చుటచేత వారి దేశవిభాగములతోఁ గూడుకొనియున్న అనుమకొండ విషయమును త్రైలోక్యమల్లునిచేఁ బొందినట్లు చెప్పియుండుటచేత ప్రోలరాజుతండ్రి బేతరాజు కాకతిపురాధినాథుఁ డెట్లగును ? దీనిని బట్టి కాకతిపుర మనుమకొండకాదే యని సంశయముకూడ కలుగక మానదు. ఇట్లున్నను శాసనకర్త యభిప్రాయము ననుసరించి యనుమకొండ కాకతిపురమనియె చెప్పవలయును.

* తెలింగానాశాసనములు (హైదరాబాదు శ్రీలక్ష్మణరాయ పరిశోధకమం డలివారిచే ప్రకటింపఁబడిన గ్రంథము) సంపుటము ౧, కాకతీయశాసనములు ఖాజీ పేటశాసనము ౧, సుజాత ౨ వ సంపుటము ౨ వ సంచిక.

## అనుమకొండ రాజ్య ప్రాచీన గాథ.

క్రీస్తుశకారంభమున నీభాగ మాంధ్రసామ్రాజ్యమునం జేరి యుండి శాతవాహనవంశజు లయిన యాంధ్రచక్రవర్తులచే మూఁడవ శతాబ్దిమధ్యమువఱకును బరిపాలింపఁబడియెను. ఆశాతవాహనచక్రవర్తులయొక్క చరిత్ర మాంధ్రులచరిత్రములోని రెండవభాగంబున సవిస్తరముగాఁ దెలుపం బడియున్నది. క్రీస్తుశకము ౨౩౦ దవ సంవత్సరము మొదలుకొని పదునొకండవ శతాబ్దాంతమువఱకు నీయనుమకొండరాజ్యముయొక్క చరిత్రము విశ్వసింపఁదగని గాథలతోఁ గూడుకొని యున్నది. ఆంధ్రచక్రవర్తులలోఁ గడపటివాఁడగు మూఁడవపులమావి క్రీస్తుశకము మూఁడవశతాబ్దిప్రారంభమున నీదేశమును బరిపాలించుచుండెను. అతనికాలంబుననే యనేకశతాబ్దములనుండి వర్ధిల్లుచుండిన యాంధ్రసామ్రాజ్యము విచ్ఛిన్నమై అనేకభాగములుగ నేర్పడినప్పుడు పశ్చిమభాగములు రాష్ట్రకూటులకును కదంబులకును, ఉత్తరభాగము లాభీరులకును కాలచుర్యులకును, ప్రాగ్దక్షిణభాగములు పల్లవులకును వశంబులై వేర్వేఱు రాజ్యములుగఁ బరిపాలింపఁబడుచు వచ్చినవి. కృష్ణామండలములోని జేతవ్రోలు (జగ్గయ పేట) స్తూపమునందలి యొకశాసనములో "ప్రసిద్ధికెక్కిన యిక్ష్వాకు వీరుఁడును మాఢారయొక్క పుత్త్రుఁడు నగు శ్రీ వీరపురుషదత్తునియొక్క ౨౧ టవ పరిపాలన సంవత్సరమున వర్షఋతువులోని యెనిమిదవపక్షమున దశమినాఁడు మహాకాండూరు గ్రామనివాసియును కమ్మకరాఠవిషయమున నడతూరు గ్రామవాసి యగు నాగచంద్రునియొక్క కుమారుఁడును, ఆవేశనియు నగు సిద్ధార్థుఁడు తనతల్లి నాగలానితోడను, తనభార్య సముద్రాణితోడను, కుమారుఁడు మూలశ్రీతోడను, కుమార్తెకె నాగ

బంధునికతోడను, సోదరుఁడు బుద్ధనికుసితోడను, వానిభార్యతోడను, సిద్ధార్థినియొక్క కొమారితతోడను, వేలగిరి గ్రామమునం దుండిన రక్తబంధువులతోడను. మిత్త్రులతోడను, గలిసి బుద్ధుని చైత్యముయొక్క ప్రాగ్ద్వారము సామీప్యమున ప్రాణికోటియొక్క క్షేమము నిమిత్తము ఆయకస్తంభముల నైదింటిని నియమించి దానముచేసె" నని చెప్పఁబడి యున్నది.* ఈశాసనమునందుఁ బేర్కొనంబడిన యిక్ష్వాకువీరుఁడైన శ్రీపురుషదత్తుఁడు ఆంధ్రచక్రవర్తియైన మూఁడవపులమావి యనంతర మీదేశమాక్రమించుకొని పరిపాలించిన వాఁడు.

## అనుమకొండ నామోత్పత్తివివరణము.

ప్రాచీనకాలంబున శ్రీశైలప్రాంతారణ్యప్రదేశంబుల మహాశూరుఁడై స్వేచ్ఛావిహారము సలుపుచుండిన కిరాతకుఁ డొకండు తన యనుచరులతోఁ గూడి యచటికి నిరువదియోజనములదూరమునఁ గృష్ణాగోదావరీమధ్యప్రదేశమున హిడింబాశ్రమం బని ప్రఖ్యాతిఁ గాంచిన ముదిగొండకు నీశానభాగమునఁ గోశత్రయదూరంబున నుండెడి హనుమాద్రికడకు నేతెంచి యచట నొకగ్రామమును నిర్మించి నివసించుచుండెను. అటుపిమ్మట హనుమాద్రిపై నొక దుర్గమును నిర్మాణముచేసి గ్రామమును విస్తరింపఁజేసి "ఎఱుకుదేవరాజు" అనుపేరితోఁ బ్రజాపాలనము సేయుచుండెను. అతనికి "అనుమఁడు, కొండఁడు," అను నిరువురు కొడుకులు జనించిరి. ఆయిరువురపేరిట నారాజధానీనగరమునకు "అనుమకొండ" అను నభిధానము గలిగినది. అనుమకొండకు దక్షిణమున నాలుగుపర్వుల దూరమున కొండఁడు తనపేరిటఁ గొండపర్తి యను గ్రామమును గట్టించెనఁట ! ఎఱుకుదేవరాజు పిమ్మట వానికొడుకు లిరువురును,

* Burgess Amaravaty & Jaggayyapeta Stupas P. 11.

తరువాత "నాగఁడు, గార్గేయుఁడు" అనువార లిరువురు నాదేశమును ౧౮౬ సంవత్సరములు పరిపాలనము చేసిరని స్థానిక చరిత్రమునఁ జెప్పఁబడినది. ఈకిరాతకుల పరిపాలనకాలముననే జైను లనేకు లిచ్చటికివచ్చి నివాసములు కుదుర్చుకొనిరి. పద్మాక్షీదేవియాలయ మున్న కొండపై జైనశిలావిగ్రహముల నెలకొల్పిరి. సిద్ధులకుఁ బార్వతీపరమేశ్వరులు ప్రత్యక్ష మైనస్థలము గనుక సిద్ధాశ్రమంబని ప్రసిద్ధిగాంచిన యాశైవక్షేత్రమును జైనక్షేత్రముగ మార్చిరని చెప్పఁబడినదిగాని, దీనిని విశ్వసింపరాదు. మొట్టమొదట నీప్రదేశము జైనక్షేత్రముగనే యుండి తరువాత శైవక్షేత్రముగ మార్పఁబడినటులఁ గాకతిప్రోలరాజు శాసనముంబట్టి దెలియుచున్నది. *

## సోమదేవరాజు.

ఈకిరాతకులకుఁ బిమ్మటను జంద్రవంశపు రాజు లీయనుమకొండ రాజ్యమును బరిపాలించినటులఁ జెప్పఁబడినది. చంద్రవంశమునఁ బాండవులు జనించిరి. వారివంశమున జనమేజయుఁడు జనించెను. అతని వంశమున విజయార్కుఁడు, సోమేంద్రుఁడు నను నిరువురు భూపాలురు పుట్టిరి. వారిలో విజయార్కునకు విష్ణువర్ధనుఁడు, సోమేంద్రునకు ఉత్తుంగభుజుఁడును జనియించిరి. వీర లుభయులును దేశమును విభాగించుకొని పరిపాలించిరి. విష్ణువర్ధనుఁడు గోదావరికి దక్షిణమున నున్న ధర్మపురిని రాజధానిగఁ జేసికొని యనేక రాజులను జయించి రాజరాజబిరుదును బడసి కీర్తి ప్రతిష్టలను గాంచెను. విష్ణువర్ధనునకు నందుఁడను కుమారుఁడు పుట్టి నందగిరి యను దుర్గము నొకదాని నిర్మించి దానిని రాజధానిగఁ జేసికొని భూపరిపాలనము చేసెను. వీనికి సూరయాదిత్యుఁడు ప్రధానిగానుండి రాజనీతులను దెలుపుచుండెను. నందుని భార్య భానుమతీదేవి. ఇతఁడు రాజ్యభార

* Epigraphia Indica. Vol. IX. Page 256.



పద్మాక్షి ఆలయమునందలి జైన విగ్రహము.

*(By the Courtesy of A. H. R. Society Rajahmundry.*

32 B



పద్మాక్షి ఆలయమునందలి జైన విగ్రహము.

*(By the Courtesy of A. H. R. Society. Rajahmundry.)*

మంతయును మంత్రివరునకు నొప్పగించి శ్రీశైల క్షేత్రమునకుఁ బోయి శ్రీమల్లిఖార్జున దేవుని సేవించి సిద్ధోపదేశము బొంది యొకబిలములోఁ బ్రవేశించెను. అచ్చట తపస్సు చేయుచుండిన యొక యోగిని వాని ధైర్యసాహసములకు మెచ్చి వానికి ఖడ్గఖేటక ములను యోగవాగములను ప్రసాదించెనఁట ! అంతట నందుఁడు యోగవాగములచే జనార్దనస్వామిని సందర్శింపఁ గలిగెనట ఆ స్వామి నందునిఁ బోసిక నిలిపి నృసింహస్వరూపంబుదాల్చి బ్రత్యక్షంబైనంత నందుఁడును జెక్కు చెదరక నిలిచియుండ స్వామి సంతోషించి శస్త్రము లొసంగి పొమ్మనఁగా సెలవుగైకొని యతండు కాంచీపురమున కేఁగి చోళేంద్రుని కొమార్తను వివాహము చేసికొని యటనుండి రామేశ్వరమున కేఁగి ధనుష్కోటిలో స్నానముచేసి నందపురమునకు విచ్చేసి యథావిధిగా జనమనోరంజకం బగునటుల రాజ్యపరిపాలనము సేయుచుండెనఁట ! ఈనందమహారాజునకు విజయపాలుఁడను రాజు జనియించెనఁట ! విజయపాలునకు యశస్కాముండయిన సోమదేవుఁడు పుట్టెను. ఇతఁడు శత్రుజనభయంకరుఁడై పరాక్రమవంతుఁడై దేవబ్రాహ్మణ భక్తిపరుఁడై కందార మను పట్టణమును రాజధానిగఁ జేసికొని బ్రాహ్మణుల కనేకాగ్రహారములొసంగి ప్రఖ్యాతుఁ డయ్యెను. ఇంతియగాక మంత్రకూటము, భద్రాచలము, మొదలగు ప్రదేశములలో అసంఖ్యాకములయిన యావులమందలను జేర్చి వాని పోషకత్వమునకై అధికారులను గొందఱను నియమించి విశేష భక్తిశ్రద్ధలతోఁ బోషించుచుండెను.

## కటకరాజు దండెత్తి వచ్చుట.

ఈసోమదేవ భూపాలుని వైభవము నంతయుఁ జారులవలన విని కటక పురాధీశ్వరుం డయిన బల్లహుఁడు వాని యైశ్వర్యమును

జూఱఁ గొనవలయునని బహుళసైన్యసమేతుఁడై కందారముపై దండెత్తివచ్చి గోదావరీప్రాంత ప్రదేశంబున సోమదేవుని పసుగణంబులంబోదివి గోపాలుర నదలించి మందలను దోలుకొనిపోవు సమయంబున గోసంరక్షణార్థము నిలుపఁబడిన వీరభటవర్గమునకును బల్లహుని సైన్యములకును ఘోరయుద్ధము జరిగెను. ఆయుద్ధమున సోమదేవుని సైన్యంబున హతశేషులు కందారంబునకుం జని "ఓ రాజదేవేంద్రా! కటకపురాధీశ్వరుం డయిన బల్లహుని సైన్యంబులు ధరణీచక్రము సంచరించునట్లుగా 'సముద్రాంతంబులై గ్రిక్కున నేతెంచి మన పసుగణంబుల ముట్టికొని రక్షకభటవర్గమును నుగ్గాడి పోవుచున్నవి." అని బల్లహుని దుర్నయమును గూర్చి మొఱ్ఱపెట్టుకోఁగా నతఁడు కోపోద్దీపితుఁడై సైన్యంబులం గూర్చుకొని సమరోన్ముఖుఁడై కటకపురీమార్గముంబట్టికొనిపోయి శత్రుపుర దుర్గమును ముట్టడించి బల్లహునితో నాఱునెలలవఱకుఁ బోరాడుచునే యుండెను. తుదకు సోమదేవుని సైన్యంబులు శత్రుపరపరంపరల ముంగట నిలువంజాలక పలాయనము లగుడు బల్లహుని సైన్యంబులు దుర్గమును విడిచి వానిని దఱిమి కొట్టెను. ఇట్లెడతెగక కొంతకాలము వఱకు సోమదేవుఁడును బల్లహుఁడును బోరాడుచుండ నొకప్పుడు బల్లహుడును, మఱియొకప్పుడు సోమదేవుఁడును విజయము గాంచుచుండిరి. కడపట బల్లహునితోఁ బోరాడుటను విడిచిపెట్టి సోమదేవరాజు కందారంబునుండి వెడలక యుండెను. ఒకనాఁడు సోమదేవరాజు తన శత్రువయిన బల్లహుఁడు ప్రబలుఁడై యుండుటయు, తనకుఁ బురుషసంతానము లేకుండుటయుఁ దలపోసి అమాత్యపురోహిత బంధువర్గమును రావించి తనదుఃఖమునకుఁ గారణమును దెలిపి సంతానము గలుగు మార్గ మెట్లని వారల నడిగెను. అంతటఁ బురోహితులు పుత్త్రకామేష్టియాగము నాచరింపవలయు నని బోధించిరి. పిమ్మట సోమదేవ

రాజు తనభార్య యయిన సిరియాలదేవి సమ్మతిని గైకొని ద్విజవర్యుల తోడ్పాటుతో యథావిధిగఁ బుత్రకామేష్టి యాగమును జేసి భూరి దక్షిణలతోను సంతర్పణములతోను బ్రాహ్మణోత్తములను బూజించెను. మఱికొంత కాలమునకు సిరియాలదేవి గర్భమును దాల్చెను. శత్రుసంహారము కొఱకుఁ బుత్రకామేష్టిని యొనరించి సోమదేవుఁడు పుత్త్రునిఁ బడయ నున్నాఁడని బల్లహుఁడు విని భయకంపితుఁడై రాణితోఁగూడ రాజును బట్టుకొనవలయునని బహుసైన్యములం గూర్చుకొని ప్రస్థానభేరి మ్రోగించి గజ ఘటహయపదాతివర్గము లతో వెడలివచ్చి కందారంబును ముట్టడించెను. మహావీరుఁడైన సోమదేవరాజును వెనుదీయక శత్రువులను మార్కొని యరువదిదిన ములు ఘోరమైన యుద్ధమును జేసెను. ఆయుద్ధమున సోమదేవరాజు వీరస్వర్గమును గాంచెను. ఈదుఃఖకరమైన వృత్తాంతమును సిరియాల దేవివిని శోకసంతప్త చిత్తయై ధన కనక వస్తువాహనాదుల నన్నిటిని విప్రవరులకు దానముచేసి శాత్రవు లంతఃపురము నాక్రమించు కొనకముందే కోటవిడిచి యనుమకొండకుఁ బోయి యెఱుకుదేవ రాజు వంశమున జన్మించిన మఱియొక యెఱుకుదేవరాజును శరణు చొచ్చెను. ఇచ్చట కందారంబున సోమదేవుని సైన్యము నెల రోజులు బల్లహునితోఁ బోరాడి హతమై పోవ నాతఁడు కందారము నాక్రమించుకొనెను. బల్లహుఁడు బలవంతుఁడు గనుక బలవంతు నితో విరోధమువలనఁ దనకు హాని సంభవించు నని సిరియాలదేవిని తన పట్టణమును విడిచి పొమ్మని యెఱుకుదేవరాజు చెప్పినందున నక్కడ సిరియాలదేవి మిగుల దుఃఖించుచు నేమి గతి యని విచా రించుచు బ్రాహ్మణోత్తముఁడును, షట్కర్మ నిరతుఁడును, దయా దాక్షిణ్యశీలుఁడు నైన మాధవశర్మ కడకుంబోయి రక్షింపుమని యతని పాదములపైఁ బడియెను. ఆబ్రాహ్మణోత్తముఁ డామెను లేవ

నెత్తి యూమెవలన వృత్తాంతమును విని జాలినొంది "ఓసాధ్వీ ! నీకు భయం బావంతయును లేదు. సిద్ధేశ్వరుండు నిన్ను రక్షించునుగాక! మద్గృహంబున నివసించి యుండుము." అని అభయహస్త మొసంగెను. అంతట సిరియాలదేవి ప్రచ్ఛన్న వేషముతో మాధవశర్మ యింట సురక్షితముగా నుండెను. మాధవశర్మ చేసిన కార్యమునకు బ్రాహ్మణు లందఱును సంతోషించి యాతని కనుకూలురై యావృత్తాంతము నంతయు నితరు లెఱుంగ రాకుండఁ బరమ గోప్యముగా నుంచిరి. అట కందారంబుననున్న సామంతులందఱును బల్లహునితోఁ బోరాడఁజాలక పట్టణమును విడిచి విదేశగతులైరి. కటకవల్లభుఁడు తనపంతంబు సాగెనని విజృంభించి దయాధర్మ శూన్యుఁడై కోటలు ద్రవ్వి కవాటములు విఱిచి మేడలుగూల్చి యంతఃపురమును నేల మట్టముగావించి సిరియాలదేవికై యిల్లిల్లు వెదకి సందుగొందులఁ బరికించి యెందునుంగానకఁ బరితపించుచు జాడలు దీయఁగా నామె యనుమకొండకుఁ బాఱిపోవుట దెలియవచ్చెను అంతట నతఁడు మంత్రిసేనాసమేతుఁడై పోయి అనుమకొండను ముట్టడించెను. ఎఱుకు దేవరాజు తనపట్టణమును సంరక్షింపఁ దనసేనాధిపతుల నియోగించి మంత్రివర్గముతోడ నాలోచించు చుండెను. బల్లహుని రాయబారులు వచ్చి "నీకు బలవద్విరోధంబు క్షేమకరంబుగాదు; సిరియాలదేవి నొసంగి నీపట్టణమును గాపాడుకొమ్ము." అని తెలియఁజెప్పిరి. అందునకు నెఱుకుదేవరాజు వారలతో నిట్లనియె. "అయ్యా! మాకు బలవద్విరోధంబుతోఁ బనిలేదు. సిరియాలదేవి యీపట్టణమున నున్నదని మీకు నమ్మికయున్న యెడల మీరు స్వేచ్ఛగావచ్చి యిల్లిల్లు వెదకి తెలిసికొనవచ్చును; మాయభ్యంతర మెంతమాత్రము లేదుగాని, మీరుమాత్రము నిరాయుధులై పట్టణమును బ్రవేశింపవలయునే గాని యాయుధపాణులై రారాదు; మీరాకపోకల

కెవ్వరు నడ్డము రారు; మఱియు సిరియాలదేవి గాన్పించిన యెడల మీరు గొనిపోవుటకు మేమడ్డుపడువారము గాము" అని విస్పష్టముగాఁ దెలుప, వారలు పోయి యీవృత్తాంతమును బల్లహునికి నివేదింపఁగా నతఁడు విస్మితుఁడై వర్ణాశ్రమ విధంబునకు భంగము కలుగకుండఁ జాతుర్వర్ణ్యము వారిని వెదుకఁ బంపెను. సిరియాలదేవినిఁ గనుఁగొని దెచ్చినవారికి గొప్ప బహుమానము లిచ్చెదనని వాగ్దానము చేసెను. వారలెల్లరును బోయి వేయికన్నులతోడఁ బట్టణమంతయుఁ బరిశోధించి చూచిరి గాని యెక్కడను వారలకు సిరియాలదేవి గానిపింపదయ్యెను. అప్పుడొక ధూర్త బ్రాహ్మణుఁడు రాజువలనఁ దనకు విశేష బహుమానములు లభించునని మిక్కిలి శ్రద్ధవహించి యేడవనాఁడు మాధవశర్మ గృహంబుఁ బ్రవేశించి ప్రచ్ఛన్న వేషముతో నున్న సిరియాలదేవిని గాంచి యామె సుందరాకారమును బట్టి రాజపత్ని యని భావించి యీమెయే సిరియాలదేవి యని మాధవశర్మతోఁ జెప్పఁగా నతఁడు "సరి సరి, యీమె నాపుత్త్రిక; నాయల్లుఁడు కాశికింబోవుచు నీమెనిచ్చట నుంచిపోయె" నని యెంత చెప్పినను నాతఁడు వినక తనవారినిం గూర్చుకొని యామెను బట్టుకొని యెఱుకుదేవరాజు కడకుఁ గొనిపోయెను. అంతటఁ బట్టణములోని బ్రాహ్మణు లందఱేకమై "అయ్యో! ఇది ఏమియాగడము? రాజపత్ని యని చెప్పి బ్రాహ్మణకాంత నెత్తికొనిపోవుటకంటెఁ బాపకృత్యంబు వేఱొండుగలదే? లోకములో సౌందర్యంబు క్షత్రియకాంతలకే గాని పెఱవారికి లేదా? ఈసుందరి మాపుత్త్రిక యాఁటచే నీమెం గొనిపోవువారికి దుర్గతులు గల్గుట సత్యము" అని గొల్లున గోలపెట్టిరి. అంతట నెఱుకు దేవరాజు బ్రాహ్మణులంగని యిట్లనియెను. "బ్రాహ్మణులారా! ఈమె క్షత్రియ కాంత యని వారు చెప్పుచున్నారు; ఈమె యంగసౌష్టవమును గాంచినప్పుడు

నాకుఁ గూడ నట్లే తోఁచుచున్నది" అని చెప్పఁగా వారలు రోష మును జెంది యీమెను గొనిపోయిన యెడల మేమందఱమును పుత్త్ర మిత్త్రకళత్త్ర బంధువర్గముతోడ ననలప్రవేశమును గాంచి ముక్తిఁజెంద దము. మాకీర్తిత్రైలోక్యంబునందును వ్యాపించును ఈబ్రహ్మహత్యల పాపమును మూట కట్టుకొనుటకై బల్లహుఁడు వచ్చినవాఁడు గనుక నతని వంశంబును సామ్రాజ్యంబును గూలిపోవు నని శపింప నుద్యు క్తులు కాఁగా బల్లహుని మంత్రి విని గడగడ వడఁకుచు వచ్చి వార లతో నిట్లనియె. "అయ్యా! బ్రాహ్మణ శ్రేష్ఠులారా! ఇది యేమి సాహసము? మీయిష్టమైనరీతిని వర్తింతముగాక; ఈమాధవ శర్మ మహిమాఢ్యుఁడు; ఇతని వంటివారీ ధాత్రిలోఁ గానరారు; మేము వ్యర్థముగా నీమె రాజపత్ని యని రవ్వచేసినమాట వాస్తవము; ఇప్పుడు మీపంతము చెల్లెను. మీరు సంతోషముతో నుండవలసి నది; అయిన నొక్క పరీక్ష చేయవలసి యున్నది; మీరు సిద్ధేశ్వ రుని సమ్ముఖమునకుఁ బోయి యచట నామె చేతియన్నమును భుజిం పవలయును; ఆమె యెవ్వరైనను జంపునుద్దేశ్యము మాకు లేదు; ఆమె మాధవశర్మ కొమార్తయైన మాకు చింతయే లేదు. ఒకవేళ నామె రాజపత్నియే యైన యెడల నామె గర్భమున నున్న శిశు వును రక్షించి కంధారంబునకుఁ బట్టాభిషేకము గావింతుము. మీకె ల్లరకు నగ్రహారము లిప్పింతుము" అని చెప్పినంతట విప్రవరులు తమకు ధనకనక వస్తువాహనాదులతో నిమిత్తము లేదనియును, బల్ల హునిమంత్రి కోరినప్రకారము సిద్ధేశ్వరుని సమ్ముఖంబున తనకొ మార్త వడ్డించిన యన్నమును భుజించుటకుఁ దమ కేయభ్యంతర మునులేదనియును, గర్భిణిచేతి యన్నమును భుజింపరాదని శాస్త్రము చెప్పుచున్నది గనుక నట్లు బ్రాహ్మణు లాచరింప రాదనియును జెప్పి యతని నొప్పించి తుదకు వారు సిద్ధేశ్వరుని ముంగటఁ గటక వల్ల

భుఁడు చూచుచుండఁగా సిరియాల దేవిచే ఘృతమును లవణమును గ్రహించి భుజియించిరి. అందునకు కటకరాజు సంతసించి సిరియాల దేవిని బ్రాహ్మణులకు విడిచిపెట్టి నిజసైన్యంబులతోఁ గందారంబు నుండి వెలువడి స్వదేశమునకుఁ బోయెను.

## మాధవ వర్మ.

ఇక్కడ అనుమకొండలో నొక్కనాఁడు సిరియాలదేవి యొక శుభముహూర్తమున నొకపురుషశిశువును బ్రసవించెను. అప్పుడు దైవజ్ఞశిఖామణులయిన బ్రాహ్మణోత్తములు పెక్కండ్రు మాధవ శర్మగృహంబున కేతెంచి ముహూర్తమును బరీక్షించి గ్రహస్థితులం బరికించి జాతకమునువ్రాసి యీపురుషశిశువు సర్వంసహాచక్రంబు నిర్వక్రలీలఁ బరిపాలించు రాజశ్రేష్ఠుండగునని మాధవశర్మతోఁ బలుక నతండు నట్లాశీర్వదించెను. పిమ్మట మాధవశర్మ యాశిశువునకు జాతకర్మసంస్కారంబు నాచరించెను. ఆచిన్నవానికిఁ దండ్రియు, గురువును, దైవమును మాధవశర్మయేగనుక నతని నామమే తన తనయునకును, బెట్టవలసిన దని సిరియాలదేవి కోరి నందున నట్లే మాధవవర్మయని నామకరణము చేయఁబడియెను. ఇట్లాచిన్నవాఁడు మాధవశర్మగృహంబున దినక్రమప్రవర్ధమానుఁడై పెరుఁగుచుండఁగా నైదవయేఁట నక్షరాభ్యాసమును విధ్యుక్తముగాఁ గావించిరి. తరువాత నుపనయనాదిసంస్కారములుజరిగి నవఁట! మఱియుఁ బెరిఁగి పెద్దవాఁడై సద్గురుముఖంబున బెక్కు విద్యలను గ్రహించి విఖ్యాతుఁ డగుచువచ్చెను. అతఁడు ప్రతిదినం బును అనుమకొండ పద్మాక్షీ దేవియాలయంబునకుం జని మిక్కిలి శ్రద్ధాభక్తులతో నామెను సేవించుచు వరప్రసాదమునుబొంది నిర్వక్రపరాక్రముండు నజయ్యుండునై వన్నెకెక్కుచుండెను. అతఁ

డొక్కనాఁడు తనతండ్రి కటకరాజుతో జరిగిన యుద్ధమునఁ జంపఁబడియె ననివిని క్రుద్ధుఁడై పగసాధింప దీక్షవహించెను అంతటఁ గ్రిమక్రమముగా నీరాజపుత్త్రుని నవమన్మథాకారమునుగూర్చియు, వివిధ విద్యాప్రౌఢిని గూర్చియు, పరాక్రిమమునుగూర్చియు, విచిత్రములయిన కథలును పొగడ్తలును దేశమునందంతట వ్యాపింపఁగా దేశములోని శూరులందఱు నాతనికడ కేఁగి కటకరాజుతోడి యుద్ధమునకుఁ బురికొల్పి సమరోన్ముఖునిఁగావించిరి. అప్పుడు మాధవవర్మ తల్లియొక్కయు, మాధవశర్మయొక్కయు, ఇతర బ్రాహ్మణులయొక్కయునను జ్ఞంగైకొని బహుసైన్యములం గూర్చుగొని మొట్టమొదట నాపట్టణ మేలుచున్నట్టి యెఱుకదేవరాజును మఱియొకప్రదేశమునకుఁబంపి యనుమకొండను స్వాధీనపఱుచుకొని దోర్దర్పమున నుద్దవిడి నుత్కలముపై దండెత్తిపోయి కటకపురిని ముట్టడించెను. కటకపురాధీశ్వరుండును మేటిపరాక్రిమవంతుఁడే గావున జంకులేక ధైర్యసాహసములతో యుద్ధసన్నద్ధుఁడై మాధవవర్మ నెదుర్కొనియెను. మాధవవర్మ కటకదుర్గములు ముప్పదిదినములు ముట్టడించి కోటలనుద్రివ్వి, కవాటంబులనుఁవిఱిచి, కుడ్యంబులిడియఁగొట్టి, పట్టణంబుఁజొచ్చి సౌధంబులనుగూల్చి, సకలసైన్యంబును సమయించి, వీరరసంబు పొంపిరివోయి పొరలిపాఱ సంకులసమరంబునఁ జంద్రాయుధముచేఁ గటకవల్లభుని తలఁదుంచి, పట్టణంబంతయు వశముచేసికొని, కటకపురాధీశ్వరుని కుమారునకుఁ బట్టముగట్టి, హతశేషమయిన సైన్యముతో ననుమకొండకు మహావైభవముతో విచ్చేసి, తల్లికిని మాధవశర్మకును నమస్కరించి, యాశీర్వాదములను గాంచెను. పిమ్మట మాధవవర్మ దుర్మార్గులను శిక్షించుచు సన్మార్గులను రక్షించుచు బ్రాహ్మణుల కనేకాగ్రిహారంబులొసంగి ప్రిజానురంజకముగాఁ బరిపాలనము సేయుచుండెను. అతనికి బట్టమహిషియందు

బద్మాక్షీదేవి వరప్రసాదంబునఁ గొంతకాలంబునకు సుతుండు కలుగఁగా నాబాలునకుఁ బద్మసేనుండని నామ ముంచెను. ఈమాధవశర్మ శాలివాహనశకము ౨౩౦ సంవత్సరము మొదలుకొని ౧౬౦ సంవత్సరము లనఁగా శాలివాహనశకము ౩౯౦ సంవత్సరము వఱకును బరిపాలనముచేసెనని స్థానిక చరిత్రమునం జెప్పఁబడినది. పండ్రెండవ శతాబ్దమునందు వేంగీదేశాధీశ్వరునకు సామంతుఁడుగ నుండిన మహామండలేశ్వర పల్లకేతభూపాలుఁడు బెజవాడ మల్లేశ్వరస్వామివారి యాలయములో నొకఱాతిపలకమీఁద వ్రాయించినశాసనములో నుదాహరింపఁబడిన గాథలలో శాలివాహనశకము ౧౧౭ వ సంవత్సరప్రాంతమున నొకమాధవవర్మ యను రాజు కలఁడనియు, అతనికుమారుఁడు చింతగింజలను నమ్ముకొని పొట్టపోసికొనెడి యొకస్త్రీయొక్క బిడ్డను సంహరించినందున రాజు విచారించి తనకొడుకుమీఁద నేరము ఋజువైనందున న్యాయపక్షమునేపూని కొడుకునకు నురిశిక్ష విధించె ననియు, అందుపైని మల్లేశ్వరస్వామి యాతని న్యాయబుద్ధికి సంతోషించి యాతనిపై సువర్ణవర్షమును గురిపించి యాతనిపుత్త్రుని బీదరాలగు నాస్త్రీయొక్క పుత్త్రుని మరల సజీవులను గావించెననియు, మల్లేశ్వరుఁడు మాధవవర్మయొక్క కీర్తిని భూమిపై స్థాపితముచేసె ననియు, నీమొదలుగాఁగలవిషయములు పేర్కొనఁబడినవి. * కాఁబట్టి మాధవవర్మఖ్యాతి యప్పటికే ప్రఖ్యాతమై యున్నది. ఈమాధవవర్మ చరిత్రమునం గొంతకల్పన ముండినను మాధవవర్మ కల్పితపురుషుఁ డని మాత్రము చెప్పవలనుగాదు. ఇయ్యవి భావిపరిశోధనమునంగాని తేటపడునట్టి విషయములు కావు.

---

* Report on Epigraphy No. 665, Public 28th July, 1810, Part II, Pages 81-82, Paras 8 and 9.

## మఱికొండలు చంద్రవంశపు రాజులు.

మాధవవర్మకు పిమ్మట బద్మసేనుఁడు రాజ్యభారమును వహించి శా. శ. ౮౬౮ సంవత్సరమువఱకు ననఁగా ౨౮ సంవత్సరములును, అటుపిమ్మట వానికొడుకు వెన్నమరాజు శా. శ. ౯౩౨ వఱకు ననఁగా౨౮ సంవత్సరములును, అనంతరము వాని కుమారుఁడు పోరంకి వెన్నమరాజు శా. శ. ౬౧౦ వఱకు ననఁగా ౨౮ సంవత్సరములును, తదనంతరము వానిపుత్త్రుఁడు వెండిగుండమురాజు శా. శ. ౬౭౦ వఱకు ననఁగా ౨౦ సంవత్సరములును, వానివెనుక వానితనయుఁ డెఱుకుదేవరాజు బాలుఁడైనందున వానిపక్షముగా వానితల్లి కుంతలదేవి శా. శ. ౬౫౫ వఱకు ననఁగా ౧౫ సంవత్సరములును, ఆమెతరువాత నెఱుకుదేవరాజు శా. శ. ౨౬౨ వఱకుననఁగా ౨౦ సంవత్సరములును, ఎఱుకుదేవరాజునకుఁ దరువాత భువనైకమల్లుఁడు శా. శ. ౭౩౯ వఱకు ననఁగా ౬౭ సంవత్సరములును బరిపాలనముచేసిరని చెప్పఁబడియున్నది. ఈరాజులను గూర్చి విశేషచరిత్రాంశము లేవియు స్థానికచరిత్రమునం జెప్పఁబడి యుండలేదు. ఈరాజుల పరిపాలన సంవత్సరము లంతగా విశ్వసింపఁదగినవి కావు. ఈరాజులు కటకపురాధీశ్వరునితోఁ బోరాడుచుండినటుల స్థానికచరిత్రమునందు వ్రాయఁబడి యున్నది. ఈమహారాజులలో భువనైకమల్లుఁడు ప్రఖ్యాతుఁడుగఁ గన్పట్టుచున్నాఁడు. ఇతఁడు విజయనగరపు రాజయిన నరసింహదేవరాయలతోఁ యుద్ధముచేసినటులఁ జెప్పఁబడియెనుగాని యాకాలమునకు విజయనగరము నిర్మింపఁబడకుండుటయు, నరసింహదేవరాయ లాకాలమువాఁడు గాకుండుటయు వాస్తవములయిన చరిత్రాంశములు గావునఁ బైగాథలలోని విషయములఁ జెప్పినవి చెప్పినట్లుగా నెంతమాత్రమును విశ్వసింపరాదు.

## నిజమైన చరిత్రము.

క్రీస్తుశకము ౨౩౦ మొదలుకొని క్రీ. శ. ౧౦౬౭ వఱకు నిజమగు చరిత్రము వివరముగా, దెలియు సాధనములు లేవుగాని కొన్ని శాసనములను బట్టి యీ దేశము ౬ వ శతాబ్దమున బశ్చిమ చాళుక్యులకును, తరువాత రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యుల కును, అటువిమ్మట పశ్చిమ చాళుక్యులకును వశమై పరిపాలింపఁ బడినట్లు తేటపడఁగలదు. రాష్ట్రకూటుఁడైన అమోఘవర్ష పృథ్వీ వల్లభమహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక పాదపద్మోప జీవినని చెప్పుకొన్న భీమరాజను నొకరాజుయొక్క యసంపూర్ణశాస నమొకటి యోరుగల్లునఁ గానంబడుచున్నది గావునను, మఱికొన్ని శాసనములను బట్టియు నీదేశమును (అమ్మకొండ విషయమును) ౬ వ శతాబ్దమునుండి ౮ వ శతాబ్దమువఱకు పశ్చిమచాళుక్యులును, ౧౦ వ శతాబ్దాంతము వఱకు పూర్వచాళుక్యులును, రాష్ట్రకూటు లును, తరువాత పదునొకండవ శతాబ్దము వఱకు పశ్చిమచాళుక్యు లును, అనంతరము కాకతీయరాజులును బరిపాలించిరి. తొమ్మిదవ శతాబ్దమంతయు నీభూభాగము సంపూర్ణముగా రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును మహాభయంకరము లయిన యుద్ధములకు రంగభూమియై యుండినది. వాస్తవ మనుటకు సందియము లేదు.

## అమోఘవర్షుఁడు-నరేంద్ర మృగరాజు.

అమోఘవర్షుఁడు మాల్యఖేతమును (Malkhed) రాజధాని గ రాష్ట్రకూట సామ్రాజ్యమును బరిపాలించినవాఁడు. నరేంద్ర మృగ రాజు వేంగిపురము రాజధానిగ వేంగీ సామ్రాజ్యమును బరిపాలిం చిన రెండవ విజయాదిత్యుఁడను పూర్వచాళుక్యుఁడు. వీరిద్దఱును సమకాలికులు. ప్రత్యర్థులునై యున్నారు. అమోఘవర్షుని తండ్రి

మూఁడవ గోవిందరాజు. ఇతఁడు బహుపరాక్రమ వంతుఁడై తనసరిహద్దులను దాటించి తన సామ్రాజ్యమును విస్తరింపఁ జేయుటకు బ్రయత్నించి ప్రాగ్దిశనున్న పూర్వచాళుక్య సామ్రాజ్యమును వెఱిచి తన వశ్యము చేసికొనవలయునని తలంపుతో వేంగీ సామ్రాజ్యమును బరిపాలించుచున్న నాలుగవ విష్ణువర్ధన మహారాజు దివంగతుఁడు కాఁగానే వాని కొమాళ్ళు విజయాదిత్యుఁడు, భీమచలుక్కియను నిద్దరు పుత్త్రులుండఁగా వారల కిద్దరకు స్పర్ధను బుట్టించి భీమచళుక్కిని తనప్రక్క నాకర్షించి యాతనిచే వేంగీ సింహాసనాక్రమణకై వేంగీ మండలముపై దండయాత్రలను సలుపునట్లు ప్రోత్సాహపఱచి రెండవ విజయాదిత్యుఁడు సింహాసన మెక్కకుండ ౧౨ సంవత్సరములవఱకు నవరోధము గలిగించెను. మూఁడవ గోవిందరాజు క్రీ. శ. 784 మొదలు 814 వఱకును, రెండవ విజయాదిత్యుఁడు 799 మొదలు 843 వఱకును బరిపాలనము చేసినవారు. ఈరెండవ విజయాదిత్యునకు భీమచళుక్కికిని (చాళుక్య భీమరాజు) పండ్రెండు సంవత్సరము లెడతెఱిపి లేకుండ ఘోర సంగ్రామము జరుగుచుండెను.* ఇద్దరు సోదరులును వేంగీ సామ్రాజ్యాధిపతులమని ప్రకటించి పోరాడుచుండిరి. రాష్ట్రకూటుల నుటిచేత పశ్చిమగాంగులును, కాళింగులును చాళుక్య భీముని పక్షమున నుండిరి. సమర గాండీవియని చెప్పఁదగిన నృపరుద్రుఁడు (విజయాదిత్యుని పిన్నతల్లి కుమారుఁడు హైహయాన్వయుఁడు) విజయాదిత్యుని పక్షమున నిలువంబడి యుండెను. తుదకి యుద్ధములో విజయాదిత్యునకే

* భారతి సంపుటము ౧ పే ౮౧౧. ౨౦, ౨౧

"........ద్వాదశవర్షయుద్ధం వల్లభేంద్రదండనాయకై స్సహ భీమసలుక్కి నామా నాం స్వానుజం నిర్జిత్యగృహీత వేంగీమండలమ్ దత్త్వాదింశ."

ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం. ౧౦ పే ౨౭౬

విజయము గలిగి వేంగీ సామ్రాజ్యము వశ్యమయ్యెను. ఆకారణము వలన చాళుక్యభీమరాజు మూఁడవ గోవిందరాజు కడనేయుండి వాని నాశ్రయించుకొని బ్రదుకవలసి వచ్చెను. మూఁడవ గోవిందరాజు మరణానంతరము మొదటి అమోఘవర్షుఁడు రాష్ట్రకూట సింహాసన మధిష్ఠించెను. వానికిని సేవకుఁడై యుండి అనుమకొండ కధికారి గానియమింపఁ బడియెను. ఆకారణము చేతనే ఖాజీపేట శాసనములో అమోఘవర్ష శ్రీపృథ్వీవల్లభ మహారాజ పాదపద్మోప సేవితుఁడ గుటఁజేసి యన్మకొండను సంపాదించిన భీమరాజీ రెండవ విజయాదిత్యుని తమ్ముఁడగు భీమచళుక్కియే యని యిప్పుడు విస్పష్టము కాగలదు. అమోఘవర్షుఁడు క్రీ. శ. 814 సంవత్సరము తరువాత సింహాసనమునకు వచ్చినవాఁడు గావున నాకాలముననే చాళుక్య భీమరాజుకూడ నుండెనని మనకు స్పష్టమగుచున్నది. కనుక నాతని శాసనమున "అనుమకొండ" యని ప్రస్తావింపఁ బడినదిగాని కాకతిపుర మని ప్రస్తావింపఁబడి యుండలేదు. అనుమకొండకు "కాకతిపుర" మను ప్రఖ్యాత నామముండిన యెడల నట్లు ప్రస్తావింపఁబడి యుండదాయని యొక సంశయము గలుగుచున్నది.*

* .........స్వస్త్యమోఘవర్ష.
శ్రీపృథువీవల్లభమహారాజాధి
రాజపరమేశ్వరపరమభట్టారక
పాదపద్మోప సేవితలబ్ధ
సమధిగత పఞ్చమ

మహాశబ్దమహాసామన్తాధిపతి సత్యాశ్రియ శ్రీమద్భీమరు సస్సద్వర్గగుణ జన సంస్తూయమానధర్మ సారతి చతుస్సమయాశ్రయ సకలభువన విఖ్యాత కీర్త్తి శ్రీదమ్మర కొణ్డగేశ్రివణ

అనుమకొండను అమ్మర కొణ్డ యని వ్రాయుట శిల్పలేఖనముయొక్క తప్పుగాని మఱియొకటి కాదు.

## కొఱవిశాసనము.

క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దిలో పూర్వచాళుక్యరాజులయిన నరేంద్రమృగరాజు, గణకవిజయాదిత్యుఁడు మొదటి చాళుక్యభీమవిష్ణువర్ధనుఁడును, రాష్ట్రకూట రాజులయిన మూఁడవ గోవిందరాజు, మొదటి అమోఘవర్షుఁడు, రెండవ కృష్ణరాజు నెడతెగని యుద్ధములను సలుపుచునే యుండిరి. ఒక్క నరేంద్రమృగరాజే రాష్ట్రకూటులతోను, గాంగులతోను ౧౧౮ యుద్ధములను గావించెను. అందువలననే యాతనికి చాళుక్యవిక్రమార్జునుం డను బిరుదము కలిగెను. ఈశతాబ్దిలో రాష్ట్రకూటులకును, పూర్వచాళుక్యులకును జరిగిన యుద్ధములు చాల భయంకరములైన వనుటకు నొకదృష్టాంతముఁ జూపినఁ జాలును. చాళుక్యార్జునుఁ డన్న బిరుదము వహించిన రెండవ విజయాదిత్యుఁడు రాష్ట్రకూటరాజధానియైన మాల్యఖేతమును ముట్టడించి అమోఘవర్షుని నోడింపగా నాతఁడు సంధిగావించుకొని తన కొమార్తెయో చెల్లెలో అగు సుశీల మహాదేవిని విజయాదిత్యుని కుమారుఁడగు కలివిష్ణువర్ధనున కిచ్చి వివాహము గావించియు బంధుత్వమునైనఁ దలపోయక యవకాశము చిక్కినప్పుడెల్లను వేంగీదేశమునకై పోరాటము సలుపుచునే యుండెను. నరేంద్ర మృగరాజునకు వెనుక కలివిష్ణువర్ధనుఁడు పట్టాభిషిక్తుఁడై ౧౮ మాసములు మాత్రము రాజ్యపరిపాలనము చేసి రాష్ట్రకూటులతోనైన యుద్ధములలోనే మరణము నొందెను. ఆ శీలమహాదేవికి గణకవిజయాదిత్యుఁడును, విక్రమాదిత్యుఁడును బుట్టి విజయాదిత్యుఁడు రాజుగను, విక్రమాదిత్యుఁడు యువరాజుగ నుండి రాష్ట్రకూటులతో యుద్ధములు చేయుచు నుండిరి. యువరాజ విక్రమాదిత్యుఁడు కూడ తన బావమఱది యగు రెండవ కృష్ణరాజుతోనైన యుద్ధములలో మరణముఁ జెంది యుండెను. ఈయువరాజ విక్రమాదిత్యుని కుమారుఁడే భీమ

విష్ణువర్ధనుఁడు. వీనినే మొదటి చాళుక్య భీమవిష్ణువర్ధనుఁ డందురు. ఇతఁడు క్రీ. శ ౮౮౮ మొదలు ౯౧౮ వఱకు వేంగీసామ్రాజ్యమును బరిపాలించినవాఁడు. పై నుడివిన కొఱవిశాసనములోఁ బ్రశంసింపఁ బడిన చాళుక్య భీముఁ డితఁడే. వీని కాలమున నీయనుమకొండ ప్రాంతప్రదేశము పూర్వచాళుక్యులకు వశ్యమై యుండెనన్న విషయమును కొఱవిశాసనము ఋజువు చేయఁగలదు. ఇందుఁ బేర్కొనఁబడిన చాళుక్య భీమరాజు వాని తండ్రి విక్రమాదిత్యుఁడు ననువారు పూర్వచాళుక్యులే గాని పశ్చిమ చాళుక్యులు గారు. కాఁబట్టి యీ తొమ్మిదవ శతాబ్దిలో నీరాజ్యము కాకతీయుల పరిపాలనము క్రిందకు వచ్చియుండ లేదని యీ కొఱవిశాసనము ఋజువు చేయఁగలదు. ఈశాసనమునఁ బేర్కొనఁబడిన చాళుక్య భీముని సామన్తుఁడైన రణమర్దనకుసుమాయుధుఁ డెవ్వఁడో యెక్కడివాఁడో బోధపడదు. ఈ కొఱవి తెలుఁగు శాసనములలోని భాష తొమ్మిదవ శతాబ్దిలోని దగుటచే శాసనము కూడ చక్కగా బోధపడకున్నది. * ఇందుఁ బేర్కొనఁబడిన కన్నరబల్లహుఁడు రాష్ట్రకూట రాజయిన రెండవ కృష్ణరాజుగా నున్నాఁడు. ఇతఁడు చాళుక్యభీమ విష్ణువర్ధనుఁడు పట్టాభిషిక్తుఁడగుటకు పూర్వము ౮ సంవత్సరముల వఱకు వేంగీపురము వఱకు దండయాత్రలు సలిపి చిక్కులం పెట్టి బాధించినను తుదకు చాళుక్యభీమవిష్ణువర్ధనుఁ డొక ప్రక్కను తన దాయాదుల నిర్జించుటయె గాక మఱియొక ప్రక్కను నీరాష్ట్రకూట రాజయిన రెండవ కృష్ణు మరల యెప్పుడు దండెత్తి రాకుండునటులు గావించెను. ఈ పై విమర్శవలన "అమోఘవర్షపృథ్వీవల్లభునికి సామంతుఁడై అన్మకొండసీమను బొందిన భీమర్సు లేక భీమరాజు పశ్చిమ చాళుక్యుఁడు గాక పూర్వచాళుక్యుఁడైన రెండవ విజయాదిత్యుని సోదరుఁడైన

---

1 తెలింగానాశాసనములు. పేజీ 163. 12 కొఱవిశాసనము.

భీమసళుక్కి యను వాఁడనియు రాష్ట్రకూట రాజైన మూఁడవ గోవింద రాజుచేఁ బ్రేరేపింపఁబడి వేంగిసింహాసనమునకై పండ్రెండు సంవత్స రములు తనయన్నతోఁ బోరాడియు విజయముఁ బొందజాలక విఫల మనోరథుఁడై రాష్ట్రకూటుల యండనేయుండి మూఁడవగోవిందరాజు పుత్త్రుఁడయిన అమోఘవర్ష పృథ్వీవల్లభునిచే అన్మకొండ సీమను బడ సినవాఁడని మనకు తేలిన సిద్ధాంతము.

ఇట్లుండినను శ్రీమాన్ దూపాటి రమణాచార్యులుగారు "కాకతీయసంచికలో కాకతీయులచరిత్రము-విశేషాంశములు" అను శీర్షికతోనున్న వ్యాసములో "అమోఘవర్ష పృథ్వీవల్లభ దేవుఁడు క్రీ. శ. 878 ప్రాంతమున అనుమకొండరాజ్యమును బాలించుచుం దన ప్రతినిధినుంచుటచేఁ దొమ్మిదవ శతాబ్దమునఁ బశ్చిమచాళుక్యుల నుండి రాష్ట్రకూటులు త్రిలింగసామ్రాజ్యమును హరించి యొక పశ్చిమచాళుక్యవంశజుని రాజప్రతినిధిగనుంచిరని తెలిసినది." * అను వాక్యములలోని భావము నిజమైన చరిత్రాంశముకాదని స్పష్టపడుచున్నది. అప్పటికి త్రిలింగసామ్రాజ్యము లేనేలేదు. వేంగీ సామ్రాజ్యమునే త్రిలింగసామ్రాజ్యమనుకొందమన్నను, వేంగీ సామ్రాజ్యమును రాష్ట్రకూటులు హరింపను లేదు. పూర్వచాళుక్యుఁ డయిన భీమరాజును (భీమసళుక్కిని లేక భీమర్సును) అన్మకొండను నిల్పినది క్రీ. శ. 878 ప్రాంతమునగాక క్రీ. శ. 814–843 సంవత్స రములకు నడిమికాలమున నని స్పష్టమయినది. 888 సంవత్సరములకు నీప్రాంతప్రదేశము మొదటి చాళుక్యభీమవిష్ణువర్ధనునకు స్వాధీన మయ్యెనని పైకొఱవిశాసనమునుబట్టి దెలియుచున్నది. అటుపిమ్మట నే యీభాగము రాష్ట్రకూటసామ్రాజ్యమును హరించిన పశ్చిమ చాళుక్యులకు వశ్యమైపోయి పూర్వచాళుక్యులకు పశ్చిమచాళుక్యు లకు యుద్ధరంగముగనుండెననుట చరిత్రబద్ధమైనవిషయము.

---

* కాకతీయసంచిక. పేజీ ౨౫౫.



# కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము.

## రెండవ ప్రకరణము.

### విరియాలవంశము కాకతీయరాజవంశమయ్యెనా ?

శ్రీలక్ష్మణరాయపరిశోధకమండలివారు తెలంగానాశాసనములను గొన్నింటిని సంపాదించి యొకసంపుటముగాఁ బ్రకటించి యీచరిత్రమునకు మహోపకారముగావించిరి. వీనివలన నొకటి రెండు క్రొత్తవి బైలుపడి విషయములు సత్యాన్వేషణపరులయిన పరిశోధకులకు నొకింత సులభమార్గమును గోచరింపఁజేయుచున్నవి. అయినను అయ్యవి యసంపూర్ణములుగను, శిథిలములయిన శిలలపై వ్రాయఁబడియుండునవిగను, ప్రాచీనమైన తెలుగుభాషలో పద్యమయమై యుండుటచేతను, అందలిభావములు విస్పష్టము లగుచుండ లేదు. కాకతీయసంచికాసంపాదకుఁడు వీనిని దెలిసియుండియు వీని యాథార్థ్యమును గ్రహించుటకై పూర్ణమైన విమర్శచేయుటకయినను బ్రయత్నించి యుండలేదు. వీనిలో గూడూరు, మాటేరుశాసనము లత్యంతప్రాముఖ్యముగలవై యపూర్వవిషయములను వెల్లడించుచున్నవి.

వీనిలో గూడూరుశాసనకాలము దెలుపఁబడియుండలేదుగాని మాటేరుశాసనముమాత్రము కాలమును దెలుపుచున్నది. అయ్యది

శా. శ. ౧౦౪౧ యని తెలియుటంబట్టి క్రీ. శ. ౧౧౧౯ అని విస్పష్టముగాఁ దెలియుచున్నది. ఈరెండుశాసనములకు నడుమ నెనోఁ్న సంవత్సరములు వ్యత్యాసముండదు. మాటేరుశాసనముచాలభాగము చెడిపోయి యున్నది. గూడూరుశాసనము ప్రాచీనమైన దయినను పద్యమయమై యున్నది. అందలి పదములలోన నేకములు నేఁడర్థములు గావు. ఆశాసనము నేనిచట సంపూర్ణముగా చదువరులయుపయోగార్థమై నీక్రిందఁ బ్రచురించుచున్నాను.

అనుపమదుర్జయాన్వయ సుధాబ్ధిననేకులు రాజనందనుల్
సనినఁబిఱుంద వెన్నఁడను సంభవుడయ్యె నతిప్రసిద్ధుఁడై
వినుత విరోధిమండలిక వెన్నడు వెన్నుడపోలె వానికిన్
ఘనుఁడగు నెఱ్ఱభూపతి జగద్వినుతుం డుదయించె గీర్తితోన్.
భావితకీర్తి నాతనికి పాండవమధ్యమ భీముఁడోయనం
గా విరియాల భీమనృప ఘన్నరుడై యుదయించె వానికిన్
భూవినుతుండు మండళిక భూషణు డెఱ్ఱనరేంద్రుఁ డుత్తమ
శ్రీవినుతుండు బంధుజన సేవ్యుండు దా నుదయించె నున్నతిన్.
అతఁడని బొట్టబేత వసుధాధిపుజేకొని వానివైరిను
ద్ధ్రితమున జంపి యాకొఱవి దేశమునందు ప్రతిష్ఠ చేసి త
త్తనయు సమేతుడోడగలియము బిట్టరగద్యనంబు న
ప్రతిముడు వానిదా మొగుడు పర్వియు పంద్రడు నెఱ్ఱడాప్తుడై
అరుదగునట్టి ఎఱ్ఱనృపు నంగన గామమసాని యాకమే
ల్గరదని బేతభూవిభుం గాకతివల్లభు సేసి వానితా
బరగగ జేతబెట్టి ఘను బల్లవరాయుని యాగిజొచ్చె భా
స్కరవిభు చక్రవర్తిగని కాకతి నిల్పుట గోటిసేయదే.
కారకకాలుడై పడుసె గాడయ నాయకు జంపి సూరడ
వ్వేలుపుకొండ రవ్వనృపు వేలుపుగొండన నిల్పి వానిచే
మేలుగ మూడముప్పయిని మేలుగ నేరెడు బోదిపాడును౦
మేలుగ టేకుమావిడులు మేలుగ రెండెయ రాజు సంగడై

సూత్రధారి కొమ్మోజన బరహా॥ శ్రీ శ్రీ శ్రీ

అడపగట్ల దేవరకు జేను,

ఈశాసనము మూఁడు చంపకమాలలతోను రెండు ఉత్పల మాలలతోను గూడుకొని భావము మాత్రము దుర్భేద్యముగా నున్నది.

ఇఁక మాటూరు శాసనమును గూర్చి "తెలంగానా శాసనము" లను గ్రంథములో "ఈశాసనముమధ్యమధ్య చెడిపోయి యుండుటచే ప్రతిబింబ మస్పష్టముగ నున్నది. త్రిభువనమల్లదేవుని సామంతుఁడొకఁడు దాయాదు లపహరించిన ఆంధ్రసామ్రాజ్యమును దిరిగి కాకతీయులకు సంపాదించి పెట్టినటుల తెలుపుచున్నవి. ఈశాసనము కాకతీయుల పూర్వచరిత్రమును దెలుపుటలో నద్వితీయ ప్రాముఖ్యత గలది. ఇందలి విషయములు భావిపరిశోధనమునఁగాని సమన్వయింపవలను పడదు.'' అని తద్గ్రంథసంపాదకునిచే వ్రాయఁబడెను.

ఈశాసనము క్రీ. శ. ౧౧౧౫ సంవత్సరమునాటి దగుటచేత ఇందుఁ బేర్కొనఁబడిన "సమస్తభువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమభట్టారక సత్యాశ్రయకులతిలక చాళుక్యాభరణ శ్రీమత్త్రిభువన మల్లదేవర" యను రాజు ఆఱవ చాళుక్య విక్రమాదిత్యుఁ డనుటకు సందియము లేదు. ఇతఁడు ౧౦౭౬ మొదలుకొని ౧౧౨౬ వఱకు పశ్చిమ చాళుక్యసామ్రాజ్యమునకు ప్రభువై యుండెను. ఇందు వాని సామంతుఁడయిన చోళకులుఁడు "ఊర్జితవర్మ" యను నాతఁడు పేర్కొనఁబడినాడు. అటు పిమ్మట "శ్రీరమణీయుఁ డుదారుండు ధీరుండు దారిద్ర్యవైరియను పేరదెగడు కాకతిరాజులం జేకొని డాయం గతాంధ్రరాజ్యంబు నిలిపి పాడిరి" అనిపద్యమో వాక్యమో వ్రాయబడినది. తక్కిన శాసనముఁ జదివి యర్థముఁ జేసికొనుటకు సాధ్యము కానటుల నడుమ నడుమ ననేకాక్షరములు విడిచిపెట్టఁ బడినవి. కడపట నెన్మిదిపంక్తులు తెలియమి

విడిచిపెట్టఁ బడినవి. ఈశాసనమువలనఁ దెలియఁ దగ్గ విషయము పైఁ జెప్పినట్టిదే. గూడూరు శాసనము మాటూరు శాసనమునకుఁ బూర్వము పుట్టినదిగాని తరువాతది కాదు. ఈశాసనముల ప్రతులను సేకరించిన దూపాటి రమణాచార్యులుగారు కాకతీయ సంచికకు తాము వ్రాసిన "కాకతీయుల చరిత్రము—విశేషాంశములు" అను శీర్షికతో నొప్పెడు వ్యాసములో "కాకతీయవంశము విచ్ఛిన్నమగు టచే సేనానులు తమబిడ్డల నొసంగి రాజవంశము నిలిపినటుల గూడూరు మాటేరు శాసనములలోఁ గొన్ని సూచనలు గలవు. వీనిలో రెండవ బేతరాజును గామమ్మసాని కని కాకతీయ సామ్రాజ్యమునకు రాజును జేసె ననియు, బేతని రాజుచేతఁ బెట్టి, పల్లవుల విజృంభణము నడంచె ననియు, దన కొన్నును కాకతిరాజును జేసి కాకతీయవంశము "కోటిసేయు ననియుఁ దోఁచుభావము విమర్శింప వలసి యున్నది." అని వ్రాసియున్న విషయము విమర్శింపఁ దగి యుండెననుట యొప్పుకొనఁ దగియున్న దే.

కాని యేకారణము చేతనో కాకతీయసంచికా సంపాదకుఁడు మాటూరు లేక మాటేరు శాసనమును విస్మరించి గూడూరు శాసనమును మాత్రము విమర్శించుచు నాచార్యులవారు వ్రాసినదానిని జదివియుండియు వానిపేరెత్తనైన నెత్తక తా మొక పంథా నవలంబించి మఱొకరీతి వ్యాఖ్యఁ గావించిరి.

"పూర్వోదాహృత మగు నైజాంరాష్ట్రములోని గూడూరు గ్రామమునందలి యొక శాసనము బేతరాజునుగూర్చి కొన్ని ముఖ్యాంశములను దెలుపుచున్నది. ఈతని తండ్రికాలముననే కాకతీయులు గోదావరీనదికిఁ బశ్చిమోత్తరమున స్థిరపడియుండు రని యిదివరలోఁ జెప్పి యుంటిమి. వీరలీ భాగమునకు నూతనాగతులగుటచేతనో లేక

మొదటి పోలిరాజు మరణించునప్పటికే బేతరాజు బాలుఁడుగ నుం డుటచేతనో మఱియే కారణము వలననో కొందఱు శత్రురాజులు చేరి బేతరాజును పదభ్రష్టునిఁ జేసిరి. అప్పుడు దుర్జయ వంశీయుఁ డగు నెఱ్ఱనయను నాతఁ డీశత్రువును దునిమి బేతరాజును కొఱవి దేశమునఁ బ్రతిష్ఠించెను. ఎఱ్ఱనభార్య యగు కామసాని పల్లవరా యఁడు, భాస్కరచక్రవర్తి, కాడవనాయకుఁడు, మున్నగు బేతరాజు శత్రువులను నిర్జించి యీ బేతరాజును కాకతివల్లభుని జేసెను. ఈవిష యములు రెండును పైగూడూరు శాసనమునుండి తెలియుచున్నవి. ఇందలి శత్రురాజులను గూర్చి విశేషము లేమియుఁ దెలియుట లేదు. ఎఱ్ఱనయు నాతని భార్యయుఁగూడ బేతరాజునకు సాహాయ్య మొన ర్చిరి. భర్తయుండినపుడు భార్య రణరంగమున దిగుట యసామా న్యము. దీనినుండి మొదటిలో కొఱవిదేశము బేతరాజునకు పైతృక మనియు నాతఁడు దానిని గోలుపోవ నెఱ్ఱన దాన నాతనిఁ దిరిగి ప్రతి ష్ఠించెననియు ఎఱ్ఱన చనిపోయిన పిమ్మట బేతరాజునకు దిరిగి శత్రు వులవలన యపాయమొదవుటచే నెఱ్ఱనభార్య కామసాని యీతూరి యాతనికి బాసటయయ్యె ననియు నూహింపవలసి యున్నది'' అని యొట్లో సమర్థించుకొన్నారు గాని యిం దుదాహరింపఁబడిన బేత రాజు మొదటివాఁడో రెండవవాఁడో నిర్ధారణ చేయకుండ వ్యాఖ్యా నముచేయుట సమంజసముగాఁ గన్పట్టదు. కొఱవిదేశమునఁ బ్రతి ష్ఠింపఁబడినవాఁడు రెండవ బేతరాజని యాశాసనమును బట్టి నిర్ధా రించుట కేమియుఁ గానరాకున్నప్పుడు పైయిర్వురు కూడ రెండవ బేతరాజే యని యభిప్రాయ పడిరి. వీరివ్యాఖ్యానము లెంతవఱకు సరియైనవో మనము విచారింపవలసి యున్నది.

మొట్టమొదట కొఱవిదేశమునఁ బ్రతిష్ఠింపఁబడినవాఁడు మొదటి బేతరాజై యుండవలెనుగాని రెండవ బేతరాజై యుండ డని యీక్రింది కారణములనుబట్టి తెలిసికొనఁ గలము.

(1) రెండవ బేతరాజు తనఖాజీపేట శాసనములో తన తండ్రియగు ప్రోలరాజు త్రైలోక్యమల్లుని వలన అన్మకొండ విషయమును శాసన పూర్వకముగాఁ బడసెనని చెప్పియుండుట.1

(2) విక్రమచక్రియన్న బిరుదము రెండవ బేతరాజునకే గాని మొదటి బేతరాజునకు లేదని రెండవ బేతరాజు పై శాసనము తెలుపుచుండుట.2

(3) రెండవ ప్రోలరాజు తన ఖాజీపేట శాసనములో తన తండ్రి బేతరాజును గూర్చి మాత్రమె "దుర్జయకులాబ్ధి చంద్రుఁ డని చెప్పియుండెను గాని తన ప్రపితామహుఁడగు మొదటి బేతరాజును గూర్చి చెప్పకుండుట.3

(4) ఈతని ఖాజీపేట శాసనములో వైరినృపతుల కిరీటములచేఁ ప్రకాశించు పాదములు గలవాఁడును, జగత్ప్రసిద్ధములగు యుద్ధములలోఁ జూపిన శౌర్యమువలన తనకీర్తిచే దిక్కులనన్నిటిని తెల్లనివిగాఁ జేసినవాఁడు రెండవ ప్రోలరాజు గాని మొదటి ప్రోలరాజు గాకుండుట.4

---

(1) కాకతీయ సంచిక, అనుబంధము, ఖాజీపేట శాసనము ౧. పేజి. ౨౯.

(2) డిటో అనుబంధము పేజి ౩౧, అనుమకొండ శాసనము ౮, భారతి సం॥ ౧, సంచిక ౯,

(3) కాకతీయ సంచిక, అనుబంధము పేజి ౩౧ ఖాజీపేట శాసనము ౫ తెలింగానా శాసనములు, పేజీ ౮ ఖాజీపేట శాసనము ౨.

(4) సుజాత ౨వ సంపుటము ౨వ సంచిక

కాకతీయ సంచికానుబంధము పేజి ౩౧, ఖాజీపేట శాసనము ౫.

(5) రెండవ బేతరాజు ఖాజీపేటలోని మఱియొక శాసనములో "త్రిభువన మల్లదేవుని పాదపద్మోపజీవి ననియు, అన్మకొండ పురవరేశ్వరుండ ననియు జెప్పుకొని యుండియు, మఱియొక శాసనములో (మొదటిది) తన తాతయైన బేతరాజును కాకతిపురాధి నాథుండని చెప్పియుండుట.5

(6) క్రీ. శ. ౧౧౧౮ (శా. శ. ౧౦౦౧) సంవత్సరమున బేతేశ్వరమున పోలేశ్వర దేవరకుని నందదీవియుం బెట్టించిన బేతమయ్య మహామండలేశ్వరుండైన రెండవ బేతరాజే యైయుండ క్రీ. శ. ౧౧౧౯ దవ సంవత్సరమున మాటూరు శాసనము పుట్టియుండుట.6

ఈపైనుడివిన ప్రమాణము ననుసరించి మొదట తనరాజ్యమునుబోఁగొట్టుకొని తరువాత విరియాల ఎఱ్ఱనచే కొఱవిదేశమున ప్రతిష్ఠింపఁబడినవాఁడు మొదటిబేతరాజై యుండునుగాని రెండవబేతరాజై యుండఁడని యూహింపఁ దగును.

ఇంక గూడూరు శాసనములలోని వివరమును సంగ్రహముగా మాటూరు శాసనమునఁ దెలుపఁబడి యుండును. రెండును నేకకాల జనితములు కావు. నడుమ కొన్ని సంవత్సరములు జరిగి యుండును. గూడూరు శాసనము మొదటి బేతరాజుకాలమునాటిదనియు, మాటూరు శాసనము రెండవబేతరాజు కాలమునాటిదనియు నూహించుట కెక్కువ యవకాశ మిచ్చుచున్నది.

---

(5) తెలింగానా శాసనములు పేజీ ౪ ఖాజీపేట శాసనము ౧

(6) కాకతీయ సంచిక, అనుబంధము, పేజి ౩౧, ౪ అనుమకొండ శాసనము.

భారతి సంపుటము ౧ సంచిక ౧.

సాటిలేనిదుర్జయ వంశమను పాలసంద్రమునందు ననేకరాజ పుత్త్రులుదయించి చనినపిమ్మట వెన్నఁడుపుట్టి విష్ణువువలెనె విరోధు లయిన సామంతమాండలికులచే వినుతింపఁ బడుచుఁ బ్రఖ్యాతుఁడై యుండ వానికి జగద్వినుతుండగు నెఱ్ఱభూపతియు, వానికి పాండవ మధ్యముం డగు భీమునింబోలిన భీముఁడును, వానికి నెఱ్ఱనయు జనించి యెఱ్ఱనయుద్ధములోఁ బొట్టబేతని పక్షముఁ జేకొని వానిశత్రువును సంహరించి బేతని కోఅవిదేశమునందుఁ బ్రతిష్ఠించె నని చెప్పెనే కాని పొట్టబేతవసుధాధిపతి యెవ్వఁడో ఏవంశమువాఁడో యించు కయు సూచించినవాఁడు కాఁడు. మొదటి మూడుపద్యములనుబట్టి విరియాలవంశమువారు దుర్జయాన్వయమునఁ బుట్టిన వీరులని నిస్సంశ యముగాఁ దెలుపుచున్నది. ఈశాసనములోని నాలుగవ పద్యము కేవల మపూర్వమైన విషయమును బ్రస్తావించు చున్నది. అందలి భావము మాత్రము దుర్గ్రాహ్యముగ నున్నది. అదియెట్లైనను కాకతీయ సంచికా సంపాదకుఁడు దెలిపిన భావములకన్నను శ్రీమాన్ దూపాటి రమణాచార్యులుగారు తెలిపినభావమే పద క్రమభ్రమణ మెంత తిరువిళ్ళుపెట్టినను తత్తుల్యభావమునే తెలుపక మానదు. అదియెట్లైనను ఆబేతరాజు రెండవ బేతరాజుమాత్రము కాఁడు. ఈ గూడూరుశాసనములోని నాలుగవ పద్యములో నున్న భాస్కరవిభుచక్రవర్తిని బేతరాజునకు విశేషణముగఁ జెప్పుకొన కున్నయెడల రమణాచార్యులవా రూహించిన యర్థము స్ఫురించున్నని చెప్పఁజాలము. బేతని రాజుచేతఁ బెట్టియనుటకు బదులుగా రమణా చార్యులుగారు తన వశ్యమున నుంచుకొని యనిచెప్పియున్నయెడల నెక్కువ సందర్భానుసారముగా నుండునేమో ? ఇంతకంటె యుక్తి యుక్తమైనభావము వెల్వడువఱకు రమణాచార్యులగారి భావమును గ్రహింపఁ దగునా యని సంశయపడుచున్నాను. ఈ మొదటిబేతరా

జయిన కాకతిబేతరాజు విరియాల వంశములోని వాఁడని వేంకట రమణాచార్యులవారి వ్యాఖ్యానము వలన బోధపడుచున్నది. ఈ సందర్భమున నాచార్యులవారు కాకతీయ సంచికలోని "కాకతీయుల చరిత్రము- విశేషాంశములు" అను తమ యపూర్వవ్యాసములో కప్పదాట్లువేసి వ్రాసి యున్నను, ప్రజోత్పత్తి నామసంవత్సరమున వెల్వడిన ఆంధ్రపత్రిక- ఉగాదిసంచికలో "కాకతీయరాజులు" అను శీర్షికతో వ్రాసినవ్యాసములో మాత్రము వీరిహృదయస్థమయిన భావము చక్కఁగా బోధపడుచున్నది. అందిట్లు వ్రాయఁబడియున్నది.

"వీని సమకాలికమునగు ఉదాహృతపద్యశాసనము (గూడూరిశాసనము) పదియవ శతాబ్దము లోనిది కావచ్చును. ఆకాలమునఁ గల దుర్జయవంశము, అందు ప్రసిద్ధులగు ఎఱ్ఱభూపతి, విరియాల భీముఁడు, జనించుటయు, విటియాల భీముఁడు బొట్టబేతరాజును జంపి కొఱవిదేశము గైకొనుటయు, ఎఱ్ఱభూపతి భార్య కామమసానిపల్లవ రాయని విజృంభణమూపి, తనకరదనిచే (బేతరాజుచే) కాకతీయ వంశము నుద్ధరింపజేయుఁటయుఁ జరిత్రమునకు క్రొత్తయంశములు. శాసనస్థాంశముల బలపఱుప నింకఁగొన్ని సాధనాంతరములు గావలసి యున్నవి. బేతభూపతి కాకతీయవల్లభు నెట్లుచేసెనో, కామసాని పూర్వోత్తరము లెవ్వియో బేతభూపతి కాకతీయరాజులలో నేపేరఁ బరఁగెనో భావిపరిశోధనమునఁగాని తేలదు. ఇది గణపతిదేవునికాలపు శాసనముగానను విరియాల వంశమాకాలమునఁ బ్రసిద్ధముగ నున్నందునను గణపతిదేవుని కీ యంశమేమైన యన్వయించునేమో యని మాయనుమానము."

ఈపై ఉగాదిసంచికలోని వాక్యరత్నములు శ్రీ శేషాద్రి రమణకవులవి. పై కాకతీయసంచికలోని కప్పదాట్లు శ్రీ దూపాటి

రమణాచార్యులవారివి. పై గూడూరు శాసనములోని మూఁడవ పద్యమగు:—

"అతడని బొట్టబేతవసుధాధిపు జేకొని వానివైరిను
చ్చిత్రమున జంపి యాకొలవి దేశమునందు బ్రతిష్ఠచేసిత
త్తనయు సమేతుడోడగలి......యము బిట్టఱగద్యనంబు న
బ్రతిముడు వానితా మొగడు పర్సియుపండ్రడు నెఱ్ఱడాపుడై."

అను దానిలో "బొట్టబేతవసుధాధిపుని జేకొని యాతని వైరిని జంపి విరియాల ఎఱ్ఱభూపతి యాతని కొలవిదేశమున నిలిపినట్లుగాఁ దెలుపఁబడినదిగాని ఎఱ్ఱభూపతి తండ్రియగు విరియాల భీముఁడు బొట్ట బేతరాజును జంపినట్లు చెప్పియుండలేదే. "తాళ్ళపాకవారి కవిత్వము కొంత నాపైత్యము కొంత" అన్నట్లుగా శేషాద్రిరమణకవులు శాసనము పదియవ శతాబ్దములోనిది కావచ్చునని పైనవ్రాసి క్రిందను "గణపతిదేవుని కాలపుశాసనముగాన" అని వ్రాయుట కవిత్వ మన వలయునో పైత్యమనవలయునో బోధపడకున్నది. గణపతిదేవుఁడు పదుమూఁడవ శతాబ్దిలోనివాఁడుగాని పదియవ శతాబ్దిలోనివాఁడు కాఁడు. ఇంతియగాక శాసనములోని పద్యములలోని నడకయు, నం దలి తెలుగుపదములు మొదలగువాని పరిశోధించినవారికి నాశాస నము పదుమూఁడవ శతాబ్దములో వ్రాయఁబడినదిగాఁ గన్పట్టదు. గణపతి యనునది విఘ్నేశ్వరునకు నామాంతరముగావునను విఘ్నే శ్వరునకు పెద్దపొట్టయుండును గావునను, పొట్టబేతండన్నతోడనే కాకతి గణపతిదేవుఁడును, వానికాలమును స్మరణకువచ్చి "గణపతి దేవుని కీ యంశమేమైన యన్వయించునేమో" యని పాప మీ యపూర్వ ద్వంద్వకవులకు స్ఫురించి యుండవచ్చును. కాని విరియాల భీముఁడు వీరి యభిప్రాయము ప్రకారము పొట్టబేతని చంపియున్న ప్పుడు కాకతిగణపతిదేవుఁడు విరియాల భీమునిచేఁ జంపఁబడియె నను నది స్ఫురింపకుండెనా? గణపతిదేవ చక్రవర్తి మహాదేవరాజునకు

బయ్యమాంబకుఁ బుట్టినవాఁడని యనేక శాసనములు గ్రంథములు దెలుపుచుండగా "విరియాల వంశ మా కాలమునఁ బ్రసిద్ధముగ నున్నందున గణపతిదేవుని కీ యంశ మేమయిన యన్వయించునేమో యని మాయనుమాన" మని వ్రాయుట హాస్యాస్పదమైన విషయ మని బాలునకు సయితము తెలియగలదు. ఇంతటి చరిత్రజ్ఞులు నింతటి పండితులు ఇటువంటి చరిత్ర పరిశోధకులు బయలుదేఱిన తరువాత "చరిత్రకారులు స్థానికుల ప్రవాదములపైనను, చరిత్రానుభవము, శాసనపఠనాభ్యాసములేని ప్రజలపైనను ఆధారపడుటచేఁ జరిత్రాంశములు తారుమారగుచున్నవి." యని వీరు వ్రాసినట్లు జరుగుచుండుటలో నాశ్చర్యమేమున్నది?

విరియాల వంశము వారిది విప్పర్లగోత్రము.

విరియాల వంశమువారిది విప్పర్లగోత్రమనియు, ప్రతాపరుద్రుని గడిదుర్గములను సంరక్షించుటకు నియమింపఁబడిన డెబ్బదియేడ్గురు నాయకులలోను వీరొక రనియు వీరు పద్మనాయకులలోనివారనియు, మనకు రావు వంశీయుల చరిత్రమును బట్టి దెలియుచున్నది. కాఁబట్టి విరియాల వంశము రావు వంశీయుల చరిత్రమును బట్టి పద్మనాయక వెలమవంశమని తెలియుచున్నది. వీరిది విప్పర్లగోత్రమని చెప్పఁబడి యుండుటచేతను, పద్మనాయకులకు వారు నివసించిన గ్రామనామములను బట్టి వేఱ్వేఱు గోత్రనామము లేర్పఱచిరని తెలుపుచున్నది గనుక విప్పర్లగోత్రమువారు మొదట విప్పర్లనివాసులైయుండి తరువాత విరియాలగ్రామమునందు నివసించుటచేత విరియాల వంశ మనుపేరు గలిగి యుండవచ్చును. పద్మనాయకులలో, కోటగిరివారు మేకావారు మొదలగువారికి విప్పర్లగోత్ర మని తెలియుచున్నది. విరియాలవంశములోఁ బుట్టిన రుద్రరాజు మనుమఁడును, గణపతిరాజు పుత్రుఁడును నగు సామన్తశూరుఁ డను

రాజు కోటగిరియను నగరములో నివసించుచు శా. శ. ౧౧౯౪
యగు శ్రీముఖ సంవత్సర పుష్య బ ౯ ఆదివారమునాఁడు వైనా
యకపురి యను వేన్కాలపురిని నిరువండ్రు బ్రాహ్మణుల కగ్రహార
ముగా నొసంగి యుండిరని కోటగిరిశాసనము తెలుపుచున్నందున
విరియాలవంశములోని సామన్తశూరరాజు సంతతివారు కోటగిరివా
రైనఁ గావచ్చును. ఇంతటితో మనచిక్కు విడలేదు. విప్పర్లగోత్రి
యులు పద్మనాయకులలోనే గాదు, కమ్మవారిలోఁ గూడ నున్నారు *

సాగివారిదీ విప్పర్లగోత్రమే.

ఆంధ్రదేశములో రాచవారిలో, కమ్మవారిలో, బ్రాహ్మణు
లలో, (అందు ముఖ్యముగా వైదికులలో, నియోగులలో కూడను)
సాగివారను నింటిపేరుగలవా రున్నారుగాని బ్రాహ్మణులలోని సాగి
వారివి ఋషిగోత్రములుగాని విప్పర్లగోత్రము కాదు. అందువలన
బ్రాహ్మణులను తొలగించిన యెడల కమ్మవారు, రాచవారు మిగు
లుదురు. ప్రాచ్యలిఖితపుస్తకభాండారము (చెన్నపురిలోనిది) లో
నొకచోట సాగిబైచన (బైచరాజు) యిట్లు వర్ణింపఁబడి యున్నాఁడు.

---

(1) H yd. Arch. Series No 6. కాకతీయ సంచిక. అనుబంధము.

(2) విప్పర్ల గోత్రీయులయిన కమ్మవారు; 1 మానికొండవారు, 2. ఆలూరి వారు, 3 సూర్యదేవరవారు, 4. మల్లంపాటివారు, 5. కడియాలవారు, 6. మండావారు, 7. సుంకరవారు, 8. కనకమేడలవారు. 9. బోయపాటివారు, 10. గింజుపల్లివారు, 11. గుమ్మడివారు, 12. సూదివారు, 13. కొమ్మినేడివారు, 14. నూలువారు, 15. పుట్టావారు, 16. గుదేవారు, 17. వరిమివారు, 18. నార్లవారు, 19. తొండమువారు, 20. దొడ్డపనేనివారు, 21. కోయవారు, 22. అరవపల్లివారు, 23, గరికపాటివారు, 24. గంటావారు. ఈ కమ్మకుటుంబములవారి గోత్రము, విప్పర్లగోత్రమైనట్లుగా శ్రీయుత గూడవల్లి రామబ్రహ్మను చౌదరిగారి వలనఁ దెలియవచ్చినది.

“ మును విప్రకులాధిపుల్ బిరుదులేమో మోటలే కాని
పెంపునఁ బెంపాలర మానసంబలర నేపారం జెలిల్ వెట్టినా వనఘా!
గన్నయసాగిబైచ! పటుబాహాశక్తి నెల్లంకిమాదని యారామునిబట్టి
కాచితి మహోద్దామప్రతాపోన్నతిఁ”

పై పద్యములో సాగివారు విప్రకులాధిపు లని వర్ణించి యుండుట గన్పట్టుచున్నది. సాగిహారు మొదట విప్రవంశజు లనుటకును శాసనాధారము గలదు. 2 దుర్జయాన్వయమునఁ బుట్టిన విరియాల వంశమువారిది విప్రగోత్ర మైనట్లుగానే దుర్జయాన్వయమున బుట్టిన సాగివంశమువారిదికూడ విప్రగోత్రముగానే తెలుపఁ బడుచున్న దని విశదమైనది. నతవాటి విషయాధీశ్వరులలో గడపటివాఁ డగు మన్మచాగి గణపతిరాజు బాహుజకులాభరణు డనియు, విప్రవంశజు డనియు, అను మంచిపల్లె శాసనము తెలుపుచున్నది. *

“సాగివారివంశవృక్షము దుర్జయునిదొట్టి నేటి తమతండ్రిగారి మేనబావలవఱకును అవిచ్ఛిన్నముగా గలదనియు, ఇట్టివంశవృక్షమాంధ్రదేశములో నేజాతియందును గానమనియు, సాగివంశమెన్నెన్నిమార్పులఁజెందియున్నదో యీవంశవృక్షము, ఏయితరవంశ

(1) M. S. S. No 15-5-32 of the Oriental Manuscript Library, Museum, Madras.

(2) E. R. Ins No 283 of 1924.

* “ లక్ష్మీవల్లభ నాభి తామరసతో ద్విస్సప్త లోకప్రజా
సర్గారంభ విదుత్సురా విరభవద్బ్రహ్మ చతుర్భిర్ముఖైః
తస్యైవాస్యభుజోరుపాద విషయాదా విర్బభూవుః కిల
బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర విధయావర్ణాశ్చతుర్ధాక్రమాత్.
తత్రాస్తి. బాహుజకులాభరణం తపోభిర్విప్రల
వంశ ఇతి విప్రకరోపమానాత్.

-Ins No 283 of 1924.

వృక్షముతో బనిలేకయే సాక్ష్యమిచ్చుచున్నదనియు, పండిత పెను మెచ్చ సత్యనారాయణరాజుగారు భారతీ పత్రికయందు వ్రాసి యున్నారు. మరియు వీరు "ఈ క్రిందివంశ వృక్షమునుబట్టి సాగివారు క్షత్రియుల యందును, చతుర్థాన్వయులందును, గలరని తెలియు నదనియు వ్రాయుచు సాగివారు క్షత్రియులేకాని చతుర్థాన్వయులు కా"రని కంఠోక్తిగ నుడువుచున్నారు. సాగివారు క్షత్రియులా, చతుర్థాన్వయులా యను విచార మటుండనిచ్చినను, సాగివంశము దుర్జయాన్వయములోని దని వీరికెట్టి యాక్షేపణమును లేదని భారతి లోని వీరివ్యాసమే స్పష్టపఱచు చున్నది. ఇంకొక విశేషమేమన, "ఆదిపురుషు లైనటువంటి దుర్జయ మహారాజుగారు గాయవంశ వృక్షము. పూర్వం దేవగిరియందు గుడిమెట్టయందును సూర్యకులా వతంస హైహయ వంశోద్ధారక నరపాలమకుటమణి కాంతాయుక్త లక్కధరా పరిపాలన మాచరించిన దుర్జయ మహారాజుగారి వంశ వృక్షము" అని పెద్దవంశవృక్షము నిచ్చియున్నారు. అది ముందు విచారింతుముగాని యిచట మనకుఁ గావలసినది దుర్జయుఁడు సాగి వంశమున కాదిపురుషుఁడనియు, అతఁడు లక్కధరా మండలములోని దేవగిరిని రాజధానిగాఁ జేసికొని పరిపాలించినవాడని వారి వంశ వృక్షమువలనఁ దేటపడుచున్నది.

## దుర్జయుఁడు దుర్యోధనుని కొడుకా?

బ్రహ్మశ్రీ పెండ్యాల వేంకటసుబ్రహ్మణ్య శాస్త్రిగారు తాము వ్రాసిన మహాభారత చరిత్రమునందు దుర్యోధనునకు దుర్జయుఁడను పేరుగల కుమారుఁడున్నాఁడనియును, మహాభారత యుద్ధానంతరము పరీక్షిన్మహారాజు రాజ్యపరిపాలన కాలమున నతఁడు జీవించి యుండె

1. భారతి. సంపుటము ౧౦, సంచిక ౨ పుట ౨౭౩.

ననియు గూడ వ్రాయుచున్నారు. ధుర్యోధన పుత్త్రుఁడయిన లక్ష్మణ కుమారుఁడు కౌరవ సైన్యాధ్యక్షుఁడగు ద్రోణాచార్యుఁడు పద్మవ్యూహమును పన్నిననాఁడు అర్జున పుత్త్రుఁడయిన అభిమన్యునితోఁ బోరి మరణించుటయు మహాభారతమున జదివి యున్నాముగాని దుర్జయుని ప్రశంస గానరాదు. కాని "భాస మహాకవి నేటికి రెండు వేలేండ్లనాఁడు రచించిన "ఊరుభంగ" నాటకమున దుర్యోధనుఁడు తొడలు విఱిగి పడినపుడు బాలుఁడైన "దుర్జయుఁడు" అను పుత్త్రుఁడువచ్చి తండ్రితో సంభాషించినట్లు వ్రాసి యున్నాఁడు. ఆబాలుని సుయోధనుని మరణానంతరము తల్లి పుట్టినింటివారు (కళింగదేశపువారు) తమ దేశమునకుఁ దీసికొనిపోయి పెంచి పెద్దవానిగఁ జేసిరేమో.? ఆ కౌరవ్యుఁడే యథర్వవేదమునఁ జెప్పఁబడినవాఁడై యుండునేమో!" అని వ్రాయుచు అథర్వసంహిత యందును, ఐతరేయ బ్రాహ్మణమునందును జెప్పఁబడిన కౌరవ్యుని లేక కౌరవ్యుని దుర్జయునిగా గుర్తించు చున్నారు. ఆ దుర్జయుఁడే మనదుర్జయుఁ డగునా? మనదుర్జయుని కాలమును దెలుపు శాసనములుగాని గ్రంథములుగాని గానరావు. సాగివారి వంశవృక్షమున నిప్పటివరకు నలువది తరములను మాత్రముచేర్చి యుండిరి. తరమునకు ౪౦ సంవత్సరములు చూచుకొన్నను ౧౬౦౦ సంవత్సరముల క్రిందట మూల పురుషుఁడుండునని నిశ్చయింప వచ్చునుగాని క్రీస్తు శకమునకుఁ బూర్వము వేలకొలది సంవత్సరముల క్రిందట జరిగిన మహాభారత యుద్ధానంతరము ధర్మజునకు వెనుక, బట్టాభిషిక్తుఁడయిన పరిక్షిత్తుకాలమున దుర్యోధనుని కుమారుఁడైన దుర్జయుఁ డనువాఁ డున్నాఁడని యొప్పుకొన్నను నాతఁడే యీతఁ డనుటకు సాధ్యముకాదు. పదునొకండు, పండ్రెండు శతాబ్దులలో ననేక సామన్త మాండలిక వంశములవారెల్లరును దుర్జయుని తమ మూలపురుషునిగాఁ జెప్పుకొనుటఁ జూడ నాతఁ

డెవ్వాఁడో యొక ప్రఖ్యాతవంశమునకు బుట్టిన సుప్రసిద్ధ రాజన్యుఁడై యుండవలయునని మనము నిశ్చయింపక తప్పదు. అట్టి సుప్రసిద్ధ రాజన్యుఁడు చరిత్ర పరిశోధకుల దృష్టికి నింతవఱకు గోచరింపకుండుట వింతవిషయ మనుటకు సందియములేదు.

## రణదుర్జయుఁడే దుర్జయుఁడా?

ఏఁడవ శతాబ్దితుదనో, ఎనిమిదవ శతాబ్ది ప్రారంభముననో పీఠికాపురప్రాంత దేశమును బరిపాలించుచున్నవాఁడని తెలియఁజేయు పృథ్వీరాజుయొక్క తామ్రశాసన మొకటి కలదు. అయ్యది పృథ్వీ రాజు తన ౪౬ వ పరిపాలన సంవత్సరమున చేయఁబడిన దానమును గూర్చిన శాసనము. ఇతఁడు కామకాయన గోత్రీయుఁడును చాందోగ్య సూత్రుఁడును, విష్ణుశర్మకు మనుమఁడును, పృథ్వీశర్మ కుమారుఁడును, కొండమంచిలి గ్రామవాసియు, త్రిసహస్ర విద్యయం దాఱితేఱిన వాఁడును, శాస్త్రముల కిరువది భాష్యములు చేసినవాఁడును, వేదవేదాంగ వేత్తయు, షట్చాస్త్ర పారగుఁడును, ఉపనిషత్తులు, యోగము మొదలగు వానిం దెలిసి యుండియు, యజ్ఞాదిక్రతువులు మొదలగు వేదోక్తకర్మల యథావిధిగ నెరవేర్ప సమర్థతగల భావశర్మకు కార్తికపౌర్ణిమినాఁడు పగుణవార విషయ ములోని తాండివాడయను గ్రామమును దానముచేసి యుండెను. ఈ శాసనములో నితనిది రామకాశ్యప గోత్రమనియు, వీని తండ్రి విక్రమేంద్రుఁడనియు, వీని తాత రణదుర్జయుఁడనియుఁ దెలుపఁబడినది. ఈ శాసనముయొక్క ఆజ్ఞప్తి శ్రీరామబిన్ను (బిందు) రాజని యున్నది. ఈ పీఠికాపుర స్తంభ శాసనములలోనే పండ్రెండవ శతాబ్దిలోఁ బరి పాలనము చేయుచున్న వెల్నాటి పృథీశ్వరరాజు కాలములో వ్రాయఁ బడిన శాసనములో వాని పూర్వులలో నొకరణదుర్జయుఁడు పేర్కొనఁ బడినాఁడుగాని యయ్యది యీ మొదటిశాసనము ననుకరించి

వ్రాయఁబడి యుండును. ఈపగుణవారవిషయము తూర్పు చాళుక్యుల శాసనమునందును గానంబడు చున్నది. ఇందలి రణదుర్జయునే దుర్జయునిగా భావించుట కనువైన సాక్ష్య మొసంగున దేమియు నీ శాసనమునందు గానరాదు. కావున నతఁడే యితఁడని చెప్ప సాధ్యముకాదు.

### దుర్జయుఁడు కరికాలుని వంశములోని వాఁడా?

దుర్జయుఁడు కరికాల చోడుని వంశములోనివాఁడని పదుమూఁడవ శతాబ్దిలోని జనశ్రుతిని విశ్వసించి గణపతిదేవ చక్రవర్తి కాలమునాటి శాసనములేగాని వాని పూర్వులనాటి శాసనములలో నెచ్చటను దెలుపఁబడి యుండలేదు. కాకతీయ రాజవంశములోని రెండవ బేతరాజు (పదవశతాబ్దము తుదను పదునొకండవ శతాబ్దము ప్రారంభమున నున్నవాఁడు) మాత్రము తనతాత యగు మొదటి బేతరాజును దుర్జయకులాబ్ధి చంద్రుఁడని వ్రాయించిన విషయము నిదివఱకె తెలిసికొని యున్నాము. కరికాలచోడుని వంశములోని వాఁడని తెలిపి యుండలేదు. కాకతీయ రాజులలో మొట్టమొదట దుర్జయుని స్మరించిన వాఁ డితఁడే. కరికాలుఁడు తన పూర్వుఁడే యైనయెడల యేల స్మరింప కుండును? గణపతిదేవ చక్రవర్తికిఁ బూర్వమున నున్నవారెవ్వరును కరికాలుని స్మరించకుండుటకుఁ గారణమేమి? ఈ రెండవ బేతరాజు కాలమునఁగాని, రెండవ ప్రోలరాజు కాలమునఁగాని, వీని కుమారులగు మొదటి ప్రతాపరుద్రదేవరాజు కాలమునగాని, మహాదేవరాజు కాలమునఁగాని, లిఖింపఁబడిన శాసనములలో వేనియందును కరికాలచోళుని ప్రశంస గానరాదు. ఇంక గణపతిదేవ చక్రవర్తికాలమునఁ బుట్టినట్టి శాసనములలో, గొన్నిటఁ గాకతీయ వంశమునకు మూలపురుషుఁడుగా కరికాలచోళుఁడు ప్రశంసింపఁబడి యున్నాఁడనుట వాస్తవమని

యొప్పుకోఁదగినదే. గణపతిదేవ చక్రవర్తి సేనానులలో నొక్కఁడగు నిమ్మడిదేవరడ్డీంద్రుని పాఖాల శాసనములో నీ వంశమిట్లు వర్ణింపఁ బడినది.

"ఇది పరరాజు లనుమదపుటేనుగులకు సింహమువంటి వాఁడయిన గణపతి భూపతియొక్క శాసనము. శ్రీమన్మహావిష్ణువు లక్ష్మీదేవితోఁగూడి పాలసముద్రముపై యోగనిద్రను బొందుచుండెను. అతని నేత్రమునుండి యంధకారము నంతటిని బోఁగొట్టు పద్మమిత్రుఁ డుదయించెను. అతనినుండి యుల్లంఘనీయము కాని చాతుర్వర్ణ్య వ్యవస్థను సృజించినవాఁడును, క్ష్మాపతులలో మొదటివాఁడు నగు మనువు జనించెను. వానివంశమున నిక్ష్వాకుఁడు పుట్టి యీ భూమి నేకచ్ఛత్రముగా నేలెను. వానితరువాత మాంధాత పుట్టెను. వీనికి భూమి తనంతటతానే పాల నొసంగెను. అటుపిమ్మట జనించిన సగరుఁడాది వరాహమునవలె నితర రాజులనుండి భూమి సముద్ధరించెను. ఆపిమ్మట స్వర్గమునుండి భూమి మీఁదకు దిగుటకై గంగకు మెట్లను గట్టిన భగీరథుఁ డావిర్భవించెను. వీనివంశమున నింద్రునకు సహాయముఁజేయ శంబరాసురుని సంహరించిన దశరథుఁ డవతరించెను. అటుపిమ్మట పది శిరస్సులుగల రావణాసురుని సంహరించి రాక్షసుల నెల్లరను నామ మాత్రులనుగాఁజేసి సముద్రమునకు సేతువును నిర్మించిన రాముఁడీ వంశమున నుద్భవించెను. తరువాత భువనైక వీరుఁడని ప్రఖ్యాతివహించిన కరికాల చోళదేవుఁడు పుట్టెను. ఇతని పాదములకు నమస్కరించు భూమి పతులయొక్క రత్నస్థగిత కిరీట కాంతులవలన ద్విగుణముగా వీనిచరణములు ప్రకాశించినవి. ఈ వంశమున దుర్జయరాజు జనించెను. వీనిచరణములకు పదేపదే పరరాజులు నమస్కరించి జడత్వమును దాల్చిరి."[1]

(1) Hyd. Arch. Ser. No. 4.
కాకతీయసంచిక, అనుబంధము. పేజి 50.

పాఖాలశాసనము, ౧౬.

మఱియు గణపతిదేవుని సేనానులలో ముఖ్యుఁడును, దోచి కులమను పాలసముద్రమునకు చంద్రుని వంటివాఁడును, తామ్రపర్ణి నదిలోని మణులను ధరించువాఁడు, కాశ్యపగోత్రియుఁడును, నగు సామన్తభోజుఁడు కాంచీనగరములోని, ఏకామ్రనాథుని దేవాలయములో నొక దానశాసనమును వ్రాయించెను. అందిట్లుండెను.

"ఇయ్యది సమస్త భూపాలురు శిరసావహింపవలసిన గణపతి దేవుని శాశ్వతమగు శాసనము.

ఎవఁడు ఋగ్యజుస్సామాది వేదములకు పదవీ సీమయైన వాఁడో, ముప్పది మూఁడుకోట్ల దేవత లెవని యంశములో అట్టి భగవంతుని నేత్రమునుండి సమస్తాంధకారమును బోఁగొట్టునట్టి సూర్యుఁడుదయించెను. వానినుండి భూపతులలోఁ బ్రథముఁడగు మనువు పుట్టెను. వానివంశమున దశథుఁడు రాముఁడు మున్నగు రాజన్యులుదయించిరి. మఱికొంత కాలమునకు వెనుకదుర్జయులు పుట్టిరి. ఈ దుర్జయ క్షత్రియకులమున బేతరాజు పుట్టెను గరుడధ్వజము తురంగములతో నేగు నా నరపతినిగాంచి మనుష్యులు విష్ణువని తలంచిరి."1

ఇదేవిధముగ రుద్రమదేవి కాలమునందునుఁ బుట్టిన కొన్ని శాసనములలో అందు ముఖ్యముగా మల్కాపురము, కొల్లిపాక శాసనములలో విష్ణువు నాభికమలమునుండి యుద్భవించిన బ్రహ్మభుజముల నుండి క్షత్రియులు పుట్టిరనియు, అందు సూర్యవంశీయులును దుర్జయులునగు క్షత్రియు లావిర్భవింపఁగా వారినుండి కాకతీయ రాజులుదయించిరనియు లిఖింపఁబడియున్నమాటయు వాస్తవము. ఈ చెప్పుకొనుపద్ధతి గణపతిదేవ చక్రవర్తి కాలము నాటి నుండియుఁ

1 Ind. and. Vol XXI P. 200.
కాకతీయ సంచిక అనుబంధము పే. ౫౫.
ఏకామ్రనాథ శాసనము.

ప్రారంభమైయున్నట్లు గనంబడుచున్నది. గణపతిదేవ చక్రవర్తి సేనానియగు తిక్కచమూపతి గారవపాడు తామ్రశాసనములో వర్ణింపఁబడిన పైవిధమగు వంశవర్ణనము నా కాలమునఁ బ్రజలలో వ్యాప్తిఁజెందియున్న వదంతులనుబట్టి యేర్పడియుండుననని మన మూహింప వచ్చును. ఇట్లా కాలమునందలి శాసనములన్నిటిని బరిశీలించితిమేనిఁ గొన్నిట చతుర్థాన్వయులనియును, మఱిగొన్నిట సూర్యాన్వయులనియు నుండుటచేత చరిత్ర పరిశోధకులు సత్యము నారయవలయునని ప్రయత్నించుట వారికి ధర్మము. అట్టి పరిశోధనము చేయుట నిజముగా క్షత్రియులుగా నుండినవారిని శూద్రులనుగాఁ జేయవలయునన్న తలంపుతో వారట్లు చేయుచున్నారని చెప్పి నిందించుట నిజముగా క్షత్రియధర్మమునునిరూపించునట్టిదికాదు. చరిత్ర పరిశోధకులాకాలమునాటి సాంఘిక పరిస్థితులు తెలిసికొని వానిం దెలుపుట వారికి పరమధర్మము కాని యీ కాలమునాటి పరిస్థితుల కనుకూలముగా వ్యాఖ్యలువ్రాయుట క్రమపద్ధతి కాదని యెల్లవారంగీకరించిన విషయమేగదా ?

## రాచవారిలో కాకతీయులు.

ఉత్తర హిందూదేశము నందలి రాజపుత్రస్థానములో రాజపుత్ర సంఘమువలెనె యాంధ్రదేశములో "రాచవా"రను నొక సంఘముకలదు. వీరినే "ఆంధ్రక్షత్రియసంఘ''మని లోకులు వ్యవహరించుటయెగాక వీరును తమ్మునట్లుగానే భావించుకొనుచున్నారు. క్షత్రియులను సంస్కృత పదమునకు సరియైన తెలుఁగుపదము రాచవారను పదమె వ్యవహరింపఁబడుచుండుట సర్వజన విదితమైన విషయము. మఱి యేనామముచేతను వీరు వ్యవహరింపఁ బడుచుండలేదు. ఆంధ్రదేశములో ఖ్యాతివంతములయిన మఱికొన్ని

సంఘములున్నవి గాని వారెవ్వరును వీరివలె నాంధ్రక్షత్రియ సంఘమని చెప్పుకొనరు సరిగదా తమ తమ కులనామములతోనే వ్యవహరించుచున్నారు. ఆంధ్ర ప్రపంచముకూడ వారి నట్లే వ్యవహరించుచున్నది. ఆంధ్ర క్షత్రియ సంఘమనఁగా ముందుగా రాచవారిని జెప్పి తరువాత మఱియొకరిని చెప్పవలయును. రాచవారనగా రాజులనికూడ వ్యవహరింఁబడు చున్నారు. 1926 సంవత్సరము డిసెంబరు 18 తేదీని రాజమహేంద్రనగరమున జరిగిన ప్రథమాంధ్ర క్షత్రియ మహాసభ కధ్యక్షులయిన శ్రీ భూపతిరాజు వేంకటపతిరాజుగారిట్లు చెప్పినారు.

"రాజశబ్దమునకు ప్రజలను రంజిల్లఁజేయువాఁడని యర్థము. వారివంశజులే రాజులయిరి. అధికజాతులు, నిమ్నజాతులను దురభిమానము విడచి స్వగౌరవము నిలువఁబెట్టుఁగొనఁదలంచుచోఁ దమ ప్రవర్తనలవలన గౌరవనీయులని చెప్పఁబడవలయునేకాని యెట్టి వర్తనము గలిగియున్నను <u>జన్మముచేతనే గొప్పవారమని</u> మనము కాని మఱియొకరుగాని తలంపరాదు.

మంచి వంశమునందుఁ బుట్టిన గౌరవమును దలంచి జాతి యందుఁ బుట్టిన గౌరవమును మనము నిల్పుకొన్నచో అన్ని జాతుల వారును మనలను గౌరవింతురు."

వీరి వాక్యము లెంత సౌమ్యములుగ నున్నవి ? వీరి పూర్వులు బూర్వమునం దాంధ్రదేశమునందు ప్రభుత్వసంపద లనుభవించి ఖ్యాతిగాంచిన వారగుటచేతనే రాజులని రాచవారని వ్యవహరింపఁబడు చుండుటను గనుచున్నారము. ఇట్టిలోకుల మర్యాదను గాపాడుకొనఁదలంచినవారు సత్యమునుండి జనదాటరాదు. చారిత్రిక సత్యముల కడ్డుకొనరాదు. చరిత్రకు వెలితి కల్పింపరాదు. నిజమైన

చరిత్రముయొక్క ప్రయోజనము సర్వజనుల కావశ్యక మయినది. అజ్ఞానముతో చరిత్ర నెదుర్కొనరాదు. జ్ఞానముతో నెదుర్కొన వలయును. ఈ రాచ సంఘమువారెల్లరును తమలోఁదాము భోజన ప్రతిభోజనములు గలిగి సంబంధ బాంధవ్యములు గలిగి యున్నారు. వీరిలో నాలుగు ప్రధానశాఖలు గలవని చెప్పుకొనియెదరు.

"సీ॥ శ్రీ) మన్మహా పరిచ్ఛేది వర్ణాటక
కోటకాకతివంశ పాటవమున
నెగడు వశిష్ఠ కౌండిన్య ధనంజయ
కాశ్యప గోత్రముల్ గణన మీర."

*    *    *

పరిచ్ఛేది, వర్ణాట, కోట, కాకితయని, నాలుగు శాఖలు చెప్పఁబడుచున్నవి. పరిచ్ఛేదులు వశిష్ఠగోత్రులు, వర్ణాటులు కౌండిన్య గోత్రులు, కోటవారు ధనంజయ గోత్రులు, కాకతులు కాశ్యప గోత్రులు, ఆత్రేయ గోత్రులు, విశ్వామిత్ర గోత్రులు మొదలగు వారు మఱికొందఱున్నవారు. భారద్వాజ గోత్రుల నైదవశాఖగాఁ దలంతురుగాని వీరికి వారిప్పుడు గానరారు. వారు బ్రహ్మణ్యశాఖ లలోఁజేరి యుండుటచేత వీరికిప్పుడు గానరాకుండుటలో వింతపడవల సిన పనిలేదు. వీరిలో వర్ణాటులును, కోటవారును దుర్జయవంశీ యులుగాఁ జెప్పఁబడి యుండలేదుగాని పరిచ్ఛేదులును, కాకతు లును దుర్జయ వంశీయులని చెప్పఁబడిరి. ఈ నాలుగు క్షత్రియ శాఖలవారి మూలపురుషులు కానిండు లేక ప్రధాన పురుషులు కానిండు కాకతీయాంధ్రరాజ యుగమునందుఁ బ్రఖ్యాతిగన్న వీరా గ్రేసరులని నుడువుటలో నసత్యమేమియును లేదు. ఆ కాలమునాటి వారికి జన్మకంటె క్షాత్రధర్మమును పాటించుటయె ప్రధానముగ నుండెను. ఆ కాలమునాటివారి పౌరుషము సత్యమును విడిచిపెట్టి

యుండలేదు. వారిగురువులుగాని, వారి పురోహితులుగాని, వారి మంత్రులుగాని, వారి యితరసేవకులుగాని, చతుర్థకులమని నొక్కి వక్కాణించి వ్రాసినను, సమభావమునే వహించియుండిరి గాని వారెవ్వరిని మండగీడులుగా భావించి యుండలేదు. ఈ రాచవారిలో సాగివారును గలరుకాని వారు విష్ణుగోత్రమునకు బదులుగా వశిష్ఠగోత్రమును జెప్పుకొనుచున్నారు. విష్ణుగోత్రము వారెల్లరును మొదట శైవులుగానే యుండిరి. ఇటీవలి వారెల్లరును వైష్ణవమును గైకొన్నవారుగా నున్నారు. పరిచ్ఛేదులును కాకతీయులును దుర్జయవంశీయులయ్యు నుభయశాఖలవారికిని సంబంధ బాంధవ్యములు గన్పట్టుచున్నవి. ఇట్టి యాచారము పూర్వామిక్ష్వాకులలోను గన్పట్టుచున్నది. అట్టి యాచారమునే వీరును నవలంబించిరి.

ఈ రాచవారిలో, మందపాటివారు, ఉప్పలపాటివారు, సయ్యపరాజువారు, నంబూరివారు, గుండ్రాజువారు, పాతపాటివారు, ఈదరపల్లివారు, కతారివారు, బెల్లంకొండవారు, కనుమూరివారు, లకంరాజువారు, మున్నగు కాశ్యపగోత్రక్షత్రియులు కాకతీయాన్వయులే యనియు, కాకతీయరాజ్యావసానమున నాయా గ్రామములందు నివసించి యుండుటచే నాయాగృహనామము లేర్పడినట్టు గన్పట్టగలదు. వీరిలో మందపాటివారికి, అనగా మందపాటి నారాయణరాజు గారికి కూచిమంచి తిమ్మ కవి సార్వభౌముని తమ్ముడు జగ్గకవి సోమదేవరాజీయ"మను గ్రంథము నంకితము గావించెను. అందిట్లున్నది.

కం. శ్రీ కాకతి రుద్రాన్వయ
నాకాధిప మందపాటి నారాయణధా
త్రీకాంత హృదయకమల
ప్రాకారనివేశ సత్యభామాధీశా?

ఏకామ్రనాథుఁడు వ్రాసిన "ప్రతాపచరిత్ర"మను గద్య కావ్యము ననుసరించియు, కాసె సర్వప్ప సిద్ధేశ్వర చరిత్ర మనుపేరిట వ్రాసిన ద్విపద కావ్యము ననుసరించియు జగ్గకవి "సోమదేవ రాజీయ"మను పేరిట పద్యకావ్యముగ రచించి కొంచెము తక్కువగా రెండువందల సంవత్సరముల క్రిందట మందపాటి నారాయణరాజు గారికి సంకితము గావించెను. ఈ మందపాటి వారిలో చిరకాలము నుండి కాకతివర్మలని వ్రాసికొను నాచారము కలదట. ఇప్పటికిని వ్రాసికొనుచున్నారనియు, గుమ్మడితీగె కథ కూడ వీరిలో నున్నదని కీ॥ శే॥ వంగూరి సుబ్బారావుగారు వ్రాసియున్నారు. ఆంధ్రక్షత్రియులను గ్రంథమునందిట్లు వ్రాయఁబడి యున్నది.

## గుమ్మడితీగెకథ, వత్సవాయివారి కథ.

"మనవారు పూర్వముచెప్పు కథల సత్యములని కొట్టివేయుట స్థూలదృష్టిగల యీ ప్రకృతి శాస్త్రయుగములో నలవాటయినది. ఈ మందపాటివారొక కథ చెప్పుచున్నారు. "ఒకసారి ఒరంగలు కోటలో గణపతి దేవునకుఁ బూర్వము యుద్ధమువచ్చినది. అప్పుడు పురుషు లందఱు మరణించిరి. స్త్రీలు చిచ్చురికిరి. ఆసమయమున వంశ రక్షణకొక శిశువును పెద్దగుమ్మడికాయ బ్రద్దలుగొట్టి, గురుగుతీసి వేసి యందుంచి ప్రక్కనున్న వత్సవాయివారి పొలములో (రాజ్యములో) విడిచి నిశ్చింతగాఁ గోటలోని స్త్రీ పురుషులు మరణించిరి. ఆగుమ్మడికాయ నొకపంచముఁడుచూచి శిశువుండుట కాశ్చర్యపడి తన ప్రభువులగు నత్సవాయి వారి కీసంగతిచెప్పి సమర్పించెను. వత్సవాయి వారాశిశువును బెంచి కాకతీయ వంశమును నిల్పిరి." అని వ్రాసి అందుకు ఋజువుగా నీ క్రింది మూఁడు కారణములను దెలిపిరి.



భీమేశ్వరాలయము.

(By the Courtesy of A. H. R. Society. Rajahmundry.)



వేయిస్తంభాలగుడి.

(౧) ఇప్పటికిని కాకతివంశము వారమని చెప్పుకొను మంద పాటివారు గుమ్మడికాయ వరుగుగాని, వడియముకాని తినరు. కను గొనుఁడు.

(౨) మందపాటి వారియింటఁ బెండ్లికిముందు పైగుమ్మిడికాయ రక్షించిన పంచమునకుఁ గృతజ్ఞతగ నొకమాలవానికి మట్టెలు, మంగళసూత్రము చీరజామారులిచ్చి వాఁడిచ్చిన యక్షతలు తీసికొని కాని పెండ్లి చేసికొనరు.

(3) తమ కుటుంబ కూటస్థుని పెంచి పుత్రప్రేమతోఁ బెద్దవానిజేసిన వత్సవాయివారి పిల్లను మందపాటివారు జ్ఞాతుల పిల్లవలె నెంచి పెండ్లియాడరు. వీరుపిల్ల నివ్వరు."

ఈ కథనుగూర్చి నేను 8_19_1919 తేదిగల యాంధ్రపత్రికలో నీ క్రిందిరీతిని ప్రత్యుత్తరము చెప్పియుంటినిగాని వానినే నీ దిగువ నుదాహరించుచున్నాను.

ఓరుగంటి కోటకెట్టి యుపద్రవము రెండవ ప్రతాప రుద్రుని మరణానంతరము సంభవించినను సంభవించి యుండునుగాని గణపతి దేవునకు బూర్వమిట్టి యుపద్రవము సంభవింప లేదని చరిత్రమునఁ బట్టి తెలియఁగలదు. ఇంతియగాక గణపతిదేవునకుఁ బూర్వము "వత్సవాయి'' అను నింటిపేరుగల రాజకుటుంబము లేదని స్పష్టముగఁ జెప్పవచ్చును. ఏలయన వత్సవాయవారి మూలపురు షుఁడు నాగిపోతరాజయినట్టు వత్సవాయి గోపరాజున కంకితమీయ బడిన "రామవిలాస'' మను గ్రంథములో ఏనుఁగు లక్ష్మణకవి "ఏ తాదృశ మహాపురుష భూషితంబైన సూర్యాన్వయంబు సాగివంశం బనం గనుంబుగఁ బ్రసిద్ధంబయ్యెడి అందుసంభవించి,

గీ సహ్యజాతీరమునకు భూషణమనంగ
సిరుల కిరవగు గుడిమెట్టపురము తనకు
రాజధానిగ సత్కళా భోజరాజు
చాగిపోతక్షమాభర్త జగతి నేలె?

అనిచెప్పి యున్నాఁడు. ఈసాగిపోతరాజు కాకతిగణపతిదేవ చక్రవర్తికాలమున కృష్ణాతీరమున గుడిమెట్టలో రాజ్యముచేయుచుండెనని బెజవాడ మొదలగు ప్రదేశములలోఁగల సాగిపోతరాజు శాసనముల వలననే బోధపడఁ గలదు.

ఈసాగిపోతరాజునకు మాచరాజను సోదరుఁడు గలఁడు. ఈమాచరాజునకు నెఱిపోతరాజు జనించెను. ఆయనకు తెలుగురాజు, రామరాజు నను నిరువురు పుత్త్రు లుద్భవించిరి. ప్రతాపరుద్రుఁడు తురుష్కులతోఁ బోరాడి మరణించిన వెనుక తెలుఁగురాజు రేకపల్లి దుర్గమునను, రామరాజు వత్సవాయి దుర్గమున నుండి యా ప్రదేశములను పాలించిరి. వీరిలో రామరాజునుగూర్చి యిట్లువ్రాసెను.

సీ. ఆరామరాజేంద్రుఁ డాజిరంగంబున
వైరిరాజులగెల్చి వారిచేత
మదగజ కంఖాణ మాణిక్య గాణిక్య
కనకాంబరము లుపాయనములందె
యాచకశ్రేణుల కభిమతార్థములిచ్చె
ప్రజల సంరక్షించె భరతునట్లు
తగవత్సవాయాఖ్యనగరంబు నిజనివా
సముఁజేసినది కారణముగ సాగి
వంశమునకు వత్సవాయ నామము లోక
సుప్రసిద్ధమగుచు సొంపు గాంచె.''

తననివాసమును వత్సవాయనగరమునకు మార్చినందున సాగివారను గృహనామము వత్సవాయగా మారిన దని రామవిలాసమునందే చెప్పఁబడినది

ఇయ్యది రెండవ ప్రతాపరుద్రుఁడు తురుష్కులచేత జయింపఁబడిన వెనుక సాగిరామరాజు వంశీయులు వత్సవాయగ్రామమును విడిచి తూర్పునకు వచ్చినపుడు వీరికి వత్సవాయ వారని వ్యవహార నామము కలిగినది. కాని పైకథలో సూచించినట్లు గణపతిదేవునికిఁ బూర్వము వత్సవాయవారు లేరు. మందపాటివారును వత్సవాయవారును సంబంధబాంధవములు నెఱపకుండుటకు కారణము వంగూరు సుబ్బారావుగారు చెప్పినదిగాక జ్ఞాతిసంప్రదాయసిద్ధమైనదిగ నుండవలయును. అది కాదేని మఱియొక కారణమైన నైన యుండవలెను. కాని కాకతీయవంశమును నిల్పిన హేతువుచేత మాత్రము కాదని చెప్పవచ్చును. మందపాటివారింటఁ బెండ్లికి ముందు పైగుమ్మడికాయ రక్షించిన పంచమునకుఁ గృతజ్ఞతగ నొక మాలవానికి మట్టెలు, మంగళసూత్రము, చీర, జామారు లిచ్చి వాడిచ్చిన యక్షతలు తీసికొనిగాని పెండ్లిచేసికొనరట. పద్మనాయకులయినరావువారు తమ యింట వివాహము జరుగునపుడు ముందుగ నొక మాలవానికి వివాహముచేసిగాని, తమ యింట వివాహము జరుపరని గ్రంథస్థనిదర్శనములు గలవు. కొందఱు కోమటి కుటుంబములలోఁ బెండ్లికి ముందు మాదిగవానికి తాంబూలము నిచ్చిన పిమ్మటగాని వివాహమునుఁ జేసికొనరని గ్రంథస్థనిదర్శనములు గలవు.

ఇట్లే మఱికొన్ని తెగలవారును చేయుచుందురు. వీనికిఁ గారణాంతరము లెవ్వియో యుండునుగాని వీరు చెప్పునవి మాత్రము కావు. కాకతియను పరశక్తియొక్క దయచేత గుమ్మడితీగెకు నొక పుత్త్రుఁడు పుట్టెననియు, వానికులమె కాకతీయమనుసంజ్ఞచేఁ బరగుచుండెనని యనితల్లిశాసనమునఁ దెలుపఁబడినది. ఈకథ కేవలము కల్పనమని దీని మొగమె చాటుచున్నది. ఇట్టికథపుట్టి లోకములో వ్యాపించుటకు వేఱుకారణము లుండవలయును.

## మాతపురాణములోని గుమ్మడిపండుకథ.

ఈకథయె జానపదులు "మాతపురాణ" మను పేరితోఁ బాడుకొనుపాటలో మఱియొకరీతిని దెలుపఁబడు చున్నది. ఈపాట మంజరీ ద్విపదలో వ్రాయఁబడినది. చదువరుల వినోదార్థము ఒకించుక భాగము నీక్రిందఁ బ్రచురించుచున్నాను. ఈపాటను సమ్మవారి చరిత్రమును, పద్మనాయక చరిత్రమును వ్రాసిన బడబాగ్నిభట్టు అను నామాంతరము గల రామచంద్రుఁడను భట్రాజు వ్రాసినది. అవి యెంత యప్రామాణ్యములుగ నున్నవో యీ "మాతపురాణము" గూడ నంత యప్రామాణ్యమైనదిగఁ గన్పట్టుచున్నది. ఇతఁడు మూలసత్యమును దెలిసికొనలేక అంధపరంపరగాఁ బామరులచేఁ బ్రశంసింపఁబడు మోటుధోరణి నాగాథలను గ్రంథస్థము గావించినాఁడు. సహేతుకమైన విమర్శను నిలువఁజాలవు వీని గ్రంథములు. వీని గ్రంథములు ప్రామాణ్యములని యాంధ్రు లెవ్వరును దలంపరాదు. ఈయప్రామాణ్యములైన గాథలేమన దేశమునకుఁ బూర్వము వారని యపకీర్తిని, హానిని గలిగించినవి. ఇప్పుడును గలిగించుచున్నవి. ఇఁకముందును గలిగింపఁగలవు. ఇయ్యవి ప్రచురణార్హములయిన గ్రంథములుకావు గావున నింతగా నొక్కి చెప్పవలసి వచ్చుచున్నది. ఇట్టిగ్రంథములను చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండారమునుండి తొలగించుట దేశమునకు క్షేమదాయకమని వేఱుగఁజెప్పనక్కర లేదు.

ఈమాత పురాణమున నోరుగల్లు పట్టణము మొదట వర్ణింపఁబడిన పిమ్మట—

" ఎలమితో నాపురి నేలినఘనుఁడు
వెలయకాకితరాజు విక్రమోన్నతుఁడు

మనువునుబోలిన యట్టిమానవేశ్వరులు
తనయు లేవురులోన ధరనెన్నఁదగిన
వినుతికెక్కినయట్టి వీరభళ్ళాణు
విక్రమోన్నతుఁడైన విజయభల్లాణు
చక్రివర్తులకెల్ల సార్వభౌముండు
ఆదివిక్రమశాలియైన ఘనుండు
రాజేంద్రుఁడైనట్టి రాయభళ్ళాణు
ప్రతిలేని నవరత్న భళ్ళాణరాజు
గాటముగ క్రిమమెర్గు కనకభళ్ళాణు
బాగొప్ప తనయులు పరగుచుండగను
జగతియు క్షేమాన నేలుచుండంగ
భానుకులాధిపు పత్నిగర్భమును
పూనిన సంతోషహృదయమునందు
తనతండ్రి గండాన తానుజన్మించె
మానవుగర్భాన మలియశంబుగను
(హీనముపుట్టవాట ?) యిదియంత వేడ్క.
తుదిమాట గుమ్మడితోటలో కిపుడు
పదపడి గుమ్మడి పండులోనేను
పుట్టెదనని వేడెపురహరుని తలచి
నట్టుక నెన్మిది నెలలువెళ్ళగను
ఆవేళ బాలకుడు హరునిమాయలను
భూపసూనుడు తన పుట్నిల్లువెడలి
పదపడి గుమ్మడి పండులో దాగె
నవమాసములు వెళ్ళి నరరుద్రుడాయె
అవిసిన యాపండు నారాజుచూచి

వనపాలకుల బిల్చి వారికిట్లనియె
అన్నలో పండిది అవిసిన యెడల
తొడిమపుచ్చినపండు తోటలోతగదు
అనుచు కాకితరాజు ఆనతివ్వగను
పనిబూని యాక్షణం పారతెంచియును
పురమున వైచిన భూవరుల్ చూచి
మతిగల విప్రుల మంత్రుల జూచి
సతులుపుణ్య స్త్రీలు బూనలుల్ చూచి
మతిగల జనులును మహిమవిడిగను
భక్తితోనొక పేదపడతి గొంపోయి
కరపాలమున పండు కరకరందఱిగె
నరరుద్రునందున్న నాతి గన్గొనెను,
నురునడి కూతలు హృదయంబునందు
కరవాలము విడచి గడగడ వణికె
ఇదియేమి చోద్యమం చేర్పడఁజూచి
కదలక చక్కలుకడకు బోవిడచి
పరువడి బాలుణ్ణిపట్టి హస్తమున
ఉతుకుపై గలిగియు ఉగ్గుపాల్పోసి
పట్టుపొత్తులుపొదగి పర్పుపైనుంచి
గట్టిగ మనుజుని క్రిమమొప్పబెంచి
చూడచోద్యంబగు సుందరుం డనుచు
నేడేండ్లునర్థమై యెదిగె బాలుండు
తనగండమున నిట్లు తనయుండుపుట్టె
మనుజేశయిది నాకుమాయ పుండొకటి
మేపెక్కినిలచిన వీర్యంబుగాను

బాపురే యిదియెంత బాధయొతనకు
అనుచు కాకితరాజు ఆది చింతించి
మనుజేంద్రు డగు బుద్ధిమంతునిబిలిచి
నీతిమంతుల బిల్చి నిర్ణయంబుగను
తనయు లేవురలోన తగినవారెవరొ
పనిబూని యీపురి పట్టంబు గట్టు
మిలయెల్లపాలింపు మెల్లకాలంబు
పలుతెరంగుల ధర్మపద్ధతితోడ
వాలాయముగ నిది వన్నె సంపదలు
బాలలు పణతులు బంధువర్గములు
స్థలములు జలములు ధరణి మీసొమ్ము
అని వప్పగించుచు నాందోళపడెను
కన్నులు ప్రాణముల్ గ్రక్కున విడిచె
అందరు దుఃఖించి హరుని తలంచి
ద్వాదశదినముల తగినహోమమున
చందనతరువులు చాల తెప్పించి
రయమున బేర్పించి రాజేంద్రుడపుడు
సరవితోడుత నగ్నిసంస్కారంబిచ్చి
మతిలోన తలపోసి మంత్రులిద్దరును
ప్రతిభతో నెవరికి పట్టంబుగట్టి
మరియొక ప్రతిభుఁడౌ మంత్రినితోడ
నీతిమంత్రిబలికె నిర్ణయంబుగను
ఎందైన మనరాజు లేవురిలోన
భ్రాంతితో నొకరినీపట్టరాదనుచు
తలవర్గ పిలిపించి ధరణీశుపురము

వెలయ సాటించిరి వేయివీధులను
కస్తూరి కల్పించి కలియ జల్లించి
వేలకు దీరిన వన్నెపుట్టములు
బురుజులపై పసిడికుండ లెత్తించి
తోరణ స్తంభాలు తోరణంబులును
మురుపున ముత్యాల ముగ్గులు తీర్చి
అయిదు వీధుల గద్దె నాయత్తపరచి
వైపున రాజులువాడ వాడలును
కూర్చుండ విధియించె కవల యేశ్వరుడు
తీర్చి సింహాసనం తేజంబు మిగుల
పట్ట పేనుగుఁదెచ్చి పార్థనజేసి
దివ్యభారంబులు దివ్యవస్త్రములు
దివ్య భూషణంబులు తెరగొప్పనొసగి
యేనుగుమీదను నెస కిరీటంబు
పండ్లుఫలంబులు పలుదెరంగులును
తొండానగట్టించి తాంబూలమొసగి
దండప్రణామంబు తగజేసెమంత్రి
అఖిలాండ కోటిబ్రహ్మాండ నాయకుడ
సకలలోకేశ్వర సర్వేశ్వరుండ
యే తెరగున రాజులేగురిలోన
కరిరాజు పాదసంఘట్టనమునను
రవధూళు లెగయంగ రాచబలములును
కవగూడి కదలిరి కరిరాజు కడకు
గంటలు మోగ్రియంగ కడురమ్యముగను
మింట దిక్కులునిండి మెరవడిగాను

ధరణీపిక్కాటిల్ల దళముకదలగ
భేరీలు మ్రోయంగ పురమెల్ల నేగె
ఆరాజసుతులను నంతగైకొనక
చెలువైన వాసులు శీఘ్రింబె వెడలి
వెలిపాలెములయందు వీథులలోన
ప్రజలు మూకలుగూడి పదిలంబుగాను
బోడికె లందరు బొంగరాలాడ
వేడుకకనుగొని వివరించి కదిలె
కూడవడిగబోయి కుడిలోను తిరిగి
పేరుగల్గినమంచి ప్రీతిభారంబు
ధరణీశ్వరునికంత ధరియించిరపుడు
ఉరువడి కిరీటంబు ఉత్త్రజంఝంబు
అరుదైన మాణిక్యాల్ అన్నిధరించి
సామజచంద్రుని చక్కహస్తమున
నీమంబుతో నెత్తినిలచి కంఠమున
ప్రాణపదంబుగ పట్నంబుజేర్చె
మేలైన నాపురిమేల్వాడినేగె
శంఖ చంక్రములను మేలైనగద్దె
కందువ కనుగొని కరినాథుడంత

*　　　*　　　*

*　　　*　　　*

మదగజేంద్రుని తిట్టి మంత్రులదూరి
తనశక్తి బాల్యుణ్ణి దండింతు మనుచు
ఈచ్చేటి యా మేటివారలఁజూచి

హెచ్చరిక పలికె నారాజ సుతుఁడు
మతిగల జనుల మంత్రులను బిలచి
ఘనమేటి పెద్దల ఘనవిప్రవరుల
అవనీశు డాక్షణం డాయంగ బిలచి
ధరనేలు రాజునకు తనయుండ నేను
నీ మంబుతో మీకు నిజము చెప్పెదను
భక్తవత్సలుపూజ పరగంగఁ జెసి
శక్తితో జగమెల్ల జన్మించినాడ
తనతండ్రి గండాన తరుణి గర్భమున
నిండార జన్మించి నిమిషమునవచ్చి
వెడలి యేక్రమముఁగా వేషముతోను
పుడమి గుమ్మడిపంట పుట్టినవాడ
నాకెను, కల్గిన నరరుద్రవరుడ
వెడమి వెలసిన వీరశైవుడను ''

ఈ పైమాతపురాణమును బట్టి గుమ్మడిపండులోఁ బుట్టినవాఁడు మొదటి ప్రతాపరుద్రుఁ డని యతఁడే కాకతిరాజు పుత్త్రుఁ డని విస్పష్టముగాఁ దెలుపుచుండెనుగదా. చరిత్రమునుబట్టి యీ మొదటి రుద్రుఁడు రెండవ ప్రోలరాజు కుమారుఁడని మనకుఁ దెలిసి యున్నది. మనకుఁ దెలిసినంతవఱకు వీనికిఁ బూర్వము నూఱుసంవత్సరములనుండి మొదటి బేతరాజు, రెండవ ప్రోలరాజు, రెండవ బేతరాజు రెండవ ప్రోలరాజునను కాకతిరాజులు నల్వురు పరిపాలనము చేసిరనివారి శాసనములనుబట్టి మనము తెలిసికొనియున్నాము. పూర్వకాలమున రాజవంశములలో సంతానములేక యావంశములు విచ్ఛిన్నములు కానైయున్నప్పుడు మంత్రులు, పురోహితులు మొదలగువారేవో తంత్రములు పన్ని యన్యులబిడ్డలను దెచ్చి యపూర్వ

గాథలను గల్పించి మూఢప్రపంచమును నమ్మించి వశ్యముగావించు కొనుట యన్నిదేశములందును గలదు. అట్లే యీకథకూడఁ బుట్టి యుండును. పైగూడూరుశాసనములోఁ జెప్పఁబడినకథ ననుసరించి యీగుమ్మడిపండు లేక తీగెకథవ్యాపించి యుండెనేమో భావిపరి శోధనమున తేలవలసి యున్నది. మనపురాణములలోఁ బలుతావు లను కూష్మాండక్షత్రియు లుదహరింపఁబడుచు వచ్చినారు. ఆకూష్మాం డక్షత్రియు లెల్లరును గుమ్మడుపండులలో బుట్టినవారనియే తలంప వలసి వచ్చునుగదా! ఈ"మాతపురాణ"మను పై పాటలో నత్సవా యవారి ప్రశంసయెగానరాదు.

గుమ్మడిపండునకుఁగాని గుమ్మడితీగెకుగాని మనుష్యుఁడు పుట్టి నాఁడని చెప్పెడికథల నిప్పటివారు విశ్వసింపరనికాఁబోలు కాకతీయ సంచికాసంపాదకు లాకథనీక్రింది విధముగా మార్చి చెప్పిరి.

"కాకతియన గుమ్మడితీగెయనియు, నొకరాజాంతఃపురమును శత్రువులు నాశన మొనర్చు సమయమునం దొకబాలుఁడు దైవవశ మున గృహమునుండి వెలువడి యొకగుమ్మడితీగెలోఁ జిక్కుకొని శత్రువుల బారినుండి తప్పెననియు, నాతఁడు ప్రాయమునంది సంస్థా నాధీశ్వరుఁ డయ్యెననియు, నాతని సంతతివారెల్లరును దమవంశము ను రక్షించిన గుమ్మడితీగెను గౌరవించుటకై కాకతీయులమని చెప్పు కొనుచుండెడివారనియు ననితల్లి కలువచేఱుశాసనములవలనఁ దెలి యుచున్నది."

ఇట్టి వ్యాఖ్యానము కలువచేఱు శాసనమునందు గానరాదు. కాకతియను పరశక్తి యొక్కకృపచేత నొక గుమ్మడితీగె యొక పుత్త్రుని గనెను. వాని వంశమున కందువలన కాకతీయవంశమను పేరు వచ్చెనని మాత్రము చెప్పఁబడినది.

ఈపైకల్పనముచేసిన కాకతీయ సంచికాసంపాదకుఁడే వాని క్రిందనే యీక్రింది విధముగా వ్రాసియుండెను.

"కాకతీయరాజులలో పూర్వులు జైనులుగ నుండినటులఁ దెలియుచున్నది. వారిరాజధానులగు హనుమకొండ వారంగల్లు ప్రాంతములలో నేటికిని జైనశిల్పములును కట్టడములును ననేకములు గలవు. రాజులవలె నయ్యవి గూడ గాలక్రమమున శైవమును బరిగ్రహించినవి. జైనశిల్పశాస్త్రమును సావధానముగఁ బరిశీలించినచో గాకతీయుల గూర్చి విశేషాంశములు గొన్ని వెలువడఁగలవు. హేమచంద్రుఁడను నాతఁడు "అభిధానచింతామణి" "త్రిషష్ఠిశలాకాపురుషచరిత్రము" అను గ్రంథములలో జైనతీర్థంకరుల యొక్కయు, వారికౌపచారికలుగ నుండు యక్షయక్షిణుల యొక్కయు లక్షణములను బేర్కొనియున్నాఁడు. నేమి యనునతఁ డిరువది రెండవ తీర్థంకరుఁడు. అతనికి "కూష్మాండినీ" యను యక్షిణిశాసనదేవి. శ్వేతాంబరజైనులీమెను "అంబికా" యని పిల్చెదరు. వారిశాస్త్రము ననుసరించి యీమెకు నాల్గు చేతులును, రెండు కుడిచేతులలో నొకదానిలో మామిడిపండ్ల గుత్తియు మఱియొక దానిలో పాశమును, ఎడమచేతులలో నొకదానియం దంకుశమును, మఱియొకదానియందొక శిశువు నుండవలెను. దిగంబర గ్రంథముల ననుసరించి యీమె తొడలపై నానుకొని వడిలో నిర్వురు శిశువు లుండవలయును. కూష్మాండమన గుమ్మడి యని యర్థము. కలువ చేఱుశాసనమందలి గుమ్మడి తీగెకును రాజశిశువునకు గల సంబంధమునకును, జైనవిగ్రహ శిల్పమునందలి కూష్మాండినీ నామక యక్షిణికిని యామె వడియందలి శిశువులకును సన్నిహితమగు సామ్యము గన్పడుచున్నది. కాకతియను మాటకుఁగూడ గుమ్మడితీగెయనియె యర్థము. శాసనములలో కాకతీయ శబ్దమునకుఁ గాకతి, కాకత్య,

కాకెత యను రూపాంతరములు గాంచనగు చున్నవిగాన "కాకతి" యను వంశనామము కేవలమును గుమ్మడితీగెనుండి యుద్భవించెనను టకంటెను, కూష్మాండినీ యను జైన శాసనదేవివలననే గలిగెననుట సమంజసముగ నుండును. అయినచోఁ గాకతీయులు మొదట జైనులుగ నుండిరని ధ్రువపడుచున్నది. దిగంబరులే కూష్మాండినీ నామము నుపయోగించి శ్వేతాంబరు లాదేవి నంబికయని బిలచుటచే గాకతీయులు మొదటి శాఖకే చెందియుండవలయును. రెండవ ప్రోల రాజు మొదటజైనుఁడుగ నుండినను పిమ్మట శైవమతము నవలంబించెను. ఆతని సంతతివారందఱును శివభక్తి పరాయణులై యుండిరి. కాన రాజమహేంద్రవర రెడ్డిరాజవంశోద్భవమై 15 వ శతాబ్దమున నుండిన యని తల్లికాలముననే గాకతీయుల జైనమతావలంబనా విషయము సంపూర్ణముగ విస్మృతమైయుండి కూష్మాండినీ ప్రశంస యడుగంటి యుండుటచేఁ గాకతియన గూష్మాండమను నర్థముమాత్రము పరిగ్రహింపఁబడి యొకగాథ ప్రచురణలో నుండును."

ఈపైదానినిబట్టి మనము గ్రహింపవలసినదేమి? ఈకూష్మాండగాథ పదునొకండవ పండ్రెండవ శతాబ్దులకు మున్నే బహుకాలమునుండి అనఁగా జైనమతము ప్రాబల్యముగానున్న కాలమున నేమి తీర్థంకరుని కాలమునుండి లోకములోఁ బ్రచారమునం దుండెనను విషయము ప్రస్ఫుటమగు చున్నది.

## ధర్మామృతములోని ఇక్ష్వాకుల కథ.

శక. ౧౦౪౭ న (క్రీ. శ. 1125) సంవత్సరములో నయసేనాచార్యుఁడను నొక కర్ణాటజైనకవి ధర్మామృతమను నొక గ్రంథమును రచియించెను. ఈగ్రంథమున ననేకాదశ్వాసమున నిక్ష్వా

కులకును నంధ్రదేశమునకును సంబంధించిన కథ కలదు. అందలి సారమిది. *

"వాసుపూజ్యతీర్థంకరుని కాలమున అంగదేశమున చంపాపురము రాజధానిగా నిక్ష్వాకువంశ పవిత్రుఁడగు యశోధరమహారాజు రాజ్యమేలుచుండెను. ఆతనికి అనంతవీర్యుఁడును, శ్రీధరుఁడు, ప్రియబలుఁడు నని ముఫ్వురు కొడుకు లుండిరి. యశోధరుఁడు దిగ్విజయయాత్రవెడలెను. దక్షిణదిక్కున మాళవ, మగధ, కర్ణాటగొల్ల (?) కరహాటగౌళ, లాట, చోళ, చేర, పాండ్య, కళింగదేశముల జయించి కప్పములఁగొని, వేంగీదేశమునకు వచ్చి, యాదేశపు సౌభాగ్యమునకు మెచ్చి, యశోధరుఁడు తానక్కడనే నెలకొన నుత్సహించెను. తన ప్రాభవమునకుఁ దగినంత గొప్పగా నాదేశమునందు ప్రతిపాలపురమని యొక రాజధానిని నిర్మించి యందు వసించెను. మహోన్నతముగా రాజ్యమేలెను. వార్ధకమున నాతఁడు రాజ్యభారమును పుత్త్రులపైఁ బెట్టి తానడవికేగి జినేంద్రసేవతోఁ గాలము గడపఁదలఁచెను. కొడుకుల బిలిచి యడిగెను. వారు తమకు రాజ్యము వలదనియు, జినేంద్రదీక్షగొని యరణ్యములందుఁ దప మాచరించుచుందుమనియుఁ దెలిపిరి. ఎట్టకేలకు మూఁడవ కుమారుఁ డగు ప్రియబలునకు రాజ్యమప్పగించి, యశోధరుఁడు పెద్దకొమాళ్ళిర్వురతో రాజ్యము వీడి, విశ్వసేనాచార్యునికడ జినదీక్షఁగొని, గురునిదేశము చొప్పున జటాశిఖరమను పర్వతము మీఁదికరిగి తపముసల్పెను.

* బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొట్టమొదట మైసూరు దొరతనమువారిచేఁ బ్రకటింపఁబడిన 'ధర్మామృత'మను కర్ణాటగ్రంథము నచ్చువేసి ప్రకటింపఁగా నందలి విషయములను శ్రీయుత నేలటూరి వెంకటరమణయ్యపంతులవారి వలనఁ దెలిసికొన్నవానిని దెలుపుచు 'ఇక్ష్వాకులు' అను నొక వ్యాసమును భారతీ పత్రిక ౫ వ సంపుటము మొదటి సంచికలో ౧౩౧-౧౩౫ పేజీలలోఁ బ్రకటించియున్నారు. ఆవ్యాసమునుండియే యీకథాసారము గ్రహింపఁబడినది.

యశోధరభట్టారకుఁడును, అనంతవీర్య మునిపుంగవుఁడును, నందు అష్టకర్మల నోనర్చి పరమ శ్రీమనః ప్రియులై నిర్వాణము నందిరి. అకలంకుఁడని పేరందిన శ్రీధరాచార్యుఁడు ఆగిరిపై నుగ్రతపస్సు చేయుచుండెను. ఒకనాఁడాతఁడు వనవిహారమునకుఁ బోయి యుండి పాముకాటుచే మృతినొందెను. ఆతనికిఁ బుత్త్రసంతతి లేదయ్యెను. ఇంద్రప్రభుఁ డను మంత్రి యారాజు మృతివార్త నెవ్వనికిఁ దెలియ నీక రాజు వనక్రీడచే బడలికఁ జెంది యంతఃపురమున నుండెనని వెల్లడించి గుప్తముగా నౌర్ధ్వదాహికకర్మల నొనర్చెను. తనకుమారుని రాజ్యరక్షకై నియోగించి యాయింద్రప్రభుఁడు పరిమితపరివారముతోఁ బయల్వెడలి, కొన్ని ప్రయాణము లమీఁదఁ బుషి నివాస పర్వతమును జేరెను; పరివారము నక్కడ ప్రత్యంతపర్వతమున విడియించెను; అక్కడ జినభవనములఁ బూజించెను. పర్వతమధిరోహించి శ్రీధరాచార్యుని దర్శించి, నమస్కరించి, యిట్లు విన్నవించెను. "మునీంద్రా! మీరీగిరిపై నెలకొని యుండుట నెఱిఁగి వేంగీదేశప్రజలు పలువురు మీచరణసేవ నభిలషించి యిక్కడకు వచ్చి పర్వతపాదమున విడిసి యున్నారు. వృద్ధులు పల్వురు పర్వత మధిరోహింపఁ జాలకున్నారు. మీరక్కడికి విజయంచేసి వారినాశీర్వదించి యుద్ధరింపుఁడు." ఈమాయపుమాటల నెఱుంగక శ్రీధరాచార్యు లందుల కంగీకరించి దిగివచ్చెను. వారెల్లరు నామునీంద్రునిఁ గపటముననే ప్రతిపాలపురమునకుఁ దోడ్కొనివచ్చి, యచ్చట ప్రియబలమరణ వార్త నెఱింగించి, సంతతి లేకపోవుటచే వంశచ్ఛేదమగుటఁ దెలిపి, సంతానము గలుగువఱకయినను సంసారమును రాజ్యమును, నంగీకరింపవలసినదిగా నిర్బంధించి వేడిరి. ఎట్టకేలకాతఁ డంగీకరించెను. కొన్నాళ్ళకాతని కొక కొడుకు గల్గెను. ఆబాలునికి శ్రీధరుఁడు తన తండ్రియగు యశోధరుని పేరు పెట్టెను. పట్టము గట్టెను. చెఱలోనుండి

విడిదలఁబొందినవాఁడువలె నాతఁ డంతట సంసారమున నుండి విముక్తుఁడై మరల ఋషినివాసపర్వతమునకుఁబోయి, జినదీక్షఁగొని, ద్వాదశవిధవ్రతముల నొనర్చి, నిర్వాణశ్రీసమేతుఁడై నెగడెను.

శ్రీధరాచార్యుఁడు తడవుకాలము వసించి తపస్సుచేసి సిద్ధి పొందుటచే ఋషినివాసపర్వతమునకు శ్రీపర్వతమని పేరయ్యెను. ఆపర్వతమునకు దక్షిణభాగమున నొక మఱ్ఱిక్రిందనుండి ముక్తిని గను గొనుటచే నాచోటికి సిద్ధవటమని పేరయ్యెను. శ్రీధరాచార్యునకు జ్ఞానపూజ చేయవలయునని చతుర్విధ దేవనికాయములు గూడిన స్థలమునకు అమరావతియని పేరయ్యెను. శ్రీధరమునితపస్సుచేయుచు నర్జునవృక్షముక్రింద నుండఁగా ఖేచరులు మల్లికాపుష్పములచేఁ బూజించిరి గావున యాస్థలమునకు మల్లికార్జునమని పేరయ్యెను. ఇంద్రప్రభుఁ డామునిని గపటముగ వేడికొనుచు వృద్ధులు వసించిరని తెలిపిన పట్టునకు వృద్ధగిరియని పేరయ్యెను. శ్రీధరాచార్యుని కుమారునిఁ జెలికాండ్రు ముండియసుతుఁడా యని (ముండితసుతుఁడు) కేరడములాడుటచే నానంశమునకు ముండియ వంశమనియుఁ దర్వాత పేరయ్యెను.

ఇట్టి యిక్ష్వాకువంశపు రాజుల పరంపరలో ధనదుఁడని యొక రాజు జనించెను. అతఁడు ప్రతిపాల పురము రాజధానిగా వేంగీదేశ మెల్ల నేలుచుండెను. ఆదేశముననే సంఘశ్రీయను నొకబౌద్ధుఁడుం డెను. ఆతని పుత్త్రి కమలశ్రీయను పేరుగలది మిక్కిలి సౌందర్యవతి. దనదుఁ డామెను బ్రేమించి వివాహమాఁడెను. కమలశ్రీ నెట్టకేల కాతఁడు జైనమతమునకుఁ ద్రిప్పుకొనెను. తన మామయగు సంఘ శ్రీనిగూడ నాతఁడు జైనమతమునకుఁ ద్రిప్పుకొన యత్నించెను. సంఘశ్రీ యంగీకరింపఁ డయ్యెను. ఒకనాఁడు జినదీక్షితులై సిద్ధిని బొందిన చారణఋషు లంతరిక్షమునఁ బోవుచుండఁగా ధనదుఁడు

వారిని సంఘశ్రీకిఁ జూపి జైనమతమున నమ్మిక పుట్టించెను. సంఘశ్రీ యానమ్మకమున జైనమతమునఁ జేరెను. ఒకనాఁడా సంఘశ్రీకి బౌద్ధమత గురువగు బుద్ధశ్రీ యరుదెంచి మరల నాతని బౌద్ధమతమునకుఁ ద్రిప్పెను. ధనదరాజు మరల నాతని జినమతమునకుఁ ద్రిప్పఁజూచెను గాని లాభము లేదయ్యెను. ధనదరాజొకనాఁడు నిండుసభలో మాము ని ట్లడిగెను. "నీవానాఁడు చారణఋషులంతరిక్షమునఁ బోవుచుండుటను జూచితివిగదా; మరల జైనమతము విడిచితి వేల ?" సంఘశ్రీ— "నేనుజూడ లేదు" అనెను. అసృతమాడిన యాసంఘశ్రీపై కోపించి యక్కడిపుర దేవతలు వచ్చి వానిరెండు కన్నులను బెఱికివేసిరి. ఇట్లు సంఘశ్రీ యవమానితుఁడై, దుఃఖితుఁడై, కొన్నాళ్ళకుఁ జనిపోయెను. ఆతఁడు నరక మందెను. వాని వంశము వా రేడుతరములదాఁక బుట్టుగ్రుడ్డువాండ్రయిరి. బహుకుటుంబము గల యాసంఘశ్రీ వంశమువా రేడుతరములదాఁక నట్లుగ్రుడ్డివారగుటచే నా దేశమున కంధక దేశమని పేరయ్యెను. ధనద మహారాజట్లు గొన్నాళ్ళు రాజ్యమేలి, తనపుత్త్రుఁడగు నింద్రగుప్తునికి బట్టముగట్టి తాను తపోవనమున కరిగెను."

ఈపైకథ వ్రాసిన గ్రంథకర్తయగు నయసేనాచార్యుఁడు పన్నెండవ శతాబ్ద ప్రారంభమున నున్నవాఁడైనను జైనుఁడగుట వలనఁ బూర్వపు జైనగాథల ననుసరించి వ్రాసియుండిన వాఁడగుటచేత నిందలి విషయములన్నియు సత్యములనికాని యసత్యములని కాని నిర్ధారించుటకు వానికాలనిర్ణయమును జేయుటకుఁ, బరమప్రమాణములుగా గైకొనుటకు సాధ్యపడునవి గాకపోయినను, మతసాంఘికపరిణామ తత్త్వచారిత్రికసత్యములను వెలికితీయుటకుఁ గొంత వఱకైన తోడ్పడకమానవు.

## ప్రతిపాలపురము — ధనదుపురము.

ఇందలి యైక్ష్వాకుఁడయిన యశోధరుఁడు పరిపాలించిన ప్రతిపాలపురము భట్టిప్రోలు కావచ్చునని ప్రభాకరశాస్త్రిగా రూహించినది సమంజసముగానే గన్పట్టుచున్నది. భట్టిప్రోలునకు సామీప్యమున నున్న చందవ్రోలు పూర్వమున ధనదుపురముగా నున్నట్లు వెలనాటిచోడుల పంద్రెండవ, పదుమూఁడవ శతాబ్దులనాటి శాసనముల వలనను, ఆకాలమునందే విరచింపఁబడిన మంచెనకవి ప్రణీతమగు కేయూరబాహుచరిత్రము వలనను బోధపడగలదు.*

కృష్ణామండలములోని దివిసీమయను పేర నేఁడు పేర్కొనఁబడుచున్న కృష్ణాసముద్రమధ్య ద్వీపము (తలగడ దీవి లేక లంక) "ద్వీపం పురైతద్ధన దేనసృష్టమ్" అని పూర్వము ధనదునిచే నిర్మింపఁబడిన

---

* "పుష్పకనివహంబు భూమిపైనిలిచిన
యట్లందమైన దేవాలయములు
రూప్యాచలము బహురూపంబుల నటించు
రమణశోభిల్లు సౌధములవెల్లు
అలకాధిపతినిధులన్నియు వెలివీట
విడిసినకరణిఁ బణ్యవీధికలును
ధాతమేదిని మిన్ను దటిఁగివైచినమాడ్కి
గనుపట్టు బహుతటాకములసొంపు
గీ. నుపవనంబులు సరసులు నొప్పచేయు
చెఱకుఁ దోటలుఁ బ్రాసంగు చేలుమెఱయ
నఖిలవిభవంబులకు నెలవగుచు వెలయు
ధనదుపురమున కెనయన ధనదుపురము."
(కేయూరబాహుచరిత్రము.)

టుల కాకతిగణపతిదేవ చక్రవర్తినాటి జాయపనాయకుని గణపేశ్వరశాసనమునఁ బేర్కొనఁబడిన ధనదుఁ డితఁడే కావచ్చును1 ఈధనదపురము రాజధానిగా వెలనాటి చోడులు పరిపాలించుటకు ప్రారంభించిన మొదటి ప్రదేశము సట్సహస్రదేశమని సంస్కృతభాషలో వ్యవహరింపఁబడిన యాఱువేలనాఁడనునది. వెలనాటి చోడుల వంశకర్తయైన మల్లవర్మ త్రినయన పల్లవుని సాహాయ్యముతో నీయాఱ్వెలనాటిని నాక్రమించెనని వారిశాసనములలోఁ బెక్కుటఁబేర్కొనఁబడినది.2 క్రీ. శ. 490 ప్రాంతమున కాంచీపురము రాజధానిగా దక్షిణదేశమును బరిపాలించుచున్న త్రినయనపల్లవుని కాలమున ధనదపురమున్నదనియుఁ దేటపడుచున్నది. పురాణములు కుబేరుని యుత్తరదిక్కున కధిపతియని ఘోషించుచున్నవి. అమరసింహుఁడు తన అమరకోశమునందు కుబేరుఁడు— త్ర్యంబకసఖుఁడు —యక్షరాట్టు— గుహ్యకేశ్వరుఁడు— మనుష్యధర్మఁడు— ధనదుఁడు— రాజరాజు— ధనాధిపుఁడు— కిన్నరేశుఁడు— వైశ్రవణుఁడు— పౌలస్త్యుఁడు— నరవాహనుఁడు— యక్షుఁడు— ఏకపిఙ్గుఁడు— ఐలబిలుఁడు— శ్రీదుఁడు-

(1) Epigraphia Indica Vol.III p. 82 H.No. 15 Ganapeswaram Inscription of the time of Ganapatideva.

ఆంధ్రులచరిత్రము భా. 3. పే. ౨౫౧

(2) శ్రీవల్లభస్యాంఘ్రిసరోజతో వా నిరంత్తరో దివ్యనదీ ప్రవాహః జాతాచ శుద్ధచ్చరణాబ్జ [తో వా] చతుర్థవంశశ్చతురాననస్య [౧] వంశేస్మిన్ సహిమాంశు నిమ్మకాల యశవ్యాప్తక్ష్మామండల శ్రీమాన్ వీరరసాశ్ర [యో] గుణనిధిః శ్రీమల్ల భూపోజని యేనత్ర్యం [బక] పల్లవాద్రిణ శిరస్సాహాయ్యకారాచిరాత్ ప్రాప్తోయం వెలనాణ్డు నామవిషయస్సామంత చిహ్నైస్సహం॥

S. I. I. Vol. IV No. 1182. Page. 405.
E. R. I 1993. Page. No. 2 Stone and No. 490 of 1893,

పుణ్యజనేశ్వరుఁడునను ౧౭ నామములును కుబేరునకు నామములుగా నిచ్చియున్నాఁడు.1 "కుబేరుని యుద్యానముపేరు చైత్రరథము, అతని కుమారునిపేరు నలకూబరుఁడు, అతని యునికిపట్టుపేరు కైలాసము, అతని పట్టణముపేరు అలక, అతని విమానముపేరు పుష్పకము." అనికూడఁ దెలిపియున్నాఁడు. 2 ఆంధ్రదేశమునందు నధునాతన కాలముల వ్రాయఁబడిన కొన్ని సంస్కృత గ్రంథములలో కోమటి శబ్దమునకుఁ బర్యాయపదముగా వైశ్యశబ్దము మాత్రమేగాక యక్ష శబ్దముగూడ వ్యవహరింపఁ బడినది. అనఁగా కోమట్లను యక్షగణము లలోనివారుగా గ్రహించినట్లు గన్పట్టుచున్నది. పదునెనిమిదవ శతా బ్దమునందు కళింగవిజయనగరాధీశ్వరుండగు ఆనందగజపతికాలమున రచియింపఁబడిన మార్కండేయోత్తర పురాణమునం దట్లే లిఖింపఁ బడియున్నది. తిక్కనసోమయాజి తన యాంధ్రభారతమున సంస్కృ తభారతమున వైశ్యశబ్దము ప్రయోగింపఁబడిన స్థానములలోఁ గొన్నిట కోమటిశబ్దమును వాడుచు వచ్చినాఁడు. తిక్కనసోమయా జికి నూఱేండ్లకుఁ బూర్వము నుండియుఁ గోమట్లు తమశాసనములలో వైశ్యశబ్దమును వాడుకొనియున్నారు. కాకతీయాంధ్ర రాజులపరి పాలనమున మాత్రమేగాక తరువాతనుగూడ, అందుముఖ్యముగా క్రీ. శ. 1125 మొదలుకొని 1425 వఱకు నడుమ ధనదుపురము, ధర్మపురి, శివపురి, పాంచాలపురము, జగన్నాధపురి, ఘంటశాల,

(1) కుబేరస్త్ర్యమ్బకసఖో యక్షరాడ్గుహ్యకేశ్వరః
మనుష్యధర్మాధనదో రాజరాజోధనాధిపః॥
కిన్నరేశో వైశ్రవణః పౌలస్త్యో నరవాహనః
యక్షైకపిఙ్గైలబిల శ్రీదపుణ్యజనేశ్వరాః॥

(2) (అస్యోద్యానం) చైత్రరథం (పుత్రస్తు) నలకూబరః
కైలాసః (స్థాన) మలకా (పూర్విమానంతు) పుష్పకమ్॥

(అమరకోశము)

ముమ్మడి, పాలకొలను, పెనుగొండ, కళింగపురి, వీరనారాయణము, భీమపురి, నగరము, నరసింహపురము, దెందులూరు, ఏలూరు మొదలుగాగల స్థలములలో నివసించు కోమటిసెట్లలోఁ బ్రముఖులయినవారు వ్రాయించిన శాసనములలోఁ గొన్నిట తమది కుబేర వంశమని వ్రాయించినదియు, మఱికొన్నిటఁ దాము వైశ్యులమనియు, అర్యులమనియు వ్రాయించినది మనము చూడఁగలుగు చున్నాము. కాని యీశాసనములలో నేనియందును ఋషిగోత్రములు గానరావు* వీరికి పరమప్రమాణగ్రంథమగు కన్యకాపురాణ మనఁబడెడి వైశ్యపురాణమునందు కోమట్లీ ప్రాంతముల వారుకారనియు, మణిపురాధీశ్వరుఁడయిన చిత్రకంఠుఁడను గంధర్వరాజుచేత శప్తులై మహావణిక్ప్రభువగు కుబేరుని దేశమునుండి వచ్చినవారని వ్రాయఁబడి యుండెను. ఈచెప్పినదియే నిజమై యున్నయెడల కోమట్లు హిమవత్పర్వతములోని కైలాసపర్వతమునకు నుత్తరభాగమున నున్న త్రివిష్టపదేశమునుండి వచ్చినవారని మనము తలంప వలసి వచ్చును. ఇయ్యది విమర్శింపఁ దగిన విషయము.

### కోమట్లకు కుబేరనలకూబర సంబంధము.

గుంటూరు మండలములో ప్రత్తిపా డను గ్రామమున దండేశ్వరస్వామిదేవాలయము గలదు. కుబేరవంశీయుఁడును, మూల్య

---

*ఈశాసనము లన్నియు శాసనపరిశోధన కార్యస్థానాధికారులు దొరతనమువారికి నివేదించిన తమనివేదికల యందు నుదాహరించి యున్నారు. ఈకోమట్లను గూర్చియు, వారికన్యకాపురాణమును గూర్చియు, వాసవీకన్యను గూర్చియు నేనొక వ్యాసమును 1923 వ సంవత్సరమున రాజమహేంద్రపురములోని ఆంధ్రేతిహాసపరిశోధకమండలివారిచేఁ బ్రకటింపఁబడిన "రాజరాజనరేంద్రపట్టాభిషేక" సంచిక యందు వ్రాసి యున్నాను. దానినిగూడఁ జూడఁదగును. See also- the Historical Basis for Kanyaka purana, South Indian Research, 1919.

గోత్రీయుఁడును, పెనుగొండ పురవరాధీశ్వరుఁడును నగు నారాయణ సెట్టి గండేశ్వరస్వామివారి దీపారాధనమునకు దానముచేసి శాసనము వ్రాయించెను. ఈశాసనము సంస్కృతాంధ్రభాషలలో వ్రాయఁబడినది. ఇయ్యది శా. శ. ౧౦౭౯ సంవత్సరమునకు సరియైన క్రీ.శ. 1157 వ సంవత్సరము. అనంతపుర మండలములోని మడకశిరా తాలూకాలో హేమావతి యను గ్రామమున శా.శ. ౧౦౮౪ అనగా క్రీ. శ. 1162 వ సంవత్సరమున కుబేరవంశ్యులై నాలుగు భాషలు మాట్లాడుచున్న దేశిసెట్ల (కోమట్లు) చే కొన్నవస్తువులపై వేయఁబడిన సుంకములను దానముచేసినట్లుగ శాసనము వ్రాయఁబడియున్నది. దూరస్థలములయందు నేకకాలమున లిఖింపఁబడిన రెండు శాసనములను మాత్రమె చదువరుల యుపయోగార్థ మిట నుదాహరించితిని. ఇందలి రెండవ శాసనము కన్నడభాషలో నున్నది.

శా. శ. ౧౦౭౦ (క్రీ. శ. 1148) సంవత్సరమున నాంధ్రదేశాంతర్గర్భితమగు వేంగివిషయమును బరిపాలించుచున్న వెలనాటి చోడ గొంకమహారాజునకు పెనుగొండ పురాధిపతియైన సామంతుఁడును భాండారియు, భండనభీమబిరుదాంకితుఁ డగు పోతిసెట్టి దాక్షారామభీమేశ్వరాలయమున వ్రాయించిన దానశాసనములో యస్సంప్ప[దాతి] నలకూబర రూపసంపత్సంస్పర్థతే అని వర్ణింపఁబడియున్నాఁడు. ఇతని తండ్రియగు భీమిసెట్టిని "సకలవైశ్యశిరోవతంసునిగాను, సౌజన్యరత్న ఖనిగను, ఆశ్రితపద్మవాసునిగను వర్ణించియున్నవాడు. ఈకోమట్లా కాలమున వణిక్ప్రభువులుగ మాత్రమె గాక సామంత ప్రభువులుగను, సేనానులుగఁగూడ నున్నట్లుఁ పెక్కు

శాసనముల వలనఁ గన్పట్టుచున్నది.1 అందమున జయంత వసంత నలకూబర మన్మథాదులతోఁ బురుషులను వర్ణించు సంప్రదాయము మన కవులకుఁ గలదు. నలకూబర రూపసంపత్తును స్పర్థించు రూప సంపత్తుగల పోతిసెట్టి యెంత యందమైనవాఁడయి యుండునో మన మూహింపఁ జాలము. ఈమఱుచటి సంవత్సరముననే దాక్షారామ భీమేశ్వరస్వామివారికి మఱియొక దీపమును బెట్టించి శాసనము వ్రాయించిన పుణ్యాగోసిల గోత్రుండగు పెట్టిసెట్టికిని పేకాసానికి సుపుత్త్రుండయిన కాపిసెట్టి తనశాసనములో "స్వస్తిశ్రీ పెట్టిశ్రేష్ఠి పెనుంగొండ వాస్తవ్యస్తస్యభామినీ। పేకాసానీతి తత్సూనుఃకాపి శ్రేష్ఠి కులోత్తమః" అని ఇతఁడు పెనుగొండవాస్తవ్యుఁడు కులోత్తముఁడు నని వ్రాయించి యుండుటచేత పోతిసెట్టి శాసనములోని "పెనుగొండ పురాధిపతి, గోంకరాజుసెట్టి, భండనభీముఁడు" మొదలగు విశేషణములకు భంగము గలిగించు శాసనము కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును.2

కీర్తి నారాయణనగరము రాజధానిగా కాళిదాస సేనాని కొడుకు కలివర్మ సిందవాడిరాష్ట్రమును బరిపాలించు కాలమున మహావడ్డవ్యవహారియు (పెద్దవర్తకుఁడు) శ్రోత్రియ కుటుంబమువాఁడును, వైశ్యకులుఁడు నగు బమ్మిసెట్టికొడుకు ఎఱియముసెట్టి కాలకంఠరాయ పురమునందు బ్రహ్మేశ్వరుని ప్రతిష్ఠాపించి వ్రాయింపించిన దానశాస

(1) I. I. I. Vol. iv. No. 1134 and 1131, A. R. No 271 of 1893 and A. R, No 269 of 1893. 1134 సంఖ్యగలశాసనము తరువాయి 1131 సంఖ్యగల శాసనములో నున్నదిగనుక నాప్రకారము చదువుకొన్నయెడల బోధపడగలదు. రెండుభాగములు కలిపిన సంపూర్ణశాసన మగుచున్నది.

(2) S. I. I. Vol IV, No 1147. A. R. No 281 of 1893.

నములో నతనిది కుబేరవంశముగా దెలుపఁబడినది.1 ఇతఁడు క్రీ. శ. 1164 సంవత్సరము నాటివాఁడు. ఇతఁడే ఆదవాని తాలూకాలో పెద్ద తుంబలము గ్రామములో శివాలయమును బ్రతిష్ఠాపించి శాసనము వ్రాయించి యట్లే తనది కుబేరవంశమని చెప్పికొని యున్నాఁడు. 1151 సంవత్సరములో మహామండలేశ్వర త్రిభువనమల్లదేవ పొత్తపిచోడదేవ మహారాజు కొట్యదొన (కొణిదెన) రాజధానిగా కమ్మనాటిని బరిపాలించుకాలమున పెనుగొండ వాస్తవ్యుఁడగు కోసనయసెట్టి కొడుకు వాసనయసెట్టి చెఱువుగట్టుమీద సోమేశ్వరదేవుని కాలయమును గట్టించి శాసనము వ్రాయించి తాను కుబేరవంశ్యుఁడనని చెప్పికొని యున్నాఁడు.2 1124లో పెనుగొండ వాస్తవ్యుఁడగు కోసనసెట్టి కొడుకు కామిసెట్టి నాదెండ్లలో విశ్వేశ్వరస్వామి యాలయమును నెలకొల్పి శాసనము వ్రాయించి తాను కుబేర వంశ్యుఁడ నని చెప్పుకొనుటయెగాక వైశ్యులయిన కోమట్లది కుబేర వంశ్యమని యావంశమును వర్ణించియున్నాఁడు.3

తమ జీవితముయొక్క ముఖ్యోద్దేశము ధర్మనిర్వాహణమనియు, విద్వాంసులను పోషించి వారి యాశీర్వాదములను పొందుచుండుటయును, తమ సానుభూతి, ప్రేమ, సర్వజనులపై ప్రసరింపఁజేయుటయును, స్వార్థత్యాగము నాచరణమునందుఁ జూపుటయు గలవారై ప్రఖ్యాతిఁ గాంచెడివారు కుబేరవంశ్యు లయిన కోమట్లే యని వ్రాయఁబడినది. వీరిప్రథమ స్థానము పెనుగొండ నగరము (ఇప్పటి పశ్చిమ గోదావరి మండలములోనిది.) ఒకపురములోని నగరస్వాములెల్లరు (వర్తకులు) కుబేర వంశ్యులేయనియు, వారు శివకేశ

(1) No 504 of appendix B, of A. D 1916,

(2) „ 364 „ „

(3) „ 395 „ 101 „

వుల నిర్వూరకుఁగూడ భక్తులనియు దెలుపఁ వీరిలో పుచ్చకోల, ఎఱ సెట్టి, బోడరకుల, వేణుకుల, యెణుకుల, వివరిసిట్ల, అప్పనాంగకుల, మొక్కలకుల, ఊటకుల, ఎలిసెట్టి, పుణ్యాసిల మొదలగు గోత్రము లనేక శాసనములలోఁ గానంబడుచున్నవి గాని వానిలో నెక్కడ వీరికి ఋషులగోత్రములు గానంబడవు. కాని యిటీవల రచింపఁబడిన వైశ్యధర్మ పురాణములో నీయనార్య గోత్రములను ఋషిగోత్రముల లోనికి మార్పించు విధానమును కీర్తిశేషులయిన బ్రహ్మశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజుల శ్రేష్ఠిగారు చక్కగా విశదపఱచి యుండుట మెచ్చుకో దగినదే. వైశ్యులకు, వ్యవసాయము, వాణిజ్యము, పాశుపాల్యము వైశ్యులకు వృత్తిగా నార్యగ్రంథములం జెప్పఁబడియుండుటచేత ముఖ్యముగా కోమట్లు వాణిజ్యము మాత్రమును ప్రత్యేకముగా వైశ్యవృత్తులుగా నమరకోశము నందుఁ జెప్పఁబడి యుండుటచేత నీవృత్తులవలంబించినవారు వైసంస్కృత శబ్దజాలము నుపయోగించుకొనుటలోఁ బ్రమాదమేదియుఁ గానరాదు. ఆంధ్ర దేశములో నొక్కవాణిజ్యమె వృత్తిగాఁ జేసికొన్న కోమట్లుమాత్రమే యీయధికారమును బడసియున్నవారు గాని కృషియు పాశుపాల్యము వృత్తులుగాఁ గలవారికీ యోగ్యతపట్టక వారు శూద్రులుగాఁ బరిగణింపఁబడుచుండుట వింతగదా. సర్వసిద్ధాంత సంగ్రహమునందు శంకరాచార్యస్వాములవారు వ్యాసమతమిది యని నిరూపించుచు శ్లో॥ " విప్రశ్శుక్లో నృపోరక్తః పీతోవైశ్యాంత్యజోసితః " అని వైశ్యుని వర్ణము పసుపు వర్ణముగాఁ జెప్పియున్నారు. ఎక్కడనో ప్రత్యేక వ్యక్తులలోఁ బసుపు వర్ణముగాన్పించవచ్చును గాని సర్వసాధారణముగా కోమట్లు నలుపురంగు కలవారుగానే యున్నారనుమాట ధ్రువపఱుపవలసిన పనిలేదు. ఉత్తరహిందూస్థానమున వైశ్యుని బనియా యనియు, వణిక్కనియు, బణజిగ యనియు వ్యవహారింతురుగాని

కోమటి యని వ్యవహరింపరు. కాని కోమటిశబ్దము ప్రాచీనమైనదిగఁ గన్పట్టుచుండును. ఈశబ్ద మెట్లు వచ్చెనో యింతవఱకు నెవ్వరికిని దెలియరాదు. యక్షులనువారు పసిమివన్నె తెగవారని కొన్ని గ్రంథములవలనఁ దెలియుచున్నది. యక్షరాట్టయిన కుబేరునకుఁ "బైడిఱేఁడు" (బంగారు రాజు) అను పేరుగలదు. కనుక యక్షులనుమాట కూడ నెట్లు పొసఁగును? అను ప్రశ్నము పుట్టుచున్నది. "విద్యాధరోఽప్సరో యక్షరక్షోగంధర్వ కిన్నరాః । పిశాచోగుహ్యకస్సిద్ధో భూతో (ఽమీదేవయోనయః)" అని యమరసింహుఁడు విద్యాధరులను, అప్సరసలను, (దేవాంగనలను), యక్షులను, రక్షస్సులను, గంధర్వులను, కిన్నరులను, పిశాచులను, గుహ్యకులను, సిద్ధులను, భూతములను దేవయోనులుగను జెప్పియున్నాఁడు. ఇట్టివారలకు రాజగువాఁడే కుబేరుఁడుగఁ జెప్పియున్నాఁడు. ఇట్టిశబ్దములలో నేనితోను సంబంధము గానరాని కోమటిశబ్దము వీరికెట్లు వచ్చినది? ఎప్పుడు వచ్చినది? అను విషయమె దెలిసికొనవలసి యున్నది. సంస్కృతమునందు కిరాటశబ్దము వైశ్యశబ్దమునకుఁ బర్యాయపదముగాఁ గొన్ని నిఘంటువుల మాత్రమెగాక వాఙ్మయమునందును గానంబడుచున్నది. కిరాటశబ్దమునకు కోమటిశబ్దమునకు నేమైన సంబంధ ముండునాయని యొక సంశయము గలుగుచున్నది.

రాజరాజనరేంద్రపట్టాభిషేక సంచికలో జినదేవుని గోమటేశ్వరుఁడనునామముతోఁ గొల్చెడి భక్తులకు కోమట్లను నామము కలిగెనేమోయని యూహించితినిగాని నేఁడు విమర్శించి చూడఁగా కోమటిశబ్దమె మొదటిదిగను గోమఠశబ్దము నవీనమైనదిగను గనుపట్టుచున్నది. క కారము పరుషవర్ణముగను గ కారముసరళవర్ణముగను నుండుటచేతను విజాతీయవిజ్ఞానసంస్కరణమువలన గోమఠ మనునది తరువాత నేర్పడినదిగాఁ దోచుచున్నది. అనఁగా కోమటులు

జైనసంస్కారమును బొందిన వెనుక జినదేవుని గోమతేశ్వరునిగాఁ గొల్చుట సంభవించినది. కోమట్టిశబ్దమును కోమటిశబ్దమునుగాఁ దెలుఁగు భాషలోనికి గ్రహించినట్లు గనుపడుచున్నది. తెలుఁగులోఁ దక్కమతి యేదేశభాషలోను కోమటిశబ్దమే తెగకు నామముగా నున్నట్లు తెలియరాదు. కోమట్లులను పేరు కోమటులకుఁ బూర్వ నామమై యుండవలయునని యూహపొడముచున్నది. *కోమాం డూరులను గ్రామనామములుండుటచే కోమాట్లులను తెగవారుందు రని తలంపనగును. ఇయ్యది వర్ణవ్యవస్థ యేర్పడుటకుఁ బూర్వమె "కూర్మక" జాతిశాఖలోఁ జేరిన కోమాట్లు తెగవారు గంగాతీరస్థదేశ ములందును, కృష్ణా గోదావరీ తీరస్థదేశములందును. కృషివాణి జ్యాదివ్యాపారములచేయుచు బహుకాలము జైనబౌద్ధమతములవలం బించి తరువాత శైవవైష్ణవములను నవలంబించి యుండవచ్చును. పదునొకండవ శతాబ్దమునుండి యార్యులమనిపించుటకును, వైదికమ తమవలంబించుటకును బ్రయత్నము సేయుచున్నట్టు గన్పట్ట గలదు. వైదిక యుగమునకుఁ బూర్వము, అనఁగా ఋగ్వేదమంత్రములకుఁ బూర్వము కీకట (ప్రమగంద దేశములందుండెడివారని తోఁచుచున్నది. అచ్చటనున్నకాలముననే యక్షగణంబులతోడ పొత్తుగలిగియుండును. ఈకీకటప్రమగంద దేశము లితిహాసయుగమునాఁడు కారూష, మలద, దేశములుగను, బౌద్ధజైనయుగములనాఁడు, విదేహమాగధ ములుగాను, లేక అంగమగధదేశములుగను నేటికాలమున బేహార దేశముగను (విహారదేశము) మార్పులు పొందియుండెను. బేహారము నుండి దక్షిణదేశమునకు వచ్చినవారిని బేరిసెట్లందురు. అనార్య

* తడ్డ-తట్ట; తడ్డి-తట్టి; మిడ్జ-మిట్ట; మిడ్డి-మిట్టి; చడ్జ-చట్ట; చడ్డి-చట్టి; రడ్డ-రట్ట; రడ్డి-రట్టి; అరాడ్డ-అరాట్ట, మరాడ్డ-మరాట్ట; వరాడ్డ-వరాట్ట; కర్ణాండ-కర్ణాట; ఇట్లే కోమడ్డి కోమట్టియై యయ్యది కోమటిశబ్దముగాఁ దెలుఁగువారు వాడుచున్నట్లు గ్రహింపఁదగును. ఇయ్యవి యూహామాత్రములు-

మనం బడెడి కీకటదేశము ఋగ్వేదమున నీక్రిందిఋక్కులో నిట్లు వర్ణింపఁబడినది. "నీయావులు కీకటములో నేమిచేయుచున్నవి; అవి హవిస్సునకై పాలియ్యవు; అగ్నిని ప్రజ్వలింపఁజేయవు; ప్రమగందు నిసంపదమాకుఁ దీసికొనిరమ్ము; ఓయిందా! నీచమనుష్యుని మాస్వాధీనము చేయుము'' అని విశ్వామిత్రుఁడు ఇందునిగూర్చి జేసిన ప్రార్థనము.1

ఆర్యకర్మలయందు విశ్వాసములేక కేవలము ప్రపంచవ్యామోహములనుండి వడ్డీవ్యాపారము మొదలగువానినిజేయు మగందుల కాటపట్టగు కీకటదేశమని తాత్పర్యము. దీనిభావమును బట్టి వీరు తొలుత కీకటదేశమునందుండెడి కురుజాతివారని యూహించుటలోఁ బ్రమాద ముండదు. కాకండ శబ్దముకాకటమైనట్లు కోకండశబ్దము కోకటమైనట్లు కీకండశబ్దము కీకటము కావచ్చును. ఈ తెగలన్నియు కురుమానవసంఘమునకు సంబంధించినవి. ఈ తెగలకును, వేడ్లు తెగలకును సమ్మేళనము సంభవించెను.2

మహాభారతములో కర్ణపర్వమున ధార్తరాష్ట్రులమంత్రిశిఖామనియు, సర్వకౌరవ సైన్యాధ్యక్షుఁడు నగు కర్ణుఁడు పార్థునిగూర్చి

---

(1) కింతే కృణ్వంతి కీకటేషు గావో నాసీరం దుహ్రేనత
పంతిఘర్మం ఆనోభర ప్రమగందస్య వేదో నైచాశాఖం
మఘవాన్ రంధయానః.'' (ఋ. వే. మం. 3-౫3-౧౮)

(2) అప్పుడు కురు+వేడ్లు = కురువేడ్లు కువేడ్లుగా మారుచున్నది. వేడ్లు=వేట్ గా మారి ''కువేట్'' అగుచున్నది. వేడ్దారు అనఁగా రాజు. వేడ్దార్ యొక్క సంక్షిప్త రూపము వేర్; వేడ్—వేణ్—వేళ్. వేట్ అను మార్పులను గమనింపుడు ''వబయోరభేదః'' అనుటచేత కువేట్—కుబేట్ గా నుచ్చరింపఁబడి సంస్కృతమున కుబేరశబ్దమై కురురాజను నర్థమేర్పడుచున్నది. కావున కురుశ్రేష్ఠులలో నగ్రగణ్యులు కుబేరనట్లు. అంధరాజగు ధృతరాష్ట్రుఁడనుమాట యితిహాస ప్రసిద్ధమైన విషయము.

గర్వసంరంభముతో యుద్ధరంగమున నీసడింపు వాక్యములఁ బలుకు నపుడు పాండవపక్షపాతియుఁ గర్ణసారథియునగు శల్యుఁడు వాని గర్వసంరంభమును మాన్పించుటకై "హంసకాకీయోపాఖ్యానము" పేరిట నీక్రిందికథను జెప్పెను. ఒకప్పుడొక కాకి తన యజమానులగు కోమటిబిడ్డల యింటియెంగిలికూళ్ళు నిరంతరము భుజించుటచే గర్వించి తనప్రతిపక్షియైన హంసను జూచి యోర్వలేమిచే దానితోఁ బఱువెత్తుటకుఁ బందెము వేసి హంస సముద్రముపై పఱవిడఁగా దానును దానివెంటఁ గొంతదూరము పఱువెత్తి యాయాసముఁజెంది నిలుచుండుటకై భూమిగాని యొకవృక్షముగాని యాధారము గాన రాక సముద్రములోఁబడి తన్ను రక్షింపుమని యాహంసను బ్రార్థింపఁగా నాహంస నవ్వుచువచ్చి వానిని దరికిఁ జేర్చి ప్రాణము గాపాడి సంరక్షించెనని చెప్పి ధార్తరాష్ట్రులను కోమటిబిడ్డలుగను, కర్ణుని కాకముగను, అర్జునుని హంసగను ధ్వనింపఁజేసినరీతిగూడ నాయూహను బలపఱచుచున్నది. విదేహమాగధములు నేటికాలమున బేహారమని వ్యవహరింపఁ బడుచున్నవని పైని దెలిపి యున్నాఁడను. ఉత్తర బేహారమునకు విదేహదేశమనియు, దక్షిణబేహారమునకు మగధమని యుఁ బూర్వముండెడి నామములనియుఁ గూడఁ దెలిపియున్నాను. వైదేహశబ్దమునకు బేహారమనునది వైకృతము. బేహారియన్న వర్తకుఁడన్న యర్థము నేఁడును వ్యవహరింపఁబడుచున్నది. కాఁబట్టి నిఘంటువులలోని యర్థము సరియైనదని మనము విశ్వసింపవచ్చును. ధర్మశాస్త్రవేత్తలు వైదేహకులను, మాగధులను వర్ణసంకరులని యు, దస్యులనియుఁ జెప్పినను దుష్టమైన వైశ్యవృత్తిని చేయుదురని చెప్పి యొప్పికొనిరి. ఇట్లు వైదేహమాగధకరణులను "దుష్టాని వైశ్య కర్మాణి తేఽపి కుర్వంతి దస్యవః" అని దుష్టములయిన వైశ్యకర్మలఁ జేయు దస్యులలోఁ జేర్చిరి. వైదేహకులు వైశ్యులను ప్రజాసంఘ

మునకుఁ జేరినవారనియు, వర్ణసంకరులనియు నైకకంఠ్యముగా కుహనాశాస్త్రవేత్తలెల్లరు చాటిచెప్పెడి విషయము పరిశీలింపఁదగినది.

కుబేరుఁడు కల్పిత పురుషుఁడుకాఁడు.

భట్టిప్రోలుస్తూపము త్రవ్వినపుడు వానిలో పది శాసనములు వెల్వరింపఁ బడినవి. అందొకదానియందు పౌరసభలు, ధర్మకార్య నిర్వాహక సంఘము మొదలగు సంఘములను గూర్చియు, ఆయా సంఘసభ్యుల నామములను గూర్చియు వ్రాయఁబడి యుండెను. ధర్మకార్య నిర్వాహక సంఘసభ్యుల నామముల నుదాహరించు నపుడు సామాన్య సభ్యుల నామములతోఁబాటు కుబేరరాజు నామముగూడ దెలుపఁబడి యుండెను.[1] కోమట్లు కుబేరవంశీయులమని పండ్రెండవ శతాబ్దినాటివారే తమశాసనములలో వ్రాయించికొని యుండుటయు, గుంటూరు మండలములోని చందవ్రోలు పూర్వము ధనదుపురముగా నుండెనని శాసనములు మాత్రమెగాక కేయూర బాహుచరిత్రము మొదలగు గ్రంథములు దెలుపుచుండుటయు, గణపతిదేవ చక్రవర్తినాటి గణపేశ్వరము శాసనములో తలగడదీవి లేక లంక ధనదునిచే సృజింపఁ బడినదని చెప్పియుండుటయు, కుబేరునకు ధనదుఁడని నామాంతరముండుటచేతను, ధర్మామృతములో ధనదుఁడిక్ష్వాకు వంశములోనివాఁడనియు, నతఁడు ధనదుపురము రాజధానిగా నీదేశము పరిపాలించినాఁడని చెప్పియుండుటయు, ధర్మామృతములోని కథ కేవల మసత్యమని కొట్టివేయఁజాలము. కుబేరుఁడు కల్పితపురుషుఁడని త్రోసివేయఁ జాలము. ఆంధ్రదేశములో కోమటి సంఘమును పురాతన నాగరికతను సూచించుటకు గుర్తుగా నిలిచియున్న సంఘమని చెప్పవచ్చును. గుంటూరు మండలములోని ప్రత్తిపాడు గ్రామమునందలి దండేశ్వరస్వామివారి యాలయములో

(1) Epigraphia Indica. Vol. II, pp. 326-329.

శాసనము వ్రాయించిన నారాయణసెట్టి తనది ధనదవంశమనియె వ్రాయించి యుండెను గనుక నాకాలమునాటి కోమటులలో ధనదుఁడనఁగా గుబేరుఁడే యనువిషయము వారెఱింగి యుండకపోలేదని చాటగలదు. ఇంతియగాక ఆంధ్రసాతవాహన చక్రవర్తులకు మొదట రాజధానిగా నుండెనని తలంపఁబడి యాకాలమునాటి ప్రాకృతశాసనములలోఁ గన్పట్టెడి ధనకటకనామ నగర మీధనదుపురమేమై యుండునేమోయని యిపుడొక యూహ పొడముచున్నది. ధనదుపురము బహుపురాతనమైన నగరముగానుండి ప్రాచీనాగరికతా వైభవమును సూచింపునదిగా నున్నదనుటకు లేశమాత్రమును సంశయింపఁబనిలేదు. క్రీస్తుశకమునకు బూర్వమునందే యాంధ్రదేశమున జైనబౌద్ధమతములు నాలుగయిదు శతాబ్దులనుండి వర్ధిల్లుచుండినవని ధర్మామృతములోని జైనగాథలవలననేమి బౌద్ధజాతక కథలవలననేమి, పరమప్రమాణములగు శాసనముల వలననేమి విశదమగుచున్నది. చారిత్రికముగాఁ బరిశీలించినపు డాంధ్రదేశము రెండువేలయేనూరు సంవత్సరములనుండి నాగరికతావిజ్ఞానవైభవములతో నొప్పుచున్నదని యెట్టిశంకకు నవకాశమియ్యనిరీతిగాఁ జాటుచున్నది. ధర్మామృతములో నుదాహరింపఁబడిన మతపరిపాలనా విశేషములు, రాజ్యపరిపాలనా విశేషము లన్నియు, శాతవాహనాంధ్ర సామ్రాజ్యమేర్పడుటకుఁ బూర్వమునఁ బ్రవర్తింపఁబడినవిగానే గ్రహింపవలసి యుండును. ఆంధ్రసాతవాహన సామ్రాజ్య విచ్ఛిన్నమైన వెనుక నీ యిక్ష్వాకు లిన్నూరు సంవత్సరములు పరిపాలించినట్లుగాఁ బురాణములవలన మాత్రమే గాక యీనడుమ నాగార్జునకొండ స్తూపములలో వెల్వడిన శాసనములు మూలముగాఁగూడ విశదమగుచున్నది. ఈకడపటి యిక్ష్వాకులు వైదికమత ప్రవిష్టులరయి యుండిరనిగూడ మనము దెలిసికొనుచున్నారము.

## జైనతీర్థంకరులు.

జైనమతగురువులగు తీర్థంకరు లిరువదినాల్గురలోను ఇరువదవవాఁడయిన మునిసువ్రతుఁడును, ఇరువదిరెండవ వాఁడయిననేమి నాథుఁడుతక్క తక్కిన వారందఱును క్ష్వాకుని కులమువారని చెప్పుకొన్నవారే. వీరిరువురు మాత్రము హరి వంశమువారుగా నిరూపింపఁ బడినారు. శైవవైష్ణవమతము లెట్టి తాంత్రికమతములో వీనికిఁ బూర్వముననున్న జైనబౌద్ధ మతములుగూడ నట్టి తాంత్రికములే. జైనపురాణములన్నియు యక్షయక్షిణులకును తీర్థంకరులకును గల సంబంధములను గూర్చి తెలుపుచున్నవి. ఈయక్షయక్షిణులు లిర్వురు ప్రతితీర్థంకరునకు నౌపచారికులగు సేవకులుగ నున్నట్లు పురాణములు దెలుపుచున్నవి. తీర్థంకరుల విగ్రహములుకూడ చాటిచెప్పుచున్నవి. జైనశాసన దేవతయగు కూష్మాండిని నేమి నాథుఁడను తీర్థంకరునకు నౌపచారికగ నుండెనని తెలియుచున్నదని యిదివఱకె నుడివియున్నాను. జైనులలో ముఖ్యముగా శ్వేతాంబరులని, దిగంబరులని రెండుశాఖలు గలవు. శ్వేతాంబరుల దేవళములలో తీర్థంకరుల విగ్రహములు తెల్లని పాలరాళ్ళతోఁ జేయఁబడినవిగ నుండునుగాని 19, 20, 22, 23 జైనులవి మాత్రము తఱచుగా నల్లవిగానే యుండును. జైనులలో శ్వేతాంబరులని దిగంబరులని రెండుశాఖలు గలవు. శ్వేతాంబరుల జైనవిగ్రహములు వస్త్రములతో నలంకరింపఁబడియుండ దిగంబరజైనుల విగ్రహములు వస్త్రశూన్యములై యుండును. సర్వసామాన్యముగా జైనతీర్థంకరుల పూజావిధానములలో నిరుశాఖల వారికి నంతగా భేదములు గానరావుగాని వేర్వేఱు తీర్థంకరుల యౌపచారికలగు యక్షిణులఁ బేర్కొనుటలో మొదటియు, కడపటియు, తీర్థంకరులు తక్క తక్కినవారి విషయములో భిన్నాభి

ప్రాయములు గానగును. భూతభవిష్యత్కాలమునాటి తీర్థంకరులను వాకొనుటలోఁగూడ భిన్నాభిప్రాయములు గలవు. దిగంబరులు జైనశక్తులలో పదునార్గురిని మాత్రమే విద్యాదేవులుగఁ బ్రస్తావించి జాబితాలోఁ జేర్చుకొనియుండ శ్వేతాంబరశాఖ వారయిదుగురిని మాత్రమె విద్యాదేవులుగఁ జేర్చుకొనుచుండిరి.

“రోహిణి, ప్రజ్ఞప్తి, వజ్రశృంఖల, కులిశాంకుశ, చక్రేశ్వరి, నరదత్త, కాళికా, మహాకాళి, గౌరి, గాంధారి, సర్వాస్త్రమహాజ్వాల, మానవి, వైరోత్య, అచ్ఛుప్త, మానసి, మహామానసిక అను పదునార్వురు విద్యాదేవులని హేమచంద్రుఁడు చెప్పియున్నాఁడు.

శ్వేతాంబర జైనుల విగ్రహములు వస్త్రములను గలిగి యుండుటయెగాక కిరీటములు నలంకారములు మొదలగువానితో నలంకరింపఁబడి యుండును. ఈతీర్థంకరులలో సువర్ణస్వరూపులు, రక్తవర్ణస్వరూపులు, నీలవర్ణస్వరూపులు, పీతవర్ణ (పసుపు) స్వరూపులుగూడఁగలరు.తీర్థంకరులలోసువర్ణస్వరూపులె పెక్కండ్రు గన్పట్టుచున్నారు. ఇరువది మూఁడవ తీర్థంకరుఁడు పార్శ్వనాథుఁడు నీలవర్ణస్వరూపుడుగ తెలుపఁబడినాఁడు. ఇరువదినాలుగవ తీర్థంకరుఁడైన మహావీరవర్ధమానుఁడు పీతవర్ణ స్వరూపుడుగఁ దెలుపఁబడినాఁడు. ధారణేంద్రయక్షుఁడు లేక నాగయక్షుఁడు, పద్మావతియు నౌపరిచారికలగు యక్షయక్షిణులుగఁ జేర్కొనఁబడిరి.

## పార్శ్వనాథునిగాథ.

ఇరువదిమూఁడవ తీర్థంకరుడైన పార్శ్వనాథుని గాథలో మరుభూతి, కమఠుఁడు నను నిర్వురు సోదరు లుండెడివారనియు, వారు వరుసగా నెనిమిది జన్మాంతరములు పొందినను వారాజన్మలలో శత్రువులుగా నుండిరనియు వారు తుదకు పార్శ్వనాథుఁడు,

శంబరదేవుఁడుగా నవతరించి నారని తెలుపఁబడినది. ఒకపాషండుఁడు పంచాగ్ని సంస్కారకర్మమునందు మగ్నుఁడైయుండి పార్శ్వనాథుఁడు వలదనుచుండగా నగ్నికొరకు నొకవృక్షమును నఱకుచుండఁగా నాపాషండుఁ డందులో నున్న రెండుపాములనుగూడ నఱికెననియు, వారే పాతాళలోకమునందు ధారణేంద్రుఁడను నాగేంద్ర యక్షుఁడుగాను, పద్మావతియను యక్షిణిగను పునర్జన్మమును గాంచిరనియు, మేఘకుమారుఁ డనుశంబరదేవుఁడు తరువాత నర్హతుని నొకపెద్ద తుపానుతో నెదుర్కొనియు, బుద్ధగయలో గౌతమబుద్ధుని మారుఁడు మార్కొన్నట్లుగా గాలిలో కాయోత్సర్గ సంస్కారము నందు స్థిరముగా నిలువఁబడియుండ మేఘకుమారుఁడను శంబరదేవుఁడు పార్శ్వనాథుని నెదుర్కొనెననియు, అందువలన పాతాళము లోని ధారణేంద్రుని సింహాసనము చలింపఁగా నాగేంద్రయక్షుఁడు తనభార్యతో నంతకుమున్ను దన ప్రాణమునురక్షించిన మహోపకారి రక్షణకై పఱువిడి ధారణేంద్రుఁడనేక ఫణములతో (పడగలు) నర్హతుని శిరస్సుపైఁ బఱపఁగా వానిభార్య పద్మావతి యక్షిణి రక్షణమునకై వానికి శ్వేతచ్ఛత్రమునుబట్టెనఁట. తరువాత బుద్ధునకు శక్రునివలె నెప్పుడును విడువని సేవకులైరట. ఈగాథ లోని విధముగానె పార్శ్వనాథుని విగ్రహములు బాదామి, ఏలూరు (హైదరాబాదులోని ఎల్లోరా) ప్రదేశములందల్లే శేషఫణులతోఁ చిత్రింపఁబడినవిగాఁజూచుచున్నాము. * నేమి తీర్థంకరుని యక్షిణి

---

* Cave Temples pp. 491, 496; Arch. Sur. West India Vol. I. p. 25 and pt. XXXVII, Vol. V p. 49; Transactions, R. A, Soc. Vol. I, p. 435,

At Ranpur in Godwar in the temple of Rishabhanadha in a finely curved slab representing Parswanatha in the Kayostsarga position attended by snake deities, Arch. Sur. in Guzerot and Rajaputana p. 21. The Story as variants Indian Antiquary Vol. XXX, p. 302 Foot note.

కూష్మాండినిమైయుండ పార్శ్వనాథుని యక్షిణి పద్మావతి యని యిప్పటికిఁ దెలియవచ్చినది. ఈగాథ రహస్య మెట్టిదో తెలిసికొను టకై చదువరుల యుపయోగార్థము వీనిని సంగ్రహముగాఁదెలిపితిని.

ఘటాంతకి గాథ.

రాజావవళి కథననుసరించి అకలంకుఁడనుజైనయతి బౌద్ధులతోఁ దనకు నగుచున్నప్రచండవివాదమునందు జైనదేవతయగు కూష్మాం డిని యొక్కతోడ్పాటును పెందెననియు, బౌద్ధుల దేవతయగు తారాదేవి తన యెడమపాదముతో కుండలోఁ బ్రవేశింపగా కూష్మాండినీ జైనదేవత తుదకా కుండను దన్ని ముక్క ముక్కలు గావించెనని తెలియ నగుచున్నది.

కాకతిబేతరాజు మంత్రియైన వైద్యని కొడుకు బేతనమంత్రి భార్య మైలమ ఘటాంతకి యని యొక శాసనములోఁ దెలుపఁ బడినది. *

కాకతిరాజవంశము బ్రహ్మణ్యరాజవంశ మగుట.

కాకతిగణపతిదేవ చక్రవర్తికి పుత్త్రికా సంతానమెగాని పుత్త్ర సంతానము లేకయుండెను. ఇద్దఱు కొమార్తెలు మాత్రము పుట్టిరి. మొదటికొమార్తె గణపాంబ. రెండవకొమార్తె, రుద్రాంబ. ఈరెం డవకొమార్తె రుద్రాంబ జనించినపుడు తన యీ మహాసామ్రాజ్య మన్యుల పరముచేయుటకు మనస్సు గొలుపక జ్ఞాతుల వంశములో నుండి యొక బాలునిఁదెచ్చుకొను దత్తస్వీకారమున కిష్టపడక తన గురువర్యుఁ డయిన విశ్వేశ్వరశివదేశికులవారి యాజ్ఞ ననుసరించి రుద్రాంబకు రుద్రదేవుడని నామకరణముఁజేసి పుత్త్రుఁడు పుట్టినట్లు

* Epigraphia Indica Vol. IX, No. 2, page 266 Footnote.

గానే లోకమునకుఁ బ్రకటించెను. ఆమె కొంతకాలము రుద్రదేవుఁడనుకొనునట్లుగాఁ గొంతకాలము పురుషవేషముతోనే కాలము గడపినట్లు గన్పట్టుచున్నది. ఆమెకు వివాహమని యొకతంతుగూడ జరపినట్లు గన్పడుచున్నది. కాకతి గణపతిదేవచక్రవర్తి తాను బ్రదికి యుండఁగానే యాకృతిమ కుమారునకు యువరాజ పట్టముగూఁడ గట్టి యుండెను. ఇట్లు గణపతిదేవ చక్రవర్తి తన కొమార్తెయగు రుద్రాంబను రాజగురువయిన విశ్వేశ్వర శివదేశికుని యనుగ్రహమునకుఁ బాత్రురాలినిగాఁ జేసి రాజ్యాంగపరిపాలనా పద్ధతులను నేర్పించి యామెసామ్రాజ్యము నందంతట యువరాజుగా గుర్తింపఁబడి ప్రజ లందఱు వినయవిధేయులై వర్తించుట స్థిరపడినవెనుక జ్ఞాతిసముదాయములోఁ గాని, తదితరసామంతవర్గములోఁగాని యే వ్యక్తియు శత్రుత్వము వహించి, సామ్రాజ్యమునకు గాని యామెకుఁగాని యెట్టి యపకృతియు జరుగకుండఁ గాపాడుకొనుచువచ్చి శత్రుపక్షమునంతయు నడంచివైచి యటుపిమ్మట నామెను విశ్వేశ్వరశివదేశికుని (శివదేవయ్యగారు) యాజ్ఞను శిరసావహించి యుత్తమకులీనుఁడును బ్రహ్మణ్యుఁడును, సుప్రసిద్ధ చాళుక్యవంశీయుఁడును, తన సామంతమండలాధీశ్వరులలో నొక్కఁడును, కొల్లిపాకపురాధినాథుఁడును, మహాదేవ రాజు మనుమఁడును, ఇందుశేఖరుని పుత్త్రుఁడునగు వీరభద్రరాజునకు నిచ్చి పెండ్లి గావించెను.

తనకుఁ బెండ్లియైన తరువాత తన తండ్రి రక్షణమునఁ దాను రాజ్యాంగవ్యవహారములను జక్కపెట్టుకొను సందర్భమున రుద్రదేవమహారాజనియె సామ్రాజ్యమునందంతట వ్యవహరింపఁబడు చుండెను. తనకు బాల్యమున వివాహముఁ జేయుటకై తీసికొనిరాబడిన ముమ్మడమ్మను (ఈమె యెవరి కొమార్తెయో దెలియరాదు.) దయతోఁ దన పుత్త్రికనుగా భావించుకొని పెంచి పెద్దదానినిగాఁ జేసి తరువాత విశ్వేశ్వరశివదేశికులవారి యానతిగైకొని యామెను నిరవద్య పురదుర్గాధిపతి యగు మహాదేవచక్రవర్తికిచ్చి పెండ్లి

గావించెను. ఆదంపతులకు జనించినవాఁడే రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి. ఈమహాదేవచక్రవర్తి యారాధ్య బ్రాహ్మణుఁడుగాని చతుర్థ కులక్షత్రియ వర్గములోనివాఁడు కాఁడు. ఈతఁడు యువ రాజ్యపట్టముగట్టుకొని వ్యవహరింపఁగలుగువఱకు గణపతి దేవచక్రవర్తి బ్రదికియుండెనని యూహింప నవకాశము లేదు. తానొకటి దలంచిన దైవము మఱియొకటి తలంచు నన్నట్లు విశ్వేశ్వర శివ దేశికులు, గణపతిదేవచక్రవర్తి, తదితర మంత్రి సామంతమండలాది వర్గమువారు తలంచి యీరీతిగా సామ్రాజ్యము నిలువబెట్ట నెంతయో ప్రయత్నించినను ఏబదిసంవత్సరముల కాలముకన్న నెక్కువకాలము నిలుపఁ జాలకపోయిరి.

రుద్రమదేవి తన కొమార్తెను రుయ్యాంబను తన సేనాధిపతులలోను, మంత్రులలోను ముఖ్యుఁడును, ఆరాధ్య బ్రాహ్మణ కుటుంబములోఁ బుట్టిన నియోగియు నగు ఇందులూరి అన్నమదేవుని కిచ్చి వివాహము గావించెను. ముమ్మడంబను వివాహమాడిన మహాదేవరాజు వీని బంధువర్గములోనివాఁడే. ఆకాలమున సామ్రాజ్యమున నీయిందులూరి వారి పలుకుఁబడి యెక్కువగానుండుటకు మూలకారణము రాజవంశమునకు వీరికినిగల సంబంధమె యని చెప్పఁదగి యుండును. ఈవిషయకములగు మార్పులెట్లువచ్చినవో, ఎట్టెట్టి యంతరాయము లాకాలమునందు సంప్రాప్తములయ్యెనో, అయ్యవి యెట్లు పరిష్కరింపఁ బడుచు వచ్చినవో ముందు ముందా యాసందర్భములయందు వివరింపఁబడును గావున నిచట విస్తరింపలేదు. అన్యులైన ముమ్మడంబకును, మహాదేవరాజునకుఁ బుట్టిన రెండవ ప్రతాపరుద్రుని రుద్రమదేవి పెంచుకొన్న దన్నను రుద్రమదేవి చాళుక్య వీరభద్రుని పెండ్లాడి యుండుటచేత ప్రతాపరుద్రుఁడు చాళుక్యరుద్రుఁడే యగును గాని కాకతీయ రుద్రుఁ డెట్లగును ? ఎన్నివిధములచేతఁ జూచినను రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి కాకతీయుఁడు మాత్రముగాఁ డని స్పష్టమగుచున్నది. అందువలననే

రెండవ ప్రతాపరుద్రుని యాస్థాన కవి యగు విద్యానాథుఁడు ప్రతాపరుద్ర యశోభూషణ మను తన యలంకార గ్రంథమునందు నీవంశమును గూర్చి యనేకవిధములగుచమత్కార వాక్యములను వ్రాసి యుండెను. ఈవంశమును గూర్చిన రహస్య విషయము లిటీవల బయల్పడి యుండుటచేత వీని యాథార్థ్యము తెలిసికొన సాధ్యమగుచున్నది గాని యింతకుఁ బూర్వము సాధ్యము కాలేదు. కొందఱు శూద్రకులమని, కొందఱు చతుర్థకులమని, కొందఱు సూర్యకులమని, మఱికొందఱు చంద్రకులమని, పల్వురు పలువిధములుగా వక్కాణించి యుండుటచేత ననేకవిధములయిన చర్చలు తీవ్రముగా బయలుదేరి కలవరపెట్ట సాగినవి. విద్యానాథ కవి "ప్రతాపరుద్ర యశోభూషణ" మని పేరుపెట్టి గ్రంథము వ్రాయుటకు మూలకారణముగూడ నిదియే యని చెప్పఁదగును.

"ఈతఁడు శౌర్యముచే బ్రకాశించుచున్నాఁడు. అడ్డులేనివాఁడు. శత్రువుల నందరను గూడ వణంచినాఁడు. భూమి వీనియందు పాతివ్రత్యము నెరపును. ఈతఁడు సాక్షాత్తుశివుఁడే. అందువలననే యీతఁడు యువరాజుగ నుండియే రాజ్యభారము నంతటిని వహించినాఁడు." అని నిత్యమును కాకతీయరాజు (ప్రతాపరుద్రునిగూర్చి ప్రశంసించుచు) సంతసించుచుండును." అని వ్రాసియున్నాడు గదా! * ఇందు పేర్కొనఁబడిన కాకతీయరాజు "రుద్రదేవ మహారాజు" అను పేరుతో సామ్రాజ్యపరిపాలనము చేయుచున్న రుద్రదేవియే యైయుండవలయునుగాని యామె తండ్రియగు కాకతి గణపతిదేవ చక్రవర్తి కాఁజాలఁడు. ఈతఁడు క్రీ. శ. 126 వఱకుఁ నించుమించుగా ౬౦ సంవత్సరములు పరిపాలనము చేసి మరణించిన

* "ధీరోయం యువరాజు ఏవకహాతి శ్రీ వీర రుద్రోద్ధురం
సర్వామిత్యను మోదతే ప్రతికలం శ్రీ కాకతీంద్రోనృపః."

వాఁడు గావున నప్పటికిఁ బ్రతాపరుద్రుఁడు పుట్టిన వాఁడని తలంచి నను నాతనికి మరణించు నాటికి క్రీ. శ. 1326 వఱకు జూచిన 66 సంవత్సరములు వయస్సు యుండి యుండవలయును. ప్రతాప రుద్రుఁడు జన్మించిన నాటికే గణపతిదేవ చక్రవర్తి 72 లేక 73 సంవత్సరముల వయస్సుగలవాఁడై యుండును. విద్యానాథుఁడు వర్ణించిన వర్ణనకు యువరాజు పాత్రుఁడగుటకు నాతఁడు కనీసము, 18, 20 సంవత్సరముల వయస్సు కలవాఁడై యుండవలయును. గణపతిదేవ చక్రవర్తి 90 - 100 సంవత్సరముల మధ్య వయస్సుగలవాఁడై యుండవలయును. అంతవఱకు చక్రవర్తి బ్రతికియున్నట్టు దృష్టాంతము గానరాదు. కనుక విద్యానాథకవిచేఁ బేర్కొనఁబడిన కాకతి రాజు రుద్రమదేవుఁడను రుద్రమదేవి యనియె భావించుట సమంజసముగా నుండును. విద్యానాథకవి తన గ్రంథమునందు "కాకతీయ కులగౌరవమును బెంపొందించు మాచే సూర్యచంద్ర వంశముల విఖ్యాతి తక్కువచేయఁబడినది."1 అని వ్రాయుట రెండవ ప్రతాపరుద్రుఁడు సూర్య చంద్రాన్వయుల కంటె భిన్నుఁడని చెప్పుట శూద్రుఁడను భావముతోఁ గాదని స్పష్టమగుచున్నది. మఱియు నాతఁడు "కాకతీయవంశము సూర్య చంద్రవంశములను జయించుచున్నది. మాయందు భూమి పాతివ్రత్యము నెఱపుచున్నది. మేముండుటఁజేసి బ్రహ్మక్షత్రియ వంశము ధన్యమైనదని తలంచుచున్నాఁడు. అందువలననే మాకుల గురువగు శివుఁడు స్వయముగా నాకు కర్తవ్యము నాజ్ఞయిచ్చియున్నాఁడు.2 అని వ్రాయుటకూడ పైభావమునే దెలుపుచున్నది.

---

1శ్లో॥ సూర్యసోమాన్వయా మాత్యమహత్త్వాద్యాఽధరీకృతా
అస్మాభి రధికుర్వాణైః కాకతీయకుల స్థితిం॥

2 సోమార్కాభి జనం తమద్య జయతి శ్రీకాకతీయాన్వయః
పాతివ్రత్య ము పైతి సాంప్రతమ మీష్వస్మాసు విశ్వంభరా
అస్మాభిర్ద్విజః ప్రసూతి మఘనాథన్యామజోమస్యతే
యత్కర్తవ్య ముపాది శత్కులపతిర్దేవస్స్వయంభూస్స్వయం॥



# కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము.

## మూఁడవ ప్రకరణము.

### నాగవంశోద్భవులయిన మహారాజులు

### క్రీ. శ. ౧౦౩౦ మొదలుకొని క్రీ. శ. ౧౩౨౬ వఱకు.

ఆంధ్రులచరిత్రములోని ప్రథమభాగమున (పూర్వముద్రణము) నాగులను గూర్చియు, నాగకులస్థులనుగూర్చియు, గొంత వఱకుఁ జర్చించి వారల యుదంతంబుఁ బాఠకులకుఁ దెలిపియున్నాఁడను. వీరలచరిత్రంబామూలాగ్రముగాఁ దెలిసికొనఁ గోరిన యెడల సంస్కృతభాషలో వ్రాయఁబడిన పురాణేతిహాసకావ్య గ్రంథములు మొదలగువానిని బెక్కింటిని బరిశోధించి యొక ప్రత్యేకగ్రంథమును వ్రాయవలయునేగాని యీయాంధ్రులచరిత్రమున సవిస్తరముగాఁ దెలుప సాధ్యము కాదు. ఆర్యులనంబడు వారీ జంబూద్వీపమునం బ్రవేశించిన కాలమున నీదేశమునందును, దీని సమీపదేశములందును సురాసుర యక్షగంధర్వకిన్నరకింపురుష సిద్ధ సాధ్యవిద్యాధరగరుడోరగాది జాతులవారు నివసించుచుండిరి. ఈ జాతులలోని వీరనాయకులనేకులనేక సహస్రవత్సరములుగడచిపోవగా

దివ్యపురుషులై దేవతలై పురాణగాథలమూలమునఁ బ్రశంసింపఁ బడుచుండిరి. వీరిలో గరుడోరగాదు లేకప్రదేశమున నన్యోన్య కలహంబులం బెంచుకొని తమలోఁదాము యుద్ధములు సేయుచు దాయాదులవలె నుండిరి. ఈగరుడోరగాదులు కశ్యపప్రజాపతి యొక్కయు అతనిభార్యలగు కద్రూవినతలయొక్కయు సంతానమై నట్లు మహాభారతమున వర్ణింపఁబడిన చందమును ప్రథమభాగచరిత్ర మునఁ దెలిపియున్నాను. కద్రూసంతానమైన నాగులు నాగధ్వజము గలవారు. వినతసంతానమైనగరుడులు గరుడధ్వజము గలవారు. అనేకనాగరాజులు కద్రూసంతానముగా మహాభారతమునం బేర్కొ నంబడిరి.[1] అనలతేజులుగను, దీర్ఘదేహులుగను, భుజవీర్యవంతులు గను, మహాభారతమున కద్రూతనయులగు నాగరాజు లభివర్ణింపఁ బడిరి. ఈనాగులను సంతోషపెట్టి స్వమతావలంబకులనుగాఁ జేసి కొనుటకై ప్రాచీనకాలమున శైవులు శివుని నాగభూషణునిగాఁజేసి యుందురు. ఆకతమున నాగులనేకులు శైవులు శాక్తేయులునై యుందురు. శైవులకన్న నాధిక్యము గనఁబడవలయునన్నభావముతో మఱికొంతకాలమునకు వైష్ణవులు విష్ణువును శేషశయనునిగను, గరుడ వాహనారూఢునిగను జేసియుందురు. ఈనాగజాతివారును, గరుడ

1. కద్రూసంతానములో శేష వాసు కైరావత తక్షక కర్కోటక ధనంజయ కాళియ మణినా గాపూరణ పింజర కైలాపుత్త్ర వామన నీలానిల కల్మాష శబలార్యకోగ్రక కలశ పోతక సురాముఖ దధిముఖ విమలపిండకాప్త కర్కోటక శంఖ వాలి శిఖ నిష్ఠానక హేమగుహ నహుష పింగళ బాహ్యకర్ణ హస్తపద ముద్గర పిండక కంబ ళాశ్వతర కాళీయక వృత్త సంవర్తక పద్మ శంఖముఖ కూష్మాండక క్షేమక పిండారక కరవీర పుష్పదంష్ట్ర బిల్వక బిల్వ పాండర మూషకాద శంఖ శిరః పూర్ణభద్ర హరిద్ర కాపరాజితజ్యోతిక శ్రీవహ కౌరవ్య ధృతరాష్ట్ర శంఖ పిండ పిఠరక సుముఖ కౌణపాశన కుఠర కుంజర ప్రభాకర కుముద కుముదాక్ష తిత్తిరి హలిక కర్దమ బహుమూలక కర్కరాకర్కర కుండోదర మహోదరు లాదిగా ప్రాచీన నాగరాజు లనేకులు పేర్కొనంబడిరి.

జాతివారును ధనుర్విద్యయందుఁ గుశలు లగుటంజేసి ప్రాచీనకాలంబునఁ గొన్ని యస్త్రంబులకు వారిపేరిట నాగాస్త్రం బనియు, గరుడాస్త్రం బనియుఁ బేరులు పెట్టఁబడినవి. ఇవ్విషయంబు లటుండనిండు. అయోధ్యానగరమునుండి శ్రీరామచంద్రుండు దండకారణ్యమార్గమునఁ బంచవటికి వచ్చి సీతను గోల్పోయి లక్ష్మణసమేతుండై కిష్కింధారాజ్యమునకుఁ బోయి సుగ్రీవునితో సఖ్యముచేసికొన్నప్పుడు సీతను వెదకుటకై సుగ్రీవుఁడు హనుమదాదుల నురగులపట్టణమగు భోగవతీపురంబునకుఁ బంపెనని రామాయణమునందుఁ జెప్పఁబడినది. హనుమంతునికి సీతయున్న ప్రదేశమును జెప్పిన సంపాతియు, సీతను గొనిపోవునపుడు రావణున కడ్డుపడి యుద్ధముచేసి చనిపోయిన సంపాతితమ్ముఁడు జటాయువును, గరుడజాతిలోనివారేమైయున్నారు. ఆకాలమునందు వాసుకి యనునాగరాజుచేఁ బరిపాలింపఁ బడుచున్న భోగవతీపుర మిప్పటి వస్తర (బస్తరు) రాజ్యములోని ప్రాగ్భాగమున నున్నట్లుగఁ గాన్పించుచున్నది. అట్టి వస్తరరాజ్యముయొక్క పదునొకండవ, పండ్రెండవ, పదుమూఁడవ శతాబ్దముల చరిత్రమునే సంగ్రహముగా నీప్రకరణమునఁ దెలుపఁ బోవుచున్నాఁడను. ఆకాలమునం దీప్రదేశము చక్రకోట్యమండలమను పేరఁ బరఁగుచుండెను. ఆంధ్రభారతకృతిపతియైన రాజరాజనరేంద్రునకును, అతనికుమారుండైన రాజేంద్రచోడుఁ డను నామాంతరముగల మొదటి కులోత్తుంగచోడచక్రవర్తికిని సమకాలికుఁడైన ధారావర్షుఁడను నాగరాజాకాలమున నీచక్రకోట్యమండలమును స్వతంత్రుఁడై పరిపాలనము సేయుచుండెను.

## చక్రకోట్యమండలము.

ఈ చక్రకోట్యమండలమునకు రాజధాని చక్రకోట్యమే. ఈ పట్టణమునుబట్టి దేశమునకు నీ నామమే గలిగినది. చక్రకోట్యమే

చక్రికూట మని శాసనములయందు వాడఁబడుచు వచ్చినది. చక్రకూట మనునది చిత్రకూటముయొక్క తప్పుపేరని తోఁచెడిని. చిత్రికూటమను గ్రామ మొకటి యిప్పటి వస్తర ( Bastar ) రాజ్యములోని యింద్రావతినది యొడ్డున నున్నది. ఇంద్రావతియను నది వస్తరరాజ్యముగుండ ప్రవహించి గోదావరిలోఁ గలియుచున్నది. ఇందరినది యనిగూడ దీనికిఁ బేరుగలదు. చిత్రకూటము రామాయణములోఁ జెప్పఁబడిన చిత్రకూటాద్రి కాదు. ఈ చిత్రకూటము పురాణ ప్రసిద్ధమయినదిగఁగూడ గన్పట్టుచున్నది. శిశునాగవంశములో జనించిన నందరాజులలోఁ గడపటివాఁడగు మహాపద్మనందుఁడు మగధదేశమును బరిపాలించుకాలమున నీ చిత్రికూట రాజ్యమును మందనాథుఁ డనువాఁడును, ఆంధ్రరాజ్యమును కాకులుడనువాఁడును పాలనము సేయుచుండిరనియు వీరలును మఱికొందఱు రాజులును గలిసి మహాపద్మనందునితో యుద్ధముచేసి యోడిపోయి చెఱబెట్టఁబడి తదాదిగ నారాజులెల్లరును క్షత్రియోచిత సంస్కారములకు నెల్ల వెలియై శూద్రప్రాయులైపోయిరనియు మార్కండేయోత్తర పురాణమునందుఁ జెప్పంబడియెను. అఱవశాసనములందు చక్రకోట్యము సక్కరకొట్టమని వ్రాయఁబడినది. ఇప్పటి బస్తరరాజ్యము మధ్యమాగాణములలోనిది. గోదావరి జిల్లాకుఁ బశ్చిమోత్తరమునను విశాఖపట్టణములోని జయపురసంస్థానమునకుఁ బశ్చిమమునను నున్న గోండ్వానాదేశములో నున్నది. అనఁగాఁ జిత్రికూట రాజ్యము దక్షిణకోసల చేదిరాష్ట్రములకును కళింగాంధ్రదేశములకును నడుమ నున్నది. దీని కిప్పటి రాజధాని జగదళపురము. కాకతీయప్రతాపరుద్రుని తమ్ముఁడగు అన్నమదేవుని సంతతివారిప్పు డీదేశమును బరిపాలించుచున్నారు.

## జగదేకభూషణధారావర్ష మహారాజు.

ఆంధ్రభారత కృతిపతియైన రాజరాజనరేంద్రుఁడు రాజమహేంద్రపురము రాజధానిగా వేంగీరాష్ట్రమునుబరిపాలించుచుండిన కాలమునఁ బదునొకండవ శతాబ్దమధ్యమున జగదేకభూషణ ధారావర్ష మహారాజు చక్రకొట్య మండలమును బాలించుచుండెను. రాజరాజనరేంద్రుని పుత్త్రుఁడును యువరాజును నగు రాజేంద్రచోడుఁడు చక్రకొట్యముపై దండెత్తివచ్చి యాపట్టణమును ముట్టడించి యీధారావర్షునితో యుద్ధముచేసి జయించి యితనివలనఁ గప్పముగైకొని దక్షిణకోసలములోని వాయిరానగరమును (వజ్రాకరము)ముట్టడించి యాదేశములోని యనేక గజయూధములను బట్టికొని పోయెనని రాజేంద్రచోడుని శాసనములయందుఁ జెప్పబడినది.1 వజ్రపురము మిక్కిలి పురాతనమైన పట్టణముగఁ గానిపించుచున్నది. క్రీస్తుశకారంభమునఁ గావేరీ తీరమున నొరయూరు రాజధానిగ ద్రావిడదేశమును బరిపాలించుచు సుప్రసిద్ధిగాంచియుండిన కరికాల చోడ చక్రవర్తి పైని జెప్పఁబడిన వజ్రపురాధిపతితో సఖ్యము గలిగియుండెనని శిలప్పదికార మనుద్రావిడ కావ్యమునందుఁ జెప్పఁబడి యున్నది.2 జగదేకభూషణ బిరుదాంచితుఁడగు ధారావర్షునియొక్క పూర్వులచరిత్రము దెలియరాదు. ఇతనికుమారుఁడగు సోమేశ్వరుని కృష్ణపుర ( Kuruspal ) శాసనమున వంశావళి చెప్పఁబడియున్నదిగాని యాభాగమునందలి యక్షరములు శిథిలము లయిపోయినందున వంశావళి చక్కఁగా నవగాహము కాకున్నది. ఈ ఈ ధారావర్షునకుఁ బూర్వమున నొక ధారావర్షుఁడు పేరొకనఁ

1. South. Ind Inscriptions Vol. III. PP. 132 and 140 and Vol. 11. P. 235.

2. The Tamils 1800 Years ago P. 67; Silappathigaram, V. II. P. 140.

బడి వానివంశమునం దీధారావర్షుఁడు జనించినటులఁ జెప్పఁ బడియెను. కన్నడమండలములలోని రాజవంశములనుగూర్చిన చరిత్రమును వ్రాసిన డాక్టరు ఫ్లీటుదొరగారు సింధుకులులను (సైంధవులను) మూఁడు శాఖలవారిని చేర్కొనియున్నారు. అందు మొదటి రెండు శాఖలవారును పశ్చిమచాళుక్య చక్రవర్తులకు సామంతులై యుండిరి. మొదటిశాఖ యెలుబరగి శాఖయందురు. బొంబాయి రాజధానిలో బీజపురమండలములోని బాగలకోటపట్టణమునకుఁ బది మైళ్ళ దూరముననున్న భైరామట్టియను గ్రామమున మహాసామంత మండలేశ్వరుఁడైన నాగాదిత్యునిచే వ్రాయింపఁబడిన యొక శాసనమున నీ సింధువంశోత్పత్తినిగూర్చిన యొక చిన్నగాథ పేర్కొనఁబడినది. ఈ సైంధవులు నాగజాతివారనియు, అనంతుఁడు వాసుకి తక్షకుఁడు మొదలగు నాగరాజులయొక్క ప్రతిబింబములను ధ్వజమునందుఁగల నాగధ్వజులనియు, వ్యాఘ్రలాంఛనులనియు, భోగవతీ పురాధీశ్వరులనియు స్పష్టముగ వర్ణింపఁబడియున్నారు. ఈ సింధువంశముయొక్క మూలపురుషుఁడు సింధునదీగర్భదేశమునందలి అహిక్షేత్రపురమునందు ధారణేంద్రుఁడను నాగరాజునకు మానవరూపమున జనించిన పుత్త్రుఁడై యుండెనఁట!

అతఁడు జనించిన పిమ్మట నొక వ్యాఘ్రముచేఁ బెంపఁబడియెనఁట! అతఁడు కదంబరాజపుత్త్రికను బెండ్లాడఁగా వారలకు మూవురుపుత్త్రులు కలిగి సింధురాజవంశస్థాపకులైరి. తరువాత ముప్పదియొక్కరు రాజులు జనించి ప్రభుత్వము చేసిరి. తరువాత సైంధవుఁడు; అటుపిమ్మట కమ్మరాజు (కమ్మయరాజు) జనించెను. అతనికి సాగరాంబయందు పులికాలుఁడు జనించెను. పులికాలునకు రేవకాంబయందు నాగాదిత్యుఁడు జనించెను. నాగాదిత్యునకు పోలాంబయందు పోలయసింధువు పుట్టెను. వానికి ఖాండవమండలేశ్వరుని

తనయయగు బిజ్జలదేవియందు సేవ్యరాజు పుట్టెను.1 ఈపైన పేర్కొ-
నంబడిన పోలయసింధురాజును వాని కొడుకు సేవ్యరాజును చక్రి
కోట్యమండలేశ్వరుఁడైన జగదేకభూషణధారా వర్షునకును సోమేశ్వ
శ్వరునకును సమకాలికులై యున్నారు. కాఁబట్టి ధారావర్షుఁడు పైని
జెప్పిన రాజవంశమునకు సంబంధించిన వాఁడై యుండవచ్చునని
తోఁచుచున్నది. మఱియును పల్లవులు, చాళుక్యులు, రాష్ట్రకూటులు,
మొదలగు వారివలెనే యీనాగవంశజులును ఉత్తరహిందూ
స్థానమునుండి దక్షిణహిందూ స్థానమునకు వచ్చినవార మని చెప్పు
కొనుచున్నటుల పై నుదహరింపఁబడిన బైరాగ్ మట్టి శాసనమువలన
బోధపడుచున్నది గాని, యితరాధారము లేవియును బరిశోధింపకుండ
నీశాసనములోని గాథలను విశ్వసింపరాదు.

ఈజగదేకభూషణ ధారావర్షమహారాజునకు చంద్రాదిత్యుఁ
డను నాతఁడు సామంతుఁడుగ నుండెను. ఇతఁడు తాను కరికాల
చోడవంశజుఁడ ననియు, కాశ్యపగోత్రుఁడ ననియుఁ జెప్పుకొనియుం
డుటచేతఁ దెనుఁగుచోడుల తెగలోని వాఁడుగఁ గనుబట్టుచున్నాఁడు.
ఇతని శాసనముపైని సింహలాంఛనము గలదు. శాసనపరిశోధకు
లితనిశాసనములం బరిశీలించి యితఁడు రేనాటిచోడులలోని వాఁడని
సిద్ధాంతీకరించిరి.2 ఇతఁడు మొదటి కులోత్తుంగ చోడచక్రవర్తితో
నీదేశమునకు దండెత్తివచ్చి ధారావర్షుఁడు కులోత్తుంగచోడ చక్రి
వర్తికిఁ గప్పము చెల్లించి యొడంబడిక చేసికొన్న తరువాత నిచ్చ
టనే నిలిచిపోయి ధారావర్షునికి సైన్యాధిపతిగను, సామంతుఁడుగ
నుండె నని తోఁచుచున్నది. చంద్రాదిత్యుఁడు తన రాజధాని యగు
వరశూర పట్టణమునందు (Modern Barsur) చంద్రాదిత్యసముద్రి
మనుపేరిట నొక ఘనతటాకమును నిర్మించెను. ధారావర్షునియొక్క-

1. Ep. Ind. Vol. III. P. 231.
2. ఆంధ్రుల చరిత్రములోని ప్రథమభాగము పేజి ౩౫౦.

యంగీకారమునుబొంది వడ్డనాడులోని యొక గ్రామమును సయితము నా శివాలయమునకు దానము చేసెను. వడ్డనా డనునది విశాఖపట్టణ మండలములోని వడ్డాదిప్రాంతప్రదేశమై యున్నది. జగదేక భూషణ ధారావర్షమహారాజునకు గుండమహాదేవియందు సోమేశ్వరుఁ డను కుమారుఁడు జనించెను.

## రాజభూషణ సోమేశ్వర మహారాజు.

ధారావర్షునకు వెనుక చక్రకూట రాజ్యాధిపత్యమున కై వాని కుమారుఁడగు సోమేశ్వరునకును వాని దాయాది యగు మధురాంతక దేవునకును వివాదము పొసఁగి యుద్ధము జరిగినటుల శాసనములందు గానంబడుచున్నది. ధారావర్షుఁడు చక్రకోట్యమండలమును బరిపాలించుకాలముననే వానికి లోఁబడిన సామంతుఁడుగనో లేక స్వతంత్రుఁడుగనో మధురాంతకదేవుఁ డను నాగరాజు భ్రమరకోట్యమండలమును బరిపాలనము సేయుచున్నటుల మధురాంతకదేవుని రాజపురశాసనము వలనఁ దెలియుచున్నది.1 తదితర నాగవంశోద్భవు లయిన చక్రకూటరాజులవలెనే మధురాంతకదేవుఁడును తాను నాగవంశోద్భవుఁడ ననియు, భోగవతీపురవరాధీశ్వరుఁడ ననియు, వ్యాఘ్రలాంఛనము గలవాఁడ ననియు, నాగధ్వజము గలవాఁడ ననియు, మహేశ్వర పాదారాధకుఁడ ననియుఁ దనశాసనమునందుఁ జెప్పుకొనియున్నవాఁడు. భ్రమరకోట్యమండల మనునది చక్రకోట్యమండలములో నొకభాగముయొక్క నామమో, లేక చక్రకోట్యమండలమునకు నామాంతరమో బోధపడదు. ధారావర్షుఁడు చక్రకోట్యమండలమును బరిపాలించుచుండఁగా నామండలముననే మధురాంతకదేవుఁడు స్వతంత్రుఁడై పరిపాలనము సేయుచుండె

Annual Report on Epigraphy, 1909. Para 65. (పుట ౧౧౯)
1 Ep. Ind. Vol. IX. P P. 174-181,

ననుట విశ్వాసపాత్రముగాదు. ధారావర్షునకు మధురాంతకదేవుఁడు సామంతుఁ డనియే యూహింపవలసి యున్నది. అయినను భావిపరి శోధనమువలననే యీవిషయ మిదమిత్థ మని నిర్ణయింపవలయును.

మధురాంతకదేవుఁడు శా. శ. ౯౮౭ వది యగు ప్రభవ సంవత్సర కార్తికశుద్ధ బుధవాసరానూరాధానక్షత్రియుక్త శుభ లగ్నమునందు కన్నరదేవ రాజకుమారునియొక్కయు, పట్టమహిషి నాగలమహాదేవి యొక్కయు, నాయక కుమారుని యొక్కయు, శూద్రికనాయకునియొక్కయు, తుంగరాజ కుమారునియొక్కయు, పుల్లమసెట్టియొక్కయు సమ్మతిని గైకొని మేడిపాత్రుఁ డను బ్రాహ్మ ణునకు భ్రిమరకోట్యమండలములోని రాజపురగ్రామమును ధారా పూర్వకముగ దానముచేసెను. ఈరాజశాసనము నతిక్రమించి యీ దానమునకు భంగముకలిగించువారు కాశికానగరములో వేయిలింగ ములను బ్రద్దలు కొట్టినప్పుడును, వేయిమంది బ్రాహ్మణులను నాలుగు వేల గోవులను జంపినప్పుడు నెట్టిపాపమును బొందుదురో అట్టి పాప మునే పొందుదు రని గూడ శ్లోకములు రచింపఁబడినవి. శ్రీధరేశ్వర నాయకుఁడు, నాగహస్తి, కరణదరియా యను వారలు సాక్షులుగను, ధేనుకాకాయస్థుఁడు లేఖకుఁడుగను బేర్కొనఁబడిరి. కుమారతుంగ రాజు, ధమదేవుఁడు, గోవర్ధనుఁడు, దనార్ధనుఁడు, గాగిరపాత్రిఁడు, సాధుసారంగుఁడు, వీరలచేతఁ గలము ముట్టఁబడియె ననియు, ఇది మానవృద్ధియొక్క స్వహస్తలిఖిత మనియు, ఇయ్యది జనసామాన్యాభి ప్రాయమును వెల్లడించుచున్నదనియు నాశాసనమునందు వ్రాయఁబడి యున్నది.

ఇట్టి మధురాంతకదేవు డేకారణముచేతనో చక్రికోట్యమండ లము నాక్రమించుకొని బరిపాలనము సేయుచుండఁగా ధారావర్షుని

పుత్త్రుఁడగు సోమేశ్వరదేవుఁడు వానిని జయించి యుద్ధరంగమునఁ జంపి సింహాసన మెక్కినటుల సోమేశ్వరుని కృష్ణపుర (Kuruspal) శాసనముంబట్టి దెలియుచున్నది. ఇతఁడు వింధ్యవాసినీ దేవతయొక్క యనుగ్రహముచేఁ దన కీచక్రకకూటసామ్రాజ్యము లభించెనని తన శాసనము లందుఁ జెప్పికొనియుండుటకూడ నీతనికిఁ బూర్వ మీ రాజ్యము మధురాంతకదేవునిచే నాక్రమింపఁబడి పరిపాలింపఁ బడు చుండెనని సూచనగఁ దెలుపుచున్నది. ఇతని కృష్ణపురశాసనములలో నొకదానియందు సమకాలికులగు రాజులపేరు లెన్నియో పేర్కొనఁబడినవి గాని, యాభాగ మంతయు శిథిలమై యుండుటచేత నంతగాఁ బ్రయోజనకారి గాకయున్నది. నారాయణ పురము (Narayanapal) శాసనమునందుంబోలె నీకృష్ణపురశాసనమునందును నాగరాజుల బిరుదావళి పేర్కొనఁబడియున్నదిగాని యంతకన్న విశేషాంశము లేవియుఁ గానరావు. తక్కిన శాసనములందుంబోలె నీశాసనమునందును సోమేశ్వరుఁడు నాగవంశజుఁ డనియు, కశ్యప గోత్రుఁ డనియుఁ బేర్కొనఁబడియెను. మఱియును మహారాజాధి రాజ పరమభట్టారక పరమమహేశ్వర సోమేశ్వర దేవుఁడని వర్ణింపఁబడి యుండుటచేత నాగరాజులలో నితఁడు మిక్కిలి పరాక్రమ వంతుఁడయిన స్వతంత్రరాజని వేద్య మగుచున్నది.

## మొదటిసోమేశ్వరుని విజయయాత్రలు.

రెండవ ధారావర్షుని కొడుకగు నితఁడే చక్రకోట్యమండల మును బాలించిన సోమేశ్వరనాము లయిన నాగరాజులలో మొదటి వాఁడుగ నున్నవాఁడు. ఇతఁడు విజృంభించి శత్రురాజ మండలిపైఁ గవిసి వారల రాజధాను లగు కళింగనగరము, లంజిపురము, రత్న పురము, ఌవణపురి, వేంగీనగరము, భద్రపట్టణము, వజ్రపురము,

మొదలగు వానిని ముట్టడించి జయించినట్లుగఁ దెలియుచున్నది. నారాయణుఁడు మధురాక్షసుని నిర్జించినవిధముగా మొదట సోమేశ్వరుఁడు మధురాంతకదేవుని సంహరించి పిన్ననారాయణుఁ డన్న బిరుదనామమును వహించి యటుపిమ్మట శత్రువర్గముపై పునకుఁ దిరిగెను. ఆకాలమునందు భూపరిపాలనము చేయురాజులు మొదలగువారుమత్సరగ్రస్తులై యొండొరులరాజధానీనగరంబులను దహించుటయేయొకఘనకార్యముగాఁ దలపోయుచుండిరి అప్పటియాచారమును బట్టి చక్రకొట్యమండలాధిపతియైన సోమేశ్వరుఁడు వేంగీదేశముపై దండెత్తివచ్చి వేంగీపురమును దహించినట్లు మిక్కిలి డంబముగాఁ దన కృష్ణపురశాసనమునందుఁ జెప్పుకొనియున్నాఁడు.1 అయినను వేంగీరాజ్యమునుబరిపాలించిన మహారాజులు నయితము చక్రకూట రాజధానిని దహించినట్లుగాఁదమ శాసనములందుఁజెప్పుకొనియేయున్నారు. ఇట్లొండొరుల రాజధానులను దగులంబెట్టుట సత్యమే కావచ్చును. ఈసోమేశ్వరునికాలమున మొదటికులోత్తుంగ చోడచక్రవర్తికుమారుఁడైన వీరచోడమహారాజు తండ్రికిఁ బ్రతినిధిగానుండి వేంగీరాష్ట్రమును బరిపాలనము సేయుచుండెను. ఇతనినామముకూడ సోమేశ్వరుని శాసనమునం దుదాహరింపఁ బడినది. వేంగీపుర మనునది ప్రాచీన వేంగీపురము కాదు. ఆకాలమునందు వేంగీపురమునకు రాజధానిగనుండిన రాజమహేంద్రపురమే వేంగీపురముగాఁ బరరాష్ట్రాధిపతులచేఁ బేర్కొనంబడుచుండె నని తోఁచుచున్నది. కాఁబట్టి వేంగీరాష్ట్రాధిపతులైన చాళుక్యచోడులకును, చక్రకొట్యమండలాధిపతులయిన నాగరాజులకును బలుమాఱు యుద్ధములు జరుగుచుండె ననుట వాస్తవము. ఇతఁడు వేంగీపురమును మాత్రమేగాక వజ్రపురప్రాంతదేశమునందలి యరణ్యముల నన్నిటిని దహింపించె నని

1. Epigraphia Indica Vol X No 4.

చెప్పఁబడియెను. మఱియును దక్షిణకోసలముపై దండెత్తిపోయి ఆఱులక్షలతొంబదియాఱు గ్రామములను గైకొనియెనని సోమేశ్వరుని శాసనమున వ్రాయంబడినది. ఇది వట్టి యతిశయోక్తిగాని వేఱొండు గాదు. దక్షిణకోసలమునం దన్ని గ్రామములు కలవాయని సందేహింపవలసి యున్నది. ఒకవేళ నిజమనుకొన్నను సోమేశ్వరుఁడు నిజముగా దక్షిణకోసలమును బరిపాలించె ననుమాటను సమర్థించుటకు సప్రమాణమైన యాధార మేమియును గానరాదు. ఇతఁడు దక్షిణకోసలదేశముపై దండెత్తిపోయి తిరిగి వెడలఁగొట్టఁబడువఱకుఁ గొంతభాగ మాక్రమించుకొని యుండవచ్చును. ఇయ్యది జజల్ల దేవునిశాసనమునుబట్టి యూహింపఁబడుచున్నది. జజల్ల దేవుఁడు రత్నపురము రాజధానిగ దక్షిణకోసలమును బరిపాలనము సేయుచు క్రీ. శ. ౧౧౧౪ వ సంవత్సరమున నొకశాసనము వ్రాయించెను. అందతఁడు సోమేశ్వరునిం బట్టుకొని యసంఖ్యాకమైన శత్రుసైన్యమును రూపుమాపెనని గొప్పగా వ్రాయించుకొనియెను. సోమేశ్వరుఁ డెవ్వఁడో వివరమును దెలుపలేదుగాని సంగతి సందర్భములను విచారింపఁగా నాసోమేశ్వరుఁడే చక్రకొట్యమండలాధిపుఁ డయిన యీ సోమేశ్వరుఁడే యని తేటపడుచున్నది. మఱియు క్రీ. శ. ౧౧౧౧ వ సంవత్సరమున వ్రాయఁబడిన నారాయణపుర శాసనములో సోమేశ్వరుని మరణానంతరమున కన్హారదేవుఁడు సింహాసన మెక్కెనని స్పష్టముగఁ దెలియుచున్నది.1 వరశూరపుర (Bursur) శాసనముంబట్టి క్రీ. శ. ౧౧౦౮ దవ సంవత్సరమున సోమేశ్వరుఁడు జీవించియుండెనని తెలిసికొనుచున్నారము.2 రత్నపురశాసనము క్రీ. శ. ౧౧౧౪ వ సంవత్సరమున వ్రాయఁబడినది. ఈసంవత్సరములయొక్క సామీప్యసంబంధమును బట్టి మన మీవిషయమున

1 Ind. Ant Vol IX P 161. 2. Ibid P 162.

నంతఁగా సందేహింపవలసిన పనిలేదు. సోమేశ్వరుని శాసనము నందుఁ బేర్కొనంబడిన లంజికప్రాంతదేశము బాలఘట్టము మండలములోనిది. లవణపురప్రాంతదేశము రాయపురమండలములోని ప్రాగ్భాగమే కాని యన్యముకాదు. వజ్రపురము మిక్కిలి పురాతనమైనపట్టణ మనియు, ప్రాచీన ద్రావిడభాషా సారస్వతమునం బేర్కొనఁబడుచు వచ్చినదనియు వాయిరానగర మనుపేరిట ద్రావిడ శాసనముల వాడఁబడుచు నేనుఁగులకుఁ బ్రసిద్ధిఁజెందినటులఁ జెప్పఁబడినదనియు నిదివఱకే చెప్పియున్నాను. వజ్రపురము ప్రాచీన కాలమున నెట్టిప్రసిద్ధిని గాంచియుండినను ౧౦, ౧౧ వ శతాబ్దముల యందంత పేరువహించి యుండలేదు. వజ్రపురము వజ్రపుగనులకు బ్రసిద్ధికెక్కియున్నటులఁ జెప్పఁబడినది. వజ్రపుర మనునది చాందా మండలములోని వైరఘుర్ (Wairagarb) లేక భైరవఘుడా యనునదియేగాని యన్యముగాదని తోఁచుచున్నది. ఇయ్యది పురాతన కాలమునుండి వజ్రపుగనులకుఁ బ్రసిద్ధికెక్కినది. ఒకప్పుడు దంతావళములకును, బొమ్మలద్దినబట్టలకును, దున్నలకును గూడఁ బ్రసిద్ధికెక్కినది. అగ్బరుచక్రవర్తికాలమునందును, బహమనీరాజులకాలమునందును బ్రఖ్యాతివహించియుండిన దని మహమ్మదీయచరిత్రములవలన స్పష్టమగుచున్నది.1 అక్బరుకాలమునం దీపట్టణమును చందుఁడను గోండురాజు పరిపాలనము సేయుచుండెను. అచ్చటి పురాతనములై శిథిలము లయిన శిలాప్రదేశములు మొదలగువానిం జూచినను స్థానికచరిత్రములను విన్నను మానవంశజులయిన రాజులచ్చట పరిపాలనము చేసియుండిరని తేటపడఁగలదు. ఈమానజాతి శాఖవారెవ్వరో స్పష్టపడదుగాని నాగజాతివారిలో నొకశాఖవారని

1 Aini Akbari; Gārret's Edition Vol III PP 229 Ind Ant Vol XXVIII P 286.

తోఁచుచున్నది. వారలు మాణిక్యదేవిపేరిట దుర్గను బూజించుచుండిరి. భద్రపట్టణము భద్రావతి యని చెప్పంబడుచుండెను. ఈ భద్రావతి యొకప్పుడు దక్షిణకోసలమునకు రాజధానిగ నుండెను. ఇయ్యది వజ్రపురమునకు (Wairagarh) 20 మైళ్ళదూరమున నున్నది. దీనినే యిప్పుడు భాండక్ అని చెప్పుచున్నారు.

ఈ చక్రకూటరాజుల శాసనములు కొన్నినాగరలిపిలో సంస్కృతమునను, మఱికొన్ని తెలుఁగునను వ్రాయఁబడినవి. చక్రకోట్యమండలము నడుమ నింద్రావతీనది ప్రవహించుచున్నది. దీనికుత్తరభాగమునఁ బుట్టిన శాసనములన్నియు సంస్కృతమున నాగరలిపిలో నుండుటచేతను, ఇంద్రావతీనదికి దక్షిణభాగమునఁ బుట్టిన శాసనములు తెలుఁగునం దుండుటచేతను, ఉత్తరభాగమున గోండు భాషయును, దక్షిణభాగమునఁ దెలుఁగుభాషయును వ్యవహరింపఁబడుచుండినట్లుగా నూహింపఁబడుచున్నవి. ఈ నాగరాజుల తెలుఁగు శాసనము లింకను పెక్కులు ప్రకటింపఁబడియుండలేదు. ఈ మొదటి సోమేశ్వరుని కృష్ణపుర సంస్కృతశాసనములు మాత్రము ప్రకటింపఁబడినవి. ఈ సోమేశ్వరునకు శాసన మహాదేవి, ధారణమహాదేవియను నిరువురు రాణులుగలరు. ధారణమహాదేవి దానధర్మములనుగూర్చిన శాసనములు రెండు కృష్ణపురమునందుఁ (Kuruspal) గానంబడుచున్నవి. ఈ గ్రామము ఇంద్రావతీనదికిఁ బైనొక మైలుదూరములో నున్నది. ఇప్పటి రాజధానియగు జగదళపురమునకు ౨౨ మైళ్ళ దూరమున నున్నది. నారాయణపురమును తమిరపట్టణమును కృష్ణపురమునకు సామీప్యముననే యున్నవి. సోమేశ్వరుని రెండవరాణియగు ధారణమహాదేవి కృష్ణపురములోని శ్రీకామేశ్వరస్వామికిఁ బెక్కుభూదానములనుజేసి శాసనములను వ్రాయించెను. అందు విశేషచరిత్రాంశము లేవియును లేవుగాని, రైతులు మొదలగువారి

నామములును సోమేశ్వరుని బిరుదావళులు పెక్కులును పేర్కొనఁబడినవి. ఇతఁడు మహేశ్వర పాదారాధకుఁడనియు, మాణిక్యదేవి పాదారాధకుఁడనియుఁ జెప్పఁబడియుండుటచేత నీతఁడు శైవుఁడు శాక్తేయుఁడుననుటకు లేశమాత్రమును సందియములేదు. ఇతనికి మసకిదేవియను తోఁబుట్టువు కలదు.

## కన్నరదేవమహారాజు.

మొదటి సోమేశ్వరునకుఁ బిమ్మట వాని పుత్త్రుఁడు కన్నారదేవుఁడు రాజ్యభారమును వహించెను. శా. శ. ౧౦౫౩ ఖరసంవత్సర మనఁగా క్రీ. శ. ౧౧౧౧-౧౨ వ సంవత్సరమున వ్రాయఁబడిన నారాయణపుర ( Narayanapal ) శాసనములోని వాక్యసముదాయమునుబట్టి యాసంవత్సరముననే మహారాజాధి రాజయిన సోమేశ్వరుఁడు మరణము నొందఁగా నాతని కొడుకు కన్నారదేవ మహారాజు సింహాసన మెక్కెనని తేటపడుచున్నది. మఱి రెండు శిథిలములయిన శాసనములందు కన్నరదేవుని నామము గానంబడుచున్నదిగాని యాశాసనములకాలము చెప్ప.బడనందున నాతనికి నీకన్నరదేవునకుఁ గల సంబంధము దెలియరాకున్నది. భావిపరిశోధనముల వలనఁగాని వారిరువు రొక్కరగుదురో కారో చెప్ప వలనుగాదు. ఈకన్నరదేవ మహారాజునుగూర్చిన చరిత్రాంశము లేవియును దెలియరాకున్నవి.

## జగదేకభూషణవీరసోమేశ్వరమహారాజు.

కన్నరదేవ మహారాజునకుఁ బిమ్మట నెవ్వరు సింహాసన మధిష్ఠించిరో చరిత్రమున గోచరము గాకయున్నది. అయినను జాలకాలమునకు జగదేక భూషణవీరసోమేశ్వర మహారాజు శాసనములు

గానిపించుచున్నందున భావిపరిశోధనమున సత్యము దెలియు
వఱకు కన్నరదేవ మహారాజునకుఁ దరువాత జగదేకభూషణ వీర
సోమేశ్వర మహారాజే రాజ్యభారమును వహించె నని యూహింప
వచ్చును. సోమేశ్వర నామమును వహించిన వారిలో నీతఁడు రెండవ
వాఁడుగ నున్నాఁడు. కొందఱు మొదటిసోమేశ్వరుఁడు నీతఁడు
నొక్కఁడే యని సమర్థించుటకుఁ బ్రయత్నించిరిగాని వారివాదము
సరియైనది కాదు. ఈవిషయము రెండవసోమేశ్వరుని నాగపురశాస
నమువలన స్పష్టపడుచున్నది. మొదటి సోమేశ్వరునకు రాజభూషణ
బిరుద ముండఁగా నీరెండవసోమేశ్వరునకు జగదేకభూషణ బిరుదము
శాసనములందుఁ జెప్పఁబడినది. మొదటిసోమేశ్వరుని రాణులు శాస
నమహాదేవియును, ధారణమహాదేవియు నైయుండఁగా నీరెండవ
సోమేశ్వరునిరాణి గంగామహాదేవి యని పేర్కొనంబడినది. అతఁడు
పదునొకండవశతాబ్దాంతమునందును, పండ్రెండవ శతాబ్దాదియం
దును నున్నవాఁడు ఇతఁడో పండ్రెండవ శతాబ్దాంతమునందును
పదమూఁడవ శతాబ్దాదియందును నున్నవాఁడు. గనుక వీరి
రువురును భిన్ను లని తలంపక తప్పదు. ఈ రెండవ సోమేశ్వరుని
తెలుఁగుశాసన మొకటి నాగపురము మ్యూజియములో
నున్నది.1 ఈశాసనము మొదట సిరువంచనుండి నాగపురము
నకుఁ బంపఁబడినది. ఇతర శాసనముల నాగరాజులకుంజెప్పఁ
బడిన బిరుదములే యీతనికిని జెప్పఁబడినవి. ఈవీరసోమేశ్వరునకు
రాణియైన గంగామహాదేవి తన భర్తపేరిట వీరసోమేశ్వరాల
యమును, తనపేరిట గంగాధరేశ్వరాలయమును, అను రెండుశివాల
యములను ప్రతిష్ఠించి భర్త యంగీకారమును గైకొని మహాప్రధాని
యైన మాండలిక సోమరాజు యొక్కయు, కార్యకర్తలయిన దామెం

1. Epigraphia Indica Vol III P 314,

దరనాయకుని యొక్కయు, మెంతమనాయకునియొక్కయు, చెంచన పెగ్గడయొక్కయు, దౌవారికు లయిన సోమినాయకునియొక్కయు, గడ్డపు ఈరపరెడ్డియొక్కయు, విరుచుడ్ల ప్రభుయొక్కయు, పరకోట కొమ్మనాయకునియొక్కయు సమక్షమున కేరమరక యను గ్రామముపై వచ్చునట్టి రాబడిని పైశివాలయములకు శా. శ. ౧౧౩౧ సంవత్సరఫాల్గునశుద్ధ ౧౨ భానువారమునాఁడు (అనఁగా క్రీ. శ. 1210 సంవత్సరము ఫిబ్రవరినెల 7 వ తేది) దానము చేసెను. కన్నరదేవ మహారాజుయొక్క నారాయణపుర శాసనమునకును గంగామహాదేవియొక్క యీ శాసనమునకు నడుమ నూటేండ్ల వ్యవధి గానవచ్చుచున్నది. ఇద్దఱు మహారాజు లింత దీర్ఘకాలము పరిపాలించి నారనుట కొంచెము సందేహాస్పదముగ నుండకమానదు. ప్రస్తుత మీశాసనములవలన నింతకన్న నధికము తెలియరాదు.

## జగదేకభూషణ నరసింహదేవమహారాజు.

జగదేకభూషణ వీరసోమేశ్వర మహారాజునకుఁ బిమ్మట నాతని కుమారుఁడయిన జగదేకభూషణ నరసింహదేవ మహారాజు రాజ్యాధిపత్యము వహించినటుల నాతనికాలమునాఁటి రెండుతెలుఁగు శాసనములవలనఁ దెలియుచున్నది. ఇతనితల్లి గంగాదేవి యని చెప్పఁబడుటచేతను, గంగాదేవి జగదేకభూషణ వీరసోమేశ్వరమహారాజునకుఁ బట్టమహిషియై యనేక దానధర్మములు చేసియుండుట చేతను, ఈనరసింహదేవమహారాజు వీరసోమేశ్వరమహారాజుయొక్క తనయుఁడే యనియు, అతని మరణమున కనంతరము రాజ్యమును వహించినాఁడనియు నూహింపఁబడు చున్నాఁడు. ఇతరనాగరాజులకుం గల బిరుదావళులే యితసంగూర్చి ప్రశంసించిన శాసనముల యందును బేర్కొనఁబడినవి. ఒకశాసనము దంతివాడ(Dantewara)

యందును, మఱియొక శాసనము యశఃపురము (Jasanpal) నందును వ్రాయఁబడినవి[1]. దంతివార లేక దంతివాడ (దంతీశ్వరము) ఇంద్రావతీనదికి దక్షిణమున నున్నది. యశఃపురము దంతివాడకు ౪౦ మైళ్ళ దూరమున నున్నది. ఈరెంటియందును నరసింహదేవునినామము గానంబడుచున్నది. యశఃపురశాసనము శా. శ. ౧౧౪౭ వ సంవత్సరమునను దంతీశ్వరశాసనము శా. శ. ౧౧౪౦ వ సంవత్సరమునను వ్రాయఁబడినవి. అనఁగా క్రీ. శ. ౧౨౧౮ వ సంవత్సరమునను క్రీ. శ. ౧౨౨౪ వ సంవత్సరమునను జగదేక భూషణ నరసింహదేవ మహారాజు చక్రకూటరాష్ట్రమును బరిపాలించుచున్న వాఁడని పైశాసనములనుబట్టి మనకు బోధపడుచున్నది. వీర సోమేశ్వరునకు మహాప్రధానిగనుండిన మాండలిక సోమరాజు నరసింహదేవునకుఁగూడ మహాప్రధానిగ నుండెనని యీ శాసనములలో నొక దానివలనఁ దెలియుచున్నది. ఇతఁ డెంతకాలము పరిపాలనము చేసెనో యది బోధ పడకున్నది.

### రాజాధిరాజ జయసింహదేవ మహారాజు.

నరసింహదేవ మహారాజునకుఁ బిమ్మట రాజాధిరాజ జయసింహదేవ మహారాజు రాజ్యాధిపత్యము వహించెనని స్వర్ణపుర శాసనమునుబట్టి తెలియుచున్నది. ఇయ్యది జయసింహుని భార్యలగు లోకమహాదేవియొక్కయు, శాసన మహాదేవియొక్కయు, దాన శాసనమై యున్నది. పంచప్రధానుల సమక్షమున అధకాడ యను గ్రామమును లోకమహాదేవి దానము చేసియుండెను. శాసనములందు కాలము చెప్పఁబడియుండలేదు. స్వర్ణపురము (Sunarpal) నారా

1. Epigraphia Indica Vol X Ins No 9.

యణ పురమునకు (Narayanpal) పదిమైళ్ళదూరమున నున్నది. జయసింహ దేవునిచరిత్ర మెంతమాత్రమును దెలిసికొనుట కాధారములు గానరాకున్నవి.

### రాజాధిరాజ హరిశ్చంద్ర దేవ మహారాజు.

ఇతఁడు క్రీ. శ. ౧౩౨౪ వ సంవత్సరమునకుఁ బూర్వము చక్రకూట రాష్ట్రమును బాలనము సేయుచుండినటులఁ దమిరె శాసనముంబట్టి దెలియుచున్నది. ఆ సంవత్సర మీ హరిశ్చంద్ర దేవుఁడు మృతినొందఁగా నతనిభార్య మాణిక్యదేవి భర్తతో సహగమనము గావించెనని యీ శాసనమునఁ జెప్పఁబడినది. ఈనాగరాజులు క్రీ. శ. ౧౩౨౯ వ సంవత్సరమువరకును చక్రకూట రాష్ట్రమును బరిపాలనము సేయుచునే యుండిరి.



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## నాల్గవ ప్రకరణము.

### కాకతిరాజుల చరిత్రము.

#### ఆంధ్రదేశస్థితి.

పదునొకండవ శతాబ్ది ప్రారంభమగునాటి కాంధ్రదేశము రెండు విభాగములై పశ్చిమ భాగము పశ్చిమ చాళుక్య చక్రవర్తి యగు నాఱవ విక్రమాదిత్యునిచేతను, ప్రాగ్భాగము వేంగీసామ్రాజ్య మనుపేరిట చాళుక్య చోడచక్రవర్తియైన రాజేంద్ర చోడ చక్రవర్తిచేతను బరిపాలింపఁ బడుచుండెను. చాళుక్య చోడచక్రవర్తియైన రాజేంద్రచోడుఁడు వేంగీచోడసామ్రాజ్యముల రెండింటిని కాంచీపురము రాజధానిగాఁ జేసికొని రెండు సామ్రాజ్యములను బరిపాలింపు చుండెను. ఇతఁడే కులోత్తుంగచోడచక్రవర్తి. ఆంధ్ర మహాభారతకృతి భర్తయైన రాజరాజ నరేంద్రుని కుమారుఁడు. పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన యాఱవ విక్రమాదిత్యుఁడు కళ్యాణ పురము రాజధానిగా పశ్చిమ చాళుక్య సామ్రాజ్యమును బరిపాలనము సేయుచుండఁగాఁ గులోత్తుంగ చోడచక్రవర్తితో వైరము వహించి వేంగీసామ్రాజ్యమును, చోడసామ్రాజ్యమును రెండింటిని గబళింపఁజూచుచుండెను గాని కులోత్తుంగుని జయించుట సాధ్య

ముగాకయుండెను. వేంగీసామ్రాజ్యము నాకాలమున చాళుక్యచోడ చక్రవర్తి పక్షమునఁ బ్రతినిధులుగా నుండి వేంగీసామ్రాజ్యమును వేల్నాటి గొంకరాజు పరిపాలనము చేయుచుఁ దన ప్రభువయిన కుళోత్తుంగుని పేరే "రాజేంద్రచోడు" డని తన కుమారునకుఁ బెట్టెను. క్రీ. శ. 1117 వ సంవత్సరమున వేల్నాటి రాజేంద్ర చోడుని తన కుమారునిగా భావించి వేంగీసామ్రాజ్యమునకు నాతని రాజప్రతినిధిగా నియమించెను. కాని 1118-20 వ సంవత్సరముల ప్రాంతమున చాళుక్య చోడచక్రవర్తి యగు కుళోత్తుంగుఁడు మరణముఁ జెందుటచేతను, 1118వ సంవత్సర ప్రాంతమున ఆతని నాల్గవ కుమారుఁడగు విక్రమ చోడుఁడు వేంగీసామ్రాజ్యమును వేల్నాటి రాజేంద్ర చోడునికి నొప్పగించి తాను నిజరాజధానికిఁ బోయిన యదను గనుపెట్టియుండి యాకస్మికముగాఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియగు విక్రమాదిత్యుఁడగు వేంగీసామ్రాజ్యముపై దండెత్తివచ్చి వేల్నాటి రాజేంద్ర చోడుని జయించి యాదేశమును స్వాధీనము గావించుకొని పరిపాలనము చేయసాగెను. 1120-1124 వఱకు నాలుగు సంవత్సరములకాలము వేంగివిషయమునఁ బశ్చిమచాళుక్యులు పరిపాలనము చేసినట్లు దాక్షారామ భీమేశ్వరస్వామివారి యాలయములోని శాసనముల వలన విశద మగుచున్నది. ఈకాలమున విక్రమాదిత్యుని సేనాధిపతులగు అనంతపాలుఁడు, గోవిందరాజు మొదలగు వారు విక్రమాదిత్యుని పక్షమున వేంగీదేశమును బరిపాలించినట్లుగా వారి శాసనముల వలన విశదమగుచున్నది. 1124 సంవత్సరమున చాళుక్య-చోడ చక్రవర్తియగు విక్రమచోడుఁడు మొదటి వేల్నాటి రాజేంద్రచోడుని సాహాయ్యముతోఁ బశ్చిమచాళుక్య రాజప్రతినిధులను వేంగివిషయమునుండి పాఱఁదోలి వేంగీసామ్రాజ్యమును మరల స్వాధీనము చేసికొని వేల్నాటి రాజేంద్రచోడుని వేంగీసామ్రా

జ్యమునకు మరల రాజప్రతినిధినిగాఁజేసి తిరిగి రాజధానికిఁ బోయెను నాటనుండి పశ్చిమ చాళుక్యులకు వేంగివిషయము స్వాధీనమైయుండ లేదు. పశ్చిమ చాళుక్యులకు సామన్తులై మండలాధీశ్వరులుగానున్న తెలుగుచోడరాజులు కమ్మనాడు, పాకనాడు మొదలగు ప్రదేశములను బరిపాలించువారు స్వతంత్రులై యప్పటప్పట తిరుగుబాటు చేయుచున్నను రాజప్రతినిధిగా నియమింపఁబడిన వేల్నాటి రాజేంద్ర చోడుఁడు వారలను క్రమముగా నోడించి చాళుక్య సామ్రాజ్యమును స్థిరీకరించుటకై ప్రబల ప్రయత్నములు సలుపుచు విజయముగాంచు చుండెను. ఈకాలమునందే అనుమకొండ రాజ్యమున కధిపతిగా నుండిన రెండవ కాకతిప్రోలరాజు సత్యాశ్రయకులతిలకుఁడును, సమస్త భువనాశ్రయ శ్రీపృథ్వీవల్లభ మహారాజాధిరాజ పరమేశ్వర పరమ భట్టారక బిరుదాంచితుఁడైన యాఱవ విక్రమాదిత్య చక్రవర్తికి సామన్తుఁడై యాంధ్రదేశములోని సబ్బిసాహిర మండలమును బరి పాలించుచుండెను. అనుమకొండ రాజ్యమన నిదియెయని గ్రహింప వలసియుండును. ఇతనికిఁ బూర్వులయిన పీనితండ్రి రెండవబేతరాజు, తాతయైన మొదటి ప్రోలరాజ, ప్రపితామహుఁడైన మొదటిబేత రాజు పశ్చిమ చాళుక్యచక్రవర్తులకు సామన్తులుగా నుండి యనుమ కొండ సామ్రాజ్యమును బాలింపుచుండిరని యాప్రాంతముననున్న వీరిశాసనములనుబట్టి కొంతవఱకు విశదమగుచున్నది గాని మొదటి బేతరాజు, మొదటిప్రోలరాజునుగూర్చి యొకింత సంశయాస్పదముగ నున్నది. మొదట వీరు స్వతంత్రముగఁ బరిపాలనము చేసిన మండలా ధీశ్వరులా లేక పూర్వచాళుక్యులకు సామన్తులుగా నుండి తరువాత స్వతంత్రులుగాఁ బరిపాలనముచేసి యటుపిమ్మట పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామన్తులయిరా యను విషయమును విమర్శించి తెలిసికొనవలసియున్నది. అట్టి విషయమును నిర్ధారణముచేయుటకు

సాధనసామాగ్రి యత్యల్పముగా నున్నది. ఈవంశమునకు మూల పురుషునిగా నిటీవల బయలుపడిన యొక శాసనము ననుసరించి

### కాకర్త్యగుండనార్యుఁడు.

కాకర్త్యగుండ్యనార్యుఁడని తలంచుచున్నాముగాని యీతనిగుఱించి మొదటి ప్రకరణమునఁ జేసిన చర్చవలన నితనికిని కాకతిరాజవంశము నకు నెట్టి సంబంధము కలదో తెలియకుండుటచేతను, అతఁడు "సామన్తవృష్టి" కులమని తన వంశమును జెప్పుకొనియుండుట చేతను, అతనికిని కాకతీయ రాజవంశమునకు మొదటివాఁడుగాఁ గన్పట్టుచున్న బేతరాజునకు నడుమ నూఱుసంవత్సరము లంతరా యము గన్పట్టుచున్నందునను, అతఁడు పూర్వచాళుక్యరాజైన అమ్మ రాజ విజయాదిత్యునకును వాని సోదరుఁడైన దానార్ణవునకును సామన్తుఁడుగానుండుటచేతను, అతఁడీ వంశములోనివాఁడు కాఁడేమో యని సందేహించుటకుఁ దగు కారణము లగుపించు చున్నవి. ఎంతమనము చర్చచేసినను అతఁడీ వంశములోని వాఁడేయని చెప్పుట కింకను దృఢమైన ప్రామాణ్యము గాన్పింపవలయునుగదా! అట్టి దేదియు నింతవఱకుఁ గాన్పింపలేదు. ఇతఁడు వేంగీసామ్రాజ్యాధీశ్వ రునకు సామన్తుఁడై క్రీ. శ. 945 – 970 మధ్యకాలమున నతవాటి సీమ నెప్పుడో పరిపాలనము సేయుచుండెనని మాత్రము మనము తెలిసికొని యున్నాము.

### మొదటి బేతరాజు.

ఇతఁడు క్రీ. శ. 975 – 1025 సంవత్సరముల నడుమ పరిపాల నము సేయుచుండెనని శ్రీమాన్ దూపాటి వేంకటరమణాచార్యుల వారు నిర్ణయించి యుండఁగా "కాకతీయ సంచికా సంపాదకు" లీవిషయమునే విస్మరించి మొదటి ప్రోలరాజు కాలము 1050–1080

వఱకునై యుండునని వేసికొని యున్నారు. కాని మొదటిబేత రాజు రాజ్యము చేయుచుండెనని రెండవబేతరాజు వేయించిన ఖాజీ పేట శాసనము వలన స్పష్టమగుచుండఁగా వీనినిగూర్చి విమర్శించి తెలిసికొనుట చరిత్రమున కావశ్యకమైనను విస్మరించుట యుచిత ముగాఁ గనుపట్టదు. ఈతనికాలము రూఢిగాఁదెలిసి కొనుటకుఁ దగిన సాధనము లేమియు నిప్పటికిని లభించియుండలేదు. ఇతఁడు కాకతి రెండవ బేతరాజుచేత లిఖింపఁబడిన ఖాజీపేట శాసనమునుబట్టి పరిశీ లించినపుడు కాకతిరాజు వంశములో మొదటివాఁడుగఁ గనుపట్టు చున్నాడు. ఇందు కాకతి పురాధినాథుఁడనియును, చోడరాజు సైన్య మను మహాసముద్రమును మథించి యూర్జితలక్ష్మిని గైకొన్నవాఁడని యును జెప్పియుండుటచేత నితఁడు స్వాతంత్రుఁడుగనే యుండెనేమో యను నూహ పొడముచున్నది. అయిన నీ శాసనమునందే యొక క్రొత్తవిశేషణము "సామన్తవిష్టివశః" అని సామన్తుల బలత్కారము నకు వశుఁడైనవాఁడను నర్థమిచ్చునది చేర్పఁబడి యుండుట నాశ్చ ర్యము పుట్టించుచున్నది. విష్టిశబ్దమునకు జీతబత్తెములు లేకుండ వెట్టిపని చేయువాఁడని నిఘంటువులలో నర్థము వ్రాయఁబడి యున్నది. విష్టియనఁగా భద్రికరణమని కొందఱర్థము చెప్పెదరని నామలింగాను శాసనమునఁ దెలుపఁబడినది. మఱికొందఱు పండితులు విష్టిశబ్దమునకు బలాత్కారమని యర్థము చెప్పఁదగునని చెప్పిరి- అట్లయినయెడల సామన్తుల బలత్కారమునకు వశుఁడైనవాఁడనిగాని అట్లు గాకపోయిన సామన్త భద్రికరణములకు వశుఁడైనవాఁడని గాని యర్థము చేసికొనవలసి యున్నది. ఈ హేతువులచేత విరియాల యెఱ్ఱభూపతిచేత కొఱవి దేశమునఁ బ్రతిష్ఠాపింపఁబడిన వాఁడును, తరువాత నతని భార్య కామసానిచే కాకతి వల్లభుడుగాఁజేయఁబడిన వాఁడును. నగు బేతరాజు ఈ మొదటి బేతరాజే యైయుండెనని

స్ఫురించు చున్నది. ఇంతియెగాక యీ శాసనమునందే బేతరాజు కుమారుఁడు ప్రోలరాజు, వానికుమారుఁడు బేతరాజు నని మూవుర నామములు తెలుపఁబడి యుండుటచేత మొదటి బేతరాజె కొఱవి దేశమునఁ బ్రతిష్ఠాపింపఁబడిన వాఁడని మనకు విశదము కాగలదు.

ఇతఁడు చోళులను జయించి లక్ష్మినార్జించినాఁడని చెప్పఁబడి యుండుటచేత నా చోడరాజు లెవ్వరని ప్రశ్నము జనించుచున్నది.

ఈ కొఱవి దేశమునకు సమీపమున చక్రకోట్యమండలము గలదు. జగదేకభూషణ ధారావర్ష మహారాజు పాలించుచుండెను. ఇతఁడు నాగవంశీయుఁడైన సింధుకులుఁడు. వీనికి సామన్తుఁడుగా నుండినవాఁడు రేనాటి చోడుఁడైన చంద్రాదిత్యుఁడనువాఁడు వరశూర (Bastar) పట్టణము రాజధానిగాఁ పరిపాలనము చేయు చుండెను. ఈ మన మొదటి బేతరాజు చోడసైన్యమను సముద్రమును మథించి లక్ష్మిని బొందినాఁడని చెప్పఁబడి యుండుట సమీపస్థుఁడు గానున్న చంద్రాదిత్య చోడ మహారాజు సైన్యముల నోడించి కొఱవి దేశము నాక్రమించుకొని పరిపాలనము చేయుచుండెనేమో యని తలంపవలసియుండునేగాని యెక్కడనో దూరమున కాంచీపుర మును బాలించు చోడచక్రవర్తుల సైన్యములనోడించి లక్ష్మినార్జించి నాడని చెప్పుట దురూహ్యము. పశ్చిమ చాళుక్యచక్రవర్తులకు సామంతుఁడుగనుండి వారి పక్షమున చోడులతో యుద్ధముచేసి జయించి లక్ష్మినార్జించెనన్న సమన్వయము కుదురవచ్చునుగాని యీ ప్రశక్తి యేమియు నా శాసనమునందు గానరాదు. ఇయ్యది భావి పరిశోధనమునఁ దేటపడవలసిన విషయముగాని యిప్పటికెంత మాత్రము దెలియరానిదిగ నుండెను. ఇంతకంటె నీతని గుఱించి చెప్పఁదగిన దేమియుఁ గానరాదు.

## కాకతి ప్రోలరాజు (1050–1080)

ఈ మొదటి బేతరాజునకు వెనుక రాజ్యాధిపత్యమును వహించినవాఁడు ప్రోలరాజని పై ఖాజీపేటలోని రెండవ బేతరాజు శాసనము వలననే ధ్రువపడుచున్నది. కాకతీయ సంచికా సంపాదకుఁ డీతనికాలమును 1050 మొదలు 1080 వఱకు నుండునని యూహించుచున్నారుగాని సరిగా నిర్ణయించుటకుఁ బ్రామాణ్యమయిన ఋజువింతవరకుఁ గానంబడదు. కాని యీ శాసనమునందు నీతని విజయములను గూర్చిన ప్రశంస గొంత గాన్పించుచున్నది. అతఁడెప్పుడు రాజ్యమునకువచ్చి యెంతవఱకుఁ బరిపాలనము చేసెనో తెలియదుగాని యతఁ డేకాలమునందుండెనో వానిని చెప్పవచ్చును.

"జగత్పవిత్రచరిత్రుఁడైన ప్రోలరాజు చక్రకూట విషయమును జయించి భద్రంగ పురాధీశ్వరునిఁ బరువెత్తించెను. కొంకణమండలమును జయించి యనుపమానమగు కీర్తిని సంపాదించెను. అతఁడనేక రాజవంశములను జయించి యుద్ధములో గొడవర్తి దుర్గరాజు కొడుకును సంహరించెను. గొన్నయ నను వాని నిర్జించి పురకూటదేశమును స్వాధీనము చేసికొనెను. అనుమకొండ విషయమును త్రైలోక్యమల్లుని వలన శాసనపూర్వకముగాఁ బడసె" నని చెప్పఁబడియున్నది. ఇందువలన నీతఁడు త్రైలోక్యమల్లుఁడనఁగాఁ బశ్చిమచాళుక్య చక్రవర్తియగు, మొదటి సోమేశ్వరుని వలన నన్మకొండ విషయమును శాసనపూర్వకముగాఁ బడసి యుండెనని చెప్పుటకు విశేష మేమనగా నదివఱకే యాయనుమకొండరాజ్యమును నీతఁడు స్వాధీనము చేసికొని యున్నను, లిఖితమూలమైన యాధార మేమియు లేదనియు నాతఁడా విషయమును స్వతంత్రముగానే సంపాదించియుండి తరువాత సోమేశ్వరునికి మిత్రుఁడై యాతని

వలన లిఖితమూలముగాఁ బొంది యుండును. అనుమకొండ విషయ మును మొట్టమొదట గాకతీయులు పరిపాలించు చుండినట్లు దెలుపు శాసనమిదియె మొదటిదిగఁ గన్పట్టుచున్నది. ఈ పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన మొదటి సోమేశ్వరుఁడు క్రీ. శ. ౧౦౪౨ మొదలు కొని క్రీ. శ. ౧౦౬౮ వఱకుఁ బరిపాలనముచేసినవాఁడు గావునఁ బదియవ శతాబ్దితుద నున్నవాఁడని స్పష్టముగా నుడువ వచ్చును. ఈకాలమునఁ జక్రకూటమండలమును బరిపాలనము సేయుచున్న వాఁడు జగదేకభూషణధారావర్షమహారాజు. ఆంధ్రభారతకృతిపతి యైనరాజరాజనరేంద్రునకును, అతనికుమారుఁడైన రాజేంద్ర చోడుఁ డను నామాంతరముగల మొదటి కులోత్తుంగచోడచక్రర్తికిని సమ కాలికుఁడైన ధారావర్షుఁడే యీజగదేకభూషణధారావర్షమహా రాజు. ఇతఁడు నాగవంశీయుఁడైన సైంధవుఁడు. వీనిరాజధాని చక్ర కొట్యము. ఈచక్రకొట్యమునే చక్రకూటమనిరి. ఇది యిప్పటి బస్తరురాజ్యమె. ఈధారావర్షునకు చంద్రాదిత్యుఁడను రేనాటి చోడుఁడు సామన్తుఁడుగా నుండెను.

ఇతఁడు తాను కరికాలచోడ వంశజుఁడననియు, కాశ్యప గోత్రుఁడననియుఁ జెప్పుకొని యుండుటచేత తెనుఁగు చోడుల తెగ లోని వాఁడుగఁగను పట్టుచున్నాఁడు. ఇతని శాసనముపైని సింహ లాంఛనముగలదు. శాసనపరిశోధకు లితనిశాసనములంబరిశీలించి యితఁడు రేనాఁటి చోడులలోని వాఁడని సిద్ధాంతీకరించిరి.[1] ఇతఁడు మొదటి కులోత్తుంగచోడచక్రవర్తితో నీదేశమునకు దండెత్తివచ్చి ధారావర్షుఁడు కులోత్తుంగచోడచక్రవర్తికిఁ గప్పము చెల్లించి యొడంబడికచేసికొన్న తరువాత నిచ్చటనే నిలిచిపోయి ధారా వర్షునికి సేనాధిపతిగను, సామన్తుఁడుగను నుండెనని తోఁచుచున్నది. చంద్రాదిత్యుఁడు తన రాజధాని యగు వరశూర పట్టణము (Modern Barsur) నందు చంద్రాదిత్య సముద్రమను పేరిట నొక ఘనతటాకమును నిర్మించెను. ధారావర్షునియొక్క యంగీకారమును

(1) Annual Report on Epigraphy 1909, Para 65

బొంది వడ్డనాడులోని యొక గ్రామమును సయితము నచట తాను ప్రతిష్ఠాపించిన శివాలయమునకు దానముచేసి యుండెను. వడ్డనాఁడనునది విశాఖపట్టణమండలములోనివడ్డాదిప్రాంతప్రదేశమైయున్నది. కాకర్త్యగుండనార్యుఁడు తనది సామన్తవృద్ధివంశమని చెప్పుకొని యుండుటచేతను, ఈవడ్డనాడులోనే కాకతియను గ్రామము గూడ నుండి యుండుటచేతను మొదటనాతఁడిచ్చటి కాకతుల తెగ లోని వాఁడేమోయని యనుమానించుటకుఁగూడ నవకాశమిచ్చు చున్నది. చక్రకూటరాజుల చరిత్రమును సంగ్రహముగా మూఁడవ ప్రకరణమునఁ దెలిపి యున్నాఁడను. వీరిని గుఱించిన విశేషాంశములు చదువరుల కాప్రకరణము వలనఁ జక్కఁగాబోధపడగలవు.

## ప్రోలరాజు మహాసేనాని బమ్మిరెడ్డి.

ఈ మొదటి ప్రోలరాజు సైన్యములకు రేచర్ల బమ్మిరెడ్డి (బ్రహ్మారెడ్డి) యధ్యక్షుఁడుగ నుండెను. ఈ బమ్మిరెడ్డి రేచర్ల వంశమునకు మూలపురుషుఁడుగా గణపతిదేవచక్రవర్తి కాలముననున్న రుద్రుసేనాని పాలంపేట శాసనమునందును, రేచర్లనామసేనాని పిల్లలమఱ్ఱి శాసనమునందునుఁ బేర్కొనఁబడి యుండెను.* రేచర్లరుద్రునిచే లిఖింపఁబడిన పాలంపేట శాసనములో నిట్లున్నది.

---

*Hyd. Arch. Ser No 3. పాలంపేట శాసనము శా. సం॥ అనుబంధము సం॥ 18-19 శాసనములు.

శ్రీమద్బమ్మాఖ్యసేనానీరభూద్భూరి గుణాన్వితః
నిజ ప్రతాప ప్రాకార పరిత్రాతమహీతలః॥
తూర్యప్రణాద సమనం తరమేవతూర్ణ మాక్షిప్యయవని శాసదృశం'క
వాటం కాంచీపురస్య సమపాదయ దాశు వీరలక్ష్మీ వివాహమిహ కాకతి
వల్లభస్య.॥

(పాలంపేట శాసనము.)

శ్లో. శ్రీమత్ప్రిద్మజ పాదపద్మ యుగళాల్లోకత్రయాభ్యుచ్ఛ్రితాదుద్భూతే
విపులేకులే నరవరో బమ్మాభిధానో భవత్ కాంచీనగర కవాట హ
రణం కృత్వా ప్రచండాహవ క్రీడశ్శోచ్చెడనరాధి పస్యకృతవాన్నాన దుగ్ధ
మోన్నాలనం॥

(పిల్లలమఱ్ఱి శాసనము.)

“ భూరిగుణాన్వితుఁడైన బమ్మసేనాని యుండెను. అతఁడు తన ప్రతాపమను పెద్ద ప్రాకారముతో మహీతలమును సంరక్షించెను. అతఁడు మంగళవాద్యములు ఘోషించుటతోడనే కాంచీనగరము యొక్క కవాట మను తెరను క్షణములో తొలగించివేసి కాకతి వల్లభునికి వీరలక్ష్మితో వివాహము గావించెను ”

మఱియు నామసేనాని పిల్లలమఱ్ఱి శాసనములో నిట్లున్నది. “కాంచీనగర కవాటమును హరించి ప్రచండ యుద్ధములో చోడ రాజుయొక్క మాన మనువృక్షము నూడఁబెఱికిన బమ్మాభిధానము గలవాఁడు బ్రహ్మయొక్క పాదములవలనఁబుట్టిన కులములోజనించెను. పాలంపేటశాసనమును వ్రాయించిన రేచర్ల రుద్రసేనాని “తన తాత యగు కామసేనాని విఖ్యాతవిక్రాంతియుతుఁడైన ప్రోలరాజు సైన్యాధిపతియైయుండి మంథెనగుండ్రాజును సంహరింపఁగా గజ రాజు సింహరాజుచేఁ బరిమార్పబడినపుడు తదితర వారువములు ప్రాణరక్షణార్థము పర్విడునటుల యితర శత్రురాజులు పలాయనముఁ జెందిరి”* అని వ్రాయించి యుండుటచేత మంథెనగుండ్రాజును ప్రోలరాజు జంపినట్లు హనుమకొండ ప్రతాపరుద్రుని శాసనములోఁ జేర్కొనఁబడి యున్నదిగనుక కామసేనాని రెండవ కాకతి ప్రోల రాజునకు సేనానిగనుండెననుట స్పష్టము. కనుక కామసేనానికిఁ బూర్వుఁడయిన బమ్మసేనాని యీమొదటి ప్రోలరాజునకు సేనాధి

* శ్రీమత్ప్రోల నృపాల సైన్యపతినా విఖ్యాత విక్రాంతినా యుద్ధేయేనమహా బలేననిహతే మంథన్యగుండాధిపే అన్యేవైరి నృపాలకాః ప్రతిదిశం ప్రాదుద్రవం స్తత్క్షణాత్సింహేనేవ నిపాతితే గజపతౌ శేషాగజాః క్షుద్రకాః

పాలంపేట శాసనము. Hyd. Arch. Ser No 3.

పతిగా నుండి యుండెనని విశ్వసింపవచ్చును. పాలంపేట శాసనము వలన నాశాసనములోఁ బేర్కొనఁబడిన కాకతివల్లభుఁడు మొదటి ప్రోలరాజై యుండవలయును గాని రెండవప్రోలరాజుగాని లేక యాతని తండ్రియగు రెండవ బేతరాజుకాని కారని విస్పష్టమగు చున్నది. ఈ మొదటి ప్రోలరాజు చక్రకూట విషయమును జయించుటయెగాక "భద్రంగ విద్రావణుఁడని వక్కాణింపఁబడి యుండుటచేత మొదటి ప్రోలరాజు భద్రంగ పురాధీశ్వరునిగూడ జయించెనని తెలియుచున్నది. ఈభద్రంగపురము భద్రపట్టణము, భద్రావతియను నామాంతరములచేఁ గూడఁ బరగు చుండెను. ఇయ్యది వజ్రపురమునకు (Wairahgarh) 20 మైళ్ళదూరమున నున్నది. దీనినే యిప్పుడు "భాండక్" అని వ్యవహరించు చున్నారు. ఇతఁడు కొంకణము, పురకూ మొదలగు దేశములను జయించిన మహా యోధుఁడుగా నుండెనని విశ్వసింపవచ్చును.

అన్మకొండ విషయమును త్రైలోక్యమల్లునిచే శాసన పూర్వకముగాఁ బడసియుండెనని ఖాజీపేట శాసనమునందుఁ జెప్పఁబడి యుండినంత మాత్రమున నీతఁడు త్రైలోక్యమల్లునకు సామన్తుడుగా నుండెనని యూహింపరాదు. అతనికి మిత్రుఁడుగానుండి యతనికి శత్రువులుగానున్న రాజులను జయించి విజయముఁ జేకూర్చిన హేతువుచేత నీ రాజ్యమును నాతనినుండి గ్రహించి యుండవచ్చును. త్రైలోక్యమల్ల బిరుదము పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు నాఱవ విక్రమాదిత్యునికేగాక యతని పూర్వుఁడైన మొదటి సోమేశ్వరునికిఁ గూడ గలదు. ఈ మొదటి ప్రోలరాజు మొదటి సోమేశ్వరునివలననే యన్మకొండ విషయమును శాసనపూర్వకముగాఁ బొందెనని

గ్రహింప వలయును. ఖాజీపేట శాసనములో త్రైలోక్యమల్లుఁడని మాత్రము చెప్పినాఁడుగాని చాళుక్య చక్రవర్తి పేరు చెప్పియుండ లేదు. మొదటి సోమేశ్వరుఁడు శా. శ. ౯౬౪ మొదలుకొని ౯౯౦ వఱకు అనఁగా క్రీ. శ. 1042—1068 వఱకుఁ బరిపాలనము చేసిన వాఁడగుటచేత క్రీ. శ. 1068 పూర్వమునందే మొదటి ప్రోలరాజున్న వాఁడని నిశ్చయింపవచ్చును. ఈ పశ్చిమ చాళుక్య చక్రవర్తులకును, కాంచీపుర చోడచక్రవర్తులకును చిరకాలమునుండి బలవద్విరోధము గలదు. పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన యీ మొదటి సోమేశ్వరు నకును, చోడచక్రవర్తులయిన రాజేంద్రదేవ, వీరరాజేంద్ర దేవుల కును పలుతడవలు యుద్ధములు సంప్రాప్తములై జయలక్ష్మివారిలో నెవ్వరినో యొకరిని వరించుచుండుట తటస్థమగుచుండెను. పశ్చిమ చాళుక్య చక్రవర్తులకును చోడచక్రవర్తులకును జరుగుచున్న యుద్ధములలో కాకతి ప్రోలరాజు చాళుక్యుల పక్షమున చోళరాజు లతో యుద్ధము చేయుచుండెను. కాకతి ప్రోలరాజు మాత్రమెగాక యితనితండ్రి బేతరాజు (మొదటివాఁడు)కూడ చోడరాజు సైన్యమను సముద్రమును మథించి యూర్జితలక్ష్మిని పొందినవా"డని ఖాజీపేట శాసనమునందు స్పష్టముగా నుడువఁబడి యుండుటచేత తండ్రి కొడుకు లిర్వురునుగూడ (1 బేతరాజు, 1 ప్రోలరాజు) చాళుక్యుల పక్షమున చోడచక్రవర్తులతో యుద్ధములు చేయుచువచ్చిరని నిశ్శంకముగాఁ దెలుపవచ్చును. ఇట్టి మహాయుద్ధములయందు తోడ్పడి యుండుట చేతనే త్రైలోక్యమల్లునిచే (మొదటి సోమేశ్వరునిచే) అనుమకొండ విషయమును బడసినది, పశ్చిమ చాళుక్య చక్రవర్తియైన మొదటి సోమేశ్వరునకు సోమేశ్వరుఁడు (2), విక్రమాదిత్యుఁడు(6), జయ సింహుఁడు (3) అనుమూవురు పుత్రులు గలరు. చోడచక్రవర్తియైన గంగైకొండ రాజేంద్ర చోడునకు రాజాధిరాజు, రాజేంద్రుఁడు, వీర రాజేంద్రుఁడునను మూవురు పుత్త్రులులేక సోదరపుత్త్రులుండిరి. పశ్చిమ

చాళుక్యులకు చోడులకు జరిగినయుద్ధములలో వీరెల్లరును పాలుగొను చున్నవారే. ఆంధ్రభారతకృతిపతియైన రాజరాజనరేంద్రుఁడు గంగైకొండ రాజేంద్ర చక్రవర్తి కొమార్తెయైన అమ్మంగదేవిని వివాహమయ్యెను. వారికిఁబుట్టినవాఁడు రాజేంద్రుఁడు. ఇతఁడే కుళోత్తుంగుఁడు. ఈమె సోదరులు మూవురలోను రాజేంద్రుఁడు తన కొమార్తెయైన మధురాంతక దేవిని తన మేనల్లుఁడైన కుళోత్తుంగునకిచ్చి వివాహము గావించెను. ఇట్లు రెండు మూఁడు తరములనుండి చోడచక్రవర్తులు తమ కొమార్తెలను వేంగీసామ్రాజ్యాధిపతులకిచ్చి వివాహములు చేయుచుండిరి. రాజరాజ నరేంద్రునకు విజయాదిత్యుఁ డనుసవతి సోదరుఁడు గలఁడు. ఇతఁడు తన సోదరుఁడైన రాజరాజ నరేంద్రునిపై తిరుగుబాటుచేసి 1030-34 నడుమ వేంగీరాజ్యము నాక్రమించుకొని పరిపాలనము చేసినట్లు వీని శాసనములు చెప్పినదానిని విశ్వసించినను, తుదకు నీతఁడు రాజరాజుచే నోడింపఁబడి దేశమునుండి వెడలగొట్టఁబడఁగాఁ బశ్చిమ చాళుక్య సామ్రాజ్యమునకుఁబోయి యా చక్రవర్తుల రక్షణమున వృద్ధికివచ్చి వారలకు సామన్తుఁడై తరువాత నోలంబవాడి విషయమును బరిపాలించుచుండెనని కొన్ని శాసనములవలనఁ దెలియుచున్నది. ఇతనికి విష్ణువర్ధనుడనియు, వేంగీమండలేశ్వరుఁడనియు బిరుదములు గలవు. ఇతఁడు పశ్చిమ చాళుక్యుల పక్షముననుండి చోడులతోఁ బోరాడుచుండెను. కనుక నితఁడు పశ్చిమ చాళుక్యులకు మిత్రుఁడును సామంతుఁడు ననుట స్పష్టము. మఱియు నితఁడు మొదటి కాకతి ప్రోలరాజునకు సమకాలికుఁడై యతఁ డన్మకొండ విషయమును బరిపాలించుచుండఁగా విజయాదిత్యుఁడు నోలంబవాడి విషయము (32000) బరిపాలించు చుండెననుట విశదమగుచున్నది. చక్రకోట్యమండలాధిపతియైన ధారావర్షునకును, వేంగీ సామ్రాజ్యాధిపతియగు రాజరాజ

నరేంద్రునకును 1060 సంవత్సరమునకుఁ బూర్వము వారలకుండు బద్ధ వైరముచేత ననేక యుద్ధములు జరుగుచువచ్చినవి. ఆ యుద్ధములలో రాజరాజ నరేంద్రుని కుమారుఁడును, యువరాజును నగు కుళోత్తుంగుడే పాల్గొనుచు తుదకు విజయమునుగాంచి ధారావర్షునితో సంధిగావించుకొన్న కొంతకాలమునకు రాజరాజ నరేంద్రుఁడు మృతుఁడయ్యెను. వీరచోడుని శాసనములో ప్రాతఃకాలమున నుద యాద్రియందు సూర్యుఁ డుదయించి తన తేజస్సును సర్వత్రవ్యాపింపఁ జేయునట్లుగా, ప్రథమమున వేంగీ సింహాసనమును బొందుటచేత (రాజేంద్రచోడుఁడు) తనశక్తితో నెల్ల దేశములను జయించినాఁ డను నర్థముగల శ్లోక ముదాహరింపఁబడినది. మఱియు కుళోత్తుంగుఁడు తన పెద్ద కొడుకునుజూచి—

"మయా వేంగిమహీరాజ్యం చోడరాజ్యాభిలాషిణా,
మత్పితృవ్యే పురా న్యస్తం విజయాదిత్యభూభుజే".

చోడరాజ్యమును పొందఁగోరి పూర్వము వేంగీరాజ్యమును నా పినతండ్రియగు విజయాదిత్యభూభుజునకు నొసంగి యున్నాను.

స చ పంచదశాబ్దాని పంచానన పరాక్రమః.
మహీం రక్షన్మహీనాథో దివం దేవోపమో గతః.
ఇత్యుక్త్వాతాం ధురం దత్తాం గురుణా చక్రవర్తినా.

"శివునివంటి పరాక్రమవంతుఁడును దైవసమానుఁడు నగు విజయాదిత్యుఁడు ౧౫ సంవత్సరములు పరిపాలించి దివంగతుఁ డయినాఁడు."

ఈ శ్లోకమును బట్టి కులోత్తుంగునకు తన పినతండ్రియం దెట్టి సుహృద్భావము కలదో తేటపడుచున్నది. తరువాత కులోత్తుంగుఁడు వేంగీరాజ్యభారమును వహింపవలసినదిగా రాజరాజును నియ మించెను. అతఁ డీపదవిని వహించిన తరువాత సుఖమును సురక్షణ

ము లేక, గురుపాద సేవవలనఁ గలిగెడి యానంద మీరాజ్యపాల నాధికార మీయనందున నొక్క సంవత్సరము మాత్రము పరిపాలించి తల్లిదండ్రుల కడకుఁ బోయెను. తరువాత వీరచోడకుమారుని రప్పించి వేంగీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడవై పరిపాలింపవలసిన దని చక్రవర్తి యాజ్ఞాపించెను. ఎట్టకేలకు నీతని నొప్పించిరి.

"ఆ త్యాశిషం సమధిగమ్య నృపా దవంధ్యాం
దేవ్యా స్తదాగ్రజ నృప ద్వితయ క్రమేణ
ఆనమ్య తా నవనతో కుమార స్సప్త
స్స్వ దేశగమనాయ న తైః కథంచిత్.

ఈ ప్రకారముగా రాజుయొక్కయు, దేవియొక్కయు, అగ్రసోదరు లిరువురి యొక్కయు దీవనలను బొంది, వారికి నమస్కరించి తన చిన్నతమ్ము లయిన నృపకుమారుల నమస్కారములను బొంది స్వదేశమునకుఁ బోవుటకై యొప్పింపఁబడియెను" అని వక్కాణింపఁబడియుండెను. వారిచేత వేంగీదేశము స్వదేశముగఁ బరిగణింపఁబడియె నని యీ శ్లోకమువలన స్పష్టముగాఁ దెలియుచున్నది. కులోత్తుంగ చోడచక్రవర్తియు, వారిదేవియు, వారల కుమారులను చోడదేశమును స్వదేశముగా భావింపలే దనియు, వేంగీదేశమునే స్వదేశమునుగా భావించిరనియు ఇది స్పష్టపరచుచున్నది. వీరచోడుఁడు—

"శాకాబ్దే శశి ఖద్వ రయేందుగణితే సింహాధిరూఢే రవౌ
చంద్రే వృద్ధిమతి త్రయోదశితిథౌ వారే గురోర్వృశ్చికే,
లగ్నేథ శ్రవణే సమస్తజగతీరాజ్యాభిషిక్తోత్తరం
లోకస్యాస్య ద్వహాత్మి పట్ట మనఘం శ్రీవీరచోడో నృపః'

శకసం. "౧౦౦౧. న రవిసింహామందుండగాఁ జంద్రుడు వృద్ధియందుండ త్రయోదశీగురువారమున శ్రవణానక్షత్రయుక్త వృశ్చికలగ్నము నఁ బ్రఖ్యాతిగాంచిన శ్రీవీరచోళనృపాలుఁడు సమస్త

భూమికి నభిషిక్తుండై పట్టణముఁగట్టుకొనియె నని వ్రాయఁబడినది. అనగా వీరచోడుఁడు వేంగిరాజ్యమున క్రీ. శ. ౧౦౭౯ సంవత్సరమునఁ బట్టాభిషిక్తుఁడయ్యె నని భావము. ఇంతవఱకు దత్తత విశ్వసనీయమైనదికాదని యనేక ప్రతిబంధక కారణములు గలవని తెలిసికొంటిమి. కావున దత్తత వ్యవహారము కులోత్తుంగునిపక్షమున వ్యవహరించిన చోడచక్రవర్తుల కుటుంబములోని కొందఱు ప్రముఖులు కల్పనమని మనకిపుడు సులభముగా బోధపడుచున్నది.

రాజరాజనరేంద్రుఁడు మరణించిన వెనువెంటనే వేంగిసింహాసనము నెవ్వరధిష్ఠించి రనువిషయము చర్చింపవలసియున్నది. వీరచోడుని శాసనములనుబట్టి ప్రథమమందు వేంగిసింహాసనమధిష్ఠించి రాజేంద్రచోడుఁడు (కులోత్తుంగుఁడు) చోళరాజ్యమును సంపాదింపవలె ననుకోరికతో వేంగిరాజ్యమును తనపినతండ్రియైన విజయాదిత్యున కప్పగించితి ననియు, నతఁడు ౧౫ సంవత్సరములు పరిపాలనముచేసి దివంగతుఁ డయ్యెననియు చెప్పఁబడియున్నవిషయ మింతకుఁబూర్వమే తెలిసికొనియున్నవారము. ఈశాసనములో నుదాహరింపఁబడిన విధానమునుబట్టి రాజరాజనరేంద్రుని సవతితమ్ముఁడైన విజయాదిత్యునికిని, కుమారుఁడైన రాజేంద్రచోడునకు నేవిధమైన మనస్పర్థలు గాని విరోధము గాని లేకుండుట మాత్రమేగాక పినతండ్రియందు కులోత్తుంగునకు మంచిగౌరవము, విధేయత గలదని తేటపడుచున్నది. ఇందుకు ప్రతిబంధకములగు మరికొన్ని విషయములుకలవు. ఈనడుమ ఈ ౭ వ విజయాదిత్యుని శాసనములును, వీనికుమారుఁడు రెండవశక్తివర్మయొక్క శాసనమొక్కటియు బైటపడినవి. అందు విజయాదిత్యుని శాసనము లాతని ౧౨-వ పరిపాలనసంవత్సరమున లిఖింపఁబడినవి. ఇయ్యవి ప్రస్తుతము మదాసు మ్యూజియముస౦ దున్నవి.* వీటినకలు నామిత్రులయిన

* See:-Administration report of Madras Govt. Museum and Connemora Library.

శ్రీ చిలుకూరి నారాయణరావు గారికడ నున్నది. అందు రాజరాజ నరేంద్రుని మరణానంతరము.

> పరోక్షే రాజరాజస్య భ్రాతు ర్ద్వైమాతురస్య యః,
> పర్యగ్రహీన్మహా ౽శ్రియం వీర శ్రియా యుతః.

అని తాను స్వయముగా పరాక్రమముచేత నే రాజ్యలక్ష్మిని గ్రహించితినని వక్కాణించుచున్నాఁడు. మఱియు నింకొక విశేష విషయమును గూడ తెలుపుచున్నాఁడు.

> కృత్వాహి స్వసుతే స్నేహాత్ రాజ్యం శ్రీశక్తివర్మణి,
> న్యస్తం తస్మిన్ ధరా మేకం సంరక్ష్యాబ్దం దివంగతే.

తనకుమారుఁడైన శక్తివర్మ యెడగల స్నేహముచేత నతనికే రాజ్యము నొసంగఁగా నొకసంవత్సరమాత్ర మాతఁడు పాలించి దివంగతుఁడైన వాఁడట. అభిమన్యుని గోల్పోయినపార్థుని వలెనె రుచియు సుఖము నెఱుంగక యున్నానని దెలుపుకొనుచు—

> 'ఆసీనే విబుధాః కులక్రమగత్తే రాష్ట్రై రలం బోధితో
> ధర్మం స్థాపయితుం కథం చి దకరోత్ బుద్ధిం ధరారక్షణే

ధర్మమును దలపోసి ధరారక్షణమందు బుద్ధికలిగి బుధులు ప్రోత్సహించుటచేత మరల రాజ్యభారమును వహించితి నని వక్కాణించుచున్నాఁడు. * ఇది క్రీ. శ. ౧౦౭౫ నాఁటిశాసనము. వీని కుమారుఁడగు రెండవశక్తివర్మశాసనములో గూడ విజయాదిత్యుఁడు వేంగీరాజ్యమును బలాత్కారముగా గ్రహించెననియె వక్కాణింప బడియున్నది. ఈరెండవ శక్తివర్మశాసనమువలనశక్తివర్మ క్రీ. శ. ౧౦౬౧ సంవత్సరమున బరిపాలనము చేసినట్లు గన్పట్టుచున్నది.

---

* Epigraphical Report 1913-14, page 7

వీరిశాసనములలో తాము కులోత్తుంగుని వెడలఁగొట్టి రాజ్యమును వశము చేసికొంటిమని వీరును చెప్పియుండలేదు. ఇతరులసహాయముతో తామీరాజ్యమును పొందితి మనియైన చెప్పియుండలేదు. తాము బలాత్కారముగా నేల గ్రహింపవలసి వచ్చెనో అదియును దెలుపలేదు. వీరిస్థితి యిట్లుండఁగా చోడరాజ్యమును బాలించెడు మొదటివీరరాజేంద్రుఁడు తనయైదవ, యేడవపరిపాలన సంవత్సరములోని శాసనములలో తాను వేంగీమండలమునుజయించి యారాజ్యము చాళుక్యవిజయాదిత్యునకొసంగితి నని చెప్పుకొనియున్నాఁడు. ఇతఁడు పెరుంబేరుశాసనములో, ముమ్మరములగు సమరములో నైదుసారులు, ఆహవమల్లుఁడు పాఱిపోవునపుడు ఆతని వెన్నుఁజూచితిననియు, వేంగైనాడు తిరిగి స్వాధీనముచేసికొంటిననియు, తనతోఁబుట్టిన పెద్దన్న ప్రతిన నెఱవేర్చితి ననియు, తనవద్దకు వచ్చి తనపాదములను బూజించిన సలుక్కివిజయాదిత్యునకు రాజ్యము నొసంగితి ననియు వ్రాయించుకొన్నాఁడు. *

ఈ వీరరాజేంద్రుఁడు మఱియొక శాసనములో ఇదివఱకు మేము జయించిన వేంగీదేశమును సంపాదింపకుండ తిరిగి పోము. మీరు బలము గలవారు రండి. మీకు శక్తియున్న రక్షించుకొనండి" అని పలికినట్లుగాఁగూడ వ్రాయఁబడి యున్నది. అనంతవర్మచోడ గంగుయొక్క కొర్ని శాసనములో—

"సరాజరాజః ప్రథమం జయశ్రియః పతి ర్బభూవ ద్రవిలాహవోత్సవే,
విరాజమానామథ రాజసుందరీమ్మదూఢవంశచోడ మాహిభృదాత్మజాం.
త్యక్త్వా వేంగీం సపది పరిణా మోదయేద్యాంయవన్యాం
చోడవ్యాజే మహతి విజయాదిత్య మథ మిమక్షుం
ఆపన్నానాం పరమ శరణం రాజరాజో విచిత్రం

---

* South Indian Inscriptions Vol. 3 Part 2 page 203.

లక్ష్మీభాజం సుచిరమకరోత్ పశ్చిమాయామ్ దిశాయామ్."

అని వ్రాయఁబడి యున్నవి.*

ఇందు రాజరాజు ద్రవిడులనోడించి చోడ భూపాత్మజయగు (రాజేంద్రచోడతనయ) రాజసుందరిని వివాహమాడెననియు, అస్తమించుచున్న సూర్యునివలె వృద్ధుఁడైన విజయాదిత్యుఁడు వేంగిని విడిచి పెట్టినతోడనే చోడులవలన సంభవించుచున్న కష్టసముద్రములో మునిఁగిపోవుచుండ దీనశరణ్యుఁడగు రాజరాజు పశ్చిమభాగమున చాలకాలమభివృద్ధినొందునటుల గావించెను. ఈపరస్పర విరుద్ధము లయినశాసనములను సమన్వయపఱచి సిద్ధాంతము చేయుట బహుకష్టసాధ్యము. రాజరాజనరేంద్రుఁడు కీర్తిశేషుఁ డయిన వెనుక వేంగీరాజ్యాధిపత్యమును గుఱించి పక్షము లేర్పడి గొప్ప యుద్ధములు జరిగినమాట సత్యము. ఆకాలమున నీదేశమున స్వపక్షాభిమానులగు వీరనాయకు లెట్టిప్రతిజ్ఞవహించుచుండిరో యీక్రింది శాసనమువలనఁ దెలియఁగలదు.

"స్వస్తిసర్వలోకాశ్రియ శ్రీవిష్ణు వర్ధనమహారాజు కోనేరిన్మెయింగొండాను శ్రీపరాంతక దేవరకు రాజాధిరాజు పూనినపూనికి ఏను నావంశమునవారును శ్రీపరాంతకదేవరను కొలువంగలవారము. ఒరులంగొలువము. ఒరుండు మమ్మేలెనేని, తనయాలిని మాకిచ్చెడువాండు. ఏము ఒరులం గొలిచితిమేని మాయాండ్రవాని కిచ్చిన వారము. ఇమ్మార్గము శ్రీభీమేశ్వర సన్నిధానమున సత్యము చేసి ఒగుంగొంటిమి. డకరేమి, లిఖితం వీరరాజేంద్ర చోడాచార్యః."

* Journal of Andhra Historical Research Society part 3.

ఇట్లు ఒడ్డవాదిచోడయ వీరంగొట్టనచోడన, వీరంగొట్టమున సూరయ, జంతురునాటి భీమన, రాపర్తిబేతయ, సరుడనాంటి వీర చోడండు ప్రతిజ్ఞలు చేసి శాసనములు వ్రాయించిరి.*

వీటిలో కాలము తెలుపఁబడియుండలేదు. తామేరాజు కొఱకు ప్రతిజ్ఞచేసి యుండిరోవానిపే రుదాహరింపఁబడినది. అతఁడు పూర్వచాళుక్యులయు, చోడులయు బిరుదములను వహించియుండెను. "సర్వలోకాశ్రియ, విష్ణువర్ధన బిరుదములు" పూర్వచాళుక్యులును, "కోనేరిన్మెయింగొండారు, పరాంతకదేవర, అనుబిరుదములు చోడు లును వహించియుండిరనుట వాస్తవము. వీనిలో నుదాహరింపఁ బడినరాజు రెండువంశములకు సంబంధించినవాఁ డగుటచేత నాబిరుద ములను వహించుట కర్హుఁడైయుండెను. మన మెఱిఁగినంతమట్టుకు నట్టి బిరుదములను వహించినవాఁడు పూర్వచాళుక్యుడగు రాజరాజ నరేంద్రుని కుమారుఁడు, రాజేంద్రచోడుఁడను పేరుగల కులోత్తుంగుఁ డయియున్నాఁడు. రాజరాజ నరేంద్రుఁడుగాని, వానిసవతి తమ్ముఁడు విజయాదిత్యుఁడుగాని వాని కుమారుఁడు శక్తివర్మగాని చోడబిరుద ములను వహించియున్నట్లు గానరాదు. అట్లే కులోత్తుంగునకు పూర్వ మునసున్న చోడరాజు లెవ్వరును పూర్వచాళుక్యులు వహించిన బిరుదములను వహించియుండలేదు. మఱియు నాశాసనముల లిఖించిన లేఖకునిపేరు రాజేంద్రచోడాచారి. ఒకటి రెండు శాసనములలో వీర రాజేంద్ర చోడాచారి అనికూడ గలదు. "రాజేంద్రచోడ" అనునది తండ్రికి యువరాజుగ నుండినపుడున్న కులోత్తుంగునికిఁగల మొదటి నామము. నిశ్చయముగా యువరాజు నెడగల భక్తివిశ్వాసములను జూపుటకే యువరాజు నామమును లేఖకుఁడుగూడ వహించి యుండెను. ఇంతియకాక యాలేఖకుఁడు రాజునకు ప్రియుఁడును,

* South Indian Inscriptions Vol. 4 1622-1275.

ముఖ్య లేఖకుఁడుగనుగూడ నుండెను. ఎందుకన నతనికాలమున నాతని శాసనములను బెక్కింటిని నతఁడే లిఖియించి యుండెను. కనుక రాజేంద్రచోడాచారి వీరరాజేంద్రుని భృత్యుఁడుగాఁడు. కులోత్తుంగుని, వానియధికారమును నాశనముఁ జేయుటకై ప్రయత్నించెడు బలవంతుఁడగు శత్రువు కులోత్తుంగునకుఁ గలడని యాశాసనములు చాటుచున్నవి. ఇపుడా శత్రువెవ్వరో, ఎందుకొఱకు దాక్షారామ భీమేశ్వర సన్నిధానమున నట్టి భయంకరములయిన ప్రతిజ్ఞల నేల పూనవలసి వచ్చెనో మనము పరిశీలింపవలసి యున్నది.

వీరచోడుని చెల్లూరి శాసనములో తనపినతండ్రియగు నేఁడవ విజయాదిత్యుని పరాక్రమమునఁ బంచాననుఁడని కులోత్తుంగుఁడు చెప్పినట్లు వ్రాయఁబడియుండెను. ఇట్లుండు నే కాలమందును కులోత్తుంగుఁడు విజయాదిత్యునియెడ శత్రుత్వముగాని, శత్రుభావముగాని కలిగియుండెనని తలంచుటకు సాధ్యపడదు. అట్లే విజయాదిత్యుఁడు తన యన్నకుమారుని రాజ్యమునుండి కుటుంబముతో వెడలఁగొట్టి అన్యాయముగా రాజ్య మాక్రమించుకొన్నాడని నమ్ముటకు సాధ్యము కాదు. ఇదే నిజమైనయెడల వేంగిరాజ్యమునకు రాజప్రతినిధిగా తన కుమారు డయిన వీరచోడుని నియమించిన పదునైదు సంవత్సరముల తరువాత తనపితృవ్యుఁడగు విజయాదిత్యునిగుఱించి యట్టి గౌరవాస్పదములయిన విశేషణముల నుపయోగించి ప్రసంగించుట సంభవింపదు. ఆ శాసనములోనే యీ యూహను బలపఱచునట్టి మఱి యొక వాక్యము గలదు.

"చోడరాజ్యాభిలాషియై వేంగిరాజ్యమును పూర్వము తన పితృవ్యుఁడయిన విజయాదిత్యున కొసంగగా నాతఁడు పదునైదు సంవత్సరములు పరిపాలించెను. అతనివెనుక కులోత్తుంగుని పెద్ద కొడుకగు రాజరాజు (రెండవ) వేంగిరాజ్యమునుబొంది యొకసంవత్స

రము మాత్రము రాజ్యభారము వహించెను". ఇపుడీవాక్యము మనల మఱికొంచెము దూరము ముందుకు తీసికొని పోవుచున్నది. విజయాదిత్యుని తరువాత నే యాటంకమును లేకుండ రాజ్యము సులువుగా కులోత్తుంగుని కుమారుఁడగు రాజరాజునకు వశమయ్యె ననియు, నెట్టి కలవరమును లేకుండ నక్రమముగా నాతని పరిపాలనము యథావిధిగ జరుగుచుండెననియు బోధపడగలదు. , కనుక చోడరాజ్యము నభిలషించి రాజేంద్రచోడుఁడు వేంగిరాజ్యమును తన పితృవ్యుఁడగు విజయాదిత్యునికి నొసంగెనని చెప్పినమాట విశేషప్రాముఖ్యమును వహించునదియై యుండెను. ఇందువలన విజయాదిత్యునకును, అతని యన్నకుమారుఁడైన రాజేంద్రచోడునకు మనస్పర్థలు కలవేమో యని యనుమానింప నగత్యము లేదు.

అట్లయిన యీ శత్రువెవ్వరై యుండును? పశ్చిమ చాళుక్యులు కారనుమాట సత్యమని తెలిసికొనుచున్నాము. వీరరాజేంద్ర చోడ చక్రవర్తియే శత్రువని నిస్సందేహముగాఁ జెప్పఁదగును. అనేక కారణములవలన వీరరాజేంద్రుఁడు వేంగీరాజ్యముపైదృష్టిఁబఱపి యుండెను. అతఁడు వేంగీరాజ్యమును గలుపుకొని తన రాజ్యమును, తన యధికారమును విస్తరింపఁ జేయవలయు ననియు, పెఱుగుచున్న పశ్చిమ చాళుక్యుల యధికారము నడ్డుకొనవలె ననియు నత్యాతురముతో నుండెను. ఈ వేంగీరాజ్యమును తమకు లోఁబడి సామంత రాజ్యముగ నుంచుకొనవలయునని చోడులును, పశ్చిమచాళుక్యులును మూఁడుతరములనుండి పోరాడుచుండిరి. వేంగీరాజ్యమును స్వాధీన పఱచుకొనవలయునని వీరరాజేంద్రుఁడు పెక్కుమాఱులు వేంగీరాజ్యముపై దండెత్తి వచ్చినటులు వాని శాసనములను బట్టి తెలిసికొనఁ గలము. ఈ దండయాత్రల నన్నిటను నాతఁడు విజయము గాంచి యుండ లేదు. మఱియు నీ యుద్ధములలో కులోత్తుంగుఁడు

పశ్చిమ చాళుక్యులయు, పూర్వగాంగులయు తోడ్పాటుతో వారలను దఱిమివేసి, వేంగిరాజ్యము యొక్క స్వాతంత్ర్య గౌరవమును నిలిపి యుండవచ్చును. కనుక వీరరాజేంద్రుఁడు పశ్చిమ చాళుక్యులతోడి పోరాటములలో, అనఁగా ౧౦౬౩-౭౦ సంవత్సరముల నడుమ నెపుడో యొకింత జయము యొక్క సూచనలుఁ గానఁబడినప్పుడు ద్రాక్షారామములో భీమేశ్వర సన్నిధానము స్థానిక నాయకులు ప్రతిజ్ఞలుచేసి తమశాసనములను వ్రాయించియుందురు. డాక్టరు అయ్యంగారును, వారియోచన ననుసరించెడు తదితర పండితులును చరిత్రప్రాముఖ్యమును గాంచిన వీరచోడుని శాసనమును విస్మరించి, కులోత్తుంగుని వీరరాజేంద్రునికి యువరాజునుగఁజేసి యతనికి విజయాదిత్యునకు వైరము గలదను వింతసిద్ధాంతమును గల్పించుటలో పొరబడిరని చెప్పదగును. ఏమైనను వీరరాజేంద్రుఁడు తనకాళ్ళపైఁబడి వేడికొన్నందునఁ గరుణించి విజయాదిత్యునకు వేంగిరాజ్యము నొసంగితినని తన పెరుంబేరు శాసనములోఁ జెప్పుకొన్నది డంబముకొఱకే గాని, వాస్తవముగా నతఁడు వేంగిరాజ్యమును స్వాధీనముఁ జేసికొని నిరాటంకముగాఁబరిపాలించినట్లు గన్పట్టదు.

ఇప్పుడు మన మీ పండితులయొక్క వింతసిద్ధాంతము లొక్కొక్క దానినిగొని వివరముగ విషయములను బరిశీలించి యెంతవఱకు సమర్థనీయములో విమర్శించి చూతము. తన ఏన్షెంటు ఇండియా అను గ్రంథములో డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారిట్లు వ్రాయుచున్నారు.*

"గంగయికొండ చోళుని అల్లుఁడును, తూర్పు చాళుక్యుఁడు నగు రాజరాజు మరణించెను. అతనికి కనీసము కులోత్తుంగుఁడను

---

* Ancient India, page 121

ప్రఖ్యాతనామముగల "రాజేంద్రు"డను నొక్కకుమారుడును, "కుందవై" యను నొక్క కొమరియుఁ గలరు. కాని మొదటి వీర రాజేంద్రుని సహాయమువలన వేంగీరాజ్యము కులోత్తుంగుని పితృవ్యుఁడగు విజయాదిత్యుని పరమయ్యెను. ఇందుకై పొసఁగినవివాదమున పశ్చిమ చాళుక్యునకు వీరరాజేంద్రునకు విజయవాడ (బెజవాడ) వద్ద జరిగిన యుద్ధములో విజయమునుపొంది వీరరాజేంద్రుఁడు వేంగీరాజ్యపీఠమున విజయాదిత్యుని గూరుచుండఁబెట్టెను."

కాని దిగువనురాజేంద్రచోడునకును, మొదటివీరరాజేంద్రునకును యువరాజుగనుండి "వాయిరాగర" మను ప్రదేశమున నేనుఁగులను బట్టుటయు, సక్కరకొట్ట దుర్గమును ముట్టడించుటయు, నను రెండు ఘనకార్యములను నెఱవేర్చితినని కులోత్తుంగుఁడు తన మొదటి శాసనములలోఁ జెప్పుకొని యుండె నని డాక్టరు అయ్యంగారు విస్పష్టముగా వ్రాయుచున్నారు.*

తన మేనమామయగు వీరరాజేంద్రునకు యువరాజుగ నుండిన యెడ వేంగీరాజ్యమునకై వివాదము కలుగుటకు కారణమేమి? ఎవరినడుమ నట్టి వివాదము సంభవించెను? వాదిప్రతివాదు లెవ్వరు? అయ్యంగారివాదము ననుసరించినను, వేంగిరాజ్యమునకై పొసఁగిన వివాదములో విక్రమాదిత్యుఁడెవరి పక్షమున నుండెనో తెలుపఁబడలేదు. రాజ్యమును న్యాయముగాఁ బొందదగిన హక్కుదారుఁడగు కులోత్తుంగుఁడు వీరరాజేంద్రునకు యువరాజుగ నుండెను. అతనికి ప్రతిస్పర్థియని చెప్పఁదగిన విజయాదిత్యుఁడు తనవలన రాజ్యమును బొందినవాఁడేగదా? ఇఁక యుద్ధమెవరితోడ? నిశ్చయముగా డాక్టరు అయ్యంగారు విషయములను తాఱుమాఱు గావించినా రని

* Ibid page 124, 130, 131

చెప్పఁదగును. వీరరాజేంద్రుఁడు తనకు యువరాజును, మేనల్లుఁడు నగుకులోత్తుంగుని విడిచి యెక్కడనో మేనల్లుని పితృవ్యుఁడగు విజయాదిత్యునికేల రాజ్యము నీయవలసి వచ్చెను? కనుక వీరరాజేంద్రుఁడు విజయాదిత్యునకు వేంగిరాజ్యము నొసంగెననుట సాధ్యమైనదియు, విశ్వసింపఁదగినదియుఁ గాదు. అతఁడెప్పుడును విజయాదిత్యునకు మిత్రుఁడుగా లేఁడని యీక్రింది నిర్వివాదాంశముల వలన స్పష్టపడఁగలదు. ఈకాలమున విజయాదిత్యుఁడు వీరరాజేంద్రునకు గర్భశత్రువును, పశ్చిమచాళుక్యచక్రవర్తియు నగు ఆహవమల్లుఁడను నామాంతరమును వహించిన మొదటి త్రైలోక్యమల్లసోమేశ్వరునకు సామంతుఁడుగనుండి ౩౨౦౦౦ గల నోలంబవాడివిషయమును బరిపాలించుచుండెను. విజయాదిత్యుని మంత్రి యగుదండనాయకసంధివిగ్రహి దేవపయ్య క్రీ. శ. ౧౦౬౬ వ సంవత్సరమునలిఖింపఁబడిన యొక శాసనములో విజయాదిత్యుఁడు త్రైలోక్యమల్లుని పాదపద్మారాధకుఁ డని వక్కాణింపఁబడి యుండె.*

కనుక తనకు శత్రువగు ఆహవమల్లునకు సామంతుఁడుగ నుండిన విజయాదిత్యునకు వేంగిరాజ్యమును వీరరాజేంద్రుఁ డిచ్చెననుమాట విశ్వసింపఁదగినది కాదు. అందును ముఖ్యముగా కీర్తిశేషుఁడయిన తన సోదరుఁడు వేంగిరాజ్యమును జయించి తిరిగి స్వాధీనము చేసికొనవలసిన దని చెప్పినపు డట్టిది సంభవించి యుండదు.

డాక్టరు అయ్యంగారిపాదము నిలువఁజాల దనుటకు నవీనముగా వెల్వడిన మఱియొక శాసనప్రమాణము గలదు. పూర్వగాంగులలోని వాఁడయిన అనంత వర్మ చోడగంగుని కొర్ని శాసనములో నిట్లు వ్రాయఁబడి యున్నది. అస్తమించుచున్న సూర్యుని

* Annual report of South Indian Epigraphy 1925 p. 75

వలె విజయాదిత్యుఁడు వృద్ధుఁడై యుండి పడమటి దిశవలెనున్న వేంగిని విడిచిపోవునపుడు చోడులవలనఁ బెట్టఁబడినకష్టముల సముద్రములో మునిఁగిపోవుచుండ, దీనరక్షకుఁ డయిన తనతండ్రి రాజరాజు విజయాదిత్యుని పడమటి రాజ్యమునఁ జాలకాల మైశ్వర్య మనుభవించునటుల గావించెను.* ఇందుఁ దెలుపబడినటుల విజయాదిత్యునకు కష్టములను గలిగించి బాధించినచోడు లెవ్వరు? కులోత్తుంగునకాకాలమున సైన్య మున్నట్లుగాని, అతఁడు స్వతంత్రముగాఁ బ్రవర్తించినట్టుగాని, శాసన ప్రమాణములు గన్పట్టవు. మఱియు నతఁడు చాళుక్యుఁడు గాని చోడుఁడు గాఁడు. అదియును గాక మనఃపూర్వకముగా నిష్టముతోఁ దనపితృవ్యునకు రాజ్యము నొసంగి యుండి యతని బాధించె ననుటయు విశ్వసింపఁదగినదికాదు. డాక్టరు అయ్యంగారు విశ్వసించు రీతిగా వీరరాజేంద్రుఁడు తన పెరుంబేరు శాసనములో డంబముగాఁ జెప్పుకొన్నట్టు విజయాదిత్యునకు రాజ్యము నొసంగినమాట వాస్తవమే యైనయెడల విజయాదిత్యుని కొఱకు తూర్పుగాంగ రాజయిన రాజరాజు చోడుల నేల యెదుర్కొనవలసి వచ్చెను? కనుక డాక్టరు అయ్యంగారును వారిపక్షమువారును వీరరాజేంద్రుఁడు వేంగిరాజ్యమును విజయాదిత్యున కొసంగె నని చెప్పుటలోఁ బొరబడి రనుట స్పష్ట మగుచున్నది.

రాజరాజనరేంద్రుని మరణానంతరము వీరరాజేంద్రుఁడు వేంగీ రాజ్యముపై పలుమాఱు దండెత్తె ననుటను డాక్టరు అయ్యంగారు నమ్ముచున్నారు. వేంగీరాజ్యముపై తనవాఁడైన విజయాదిత్యుని పట్టాభిషిక్తుని గావించియున్నప్పుడు ప్రతిసంవత్సరము దండయాత్రలేల సాగింప వలసి వచ్చెను? విజయాదిత్యుఁడు శత్రువు కాని యెడల యపు డెవనితో యుద్ధము సేయుచుండెను? వేంగీరాజ్యము

* Supra p. 123 Lines 80-91

పాలించుచున్న రాజెవ్వరో. ఆతనికి ప్రతిస్పర్థిగా నిలిచిరాజ్యము కొఱకు వివాదము పెట్టుకొన్న దెవ్వరో, డాక్టరు అయ్యంగారు వక్కాణించి యుండలేదని యిదివఱకే తెలిపి యుంటిని. విజయాదిత్యుని దయతో కులోత్తుంగుఁడు వేంగీరాజ్యముపై నిలిపి యుండె నని యిదివఱకె తెలుపఁబడి యుండెను. (వీరచోడుని చెల్లూరు శాసనము చూడుఁడు) కాబట్టి కులోత్తుంగుఁడు మొదటి వీరరాజేంద్రునకు యువరాజుగ నుండలే దనియు, విజయాదిత్యుఁడు వీరరాజేంద్రుని వలన వేంగీరాజ్యముపై నిలుపఁబడియుండలేదనియు స్పష్టమగుచున్నది. వీరివాద మిట్లుండ నింక ప్రొఫెస్సరు వేంకటరామయ్యరు గారు కులోత్తుంగుఁడు తనపితార్జితరాజ్యమగు వేంగీరాజ్యమునకు తనపితృవ్యుఁడగు విజయాదిత్యుని తనకుఁ బ్రతినిధిగాఁ బట్టాభిషిక్తుని గావించిన విషయము నొప్పుకొనుచు చోడసామ్రాజ్యాభిలాషియై ముందు క్రమముగాఁ దగు కాలములోఁ బొందవచ్చు నను ధైర్యముతో ౧౦౬౩-వ సంవత్సరములో వీరరాజేంద్రునకు యువరాజుగ నుండఁగోరి, యట్లు గావించెనని వాదించుచున్నారు.* ఇయ్యది వీరచోడుని శాసనములో కులోత్తుంగుఁడు మొదట వేంగీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడై క్రమక్రమముగా కేరళ, పాండ్య, కుంతలములను ఎల్లదేశములను జయించి పిమ్మట చోడసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడయ్యె నని తెలుపఁబడిన యభిప్రాయమునకు వ్యతిరేకమైన విరుద్ధవాదమై యున్నది.

వీనివలన వీరరాజేంద్రునకు యువరాజునగుదునను తలంపుతో గాని, లేక ముందు క్రమముగా చోడసామ్రాజ్యము పొందుదు నను తలంపుతోఁగాని, వేంగీరాజ్యమును విడిచిపెట్టి యుండలేదనియు,

* See :-pages 143, 145 of the Madras Oriental Conference proceedings 1925.

చోడసామ్రాజ్య సింహాసనమునుపొందు గోరికతోనే తన పితృవ్యు నకు వేంగీరాజ్యము నొసంగెననియు స్పష్టపడుచున్నది.

మణిమంగళము శాసనములో గంగయికొండ చోడుఁడు తండ్రిగాక తన తండ్రియొక్క కనిష్ఠసోదరునిగా రాజేంద్రదేవుఁడు చెప్పుకొనియున్నాఁడు.* దీనినిబట్టి కుంభకోణము కాలేజిపండితు లగు యల్. శ్రీనివాసయ్యరుగారు రాజాధిరాజు, రాజేంద్రదేవుఁడు మొదటి వీరరాజేంద్రుఁడు గంగయికొండచోడుని పుత్రులు గారనియు, సోదర పుత్రులనియు వ్రాయుచున్నారు. దీనిని జయంగొండారుకవి బల పఱచుచున్నాఁడు. (చూ. 1927 మార్చి 23వ-తేది హిందూ.) కనుక కులోత్తుంగుఁడు గంగయికొండచోడునకు దౌహిత్రుఁడగుటవలనఁదన మేనమామ యగు వీరరాజేంద్రునికంటెను, అతనికుమారుఁడగు అధి రాజేంద్రునికంటెను చోడసామ్రాజ్యమును బొందుటకు నెక్కువహక్కు కలిగియుండెను. అప్పుడిట్లు జరిగియుండవచ్చును. ౧౦౬౦వ సంవత్సర ములో తూర్పుచాళుక్యుఁడగు రాజరాజు మరణము నొందినతరువాత వానికుమారుఁడగు కులోత్తుంగుఁడు వేంగీరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. కొద్దికాలమునకుఁ బిమ్మట కులోత్తుంగుని మామగారగు రాజేంద్రదేవుఁడుకూడ మరణముఁ జెందెను. అప్పుడు కులోత్తుంగుఁడు గంగయికొండ చోడునకు దౌహిత్రుఁడగుటవలన మామగారియనంత రము చోడసామ్రాజ్యమున కభిషిక్తుఁడు కావలయునని కొంతకాలము నుండి యుబలాటము పడుచున్నవాఁడు గావున మామగారిమరణవార్త విన్నవెంటనే వేంగీరాజ్యమున పితృవ్యుఁడగు విజయాదిత్యుని నిలిపి, తాను దక్షిణదేశమునకుఁ బోయెను. అనేకహేతువులచే నతడిట్లు గావించి యుండవచ్చును. పశ్చిమ చాళుక్యులకును చోడులకును గల తగవులకెల్ల మూలకారణమైయున్న వేంగీరాజ్యమును కేవలము

* See:-South Indian Ins. Vol. 3 part 1, page 59

బాలురుగానున్న తనకొమాళ్ళస్వాధీనములో నుంచుటకంటె, తనపితృవ్యుని స్వాధీనములో నుంచుట యుక్తమని తలంచి యుండెను. ఇదియునుగాక మఱియొక కారణముగూడ గన్పట్టఁగలదు. తనపితృవ్యుఁడగు విజయాదిత్యునియెడ నాతనికిభక్తి విశ్వాసములు మెండు. వేంగిరాష్ట్రమున దాను లేనికాలమునఁ దనపితృవ్యుఁడు తనపక్షమున నుండుటవలనస్వదేశములోఁ దనయధికార మెక్కుడగా బలపడునని యాతఁడు తలంచి యట్లుచేసి యుండవచ్చును.

కాని, చోడరాజ్యములో గులోత్తుంగుడు తలంచినట్లు జరుగ లేదు. దురదృష్టవశమున గులోత్తుంగుఁడు రంగము చేరునప్పటికే వీరరాజేంద్రుఁడు చోడసామ్రాజ్యమునకు కాంచీనగరమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. కులోత్తుంగుఁడు తానే చోడసామ్రాజ్యమున కభిషిక్తుఁడు గావలెనని చాలకాలమునుండి కోరికతోనుండుట చేతను, తనస్థానమును విడిచి బహుదూరము వచ్చినవాఁడగుట చేతను వేంగీ రాజ్యమునకుఁ బోఁదలంచుకొనలేదు. కాని వీరరాజేంద్ర చక్రవర్తి విశేషపరాక్రమవంతుఁడగు ప్రతిస్పర్ధిగ నేర్పడుటవలన నతని కోరిక సులువుగా ఫలింపలేదు. కావునఁ గులోత్తుంగుఁడు తన ప్రతిస్పర్ధిని జయించి, చోడసామ్రాజ్యమును సంపాదించుటకై వీరరాజేంద్రుని పరిపాలనకాలమునంతను (అనఁగా నేడేండ్లకాలము) ప్రవాసమునఁ గడగండ్లు పడుచు కాలము గడుపవలసివచ్చెను.

అతఁడు యువరాజుఁడుగానున్న కాలమున సక్కరకొట్టమును జయించి వాయిరాగరమున నేనుఁగులను బట్టికొనుట జరిపియుండెనని శాసనములలోఁ జెప్పియుండెను. ఇయ్యవి యాతఁడు రాజమహేం

ద్రవరమునఁ దనతండ్రికి యువరాజుగ నుండినపుడు జరిపినవే కాని తనతాత గంగయికొండ చోడచక్రవర్తికిఁ గాని, తనమేనమామ వీరరాజేంద్రునకుఁ గాని యువరాజుగ నుండినపుడు జరిపినవి కావనియు మనము తెలిసికొనఁగలము. వేంగీసామ్రాజ్యాధిపతియగు రాజరాజనరేంద్రుఁడును, చక్రకోట్యమండలాధీశ్వరుఁడగు ధారావర్షుఁడును, నొండొరులతో వైరములు గల్పించుకొని పోరాడుచుండిరనియు, సమయము చిక్కినపు డొండొరుల రాజధానీ పట్టణములను దగులఁబెట్టుకొనుచుండిరనియుఁ కొన్నిశాసనములవలనఁ దెలియుచున్నది.1

ఇందువలన చక్రకోట్యమండలముపై (బస్తరురాజ్యము) కులోత్తుంగుని దండయాత్ర కాలమును నిర్ణయించుటయు, నాకాలమున నెవనికి యువరాజుగ నుండెనో తెలిసికొనుటయు, సాధ్యముకాగలదు. ధారావర్షుని కడపటిసంవత్సర మాతని సామంతులలో నొక్కఁడగు మహామండలేశ్వర చంద్రాదిత్యుని శాసనములో నుదాహరింపఁబడిన ౧౦౬౦ గా నెత్తుకొనవచ్చును. ఈశాసనములో ధారావర్షుని రాజధాని బరశూరపట్టణములో చంద్రాదిత్యుఁడు తన పేరిట చంద్రాదిత్య సముద్రమనుపేరిట నొక పెద్ద చెఱువు త్రవ్వించి దానికట్టమీఁదను చంద్రాదిత్యేశ్వరుఁడను పేరితో నొక శివాలయమును నిర్మించినట్లు తెలుపఁబడినది. ఈశివాలయ పోషణార్థ మతఁడు ధారావర్షునినుండి యొకగ్రామమును కొని దానముచేసినట్లుగాఁ దెలుపఁబడినది. ఈచంద్రాదిత్యుఁడు చోఁడుఁడనియు, కాశ్యపగోత్రుఁడనియు, కడపమండలమును బాలించిన పూర్వచోడులతో సంబంధముగలవాఁడనియు, కులోత్తుంగుని పక్షమున నాతనితో దండయాత్ర

(1) Ep. Ind. Vol. 6 p. 25.

వెడలి వచ్చెననియు, అతడు జయింపఁబడిన రాజ్యములోనుండి తరువాత కొంతకాలమునకు నచటనే స్థిరపడి ధారావర్షునికి సామంతుఁడయ్యెననియు శాసన పరిశోధకులు చెప్పుచున్నారు 1

ఇట్టి పరిస్థితులు వేంగిచక్రకోట్యమండలముల మధ్య జరుగుచుండిన యుద్ధములు ముగిసినపిమ్మట గొంతకాలమునకుఁ గాని సంభవింపవు. కనుక ౧౦౬౦ లేక ౧౦౬౫ లకు పూర్వమె యుద్ధము ముగిసియుండును. ఆయుద్ధములలోఁ బాల్గొన్న కులోత్తుంగుఁడా సంవత్సరములకు పూర్వమె తనతండ్రికి యువరాజుగనుండి నడిపియుండవలయునుగాని, గంగయికొండ చోడునికిగాని, వీరరాజేంద్ర చోడునికిగాని యువరాజుగనుండి జరిపినవి కాదని బోధపడఁగలదు.

తండ్రిమరణానంతరము కులోత్తుంగుఁడు వేంగిరాజ్యమును బొందియుండియుఁ దనకై చోడరాజ్యమును సంపాదింపఁ గోరి యెందుకు వేంగిరాజ్యమును పితృవ్యునకు విడిచిపెట్టెనని యొకప్రశ్నము పుట్టవచ్చును. అతఁడు చక్రవర్తియై వేంగిచోడరాజ్యములను పాలింపవలెనని పెద్దకోరికతోఁ జేసినపనికాని మఱియొకటికాదు. ఇతఁడు దీనిని సామాన్యదృష్టితో నాచరింపలేదు. ఇతఁడు మంచి సూక్ష్మబుద్ధిగలవాఁడును, రాజ్యాంగవేత్తయు, మంత్రాలోచనాపరుఁడు నగుటవలన నెప్పుడును పశ్చిమచాళుక్యులకు సామంతుఁడుగా నున్న తన పిన్నతండ్రిని తనకుఁ దోడ్పాటుగాఁ దనపక్షమున నుండుటకై దూరదృష్టితో గావించెను. మఱియు విజయాదిత్యుఁడు తన తండ్రి పరిపాలనకాలమున నతృప్తినిగాంచి పశ్చిమచాళుక్యుల యండనుజేరి యున్నవాఁడు గావున నాతని మనోవ్యథనుడిపి సంతోషపఱిచి తన ప్రక్కనుంచుకొనుటకై యతఁడిట్లు గావించెను.

(1) South Indian Epigraphy 1908-9, 3 p. para 65.

విజయాదిత్యుఁడు ౧౦౬౪ మొదలుకొని ౧౦౬౬ వఱకు నోలంబవాడి విషయమునకుఁ బాలకుఁడుగానుండి, పశ్చిమచాళుక్య చక్రవర్తియగు మొదటి సోమేశ్వరునకు సామంతుఁడుగ నున్నట్లు శాసనము వలనఁ దెలియుచున్నది.1

మరియు విజయాదిత్యుని రెండవకుమారుఁడగు శక్తివర్మ యొక్క తామ్రశాసనమువలన నతఁడు ౧౦౬౧-వ సంవత్సరమున వేంగీసామ్రాజ్యమును బరిపాలించు చుండినట్లు గన్పట్టుచున్నది.2

ఈసంవత్సరము విజయాదిత్యుని పరిపాలనకాలములోఁ చేరినదై యున్నది. విజయాదిత్యు నిర్వాలితామ్రశాసనములలో దాను పుత్రుని యెడఁగల ప్రేమచేత వానిని రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేయఁ గానాతఁడొక్క సంవత్సరము మాత్రము పరిపాలించి, యకస్మాత్తుగా మరణించెననియు, అభిమన్యుఁడు చనిపోయిన వెనుక అర్జునుని రీతిగా రాజధర్మమును, వీరధర్మమును గూడ పరిపాలించుటకై బుధుల ప్రబోధనమును పురస్కరించుకొని మరలి రాజ్యాధికారము వహించితినని చెప్పికొనియున్నాఁడు.3 కనుక నాకాలమున దన కుమారుని వేంగీరాజ్యమున నిలిపి, తాను నోలంబవాడి విషయమును బరిపాలింప విజయాదిత్యుఁడు పోయి యుండును.

ఇతఁడు ౧౦౪౬ వ సంవత్సరమునుండి పశ్చిమ చాళుక్యులకు సామంతుఁడుగానున్నవాఁడు గావున వారితోడి మైత్రిని బలపఱచు కొనగోరి అట్లుపోయి యుండెను. మఱియు విజయాదిత్యుని తామ్ర శాసనములోఁ జెప్పఁబడిన యలంకారములవలన నీతఁడర్జునుని వలెనే

(1) Report on Epigraphy, Madras 1925, No. 332, p. 75; Ep. Ind. Vol. IV, p. 213

(2) 1913, No. 8 E. R. 1914, p. 86, para 10

(3) Ep. R. 1925, p. 77, para 5.

తనకుమారుని వేంగీరాజ్యమున నిలుపఁగోరెను; కాని యదృష్టము వేఱుగానున్నందున నతఁడు మరణించుట సంభవించినది. అభిమన్యుని మరణమువలెనే శక్తివర్మ మరణముగూడ నుండెనని యందలి యలంకారమువలన నూహింపవచ్చును. తనతండ్రియగు విజయాదిత్యుఁడును, సోదరుఁడగు కులోత్తుంగుఁడును, లేనికాలమున శక్తివర్మ మొదట వీరరాజేంద్రచోడ చక్రవర్తితో జరిగిన యుద్ధములో మృతినొందియుండనచ్చును. రెండవశక్తివర్మ చనిపోయిన తరువాత స్వల్పకాలము వేంగీ రాజ్యము వీరరాజేంద్రుని వశములో నుండెను.

## కాకతిపోలరాజు కులోత్తుంగునకు తోడ్పడిమెనా ?

రాజరాజనరేంద్రుని మనుమఁడయిన వీరచోడుని శాసనమునుబట్టి క్రీ. శ. ౧౦౬౩ వ సంవత్సరమున రాజరాజు మరణముఁ జెందినట్లు, వాని కుమారుఁడు రాజేంద్రచోడుఁడను కులోత్తుంగుఁడు వేంగీసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడైనట్టు దెలియును. రాజరాజు ౪౧ సంవత్సములు పరిపాలనము చేసెనను విషయముకూడ పై సంవత్సరమునకు సరిపోవుచున్నది. కాని దీనికి ప్రతిబంధకముగా విజయాదిత్యుని కుమారుఁడగు శక్తివర్మ శాసనము పైయభిప్రాయము నడ్డుకొనుచున్నది. అతని నుమియవాడ శాసనములో శక్తివర్మ శా. శ. ౯౮౩ సంవత్సరము తులామాస శుక్లపక్ష ద్వితీయా గురువాసరమునాఁడు అనఁగా 18 అక్టోబరు 1061 తేదిని సింహాసన మధిష్ఠించెనని తెలుపుచున్నది. దీనినిబట్టి రాజరాజనరేంద్రుఁడు ౧౦౬౦ సంవత్సరముననే మృతిఁజెంది యుండునని తలంపవలసి వచ్చుచున్నది. ఇందేది సత్యమని శంక కలుగకమానదు. వీరచోడుని శాసనము చెల్లూరుశాసనమువలన కులోత్తుంగుని కుటుంబము విజయాదిత్యునియెడ సుహృద్భావమునే వెల్లడించుచున్నది. శక్తివర్మ

శాసనమునఁగాని విజయాదిత్యుని ర్యాలి శాసనమునఁగాని యట్టి సుహృద్భావము గానరాదు.

"పరోక్షేరాజరాజ స్యభ్రాతు ర్ద్వైమాతురస్యయః
ప్రత్యగ్రహేమహీరాజ్యశ్రియం వీరశ్రియాయుతః."

రాజరాజునకు సవతితల్లి కుమారుఁడగు విజయాదిత్యుఁడు, ఆయన లేనికాలమున సోదరునిరాజ్యము గొప్పపరాక్రమముతో నాక్రమించుకొనెనని చెప్పెను. కాని విజయాదిత్యుని శాసనకాలము తనపరిపాలన కాలములోని పంద్రెండవ సంవత్సరమని తెలిపియుండెను. అది క్రీ.శ. ౧౦౭౫ వ సంవత్సరమున లిఖింపఁబడినదగుటచేత ౧౦౬౩ సంవత్సరమున విజయాదిత్యుని పరిపాలనము ప్రారంభమని తలంపవలసి యుండును. తానే తన కుమారుఁడైన శక్తివర్మను 1061 సంవత్సరమున సింహాసన మెక్కించినట్లు చెప్పుకొని యున్నవాఁడు గావునను, అతఁడొక సంవత్సరము పరిపాలనముచేసి మృతినొందఁగా బుధుల యాజ్ఞను శిరసావహించి తాను పట్టాభిషిక్తుఁడనైతినని చెప్పుకొని యున్నాఁడు గావున 1062 లో గాని 1063 లో గాని తాను పట్టాభిషిక్తుఁడై యుండవలయును. కాని యతఁడు 1064 — 65 వఱకు నోలంబవాడి విషయమున కధ్యక్షుఁడై చాళుక్యచక్రవర్తి యైన మొదటిసోమేశ్వర చక్రవర్తికి సామన్తుఁడుగా నుండెను. ఇదెట్లు సమన్వయింపఁగలము.? దీని యాథార్థ్యమేమి ? విజయాదిత్యుని శాసన కాలము క్రీ. శ. 1075. విజయాదిత్యుఁడు నోలంబవాడి విషయమును బరిపాలించుకాలమున వేంగీసామ్రాజ్యము నెవ్వని స్వాధీనములో నుండెను. ఇందుకు విజయాదిత్యుని శాసనమున ప్రత్యుత్తరము గానరాదు. శక్తివర్మ శాసనమును బ్రకటించిన శ్రీయుత భావరాజు వేంకట కృష్ణారావుపంతులుగా రిట్లు వ్రాయుచున్నారు.

"రాజరాజు రాజ్యావసాన కాలమున నీ సప్తమ విజయాదిత్యుఁడు వేంగీదేశముపై దండెత్తి వచ్చుటకుఁ గారణములు దెలియరాకున్నవి. ఏదో దూరదేశమునకు రాజు దండయాత్ర వెడలియున్న కాలమున విజయాదిత్యునకుఁ గలిగిన మంచి యవకాశమును విజయాదిత్యుఁడు దండయాత్ర సాగించుటకుఁ జక్కఁగా నుపయోగపఱచుకొన్నట్లు గానుపించుచున్నది. ఈదండయాత్రయందు బశ్చిమ చాళుక్య ప్రభువును, కళ్యాణపురాధీశ్వరుఁడు నగు మొదటి సోమేశ్వరుని యొక్క సహాయము నీతఁడు పొందియుండవచ్చును. ఏమన నీతఁడు సోమేశ్వరునకు సామంతుఁడై నోలంబవాడి విషయమున కధికారిగా యున్నాఁడు గనుక. మొదటి సోమేశ్వరుఁడు 1060 ప్రాంతమున చోడదేశము మీఁదికి దండయాత్ర సాగించి కాంచీపురము వఱకుఁబోయి దానిని ముట్టడించి నగరమును చూఱఁగొనియెను. ఈసమయమునందే యాతఁడు చక్రకూట మండలాధీశ్వరుఁడగు ధారావర్షుని వేంగీదేశముపై దండయాత్ర సాగింపఁ బ్రోత్సహించియుండును. ఈసమయమున తూర్పుచాళుక్యులగు రాజరాజును, వాని కుమారుఁడు రాజేంద్రచోడుఁడును ధారావర్షునితో యుద్ధము చేయఁబోయి యుండవచ్చును. ఈయదను గైకొని తన సోదరుఁడు లేని సమయముఁ జూచి విజయాదిత్యుఁడు వేంగిపై దండెత్తివచ్చి జయించి యుండును." అని హెచ్చరించి యీశక్తివర్మ శాసనమును జూపినారు. ఇంత ద్రోహముచేసిన వీరిని శక్తివర్మయు, విజయాదిత్యుఁడు స్వర్గస్థులైన పిమ్మట లిఖింపఁబడిన వీరచోడుని చెల్లూరు శాసనములో నాప్రకారముగా దైవ సమానునిగాఁ గులోత్తుంగుఁడు కొమారునితోఁ జెప్పి వర్ణించుట యెట్లు సంభవించును? అష్టకష్టములకు లోనుగావించి దేశమునుండి వెడలనడచిన వానిని నేరాజన్యుఁడు దైవసమానునిగా భావించును. ఈసందర్భమున నింకొక క్రొత్త విషయమును నాలోచింపవలసి యున్నది. ఈకాలమునందే

యున్న కాకతి ప్రోలరాజు చక్రకూట విషయమును జయించి భద్రంగ పురాధీశ్వరుని నోడించెనని రెండవ బేతరాజు ఖాజీపేట దర్గాశాసనము వలనఁ దెలిసికొని యున్నాము. అతఁడు మొదటి సోమేశ్వరుని వలన అనుమకొండ విషయమును శాసనపూర్వకముగాఁ బడసియుండెనని తెలిసికొని యున్నాము. అందువలన ప్రోలరాజీ కాలమున లేడని తలంపరాదు. తన మిత్రుఁడయిన జగదేకభూషణ ధారావర్షుని పరాభవించిన కాకతి ప్రోలరాజును మన్నించి అనుమకొండ విషయమును శాసన పూర్వకముగా నొసంగునా? 1060 సంవత్సరముల ప్రాంతమున రాజరాజును వాని కుమారుఁడు రాజేంద్రచోడుఁడును ధారావర్షునితో యుద్ధముచేసిన మాట వాస్తవమైన చో కాకతి ప్రోలరాజు, రాజరాజు రాజేంద్రచోడుల పక్షముననుండి తానుగూడ ధారావర్షునితోఁ బోరాడి జయించి యుండునని విశ్వసింపఁదగియుండదా? కాఁబట్టి రాజరాజుపై దండయాత్ర వెడలుటకు సోమేశ్వరచక్రవర్తి ధారావర్షుని ప్రోత్సహించియుండఁజాలఁడు. వృద్ధుఁడైన రాజరాజు తన యేకపుత్త్రుఁడు దగ్గర లేని సమయమునఁ దానొంటరిగఁ గాని, లేక కుమారునితోఁ గలసి యిర్వురుగాని రాజధానీ నగరమును విడిచి దండయాత్రలు సాగింతురని చెప్పుటకు వారు వట్టి బుద్ధిహీనులుగారు. కావున శక్తివర్మ శాసనములోఁ జెప్పిన విషయములు బొంకులయి యుండవలయును గాని యన్నియు యథార్థమును దెల్పునవిగావు. వేంగీ సామ్రాజ్యమును దమదిగాఁ జేసికొనుటకై పన్నిన పన్నుగడలుగా గ్రహింపవలయును. నుమియవాడ శాసనము తానొక సామంతుఁడుగా నుండి వ్రాయించిన శాటి నమె గాని తనతండ్రి జయించిన వేంగీరాజ్యము పట్టము గట్టుకొంననని వ్రాయించినది సత్యమై యుండదు. కులోత్తుంగుడు మాత్రము రాజధానీనగరమున లేక పోయియుండవచ్చును. అట్లు గాకపోయినఁ దానే రాజరాజుపైఁ దిరుగుబాటుచేసి యతని చెఱబెట్టి యుండ

వచ్చును. అతఁడు 1063 వఱకు బ్రతికియుండి తరువాత చని పోయి యుండవచ్చును. 1062 లో శక్తివర్మతో యుద్ధము సాగించి యుండవచ్చును ఆయుద్ధములోనే శక్తివర్మ మరణించి యుండును. విజయాదిత్యుఁడు రాజ్రప్రతి నిధిగా నియమించి తరువాత తాను తన మేనమామ రాజేంద్ర చక్రవర్తి చనిపోవుటచేత చోడరాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁడను గావలెనన్న యుబలాటముతోఁ గాంచీపురమునకుఁ బోయి యుండును. ఇతఁడు కాంచీ నగరము చేరక మునుపే రాజేంద్రచక్రవర్తి తమ్ముఁడు వీరరాజేంద్రుఁడు చోడసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుఁ డయ్యెనని తెలిసికొని యుండును. ఉభయ భ్రష్టత్వము; ఉపరిసన్యాస మన్నట్లయ్యెను కులోత్తుంగుని బ్రదుకు. ఏడేండ్లకాలము ప్రవాసమున నుండవలసి వచ్చెను.

ఈ యేడేండ్లకాలము వీరరాజేంద్ర చోడచక్రవర్తి చోడ సామ్రాజ్యమును బరిపాలింపుచు నొక ప్రక్కను పశ్చిమ చాళుక్యులతోను, మఱియొకప్రక్కను పూర్వగాంగులతోను, వేఱొకప్రక్కను వేంగీరాజ్యాధిపతియైన విజయాదిత్యునితోడను యుద్ధములు సలుపుచు జయాపజయములను బొందుచుండెను. ఇతనితోడఁ బోరాడలేక విజయాదిత్యుఁడు వేంగీరాజ్యమును వీరరాజేంద్రునకు విడిచిపెట్టి 1064—65 సంవత్సరములలోఁ బశ్చిమ చాళుక్యసామ్రాజ్యమున నోలంబాడివిషయమున కధిపతిగా నుండిపోయెను. కాని పశ్చిమచాళుక్యులయు, తూర్పుగాంగులయు సాహాయ్యముతో నీతఁడు వేంగీ సామ్రాజ్యమునఁ బట్టాభిషిక్తుఁడయ్యెను. పశ్చిమ చాళుక్యులతో సఖ్యతగా నుండుట రాజనీతిగా భావించి మొదటిసోమేశ్వరుని రెండవ కుమారుఁడైనఁ యాఱవ విక్రమాదిత్యునికి తన కొమార్తె నిచ్చి వివాహముగా గావించెను. 1068 వఱకు మొదటిసోమేశ్వరుఁడు పశ్చిమ చాళుక్య సామ్రాజ్యమును బరిపాలించెను. తరువాత వాని

పెద్దకుమారుఁడు రెండవ సోమేశ్వరుఁడు భువనైకమల్లుఁడను బిరుదమును వహించి 1076 వఱకుఁ బరిపాలనముచేసెను. 1070 సంవత్సరమున రాజేంద్రచోడుఁడు (కులోత్తుంగుఁడు) అనుమకొండ విషయాధిపతియగు కాకతిప్రోలరాజు తన సైన్యాధక్షుఁడయిన బమ్మసేనానితోఁ దనకుఁ దోడ్పడఁ గాంచీనగరముపై దండయాత్రసాగింపుచుండ వీరరాజేంద్ర చక్రవర్తి మరణముఁ జెందినవార్త దెలియవచ్చెను. అసంఖ్యాకములగు సైన్యములతోఁ గులోత్తుంగుఁడు కాంచీనగరముపై దండెత్తిపోయెను. తనమామ వీరరాజేంద్రుని మరణవార్త విన్నతోడనే పశ్చిమ చాళుక్యుఁడునగు సామంత మండలేశ్వరుఁడుగానుండి నోలంబవాడి విషయమును బరిపాలించు నాఱవవిక్రమాదిత్యుఁడు వీరరాజేంద్ర చక్రవర్తి పుత్త్రుఁడగు అధిరాజేంద్రుని చోడసామ్రాజ్యమునకుఁ బట్టాభిషిక్తుని గావించి మరలివచ్చెను. ఇది జరిగిన కొద్దికాలముననే ప్రోలరాజు సైన్యాధ్యక్షుఁడయిన రేచర్లబమ్మ సేనాని కాంచీనగరమును ముట్టడించి దుర్గకవాటములను బ్రద్దలుకొట్టి పురమునఁ బ్రవేశింపఁగానే పురములోని పౌరులెల్లరును చక్రవర్తిపై తిరుగఁబడి వాని సంహరించిరి. అప్పుడు పౌరులెల్లరు స్వాగతము నొసంగఁగాఁ గులోత్తుంగుఁడు సింహాసన మధిష్ఠించి రాజ్యమును గైవశముఁ జేసికొనియెను. రేచర్లబమ్మ సేనాని కాంచీనగర కవాటములను దెఱపించి చోడచక్రవర్తి మానమును హతముగావించి తన ప్రభువైన కాకతివల్లభునకు వీరలక్ష్మిని వివాహమును గావించెనని పాలంపేట, పిల్లలమఱ్ఱి శాసనములలో వర్ణింపఁబడిన విషయ మీ సందర్భముననే యైయుండునని నేనభిప్రాయపడుచున్నాను.

## జైనమతవ్యాప్తి.

ఈ మొదటి కాకతి ప్రోలరాజు కాలమున నీదేశములో జైనమతము విశేషవ్యాప్తి కలిగి యున్నటులు గన్పట్టుచున్నది. పశ్చిమచాళుక్యుల కాలమునందును, వారికిఁ బూర్వులయిన రాష్ట్రకూటుల కాలమునందును జైనమతమునకును రక్షణమును వ్యాప్తియు నుండెడివి కాని వీరశైవ మతము మొలకెత్తిన తరువాత జైనమతావలంబకులు పెక్కుండ్రు శైవులగుచు వచ్చిరి. కొందఱు వీరశైవులే యైనారు. శైవవైష్ణవములు ప్రబలిన తరువాత నాంధ్రదేశమున జైనమతమునకు స్థానము లేకపోయినది. వేఁగిదేశమున రాజరాజ నరేంద్రుఁడు శైవమత పక్షాభిమాని యగుటచేత జైనమతమునకు రక్షణము పోయినది. రాజరాజ నరేంద్రుని రాజధానీ నగరమున ఋషభనాథ తీర్థుఁడను నొక సుప్రసిద్ధజైనయతి రాజమహేంద్రవరమునుండి అనుమకొండ రాజధానికి వలసిపోయినవాఁడు సుప్రసిద్ధుఁడై యుండెనని యోరుగంటి కయఫియ్యతు దెలుపుచున్నది. అట్టి ప్రసిద్ధ విద్వాంసుఁడు వేఁగీదేశమునకా కాలమున నాయకరత్నముగానున్న రాజమహేంద్ర నగరమువంటి నగరమును వీడి యోరుగంటికిఁ బోవుట పరమతస్థుల పెట్టు బాధలవలననేయని వేఱుగఁ జెప్పవలయునా ?



# కాకతీయాంధ్రరాజయుగచరిత్రము.

## ఐదవ ప్రకరణము.

### కాకతిరాజుల చరిత్రము.

### పలనాటివీరచరిత్రము.

మొదటి ప్రతాపరుద్రునకు సమకాలికులయిన పల్నాటివీరుల చరిత్రమును సంగ్రహముగా నీప్రకరణమున వివరింపఁబోవుచున్నాఁడను. పండ్రెండవశతాబ్ది ప్రారంభమునఁ బల్నాడు పశ్చిమచాళుక్యచక్రవర్తులకు సామంతులుగ నుండిన హైహయవంశజులయిన గళచుటిరాజులచేఁ బరిపాలింపఁబడుచుండెను.1 బిరుదాంకరుద్రుఁడను నామాంతరముగల చాగిబేతరాజు పల్నాటికిఁ బ్రభువై భూలోకమల్లుఁడను పశ్చిమచాళుక్యచక్రవర్తికిఁ గప్పము గట్టుచుండె

1. పల్నాడనునది గుంటూరుజిల్లాలో నొకతాలూకాయైయున్నది. ఇయ్యది కృష్ణానదీ దక్షిణతీరమున సముద్రమునకు నించుమించుగా ౧౨౦ మైళ్లదూరములో నున్నది. ఈసీమకు నుత్తరమునను బడమటను ౭౫ మైళ్ళపొడవునఁ గృష్ణానది ప్రవహించుచున్నది. దీని దక్షిణభాగము కొండలచేతను దట్టములయిన యడవులచేతను నావరింపఁబడి యున్నదిగాని తూర్పునఁ జిట్టడవులు మాత్రమే వ్యాపించి యున్నవి, దీనియొక్క వైశాల్యము ౧౦౫౦ చదరపుమైళ్ళుండును. వాగులేఱు, చంద్రవంక, యనునదులు దీనిగుండఁ బ్రవహించుచున్నవి. ఈభూప్రదేశము చరిత్రకాలమునకుఁ బూర్వమునుండియుఁ బ్రఖ్యాతి వహించి యున్నది. ఇది మొదట నాగులకు నివాసభూమిగనుండి యాంధ్రభృత్యవంశపురాజుల పరిపాలమునఁ బల్లవులచే నాక్రమింపఁబడి పల్లవనాడని పేరుపొంది తరువాత పలనాడనియు, పల్నాడనియు వ్యవహరింపఁబడుచున్నది చరిత్రాంశముల నెఱుంగమి కొందఱాంధ్రికవులు పల్లెనాడని గ్రంథస్థము గావించిరి. తక్కిన వ్యుత్పత్తులంతగాఁ బాటింపఁబనిలేదు.

నని మొదటిప్రకరణమునఁ జెప్పియున్నాడను. 1 ఇతఁడు కామనూరు గ్రామవాస్తవ్యుఁడు ఋగ్వేదపదపాఠియునగు నొక బ్రాహ్మణునిచే మాధవిపట్టణమునఁ బ్రతిష్ఠింపఁబడిన త్రిమూర్తి దేవాలయమునకు శా. శ. ౧౦౫౧ సౌమ్యసంవత్సరము (క్రీ. శ. ౧౧౨౯-30) దాన శాసనమును వ్రాయించెను. ఇందుఁ జెప్పఁబడిన మాధవిపట్టణము గురివిందస్థలమనియు గురిజాల యనియు, జెప్పఁబడు చున్నది. పల్నాటిలోని మాచెర్ల గ్రామములోని చెన్నకేశవస్వామి దేవాలయములో నింకొక శాసనము పండ్రెండవశతాబ్ది ప్రారంభమునాఁటిది గలదు. పల్నాటికి రాజధానియగు మహాదేవితటాకము (మాచెర్ల)లో నొకానొక యాదిత్యునిచే నాదిత్యేశ్వర దేవాలయము నిర్మింపఁబడినది. చంద్రకులమునందు జనించిన కార్తవీర్యార్జునుని వంశమునందుఁ బుట్టిన చాగిబేతరాజు నలుగురు కుమారులలోను రెండవవాఁడగు వీరకామునికుమారుఁడు బేతరాజు దీనికి భూదానము చేసియుండెను. హైహాయవంశజులయిన యీరాజులు పండ్రెండవశతాబ్ద ప్రారంభమునందుఁ బల్నాటికిఁ బ్రభువులై పరిపాలించుచున్న విషయము వాస్తవమని పై శాసనములంబట్టి స్పష్టమగుచున్నది. ఈ రాజులయొక్క చరిత్రమే పల్నాటి వీరచరిత్రమనుపేరఁ బెక్కండ్రు తెలుఁగు కవులచే ద్విపదరూపమున వ్రాయఁబడి యాంధ్రదేశమునఁ బఠింపఁబడుచున్నది. ఈ గ్రంథమున కనేక పాఠాంతరములు గలవు. 2 ఈ గ్రంథము లన్నిటిలో శ్రీనాథకవి ప్రణీతమైనదని చెప్పఁబడు

---

1. ఆంధ్రులచరిత్రము రెండవభాగము మొదటి ప్రకరణము 14-15 పేజీలను చూడుఁడు.

2, పల్నాటి వీరచరిత్రమును శ్రీనాథకవి, కొండయ, మల్లన, బలరామసెట్టి, ముదిగొండ వీరభద్రకవి, మొదలగువారు రచించియున్నారు. వీరిలో శ్రీనాథుని గ్రంథము ప్రాచీనము; ఈ శ్రీనాథుఁడు శృంగారనైషధాది మహాకావ్యములను రచించిన కవిసార్వభౌముఁడేయని చెప్పుచున్నారుగాని, యీ గ్రంథములోని వ్యాకరణ దోషములను వీక్షించినప్పుడీ గ్రంథ మామహాకవి విరచితము కాదేమోయని సందియము కలుగుచున్నది ముదిగొండ వీరభద్రకవి గ్రంథము క్రీ. శ. ౧౭౬౩ వ సంవత్సరమున రచింపఁబడినదిగావున నవీనము. ఇది పద్యకావ్యము. ఇది పాఠాంతర భేదము లనేకములు గలవు.

గ్రంథము మాత్రము ప్రాచీనమైనదిగఁ దోచుచున్నది. పాఠాంతర భేదములను విడిచి నేను గ్రహించిన కథాసారమును మాత్రమే యిందు వివరింపఁబోవు చున్నాఁడను. ఉత్తర హిందూస్థానమునఁ బాలమాచాపురియను పట్టణము గలదు. దానికి జంభనాపురమని నామాంతరము గలదు. ఆపట్టణమును గార్తవీర్యార్జునునకు నేఁడవ తరమువాఁడైన యనుగు రాజేలుచుండెను కార్తవీర్యార్జునుఁడు చేసిన పాపములు తన్ను బాధింపఁగా ననుగురాజు విదగ్ధులగు విప్రవర్యుల యాలోచనము గైకొని జీడినూనె గుడ్డలుధరించి తన సైన్యముతోను, తన మంత్రులతోను, తన ధనముతోను, తన కుటుంబముతోను, తన కులదేవతలతోను, స్వరాష్ట్రమునువిడిచి పాప పరిహారార్థమై తీర్థయాత్రలు సేయఁగోరి నానాక్షేత్రంబుల కరుగుచు పుణ్యానదులలో మునుంగుచు నాంధ్రదేశమునకువచ్చి యమరావతి రేవునఁ గృష్ణానదిలో స్నానముచేయఁగా నల్లని జీడినూనె గుడ్డలు తెల్లనివాయెనఁట! ఇట్లు తెల్లనగునని బ్రాహ్మణోత్తములు చెప్పుట వలననే యనుఁగురాజు స్వదేశమునువిడిచి యీదేశమునకు రాఁగలుగుట తటస్థమైనదఁట![1] ఈదేశమునకువచ్చి యనుఁగురాజు వెలనాటి రాజవంశములోఁ జేరిన యొకకన్యను వివాహముఁ జేసికొనియెనఁట! ఆమెపేరు మైలమదేవి. చందవోలు రాజధానిగ వేంగీదేశమును రాజప్రతినిధిగనుండి పరిపాలనము సేయు మైలమదేవి తండ్రి కూతుఁనకుఁ బల్నాడరణముగా నొసంగినందున ననుగురాజు గురిజాల రాజధానిగఁ బల్నాటి కధిపతియై ప్రజాపరిపాలనము సేయుచుండెనఁట!

1. హైహయులు చేదిదేశమునుండి వచ్చినవారు. వీరిని గళచురిరాజులందురు. వీరు చేదిదేశమున మాత్రమే గాక చాళుక్యులకాలమునఁ గొంకణదేశమునందుండిరి. బుందేలుఖండములోనుండు కాలంజరుకోట హైహయులదే. పదునొకండవ శతాబ్దమున గజనీ మామూదును, పండ్రెండవ శతాబ్దప్రారంభమున మహమ్మదుగోరియు, వీరిపై దండెత్తివచ్చుటచేత నుత్తరముననున్న హైహయులు దక్షిణమునకు వచ్చిరి.

ఇతనికి రేచెర్ల బేతినాయనికొడుకు దొడ్డనాయఁడు మంత్రిగనుండెను. అనుగురాజునకు మైలమదేవి, వీరవిద్యాదేవి (విజ్జలదేవి,) భూరమా దేవియను ముప్వురుభార్యలు గలరు.1 వీరిలో మైలమదేవికి నలగామ రాజును,వీరవిద్యాదేవికిఁ బెదమల్లదేవుఁడు,పినమల్లదేవుఁడు బాలమల్ల దేవుఁడును, భూరమాదేవికిఁ గామరాజు, నరసింగరాజు, ఝట్టిరాజు, పెరుమాళ్ళరాజును జనించిరి. వెలనాటిరాజులు శూద్రులమని చెప్పు కొన్నవారు. కార్తవీర్యార్జునుని సంతతివారయిన హైహయులయిన గళచురిరాజులు క్షత్త్రియులమని చెప్పుకొన్నారు. ఇట్టి వివాహములా కాలమునం దనేకములు జరుగుచున్నందులకు దృష్టాంతము లనేక ములు శాసనములలోఁ గానంబడుచున్నవి. చతుర్థాన్వయ సంభవు లయిన వెలనాటి రాజులతోడి సంబంధముచేతనే హైహయరాజు లనేకులు వేంగిదేశములో (గుంటూరు, కృష్ణా; గోదావరి మండల ములలో) సామంతపదవులను వహించి పండ్రెండవశతాబ్ద ప్రారంభ మునఁ బ్రసిద్ధిగాంచిరి. కృష్ణా, గోదావరీ మండలములలోఁ బరి పాలనము చేసిన కోనసీమరాజు లెల్లరును హైహయరాజులే యనియు పల్నాటిహైహయులును కోనసీమహైహయులును చాళుక్యులు ఈ దేశమును జయించినప్పుడు వారితోఁగాని, గజనీమామూదు, మహ మ్మదుగోరీల కాలములోఁగాని, యాంధ్రదేశమునకు వచ్చియుందురు. పల్నాటిలోని శాసనములలోఁ బేర్కొనంబడిన చాగిబేతరాజునకే యనుగు రాజను నామాంతరము గలదేమోయని సందేహముకలుగు చున్నది. అయినను గాకపోయినను శాసనములోని చాగిరాజకుటుం బములోనివారే యీయనుగురాజు మొదలగు వారని మనము నిస్సం శయముగా విశ్వసింపవచ్చును. అనుగు రాజునకు మొదట సంతా

1. మైలమదేవిక వీరవిద్యాదేవియను నామాంతరము గలదని ముదిగొండ వీరభద్రకవి యిరువురు భార్యలనే వక్కాణించెను.

నము లేకపోయినదఁట అంతట క్షత్త్రియుండైన యనుగురాజు తన మంత్రియైన దొడ్డనాయని పుత్త్రుఁడగు బాదన్నను బెంచుకొని యెనఁట! [1]

పెద్దనాయనిఁ బెంచుకొన్న తరువాతనే మూవురురాణుల యందును రాజునకు సంతానము గలుగుట సంభవించెను. రేచెర్ల దొడ్డనాయనికి శీలమ్మ యందు పెద్దనాయఁడు, బ్రహ్మనాయఁడు, సూరిసీఁడు, పేరిసీఁడు, మల్లిసీఁడు, అను నేవురుపుత్త్రులు జనించి పంచపాండవులవలెఁ బరాక్రమవంతులై తేజోధికులై యొప్పుచుండిరి. వారిలో బాదన్న గొప్పరాతు; బ్రహ్మనాయఁడు రాజకార్యధురంధరుఁడును మహావీరుఁడునై యుండెను.

## పెద్దనాయని కథ.

అనుగురాజు తనమంత్రియైన రేచెర్ల దొడ్డనాయని పుత్త్రుఁడగు పెద్దనాయనిఁ బెంచుకొని యాతనికి వివాహముఁ జేయ నిశ్చయింపఁగా నాతనికి క్షత్త్రియులెవ్వరుఁ గన్యక నీయకపోయిరఁట! అనుగురాజుచే దేశదేశంబులకుఁ బంపబడిన దూతలిట్లు క్షత్త్రియులెవ్వరును శూద్రునకుఁ గన్యక నిచ్చుట కొడంబడక పోవుటచేత విసిగి వేసారి తుదకు నాంధ్రదేశములోని చందవోలునకు విచ్చేసిరి.[1] అచ్చట నొకబ్రాహ్మణుఁ డనుగ్రహించి వారలకు నొక్కయుపాయము చెప్పెను. క్షత్త్రియుండైన కృష్ణగంధర్వుని కడకుఁ బోయి పెద్దనదత్తపుత్త్రుఁడని చెప్పక మాటలాడి యతనికూఁతు రయిన ముక్తలవాంబ నిప్పించి వివాహకార్యము నెఱవేర్చుటుచితమని యాతఁడు చెప్పెను. ఆయుపాయ మనుకూలముగ నున్నదని

---

1. బాదన్నకే పెద్దన లేక బెద్దనాయఁడని నామాంతరము గలదు. పెద్దన యనియే కొన్ని గ్రంథములందు వక్కాణింపఁబడెను.

భావించి దూతకృత్యమును నెరవేర్చెడి బ్రాహ్మణులు కంచెర్లనగర మునఁ గృష్ణగంధర్వుని సందర్శించి దత్తస్వీకారము సంగతి నెత్త కయే తమసందేశమును దెలిపిరి. అంతట కృష్ణగంధర్వుఁడలుగు రాజుతోడి బాంధవ్యమున కపరిమితానందమును బొంది పెద్దనకు దన చిన్నకొమార్తె యయిన ముక్తలవాంబ నొసంగి వివాహముఁ జేయుటకు సమ్మతించెను. పిమ్మట బ్రాహ్మణులు గురిజాల కేతెంచి యాశుభవృత్తాంతము నంతయు నలుగురాజునకుఁ జెప్పి యాతని వలన విశేష బహూమానములను బొందిరి. అటుపిమ్మట నలుగు రాజు దైవజ్ఞులయిన పెద్దలవలనఁ నొకశుభముహూర్తమును విచారించి బంధుపరివారసమేతముగాఁ గంచెర్లకుఁ దరలిపోయి యాశుభ ముహూర్తమునఁ బెద్దనకును ముక్తలవాంబకును వివాహమును గావించి పెద్దన నత్తవారింట విడిచి నిజరాజధానికి మరలి వచ్చిరి. అత్త వారింట నున్నకాలమునఁ బెద్దన తనబావమఱఁదులతో వనవిహారాది క్రీడావినోదములఁ బ్రొద్దుపుచ్చుచుఁ దన యశ్వవిద్యానైపుణ్యమును బరాక్రమమును జూపుచు వారలకుఁ దనపట్ల నసూయ జనింపఁజేయుకార్యములను జేయుచుండెను. ఇట్లుండ వారలకు నితండు శూద్రుండనియు నలుగురాజు దత్తపుత్త్రుండనియుఁ దెలియవచ్చెను. ఇయ్యది విన్నతోడనే వారలాగ్రహించి పెద్దనాయనిఁ జంపఁజూచిరి కాని యెదుర్కొనుటకు సాహసింపఁజాలక యెట్లయిన నాతనిఁ బరిమార్చు నుపాయ మాలోచింపుమని తండ్రిని బ్రోత్సహింప సాగిరి. అతండును మాయోపాయంబున నాతని గడతేర్చి కులగౌరవమును నిలుపకొనవలయునని యోజించెను. ఇంతవఱకు రౌతుల ననేకులం జంపి మదించి యప్రఖ్యాతి గాంచియుండిన గంధర్వాశ్వము బహు మానముఁ జేసిన నయ్యది నిందప్పక చంపుననియు, అంతటఁ దన కొమార్తె ముక్తలవాంబ వానితో సహగమనముఁ జేయుననియు,

అంతటితో వారివలనఁ గలుగఁబోయెడు నగౌరవమంతయుఁ దొలం గుననియు నూహించి యతండాగుఱ్ఱము నల్లునకు బహుమానముఁ జేసెను. తానొకటితలంచిన దైవము వేఱొకటి తలంచుననను నట్లుగా నమ్మహాకార్యమువలనఁ బెద్దన చచ్చుటకు మాఱుగా వారలెల్లరుఁ జచ్చుట సంభవించినది. పెద్దన స్వారిచేయుటయందుఁ గడితేఱిన రౌతు గావున నతండాగుఱ్ఱము నెక్కినతోడనే యది వానియొక్క సామర్థ్యమును దెలిసికొని వానిం గడతేర్చుట యసాధ్యమని భావించి వశవర్తియై వాయువేగమునఁ బఱువిడ సాగెను. అతనిరాక యెప్ప టికిని గానరాకపోయినందున నాయశ్వమతనిం జంపియుండునని యెల్లవారును నిశ్చయించిరి. తనభర్త మరణమునకు మిక్కిలి దుఃఖించి ముక్తవాలంబ బ్రతుకునందాస విడిచి భర్తతో సహగమనముఁ జేయఁ దలపోసిన తనయభీష్టమును తల్లిదండ్రులకు సహోదరులకునుఁ జెప్పి చితినిపేర్పించి యగ్నిని దాకొల్పి యందులోదుముక సంసిద్ధు రాలయి యున్నసమయమునఁ బెద్దన యాయశ్వంబుతో వాయు వేగమునవచ్చి యామెను బట్టికొనిపోయి తనప్రక్క నుంచుకొని తన బావమఱఁదులతోడఁ బోరాడి వారలనెల్లర నుక్కడించి యాపట్ట ణమును నాశనము గావించి మహాపౌరుషమునుజూపి పిమ్మటఁ దన పుట్టినయింటికిఁబోయి తనతల్లిదండ్రులకును బంధుజనంబులకు నమితా నందమును గలుగఁజేసి హయారూఢరేవంతుఁడను మహాబిరుదమును గాంచి పల్నాటివీరులలో సుప్రసిద్ధుఁడయ్యెను. వీరచరిత్రమునం దీతని చర్యలత్యద్భుతముగా నభివర్ణింపఁబడినవి.

## నర్లకొండ దండయాత్ర.

తరువాత దొడ్డనాయఁడు మంత్రిగ ననుగురాజు ప్రజారంజ కముగఁ బరిపాలనము సేయుచుండ నొకనాఁడు దానును. తెప్పలినా

యుఁడు[1] అనువాఁడును, మృగయావినోదార్థము నరణ్యమునకుం జని నర్లకొండ సామీప్యమున బసచేసి యుండిరి. అక్కడ నొక వ్యవసాయదారుఁడు కొన్నివిత్తనములనుదెచ్చి రాజునకు కానుకగా నర్పించెను. ప్రభువు వానిని స్వీకరించి యంతఃపురము నుండు రాణులకుఁబంపెను. వారలింక నట్టివిత్తనములు గావలయునని కోరఁగాఁ దెప్పలినాయుఁడా రైతులపొలములను దోఁచి విత్తనములను సంగ్రహించి తెచ్చెను. అట్టివిత్తనములతో వారెల్లరును గురిజాలకువచ్చిరి. ఆవిత్తనములను గొల్లఁబోయిన పొలముకాపఱు లెల్లరును తమ దురవస్థనంతయు దమ యేలికకు విన్నవించుకొనిరి. అంతట నాయేలిక యాగ్రహాయత్తచిత్తుఁడై యలుగుభూపతికి భయంకరమైన సందేశమును బంపెను. దొడ్డనాయఁడు తెప్పలినాయనితోడ నర్లకొండపై దండయాత్ర వెడలెను. ఈదండయాత్ర వీరచరిత్రమున నత్యద్భుతముగా నభివర్ణింపఁబడినది. అప్పుడచ్చట నర్లకొండ ప్రభువునకును దొడ్డనాయనికిని భయంకరమైన యుద్ధము జరిగెను. ఆయుద్ధములో నర్లకొండనాయకుఁడు మృతినొందెను. వానిసైన్యము పలాయనమయ్యెను; నర్లకొండ శత్రువులకుఁజిక్కి దోఁచుకొనఁబడియెను. ఇట్లు దొడ్డనాయఁడు విజయముతో గురిజాలఁ బ్రవేశించెను.

## నాయకురాలి వృత్తాంతము.

జిట్టగామాలపాడను నొక గ్రామమున చౌదరి రామిరెడ్డి యను పేరుగల యొక బీదరైతు పొలములో బనిచేసి కొనుచుండఁగా నా సమీపమునం దున్న కంచెలో నొక యాఁడుశిశువు కాన్పించెను. ఆరైతు శిశువును గొనిపోయి పెంచుచుండెను. ఈశిశువు మాత్రమే గాక యాతని కాదినమున భూమిలోనుండి ధనముకూడ లభించెను.

1. ఇతఁడు మాలవాఁడు.

అతఁ డా ధనముతో భాగ్యవంతుఁ డయ్యెను. అతఁడు ముప్పిరిగొన్న ప్రేమంబుతో నాశిశువునకు నాగమ్మ యని పేరుపెట్టి నిజపుత్త్రికనుం బోలెఁబెంచి పెద్దదానిగఁజేసెను. తరువాత రామిరెడ్డి యీయామె నొక ధనికున కిచ్చి వివాహముం జేసెను కాని, యత్యంత శీఘ్రకాలము లోనే తండ్రియు భర్తయుఁ గూడ మృతినొందుట సంభవించి వారల యైశ్వర్య మంతయు నీమెకే సంప్రాప్త మయ్యెను తన యైశ్వర్య బలముచేత నీమె దేశమున నొక ప్రముఖురాలుగ నుండి యాత్మశక్తి చేత నెల్లెల్లో యనుగురాజుయొక్క అనుగ్రహమును సంపాదించి నాయకురా లను బిరుదు నామమును వహించి ప్రఖ్యాతి గాంచెను. ఇట్లు తన నేర్పుచేత రాజును వశపఱుచుకొని మంత్రాంగముచేసి యెట్లయిననేమి యనుగురాజునకును దొడ్డనాయనికిని విరోధమును గల్పించెను. అంతట దొడ్డఁ డీమె దుర్మంత్రమువలన మంత్రిపదవిని తన రెండవ కుమారుఁడైన బ్రహ్మనాయనికి విడిచిపెట్టి తాను దొలంగెను. బ్రహ్మనాయఁడు స్వప్రయోజన పరుఁడై తన ప్రభు వైన యలుగురాజును జంపించెను. తరువాత దొడ్డనాయఁడును మర ణము నొందెను.1

## నాయకురాలి దుస్తంత్రములు,

అలుగురాజు స్వర్గస్థుడైన వెనుక నలగామరాజు పట్టాభి షిక్తు డయ్యెను. ఒకనాఁడు నలగామరాజు స్వపరివారముతో వేఁటాడ నరణ్యమునకుఁ బోయి యందందుఁ బెక్కు మెకంబుల వేఁటాడి భరింపరాని సూర్యాతపంబునకుఁ జిక్కి మిక్కిలి డప్పిగొని విశ్రమింపఁ దగినతావును వెదకికొనుచు వచ్చుచుండెను. నాయకు రాలు రాజామార్గమున వచ్చునని ముందుగానే తనబుద్ధిచే నూహించి

1. బ్రహ్మనాయఁడు తనతండ్రిం గూడ నలుగురాజుతో స్వర్గమున కనుగ మింపజేసెనని చెప్పబఁడియె.

యామార్గమున నొక చల్లని ప్రదేశమునఁ జలువపందిరి వేయించి స్నానంబునకు నుష్ణోదకమును పానంబునకు శుద్ధోదకమును సమకూర్పించి షడ్రసోపేతమైన భోజనమున కనుకూలము లగు పదార్థములను సిద్ధముచేయించి తన ప్రభువునకై యెదురుచూచుచుండెనఁట! నలగామరా జాప్రదేశమునకు విచ్చేసి నాయకురాలిచే నాహూతుఁడై యచట నిలిచి యామెయొక్క యాతిథ్యమును సంతోషపూర్వకముగాఁ గైకొనియెను. అతని కప్పు డా ప్రదేశమంతయు భూతలస్వర్గముగా నుండెను. అతఁడు సంతోషసాగరమునఁ దేలుచున్న సమయమును గనుపెట్టి నాయకురాలు ప్రభువునకు మాఱుగాఁ దాను కొన్ని గడియలు ప్రభుత్వము చేయుట కనుగ్రహింపవలసిన దని వేఁడికొనఁగా నందుల కాతండు శంకింపక యట్లే యని వరమిచ్చెను. తరువాత వారలందఱును గురిజాలకు మరలివచ్చిరి. కొన్నిదినములు గడచినవెనుక నాయకురాలు వాగ్దానముప్రకారము ప్రభుత్వమును వశపఱుపవలసిన దని యడిగెను. అతఁ డట్లు కావించెను. అంతట నామె తనపరివారమున కుత్తరువిచ్చి గ్రామములను దోఁపించి విశేషధనమును దెప్పించి నలగామరాజు కాళ్ళముంగటఁ గుమ్మరింపించి "మహాప్రభూ! సత్పరిపాలనము చేయఁ గోరినపక్షమున నిట్లే ప్రతిదినము ధనార్జనము చేయవలయు" నని హెచ్చరించుటయేగాక బ్రహ్మనాయఁడు విశ్వాసవిహీనుఁడును, మోసగాఁడు నై యున్నాఁడని యతనిపై కొండెములు చెప్పెను. అతఁడు దేశముయొక్క యైశ్వర్యము నంతయు జూఱఁగొన్నవాఁడని గూడ నిందింపసాగెను. ఈమెవలలోఁ జిక్కుకొని నలగామరాజు బ్రహ్మనాయనిపట్ల మనస్పర్థను వహించెను. బ్రహ్మనాయఁడు ధనము గోల్పోయినవారికి ధనము నొసంగి యాదరించుచు వారల మన్ననకుఁ బాత్రుండగుచు నుండెను. ఏమయిననేమి? నలగామ

రాజాదు లీమెచేతిలోని కీలుబొమ్మలై యెట్లుద్రిప్పిన నటు దిరుగు చుండిరి. ఎట్లయిననేమి? సవతితల్లి బిడ్డలపై నలగామరాజునకుఁ గల ప్రేమ దొలఁగునటులఁ జేసెను. అంతటితో నూరకుండక వీరవిద్యాదేవిపుత్త్రులయిన మల్లదేవాదులను జంపింపఁ దివిరెను, దొడ్డనాయని భార్య యగు శీలమ్మ ఘోరమైన మరణమునుండి యాబాలురను దప్పించి గాపాడి వారలను బ్రహ్మనాయనివశము చేసెను. బ్రహ్మనాయఁడు వీరలను దగ్గఱకుఁదీసి రాజ్యములోఁ గొంతభాగము నిప్పించి గురిజాల విడిచిపెట్టి మాచెర్ల యను పట్టణమును గట్టించి వారల నచ్చటికిఁ గొనిపోయి వారు బాలురైనందున వారలకు బదులుగా తానే పరిపాలనము సేయుచుండెను. మాచెర్లపట్టణము చంద్రవంక యను నొక యేటియొడ్డునఁ గట్టఁబడియున్నది.

## బ్రహ్మనాయని సంతానము.

దొడ్డనాయనిపుత్త్రులలోఁ బెద్దనాయఁడు కృష్ణగంధర్వుని కూతుఁరగు ముక్తలవాంబను బెండ్లాడె నని యిప్పటికే చెప్పియున్నాను. బ్రహ్మనాయని భార్య ఐతాంబ. ఈమెకు ఈడమ్మ యను నామాంతరము గలదు. పేర్నిని భార్య గౌరమ్మ; సూర్నిని భార్య సీరమ్మ; మల్లినినిభార్య మాచమ్మ. వీరిలో బ్రహ్మనాయని భార్య యగు నైతాంబకు మాత్రము సంతానము గలదు. ఐతాంబకు విష్ణువరప్రసాదమున బాలనాయఁడను పుత్త్రుఁడు మహాశూరుఁడుద్భవించెను. మఱియు విష్ణువుయొక్క యనుగ్రహముచేతనే "యొక బ్రాహ్మణయువతికి జనించినట్టి అనపోతరాజు; ఒక వెలమ, స్త్రీకి జనించినట్టి దోర్నీఁడు, ఒక చాకలి వనితకు జనించిన చందన్న ఒక కుమ్మర కొమ్మకుజనించిన తేర్కుఁడు, ఒక కంసాలి కలికికి జనించిన చందన్న, ఒకమంగలిభామకు జనించిన మంచన్న," అను నార్గురు పుత్త్రులు బాలనాయనికి నుగ్గుపాలనాఁటినుండి మిత్త్రులై యాతనికిఁ

దమ్ములవలె నుండి యట్లే వ్యవహరింపఁబడుచుండిరి. బాలనాయని జన్మనక్షత్రము మంచిది కాదని దైవజ్ఞులయిన బ్రాహ్మణులు చెప్పినందున బ్రహ్మనాయఁడు వానిని జంపఁ దన ప్రియసేవకుని కనమదాసను కన్నమనాయని నియోగించెనుగాని యతఁడట్లు వానిని జంపలేక బ్రహ్మనాయనితమ్ముఁడగు పేరినాయనివశము గావించెను.[1] అప్పటినుండియు బాలనాయనిఁ బేర్నీడు పెంచుచుండె నని చెప్పఁబడియెను. శైవుఁ డొసఁగెనని చెప్పిన వరప్రసాదజనితులైన యాఱ్వురు బిడ్డలను పేర్నీనిగృహముననే పెరుఁగుచుండిరఁట!

బాలనాయని వివాహము.

కొన్ని సంవత్సరములు గడచిన వెనుక గండుకన్నమనాయఁ డనువాఁడు బ్రహ్మనాయనిసభలో నాతని కెదురుగఁ గూరుచుండి తనకొమార్తె మంచాల యను బాలికను దగ్గఱనుంచికొని యీమె నొక యుత్తమకులీనుఁడైన యౌవనవంతునకు వివాహముచేయ నభి లాష కలదని పలుకఁగా ఆలకించి పేరినీఁడు తనయింటఁ బెరుఁగుచున్న బ్రహ్మనాయనిపుత్త్రుని రప్పించి తనప్రక్కఁ గూరుచుండఁబెట్టుకొని యాతనికిచ్చి వివాహము చేయవలసినదని కన్నమనాయనితోఁ బలి కెను. బ్రహ్మనాయఁడు తనకుమారుఁడైన బాలనాయని గుర్తించి యతఁ డెట్లుమరల బ్రదికెనని యాశ్చర్యపడసాగెను. కనమదాసు జరిగినవృత్తాంతమును వెల్లడించెను.

బ్రహ్మనాయఁడు మూఢభక్తియు, మూఢవిశ్వాసములు గల వాఁడు గావున దుష్టనక్షత్రమున జనించిన కుమారుఁడు బ్రతికియుం డిన నేమికీడు వాటిల్లునో యని బెంగగొని మనస్సును స్థిరపఱుచు

1. ఇతఁడు మాలవాఁడైన తెప్పలినాయనికి పెమ్మసానికి బ్రహ్మనాయని వరమునఁ • బుట్టినాఁడు.

కొనలేక బంధువులు, మిత్రులు. పరివారజనంబులు, సభ్యులు మొదలగువారందఱు గుండియ లవియునట్లు మరల తన కుమారుని వధ్యశిలపై వధింపవలసినదని తన ప్రియభృత్యుఁడగు కనమదాసున కుత్తరువు గావించెను. అతఁడు ప్రభువునాజ్ఞ శిరమునఁదాల్చి బాలుని వధ్యస్థానమునకుఁ గొంపోయి చూపరులెల్ల హాహాకారములు సేయుచుండ భైరవఖడ్గముతో బాలనాయని శిరమున నొక్కదెబ్బ తీసెనఁటగాని యేమి మాహాత్మ్యముచేతనో యాఖడ్గము ముక్కలై చెక్కలై పొడుమై క్రిందఁబడెను. బాలచంద్రుని శిరము నిర్భేద్యమై నొవ్వక యుండెనఁట! అంతట బాలనాయఁడు బ్రహ్మనాయని సభకు దేఁబడియెను. సభాసదులు బాలనాయని ప్రాణములను రక్షింపఁ బ్రార్థించిరి. బ్రహ్మనాయఁడు వారల ప్రార్థనల మన్నించి తుదకుఁ బుత్త్రుని స్వకుటుంబములోఁ జేర్చుకొనియెను అటుపిమ్మటఁ దన కొడుకునకు మంచాలమ్మను ఇచ్చి పెండ్లిచేయుమని కన్నమనాయని అడిగెను. ఆతఁడు దురాశాపీడితుఁడై విశేషధన మీయవలసినదని కోరెనఁట! అందులకు బ్రహ్మనాయఁ డంగీకరించి యమిత సువర్ణము గానుకగా నంపించి క్రమముగా నొక్క శుభముహూర్తమున బాలనాయనికిని మంచాలమ్మకును మిక్కిలి వైభవముతో వివాహము గావించెను.

## నాయకురాలి మాత్సర్యము.

బ్రహ్మనాయని వైభవమునంతయుఁ జారులవలనఁ దెలిసికొని వారివిభవాభివృద్ధి తనప్రభువు పరిపాలనమునకు భంగము కలిగించునని మాత్సర్యమును బూని నాయకురాలు మాచెర్లపట్టణమును దోఁచుకొనిరండని గడెకారులయిన దోఁపిడికాండ్రను, నాగరికము లేని చెంచులు కోయలు మొదలగు నడవిజనంబులను బంపెను కాని

మహావీరుఁడైన మాలకనమదాసు వారల నెదుర్కొని పోరాడి యోడించి వారల వీపుపై ఇసుకబస్తాలను గట్టించి పశువులను దోలుకొనివచ్చినట్లుగా వారిని వెంబడించివచ్చి గురిజాలఁ బ్రవేశించెను. నాయకురాలు స్వయముగా బయలువెడలివచ్చి కనుమదాసు నానావిధములయిన దుర్భాషలను బలికెను. అందుపై మహోగ్రుఁడై కనమదాను నాయకురాలిని జంప నుద్యుక్తుఁడై పైఁబడ నామె తప్పించుకొని పాఱిపోయి సురక్షితముగా నంతఃపురముఁ బ్రవేశించెను. ఇంతలో బ్రహ్మనాయఁడు తన ప్రియభృత్యుఁడైన కనమనీడు గానరానందున దిగులుఁజెంది తనప్రభువయిన నలగామరాజును దర్శింపవలయునన్న మిషతో గురిజాలకు బైలుదేఱి వచ్చెను. నలగామరాజు, నరసింగభూపతి మొదలగు ప్రభువర్గమంతయు నాతని మిక్కిలి గౌరవముతో నాదరించిరి. అయినను నాయకురాలు అతనిని జంప నుపాయములు వెదకుచుండెను.

అతఁడు వచ్చుమార్గమున నగాధమైన గొయ్యిత్రవ్వించి కనఁబడకుండఁ బైన గసవుచేఁ గప్పించి మన్నుచల్లెను. ఆహారముతో విషముగూడఁ బెట్టించెను. ఎన్ని యపకృతులు గావించినను బ్రహ్మనాయఁడు బ్రతికియుండెను.

### కోడి పందెములు.

విందులారగించిన తరువాత ప్రభువు నాతని యతిథియు వెలుపలికి వచ్చినప్పుడు నాయకురాలు కోడిపందెము లాడించుచుండుట వీక్షింపసాగిరి. అప్పుడు నాయకురాలు గెలిచిన కోడిని రాజుకోడి యనియును, ఓడిపోయినకోడి బ్రహ్మనాయనికోడి యనియును హెచ్చరించుచు వచ్చెను. బ్రహ్మనాయఁడు దీనిని విని నాయకురాలి వర్తనమును నిందింపఁ జొచ్చెను. ఇట్టి నాయకురాలి వర్తనము వారని

మనస్స్పర్థను గలిగింప బ్రహ్మనాయఁడు పగసాధింపఁ బూనెను. ఓడిన యొకకోడి బ్రహ్మనాయఁడని పిలువంబడినతోడనే మరల జవసత్త్వములనుబొంది నాయకురాలను బిరుదును వహించిన కోడిని మాత్రమేగాక యెదిరించినవానినెల్ల జయించుచు వచ్చెను. దీని నంతయును జూచి నాయకురాలు సహింపఁజాలక కోపావేశ పరవశురాలయి తనతోఁ గోడిపందెము వేయవలసినదని కయ్యమునకుఁ గాలుద్రవ్వెను. అందుల కత డంగీకరింపఁగా గోళ్ళపోరాటమునకై సర్వసన్నాహములు చేసి ఇరుపక్షముల కోడిపుంజులను యుద్ధమునకు సంసిద్ధములు గావింపఁబడియెను.

ఎవ్వరికోళ్లు ఓడిపోవునో వారు పట్టణమును రాజ్యమును విడిచి కృష్ణదాఁటి వలసపోయి యేఁడు సంవత్సరముల వఱకుఁ బ్రవాసమున నుండి యనంతరము రావలసి యుండు నన్న ప్రతిజ్ఞాపత్రముపై నిరుపక్షముల వారును చేవ్రాళ్ళు చేసిరి. బ్రహ్మనాయనిమిత్రుఁడైన బాలగోపన్న నాయఁడు మధ్యవర్తిగా నంగీకరింపఁ బడియెను.1 అందఱ కత్యాశ్చర్యకరముగా బ్రహ్మనాయని కోడి నాయకురాలి పేరుగల పుంజులనెల్ల నొక్కొక్క దానిని నేలంగూల్చి మడియనటులఁ గొట్టుచుండెను. ఆపరాభవమును నాయకురాలు భరింపఁజాలక మాయోపాయమున మఱియొక పుంజుచే బ్రహ్మనాయని పుంజును జంపించెను. ఇంక బ్రహ్మనాయనికి పుంజులు లేకపోయెను. దీని నంతయు వీక్షించుచున్న మధ్యవర్తియైన బాలగోపన్న మహోదగ్రుఁడై లేచి యొక్కడే నాయకురాలి సైన్యముపైఁ బడి ఘోరయుద్ధముచేసి నాశనము గావించెను. ఇతఁడు మువ్వాలభీమన్నచేఁ జంపఁబడఁగాఁ గనమనీఁడు వీని శిరమును గొనిపోయి బ్రహ్మనాయని ముందటఁ బెట్టె ననియు, అతఁడు మంత్రప్రభావముచేత నాతనిఁ

1. బాలగోపన్ననాయఁడు గొల్లవాఁడు.

బునర్జీవుని గావించి మాచెర్లపట్టణమును బరిపాలింప నియోగించి మలిదేవరాజాదులతో సంబంధుసపరివారముగా సమయదీక్షనుబూని పట్టణమును విడిచిపెట్టి బయలుదేఱి యేలేశ్వరముకడఁ గృష్ణనుదాటి యరణ్యమున సంచరించుచు నచట మందాడి యను పట్టణమును నిర్మింపించి, లంకన్న సేనాపతిగ నందు నివసించుచుండె ననియు, చెప్పఁబడియెను.

## కనమనాయని యుద్ధము.

ఇట్లు బ్రహ్మనాయఁడు సమయబద్ధుఁడై దేశమువిడిచి ప్రవాసముపోయినను బ్రహ్మనాయఁడు బ్రదికియున్నంత వఱకుఁ దనకును దనప్రభువునకును క్షేమము కలుగదని నిరంతరమును దలపోయుచుండునది గావున నాయకురా లెట్లు ప్రతీకారము చింతింపక యూరకుండఁగలదు? అప్పుడు బ్రహ్మనాయఁడు మందాడిలో సుక్షితముగా విశేషప్రాభవముతో వఱలుచున్నాఁడని విని యోర్వఁజాలక యడవిచెంచులను గిరాతకులను రప్పించి బ్రహ్మనాయని పశువుల మందలను దూరముగాఁ దఱిమి చెదరఁగొట్టి రావలసినదని యుత్తరవు చేసి పంపించెను. అప్పుడా చెంచులును గిరాతకులును విశేష సైన్యములతో మందాడిపై దండెత్తి వచ్చి నాయకురాలి యాజ్ఞప్రకారము బసులమందలను జెదరఁగొట్టి యల్లరులుగావింప బ్రహ్మనాయని సేనాపతి యైన లంకన్నకును వారలకును భీమసంగ్రామంబు జరిగెను. ఆయుద్ధములో లంకన్న వీరస్వర్గమును జూఱఁగొనియెనుగాని, బ్రహ్మనాయని పాదసేవకుఁడును మాలయు విష్ణుభక్తుఁడు నైన కన్నమనాయఁడు శత్రుసైన్యముల నెదుర్కొని భయంకరముగాఁ బోరాడి నాయకురాలి సైన్యములను మందాడినుండి పాఱిపోవునట్లుగాఁ దఱిమితఱిమి గొట్టెను. అటుపిమ్మట బ్రహ్మనాయఁ

డాప్రదేశమున నుండిన దనకు క్షేమము గలుగదని యూహించి కృష్ణదాఁటి దక్షిణముగాఁ బోవలయునని నిశ్చయించెను.

బ్రహ్మనాయఁడు శ్రీశైలమునకుఁ బోవుట.

ఆప్రకారము బ్రహ్మనాయఁడు సబంధు పరివారముగా రాచ బిడ్డలను వెంటనిడుకొని మండాదిని విడిచిపెట్టి బయలువెడలి దొమ్మర్ల రేవుకడఁ గృష్ణానదిని దాఁటి మహాప్రసిద్ధ శివక్షేత్రమగు శ్రీశైల మునకుఁబోయి శ్రీమల్లికార్జున స్వామిని సందర్శించి యర్చనాదికృత్య ముల నెఱవేర్చి యచటి రాజయిన మాకరాజునకుఁ దన చరిత్రము నంతయు వినిపించి తన ఖడ్గమును గుదువబెట్టుకొని కోటిసువర్ణముల నప్పుగా నీయవలసిన దని యడిగెను. అతఁడందుల కంగీకరింపక ౨౩ గ్రామములను గుత్తకు నిచ్చెనఁట1! అంతట బ్రహ్మనాయఁడు త్రిపు రాంతక క్షేత్రమునకుఁ బోయి కొంతకాల మక్కడ నివసించియుండి మాచర్లపురమున "చెన్నారాయని" పేరను విష్ణాలయము నొక దాని నిర్మింపించి యటుపిమ్మట వీరమేడపి యను పట్టణమునకుఁ బోయి యచట నివసించుచుండెను. ఇచ్చట నుండఁగానే యేడు సంవత్సరముల గడువు గడచెను. అప్పుడు బ్రహ్మనాయఁడు బంధు పుత్త్ర మిత్త్ర కళత్రాది జనంబులతో విచారించి నలగామరాజు కడకు రాయబారమును బంప నిశ్చయించెను.

రాచమల్లుని రాయబారము.

రాచమల్లుఁడను బిరుదమును వహించిన అలరాజు కళ్యాణ పురాధీశ్వరుఁడైన వీరసోముని మనుమఁడు. పెదమల్లదేవుని బావ

1 ఆగ్రామము లన్నియు కందనోలిమండలములో మాచర్లపురము తాలూకాలోఁ దూర్పుభాగమున నున్నవి దానిలో మాచర్లపురము, దూఁపాడు చేపలమడుగు, కోలకలము, అంబసముద్రము, గణపవరము, త్రిపురాంతకము మేడపి ముఖ్యమైనవిగాఁ జెప్పఁబడియెను.

మఱిది యైనకొమ్మ రాజపుత్రుఁడు. పల్నాటిప్రభు వైన నలగామ రాజున కల్లుఁడు. ఈతనిభార్య పేరు రత్నాలపేరమ్మ. అలరాచ మల్లునకును పెద్దనాయనికిని వివాదము తటస్థింపఁగా బ్రహ్మనాయఁడు మధ్యవర్తియై తగవుదీర్చెనుగాని, వారలకుంగల మనస్పర్థలు విడిచిపోలేదు. నాయకురాలికడకు రాయబారము పంపుట యపాయకరమైనదిగావున నీతని బంపుట యుచితమని సోదరులకుఁ దోఁచినది. వైష్ణవభక్తాగ్రేసరుఁ డైన బ్రహ్మనాయఁడు రాచమల్లునకుఁ బ్రాణాపాయము కలుగకుండఁ దులసిపే రిచ్చెను. ఈరాయబార మలరాజు తలిదండ్రుల కెంతమాత్రము నిష్టము లేదు. ఏలన రాచమల్లుఁడును వానితల్లిదండ్రులును వీరశైవులు. రాచమల్లు తల్లిదండ్రుల నొప్పించి రాయబారమునుబూని గురిజాలకు బయలు వెడలెను. తరువాత బ్రహ్మనాయఁడు దురాలోచనముచేసి తులసిమాలికను మాఱొపాయముచేఁ గొనిరమ్మని కుమారుఁ డైన బాలనాయని వానివెనుకఁ బంపెను. బాలనాయఁడు మార్గములో రాచమల్లుని గలిసికొని యొక కాలువను దాఁటుటకై వానితోఁ బందెమువేసికొనియెను. రాచమల్లుని గుఱ్ఱము కాలువను దాఁటలేక యందులో దిగఁబడియెను.

బాలనాయఁ డెక్కివచ్చిన గొఱ్ఱపొట్టేలు కాలువను దాఁటగలిగెను. పందెముప్రకారము రాచమల్లుఁడు తన మెడలోని తులసిమాల మొదలయిన యాభరణముల నిచ్చివేసెను. పిమ్మట అలరాజు గురిజాలను సురక్షితముగాఁ బ్రవేశించి మామగారిచే సర్వసత్కారములనుబొంది తన రాయబారమును నిండుపేరోలగమున నాతనికి విన్నవించెను. మల్లదేవులకు వారిభాగము నిచ్చి ప్రవాసమునకుఁబోయిన రాచవీరులు స్వదేశమునకు వచ్చుట కుత్తరువీయవలసినదని ప్రార్థించెను. అందులకు నలగామరాజు సమ్మతింపక పరుషోక్తులాడెను. అతఁడాగ్రహమును జెంది యచ్చోట నుండనొల్లక చెర్లగుడిపాడునకు

వచ్చెను. అచ్చటఁ గనమదాసును గలిసికొని తనకార్యము నెఱ వేర్చుకొని గాని బ్రహ్మనాయనికడకుఁ బోనని ప్రతిజ్ఞ చేసెను. ఇంతలో నాయకురాలొక బ్రాహ్మణునకు విశేషధనము నొసంగి వానిచే రాచమల్లునకు విషము పెట్టించి చంపించెను. వానిభార్య పేరమ్మ, తన తండ్రియైన నలగామరాజును దూషించి దుఃఖించుచు భర్తతో సహగమనము చేసెను. అంతట నిరుపక్షములవారును ఘోరావహమును సలుపుటకు సర్వప్రయత్నములను జేయుచుండిరి. వీరులు కొందఱు బ్రహ్మనాయని ప్రక్కను నిలిచి ప్రాణము లున్నంత దనుక నాతనికై పోరాడెద మని ప్రతిజ్ఞావాక్యములు పలికిరి.

## బ్రహ్మనాయఁడు యుద్ధమునకు వెడలుట.

బ్రహ్మనాయఁడు యుద్ధముచేయుటయే విధికృతమైన ధర్మ మని నిశ్చయించినవాఁ డగుటచేత బాలమల్లదేవుని వీరమేడపికిఁ బట్ట ముగట్టి తన పుత్త్రుఁడైన బాలచంద్రుని సచివకార్యమునందు నియోగించి కరణకార్యం బనపోతన కిచ్చి మాంచాల యను వీరవనితను రాణివాసమునకు రక్షకురాలినిగఁ జేసి తన పక్షమును బూనివచ్చిన వీరనాయకులతో నొక్క శుభముహూర్తమున దాడి వెడలెను. బ్రహ్మనాయని దండయాత్రాప్రారంభము వీరచరిత్రమున నిట్లభివర్ణింపఁ బడియెను.

“ బ్రహ్మన్న గదలెను బాయని వేడ్కఁ
బట్టిరిగొడుగులు పాలకినెత్తి
సూర్యాతపంబు పై సోఁకనియట్లు
పాలకీలను నిరుపార్శ్వంబులందు
నందంబుఁబట్టి రరిగెలజోళ్ళు
వింజామరంబులు వెలయఁగా నెమలి
కుంచెలవారును గూడివీవంగ

నాయఁడు రాజులు నయముతోఁ జనఁగ
ముందుండమాయిాలు మురజసంఘంబు
బూరలు భేరీలు పోటుధారలును
గాహళవంకిణి కాలికొమ్ములును
శంఖసమూహంబు సన్నాయిజోళ్ళు
మురళీచయంబును ముఖవీణె వితతి
నరగలు తప్పెటల్ నయమైన డోళ్ళు
తమ్మటమ్ములుఁ నెంచఁదగు వీరణములు
ఘనమైనరుంజలు కనకతప్పెటలు
చేగంటలును మఱి చిఱుగంటచయము
ఘనమైన మ్రోఁతచే గగనంబు గప్పఁ
గుంభిని వణకంగఁ గులగిరులెల్లఁ
బగిలి మ్రోఁతలీయంగ భావ ముప్పొంగ
నావాలవారును నాగెమువారు
కొండ్లవిందులవారు గోవిందువారు
ముతసానివారును ముయ్యూరువారు
నర్మాలవారును నాయనివారు
పైడిచుక్కల పాలపర్తి వారలును
బలుమూరివారును బాలెమువారు
రేవనూళులవారు రేచెర్లవారు
నట్లూరిముట్లూరి యాఖ్యలవారు
చెవులవారును మఱి చిల్లరవారు
గురిమైన నాయకుల్ గూడియే తేర
గండువా రేగురు గదిసిన వేడ్కఁ
జనిరి బిరుదులతో స్సాహస మడర

నొప్పుగా నిండఱు నుఱ్ఱైన బంట్లు
ఘోటకంబులు మేటికుంజరావళులు
నుత్సాహమున హుటాహుటి నడువంగ
బట్టువారలుమించి బహువిధంబులను
బిరుదుపద్యంబులు పెళ్ళుగాఁ జదువ
నుద్దండమాష్టీలు నొనర నిర్వంక
భైరవఖడ్గముల్ పట్టుకరాఁగ
శీలమ్మతనయుని సింహవిక్రముఁడు
కరమర్థికనుకులకన్నమ నడిచె
సకలవీరచయంబు సంతతోత్సాహ
పౌరుషంబులుమీఱ బ్రహ్మ కిట్లనియె
"మముఁజూడు నాయఁడా మాలావుకొలఁది
మముఁజూడు బ్రహ్మన్న మాశౌర్యపటిమ
సింధురంబులమీఁదఁ జెన్నుగాఁ దుమికి
కుంభస్థలంబులు కుఱ్ఱగఁజేసెదము
కొదమసింగంబులఁ గూలఁద్రోచెదము
గండభేరుండాల ఖండింతు మలుక
వాయువుఁబోనీక వడినాపఁగలము
జాతవేదునిబట్టి చమిరివైచెదము
ఘనసముద్రముఁ జొచ్చి కలఁగఁ జేసెదము
కుంభినిఁగాళ్ళతోఁ గుఱ్ఱగఁ దన్నెదము
కులగిరులైనను గొట్టివైచెదము
గురిజాలనేలెడు కువలయేశ్వరునిఁ
గొలపగకై పట్టి కొఱ్ఱవ్రేఁగించి
చలమున విడువక చంపఁగా గలము"

అని పెక్కువంతంబులాడుచు నడునఁ
జూచినవారలు చోద్యంబుగాఁగఁ
బటువిక్రమాఢ్యులు పల్నాటివీర
వరులంచుఁ బొగడుచు వర్ణించి పలుక
మలిదేవ భూపతిమంత్రి బ్రహ్మన్న
కంపింప భూస్థలి కదలి రావేళ"

ఇట్లు బ్రహ్మనాయఁడు విశేష సైన్యములతో బయలు వెడలి కార్యము పూడికలనికి వచ్చుమార్గమునఁ ద్రిపురాంతకమున దండు విడిసి యచ్చటి త్రిపురాంతకేశ్వరుని సందర్శించి యచ్చోటనుండి మరల బయలుదేఱి కార్యము పూడికి దక్షిణమున నాలుమైళ్ళదూరముననున్న మేళ్ళవాగుఁ జేరెను. అచ్చట నివసించియుండి కార్యముపూడి రణరంగమును బరీక్షించుటకై బ్రహ్మనాయఁడు తన ప్రియసేవకుండును మాలయు నగు కనుకులకన్నమనాయని నాయర్ధరాత్రంబునఁ బంపెను. అతండును తన ప్రభువునాజ్ఞ శిరమునఁ దాల్చి బయలుదేఱిన విధమీక్రింది తెలుంగున వీరచరిత్రమున వర్ణింపఁబడినది :—

"కరమున గుజ్జరికడియముల్ మెఱయ
నేడైనపిడిఘంట నెమలిసోగలును
నల్లనిధట్టిని నయమొప్ప గట్టి
యర్ధనారీఝుల్లకాదులు నమర
ఘోరభైరవగద కోరమీసములు
నెగుభుజంబులుమించు నెఱజేరుగుడ్లు
ఘనమైన దేహంబు కాలిపెండెరము
వెరవైన భీకరవేషంబుతోడఁ
గదలెఁ గన్నమనీఁడు కదనభూమికిని"

ఇట్లు కన్నమనాయఁడు కార్యముపూడి రణరంగమునకుఁ బోయి యచ్చటనున్న యొక యెఱుకలసానివలన నచ్చటివిశేషం బులనెల్ల నారసివచ్చి బ్రహ్మనాయనికి నివేదింపఁగా నతండు సంతోషించి నిజసైన్యములతో నక్కడ నుండి బయలుదేఱి కార్యముపూడి ప్రవేశించి యుద్ధమున కాయత్తపడుచున్న వీరనాయకుల వేగము వలదని వారించుచుండెను.

## నలగాముఁడును యుద్ధసన్నద్ధుఁ డగుట.

అచట గురిజాలలో నలగామరాజు సయితము నాయకురాలి ప్రేరణవలన బ్రహ్మనాయనితో యుద్ధముచేయ నిశ్చయించి యుద్ధ వార్తను నానాదేశరాజులకుఁ దెలియఁజేసి వారల సాహాయ్యమును బడయుటకై ప్రయత్నించెను. ఇంతలో బ్రహ్మనాయనియొద్దనుండి యొకబట్టువాఁడు రాయబారమును బూని నలగామరాజు సభకువచ్చి యతనిచే సర్వసత్కారములను గాంచి మలిదేవరాజాదులు కార్యముపూడికి దాడివెడలి వచ్చియున్నారని తెలిపి సంధికార్యమునుగూర్చి యిట్లుపలికెను.

"రాజాధిరాజ విరాజితకీర్తి
రాజవేశ్యావిట ప్రాభవప్రకట
గండరగండాంక ఘనదానచతుర
ధైర్యనిర్జిత మేరుధరణీధరేంద్ర
శౌర్యవిక్రమకళా సంపూర్ణచంద్ర
భాస్కరసమతేజ ప్రౌఢగుణాఢ్య
మానదుర్యోధన మైలమసుతుఁడ
అనుఁగుభూపతిపుత్త్ర యంచితగాత్ర
వీరకామనరేంద్ర విభవదేవేంద్ర

* * * *

పగ వృద్ధిఁబొందించు భ్రష్టులే కాని
యడఁగించు నేర్పరు లవనిలో లేరు

* * * *

పోరుమంచిదికాదు భూమినెక్కడను
బాహాను దేశంబు పగ మించెనేని
ప్రజలెల్ల నశియించి పాఱిపోవుదురు
బండారమునకును బైకంబు లేదు
రాణువయందుచే రహిచెడియుండుఁ
జేజీతగాండ్రెల్లఁ జెలఁగి కోపించి
యీగలజీతంబు లిమ్మందు రపుడు
పతిబంటుమేరలు పరిహారమాను
బంపినఁబనిసేయఁ బ్రాలుమాలుదురు
తెలిసినశాత్రవుల్ ధీరతతోడ
భూమినిగొనుటకు బుద్ధిసెట్టుదురు
పగవారివార్తలు పరికింపలేరు
మేకొనిమీలోన మీరుపోరాడఁ
జూచెదువానికిఁ జులకన యౌను
(కోరిశాత్రవులు మీగుట్టెఱుంగుదురు)
పలువలు మిముఁజేఱి పగఁజావనీక
చెప్పుచునుందురు చెనటివాక్యముల
నైకమత్యముచెడు నద్దానితోడఁ
జెడునుబలంబును జెడునుభాగ్యంబుఁ
జెడునుయశంబును జెడునుశౌర్యంబుఁ
జెడునురాజ్యమ్మును చెడ్డపిమ్మటను
దేశంబు పరనృపాధీనమౌ సుమ్ము ”

అని భట్టుమూర్తి సంధివాక్యములను బలుకఁగా నలగామ రాజు వానిని దృణీకరించి సంధి పొసంగనేరదనియును, బ్రదుకఁ దలంచినయెడల బాలరాజును దిన్నఁగాఁ దోడ్కొని మరలిపొమ్మని యును, అట్లు పోకయుండిన రణభూమికి బలిగ నర్పింతుననియును, బ్రహ్మనాయనికిఁ జెప్పి బుద్ధి గఱపవలసినదనియును బలికెను.

అంతట భట్టుమూర్తి యాగ్రహమునుబొంది నలగామున దూలనాడి బ్రహ్మనాయని ప్రతాపాదుల నభివర్ణించి భయపెట్టజూచె నుగాని నాయకురాలు వానిమాటలను దృణీకరించి "నీవెంత, నీబల మెంత, బట్టువాఁడవుగాన బ్రతికిపోతివి, పోపొమ్ము" అని గంభీర వాక్యములు పలికి దూతను వచ్చినదారిని బంపివైచెను. అటుపిమ్మట నలగామరాజును నాయకురాలును మంతనముచేసి యుభయపక్షముల లోని బలముల తారతమ్యమును విచారించి తమకు సాహాయ్యము చేయవలసినదిగా నానాదేశరాజులకును లేఖలను బంపించిరి. నాయ కురాలు నిజబలంబులను యుద్ధమునకై సన్నద్ధపఱిచి నలగామునకుఁ బ్రోత్సాహముం గలిగించుచుండెను. నలగాముఁడును వీరపురుషోచిత ములైన కర్మముల నెల్ల నాచరించి గజారోహణం బొనర్చి నిజసై న్యంబులతోడ బయలుదేఱి కార్యముపూడికి వచ్చెను. మహారాజు లనేకు లసంఖ్యాకములయిన సైన్యంబులతోడవచ్చి యుద్ధభూమిని నల గామరాజును గలిసికొన్నట్లుగా వీరచరిత్రమున మిక్కిలి యతిశయో క్తులతోఁ గూడిన వర్ణనములతోఁ జెప్పఁబడియెను. ప్రతాపరుద్రుఁడు వేయియశ్వంబుల నంపెనని మాత్రము చెప్పఁబడినదిగాని యాతండు యుద్ధభూమికి వచ్చినట్లు చెప్పఁబడి యుండలేదు. అచ్చట వీరనాయ కులు యుద్ధమునకాజ్ఞయిమ్మని బ్రహ్మనాయని తొందఱపఱుపసాగిరి కాని నీతివాక్యములచే నాతఁడు వారల వారించుచుండెను.

# ఏదవ ప్రకరణము.

## బాలనాయని కథ.

ఇట్లుభయ పక్షములవారును గార్యముపూడికిఁ జనుదెంచి యుద్ధసన్నద్ధులై యుండఁగా నచ్చట వీరమేడపిలో బ్రహ్మనాయని పుత్త్రుఁడైన బాలనాయఁడు తోడిబాలురతోఁగూడి తల్లి మైలాంబ వారించినను వినక పోయి బొంగరము లాడుచుండఁ జూడవచ్చిన యమ్మలక్కలలోఁ గోమటియన్నమ్మ మీఁగాలికి బాలునిబొంగరము దాఁకి యామె మూర్ఛిల్లి పడిపోయెనఁట ! పిమ్మట జుట్టును మూఁగిన యువతులు శైత్యోపచారములు సేయఁగాఁ గొంతవడికిఁ దెలివి గాంచి యాకోమటియన్నమ్మ పోతుసింగమువలెఁ బొగరెక్కియున్నా వుగాన యుద్ధభూమిలో నున్నమీయయ్యలను గలిసికొన్నచోఁ గండ కావర ముడిగెడు నని వానిని దిట్టి శపించెనఁట ! ఆపలుకులు చెవిఁ బడ్డతోడనే యొక్క నిమిషమైన నచ్చట నిలువనోల్లక యామెను మన్నింపవేడి వెంటనే తల్లియొద్దకుఁ బఱుగిడిపోయి యుద్ధసమాచారములు దెలుపవలసినదని యడిగెను. ఆమెవలన సకలసంగతులను దెలిసికొని తానుగూడ సమరస్థలికిఁ బోయి తండ్రులకుఁ దోడ్పడి స్వధర్మమును నెఱవేర్చుకొనుట కనుజ్ఞయిమ్మని తల్లిని బ్రార్థించెను. ఆమె తనయుని సాహసంబున కచ్చెరువందుచు బాలురకు యుద్ధము వలదనియు, యుద్ధముల వలనఁగలిగెడి యనర్థముల నెన్నింటినో బోధించియు, నామార్గమునుండి వాని చిత్తమును మరలింప నెంతయో ప్రయత్నించెనుగాని వాని మనంబు మరల కుండెను. అప్పు డాతఁడు వీరధర్మపరిభావంబు తల్లికి నీవిధముగా బోధించెను.

“ కార్యమపురమందు ఘనపరాక్రమతఁ
దండ్రిలునిలుచుండి దండుసేయంగ
నేనిటనుండుట నీతియే తల్లి ?
యుంగుసంటకునీకు నొప్పునా మనసు

నీవెఱుంగనిధర్మ మేనెఱుంగుదునె
ప్రాకృతభామలపగిదిఁ బల్కెదవు
వెఱ్ఱితనంబేల వీరునిసతికిఁ
గాయ మనిత్యంబు కల్మిహుళక్కి
జలబుద్బుదవిధంబు క్షణభంగురములు
షట్చక్రవర్తులు సకలభూపతులు
చనిరి బ్రహ్మేంద్రాదిసర్వదేవతలు
భూతంబులైదును బొలియుచు నుండు
శౌర్యసత్కీర్తులు సమయ వెన్నటికి
సకలపురాణముల్ సద్ధర్మకథలు
నీతిశాస్త్రంబులు నీవెఱుంగుదువు
పౌరుషాధికతచే బ్రదుకుట లెస్స
జననమరణములు జనులకు నిక్క
మాలయంబున నున్న నడవిలో నున్నఁ
దప్పక దార్కొనుఁ దథ్యంబుగాను
బుణ్యలోకంబును బొందుమార్గముల
వినిపింతునేఁదల్లి విశదంబుగాను
సజ్జనసంగతి సంసారమెడల
గురువుబోధించిన గుఱిమీఁదమనసు
నిలిపిమరణమొందు నిశ్చలుఁ డొకఁడు
ప్రాజ్యసామ్రాజ్యసంరక్షణమందు
ఘనరణమ్మునఁ ఱొమ్ము గాయాలనొంద
మనసుచలింపక మరణంబు నొందు
శౌర్యపరాక్రమసంపన్నుఁ డొకఁడు
వీరలిద్దఱు లెస్స వినువీధి కేఁగి

యాదిత్యమండలం బరుదారఁ జించి
పోయి పుణ్యంబుల భూమిఁజెందుదురు
మొదటికార్యముఁబూను ముఖ్యత లేదు
శౌర్యంబుచే మాకు సంపాద్య మగును"

ఇట్లు వీరధర్మమును బోధించుటఁ జూచి తన కుమారుఁ డింక యుద్ధమునకుఁ బోయి మరణము నొందఁగలవాఁడని నిశ్చయించి బెగ్గడిల్లుచు నెట్టెట్టి నీతులనో బోధించి యెట్టులయిన వానిచిత్తంబు మరలింపఁజూచెను. వాఁడు వినకుండుటఁజూచి తల్లి "నాయనా! నాహితవచనంబులు నీచెవి నాటకున్నవి; పోయినవాఁడవు పోవు చునే యున్నావు గానఁ బోవునపుడు నీభార్య మాంచాలను జూచి మఱిపొమ్ము" అని యనుజ్ఞ నిచ్చెను. అట్లే యని బాలుఁడు తన యేఁబుగురు సోదరులతో బయలుదేఱి మార్గమధ్యమునఁ దన యుంపుడుకత్తె యైన సబ్బాయి యను వేశ్యయొక్క గృహంబునకుఁబోయి యామెతో సరససల్లాపములాడి యుద్ధవార్తను దెలిపి యామెకు విశేష బహుమానము లొసంగె నని వీరచరిత్రము నడుమ నభివర్ణింపఁబడియున్నది.1 అనపోతు బాలనాయని ప్రవర్తనమును దెగడుచు వేశ్యావృత్తినిగూడ నీక్రింది విధమున నిందించెను.

"కామాంధకారంబు కన్నులదట్టి
క్రిందిమీఁదెఱుఁగక కేరుచున్నావు
కలధనమెల్ల భోగముదాని కిచ్చి
చేసితిపాపంబు చెడ్డ వెచ్చంబు
నిహపరదూరపు టీ నడకేమి

---

1. ఏమి హేతువుచేతనో వీరచరిత్రము నడుమ శృంగారభూయిష్ఠ మైన వేశ్యాకథనమును జొప్పించి పదునాలుగేండ్ల బాలునకు వేశ్యాసంపర్కమును గలిగించుట కవికల్పన మని యూహింపవలయును: లేదా బాలనాయఁడు పదునాలుగేండ్లవాఁడు కాఁడని యూహింపవలయును.

సభ్యాయిపైఁ బ్రేమ సర్వనాశంబు
సోలిదానికి మ్రొక్కి సొమ్మెల్లనిచ్చి
యిందఱ నడిగిన నేమి లాభంబు
వారకాంతల రీతి వర్ణింపరాదు
బిడ్డలకోసఁగక ప్రియురాలి కీక
చీమలుగూర్చిన చెలువునఁగూర్చి
ధనవంతులగు వారిధనమెల్లఁ దోచి
ముంజికాండ్రను జేసి మురిపెమడంప
వ్యసనులై విటవృత్తి వసుమతి మీఁదఁ
బోయిరి బ్రతికెడు పొందిక లేక
యుర్విపై వేశ్యల కోలి యిచ్చుటలు
వినలేదు కనలేదు వేడబం బిద్ది"

అని యిట్లు తన బ్రాహ్మణసోదరుఁడైన యనపోతరాజు చీవాట్లుపెట్టి మందలింపఁగా సిగ్గుచేఁ దలవాంచి ప్రత్యుత్తర మీయక తన యాభరణముల నెల్లను దీసి బీదలకు భిక్షుకులకు, బ్రాహ్మణులకు, భట్టులకు, దానముచేసి తన మామగారయిన గండుకన్నమ నాయని యింటికేఁగెను. రాకరాక చాలకాలమునకు వచ్చిన యల్లుని నత్త వారు పరమసంతోషభావముతోఁ బూజించిరి. అతండును గొన్ని దినంబులు తన వచ్చిన కార్యమును మఱచి మదనవ్యాపార పరతంత్రుఁడై యంతఃపురంబును విడువక నిజసఖియైన మాంచాలతోఁ గ్రీడించుచుండెను. అపుడు పతివ్రతయు, సుగుణవతియు, సుందరియు నగునిట్టి భార్యను విడిచి, వేశ్యతోఁ గాలముఁ బుచ్చుచున్నందులకుఁ బశ్చాత్తాపమునుబొంది తన్నుఁ దాను దూఱుకొనసాగెను. ఇట్లత్త వారియింట బాలచంద్రుడు మాంచాలతోడి వినోదంబులఁ బ్రొద్దులు పుచ్చుచుండ నొకనాఁడు మాంచాల తనభర్తతా వచ్చినపని మఱచి యున్నవాఁడని యెంచి యిట్లనియె.

"నాతోఁ బెనంగిన నయమేమి లేదు
కడువడిఁగలనికిఁ గదలుఁడి మీరు
కులవైరముందీర్పు గురుసాహసుండు
పరికించి చూడ నెవ్వరు మీరుదక్క"

ఇట్లు వచ్చిన కార్యమును దమ్మును మఱచి బాలనాయఁడు పిఱికిపందయై స్త్రీలోలుఁడై యంతఃపురంబునఁ గ్రీడించుచున్నవాఁడని యాతని తమ్ములాఱ్వురును మిక్కిలి రోషించి ఘనరౌద్రభావంబు తోడఁ గత్తులు దూసి వెడలిన కోపాగ్నిచే మాఱెరుంగక కేరునట్టి మదగజంబులరీతి గండువారింటి ముంగల నిలిచి నగరు తల్లడమంద భీకరంబుగానార్చి పెడబొబ్బలిడిరి. అప్పుడతఁడాగ్రహముతోఁ గటారి వెఱికి తమ్ములపై నుఱికె. అంతవారు బాలనాయఁడు తమపైఁగవియ లజ్జాకరంబులగు పోటుమాటలచే నొప్పించి సిగ్గుపడునటులఁ జేసిరి.

అప్పుడు బాలనాయఁడు తన తప్పును గ్రహించి యంతఃపురంబునకుఁ జని తనచేతి కటారిని భార్యచేతి కీయఁగా నామె నవ్వుచు భర్తను జూచి

"రతిరాజ సౌందర్య రణరంగధీర
కమల బాంధవ తేజ కరుణాలవాల
వినతాత్మజుని లావు వెసనీకుఁ గలుగు
సామీరిసమమైన సాహసం బబ్బుఁ
గృష్ణుని కెనయైనకీర్తి ఘటిల్లు
రవికాంతయుతుఁడవై రంజిల్లుచుండి
యలరాజు పగఁదీర్పు మనుజులతోడఁ
బటులెర విక్రమ ప్రౌఢిమ మెఱయ
శ్రీగిరిలింగంబు చెన్నకేశవుఁడు

వరము లొసంగఁగ వర్ధిల్లఁ గలవు
శాత్రవ విజయంబు సమకూఱు మీకు
నీమాయమునను వడినిచ్చును జయము
కలియుగంబున మీకు ఘనపూజ లమరు”

అని పాత్రినాథుని ఆశీర్వదించి యాకటారిని మరల నొసంగ నాతండు దానిం గైకొని యచటనుండి గదల నిజగృహంబునకుం జని తల్లికిం జెప్పి యామెచే నాశీర్వాదములం బడిసి మాయచే ననపోత రాజును వీరమేడపికిం బంపి తక్కిన సోదరు లాగ్గురతోడను రణభూమికి బయన మయ్యెను. ఇచ్చటం గార్యమపూడిలో నాయకురాలు యుద్ధము జరుగకుండ నెట్లయిన సంధిగావింపం బ్రయత్నించుచుండెను.

### కోటకేతరాజు రాయబారము.

ఒకనాఁడు నలగాము కొల్వులో నాయకురాలు గూరుచుండి చింతపల్లిరెడ్డి, మాడుగుల వీరారెడ్డి, కొండ అన్నమరాజు, కోట కేతరాజు మొదలగు నాప్తవర్గమును రప్పించి సముభావమును వహించి,

“బాహుపరాక్రమప్రాభవు లయిన
వీరులు రాజులు వెలయు శోభిల్లు
కొల్వులోనికిఁ బోయి కూరిమి మీఱు
సమరంబు గాకుండ సంధియౌనట్లు
మాటాడి యటమీఁద మాచెర్ల భాగ
మెలుకొమ్మని చెప్పుడింకొక మాట
నాయనవద్దకు నరసింగుఁ దెచ్చి

కులవైర మడఁతుము కోరి మీరంద
ఱొక్కటికమ్మని యొప్పించి రండు
మగిడి పోవలయును మనదేశమునకు''

అని చెప్పి సంధికార్యము నెఱవేర్పఁబంపించెను. కేతరాజు మొదలగు రాయబారులు పెదమలిదేవ మహీపతి కొల్వునకు వచ్చి యొండొరుల క్షేమసమాచారములఁ దెల్పుకొన్న తరువాత నల గామరాజుచే మన్ననగాంచిన పిమ్మట కేతరాజు బ్రహ్మనాయని నిట్లని హెచ్చరించెను.

"వినవయ్య నాయఁడ విన్నపం బొకటి
అతివివేకులు మీర లఖిలరాజ్యముల
మీకృప లయినట్టి మేటివిక్రములు
నీతిమంతులు లేరు నిశ్చయం బిదియ
గొంతుగోయఁగ మీరు కోరినయట్టి
నరసింగరాజును నయమునఁ దెచ్చి
యిచ్చెద నామీఁద నేమైన లెన్న
నరవిరక్షించిన సంహరించినను
భారంబు మీపైనఁ బాదుకయుండు
మునుపటి రీతిని ముదమొప్ప మీరు
మాచెర్లభాగంబు మక్కువ నేలి
సంరక్షణముసేయు జనములనెల్ల
నుభయరాజులు మీర లొక్కటైయున్న
మావంటివారికి మానసం బలరు
నఖిలాధిపతులు మీయాజ్ఞ సేయుదురు
మీరెఱింగిననీతి మేమెఱుంగుదుమె
ఉభయసంతానంబు లొక్కటిమూఁకు

నను(గు రాజేంద్రుఁడు హరపురి కేఁగు
సమయంబును బుత్త్రచయమును దెచ్చి
మీకు సమర్పించి మేను త్యజించెఁ
దర్వాత నిర్వాహదశయెల్ల నీది
యొకయిల్లు రెండుగ నొప్పనొనర్చి
తద్దుమాటాడనే యెపుడెవ్వరైన
మతిచెడి యీలోన మనసులు గలఁగ
నిందుచేఁ బగహెచ్చ నీర్ష్య జనించెఁ
గోడిపోరాడుట కూడదటంచు
నిచ్చతోఁ జెప్పిన నెవ్వరు వినిరి?
గురిజాలపురికినిఁ గోడిపోరాడ
నెవ్వరు వచ్చిరి యిదియేమి మాయ
ఐనట్టి కార్యంబు లన్నియు నీకు
దెలిసియే యున్నవి తేటతెల్లముగఁ
గతజలంబుల కడ్డుగట్టిన రీతి
జరిగిన దానికిఁ జర్చలేమిటికి
నావలీవలివారి నరసి రక్షింప
భారంబు నీయది బ్రహ్మనాయఁడ!
కౌరవతతి నెల్లఁ గదనంబునందుఁ
గూకటివేళ్ళతోఁ గూల్చి యామీఁద
బహుళార్తి నడవులపాలైరి గాక
పాండవు లేమేలుపడసిరి చెప్పుమ?
చేరి మీరొకనరసింగుని కొలకు
సకలభూపతులను సమయంగఁ జేసి
పాడైన రాజ్యంబు పైనఁబెట్టికొని

చివరకు ఫలమేమి చెందంగఁ గలరు?
పొందిక గలహంపు బుద్ధులు మాని
సవతిపుత్త్రులకిప్డు సంధి యొనర్చి
యనుకూలమున నుంట నర్హంబుమీకు
నరయ నింతియకార్య మనుగురాజాన
నీయాన మేమింక నిల్వ మిచ్చటను"

అనియిట్లు ధరణికోట విభుఁడు భీమరాజపుత్త్రుఁడైన యీరెండవ కేతరాజు సామవాక్యముల కిష్టపడక బ్రహ్మనాయని సైన్యములోని వీరనాయకులు వీరలను జంప దురాలోచనము చేయఁగా వారలను వారించి బ్రహ్మనాయని మఱఁదులు గన్నమనాయఁడు, కొమ్మరాజు, వారలవాక్యములను బూర్వపక్షము జేసి వీరనాయకులను బ్రహ్మనాయని సంధికార్యమునకు సమ్మతించు నటులఁ జేసెను.1

బాలనాయఁడు కార్యముపూడి ప్రవేశించుట.

అక్కడ బాలనాయఁడు నలగొండ శిఖరమునుండి కార్యముపూడి రణరంగంబు నవలోకించి దోర్నిని రప్పించి యాతని కాయుద్ధభూమిని జూపింప నాతఁడంతయుం గలయఁజూచి యాయాదిశల నున్న శత్రుసేనాధిపతుల నీక్రిందివిధమున బాలనాయనికి దెలిపెను.

"నరనాథుఁడైనట్టి నలగామరాజు
గొల్లెనచుట్టును గూడికొపాడు
సేనాధిపతులను జెప్పెద వినుము
పడమటిదిక్కునఁ బాజుల బ్రహ్మ

1 కోటకేతరాజు క్రీ. శ. ౧౧౫౨ సంవత్సరమున ధరణికోటకుఁ బాలకుఁ డగుటకుఁ బూర్వమే తండ్రికాలముననే యీరాయబారము నడపినాఁడు.

సంకోజిగణపతి సరవితూర్పునను
నాయకురాల్ దక్షిణంపుదిక్కునను
దంటలై యుండిరి దక్షత మెఱయ
నందెలరాముండు నానెమలిపురి
ముమ్మడిరెడ్డియు మొనతీర్చినట్టి
పొందుగలను నేలు భూరివిక్రముఁడు
వీరమల్లను నట్టి విఖ్యాతుఁడొకఁడు
నుత్తర భాగాన నుండిరి వేడ్క
నిందఱనెల్లను హెచ్చరించుచును
దిరుగుచు నరసింగధీవరుఁ డుండె
విక్రమసింహంబు వీరకామేంద్రుఁ
డబ్బంగి సేనతో నచ్చట విడిసె."

అంతట బాలనాయఁడు నలగొండ వదలి సోదరులతో బయలుదేఱి పోయి కార్యముపూడి కరిగి సభలోఁ బ్రవేశించి రాజదర్శనమునకు మార్గమిమ్మని సభాస్తారులఁ ద్రోచుకొని రాజుసమ్ముఖమునకుఁ బోయి మ్రొక్కెను. ఇతనిరాక యెవ్వారికిని సంతోషము గలిగింపలేదు. రాజు భయముచేఁ బెడమొగము పెట్టెను. అప్పుడు కొలువులోఁ గూర్చుండిన బ్రహ్మనాయని ప్రియశిష్యుండగు మాలకన్నమనాయఁడు బాలుని తుందుడుకుఁదనమును నిందించి తృణీకరించి పలికెను. బాలనాయఁడు సంధికార్యమున కొప్పుకొన్నగదులకు మలిదేవ భూపతిని సమ్ముఖంబున దూషింప నారంభించెను. బాలనాయఁడు తనమామయైన గండుకన్నమనాయనితోడఁ గొంతవడి చర్చించి యోధులకు రోషము వచ్చు మాటలాడి యుద్ధమునకుఁ బురికొల్ప సాగెను. బాలనాయఁడు తనభార్య చెప్పినమాట విశ్వసించి తనతో యుద్ధభూమికి రానీయక శత్రువులతోఁ బోరాడి కీర్తి గడింపనీయక మిష పెట్టి వీరమేడపికిఁ బంపి మోసము చేసెనని

దుఃఖించి అనపోతరాజు ప్రాణత్యాగము చేసిన సమాచారమును మాడచియను యువతివచ్చి దెలుపఁగా బాలనాయఁడు మిక్కిలి చింతించి మహోగ్రుఁడై లేచి తానొక్కఁడు పోయి శత్రువుల మార్కొని పోరాడి విజయంబుగాంతు నని ప్రతిజ్ఞ చేసెను. బ్రహ్మనాయఁడు తనకుమారుని పౌరుషవిక్రమాదులకు మెచ్చుకొని యుద్ధమును జేయుటకు సమ్మతించి తనకడకు వచ్చిన రాయబారులను మరలఁ బంపివైచెను. అటుపిమ్మట యుద్ధము ప్రారంభమయ్యెను.

బాలచంద్ర నరసింహుల యుద్ధము.

మొట్టమొదట బాలనాయఁడు తనతండ్రివలన రణనీతి నుపదేశముగొంది బ్రహ్మనాయనికి నమస్కృతులు గావించి రణభేరు లధికమై మ్రోగుచుండఁగాఁ జంద్రాయుధము నొఱనుండి తీసి ఝళిపించి యుగ్రుఁడై నిజసైన్యసమేతుఁడై శత్రుసైన్యముల నెదుర్కొన బయలుదేఱెను. ఇట్లు బయలుదేఱిన బాలచంద్రుని సైన్యమును నరసింహభూపతి సైన్యములు మార్కొనియెను. అప్పుడు బాలనాయని ధాకకు నిలువంజాలక నరసింహుని సైన్యంబులు బలాయనంబులగుచుండ నరసింగరాజు నిలువంబడి పాఱిపోవుట వీరధర్మంబు గాదని ధైర్యవాక్యములం బలికి హెచ్చరించి పాఱిపోవు బంటులకు పౌరుష మెక్కించి మరల్చుకొని శత్రుసైన్యంబుల పయింబడిన నుభయపక్షములవారికిని సంకుల సమరంబయ్యెను. అప్పుడెదురుగ నొక్క శూరవరుఁడు వెల్లనైన భద్రగజమునెక్కి రాఁగ నతండె నరసింహుఁడని భ్రమించి బాలనాయఁడు సింగపుఁ గొదమమాడ్కి వానిపై దుమికి మదగజముయొక్క ఘనమైన మస్తకంబును ఖండించి ధరపైనిగూల్చి మొలనున్న కటారితో వీరవరుని వక్షస్థలంబునుబొడిచి వ్రక్కలుచేసి తమకంబుంచి వానితలఁ దెగవ్రేసి తన చేతఁబట్టుకొని తండ్రికడకు విచ్చేసి యిదే నరసింహుని శిరంబని

యతని ముంగటం బడవైచెను. అంతట నయ్యది నరసింహుని శిరముకాదని బ్రహ్మనాయఁడు చెప్పఁగా సిగ్గుపడి మరల సమరభూమికిఁ జనుదెంచి యెప్పటియట్ల దలంపడి నరసింహభూపతితోడ ఘోరమైన యుద్ధముఁ జేసెను. ఆయుద్ధమునందు నిక్కముగా బాలనాయఁడు నరసింగుని సామంతరాగోలచే వక్షంబునం బొడువఁగా నతండు మత్తగజంబుపైఁ గూలెను.

### నరసింహుని తలగోయుట.

అంతట బాలనాయఁడు పశ్చాత్తప్తుఁడై మిక్కిలి దుఃఖించి నరసింహుని చెయ్దుములం దలపోసి తనవలన దోషమేమియు లేదని వక్కాణించుచుఁ గత్తితోఁ దలగోసి యద్దానిం గైకొని బ్రహ్మనాయని సభకుఁ బోయెను. బాలనాయఁడు చేసిన వీరకృత్యమున కద్భుతంబంది నరసింహుని మరణమున కెల్లవారును మిక్కిలి దుఃఖించిరి. తుదకు బ్రహ్మనాయఁడు సహితము బాలనాయని నిందించెను.

### బ్రహ్మనాయని దోషము లెన్నుట.

అందులకు సహింపఁజాలక బాలనాయఁడు తండ్రిచేసిన దుష్కార్యముల నెన్ని యీక్రింది రీతిని దూషించెను.

"వెడవెడయేడ్పులు వేగచాలింపు
కొల్వులో మామను కొమ్మభూపతికి
నలరాజు పగకయి యప్పగించితివి
నీస్వభావం బింక నేవివరింతుఁ
బోఁగొట్టితివి కోడిపోరున భూమి
నిను నమ్మివచ్చిన నీమేనమఱఁది

ప్రాణంబు గొన్నట్టి పాపాత్మకుఁడవు
చెలువుచూడఁగఁ బంపఁ జెవులకాయనను
జటులకర్మండవై చంపించితీవు
ఘనువేంకజోదును గలనికిఁ బంపి
మందలోఁ జంపితి మాయ యొనర్చి
యిటువంటి నీచేష్ట లెన్నివర్ణింతు”

ఇట్లు తండ్రిచేసిన దుష్కృత్యములను దూషించినఁ దండ్రియు “విమతులకు వెన్నిచ్చి వచ్చిన నీవంటి వీరుఁడను గాను” అని యుల్లంబు నొనాడఁ బలికెను. ఆపలుకు చెవులకు శూలమైనాట నచట నిల్వంజాలక బాలనాయఁ డహంకార గరిమచేఁ గదనభూమికి వచ్చి శత్రుసైన్యముల మార్కొని సోదరులతోఁ గూడ మృతి నొందెను.

## మలిదేవరాజుల మరణము.

తమసోదరుఁడైన నరసింహభూపతి మరణమును విన్నతోడనే బాలమలిదేవరాజులు గుండె లడలి చచ్చిరని చెప్పఁబడినదిగాని యదియే నిక్కమైన యెడల వారలు మాయోపాయముచేఁ జంపఁ బడియుందురు. వీరలకు రక్షకుఁడుగ నుండిన మాలకన్నమనాయఁడు వారలు మరణము నొందినతోడనే సైన్యములోనికి మరలివచ్చె నని చెప్పఁబడియుండుటచేత నతఁడే వారలఁ జంపియుండునని సందేహింపవలసి వచ్చుచున్నది.

## మూఁడవ యుద్ధము.

బాలనాయఁడు మొదలగు మహావీరు లందఱు సంగ్రామ స్థలంబునం బడుటకు సంతోషించి నాయకురాలు బ్రహ్మనాయని

సమస్తసైన్యముల నాశనము చేయవచ్చునని తలంచి నూత్నసైన్య మును గొంత మరల బ్రహ్మనాయనిపైకిఁ బంపెను. ఈయుద్ధము నందు కొమ్మరాజు పెద్దనాయఁడు నాయకురాలి సైన్యముల నోడిం చిరి గాని, యుద్ధములోఁ గొమ్మరాజు ప్రాణంబుల విడిచెను.

## నాయకురాలి యుద్ధము.

ఈకడసారియుద్ధమున బ్రహ్మనాయనిని కిరుపోటిగా రాజ్య తంత్రము నడపినట్టి మహాసమర్థురాలును, మగబిరుదుగట్టి యశ్వా రూఢయై యుద్ధావసానము వఱకు నించుకయుఁ జలింపక బ్రహ్మ నాయనితోఁ బోర సమకట్టిన నిరుపమాన శూరురాలును అగు నాయకురాలు తనసైన్యమున కంతకుఁ దానే యధ్యక్షురాలుగ నేర్పడి నాలుగుభాగములు గావించి నాలుగు ప్రక్కల శత్రువుల మార్కొనుటకై నిలిపియుంచెను. బ్రహ్మనాయని పక్షమున రేచెర్ల పేరినీఁడు, గండుకన్నమనాయఁడు సుంకర దామనాయఁడు, మాల కన్నమనాయఁడు, అను నల్వురు సేనాధిపతులును నాయకురాలి నాల్గుభాగములను మార్కొని యతిభయంకరమైన యుద్ధముఁజేసిరి. పేరినీడు శత్రుసైన్యము నోడించెనుగాని నన్నగండ్లకడ మరణము నొందెను. మాలకన్నమనాయని నల్వురు సోదరులు చింతలపల్లి కడ యుద్ధములోఁ జచ్చిరి. ఉభయపక్షములందును వీరనాయకు లనేకులు వీరస్వర్గమును జూఱగొనిరి. తుదకు బ్రహ్మనాయని ప్రియశిష్యుఁ డగు మాలకన్నమనాయనితోడి పోరాటమున నాయకురా లపజయ మును బొందుటయేగాక వానిచేతికిఁ జిక్కెను. అంతట కన్నమ నాయఁడు నాయకురాలిని కాళ్ళుసేతులు బంధించి బ్రహ్మనాయని కడకుఁ గొనివచ్చెను.

## యుద్ధ సమాప్తి.

నాయకురాలు బ్రహ్మనాయనిచేఁ జిక్కినతరువాత చేయునది లేక నలగామరాజు బ్రహ్మనాయని శరణు సొచ్చెను. బ్రహ్మనాయఁడు దయార్ద్రహృదయుఁడై వీరనాయకు లెల్లరు మరణము గాంచి నందువలన గల్గిన వైరాగ్యముచేత క్షమించి నాయకురాలికి బంధవిముక్తి గావించి నలగామరాజును బునరభిషిక్తునిఁ గావించి కీర్తి గాంచెను.

## బ్రహ్మనాయఁడు సంఘసంస్కర్త.

వెలమకులంబున జన్మముగాంచిన రేచెర్ల బ్రహ్మనాయఁడు శ్రీరామానుజులచే బోధింపఁబడిన శ్రీవైష్ణవమతమును స్వీకరించి తన్మతాభినివేశపరవశుఁడై యామతమును పల్నాటిలో వ్యాపింపఁ జేసి ప్రసిద్ధుఁడయ్యెను. ఇతఁడు కులభేదమును బాటింపక యగ్రవర్ణములవారిని క్షుద్రవర్ణములవారిని గూడ వైష్ణవులను గావించి తనతోఁడఁ గలుపుకొని సహపంక్తి భోజనములను గావించినట్లుగా వీరచరిత్రమునఁ బలుతెఁపులఁ జేర్కొనంబడియెను. ఈకాలమున నంత్యజులనియుఁ బంచములనియుఁ బెద్దకొలము వారనియుఁ జెప్పఁబడునట్టి మాలలకు సయితమా కాలమున వైష్ణవమతమును బోధించి దాసులనుగఁ జేసికొని సభలలో గౌరవించుటయేగాక వారలకు తనతోడి సపంక్తి భోజనమునుగూడఁ గలుగఁ జేసెను. బ్రహ్మనాయఁడు మాలయైన తెప్పలినాయనికిని పెమ్మసానికిని బుట్టిన కన్నమనాయని వైష్ణవునిగఁజేసి జ్యేష్ఠపుత్త్రునిభాతిఁ బెంచుకొన్నట్లుగ వీరచరిత్రమునఁ జెప్పఁబడినది. కార్యముపూఁడి రణరంగమును పరీక్షించుటకై బ్రహ్మనాయనిచేఁ బంపబడిన కన్నమనాయఁడచ్చటి మేఖకుల సానితో,

"మాలలకునుబుట్టి మాలనైపోక
విష్ణుపాదముఁబట్టి విశ్వంబు లోనఁ
దెప్పలినాయఁడు తెలవ యైనట్టి
యంబుజలోచన పెమ్మసానికిని
శ్రీమించు మాచెర్ల చెన్నుని మేనఁ
బెంపొందెడు తులసి పెదవనమాల
వరమునగన్నట్టి వరపుణ్యసుతుఁడఁ
గన్నమనా పేరు గమలాక్షి వినవె"

అని తన యుదంతమును జెప్పుకొనియున్నాఁడు. కారెముపూడియందు మలిదేవభూపతి బ్రహ్మనాయఁడు మొదలగు వారు కోటకేతరాజు మొదలగు రాయబారులతో సంధికార్యమునుగూర్చి ప్రసంగించు సభలోఁ గన్నమనాయఁడు మొదలగు గోసంగులు కూర్చుండి యుండఁగా వీరమేడపినుండి వచ్చి బాలనాయఁడు సభాస్తారులను ద్రోచుకొని రాజు సమ్ముఖమునకుఁ బోవునపుడు మాల కన్నమనాయఁ డడ్డుపడి వానితోఁ గొంత ప్రసంగముఁ జేసెను. అప్పుడు,

"బ్రహ్మనాయఁడు నీకు బాంధవుఁ డెట్లొ?
వినిపింపు కన్నమ వివరంబు గాఁగ"

అని బాలనాయఁడు ప్రశ్నింపఁగా నతఁడు,—

"నాయఁడు విష్ణువు నారాయణుండు
ప్రకటదయాంబుధి వరము లొసంగఁ
దగ జనించితి నేను దల్లి గర్భమునఁ
బరమపావనమూర్తి బ్రహ్మనాయనికిఁ
బాద సేవకుఁడనై పరఁగినవాఁడ
భుజముల ముద్రలు పూనినవాఁడ

క్షుద్రమార్గుల నెప్డు చూడనివాఁడఁ
బ్రాసాదజీవినై ప్రబలినవాఁడ
జ్యేష్ఠపుత్త్రుఁ డనంగ జెలఁగినవాఁడఁ
బుట్టితి వావెన్కఁ బురుషోత్తమునకు''

అని నిశ్శంకముగాఁ బ్రత్యుత్తర మిచ్చెను. ఈపై వాక్యములనుబట్టి యితఁడు మాలవాఁడనియు, బ్రహ్మనాయనిచేత నుపదేశమునుబొంది శంఖచక్రాంకధారియై బ్రహ్మనాయనికి భక్తుఁడును బాదసేవకుఁడునై బాలనాయఁడు జనింపక పూర్వమే బ్రహ్మనాయనిచేతఁ బుత్త్రభావమునఁ బెంపఁబడెననియు స్పష్టమగుచున్నది! మాడుగుల బ్రహ్మారెడ్డి రేచెర్లబ్రహ్మనాయఁడు మొదలగువారికి విందు చేసినపుడు గొల్లవారు మొదలగువారు మాత్రమేగాక కన్నమనాయఁడు మొదలగు గోసంగులుగూడఁ బోయిరి. కన్నమనాయఁడాఁ విందు నకుఁబోయి తన యిచ్చవచ్చిన స్థలమునఁ గూరుచుండె నని

"గోసంగికన్నమ గుణములకుప్ప
తనయిచ్చ యగుచోటఁ దనరఁ గూర్చుండె"

అను వీరచరిత్రములోని వాక్యమువలన బోధపడుచున్నది. మఱి యొక కాలమునందు ఆఱెమువారి యెదుట బ్రహ్మనాయఁడు గోసంగులనడుమ గూరుచుండి వారితోఁ గలసి భుజించె నని చెప్పఁబడినది. మాధవకులము పవిత్రమైనదిగా

"కులము లెన్నిటికైన గుఱుతైనవారు
తనర పూసలలోని దారంబువలెను
మలసి భేదములేక మలయుచుండుదురు
ఎంగిలి చండాల మేమియు లేక
మంగళంబునబుట్టె మాధవకులము''

అని బ్రహ్మనాయఁడు నిశ్చయించి పలికెనని చెప్పఁబడినది.

## వీరశైవము.

మఱియు బ్రహ్మనాయనిపక్షమున వీరశైవులుగూడఁ గొందఱు కలరు. అలరాజు. కొమ్మరాజు మొదలగు వారెల్లరును వీరశైవులు. బాలమలిదేవరాజు మొదలగువారు శైవమతావలంబకులే గాని వైష్ణవులుగారు. అనుఁగుభూపతి, నరసింగరాజు, నాయకురాలు మొదలగువారెల్లరును శైవమతావలంబకులు. పల్నాటి వీరయుద్ధమున వీరశైవులును వీరవైష్ణవులును మతభేదములను విడిచి బాలమలి దేవరాజు పక్షమున నిలిచి యుద్ధము చేసినది వింతగా నుండక మానదు.

## వీరారాధనము.

పల్నాటివీరచరిత్రమున నభివర్ణింపఁబడిన వీరవరులను నాదేశమున నిప్పటికిని గొలుచున్నారు. బ్రహ్మనాయఁడు విష్ణువనియు, విష్ణ్వంశసంభూతుఁడనియు వ్రాయుటయేగాక, యాసీమలో ఆబాలగోపాలము నందఱు నట్లేనమ్మి యిప్పటికిని గారెముపూడి సమీపమునను గుట్టము కొండబిలములోఁ దపం బొచరించుచున్నవాఁడని చెప్పెదరు. ప్రతి సంవత్సరము కార్తికమాసములో నాపల్నాటి వీరుల యుద్ధరంగప్రదేశమున మహోత్సవమొక్కటి జరుగుచున్నది. ఆయుత్సవమునకు వేలకొలఁది దూరదేశస్థులు 'సయితముఁ బోవుచున్నారు. కార్తికశుద్ధ పూర్ణిమనాఁడు యుద్ధరంగస్థలమున నెఱ్ఱని జెండా యెత్తుటయు, యుద్ధాహ్వానపత్రికలు చుట్టుపట్టులనుండు గ్రామములవారికిఁ బరివారాయుధాది సామగ్రీసమేతులై రావలయునని వ్రాయుటయు, నాబహుళామావాస్యనాఁడు రాచగావు, మఱు

దినము రాయబారముః మూఁడవ దినము మందపూఁడు, నాల్గవ దినము కోఁడిపోరు, అయిదవదినము కల్లిపాడు, అను నివి వరుసగా జరుపుటయు, దానికి మూఁడవదిన మర్ధరాత్రిమున యుద్ధరంగమున రక్తముతోఁ గలిపిన యన్నమును దిగంబరులై రణబలి యిచ్చుటయు మొదలుగాఁగలవి యిప్పటికిని జరుగుచున్నవి.1 దీనినంతయును జరుపుటకు బ్రహ్మనాయని ముద్రికర్త యని యొకపీఠాధిపతి కలఁడు.

---

1. వెలుగోటివారి వంశచరిత్రము పుట ౨౦.



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## ఆఱవ ప్రకరణము.

## కాకతిరాజుల చరిత్రము.

### త్రిభువనమల్ల బేతరాజు. (1080 - 1115)

ఇతఁడు కాకతిప్రోలరాజు కుమారుఁడు బేతరాజు. కాకతి రాజవంశములో బేతరాజు నామముగల వారిలో నీతఁడు రెండవ వాఁడు గావున రెండవ బేతరాజని చరిత్రజ్ఞులు వ్యవహరించుచుందురు. ఈబేతరాజు మొదట నాంధ్రదేశమున నన్మకొండ విషయ యమునకు నధిపతియైయుండి చాళుక్యాభరణుఁడును, సత్యాశ్రయ కులతిలకుఁడును సమస్తభువనాశ్రయశ్రీ పృథ్వీవల్లభ మహారాజాధిరాజపరమేశ్వర పరమభట్టారక బిరుదాంచితుఁడు నైన యాఱవ విక్రమాదిత్య చక్రవర్తికి సామంతుఁడై త్రిభువన మల్లదేవుఁడను నాతని బిరుదమునే తానుగూడ వహించెను. ఇతఁడా చక్రవర్తికి సామంతుఁడుగ నున్నను చాల స్వతంత్రుఁడుగనే వ్యవహరించుచుండెను. వేంగీసామ్రాజ్యము స్వాధీన పఱచుకొనవలయునన్న సంకల్పముతోనున్న విక్రమాదిత్యునకు త్రిభువనమల్ల బేతరాజుతోడి సఖ్యమె యత్యావశ్యకమైనదిగ నుండెను. ఇతనికి విక్రమచక్రి యను బిరుదము గలదు. ఇతఁడు గండ్రగొడ్డలి చేఁబూనినవాఁడనియు,

చోళమాళవరాజులను మత్తగజములకు సింహమువంటి వాఁడును, విక్రమములో భూమియందవతరించిన విష్ణువు వంటివాడునని ఖాజీ పేటశాసనములో వర్ణింపఁబడియుండెను. అనుమకొండ నగరమున నొకతోఁటను, శివపురమను తీర్థమును నిర్మించుటయెగాక బేతేశ్వరుఁడని తన పేరిట నొకశివాలయమును గూడఁ గట్టించెను.1 చలమర్తి గండబిరుదాంచితుఁడును, యుద్ధములో జయశ్రీచేత నలంకరింపఁబడిన బాహువులు గలవాఁడును, దుర్జయకులమను సముద్రమునకు చంద్రునివంటివాఁడును, సత్యవ్రతుఁడును నగు బేతరాజు జయమును పొందుగాక యని యొకశాసనమున వ్రాయఁబడియుండెను.2

ఇతఁడు పైఖాజీపేట శాసనములలో నొకదానిలో స్పష్టముగాఁదాను త్రిభువనమల్లదేవ పాదపద్మోప జీవియని చెప్పుకొన్నవాఁడు. ఇతఁడు శ్రీమచ్చాళుక్య త్రిభువనమల్లుని రాజ్యము వర్ధిల్లుచుండఁగా మార్గశిర శుద్ధద్వాదశీ శుక్రవారమునాఁడు తన తండ్రి పేరను వరుణ ప్రతిష్ఠ చేయించినట్లుగ వేఱొక శాసనమునఁ గలదు. ఇతఁడు పరమమాహేశ్వరాచారతత్పరుఁడట. ఇతనికి వైజన దండనాథుఁడొకఁడు ప్రధానమంత్రిగ నుండెను. అతఁడు "కాకతి భేత భూపాల క్రమాగత, తదీయరాజ్యభర నిరూపిత మహామాత్యపదవీ విరాజమానోన్నత ప్రభుమంత్రోత్సాహ శక్తిత్రయ సంపన్నుఁ" డని పద్మాక్షి గుడిముందరనున్న శాసనములో వర్ణింపఁబడి యుండెను ఈమంత్రిశిఖామణియే మహత్తరమైన యశస్సును గలవాఁడై అగణితశౌర్యసంపత్తుచేఁ బ్రసిద్ధిఁగాంచిన కాకతిబేతరాజును చాళుక్య చక్రవర్తి పాదపద్మములను సందర్శించునట్లు చేసి అనఁగా మ్రొక్కింపజేసి యాచకవర్తి దయతో నిప్పించిన "సబ్బిసాయిర" మండల

(1) కాకతీయ సంచిక, అనుబంధము. పేజీ 1

(2) డిటో-పేజీ. ౩౧.

మును సర్వజనసంతోషకరముగాఁ బరిపాలింపఁ జేసినవాఁడును, మహామండలేశ్వర కాకతిబేతరాజు ప్రధానియునైన వైజదండనాథుని నెవరుస్తుతింపఁ జేయకుండనుందురు ?1 దీనినిబట్టి వైజమంత్రియు, ఆయనభార్య మైలమయు ఆమె పుట్టినింటివారును జైనులని స్పష్టపఱచుచున్నది. ఈరెండవ బేతరాజునుగూర్చి "శా. శ. ౧౦౧౨ ప్రమోదసంవత్సరము కార్తిక బహుళ ౧౪ ఆదివారము సూర్యగ్రహణకాలమని కలదు. అచటనే కాలాముఖతపోధనాచార్యుఁడును, శ్రీశైలమల్లికార్జున శిలామఠాచార్యుఁడును నగు రామేశ్వరభట్టారకునకును బాదప్రక్షాళనము గావించి యొనరించిన ధర్మము చెప్పఁబడినది." అను వాక్యములు కాకతీయసంచికలో శ్రీమార్గదూపాటి రమణాచార్యులుగారు వ్రాసిన "కాకతీయుల చరిత్రములు-విశేషాంశములు" అను వ్యాసములో వ్రాయఁబడనవి.2

(1) .........కాకతి బేతనరేంద్రనం జగం పొగలె చాళుక్య చక్రిచరణం నవెకాణిసి తత్ప్రసాదదిం బగిగోళె సబ్బిసాయిరతున్నైనిసి............ "అనుమకొండ శాసనము. Ep Ind Vol IX, p. 256.

(2) ఖాజీపేట శాసనములలో రెండవ బేతరాజు దనియు, నాలుగువైపుల నీ శాసనము వ్రాయఁబడి యున్నదనియు, తల భాగము ఒకనూరవఱకు తెగఁగొట్టఁబడుటచే ఒకచివరగల యంశము వేఱొక ప్రక్కతో జతకువరకయున్నది. ఇదియొక శాసనమా రెండుశాసనములా ? యను సందియముగూడఁ గలుగుచున్నది ఇందొక భాగము కన్నడ పద్యములతోనున్నది. మఱియొకభాగము శ్లోకములతోనున్నది, అని వ్రాయుచు రమణాచార్యులుగారు పైని తాము తెలిపిన ధర్మవిషయము కన్నడ భాగములోనిదని తెలుపుచు ధర్మమునుగూర్చిన భాగమును మాత్రము విడిచిపెట్టి 10—24 చరణము వఱకు 15 చరణములుగల శాసనము మాత్రము ప్రకటించి యున్నారు. తెలిసికోవలసిన దానిని మాత్రము విడిచిపెట్టుట యాశ్చర్యకరము, వీరు 8—10—35 తేదిని నాకు వ్రాసిన జాబులో "మీసంపుటములోనికి నేనే యంశములు కావలయునో తెలిపిన వానిని సమకూర్చి పంపుదును. ఖాజీపేట దర్గాలో 1 బేతరాజు 1 వ ప్రోలరాజు 2 వ బేతరాజు (త్రిభువనమల్లుఁడు) అనువారి వృత్తాంతములుగల శాసనము లభించినది. ఇది కొంతవఱకె • నేనొసంగఁ

"బేతభూపతికాలము క్రీ. శ. 1025 మొదలు 1076 వఱకుఁ గావచ్చును లేదా 1090 వఱకునైనఁ గావచ్చు." నని శ్రీమార్గ దూపాటి వేంకటరమణాచార్యులవారి యభిప్రాయము. ఈ రెండవ బేతరాజు మల్లికార్జునునకు రామేశ్వరభట్టారకునకును బాదప్రక్షాళనము గావించి ధర్మమాచరించిన వెనువెంటనే చనిపోయెనని తలంచిరా? ఈపై చెప్పిన ధర్మవిషయమునుగూర్చిన శాసనము 1090 లోనిదని స్పష్టముగాఁ దెలుపుచుండఁగా నాచార్యులవారు "1076 వఱకు గావచ్చును లేదా" యని యేలసందేహింపవలసి వచ్చెనో అదియు దురూహ్యముగ నున్నది.

"అజ్ఞాతముగానున్న కాకతీయ చరిత్రమునఁ గొన్నియంశము లిప్పటికి నిర్ణీతములైనవి" అని యాచార్యులవారు తమవ్యాసమును వ్రాసియున్నారు. తమ యీయపూర్వ వ్యాసములో రెండవ బేతరాజు క్రీ. శ. 1025 మొదలు 1076 వఱకుఁ బరిపాలనము చేసియుండునని వ్రాసిన వీరు బేతభూపతి 1076 మొదలు 1126 వఱకుఁ బరిపాలనము చేసియుండవచ్చు నని యాచిన్న వ్యాసముననే

బ్రిదురించిరి. పూర్తిపాఠము కావలయునా ?'' అని వ్రాసితి. అందుకు 14-10-35 తేదీని జవాబు వ్రాయుచు దానిని ముఖ్యముగా దయతో బంపించవలసినది ప్రార్థించితిని గాని వారికి నాయందనుగ్రహము కలుగలేదు సరికదా "కాకతీయాంధ్రయుగము" అను పేరుపెట్టి యొకవ్యాసమును వ్రాసి అక్టోబరు 26 తేదీని ప్రకటింపఁబడిన కృష్ణాపత్రికలోఁ బ్రకటించుచు నందు, "అదృష్టవశమున కాకతీయ రాజులలో మిగుల పూర్వులగు మొదటి బేతరాజు, మొదటిప్రోలరాజు, రెండవ బేతరాజుల చరిత్రము దెలుపు ఒక సమగ్ర శిలాశాసనము ఖాజీపేట దర్గాలోనుండఁగఁ దీసి మేము ప్రచురింపఁగలిగితిమి'' అని వ్రాసియున్నారు. నాకు వ్రాసిన జాబులో "లక్ష్మణరాయ పరిశోధక మండలివారికి పూర్తిపాఠము నీయలేదని కొంతవఱకు మాత్రమె యొసంగ వారు ప్రచురించి''రని వ్రాసి కావలసిన పంపుదునని చెప్పి పంపుమని ప్రార్థించినను పంపకుండి సమగ్రశిలాశాసనము "మేము ప్రచురింపఁగలిగితిమని చెప్పుట యెట్టినీతియో చదువరులె గ్రహింతురుగాక !

మరలవ్రాసిరి. ఇందేది రెండవబేతరాజునకు నిర్ణీతమైన కాలముగా నిర్ణయించిరో బోధపడదు. మొదటిప్రోలరాజు కాలము క్రీ. శ. 1025 మొదలు 1076 వఱకు నని నిర్ణయించిన యీాయపూర్వ చరిత్రజ్ఞులు తమకున్న యపూర్వ చరిత్రజ్ఞానముపురస్కరించుకొనియె కాఁబోలు "డాకరేమి శాసనకాలము ఆంగ్లమానముచే 1081 అగుననియు, ఇది దాదాపుగా మొదటి ప్రోలరాజు కాలమునకుఁ గలియును గాన త్రైలోక్యమల్లునకు మొదటిప్రోలునకు సంబంధము సరిపడుచున్నదని వ్రాసియున్నారు. డాకరేమి శాసనములోని శా. శ. 1013 వ సంవత్సరము ఆంగ్లమానముచే క్రీ. శ. ౧౦౯౧ అగునుగాని యాచార్యులవారు చెప్పినప్రకారము ౧౦౮౧ మాత్రముకాదు. మొదటి ప్రోలరాజు త్రైలోక్యమల్ల బిరుదముగలిగిన మొదటి సోమేశ్వరునకు సామన్తుడై యుండవలెను గాని త్రైలోక్యమల్ల బిరుదము గలిగిన యాఱవ విక్రమాదిత్యునకు సామంతుఁడు గాఁడు. త్రైలోక్యమల్ల బిరుదము గల మొదటి సోమేశ్వరుఁడు క్రీ. శ. 1068 వఱకె పరిపాలనము చేసెను. తరువాత నతని పెద్దకుమారుఁడు రెండవసోమేశ్వరుఁడు భువనైకమల్లుఁడను బిరుదనామము గలవాఁడు క్రీ. శ. 1076 వఱకుఁ బరిపాలనము చేసినవాఁడు. మొదటి ప్రోలరాజు నేలెక్కనుసరించి 1091 వఱకుఁ దీసికొనిరాఁగలరో యాచార్యులవారు చూపవలదా?*

* వీరు నాకు 8—10—35 తేదీని వ్రాసిన జాబులో "తాము ఒక మాఱు ఈ సంపుటము ముగియులోగా ఓరుగల్లునకు దయచేయఁ గల్గుదురా? వలయు చరిత్రాంశములు, స్థానిక విశేషములు గమనింప వచ్చును. అట్లురాఁజాలరేని మీాకు గావలసిన చిత్రపటములపట్టిక, వలసిన చరిత్రాంశములయు వాని విమర్శనాభిప్రాయములయు జాబితానైనను బంపినచో మేముపంపు విపుల ప్రత్యుత్తరములు గొంతయేని తోడ్పడఁగలవు." అనియు, అక్టోబరు 26 తేది కృష్ణాపత్రికలో "వలయుచో మాయవలంబనముననున్న ఆంధ్రపరిశోధక మండలియందును, హైదరాబాదు లక్ష్మణరాయ పరిశోధక మండలి యందునుగల శాసనములు విశేషించి సహాయపడఁగలవు" అనియు వ్రాయ సాహసించిన యాచార్యులవారు తమవద్దనంత సామగ్ర్యముండియు, అంత చరిత్ర పరికరముండియుఁ గాకతీయసంచికలో "కాకతీయుల చరిత్రము-విశేషాంశములు" అను నొక చిన్నవ్యాసమునందే యిట్టి తప్పులను వ్రాయుట చాల విచారకరమైన విషయముగా నున్నది.

సత్యమును విచారింపఁగాఁ గాకతిరాజులలో మొదటి బేతరాజు, మొదటిప్రోలరాజు, రెండవ బేతరాజు, రెండవప్రోలరాజుల పరిపాలనసంవత్సరము లెప్పుడు ప్రారంభమై యెప్పుడు ముగిసినవో ఉజ్జాయింపుగ తెలిసినంతవఱకు సత్యములగు చరిత్రాంశములకు భంగము కలుగకుండ నిర్ణయించుకొనవలసినదేగాని సరిగా నిర్ధారణచేసి చెప్పుటకు నిప్పటికి దొరకిన సాధనములను బట్టి సాధ్యము గాదని చెప్పవచ్చును. ఇంతేగాని యాచార్యులుగారివలె నొక చిన్న వ్యాసమునఁ దెలియని కాలనిర్ణయమునకు సమకట్టి పరిహాసాస్పదుల మగుటమాత్రము కూడదు.

## మహామండలేశ్వర కాకతిప్రోలరాజు (2)

## 1115—1158.

మహామండలేశ్వర కాకతిబేతరాజునకుఁ బిమ్మట రాజ్యభారమును వహించినవాఁడతని కుమారుఁడైన ప్రోలరాజు. ఇతఁడు రాజ్యతంత్రజ్ఞుఁడైన మహాయోధుఁడు ఈతఁడు తండ్రి మరణానంతరము రాజ్యభారమును బూని పశ్చిమచాళుక్య చక్రవర్తియగు నాఱవ విక్రమాదిత్యునికి సామంతమాండలికుఁడై యాతని మహాప్రధానులలో నొకఁడైయుండియు నాచక్రవర్తి లోకాంతరగతుఁడైన వెనుక స్వతంత్రుఁడై త్రైలింగ్య సామ్రాజ్యమును నిర్మించుటకై పునాదులేర్పఱుపఁ బ్రయత్నించి చాలవఱకు విజయముగాంచెను. ఇతని పేరుగల శాసనమొకటి పద్మాక్షిగుడిలోఁ గానంబడుచున్నది.[1] ఈప్రోలరాజు మంత్రియగు బేతనప్రెగ్గడయు, నతని భార్యయుఁ గూడ జైనమతావలంబకులయినట్టు శాసనమువలనఁ దెలియుచున్నది. ఈబేతనప్రెగ్గడ గాకతిబేతరాజు మంత్రియైన వైజదండాధినాథునకు యాకమాంబికయందు జనించినవాఁడు

(1) Epigraphia Indica, Vol. IX page 256, No. 35

## పద్మాక్షీదేవి యాలయము.

నైజామురాష్ట్రములోని హనుమకొండకు దక్షిణభాగమునం దున్న యొకచిన్న కొండపైని పద్మాక్షీదేవి యాలయము నిర్మింపఁబడినది. ఈకొండప్రక్కను ఈదేవతాలయమున కెదుటను జైన విగ్రహములుగలవు. ఈయాలయము స్తంభముమీఁదనే పైనిజెప్పఁబడిన ప్రోలరాజుశాసనము గలదు. వీనినన్నిటిని బట్టిచూడ నిది మొదట జైనులచేతనే ప్రతిష్ఠింపఁబడినదిగాఁ దోఁచుచున్నది. ఈయాలయములోఁ బ్రతిష్ఠింపఁబడిన పద్మాక్షీదేవి జైనపురాణగాథలలో, వర్ణింపఁబడిన యిరువదినల్వురు శాసనమహాదేవులలో నొక్కతె యైయుండవలయును. ఇరువదిరెండవ తీర్థంకరుని శాసనదేవియైన యంబిక దుర్గయొక్క యొక ప్రతిరూపమని భావింపఁబడుచున్నది. అట్లే పద్మాక్షి పార్శ్వనాథునియొక శాసనదేవిగ నున్నది.1 కాఁబట్టి ప్రోలరాజుమంత్రియైన బేతనప్రెగ్గడభార్యయగు మైలమ్మ యాకొండ పైని యాలయమునఁ గన్నడములో "కడలాలయ" మనియెడి యంబికనో పద్మావతినో ప్రతిష్ఠించియుండ వచ్చునని యూహింపవచ్చును. తనకు జైనమతమునం దుండెడి ప్రేమచేతను భక్తిచేతను బుణ్యము కొరకు కొండపైని కడలాలయబస్తిని (వసతిని) బేతన ప్రెగ్గడభార్య యగు మైలమ్మనిర్మించెనని పై శాసనమునందే చెప్పఁబడినది. మైలమ్మ తండ్రియగు బేతనప్రెగ్గడ తన స్వగ్రామమునందుఁ బదిదేవాలయములను నిర్మించెనని కూడ వ్రాయఁబడినది. ఈ మైలమ్మచే నిర్మింపఁబడిన కడలాలయమున జాళుక్య విక్రమసంవత్సరము ౪౨ హేవిళంబి సంవత్సర పుష్యబహుళ 30 సోమవారమున అనఁగా క్రీ.శ. ౧౧౧౭ సంవత్సరము డిసెంబరు ౨౪వ తేదీని శ్రీమన్మహామండలేశ్వరకాకతి ప్రోలరాజు మైలమ్మపేరిట నామెభర్తయైన బేతనప్రెగ్గడ త్రవ్వించిన

1. Dr. Burgess Archeological Survey of Western India Vol. V. page 45 F and page 46, note 2

చెఱువుక్రిందను బాడువపొలము రెండుమత్తరులను ఆచెఱువునకు బడమటిప్రక్కను నలరేవడిపొలము నాలుగుమత్తరులను బీటిపొల మూఁడుమత్తరులను ధారాపూర్వకముగా దానముచేసి పై శాసనమును వ్రాయించెను. మఱియు నీశాసనమందే శ్రీమన్మహామండలేశ్వర మేళరాజు కూచికెఱెచెఱువుకట్టక్రింద నొకమత్తరుబాడువపొలమునుదానికి సామీప్యమునఁ బదిమత్తరుల సామాన్యభూమిని దానముచేసినటుల వ్రాయఁబడినది. ఈ మండలేశ్వరుఁ డయిన మేళరాజు మాధవవర్మ వంశమున జనించిన వాఁడని వ్రాయఁబడినది. మాధవవర్మగాథ పండ్రెండవ శతాబ్ది ప్రారంభమునకే ప్రచారము నందుండెనని యీ శాసనముంబట్టి దెలియుచున్నది. ఇట్లు భూదానములను, బొందిన యీ జైనాలయమును అనుమకొండ బ్రాహ్మణులు స్వాధీనముచేసికొని దుర్గయొక్క నామాంతరమని నమ్మి పద్మాక్షీదేవియను పేరితో నర్చనాదికమును జరుపుచున్నారు. ఈ యాలయము జైనులనుండి బ్రాహ్మణుల స్వాధీన మెప్పుడయ్యెనో తెలియరాదు. ఇయ్యది మొదటి ప్రతాపరుద్రుని కాలమున బ్రాహ్మణుల యధీనమై యుండును. ఈ శాసనమునుబట్టి యీ పద్మాక్షి యాలయము మాధవవర్మ కాలమునుండియు శైవ బ్రాహ్మణుల యాధీనమునం దుండెనని గాని, ఈ పద్మాక్షీదేవి వరప్రసాదముచేతనే సోమదేవరాజు మాధవవర్మ మొదలుగాఁగల చంద్రవంశపురాజులను జయించి రాజ్యమేలినారనిగాని విశ్వసింప దగునేమో దెలియరాదు.

## ప్రోలరాజు తైలపదేవుని బంధించి విడుచుట.

కాకతి ప్రోలరాజు పుత్త్రుఁడయిన మొదటి ప్రతాపరుద్రుని యనుమకొండ శాసనములో చాళుక్య చూడామణియైన తైలపదేవునితో యుద్ధముచేసి క్షణములో బంధించి భక్తునియందుండెడి

యనురాగముచేత విడిచిపుచ్చె నని చెప్పఁబడినది. * ఇందుఁ బేర్కొనఁ బడిన తైలపదేవుఁడు రాజ్యాధిపత్యమును వహించి కుంతలదేశమును బరిపాలించిన యా పశ్చిమ చాళుక్యవంశమున జనించిన తైలపదేవుఁడేగాని యన్యుఁడు గాడని స్పష్టముగాఁ జెప్ప వచ్చును. చాళుక్యరాజులలో శ్రేష్ఠుఁడై, ఏనుగు నధిష్ఠించు వ్యాపారమున నిష్ఠగలవాఁడై సదా యుద్ధమునందగుల్కొన్న మనస్సు గలవాఁడైనల్లనైన యేనుగుపై నెక్కి యున్నవాఁడగు శ్రీమత్తైలప దేవుని శత్రువుల కంఠములను నుత్తరించు వ్యాపారమున మిక్కిలి పొగడ్తగాంచినవాఁడు (పోలరాజు) క్షణములో వానిబట్టుకొని యతనిమీఁది భక్తిచేతను, ప్రేమచేతను విడిచిపెట్టెనని యర్థమిచ్చెడి శ్లోకము గాన వచ్చుచున్నది.

ఇందలి వర్ణనమును బట్టిచూడ నీ చాళుక్యచూడామణి యగు వాఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తియగు తైలపదేవుఁడేగాని యన్యుఁడుగాడనుట స్పష్టము. కాకతిప్రోలరాజు వీనియెడ భక్త్యను రాగములు గలిగియున్నట్టుగాఁ దెలుపుచున్నప్పుడు సామాన్యునిగాఁ దలంపరాదు. పశ్చిమ చాళుక్యులలో నాఱవ విక్రమాదిత్యునకు వెనుక భూలోకమల్ల బిరుదాంచితుఁడగు మూఁడవ సోమేశ్వరుఁడు 1127 మొదలుకొని 1138 వఱకు బరిపాలనము చేసెను. వీని రెండవ కుమారుఁడే మన తైలపదేవుఁడు. మొదటి కుమారుఁడు పెరమాండి జగదేక మల్లుఁడు. ఈ మూఁడవ సోమేశ్వరుఁడె తన రెండవ కొమ

---

* "హస్త్యారోహణ కర్మ కర్మఠగతిం చాళుక్య చూడామణిం
శశ్వద్యుద్ధనిబద్ధ గహ్వరమతిం యుద్ధే బబంధక్షణాత్,
శ్రీమత్తైలపదేవ మంబుదనిభ స్తం బేరమస్థంక్షణాత్,
ప్రఖ్యాతో రిపుకంఠ ఖండన విధౌ భక్త్యానురాగాజ్జహౌ॥"

హనుమకొండ శాసనము (27—30 ప)

రుఁడై తైలపుని యువరాజునుగఁ జేసెను. మూఁడవ సోమేశ్వరునకుఁ బిమ్మట వాని పెద్దకుమారుఁడు రెండవ జగదేకమల్లుఁడు 1138 మొదలు 1148 వఱకుఁ బరిపాలనము చేసెను. వానివెనుక మన తైలపదేవుఁడు త్రైలోక్యమల్ల బిరుదమునువహించి క్రీ.శ. 1148 సింహాసనమధిష్ఠించెను. వీనికాలములో మహామండలేశ్వరులలోఁ గొందఱు నిరంకుశాధికారులై స్వతంత్రులై వీని యధికారమును ధిక్కరించిరి. అట్టివారిలో బిజ్జలుఁడొకఁడు. కాలచుర్యుఁడును, హైహయాన్వయుఁడునైన యితఁడు త్రైలోక్యమల్ల తైలపదేవునికి యుద్ధమంత్రిగను దండనాయకుఁడుగ నుండెను. ఇతని ప్రయత్నమునకు కొల్లాపుర మండలేశ్వరుఁడగు విజయార్కుఁడును, త్రైలింగ్య సామ్రాజ్య స్థాపకుఁడు నగు కాకతి ప్రోలరాజును దోడ్పడి, ఇతనికి విజయమును సిద్ధింపఁజేసిరి. కాకతీయ ప్రోలరాజు తైలపదేవుని నోడించి యతనిఁ జెఱఁబెట్టి 1157 వ సంవత్సరమున విడిచిపుచ్చెను. ఇతఁడు కళ్యాణపురమును విడిచిపెట్టి ధార్వాడ మండలములోని యన్నిగేరికిఁ బోయి కొంతకాలమువఱకు దానినే రాజధానిగఁజేసికొనియెనుగాని, యాతని రాజ్యము మిక్కిలి క్షీణించిన దయ్యెను. క్రీ. శ. 1157 వ సంవత్సరమున బిజ్జలుఁడు రాజ్యభారము వహించి నట్లొక శాసనము కలదుగాని క్రీ. శ. 1162 వఱకు రాజబిరుదము లేవియు వహింపక మహామండలేశ్వరుఁడుగ నుండెను. ఇతఁడా సంవత్సరము త్రైలోక్యమల్లునిపై దండెత్తిపోయి తాను స్వతంత్ర రాజునని ప్రకటింపించెను. త్రైలోక్యమల్లుఁడను, నీ మూఁడవ తైలపదేవుఁడు అన్నిగేరినుండి మఱికొంత దక్షిణముగా వనవాసికిఁబోయి యచ్చటనే నివసించుచుండెను.1 ఇతఁడు క్రీ. శ. ౧౧౬౬ వఱకుఁ బరిపాలనము చేసినట్లు గానిపించు చున్నది. 1157 లో కాకతి ప్రోలరాజు తైలపునోడించి

(1) Jour. R A. S. Vol. IV, p, 16

(2) P. S. & O. C. Ins. No. 140.

చెఱిపెట్టి విడిచిపుచ్చిన విషయమునే హనుమకొండ శాసనకవి యీ విధముగా వర్ణించి యున్నాఁడు. ప్రతాపరుద్రుని కాలమున మరణించిన తైలపునిగూర్చి ప్రతాపరుద్రునిగూర్చి వ్రాయుసందర్భమున వ్రాయుదును.

పోలిరాజు గోవిందరాజును జయించుట.

పోలిరాజు పశ్చిమ చాళుక్య చక్రవర్తుల సేనాధిపతియైన గోవిందరాజును జయించెనని యనుమకొండలోని రుద్రదేవుని శాసనము వలనఁ దెలిసికొనుచున్నాము.

"కుంకోరి దేశాధిపతియొక్క మొక్కవోని గండ్రగొడ్డలి యొక్క తీవ్రమైన కొనవాఁడియందు దొప్పచుండు దెగవేయఁబడుటను బడఁగొట్టుటయందు నేర్పుగల గోవిందరాజును వానిని యుద్ధమునందు గట్టివేసి, అప్పుడే యీ రాజ్యమును, అతని రాజ్యమును నాశనముఁ జేసినవాఁడును, చక్కనిదైన వీరవ్రతముచేత గొప్పవాడును (నైన) పోలిరాజు ఉదయరాజునకు సులభముగా నిచ్చివేసెను." అను భావమును వెల్లడించు శ్లోకము గలదు. *

అనంతపాలుని సోదరపుత్త్రుఁడని అబ్బలూరు శాసనముల వలనఁ దెలియుచున్నది. ఈ గోవింద దండనాయకుఁడు క్రీ. శ ౧౧౨౬-౨౭ సంవత్సర ప్రాంతమున నాంధ్రదేశములోని కొండపల్లి సీమకు బరిపాలకుఁడుగ నున్నటులఁ గందనోలి (కర్నూలు) మండలములోని త్రిపురాంతక శాసనములలో నొకదాని వలనఁ జక్కఁగా

* యో (యః) కుంతే రిపతేరకుంఠ పరశుశ్లక్ష్ణాగ్ర ధారోల్లస
ద్ధారా పాతనిపాతనైక చతురం గోవింద రాజాహ్వయం
బద్ధ్వోన్మూల్య తదోదయక్షితి భృతే రాజ్యం దదౌ లీలయా
లుంటాకో విషయస్య తస్య సమరే సద్వీర దీక్షాగురుః॥

వేయిస్తంభాలగుడి శాసనము. (30—33 ప) పేజి. ౯౬.

దేటపడుచున్నది. అందితఁడు వేంగీపురమును దగ్ధముగావించి గోంక రాజును జయించినటులఁ జెప్పఁబడినది. ఈ గోంకరాజు వేంగీదేశము నకు రాజప్రతినిధియై ధనదుపురము (గుంటూరు మండలములోని చందవ్రోలు) రాజధానిగఁ బరిపాలనముచేసిన వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడునకుఁ బుత్త్రుఁడు. వెలనాడునకు రాజధానిగనున్న ధనదుపురమునకు నాకాలమున వేంగీపుర మనిగూడఁ జెప్పుచుండిరి కాబోలు. వెలనాటిరాజులు వేంగీ రాజప్రతినిధులై పరిపాలనఁజేసిన వారగుటవలన వారు నివసించు ముఖ్యపట్టణమయిన ధనదుపురము వేంగీపురమని పరరాజులచేఁ బేర్కొనంబడుట యొకవిశేష విషయము గాదు. ఈ గోవిందరాజును జయించి యితని రాజ్యమును ఉదయ రాజున కిప్పించెనని చెప్పఁబడి యున్నది. ఇందుఁ బేర్కొనఁబడిన యుదయరా జెవ్వఁడైనదియు నిర్ధారించుట కష్టసాధ్యముగ నుండును. కందూరోదయచోడుఁడే యుదయరాజని కొందఱును, వెలనాటి గోంకరాజే చోడోదయుండని మఱికొందఱును తలంచుచున్నారు.

ఉదయరాజునుగూర్చి రుద్రదేవునిగూర్చి వ్రాయు సందర్భమునఁ జర్చింపఁ బూనినాఁడను గావున నిచట విరమించు చున్నాను. కాకతీయ సంచికా సంపాదకులు గోవిందరాజునుగూర్చి యిట్లు వ్రాసి యున్నారు.

"కాకతి ప్రోలుని రెండవ ప్రత్యర్థి గోవిందరాజు. ఈతని నీ కాకతీయ రాజన్యుఁడు యుద్ధమున నోడించి యీతఁ డేలుచుండిన లుంతాక విషయమును ఉదయరాజునకిచ్చెనని యనుమకొండ శాసనమునఁ జెప్పఁబడినది. పై శాసనము నందలి గోవిందరాజును, విక్రమాదిత్యుని దండనాథుఁడుగనుండి ద్రాక్షారామాది స్థలములలోని శాసనములవలనఁ దెలియనగు దండనాయక గోవిందరసయు నొక్కరేయై యుందురు. ఆంధ్రచరిత్రకారు లీతఁడు బెజవాడదగ్గరనున్న

కొండపల్లి దుర్గ పాలకుఁడనియును శ్రీ శేషాద్రిరమణ కవులీతఁడు వరంగల్లు జిల్లాలోని నేలకొండపల్లి ప్రాంత పాలకుఁడనియు నభిప్రాయ పడుచున్నారు. ప్రోలరాజు కాలముననే రాజ్యవిస్తరణ మారంభమయ్యెననియు, నాతని ప్రత్యర్థులందఱును అనుమకొండ పరిసర ప్రాంత పాలకులే యనియు నిదివరలో చెప్పియుంటిమి. ఈ యభిప్రాయము ననుసరించి గోవిందరాజు నేలకొండపల్లిని పాలించు చుండెనని చెప్పుటయె సమంజసముగాఁ గన్పట్టుచున్నదని వ్రాయుచు మరల "1120-24 వఱకు వేంగీదేశమున నధికారము నెఱపిన గోవిందరసయు, నీ నేలకొండపల్లి పాలకుఁడగు గోవిందరాజు నొక్కఁ రేయని చెప్పవచ్చును. ఆస్థానమును కేంద్రముగ వేంగీదేశమును గూడ నేలియుండవచ్చు"నని వ్రాసియున్నారు. చాళుక్య విక్రమాదిత్యునకు గోవిందరాజెట్టిసామంతుఁడో ప్రోలరాజుగూడ నట్టి సామంతుఁడేకాని ప్రోలరాజు అనుమకొండ రాజ్యమున కధిపతిగా నున్నవాఁడు. వేంగీదేశ దండయాత్ర యజమాని పక్షమును వహించి వచ్చినవారిలో నిర్వురుముఖ్యులు. ఒకరు అనంతపాలుఁడు, రెండవవాడతని మేనల్లుఁడగు గోవిందరాజు. వీరిర్వురు వేంగీదేశపాలకుని జయించి అనంత పాలుఁడు గుంటూరు సీమను, రెండవవాఁడు గోవిందరాజు కొండపల్లి సీమను బరిపాలించిరి. కొండపల్లిసీమకూడ అనుమకొండ విషయమునకుఁ బరిసర ప్రాంతమె. అదియునుంగాక యిర్వురు నొక్కఁపురుషుఁడేయని యొప్పుకొన్నవారికీ సంవాదముతోఁ బనిలేదు. ఇంతకు నేను "కొండపల్లిసీమ"యని వ్రాసియున్నాఁడను గాని స్పష్టించి వ్రాసియుండలేదు. ఇంతకు గోవిందరాజు పరిపాలించినది వరంగలు జిల్లాకాదు. కొండపల్లి సీమయె యని మఱొక మాఱు నొక్కి వక్కాణింపవలసి యున్నది.

## ప్రోలరాజు గుండరాజును జంపుట.

కాకతి ప్రోలరాజు మంత్రకూటపట్టణాధిపతియైన గుండరాజుపై దండెత్తిపోయి యతనితో యుద్ధముచేసి జయించి యంతటితోఁ బోవక యాగ్రహ మహోదగ్రుఁడై యతనిం బట్టుకొని శిరమును గొరిగించి వక్షఃస్థలంబున వరాహముద్రను బొడిచి చంపెనని రుద్రదేవుని శాసనమునఁ జెప్పఁబడినది.

“ఎవఁడు ప్రోలరాజు ముందఱకు యుద్ధమునకుఁ బిలువఁబడియు గొఱ్ఱెపిల్లవలెఁ బాఱిపోవు నాశక్తిగలవాఁడయి తన పట్టణమునకు వెడలిపోయెనో, ఆసిగ్గులేని మంత్రకూట (మంథెన) నగరాధిపుఁడైన గుండరాజు, కోపముగల ప్రోలరాజుచేఁ దలగొఱిగింపఁబడి వరాహముద్రగల కొమ్ముగలవాఁడై చివరకుఁ దలగొట్టఁబడినవాఁడాయెను.” అను భావముతో నొక శ్లోకము చేర్పఁబడినది. 1

మంత్రకూటమనునది నైజాము రాష్ట్రములోని గోదావరీ తీరమునందున్న మంథెనగ్రామమునకె వర్తించునుగాని పూర్వపు ముద్రణములో ముద్రించినట్లు కృష్ణామండలములో నూజవీడు తాలూకాలోని మంతెన గ్రామముగాదు. ఇందు కేవిధమైన సంవాదముతోను బనిలేదు. పాలంపేట శాసనములో నీ గుండ్రాజును జంపినది కాకతి ప్రోలరాజుగాక ప్రోలరాజు సైన్యాధిపతియగు కామసేనానియని తెలుపఁబడినది. 2

---

1. క్రుద్ధేనోద్ధుర మంత్రకూట నగరీ నాథోఽథయోనిస్త్రపో
గుండః ఖండిత ఏవముండిత శిరాః క్రోడాంక వక్షస్స్థలః
ఏడోడింభ కవత్పలాయన పరో జాతో గతస్స్వాంపురీ,
మాహూతోఽపి నృపేశ్వర స్యపురతః ప్రోలేనయుద్ధాయ యత్.॥

వేయిస్తంభాలగుడి శాసనము. పేజి. 86 (విద్వాన్ అప్పన్న శాస్త్రికృతము)

2. శ్రీమత్ప్రోల నృపాల సైన్యపతినా విఖ్యాత విక్రాంతినా యుద్ధే
యేన మహా బలేననిహతే మంథన్యగుండాధిప అన్యే వైరినృపా
లకాః ప్రతిదిశం ప్రాదుద్రువం స్తత్క్షణాత్సింహేనేవ నిపాతితే
గజపతౌ శేషాగజాః క్షుద్రకాః॥

పాలంపేట శాసనము. (Hyd. Arch Ser. No. 3)

సామాన్య సైనికులు చేసిన ఘనకార్యములు వారి సేనాధిపతులకుఁ జెందునట్లే, సేనాధిపతుల ఘనకార్యములయొక్క గౌరవము వారి ప్రభువులకుఁ జెందఁజేయుట, పూర్వుల వీరసంప్రదాయ కథనములయొక్క లక్ష్యమట్టిది. దీనికి వింతపడనక్కర లేదు.

## ప్రోలరాజు జగద్దేవుని పాఱఁదోలుట.

అనుమకొండ శాసనమునందే జగద్దేవుఁడను రాజు ప్రోలరాజుపై దండెత్తివచ్చి యనుమకొండను ముట్టడింపఁగా నాతని జయించి తఱిమెనని చెప్పఁబడి యున్నది. అందిట్లున్నది.

"వెండియు, నెవఁడనేక మాండలికరాజులతోఁగూడినవాఁడై అనుమకొండ పట్టణమునుజుట్టు ముట్టి నిలచెనో, భూలోకమున దేవతల గొప్పదనమునంటి గొప్పదనము కలవాఁడైన యాజగద్దేవుఁడేమి చేయుటకును దోఁచనివాఁడై, మాన్పడి, క్షణములోఁ బాఱిపోయెను. జయశాలియైన శ్రీమత్ప్రోలరాజుయొక్క గౌరవమును గూర్చి యేమి (యెంతని) చెప్పఁగలము ? " *

ఈ పైశ్లోకమునం బేర్కొనంబడిన జగద్దేవుఁడు పట్టిపొంబుచ్చపురాధీశులయిన సంతారరాజులలో నొక్కఁడగు మహామండలేశ్వర త్రిభువనమల్ల జగద్దేవుఁడేకాని యన్యుఁడుగాఁడు. పట్టిపొంబుచ్చపురము నేఁడు మైసూరు రాష్ట్రములో నగరమండలములోని హొంచ యనుపేరం బరఁగుచున్నది. ఈ జగద్దేవునితల్లి బిజ్జలదేవి; చెల్లెలగు

* అన్య చ్చానుమకొండ నామనగరీం సంవేష్ట్య యో యంస్థితో
నానా మండలికాన్వితో భువి జగద్దేవస్సదేవ ప్రభః
స్తబ్ధస్తంభిత ఏవ కార్య కరణేఽశక్తః క్షణాన్నిర్గతః
శ్రీమత్ప్రోల నృపస్య తస్య జయినః కింబ్రూమహే గౌరవం॥ "

వేయి స్తంభాలగుడి శాసనము. (37-39 ప) పేజి. 87. Ind. Ant. Vol. XXI p. 257. కాకతీయ సంచిక. అనుబంధము. పేజి. 32. శా. 6.

చట్టలదేవి గోవాకదంబులలో మొదటి విజయాదిత్యునకిచ్చి వివాహము చేయఁబడియెను. (శా. శ. ౧౦౨౦) ఇతఁడు వయస్సుమీఱకయున్న కాలమున బల్లాలరాజులచే నదిమిపెట్టఁబడి యుండెను. మొదటి బల్లాలరాజు జగద్దేవుని రాష్ట్రమును బాడుచేసెనని గడగు శాసనమువలనఁ దెలియుచున్నది.1 శా. శ. ౧౦౩౬ సంవత్సరములో నేర్పడిన బేలూరు శాసనములలో నొక దానిలో జగద్దేవుని బలమును హరించుటయందు భైరవునివంటివాఁడని హోసలబల్లాలరాజయిన విష్ణువర్ధనుఁ డభినందింపఁబడియెను. అయినను జగద్దేవుఁడు శా. శ. ౧౦౭౧ (క్రీ. శ. ౧౧౪౯) వ సంవత్సరమున "సేతు" అనెడి ప్రదేశమునఁ బరిపాలనముసేయుచు బల్లిగావె గ్రామమునకు విచ్చేసికొండనాటిలోనికుంటూరు గ్రామమునుదానముచేసియున్నాఁడు. పశ్చిమ చాళుక్యచక్రవర్తియైన రెండవ జగదేకమల్లుని పరిపాలన సంవత్సరములలో ౧౩ వదియగు శుక్లసంవత్సరమునఁ బై శాసనము పుట్టియుండుటచేతను, చాళుక్య చక్రవర్తులచే వహింపబడుచుండిన త్రిభువనమల్లయను బిరుద నామమును వహించి యుండుట చేతను, ఇతఁడు మొదట త్రిభువనమల్ల విక్రమాదిత్య చక్రవర్తికిని, అటు పిమ్మట రెండవ జగదేక మల్లునకును, సామంతుఁడుగ నుండెనని వేద్యమగు చున్నది. అందుచేతనే యితఁడు త్రైలపదేవుఁడు కాకతి ప్రోలరాజుచేఁ బట్టువడి పరిభవింపఁబడి తరువాత ప్రభుపక్షమును బూని ప్రోలరాజును శిక్షించుటకై అనుమకొండపై దాడివెడలివచ్చి యుద్ధముచేసి యోడిపోఁగాఁ బ్రోలరాజుచేఁ దఱుమఁగొట్టఁబడియుండునని సులభముగా బోధపడుచున్నది.

ఇట్లుండినను జగద్దేవునిగూర్చి యొకవింత సంవాదము బయలుదేరినది. నేనీ చరిత్రభాగమును బ్రకటించిన వెనుక నిటీవల హైదరాబాదు రాష్ట్రమున నేర్పడిన శ్రీ లక్ష్మణరాయ పరిశోధకమండలి

1. Indian Antiquary, Vol. II page 301.

వారి కృషివలనఁ గొన్ని శాసనములు కనుగొనబఁడి ప్రతులెత్తబఁడి "తెలింగానా శాసనము"లను పేరిట నొక సంపుటముగాఁ బ్రకటింపఁ బడినవి. వానిలో "వేములవాడ, నగునూరు" శాసనముల రెండిటి లోను నొక జగద్దేవుని నామము పేర్కొనఁబడినదిగాని యతఁడె వ్వరో తెలిసికొనుటకు వివరము లేవియుఁగానరావుగాని వేములవాడ శాసనములో మాత్రము "మహామండలేశ్వర జగద్దేవరు" పొళ వాకవుల తిలకుఁడని వక్కాణింపఁబడి యున్నది.1 కాకతీయ సంచి కలోఁ 'గణపవరము శాసన'మని యొక శాసనములోని మూడు శ్లోకము లను బంధములోఁ జేర్పఁబడినవి. హేమాద్రి భూపతి జగద్దేవ రాజును సేనాపతిగను, మంత్రిగను చేసికొనెను. (2) అతనికి దేవ పాలుఁడను కొడుకు పుట్టెను. ఇతనికి జగద్దేవుఁడు పాలకుఁడుగా నుండెను. (3) జగద్దేవునకిఁ బిమ్మట కాకతీయరాజగు ప్రోలరాజు భూమిని పాలించెను.'' అను భావమీ శ్లోకము లంగను పట్టు చున్నది.

ఈ గణపవరము శాసనము "దెలంగానా శాసనము''లను సంపుటములో కాకతీయ శాసనములలో 18 సంఖ్యగలదిగా నున్నది. ఈ శాసనము గణపతిదేవ చక్రవర్తి కాలము నాటిది.

---

* తెలింగానా శాసనములు పేజి 116. 13 వేములవాడ శాసనము. ఉత్తరము. డిటో. పేజి 119. నగునూరు శాసనము. 17

(1) శ్లో. యం జగద్దేవ భూపాలం లబ్ధ్వా హేమాద్రి భూపతిః
సేనాపతి మమాత్యంచ చక్రే విక్రమ ధీయుతం॥ ౩
తత్పుత్రో భూద్దేవపాల నామధేయోధియాం నిధిః
జగద్దేవ మహీపాల పాలిత స్సమ్మతస్సతాం॥ ౪
యస్తాది భక్తమాలక్ష్మ్యా జగద్దేవా దనం తరం
కాకతీశః ప్రోలభూపస్సోధరాం పర్యపాలయత్॥ ౫
11. గణపవరము శాసనము, కాకతీయ సంచికానుబంధము. పేజి. 41

230A



పద్మాక్షీ దేవాలయము.



పద్మాక్షిగుడిలోని యక్షుని విగ్రహాము.

క్రీ.శ. 1253 సంవత్సరములోనిదని యాశాసనము వలననే తెలియుచున్నది. ఇదిగాక మాటూరు శిథిల శాసనములోఁగూడ జగద్దేవుని పేరు గానంబడుచున్నదని విద్వాన్ అప్పన్నశాస్త్రిగారు 'వేయి స్తంభాలగుడి శాసన' మను గ్రంథములోఁ దెలిపియున్నారు. ఇంతవఱకు తెలుగు దేశమును బరిపాలించిన హేమాద్రిరాజుగాని వాని కుమారుఁడు దేవ భూపాలుఁడుగాని గానరారు. వీరి ప్రదేశమిదియని నిర్ధారించి చెప్పుటకు సాధ్యముగాక యున్నది. గణపవరము శాసనములో నేదియో లోకులాడుకొను వినికిడి ననుసరించి వ్రాయబడినదిగాని సత్యమెఱింగి వ్రాసినదిగాఁగనుపట్టదు. ఈ జగద్దేవుఁడెచ్చట పరిపాలనము చేసెనో యీశాసనములలో నెచ్చటను దెలుపఁబడి యుండలేదు. ఈ జగద్దేవుఁడు నేను చెప్పిన జగద్దేవుఁడేయై యుండవలయును. ఇతఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామంతుఁడు గావునను, కాకతి ప్రోలరాజుగూడ పశ్చిమ చాళుక్య చక్రవర్తులకు సామంతుఁడుగానున్నను, ఆఱవ విక్రమాదిత్యుఁడు మృతినొందిన వెనుక వారిపై తిరుగుబాటుచేసి ప్రత్యేక మాంధ్ర సామ్రాజ్యము నెలకొల్పఁజూచుచున్నవాఁడు గావున పశ్చిమ చాళుక్యులకు సామంతుఁడుగానున్న జగద్దేవుఁడు రాజద్రోహియైన ప్రోలరాజును శిక్షించుటకై స్థానిక మాండలికులతోఁగలసి ప్రోలరాజుతో యుద్ధము చేయుటయు, అనుమకొండయాత్ర సలుపుటయు సంభవించి యుండునని విశ్వసింపవచ్చును. "ఈ జగద్దేవుఁడు ప్రోలరాజునకు మిక్కిలి పరాక్రమ శాలియైన శత్రువేకాని సామాన్యుఁడుకాడు కావుననే యితనిని గెలిచిన ప్రోలరాజు శౌర్యాతిశయము వలనఁ గలిగిన గౌరవము నేమని వర్ణింతునని రుద్రదేవుని శాసనకవి తెలుపుచున్నాఁడు" అని విద్వాన్ అప్పన్న శాస్త్రిగారు గుర్తించిన విషయము. "ఇవన్నియుఁ బరిశీలించి చూడగా జగద్దేవుఁడు లేంబాలవాడ (వేములవాడ) ప్రాంతమువాఁడై యుండునేమోయని నాకనుమానముకలుగుచున్న"దని అప్పన్నశాస్త్రి

గారనుమానము పడనక్కరలేదు. హేమాద్రియనునది పశ్చిమచాళు క్యచక్రవర్తియగు మూఁడవ సోమేశ్వరునకు బిరుదనామమై యుండ వచ్చును. మూడవతైలపునకు "పెరమాడిదేవ"యను నామాంతరము గలదుగావునను, మూఁడవసోమేశ్వరుని కుమారుఁడు మూడవతైలవుడు గావునను మూడవతైలపదేవుని హేమాద్రికుమారుఁడైన దేవభూపాలు నిగామనమేల గ్రహింపరాదు. గణపవరము శాసనములో దేవభూపా లునిజగద్దేవకుఁడు పాలకుఁడుగానుండెనని చెప్పినపుడు మూఁడవతైలప దేవచక్రవర్తిపై కాకతిప్రోలరాజువంటి మాండలికరాజులు పెక్కం డ్రుద్రోహులై యున్నప్పుడు జగద్దేవ... పాలుఁడు వానికి రక్షకుఁడై కాపాడుచుండెనని యేల గ్రహింపరాదు. అట్లుగ్రహించినచో సమ న్వయము కుదురుచుండ లేదా? ప్రోలునికాలమున కాకతీయరాజ్యము మైసూరువఱకు వ్యాపించియుండనక్కరలేదు. "మధ్యమార్గమునం దనేక పశ్చిమచాళుక్య సామంతులుండఁగా ప్రోలునకు దూరదేశ పాలకుఁడగు నీతనితో వైరముపొఁసగుట సమంజసముగ గన్పడదు" అని కాకతీయసంచికా సంపాదకునకు పెద్దశంక పుట్టినది. మధ్య మార్గమునందనేక పశ్చిమచాళుక్య సామంతులుండగా నెక్కడనో హానుంగల్లు, వాసపురము, నాగరఖండముజిల్లా లేలుచుండిన సామం తదండనాయకులగు అనంతపాలయ్య గోవిందరాజులు వేంగిపై దండ యాత్ర సాగించి నాలుగుసంవత్సరముల కాలము పాలించుటకేల విరోధముపెట్టుకొనఁ గలిగిరో అట్టిదే జగద్దేవునికిని ప్రోలరాజునకుఁ గలకారణము-ఇయ్యవి బహు వెత్తుట కేర్పడినట్టి శంకలుగాని సత్య మారయుటకు నేర్పడునట్టి శంకలుగావు. వీరు తలంచినట్లు జగద్దే వుఁడు, మేడరాజు, దొమ్మరాజు, మైళిగిదేవుఁడు మొదలగు వారొ క్కచోటనేయుండి పరిపాలించు చుండిరనుమాట విశ్వసింపఁదగినది కాదు. పశ్చిమచాళుక్య సామంతుఁడయిన గోవిందరాజు కొండపల్లి సీమను బరిపాలించునట్లుగా జగద్దేవుఁడీ ప్రాంతములఁ బశ్చిమచాళుక్య

చక్రవర్తులచేతఁ బాలించుటకు, రాజద్రోహులను శిక్షించి శాంతి నెలకొల్పుటకు వారలచేఁ బంపఁబడెనని యేలగ్రహింపరాదు? పశ్చిమచాళుక్య చక్రవర్తుల క్రిందనున్న యనేక మాండలికరాజుల బలస్తోమముగలిగియుండుట పశ్చిమచాళుక్య చక్రవర్తిచే నియమితుఁడైన బలాఢ్యుఁడయిన జగద్దేవునివంటి సామంత మండలాధీశ్వరునికే సాధ్యమగును గాని యెక్కడనో మారుమూలనున్నకు గ్రామాధిపతియైన వానికి సాధ్యముకాదు. నేనూహించిన జగద్దేవుఁడే యాశాసనములలోని జగద్దేవుఁడు కాఁడని తెల్పుటకుఁ జాలినంత సాక్ష్యము గానరాదు. అట్టి సాక్ష్యమును గొనితెచ్చిచూపు వరకు వారివాదమును నేను విశ్వసింపఁజాలను. వాదమును బూర్వపక్షము చేయఁగలిగిన సాధనములను గొనితెచ్చిన యెడల నావాదమును విడిచిపెట్టి వారు చెప్పినదానినే గ్రహించుటకు నాకేయభ్యంతరము నుండదని మనవిచేసెదను.

## ప్రోలరాజు గురువు రామేశ్వరదీక్షితులు.

అనుమకొండశాసనమును రచియించిన అచింతేంద్రవరకవి తండ్రియు, భారద్వాజగోత్రీయులలో శ్రేష్ఠుఁడును, యజ్ఞయాగాది కర్మనిష్ఠుఁడునైన రామేశ్వరదీక్షితుఁడే ఈరెండవ ప్రోలరాజునకు గురువునై యున్నాఁడు. ఈరామేశ్వరదీక్షితుని గూర్చి మాదిరెడ్డికుంటశాసనములో నిట్లున్నది.

"ఇతఁడు రామేశ్వరదీక్షితుఁడని యెవని నన్నిదిశలను ప్రస్తావించుకొందురో, సద్గుణములనిధి యెవ్వఁడో, ఎవ్వఁడు మహేశ్వరులలో నగ్రగణ్యుఁడో, ఎవ్వఁడు పరమదయాంతరంగుఁడై వికలులకును, బీదలకును, బాధితులకునుఁ సాధువులకు, బ్రాహ్మణులకు అన్నదానముచేయునో అతఁడే యీయాలయములను గట్టించెను. అతఁడు

త్రిభువన మల్లరాజుతండ్రి దనకు భక్తితో నిచ్చిన జనపల్లెకు "శివపుర"మని పేరిడి యందు త్రిపురుషతీర్థమును ప్రతిష్ఠాపించెను. అతఁడు లకులేశ్వరాగమ సిద్ధాంత వేది. ధర్మసంస్థాపకుఁడు. అతని యుత్తమ శిష్యుఁడగు చలమర్తి గండప్రోలరాజు శాశ్వతమగుకీర్తి స్తంభమును స్థాపించెను."*

దీనినిబట్టి యితఁడు కాలాముఖశైవ మతము వాఁడని స్పష్టమగుచున్నది. కాకతిప్రోలరాజునకు శైవమతదీక్ష నొసంగిన గురువర్యుఁడని తెలిసినదిగనుక కాకతిప్రోలరాజుమతము శైవమతమని స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. రెండవ బేతరాజు తనఖాజీపేట శాసనమున అనుమకొండ పట్టణములో నొకతోటయును, శివపుర మను తీర్థమును నిర్మించి ఆనగరమునఁ దనపేరిట నొకదేవాలయము గట్టించెనని యిదివఱకె తెలిసికొని యున్నాము. ఈమాదిరెడ్డికుంటశాసనమువలన నియ్యది విస్పష్టమగుచున్నది. కనుక కాకతిప్రోలరాజునకు మాత్రమెగాక యాతని తండ్రియగు రెండవ బేతరాజునకుఁగూడ శైవమతదీక్ష నిప్పించెనని స్పష్టమగుచున్నది. లకులీశమనియు కాలాముఖమనియు, పాశుపతమనియుఁ బేర్లతో వ్యవహరింపఁబడు శైవమతమునుగూర్చి ముందు తెలుపుదును.

---

* 1 యోరామేశ్వర పండితాయమతి దిగ్వ్యావ
2 ప్తోయశః శ్చంద్రికా జాతైర్యో
3 గుణరత్న రోహణ గిరిర్మాహేశ్వ
4 రగ్రామణీః । ఏతేషాం సురపద్మనా
5 చకృతవాన్ పుంజం ఘృణాతత్పరో
6 దాతాన్నం వికలార్త దీనముని విప్రె
7 భ్యస్తపోవిశ్రుతః॥ (1) కృత్వావై
8 జనపల్యాః శివపుర నామత్రిపురు
9 షతీర్థం । స్వదత్తం యస్యభక్త్యా.
10 త్రిభువన మల్లావ నీశజనకేన॥
11 వేత్తాయా(యో)లకులేశ్వరాగమ మ
12 హాసిద్ధాంత సారామృతం యే
13 నాస్యం (స్యాం) ప్రకటీకృతా వసుమతౌ
14 ధర్మస్య (శ్చ) యశ్శోత్తమః
15 శిష్యోసౌ చలమర్తిగండ నృప
16 తిః ప్రోలావనీవల్లభః స్తంభం
17 స్థాపితవాన్ స్వకీర్తి విమలస్తం
18 భాయితః శాశ్వతం॥ (3)

కాకతీయ సంచిక. అనుబంధము. పేజి ౮౮ మాదిరెడ్డికుంట శాసనము 39

## ప్రోలరాజు సంతానము.

కాకతి ప్రోలరాజు భార్య ముప్పమదేవి. ఈమె సుగుణంబులు నక్షత్రములవలెను, కీర్తిశరత్కాల చంద్రికవలెను, బ్రకాశించుచున్నవనియు, మఱియు నామె కౌసల్య, జానకి, కుంతి, పద్మ, పౌలోమి, చండికా మొదలగు వారింబోలియున్నదని మాత్రము వర్ణింపఁబడియెనే కాని యామె యేవంశమున నేరాజునకు జనియించెనో తెలుపఁబడియుండ నందున ముప్పమదేవియొక్క తల్లిదండ్రులనుగూర్చి మన కేమియుఁ దెలియరాకున్నది. ఈమెకు ప్రోలరాజువలన రుద్రదేవుఁడు, మహాదేవుఁడు మొదలగు నైదుగురు పుత్త్రులు జనించి యశస్వంతులయిరి. ఈప్రకారము కాకతిప్రోలరాజు సంతానమును బ్రాభవమును బడసి అవక్రపరాక్రముఁడై చాళుక్యచక్రవర్తుల సైన్యాధిపతులను పెక్కండ్రు మాండలిక రాజులను జయించి రాజ్యమును విస్తరింపఁజేసి మొట్టమొదట త్రైలింగ్య సామ్రాజ్య నిర్మాణ భవనమునకుఁ బునాదులేర్పరించెను.

## ప్రోలరాజు మరణము.

“ఇట్లవక్రపరాక్రమలీల శత్రురాజులను నిర్జించి త్రైలింగ్య సామ్రాజ్య నిర్మాణభవనమునకుఁ బునాదులేర్పరించి జగతి కేసరి యని బిరుదునామమును వహించి యనేకశివాలయములను నిర్మించి బహుకాలము పరిపాలనము చేసిన కాకతిప్రోలరాజు తుదకు నవసానకాలము సమీపింప దురదృష్టవశమునఁ దనప్రియకుమారుఁడగు శ్రీరుద్రదేవ నృపునిచేఁ బొడువఁబడి చంపఁబడియె” నని ఆంధ్రుల చరిత్రము పూర్వ ముద్రణమునఁ దెలిపియుంటినిగాని యయ్యది సత్యముగాఁ గనుపట్టదు. స్థానికచరిత్రములలోని గాథలనమ్మి విధిలేక నాఁడట్లు వ్రాయవలసి వచ్చినది. ఇటీవల ప్రభుత్వమువారు దాక్షా

రామ భీమేశ్వరాలయములోని శాసనములనన్నిటిని బ్రకటించిన తరువాత నీవిషయ మసత్యమని స్పష్టపడినది. ఏమనగా శా. శ ౧౦౯౧ నకు సరియైన క్రీ శ. 1169 సంవత్సరములోని యొక శాసనములో వెలనాటి రెండవ చోడయరాజును గూర్చిన ప్రశస్తిలో చోడయరాజు "కాకతిప్రోలనిర్దహన" అని కీర్తింపఁబడి యున్నాఁడు. దీనిని నామిత్రులు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మొదట గుర్తించినారు. వారిట్లు వ్రాసియున్నారు.[1]

"దీని ననుసరించి యతఁడు కాకతిప్రోలరాజును దహించిన వాఁడు అని తెలుచున్నది. కాకతిప్రోలరాజు శాసనములు ఇంతవఱకు రెండుమాత్రమే తెలియవచ్చినవి. (౧) శకము ౧౦౩౭ నాటిది (౨) శకము ౧౦౩౯ నాటిది. వీటిలో మొదటి శాసనమున నొక్క ప్రోలరాజు పేర్కొనఁబడెను. అతఁడితఁడగునా కాదాయని యించుక సంశయింప వలసియున్నను రెండవది యాతనిదగుట నిశ్చయము. ప్రోలరాజు కుమారుఁడైన మొదటి రుద్రదేవరాజు మొదటి శాసనము శ. ౧౦౮౦నాటిదే. రుద్రదేవరాజు ఎప్పుడు రాజ్యమునకు వచ్చినదియు మనకు నిశ్చయముగఁ దెలియదు. వెలనాటి చోడుఁడు కాకతి ప్రోలుని దహించిన దెప్పుడో మనము నిశ్చయముగఁ జెప్పలేము. కాని యీపని నాతఁడు యువరాజుగ నుండినప్పుడో లేక సింహాసనమెక్కిన మొదటి దినములలోనో చేసియుండ వచ్చును.

(1) S. I. I. Vol IV, No. 1242

(2) నా మిత్రులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, "కళింగములోని కాకతీయులు. అనువ్యాస మొకటి "కళింగ సంచిక" యందుఁ బ్రకటించినారు. అదిచూచినచోఁ దెలియగలదు.



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## ఏడవ ప్రకరణము.

## కాకతిరాజుల చరిత్రము.

### శ్రీరుద్రదేవమహారాజు.

(క్రీ. శ. ౧౧౫౮ మొదలుకొని ౧౧౯౬ వఱకు.)

కాకతిప్రోలరాజునకుఁ బిమ్మట నతని పెద్దకుమారుఁడైన రుద్రదేవుఁడు పట్టాభిషిక్తుఁడయ్యెనుగాని యెప్పటినుండి యాతని పరిపాలనము ప్రారంభమయ్యెనో స్పష్టముగాఁ దెలిసికొనుట కాధారము గానిపింపలేదు. భావిపరిశోధనమున సత్యము తేటపడునంత దనుక క్రీ. శ. ౧౧౫౮ దవ సవంత్సరమునకుఁ గొంచె మీవలావలఁ గాని రుద్రదేవుని పరిపాలనము ప్రారంభమై యుండునని చెప్ప వచ్చును. ఈరుద్రదేవుఁడే చరిత్రమున మొదటి ప్రతాపరుద్రుఁడని పేర్కొనఁబడుచున్నాఁడు. ఇతఁడు పరాక్రమమునందు తండ్రిని నయితము మించినవాఁడై అధికసామర్థ్యముతో నతఁడేర్పరించిన పునాదులపైఁ ద్రైలింగ్యసామ్రాజ్యభవన నిర్మాణమును గావించి సుస్థిరమైన యశమును సంపాదించెను. ఇతని చరిత్రమును సంపూర్ణముగాఁ దెలిసికొనుటకుఁ జాలినన్ని సాధనములు గానరావు గాని

కొంతచరిత్రమును దెలిసికొనుటకు మాత్రము రెండుమూఁడు శాస సములు మాత్రము తోడ్పడుచున్నవి. అందనుమకొండ శాస నము ప్రధానమైనది. ఇయ్యది శా. శ. ౧౦౮౪ వ సంవత్సరము నందఁగా క్రీ. శ. ౧౧౬౨ వ సంవత్సరమున రుద్రదేవుని చేతనే వ్రాయింపబడిన ప్రధానశాసనముగానున్నది. ఇందు కాకతీయ రాజులకు ప్రోలరాజు రుద్రదేవరాజుల ప్రశస్తికావ్యరీతిని అద్వయా మృతయతికి పరమశిష్యుఁడయిన అచింతేంద్రుఁడను కవివర్యునిచే రచింపఁబడియెను. ఈశాసనమునందు రుద్రదేవుని తాతయైన త్రిభువనమల్లునకు (రెండవ బేతరాజు) బూర్వమునందుండిన వంశ పురుషుల నెవ్వరిని బేర్కొని యుండలేదు. ఇతఁడును, వీనితండ్రియు జయించిన రాజులను కొందఱను బేర్కొనియుండుటచేతఁ గొంత వఱకైనను చరిత్రము బోధపడుచున్నది.

రుద్రదేవుఁడు దొమ్మరాజును జయించుట.

ఈశాసనములో:—

"ఉన్నతములైనట్టియు, ప్రఖ్యాతములైనట్టియు, నశ్వంబుల నారోహించుట యందు నేర్పరియు, చారుపరాక్రముండునగు "దొమ్మ రాజు" అనువానిని పార్థుఁడు కర్ణుని వందలకొలఁది తీక్ష్ణములయిన బాణములచేతఁ బలుమాఱుతఱుమఁ గొట్టినట్లుగా రుద్రదేవుఁడు తఱిమి విశేషవస్తుసంపన్నంబులయిన పట్టణంబులఁగైకొనియెనని చెప్పఁబడి యున్నది. ఇందుఁబేర్కొనఁబడిన రుద్రదేవుని శత్రువెవ్వఁడో తెలిసికొనవలసియున్నది.1 నగునూరి శాసనములో ఇతఁడును,

(1) "త్యజత్తు జ్గతురజ్గనచయా రోహక్రమే కర్మఠం
(డొ)దోమ్మం చారు పరాక్రమ క్రమభరం భఙ్త్వా సకృల్లీల యో
కర్ణం పార్థ ఇవామలైః శరశతైర్విద్రావ్య విద్రావ్యతో
లేభే సర్వ విశేష యుక్తనగర గ్రామం స రుద్రో నృపః॥"

మేడరాజును, జగద్దేవుఁడును గలిసి యెనుబదివేల సైన్యమును గెల్చెనని మాత్రము తెలుపఁబడియున్నదిగాని యితని పుట్టుపూర్వోత్తరము సెట్టిదో, ఎక్కడపరిపాలనము చేయుచున్నవాఁడో తెలియఁజేయు శాసనమొక్కటియుఁ గానరాలేదు. మఱియుఁబైని వక్కాణించిన విషయముక్రిందనే "మేడరాజుయొక్క మోసపుచ్చుట యందలి గర్వాతిశయమును పలుచగాఁ జేయసమర్థుఁడును, రాజుల యొక్కనిరర్గళమై యతిశయమైన వీనుల మంత్రదీక్షను లాగికొనుట యను నియమముచే గొప్పవాఁడును. శ్రీమన్మైళిగిదేవుని యుద్ధసమయమందుగలిగిన శౌర్యగర్వమును హరించినవాఁడును పొందఁబడిన శ్రీపోలవాస దేశవైభవముగలవాఁడును నైన రుద్రదేవుని స్తుతించుచున్నానని కవివర్ణించియున్నాఁడు.*

"ఈప్రతాపరుద్రదేవుఁడు మైళిగిదేవుని జయించి పోలవాస దేశమును గైకొనియెనని పైశ్లోకమున చెప్పబడినది. శౌణదేశమును బరిపాలించుచుండిన సింగనరాజు కొడుకు మల్లుగియనువాఁడే మైళిగి దేవుఁడై యుండవచ్చును. ఈమల్లుఁగి యాదవవంశ జాతుఁడు. (ఈయాదవ వంశమునకే శౌణవంశమని పేరు.) ఇతఁడు పర్ణఖేత మను పట్టణమును తనశత్రువులనుండి స్వాధీనపఱచుకొని యాపర్ణ ఖేతముననే నివసించుకాలమున నుత్కలరాజుయొక్క గజసేనను బరాక్రమముతో నెగనెత్తుకొనిపోయెను. ఇతఁడు దేవగిరి యాదవుల యొక్క పూర్వికుఁడు. ఇతఁడు గాకపోయిన నీతనిరెండవ కుమా

* ఈడేమేడ విడమ్బడమ్బర భ(క్షో)దక్ష్యోరదక్షమంత్రాన్ భృతాం
దుర్వారోద్ధుర వీర మన్త్ర సమయాదానైక దీక్షాగురుం
శ్రీమన్మైళిగి దేవసఙ్గ సమయ ప్రోద్భూత దర్పాపహం
ప్రాప్తశ్రీపోలవాస దేశవిభవం శ్రీరుద్రదేవం సదా"
అనుమకొండ శాసనము లేక వేయిస్తంభాలగుడి శాసనము. పేజి. 88 (8-14-16 ప.) కాకతీయ సంచిక. అనుబంధము. పేజ. 33. శ్లో. 14-15)

రుఁడయిన "అమరమల్లఁగియైన గావచ్చును. పోలవాసదేశమెచ్చ టిదో గుర్తింపనలవిగాక యున్నది." ఇట్లు నేనాంధ్రులచరిత్రము మొదట ప్రకటించినపు డిరువదిమూఁడేండ్లనాఁడు వ్రాసియుంటిని.

## మైళిగిదేవుఁడు.

ఈసందర్భమున విద్వాన్ అప్పన్నశాస్త్రిగారిట్లు వ్రాసినారు.*

"మైళిగిదేవుఁడెవరో యింతవఱకుఁ జరిత్రపరిశోధకులకు సరియైనసంగతి తెలియలేదు. ఇతఁడు దేవగిరినేలిన యాదవ రాజులలో నొకఁడగు మల్లుఁగి (సింగనరాజుకొడుకు) యైనను లేక యతని కుమారుఁడైన యమరమల్లఁగియైనను గావచ్చునని వీరభద్రరావు గారు తమ యాంధ్రుఁచరిత్రములో (రెం. భా. 163) వ్రాసినారు. శ్రీయుత మా. రామారావుగారు వీరితో నేకీభవించుటలేదు. మైళిగి దేవుని జయించి పోలవాసదేశవైభవమును రుద్రుఁడు పొందెనని (శ్లో. 15) యీశాసనములోనే కలదు గావునను, రుద్రదేవుని శత్రురాజులందఱు అనుమకొండ చుట్టుపట్ల నేలినవారే కాఁబట్టియు, పైనిచెప్పబడిన పొలవాస పట్టణమునకు కాఁదగిన పొలాసగ్రామము కరీంనగరమండలములోని జగత్యాలతాలూకాలోఁ జేరినదిగనుకను, అతఁడు తప్పక నిజాంరాష్ట్రప్రాంతవాసుఁడై యుండవచ్చును."

శ్రీయుత మా. రామారావుగారిట్లు వ్రాయుచున్నారు.

"మైళిగిదేవుని పూర్వచరిత్రకారులు యాదవరాజగు మల్లఁగి తోసరిచేసియుండిరి కాని యియ్యది యనుమకొండ శాసనవిషయ ములకు విరుద్ధముగ నున్నది. మైళిగిదేవుని జయించి కాకతిరుద్రుఁడు పొలవాసదేశమును స్వాధీన మొనర్చుకొనెను. అనుమకొండ కనతి

* వేయిస్తంభాలగుడి శాసనము. పుట 37,

దూరముననే జగత్యాల తాలూకాలో నొకమైళిగి గనవచ్చుచు న్నాడు. ఆతాలూకాకు నేటికిని "పొలాసా" అను నామము గలదు. గాన నీతఁడే రుద్రదేవుని ప్రత్యర్థియని చెప్పవలెను.''*

కాకతీయసంచికా సంపాదకులగు రామారావుగారిట్లు వ్రాయుచు "శుక్లసంవత్సర చైత్రభారతిలో శ్రీశేషాద్రి రమణకవులు అనుమకొండశాసన''మను పేరిట రచించిన వ్యాసములోని వారి యూహల నామోదించుచున్నాననివ్రాసియున్నారు.''

ఈపైవాక్యములవలన మొదటివారు రెండవ వారిపైనను, రెండవవారు శ్రీశేషాద్రి రమణకవులపైనను నాధారపడియుండి యట్లువ్రాయ సాహసించినారు.

"ఇంక మూఁడవవారైన శేషాద్రి రమణకవులిట్లు వ్రాయు చున్నారు.

"మైలఁగి దేవుఁడు పాలించు పొలవాస రాజ్యముకరీమునగరు జిల్లా జగత్యాల తాలూకాలోనున్నది. దీని నిపుడు పొలాస యను చున్నారు. పూర్వమిది రాజధానియని విశ్వసింపనగు చిహ్నలుకొన్ని నేటికి మిగిలి యున్నవి. ఇటపౌలస్త్యేశ్వరాలయము గలదు. ఆల యము వలన పొలవాస యని పేరు వచ్చియుండునేమోయని సందియముగలుగుచున్నది. మైళిగిదేవుని శాసనములు ప్రత్యేకించి ప్రచురింపఁదలఁచి యిచ్చటవలయునంతవఱకె సూచించివదలితిమి."

ఒక్కటేపాటను ముగ్గురును పాడిరిగాని మైళిగి దేవుని పొల వాస శాసనము నొక్కటినైన భారతిలోఁ బ్రకటింప సాహసింప కుండుటకుఁ గారణమేమి? ఇతరరాజుల శాసనములను బ్రకటించిన

* కాకతీయ సంచిక, కాకతీయుల చరిత్ర పుట ౨౬.

రీతిగా నొక్క-శాసనమైనఁ బ్రకటించి యున్న యెడల నెంత సామరస్యముగానుండును. కాకతీయసంచికా సంపాదకుండైనను జగత్యాలతాలూకాలో నొకమైళిగి గనుపట్టుచున్నాఁడని వ్రాసి యున్నారేగాని యెట్లుగనుపట్టుచున్నారో చూపవలదా. ఇతరులు చెప్పుదానిని ఖండించునపు డాశాసనములేక యాసాక్ష్యమెట్టిదో చూపించుటకు జవాబు దారులుకారా? ఎందుకీ రహస్యమును గప్పి పెట్టుట. శేషాద్రిరమణకవులు మైళిగిదేవుని శాసనములు పరిశోధించి శుక్లసంవత్సరములోఁ గాకపోయిన నీలోపల నెప్పుడైనఁ బ్రకటించినారా? ప్రకటించినయెడ నెప్పు డెచ్చోటఁ బ్రచురించినారు? అట్లు ప్రచురించిన యెడల కాకతీయసంచికలో నెందుకుఁ బ్రచురింపలేదు. "వేయిస్తంభాలగుడి శాసనముగ్రంథము" లో నెందుకుఁ జేరలేదు. పోనిండు శ్రీలక్ష్మణరాయ పరిశోధకమండలివారికి తెలింగానా శాసనములతోఁబాటు వీనినేల యీయలేదు. ఇట్టికృత్రిమమార్గమెందుకవలంబింప వలసివచ్చినది. ఈమైళిగి శాసనములున్న మాటనిజమేయై యున్న యెడల లక్ష్మణరాయ పరిశోధకమండలివారి "తెలింగానాశాసనములలో" బ్రకటించుట విధ్యుక్తధర్మముగాదా! చరిత్రపరిశోధకులిట్టిపనులు గావించుట గర్హనీయమని స్పష్టముగా నుడువవలసియున్నది. ఈమైళిగిదేవుని శాసనములు ప్రకటింపఁబడినఁగాని రుద్రదేవుని శాసనములో నుదాహరింపఁబడిన మైళిగి దేవగిరినేలిన మైళిగి యగునో కాదో నిర్ధారించుటకు సాధ్యపడదు.

## దొమ్మరాజు.

ఈదొమ్మరాజునుగూర్చి ఇందుఁబేర్కొ-నఁబడిన రుద్రదేవుని శత్రువెవ్వఁడో నిర్ధారించుటకు నాధారము గానిపింపకున్నది" అని పూర్వముద్రితగ్రంథములో వ్రాసియున్నాను. ఇప్పుడు తెలింగానా శాసనములలో "నగునూరు" శాసనమున "దొమ్మరాజు పేరు

మాత్రము గనుపట్టుచున్నది. అతఁడెవ్వఁడయినను, ఎక్కడపరిపాలన చేసినను మహామండలేశ్వరుఁడని స్పష్టముగానున్నది. శాసనములో చాళుక్యవిక్రమ సంవత్సరమిచ్చినట్లు గాన్పించుచున్నది గాని సంవత్స రమును దెలుపునంకెలు గానరావు. ప్రమాదిసంవత్సర చైత్ర బహుళ చవితి (చదివెలు) శుక్రవారమునాడు "మేడరజు (జ) జగద్దేవడుం ఎనభఇవేలుతో పొడిచిగెలిచె" అని మాత్రమున్నది. కోతికికొబ్బరిబొండము దొరకినప్పుడది చేతఁబట్టుకొని సంతోషముతో నెట్లాడుకొనునోనామిత్రులు నగునూరి శాసనముఁబట్టుకొని యాంధ్రుల చరిత్రములోని సిద్ధాంతము లన్నిటిని తారుమారుచేసినట్లుగా శుక్ల సంవత్సరము మొదలుకొని శేషాద్రిరమణకవులు పత్రికలలోఁ దాండవ మాడుచున్నారు. "ఇతఁడు ధర్మపురిమొదలు భద్రాద్రి వఱకుఁగల దేశముపాలించురాజు. భద్రాద్రిచెంతగల దొమ్మ గూడెమీతని పేరిటఁ గట్టఁబడినదె....... ఈతనిం గూర్చి ప్రత్యేక శాసనములు కరీమునగరు, వరంగల్లుమండలములలోని గోదావరీతీర మున దొరకగలవు." అని భారతిలోఁ దమ "అనుమకొండశాసనము" వ్యాసమున వాక్యరత్నములంగుప్పించి యున్నారు. ధర్మపురి మొదలు భద్రాద్రివఱకుఁగల దేశమధ్యమందున్నవని చెప్పఁబడిన మంథన్యగుండరాజు మంత్రకూటరాజ్యమును, వరంగల్లుమండలము లోని "కుఱుపట్టముమొదలు గోదావరీ తీరమువఱకుఁగల మేడరాజు రాజ్యమును నెక్కడకుఁ గొంపోవలయునో శ్రీ శేషాద్రి రమణ కవులుగాని వారివెనుకనేతాళము వేయు మారేమండ రామారావు గారు గాని సెలవిత్తురా? కాకతిప్రోలరాజుతో సమకాలికులేగదా యీరాజులు! పోనిండు రామారావుగారి యందు పరమవిశ్వాసము గల వేయిస్తంభాలగుడిశాసన గ్రంథకర్తలయిన విద్వాన్ అప్పన్న శాస్త్రిగారు సెలవిచ్చినను సంతోషమే. "ఈగుండరాజు మంథనలో

రాజధానిని స్థాపించి గోదావరి కిరుప్రక్కలనుండు దేశమును బరి పాలించినరాజు. ఇతని చరిత్రము మంథెనప్రాంతములలోని శాస నము లందున్నది. దీనిని మఱుగుపఱచి నామసామ్యమును బుర స్కరించుకొని నూజివీటిచెంతగల మంతెనకుఁ బ్రాముఖ్యతనొసంగుట చారిత్రకప్రశస్తినుపేక్షాదృష్టితోఁజూచుచున్నారనుటకుఁ దార్కాణము కాకమానదు."[1] అని శేషాద్రిరమణకవులు వ్రాసియున్నారు.[2] మంథెనయు, మంతెనయు దక్షిణాపథములోనివే యనుజ్ఞానము వీరికున్నయెడల వీరిట్టి వాక్యములను వ్రాయసాహసించియుండరు. ఇంతకు నగునూరి శాసనములోని సందిగ్ధభావము వీరికర్థమైనదా! "ఎనబఇవేలుఃతో పొడిచి గెలిచెనను దానిలో" ఎనుబదివేల సైన్యము

---

(1) శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము వారిచే హైదరాబాదు నందుఁ బ్రకటింపఁబడిన రజితోత్సవ సంచిక నిజామురాష్ట్రమండలి ఆంధ్రదేశ ప్రశస్తి అనే వ్యాసము పేజి. ౨౦.

(2) మఱుంగు పఱచు పద్ధతి శేషాద్రిరమణకవులకడను, కాకతీయ సంచికా సంపాదకులగు శ్రీయుత మారేమండ రామారావుగారి కడను గాన నగుచున్నది. ఖాజీపేట దర్గాశాసనముయొక్క పూర్తిపాఠము తెలింగానా శాసనములలో నేల ప్రకటింపలేదు కొంతమాత్రమె యీయనేల ? పూర్తిపాఠము కావలయునా ? అని నన్నూరించుట యెందుకు ? ఇది బొంకను వలయునా ? మైళిగిదేవుని శాసనము లెందుకు తెలింగానా శాసనమాలలోఁ బ్రకటించుటకు శ్రీలక్ష్మణరాయ పరిశోధక మండలి వారికీయలేదు ? మంథెన గుండ్రాజు చరిత్రముగల శాసనములా మండలి కేల యివ్వలేదు. వానినేల ప్రకటింపఁలేదు, అతిప్రాముఖ్యములయిన చారిత్రకాంశ ముల నీరీతిని మఱఁగుపఱచుటగాని హైదరాబాదు రాష్ట్రమున నీకాలమునందువలె శాసనాదిక గ్రంథ సామగ్రి వెల్వడ యీ కాలమున నేను వ్రాసిన చరిత్రమునందు రుద్రదేవుని శాసనములోని మంత్రకూటమును మంథెనగా భావింపక నూజివీటికడ నున్న మంతెనగా భావిచుట బుద్ధిపూర్వకముగా మఱుగు పఱచుట యగునా ? దొర తనమువారి పరిశోధకులు గూడనట్లు భావించిరే ? వారెల్లరురు మఱుగు పఱచవలెనని రేమే యట్లు గావించి యుందురని తలంతురా ? ఇది వట్టి దురహం భావనును దెల్ప కుండునా ?

తోఁ బోయి యుద్ధముచేసి గెల్చినారనా! లేక దొమ్మెరాజు, మేడ రాజు, జగద్దేవుఁడు ననువారు మూవురు ఎనుబదివేల సైన్యమును బొడిచి గెలిచినారనా? ఇది నిర్ధారణచేయుట కితరశాసనాదిక దృష్టాంతము లేవియు లేవు కాఁబోలు!

జగద్దేవుఁడు.

జగద్దేవుని ప్రశంస పదేపదేవచ్చుచున్నది గావున వీనింగూర్చి పూర్వప్రకరణమునఁ గొంతదెలిపియున్నను శేషాద్రిరమణకవుల తృప్తికొఱకు మఱికొన్ని విషయములు దెలుపవలసి యున్నది. అనుమకొండ శాసనవ్యాసములో "జగద్దేవుఁడు పశ్చిమచాళుక్యరాజుల కడ రాజప్రతినిధిగనుండి ధర్మపురి వేములవాడ ప్రాంతములను బాలించునొక మాండలికుఁడు. ఇతనిశాసనములు కొన్ని నిజాము రాష్ట్రమునఁ గలవు. అందొకదానిలోఁ బోలరాజు జగద్దేవుని నణచి నటులఁ గలదు.

శ్లో. తత్పుత్రో భూద్దేవపాల నామధేయోధియాన్నిధిః
జగద్దేవమహీపాలితస్సమ్మతస్సతాం
యస్థాదిభక్తమాలఘ్నో జగద్దేవా దనంతరం
కాకతీశం ప్రోలభూపస్యాధీరం పర్యపాలయత్.
౮౨ నెంబరు ఆమనగల్లు శాసనము."

అని యుదాహరించియున్నారు. ఇయ్యవి ఆమనగల్లు ౮౨ నంబరు శాసనములోనివని శేషాద్రిరమణకవులు ప్రచురించినను "తెలింగానా శాసనములలో ౧౮ సంఖ్యగల గణపవరము శాసనముగాఁ బ్రకటింపఁబడియున్నది. కాకతీయసంచికలోఁ గూడ గణపవరశాసనములోనివి గానే ప్రకటింప బడియుండెను. గణపవరము శాసనమును ఆమనగల్లు శాసనమని యెందుకు పేర్కొనవలసివచ్చెనో యారహస్యము వారికే తెలియవలెను. భారతీ పాఠకులను దమ

యభిప్రాయమునకుఁ దిప్పుకొనుటకై యెట్టిశాసనమునందలి చారిత్రిక విషయములను మఱుగుపఱచి యుండిరో యీవివర మొకించుక నిచటఁ దేటపఱచవలసి యున్నది.

"యం జగద్దేవభూపాలం లబ్ధ్వా హేమాద్రిభూపతిః
సేనాపతి మమాత్యంచ చక్రే విక్రమధీయుతం॥

హేమాద్రిభూపతి జగద్దేవరాజును తనకు సేనాపతిగను మంత్రిగను జేసికొనె" నను నర్థమిచ్చు శ్లోకపాదములను విడిచిపెట్టినారు. కాకతీయసంచికలోఁ బ్రకటించినారు. కాని కాకతీయసంచికలో పైశ్లోకపాదముల క్రిందనుండు:—

"యశ్చారివీరాన్ విజిత్యా త్యంరక్షై............భూమిభర్తుః
ఆ పూ*య ద్దేశ మ పేతతాపత్రియాగమే మేఘ మివాంబు వర్షైః॥"
అనుశ్లోకపాదములను విడిచిపెట్టినారు. ఇంతియగాక శేషాద్రి

రమణకవు లామనగల్లు శాసనములోఁ దామెత్తుకొన్న కడపటి శ్లోకములోని కడపటి పాదము:—

"కాకతీశః ప్రోల భూపస్స్వోధరాం పర్యపాలయత్"

అను దానిలో భూపస్స్వోదరాం" అనుదానికి "భూపస్వ్యాధీరం అని పాఠాంతరమును ప్రకటించినారు. తెలింగానా శాసనములలో భూపస్స్వోదరాం" అనునది మూలపాఠముగా బ్రకటింపఁ బడినది. కాకతీయసంచికయు నట్లే ప్రకటించినది. ఈకడపటి శ్లోకముయొక్క తాత్పర్యమేమనఁగా "పూర్వసంప్రదాయముల ననుసరించి జగద్దేవుని యనంతరము ప్రోలభూపాలుఁడు భూమిని పాలించెనని మాత్రమె గలదుగాని శేషాద్రిరమణకవులు వ్రాసినట్లు ప్రోలరాజు జగద్దేవు నణచినటుల లేదు. ఈగణపవరము శాసనములోని జగద్దేవునకు "బాలసరస్వతి" యను బిరుదము గలిగి యున్నట్టు శ్రీయుత(ద్వా)ల

సరస్వతీతి విదితం నామోత్తమః" అని వ్రాయఁబడియుండుట వలన విదితమగుచున్నది. గణపవరము శాసనములోని జగద్దేవుఁడు హేమాద్రిభూపతికి మంత్రిగను సేనాపతిగను, నుండెననియు, "బాలసరస్వతి యను నుత్తమ బిరుదము గలవాఁడనియు మనము తెలిసికొనఁ గలుగుచున్నాము. మఱియు హేమాద్రిభూపతి కుమారుఁడగు దేవభూపాలునకు పాలకుఁడుగఁ గూడనుండెనని తెలిసికొన్నారము. హేమాద్రిభూపతియెవ్వఁడో, ఎటువంటివాఁడో తెలిసికొనుటకాధారమేమయిన నీశాసనమునందుఁ గలదాయని విచారించినచో, నీక్రింది విశేషణముతో:-

"సర్వేన్నృపాలహేమ (మంజీర)కోటిస్ఫుర ద్రత్నోద్భా (సిత) పీఠమహిత శ్రీపాదప(ద్మ) యాత్ శౌర్యైరసన్నుతశౌర్య భూషణభృతో హేమాద్రిదేవాత్సుధీ" అని ప్రశంసింపఁబడినాఁడు. ఈగణపవరము శాసనము శా. శ. ౧౧౮౫ శ్రీముఖసంవత్సర మాఘశుద్ధ ౮ భానువాసరమునాఁడనగా క్రీ. శ. ౧౨౬౩ వ సంవత్సరమున గణపవరగ్రామములో రుద్రేశ్వర దేవుని ప్రతిష్ఠాపించిన సమయమున కాకతి గణపతిదేవచక్రవర్తిచే వ్రాయించబడినది.

ఇంక లేంబాలవాడ శాసనములోని జగద్దేవుఁడెట్టివాఁడను విషయమును విచారింతము.

ఈ లేంబాలవాడ (వేములవాడ) గ్రామములోని భీమేశ్వరుని గుడిముందటిరాతిమీఁద పడమరభాగమున నొకశాసనమును, ఉత్తర భాగమున నొకశాసనమును గలవు. తెలింగానాశాసనములలోని యొక్కటే శాసనముగా ౧౩ వ సంఖ్యతోఁ బ్రచురింపఁబడినవి. మొదటిది త్రిభువనమల్లుని పుత్త్రుఁడగు కుమారసోమేశ్వరుని దానశాసనము. చాళుక్య విక్రమవర్షము ౨ అనఁగా క్రీ. శ. 1078 సంవ

త్సరములోనిది. రెండవ మహామండలేశ్వరుఁడును, పోలవాక కులతిల కుఁడును నగు జగద్దేవునిది. శా. శ. ౧౦౩౧ అనగా క్రీ. శ. 1109 సంవత్సరమునాటిది. ఈరెండవశాసనములో జగద్దేవుఁడు హరిందరి దేవర ప్రీతికై ఈశ్వరపండితునికి ఇండిండికుంట యను గ్రామమును ధారాపూర్వకముగ నొసంగినట్లు దెలుపఁ బడినది. ఈశాసనములో "ఒకకాలమున జగద్దేవునకు వేములవాడ రాజధాని" యని స్పష మగుచున్నది. ఇది నట్టికల్ల; ఈశాసనమందట్టి యర్థము నిచ్చెడి వాక్యమేమియు లేదు.

"ఈ జగద్దేవుఁడుగాక ఓరుగల్లు ప్రాంతమున నింక నిరువురు జగద్దేవులు గలరు. కొలను పాకలో నొక జగద్దేవుఁడు కొన్ని శాసన ములు వేయించినాడు. ఇతనిపేర శాసన సహితమగు జయస్తంభము కొలనుపాక చిన వాగుగడ్డవద్దను, శాసనము చండికాంబగుడి గోడ లోను గలదు. ఇతఁడు ప్రోలరాజునకు సమకాలికుఁడే. బసవేశ్వరుని భక్తగణములోనివాఁడు బసవ పురాణమునఁ పేర్కొనఁబడిన జగదేక మల్లుఁడొకఁడు; ఇతఁడు వీర చూడామణి; ఈ జగదేక మల్లుఁడును ప్రోలరాజు కాలములోనివాఁడె కావచ్చును. మైసూరు మండలము లోని జగదేక మల్లుఁడు కాకతి ప్రోలరాజు ప్రత్యర్థియనఁ జాలము" అని శేషాద్రి రమణ కవులు కడపట వ్రాసినారు.

జగద్దేవుఁడు జగదేకమల్లుఁడుగాఁడు. పొట్టిపుంబుచ్చ పురా ధీశ్వరుఁడైన జగద్దేవుఁడనినేను వ్రాసితినేగాని యెచ్చటను జగదేక మల్లుఁడని వ్రాసి యుండలేదు-గణపవరము శాసనములోని జగ ద్దేవుఁడును వేములవాడ శాసనములోని జగద్దేవుఁడు నొక్కడేయను భావముతోనున్న కవులు కొలిపాక జగద్దేవుఁడు వేఱొకఁడని తలంచు చున్నారు. జగద్దేవుఁడు కొలను పాకలో "కొన్ని శాసనములు"

వేయించినాడని చెప్పెడి వీరు కొలనుపాక చాళుక్య శాసనము లైదింటిలో నొకటి మాత్రమె తెలింగానా శాసనము సంపుటము లోని కెక్కిన భాగ్యమును వహించినదిగాని తక్కినవాని కట్టి భాగ్యము పట్టలేదు. ఇయ్యది వీర నారాయణస్వామిగుడి గర్భాలయ ములోనిదని తెలుపఁబడినదిగాని చండికాంబగుడి గోడలోనిదని తెలుఁబడి యుండలేదు. ఇయ్యవి చాళుక్య విక్రమసంవత్సరము ౨౭ నాటిదని తెలుఁపబడి నందున నియ్యది క్రీ. శ. 1105 లోనిదని స్పష్ట పడు చున్నది. ఈ కాలము త్రిభువనమల్ల విక్రమాదిత్యునిది. ఇతఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తియను మాట నిశ్చయమెగదా. ఇందు మహా మండలేశ్వరుఁడైన జగద్దేవుఁడు పెంబఱితి గ్రామమును దానముచేసి నట్లున్నది. వేములవాడ శాసనము క్రీ. శ. 1109 సంవ త్సరములోనిదని తెలుపఁబడినది. దానికి దీనికి ౪ సంవత్సరములు భేదము మాత్రము గలదు. వేములవాడది సర్వధారి సంవత్సరమై యుండ కొలను పాకది తారణ సంవత్సరమై యుండుటచేత తెలుగు సంవత్సరములకు నడుమ ౪ సంవత్సరములుగా లెక్కకూడ సరిపోవు చున్నది.

ఇరువురుజగద్దేవులును పశ్చిమచాళుక్యచక్రవర్తియగు త్రిభు వనమల్ల విక్రమాదిత్యునకు సామంతులుగానున్న మహామండలేశ్వ రులని స్పష్టపడుచున్నది. ఏకకాలమున నున్నవారు. "జగద్దేవుఁడు పశ్చిమచాళుక్యులకడ రాజప్రతినిధిగనుండి ధర్మపురి వేములవాడ ప్రాంతములను బాలించు నొక మాండలికుఁడు" అని భారతిలో వ్రాసిన వీరు, గణపవరము శాసనములోని జగద్దేవుఁడు నొక్కఁడే యని యొప్పుకొన్న వీరు, అట్టివీరి జగద్దేవుని ప్రిభువని గణపవరము శాసనములోఁ బేర్కొనఁబడిన హేమాద్రి భూపతియను వాఁడును, వానికుమారుఁడగు దేవపాలుఁడుఁ బశ్చిమచాళుక్యులగుదురో కారో

విచారించుట వీరికి పూచీకలదా లేదా? అతఁడు పశ్చిమచాళుక్య చక్రవర్తి కానియెడల హేమాద్రిభూపతి యెక్కడ పరిపాలనము చేయుచుండెను? వానిరాజధాని యెద్ది? హేమాద్రిభూపతియొక్క మంత్రియు సేనానియునైన జగద్దేవుని యనంతరము భూమిని కాకతీశుఁడైన ప్రోలరాజు పరిపాలించెనను భావమేమో విచారించవలదా? ఒక్కమండలమున కధికారియై పరిపాలించువాఁడు మండలేశ్వరుఁడనియు, బహుమండలముల కధికారియై పరిపాలించువాఁడు మహామండలేశ్వరుఁడనియు, అట్టి మహామండలేశ్వరుఁడే రాజప్రతినిధిగానుండి పరిపాలించుట కర్తుఁడుగాఁ బరిగణింపఁబడుట చాళుక్య రాజ్యాంగచరిత్ర మెఱింగినవారికి దెలిసిన విషయమేగదా! అనవసరముగా గ్రంథమును విస్తరింపఁజేయక జగద్దేవుని గూర్చి తెలియఁజేయు సూక్ష్మమార్గ మొక్కటిగలదు. ఆమార్గమునననుసరించి మనము పోయిన యెడల సత్యాసత్యములెవ్వియో సులువుగా బోధపడగలవు.

తెలంగానా శాసనములలో నొకటియగు నగునూరు కన్నడ శాసనము క్రీ. శ. 1143 కావచ్చునని విద్వాన్ అప్పన్నశాస్త్రిగారభిప్రాయపడినది తప్పు. అయ్యది ప్రమాది సంవత్సర వైశాఖ బహుళ చతుర్థీ శుక్రవారము నాటిదని యందే తెలుపఁబడి యుండుటచేత క్రీ. శ 1100-1101 గాని లేక 1164-1165 సంవత్సరముగాని కావచ్చును. వేములవాడ శాసనము క్రీ. శ. 1109 సంవత్సరములోని దనుట స్పష్టము. ఇందు శా. శ. ౧౦౩౧ సర్వధారి సంవత్సర వైశాఖశుద్ధ చతుర్దశీ ఆదివారము నాటిదని యందే యున్నది గనుక స్పష్టము. కొలనుపాక శాసనము (కొల్లిపాక) "శ్రీమచ్చాళుక్య విక్రమ వర్ష ఏకోన త్రింశత్తమే తారణ సంవత్సరే చైత్రపూర్ణిమా యా మాదిత్యవాసరే" అని యందే యుండుటచేత నయ్యది క్రీ. శ. 1105 సంవత్సరములోనిదని స్పష్టమగుచున్నది.

దీనిని బట్టి ప్రమాది సంవత్సరలోఁ బుట్టిన నగునూరు శాసనము మొదటిదనియు, తారణ సంవత్సరములోఁ బుట్టిన కొల్లిపాక శాసనము రెండవదనియుఁ సర్వధారి సంవత్సరలోఁ బుట్టిన వేములవాడ శాసనము మూఁడవదనియు స్పష్టమగు చున్నది. నగునూరు శాసనములోని ప్రమాది సర్వధారి సంవత్సరమునకు తరువాతదియని యెంచిన యెడల క్రీ. శ. 1164-65 సంవత్సమగునుగాని విద్వాన్ అప్పన్నశాస్త్రిగారూహించిన 1143 కాఁజాలదనుట స్పష్టము. అప్పుడు కొల్లిపాక వేములవాడ శాసనములు చాళుక్య చక్రవర్తి త్రిభువనమల్ల విక్రమాదిత్యుని కాలములోనివగను, నగునూరు శాసనము చాళుక్య చక్రవర్తి రెండవ జగదేక మల్లుని కుమారుఁడగు మూఁడవ తైలపదేవుని కాలమని చెప్పదగును. మొదటి ప్రతాపరుద్రుని హనుమకొండ శాసనము క్రీ. శ. 1162 లోనిది గనుక నప్పటికే రుద్రదేవుఁడు మేడరాజును, దొమ్మరాజును జయించి వారల రాజ్యములను స్వాధీనము చేసికొన్నట్లుగాఁజెప్పఁబడి యున్నది గనుకను, నగునూరు శాసనములో దొమ్మరాజు, మేడరాజు, జగద్దేవుఁడు ఎనుబదివేల సైన్యమును పొడిచి గెలిచెనన్న కథ విశ్వసించిన యెడల నగునూరు శాసనములోని ప్రమాది సంవత్సరము క్రీ. శ. 1101 వ సంవత్సర మగుచున్నది గనుక మొదటిప్రమాదియే స్థిరమైనదని చెప్పవచ్చును.

కనుక నిందలి పర్యవసానమేమనఁగా నగునూరు, కొల్లిపాక, వేములవాడ శాసనములలో నుదాహరింపఁబడిన జగద్దేవుఁడు త్రిభువనమల్లవిక్రమాదిత్యుని సామంతుఁడగుమహామండలేశ్వరుఁడొక్కఁడే గాని భిన్నులుగారనియు, ఈత్రిభువన విక్రమాదిత్యుఁడు క్రీ. శ. 1126-27 లో మృతుఁడైన వెనుకనే కాకతిప్రోలరాజు స్వతంత్రుఁడై ప్రత్యేకసామ్రాజ్యము నెలకొల్పి పరిపాలింపవలయునని ప్రయత్నిం

చిన వాఁడుగనుక తరువాత నే యీజగద్దేవునితోఁ బోరాటము పెట్టు కొనియెననుట స్పష్టమగుచున్నది. మఱియు జగద్దేవుని తరువాత నే కాకతిప్రోలరాజు భూమినిపరిపాలించెనని గణపవరము శాసనము స్పష్టముగా వక్కాణించుచుండుటయు, రుద్రదేవుని శాసనములో ప్రోలరాజు జయించిన రాజుల సందర్భమునమాత్రమె జగద్దేవుని ప్రశంసగలదుగాని రుద్రదేవుఁడు జయించినరాజుల ప్రశంసతో జగద్దేఁడు ప్రశంసింపఁబడి యుండలేదు గనుక రుద్రదేవుని శాసన కాలమునాటికి అనఁగా క్రీ. శ. 1162 సంవత్సరమునాటికి జగద్దేవుఁడు మరణముఁ జెందియుండవలయును. క్రీ. శ. 1143-44 సంవత్సరమునాటికి కొల్లిపాకరాజ్యము పశ్చిమచాళుక్య చక్రవర్తుల పరిపాలనములక్రిందనే యుండెనని రెండవ జగదేకమల్లుని మహాప్రధానియు, అంతఃపురాధ్యక్షుఁడును, కరితురగపట్టసాహిణియు, శ్రీకరణుఁడును, సర్వాధ్యక్షుఁడును, సేనాపతియు, హెరెలాలసంధి విగ్రహియునగు కేశిమయ్యమనదినాడు, మిత్తినాడు, కోసగెనాడు, గావిదిరాలనాడు, కాళ్ళకెలఁగునాడు, సిందవాడినాడు, కొల్లిహాకె నాడు, మొదలగు నాడులను బరిపాలించుచుండెనని యాదవాని తాలూకాలోని గురజాల గ్రామములో రామేశ్వరస్వామివారి దేవాలయములో కేశిమయ్య కుమారుఁడు చామరాజు వ్రాయించినదాన శాసనమువలనఁ దెలియున్నది.1 చామరాజు గురజాల శాసనములో నుదాహరింపఁబడిన కొల్లిహాకేనాడె కొల్లిపాకనాడనుట స్పష్టము2

---

(1) Anual Report on Epigraphy 1916. Appendix B. stone Ins. in 1915. No. 549.

(2) Of these Kollihake-nadu is evidently identical with Kollipake-nadu and suggests the probable position in the Hyderabad State of the ancient Kollipake of the Western Chalukya and Chola records. No. 99 Home (Macellaneous) 29th August 1916. p. 132 No. 43.

త్రిభువన విక్రమాదిత్యుఁడు క్రీ. శ. 1127 వఱకును, వాని తరువాతభూలోకమల్ల బిరుదాంచితుఁడు మూఁడవ సోమేశ్వరుఁడు 1138 వఱకును వాని తరువాత రెండవ జగదేకమల్లుఁడు 1148 వఱకును వానికి పిమ్మట త్రైలోక్యమల్ల బిరుదాంచితుఁడైన మూఁడవ తైలపుఁడును కల్యాణపురసింహాసనాధిష్ఠితులై పశ్చిమ చాళుక్య సామ్రాజ్యమును బరిపాలించినవారుగనుక జగద్దేవుఁడు త్రిభువనమల్ల విక్రమాదిత్యునకు వెనుక తైలపదేవచక్రవర్తి కాలములోఁ గొంత వఱకు బ్రదికియున్నట్టు గానుపించుచున్నది గనుక 1157 వ సంవత్సరములోఁగాని యంతకుఁ బూర్వముఁగాని తైలపుని ప్రోలరాజు జయించి బంధించి విడిచిపుచ్చిన తరువాతనే మహామండలేశ్వరుఁడై రాజప్రతినిధిగానుండి యాంధ్రదేశమున సామ్రాజ్యముపైఁ దిరుగుబాటు చేయు ప్రోలరాజును శిక్షించుటకై మాండలిక రాజుల ననేకులను గూర్చికొని యనుమకొండపురమును ముట్టడించియుఁ బ్రోలరాజు ధాటికి నిలువఁజాలక పలాయనుఁడైన వెనుక మరణించి యుండునని మనమూహింపవచ్చును. దానఁజరిత్రమునకువచ్చిన ప్రమాదమేమియు లేదు. జగద్దేవునికి వెనుక మేడరాజు మొదలగు వారిని రుద్రదేవుఁడు జయించి వారి రాజ్యములను స్వాధీనముఁజేసికొని యుండును. 1158 లో ప్రోలరాజు మరణింపఁగా నతని పెద్దకుమారుఁడు రుద్రదేవుఁడు రాజ్యాభిషిక్తుఁడై హతశేషులయిన మాండలిక రాజులనెల్లరను జయించి 1162 సంవత్సరము నాటికి తన సామ్రాజ్యము విస్తరింపఁజేసెనని యనుమకొండలోని రుద్రదేవుని శాసనము వలననే స్పష్టమగుచున్నది. ఇప్పటికి బయల్వెడలిన సాధములను బట్టిజగద్దేవుని గూర్చి యింతకంటె నెక్కువ యూహించి వ్రాయుటకు నాకు శక్తిచాలకున్నది.

## తైలపదేవుఁడు.

శ్రీ శేషాద్రిరమణకవులు శ్రీకృష్ణదేవ రాయాంధ్రభాషానిలయమువారిచేఁ బ్రకటింపఁబడిన రజతోత్సవసంచికానుబంధమున వ్రాసిన "నిజామురాష్ట్రమునందలి ఆంధ్రదేశప్రశస్తి అను వ్యాసములో" చాళుక్యచూడామణి యగు తైలపదేవుఁడు; పశ్చిమ చాళుక్య కుటుంబములోనివాఁడు. చాళుక్య సామ్రాజ్య మంతరించినను, పలుకుబడిచేఁ గొంతసైన్యముచు జతపఱచికొని సంగరసన్నద్ధుఁడైన యీవీరుని చరిత్రము ప్రశంసాపాత్రము. ఇతని సేనాధిపతిగను సామంతుఁడుగనుండి క్రమముగా స్వతంత్రుఁడైనవాఁడె జగద్దేవుఁడు." అని వ్రాసియున్నారు. ఈతైలపదేవుని కాలమున చాళుక్య సామ్రాజ్యమున అనుమకొండ ప్రాంత ప్రదేశములు కాకతీయుల స్వాధీనమయినను, చాళుక్యరాజధాని యగు కళ్యాణ నగరము తైలపదేవచక్రవర్తికి సామంతుఁడై మహామండలేశ్వరుఁడుగ వ్యవహరించిన కాలచుర్యవంశీయుఁడగు బిజ్జలరాజు స్వాధీనముఁ జేసికొని పరిపాలించినను చాళుక్యసామ్రాజ్యమంతరించలేదు. బిజ్జలుని మరణానంతరము తైలపుని కుమారుఁడగు నాల్గవ సోమేశ్వరుఁడు 1165 దవ సంవత్సరముననో యామరుచటి సంవత్సరముననో కల్యాణపురిని స్వాధీనముఁజేసికొని 1180 వఱకుఁ బరిపాలనముఁజేసియున్నవాఁడు గావున నాతని యనంతరమే యీభాగము దేవగిరి యాదవరాజుల వశమైపోయినది. జగద్దేవుఁడు స్వతంత్రుఁడై యెన్నఁడును కాకతీయులతో యుద్ధముచేసి యున్నట్టు గన్పట్టదు. అతఁడు చేసిన యుద్ధములన్నియు మరణించు వఱకు బశ్చిమచాళుక్యుల పక్షముననే చేసి యుండెనని భావింపవలసి యున్నది. తైలపుఁడు కళ్యాణనగరమును గోల్పోయిన తరువాత కొంతకాలము అన్నిగేరి, మఱికొంత కాలము బనవాసి రాజధానులుగఁజేసికొని పరిపాలనము

చేసి యుండెనని వాని శాసనములె దెలుపుచున్నవి. కనుక చాళుక్య సామ్రాజ్యమంతరించిన దని శేషాద్రిరమణకవులు వ్రాసినది చారిత్రిక సత్యము కాదని స్పష్టముగా నుడువవచ్చును. కళ్యాణపురరాజధానికి సమీపములోనున్న సిందవాడి రాజ్యము పశ్చిమచాళుక్య సామ్రాజ్య చక్రవర్తుల క్రిందనే యుండెను.

## రుద్రదేవుఁడు తైలపదేవుని వధించెనా ?

శుక్లసంవత్సర చైత్రమాసభారతిలో శేషాద్రిరమణ కవులనుమకొండ శాసనమను వ్యాసములో "కాకతీయప్రోలరాజు క్రీ. శ. ౧౧౪౮ వఱకును, రుద్రదేవుఁడు తరువాతను పాలించిరి గాన నీమూఁడవ తైలపదేవుఁడు ప్రోలరాజు కాలమున బంధింపఁబడి యున్నమ్ముక్తుఁ డగుటయు, బిమ్మట రుద్రదేవునిచే వధింపఁబడుటయుఁ బొసఁగియున్నది. రుద్రదేవుఁడు తన రాజ్యమున కొకసరిహద్దు కటక మని చెప్పినాఁడు- ఇదియె కళ్యాణపురి. దీనిచేఁగూడ మూఁడవ తైలపదేవుఁడు ప్రోలరాజు రుద్రదేవులకు లోఁబడినవాఁడని తేలును. అనంతరము తైలపదేవుని రాజ్యమును బిజ్జలుఁ డాక్రమించుకొనెను. చాలుక్యచూడామణి యను బిరుద మితనికిఁ దగియున్నది. కాకతీయుల ప్రత్యర్థి యీమూఁడవ తైలపదేవుఁ డనుటకు బాధకములు గానరావు." అని వ్రాసియున్నారు. ఈశేషాద్రి రమణకవులకు రుద్రదేవుని శాసనములోని తైలపుని చావునుగూర్చిన శ్లోకమర్థము కాలేదు. తాము కవులయియుండియు, అచింతేంద్రకవియొక్క భావమునైనఁ గనిపెట్టలేకపోయినారు. విద్వాన్ అప్పన్నశాస్త్రిగారా శ్లోకమునకుఁ దమ "వేయి స్తంభాలగుడి శాసన" మను గ్రంథములో నీరీతి యర్థము నిచ్చియున్నారు.

"గొప్పదైన పరాక్రమముగల యీ రుద్రదేవరాజుయొక్క (వలని) భయముచే, అతిసారరోగముచే నంతటను గబళింపఁబడిన కట్టెవంటి శరీరముగల తైలపరాజు స్వర్గమునకుఁ బోగా (పరమపదిం పగా) అభీముఁడును (తైలపుని) రాజ్యపదవిని క్షణకాల మనుభ వించెను."* ఇందు కవి తన కవితా చమత్కృతిని గనుపఱచినవాఁడే గాని రుద్రదేవుఁడు తైలపరాజును వధించెనని చెప్పియుండలేదే. వీరి పాండిత్యము, కవితాధోరణుల నటుండనిచ్చి వీరిచారిత్రిక జ్ఞానమొ కింత విమర్శింతము.

తైలపుడు కాకతి ప్రోలరాజు, రుద్రదేవరాజులచే యుద్ధ ములో నోడింపఁ బడినవాఁడేగాని యెన్నఁడును వీరికి లోఁబడి యున్న వాఁడు కాఁడు. రుద్రదేవుఁడు తన రాజ్యమునకొక హద్దు కటకమని చెప్పినాఁడు గనుక నదియె కళ్యాణపురి గనుక నందువలన తైలపుఁడు రుద్రదేవునికి లోఁబడిన వాఁడని తేలుననని వ్రాయుట పట్టి తేలిక మాట. చచ్చిన తరువాత లోఁబడి యుండుట యెక్కడ? 1162 వ సంవత్సరమున తైలపుని రాజధానినుండి తఱిమివేసిన బిజ్జలుఁడు స్వతంత్రుఁడై సింహాసనమెక్కినట్లు గన్పట్టుచుండఁగాఁ గళ్యాణ పురము రుద్రదేవుని రాజ్యములోనిదిగా భావించుట విపరీతచరిత్ర జ్ఞానమును సూచించునేగాని యంతకన్న వేఱొకటిగాదు. ప్రోల రాజుచే బంధింపఁబడి విముక్తుఁడై రుద్రదేవునిచే వధింపఁబడి బిజ్జలునిచే రాజ్యము గోల్పోయిన చాళుక్య తైలపునకు "చాళుక్య

---

* యాతేఽపి తైలపనృపేదిన మస్యభీత్యా
సర్వాతిసారకబళీ కృతగాత్ర యష్టౌ
శ్రీరుద్రదేవ నృపతేః పృథువిక్రమస్య
భీమోఽపిరాజ్యపద వీంక్షణి కాంస లేభే. "

(ద. వై. పం 20 - 34)

వేయిస్తంభాలగుడి శాసనము. పేజి. 91.

చూడామణి”యను బిరుదము తగియున్నదని వ్రాయుటెంత యపహా
స్యాస్పదముగ నున్నదో గుర్తింపజాలకుండుట శోచనీయమైన విష
యము. 1929 సంవత్సరములో భారతిలో వ్రాసిన యీ వాక్యము
లన్నియు, 26-10-35 కృష్ణాపత్రికలో “ఈమరణించిన తైలపదేవుఁడు
మహబూబు నగరమండలములోని కోడూరు రాజధానిగఁ జేసికొని
ఆ ప్రాంతముల బాలించిన చోడరాజు” అని వ్రాయుట వలన మన్ను
గొట్టుకొనిపోయినవిగదా. “ఈ చోడతైలపుని శాసనములు బూద
పూరు, నెక్కొండ గ్రామము లో లభించినవి” అనికూడ వ్రాసి
యున్నారు. ఇదియు సరిగాదు. కోడూరు రాజధానిగా నేలిన కుమార
తైలప దేవుఁడు చాళుక్య చక్రవర్తి త్రిభువనమల్ల విక్రమాదిత్యుని
మనుమఁడును, మూఁడవ సోమేశ్వరుని పుత్త్రుఁడు నగుకుమార
తైలపదేవుఁడుగాని చోడరాజు కాడని యా బుదపూరు, నెక్కొండ
గ్రామములలోని శాసనములం జదివినవారికి బోధపడఁగలదు. ఇతరుల
మాట యటుండనిండు. ఈ శేషాద్రి రమణ కవులే శుక్ల సంవత్సర
భారతిలో ‘అనుమకొండ శాసన వ్యాసమున’ బూదపూరు ‘నెక్కొండ’
గంగాపురము, పానగల్లు శాసనములఁ బేర్కొని వానిలో పానగల్లు,
నెక్కొండ శాసనముల పాఠములఁ గొంతవఱకు వివరించుచు నందలి
కుమార తైలప దేవుఁడు చాళుక్య చూడామణియగు చాళుక్య తైల
పుడని తెలుపుటయెగాక “ఈ తైలపదేవుఁడు ప్రోలరాజు ప్రత్యర్థి
చాళుక్య చూడామణి యనుటఁబట్టి పశ్చిమ చాళుక్య కుటుంబ
సంబంధియని భావింపఁ జనును. ఇది ప్రోలరాజు కాలము గావున
నీ తైలపదేవుఁడు పశ్చిమ చాళుక్య రాజప్రతినిధి యగుట సత్యము.”
అని వ్రాసిన వీరు కృష్ణాపత్రికలో “ప్రోలరాజునాటి తైలపదేవుఁడు,
రుద్రదేవునినాఁడు మరణించిన తైలపదేవుఁడు, భిన్నవ్యక్తులని నుడువు
టెంతటి యపహాస్య కరమైన విషయము. అతఁడు చాళుక్యుఁడు;

ఇతఁడు చోడరాజు; ఏ శాసన ప్రమాణములు చాళుక్యుఁడనుటకుఁ దగియున్నవో అయ్యవియె చోడుఁడనుటకును దగియున్నవని యా నోటితోనే నేఁడు పల్కనేర్చినారు. ఎంత యాభాసము! ఈ సందర్భమున వీరికంటెఁ గడుసరియగు విద్వాన్ అప్పన్నశాస్త్రిగారిందలి కిటుకు గనిపెట్టి ప్రజామిత్ర పత్రికలో వ్రాసిన వాక్యములు పాటింపఁ దగినవని శేషాద్రి రమణ కవులకుఁ దెలియఁ జెప్పఁదగును, "బూదపూరు" నెకొండ శాసనములలోఁ దెలుపఁబడి తైలపుఁడు కుమార తైలపుఁడని చెప్పఁబడినది. కావున ఆఱవ విక్రమాదిత్యుని కాలమున, అనఁగా, క్రి. శ. 1122 ప్రాంతమున కోడూరు రాజధానిగాఁ జేసికొని, మాండలికుఁడై కుమార తైలపుడు రాజ్యము చేయుచు వేయించిన శాసనములను జూచి ఇతఁడు చోడుఁడై యుండవచ్చునని యూహించుటంత సమంజసముగాఁ గనుపట్టదు. ఈ సంగతి నేలకొండపల్లి శాసనము వలన మఱింత స్పష్టము కాఁగలదు. ఈ కుమార తైలపదేవుఁడే తరువాత రాజై 1150-1165 ప్రాంతము వఱకు నేలినవాఁడై రుద్రదేవునికిఁగూడ సమకాలికుఁడగుచున్నాఁడు." అని ప్రజామిత్ర పత్రికలో శేషాద్రిరమణ కవులు 'కృష్ణాపత్రికలో వ్రాసిన దానికి జవాబుగా' వ్రాసిన వ్యాసములో "విద్వాన్ అప్పన్న శాస్త్రిగారు వ్రాసియున్నారు గనుక చర్విత చర్వణముగా నావిషయమును మరల వ్రాయుటకు వెఱచి విరమించుచున్నాను. కావున శేషాద్రిరమణ కవులు నేలవిడిచి సాముచేయుట తగదు. అచింతేంద్ర కవి రుద్రదేవుని శాసనము వర్ణించిన విధానము కవితా చమత్కృతిఁ దెలుపు నతిశయోక్తిగా భావింపఁదగునేకాని యయ్యది చారిత్రిక సత్యమనుకొని తగినంత శాసనాదిక సాధన సామగ్రి చెంతనుంచికొనియుఁ దాము వృథాప్రయాస పాల్పడుటయు, సాధన సామగ్రి చెంతలేని తరుణమునఁ జరిత్రకారులేమో యూహించి వ్రాసిన

వారిని నేవేవ్వో యీసడింపు వాక్యములతోఁ దృణీకరించి వ్రాయుట చరిత్ర పరిశోధనమందు మేలుచేయ గైకొనఁదలంచిన వారికిఁ దగని పనియని యిప్పటికైనను శేషాద్రి రమణకవులు గ్రహింపఁగలిగిన యెడలఁ గృతార్థులమగుదుము.

రుద్రదేవుఁడు కందూరు వర్ధమానపుర చోడులను జయించుట.

తెలుఁగు చోడులలో నొక శాఖవారు పదునొకండవ శతాబ్దినుండి పశ్చిమచాళుక్య చక్రవర్తులకు సామంత మాండలికులుగ నుండి వర్ధమానపురము, కందూరు, పానుగల్లు మొదలగు ప్రదేశములను బరిపాలనము సేయుచుండిరి. అయ్యవి యిప్పటి హైదరాబాదు రాష్ట్రమునందలి మహబూబు నగరము, నల్లగొండ జిల్లాల ప్రాంతములోనివి. అయ్యవి పశ్చిమచాళుక్యుల కాలమున సిందవాడిరాష్ట్రమునను, కొల్లిపాక రాష్ట్రమునకును లోఁబడియుండెడివని చెప్పవచ్చును. ఈప్రదేశములు పదునొకండవ శతాబ్దికి, బూర్వము, రాష్ట్రకూటరాజులకును కాంచీపుర చోడరాజులకును, పశ్చిమచాళుక్యులకును పూర్వచాళుక్యులకును, పశ్చిమచాళుక్యులకును, కాంచీపుర రాజులకును, యుద్ధరంగములుగనుండి ప్రఖ్యాతికి వచ్చినవే. అందు ముఖ్యముగా వర్ధమానపురము, కందూరు, పానుగల్లు దుర్గములు మాండలికరాజులకు నాయాకాలములందు రాజధానులుగ నుండుచు వచ్చెను. రాష్ట్రకూటుల కాలమున కోడూరు చోడమాండలికులకు రాజధానిగ నుండుచు వచ్చెనుగాని పశ్చిమచాళుక్యులలో రాష్ట్రకూటుల తరువాత రాజ్యమునకు వచ్చిన చాళుక్యప్రథమతైలపుని సంతతివారీ చోడులను జయించి తమరాజప్రతినిధులను నిక్కడి దేశములను బాలించుటకు నియమించినపుడు వారలు తఱచుగా కోడూరు రాజధానిగఁ జేసికొని పాలించు చుండెడివారు. చోడమాండలికులు వారికి లోఁబడి యాయా దుర్గముల కధిపతులై

పరిపాలనము సేయుచుండెడివారు. తఱచుగా నీరాజప్రతినిధులు కొల్లిపాకను, కోడూరును రాజధానులుగఁ జేసికొని పరిపాలనము సేయుచుండెడివారు. పశ్చిమ చాళుక్యచక్రవర్తులగు ఆఱవ విక్రమాదిత్యుని మనమఁడును, మూఁడవ సోమేశ్వరుని కుమారుఁడును, రెండవ జగదేకమల్లుని తమ్ముఁడు నగు కుమారతైలపదేవుఁడు రాజప్రతినిధిగను మూఁడవ సోమేశ్వరుని కాలమునను, రెండవ జగదేకమల్లుని కాలమునను యువరాజుగా నుండి పరిపాలనము చేసినవాఁడు గావున క్రీ. శ. 1122 వ సంవత్సరములో నితఁడు కోడూరు రాజధానిగా నీ ప్రదేశములను రాజప్రతినిధిగానుండి పరిపాలనము చేసెనని బూదపూరు, నెక్కొండ, గంగాపురము, పాలుగల్లు శాసనముల వలన నిదివఱకె తెలిసికొని యున్నాము. ఇతఁడు రెండవ జగదేకమల్లుఁడు చనిపోయిన వెనుక క్రీ. శ. 11x8 సంవత్సరమునఁ బశ్చిమచాళుక్య సింహాసన మధిష్ఠించెను. ఇతఁడు సింహాసన మధిష్ఠించిన కొలదికాలముననే యితనికి సామంతుఁడుగా నుండిన కాలచుర్యవంశీయుఁడైన బిజ్జలుఁడు మొదలగు మాండలిక ప్రభువులు కాకతిప్రోలరాజు మొదలగు వారితోఁ గూడుకొని చక్రవర్తిని దిరస్కరించి తిరుగుబాటుచేసి యుద్ధములు నడిపినట్లు తెలియుచున్నది. ఎట్లయినను బిజ్జలుఁడును, కాకతిప్రోలరాజును మూఁడవతైలపుని కళ్యాణ నగరమునుండి వెడలఁ గొట్టిరి. ఇయ్యది క్రీ. శ. 1157 సంవత్సర ప్రాంతమున జరిగియుండును. ఈయుద్ధములు జరుగుచున్న సందర్భముననో యంతకుఁ బూర్వముననో ప్రోలరాజును జయించి యాతనిక్రింది రాజ్యమును ఉదయరాజున కొసంగి యుండును. ఆయుద్ధములలో నతఁడు మొదట ప్రోలరాజునకు తోడ్పడియుండును. కాని తైలపదేవ చక్రవర్తి కళ్యాణకటకమును గోల్పోయిన వెనుక పానగల్లు దుర్గాధీశ్వరుఁడైన యుదయరాజు స్వతంత్రుఁడగుటకుఁ బ్రయత్నించెను. ఈసమయము

ననే బిజ్జలరాజు మంత్రియగు బసవేశ్వరుఁడు వీరశైవ మతదీక్షను వహించి ప్రచారము సలుపుచుండ నాజంగమ మతము కర్ణాటాంధ్ర దేశముల వ్యాపించుచుండ నుదయావనీశ్వరుఁడును, వానిపూర్వులును జైనమతావలంబకులై యుండిరి గావున వీరశైవమతావలంబకులను ద్వేషింప సాగిరి. ఈకాలమునందే యుండిన పండితారాధ్యుఁడు తాను కాలాముఖలేక పాశుపత శైవమతావలంబకుఁడైనను బసవేశ్వరుని వీరశైవ మతమును ప్రోత్సహించెను. ఇతని శిష్యుఁడగు నామయ్య యను శివభక్తుని నుదయావనీశ్వరుఁ డనేక విధములుగా బాధించెనఁట. ఉదయచోడుని మంత్రి పింగళి గోవింద ప్రధానియని సుప్రసిద్ధ పరిశోధకులగు కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు తమ శివతత్త్వసార పీఠికలో వ్రాసియున్నారు.* తన శిష్యుఁడగు నామయ్య ఆయుదయ చోడుని బాధపడలేక యురిపెట్టుకొని చచ్చెనఁట! దానిని విని పండితారాధ్యుఁడు కోపగించి రాజునకు శాపమిచ్చి యచటనుండి వెడలిపోయెనఁట! తరువాత చరిత్రము పండితారాధ్యచరిత్రమునం దిట్లు వ్రాయఁబడియున్నవి.

"కాదింక నీ పానుగంట నుండఁగ మహాదేవు భక్తులకనుచుఁ గట్టలుక, మసలక పండిత మల్లికార్జునుఁడు, వెసదలిర్పఁగఁ బురివెడలంగ వెనుక నక్కజంబుగఁ బూచనంతగల్పొన్న, కుక్కురో కురని కూసెఁగల్కోడి, పురిమహోత్పాతముల్పుట్టె వెండియును, బురము పాడగునని బుధులు గలంగ, విదిత శాపోద్ధత విలయోగ్రవహ్ని, కుద యావనీశుఁడాహుతియయ్యె. బుత్రపౌత్రులన్యోన్య కళత్రాభినిరతి" శత్రులై చీఁటి చప్పరంబులను, దడయకాసురిచేఁదన పురిజనము, లడరఁగ నిర్మూలమెరట్లుఁగూడ, సంతానమెల్ల నిస్సంతానమయ్యె."* మహిమాప్రకరణము. పుట. 300

---

* ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సం. ౧౦. సంచిక. 3. పే. ౧౪3-౧౫౫.

ఉదయావనీశుని బ్రశంసించు నపుడు పండితారాధ్య చరిత్రి యందు నిట్లున్నది.

"జోళవాళిగాక క్షోణీత లేశ
వేళవాళికిఁ గర్తనేమెట్టులనిన." (పుట ౨౮౭)

"చోళవాళి=చోళపాళికి=చోళరాజ్య; వేళవాళి=వేళపాళి=కాళునిరాజ్యము"అని నేనర్థము చేసికొంటిని కాని యర్థము స్పష్ట మనుటకు వీలులేదు.''అని లక్ష్మణరావు పంతులువారు తెలిపినారు. కాని నేను వేళపాళి యనఁగా చాళుక్య రాజ్యమని యర్థము చేసికొనుచున్నాను. అయినను గాక పోయినను, ఆరాధ్యుఁడు రాజునకు శాపమిచ్చి వెడలిపోయిన వెనువెంటనే యా పురమునందలి ఱాతి కోళ్లు కూసినవఁట; ఱాతిపొన్న పూచినదఁట. కలోడియు, కల్పొన్నయు చోడుల విశేష చిహ్నములని నన్నెచోడుని కుమారసంభవము మొదలగువాని వలనఁ మనము దెలిసికొనుచునే యున్నాము. పండితారాధ్యుని శాపమెట్టిదైనను రుద్రదేవుని శాసనములోని వీరిం గూర్చిన వర్ణములను బట్టి యదంతయు నిజముగా జరిగినేమో యనిపించు చున్నది. రుద్రదేవుని శాసనములో నుదయావనీశుని కవి నీ క్రింది యర్థమువచ్చు రీతిగా వర్ణించి యున్నాఁడు. "శోభాయుక్తుఁడైన రుద్రదేవరాజుయొక్క పరాక్రమమువలనఁ గలిగిన భయమనెడి వ్యామోహమనుపేర నొప్పు శస్త్రమువలన వడకుచున్న సమస్తశరీరముగల్గి చోడోదయరాజుయొక్క ప్రాణములు పిచ్చిపట్టినవి వలెను, వశము తప్పినవి వలెను, గొప్ప పిశాచముచే బాధింపఁ

బడినవి వలెను భ్రాంతి మంతములైనవి వలెను, చెడిపోయినవి వలెను, అప్పుడే స్వర్గమునకుఁ బోయిన వారయెను."*

ఇట్లుండినను పండితారాధ్య చరిత్రయందుఁ బేర్కొనఁబడిన పానుగంటి యుదయావనీశ్వరుఁడు వేఱనియు, రుద్రదేవుని శాసనములోఁ బేర్కొనఁబడిన చోడోదయుఁడు వేఱనియు నొక సంవాదము బయలు దేరినది. ఈసంవాదమునకు మూలకారణ మీ శ్లోకమునందు చోడోదయక్ష్మాపతి యెక్కడ పరిపాలనము చేయుచున్న వాఁడో కవి తెలుపకుండుటయెగాక యీశ్లోకమునకుఁ పైన గోకర్ణనామభుజగమును భీమనకులము చంపిన దను శ్లోకము వ్రాయఁబడి యుండుటయే.

ఇందునుగూర్చి శేషాద్రిరమణ కవులు కృష్ణాపత్రికయందిట్లు వ్రాయుచున్నారు. "పోలరాజు ఉదయాదిత్యునకు రాజ్యము నొసంగినాఁడు. ఇతఁడు భీమరాజ గోకర్ణుల తండ్రి. కీ. శే. లక్ష్మణ రావు పంతులువారు చెప్పినట్లు వనపర్తి సంస్థానములోనిది గాక నల్లగొండ చెంత రాజ్యము పాలించిన ఉదయచోడుఁ డింకొకఁడు గలఁడు. ఇతఁడు పండితారాధ్యుల ద్వేషించి శాపగతుఁడై మరణించినాఁడు. వెయ్యిస్తంభములగుడి శాసనములోఁ జెప్పఁబడిన చోడోదయుఁడు పూర్వోక్త ప్రతిపక్షుయగు భీమరాజు. వీరుగాక కోడూరు పాలించు మఱియొక ఉదయచోడుఁడు క్రీ. శ. 1160 ప్రాంతమున నుండి జటచర్లలో శాసనము నెలకొల్పినాఁడు. ఈ

* శ్రీరుద్రదుర్ధరపరాక్రమోద్భవ భయవ్యామోహనాభోల్లస
చ్ఛస్త్రత్రిస్తసమస్తగాత్రి విలసచ్చోడోదయక్ష్మాపతేః
ఉన్మత్తాఇవ, నిస్పృతా ఇవ, మహాఘూతాభి భూతాఇవ,
ప్రోద్భ్రాంతాఇవ, సంకులాఇవ తదా ప్రాణాః ప్రయాతాదివం॥
అనుమకొండ శాసనము. వేయిస్తంభాలగుడి శాసనము. పేజి 90. ద. పైన. 24-30.

భిన్నవ్యక్తులను సమన్వయించుటలో పంతులువారు (వీరభద్రరావు) పూర్వభ్రమ ప్రమాదములు పరిష్కరింప వలసి యున్నది.” అని వ్రాసి యీపరిష్కార మనుపెనుభారము నాపైఁ బెట్టుటకు సాహసించుట యాశ్చర్యకరమైన విషయముగదా! కాని శేషాద్రి రమణకవులు లక్ష్మణరావు పంతులవారు “శివతత్త్వసార గ్రంథపీఠికలో “పానుగల్లునైజామురాజ్యమునందుమహబూబ్‌నగర్‌జిల్లాలోనాగర్ కర్నూలుతాలూకాలో నున్నది. ఇదిపూర్వముగొప్పదుర్గము. ఈ ప్రాంతమునఁ బండితునికాలమున నుదయచోడుఁడనురాజు రాజ్యము చేసినట్లు శాసనముల వలనఁ గానవచ్చుచున్నది. ఉదయచోడుని దండనాయకులు శా. శ. ౧౦౮౪ (క్రీ. శ. ౧౧౬౨) లో వేయించిన శాసనమొకటి జడచర్లలోఁ గలదు. జడచర్ల నైజాము రాజ్యము నందుఁ బానుగంటికి నుత్తరమునఁ బదునైదు క్రోశముల మీఁద గలదు. ఈసంవత్సరముననే ప్రథమ రుద్రదేవునిచే వేయించబడిన హనుమకొండ శాసనమునందును నీ చోడోదయుఁడు పేర్కొనఁ బడియెను. రుద్రుఁడు చోడోదయుని గెల్చినట్లును అతని రాజధానియైన కందూరును గాల్చినట్లును నీశాసనము నందుఁ గలదు. కందూరు పానుగంటికి సమీపముననే యున్నది. ౧౧౬౨ ప్రాంతమున అనఁగాఁ బండితారాధ్యునకు మనమితర ప్రమాణముల వలన నిర్ణయించిన కాలమందుఁ బానుగంటివైపున నొక యుదయావనీశుఁడుండెనని స్పష్టపడుచున్నది.” అని విస్పష్టముగా వ్రాయుచుండిన దాని సరిగా నర్థము చేసికొనకయె తబ్బిబ్బు పడుచుందురు. శాసనములలోని వాక్యములను సరిగాఁ జూచుకొనకయె యందున్నవాని కంటె భిన్నముగా వ్రాయుదురు. వానినే తొందరపడి పత్రికలకు వ్రాయుచుందురు. “వీరుగాక కోడూరు పాలించు మఱియొకఉదయచోడుఁడు క్రీ. శ. 1160 ప్రాంతముననుండి జటచర్లలో శాసనము

నెలకొల్పినాఁడు." అని శేషాద్రి రమణకవులు వ్రాసినది దుర్భ్రమ గాని సత్యముకాఁ గన్పట్టదు. ఆశాసనముండిన యెడల నెందుకుఁ బ్రకటింపలేదు? ప్రకటింపఁబడిన జడచర్ల శాసన ముదయావనీశు నిదికాదు. వాని దండనాయకులిది. అది వారు చెప్పినట్లు క్రీ. శ. 1160 నాటిదిగాక 1162 సంవత్సరములోని దని యందేయున్నది. ఇందు పేర్కొనఁబడిన యుదయావనీశ్వరుఁడు కోడూరు రాజధానిగాఁ బరిపాలించిన వాఁడుకాఁడు. "కోడూరు విడిచిపెట్టిన పై తెలుఁగు చోడులు కోడూరు పురవరాధీశ్వరులమని పిలుచుకొనుచుండిరనియుఁ గూడ మనము తెలిసికొనఁ దగిన నూతనాంశమై యున్నది." అని విద్వాన్ అప్పన్నశాస్త్రిగారు ప్రజామిత్ర పత్రికలో వ్రాసినారు. అప్పన్నశాస్త్రిగారికిది నూతనాంశముగాఁ గన్పట్టుచున్నది గాని యిరువది మూఁడేండ్ల క్రిందట వ్రాసిప్రకటించిన నాయాంధ్రుల చరిత్రములోఁ బెక్కుమాఱులు వ్రాసియున్నాను. దొరతనమువారి పరిశోధకులుసహా యితర పరిశోధకులెల్లరు నట్లే వ్రాసియున్నారు. రుద్రదేవుని శాసనములో రుద్రదేవునికి సమకాలికులుగా మూవురు చోడరాజులు ఉదయావనీశ భీమగోకర్ణులను వారు పేర్కొనఁ బడినారుగాని వారికిఁగల పరస్పర "బంధుత్వ మెట్టిదో తెలుపఁబడి యుండలేదు. ఇతర ప్రమాణములగు సాధనములనుబట్టి మనము నిర్ధారించుకొనవలసి యున్నది. రుద్రదేవుని శాసనములలో రుద్రదేవుని విజయములను దెలుపుసందర్భమున వాని ప్రత్యర్థులను గూర్చి చేసిన యుపహాస్యవర్ణనలలో నతిశయోక్తులు పెక్కులుగల వని ముందుగా మనము గుర్తింపకున్నయెడల మనకు సత్యము బోధపడఁజాలదు. తైలపదేవుని మరణ మెంత సత్యమో ఉదయావనీశుని మరణముగూడనంత సత్యమయినదిగానే భావింపవలయును. రుద్రదేవుఁడు వారిని జయించి వారి రాజధానీపురములను దహించివేసిన మాట నిజమై యుండవచ్చును.

## గోకర్ణనృపాలుఁడు.

భీమన సోదరుఁడైన గోకర్ణుఁడు వాగీంద్రచూడామణి యను జైనసమయాచార్యుని శిష్యుఁడు. వర్ధమానపురాధీశ్వరుఁడు. ఇతఁడు భీమకవికిఁ గర్తృత్వ మారోపింపఁబడిన కవిజనాశ్రయ మను ఛందోగ్రంథమును రచించి కల్యాణపురాధీశ్వరుం డైన చాళుక్యజగదేకమల్లునకు సేనాపతి యగు రేచభూపాలున కంకితము చేసెను. ఈ రేచనికిఁ గవిజనాశ్రయుఁ డనియు, గోకర్ణునకు శ్రావకాభరణాంకుఁ డనియు బిరుదనామములు గలవు. కవిజనాశ్రియములో నాలుగాశ్వాసములును జైనకావ్యధర్మముల ననుసరించి వాగ్దేవతాస్తుతితోఁ బ్రారంభింపఁబడినవి. వేములవాడభీమకవి రచించినది నృసింహపురాణముకాని కవిజనాశ్రియము కాదు. గోకర్ణు డనేకాగ్రహారములను బ్రాహ్మణోత్తములకు ధారవోసి శాసనములను వ్రాయించి యున్నాఁడు. ఈగోకర్ణుని గురు వయిన వాగీంద్రచూడామణి తనపేరిట లక్షణగ్రంథమును, ఆదిపురాణమును ఆంధ్రభాషలో విరచించినటుల దెలియుచున్నది.

## భీముఁడు-గోకర్ణుఁడు.

ప్రతాపరుద్రుని కాలమున వర్ధమానపురమును భీమచోడుఁడు తన సోదరుఁడైన గోకర్ణచోడునితోఁ గలిసి పరిపాలనము సేయుచున్నటులు దెలియుచున్నది. ఈభీమచోడనృపాలుఁడు పరమదుర్మార్గుఁ డైనటుల రుద్రదేవుని శాసనమున వాకొనఁబడియెను. భోజనకాలమునందు తన సోదరుని జంపెను. తన సవతితల్లికిఁ బతియయ్యెను. పశ్చిమచాళుక్యుఁ డను విక్రమాదిత్యచక్రవర్తి మనుమఁ డగు తైలపదేవుఁడు వర్ధమానపురమున కిరువదిమైళ్ళ దూరమునం దున్న కందూరునఁ బరిపాలనము సేయుచునుండి రుద్రదేవుని పరాక్రమమునకు వెఱచి మరణమునొందఁగా భీమచోడుఁ

డారాజ్యము నాక్రమించుకొని కొంతకాలము పరిపాలనముచేసి రుద్రదేవునితో వైరము గల్పించుకొని నిరంకుశాధికారమును నెఱపుచుండఁగా రుద్రదేవుఁ డీనృపాలాధముని శిక్షించుటకై వాని పైకి దండెత్తి పోయెను. రుద్రదేవుని వీక్షించిన మాత్రముననే భయంపడి భ్రాతృమాతృవనితా సహితముగా భీముఁడు పర్వతారణ్యభూములకుఁ బాఱిపోయె నని అలంకారయుక్తము లయిన శ్లోకములలో వ్యక్తీకరింపఁబడియెను.

ఉనయచోడుని జంపి పద్మావతిని పెండ్లియాడుట.

అటుపిమ్మట రుద్రదేవుఁడు వానిని వెంబడించి తఱిమి యాంజనేయుఁడు లంకాపురమును దహించినటులఁ జోడోదయరాజు యొక్క నగరమును దగ్ధము గావించి యా నగరముమధ్య నొక మహాద్భుతమైన తటాకమును ద్రవ్వించెను. అంతకుఁ బూర్వమే చోడోదయుఁడు రుద్రదేవుని పరాక్రమమును విని భయకంపితుఁడై మతిపోయి పిచ్చియెత్తి దయ్యముసోఁకి మృతినొందెనని చెప్పఁబడి యున్నది.

పైని చెప్పినట్లూ చోడోదయుని నగరమును దగ్ధము గావించుటయే కాక యాతని కొమార్తను పద్మావతియను దానిని వివాహమైనటుల యా శాసనము వలనఁ దెలియుచున్నది.

" కస్తూరోదయ చోడవంశవిలసత్ క్షీరాబ్ధి గర్భోద్భవ
త్పద్మాకారశ్రియ రుద్రదేవ నృపతేః కిం వర్ణ్యతే విక్రమః
క్షుద్రక్షత్రకులోన్న తిక్షయకృత స్సర్వావనీ శ్రీభృతో
రామస్యేవ కుఠారఖణ్డిత రిపువ్రాతస్య పృథ్వీపతేః. "

ఈ పై శ్లోకము ద్వంద్వార్థమును సూచించు చున్నది. అయినను రుద్రదేవుఁడు పద్మావతిని వివాహముఁ జేసికొనె

ననుటయే యొప్పి యున్నది. కాని మఱియొక శాసనమునుబట్టి సందేహము కలుగు చున్నది.* ఉదయచోడని జట్చర్ల శాసన మునకును రుద్రదేవుని యనుమకొండ శాసనమునకును నడుమ ౨౬ దినములు మాత్రమే వ్యవధి కలదు.

ఉదయచోడుని ప్రశంస అనుమకొండ శాసనములోనే గాక మామిళ్ళపల్లి, పానుగల్లు, జడచర్ల శాసనములలోగూడ నుండుట చేత వాని వివరములను దెలిపినవాని నెట్లు సమన్వయించు కొనవల యునో చదువరులె గ్రహింపఁ గలరు.

౧ మామిళ్ళపల్లి శాసనము : విళంబిసంవత్సరము. గోక ర్ణుని దానమును గూర్చినది. ఇందు సూర్యవంశమున గోకర్ణుఁడును వానికి నుదయాదిత్యుఁడును, వానికి భీమగోకర్ణులును బుట్టి రని భీమగోకర్ణులు నిస్సీమ ప్రేమబంధము గలవారని తెలియఁజేయును. ఇందు శకసంవత్సరము లేకపోయినను క్రీ. శ. 1117-1118 సంవత్సర మగునని యూహింపవచ్చును.1

౨ మామిళ్ళపల్లి రెండవశాసనము : సౌమ్యసంవత్సరము, కందూరి గోకర్ణ చోడదేవమహారాజుల దండనాయకుఁడు, హరిహర దాసుండయిన బోయదేవుని ధర్మమును దెలుపునది. ఇందు శకసంవ త్సరము లేకపోయినను క్రీ. శ. 1128-29 అగుచున్నది.2

3. పానుగల్లు శాసనము: క్రోధిసంవత్సరము; ఇందుసోమ రాజుభార్య బెడగాంబ. వీరికూతురు మేలాంబిక; భర్తపేరు లేదు. ఈమెకు ఉదయాదిత్యుఁడు, భీముఁడు, గోకర్ణుఁడు జనించిరి.

*. See the Lithic Records in Hyderabad prepared by M. Ramakrishna Kavi M.A.

(1) సుజాత సం ౧ సంచిక ౨, కాకతీయసంచిక, అనుబంధము 39

(2) సుజాత సం ౧ సంచిక ౨ డిటో ,, 40

బ్రాహ్మణులకు చేసినదానమును దెలుపునది. తెలింగానా శాసనములలో వివరము వ్రాసినవారు ప్రతిబింబము బాగుగలేదు. చాళుక్య విక్రమవర్షము ౫౮. వేసినారు. అట్లయిన క్రీ. శ. 1160 కాఁగలదు కాని యందలి క్రోధియను తెలుగుసంవత్సర నామమునుబట్టి క్రీ. శ. 1123-1124 అగుచున్నది. 1160 విక్రమసంవత్సర మగును కనుక వివరము వ్రాసినవారి విక్రమవర్ష సంఖ్యతప్పు.1

౪ జడచర్ల శాసనము. కందూరి ఉదయచోడుని దండనాయకులు వేయించినది. చిత్రభాను సంవత్సరము. శకసంవత్సరము ౧౦౮౪ అనఁగా క్రీ. శ. 1162 అగుచున్నది. వారు విధించెడు సుంకములనుగూర్చిన దానశాసనము.2

౫ రుద్రదేవుని అనుమకొండ శాసనము. చిత్రభాను సంవత్సరమె.

ఈపై శాసనములలో జడచర్ల శాసనమునుబట్టి 1162 కందూ రుదయచోడుఁడు బ్రదికియున్నాఁడని స్పష్టముగాఁ దెలియుచున్నది. ఈశాసనతిథి చిత్రభానుసంవత్సర పుష్యబహుళ ద్వితీయా మంగళవారమై యుండగా అనుమకొండ శాసనము తిథి చిత్రభాను సంవత్సర మాఘశుద్ధ త్రయోదశీ వడ్డవారము (శనివారమై) యుండెనుగనుక జడచర్ల శాసనము వ్రాయఁబడిన ౨౬ దినములకే అనుమకొండశాసనము వ్రాయఁబడినది.

ఇందువలన తేలిన పర్యవసానమేమనఁగా రుద్రదేవుని శాసనమువ్రాసిన అద్వయామృత యతికి శిష్యుఁడును, రామేశ్వర దీక్షితునికుమారుఁడును, నగు అచింతేంద్ర కవివర్యుని వర్ణనలలోని యతి

(1) తెలింగానా శాసనములు, ఇతరశాసనములు, సం ౫౧౫. పత్రము ౧౬౪

(2) ,, ,, ,, ౬ ,, ౧౫౪-౫౫

శయోక్తుల మనము పాటించి విశ్వసించిన యెడల నీయిరువదియారు దినములలోనే సూర్యవంశోద్భవుఁడును, క్షత్రియ శిఖామణియునగు భీమచోడనృపాలుఁడు తైలపుని రాజ్యమాక్రమించి వర్ధమానపురము రాజధానిగాఁ జేసికొని సవతితమ్ముఁడైన గోకర్ణచోడుని సంహరించి వానితల్లిని భార్యగాఁ జేసికొని పరమదుర్మార్గుఁడై ప్రజాపాలనముఁ జేయుచుండగా వానిదుష్ప్రవర్తనము చారులవలన విని అసంఖ్యాకములగు సైన్యములంగూర్చుకొని రుద్రదేవుఁడు దండెత్తి పోయి భీముఁడు పుత్రమిత్ర కళత్రాదులతో పట్టణము విడిచి యడవులకుఁ బాఱిపోగా వర్ధమానపురమును ఆంజనేయులు లంకాపురమును దగుల బెట్టినట్లుగాఁ దగులఁబెట్టి యాపట్టణమధ్యమున నొక గొప్ప తటాకమును ద్రవ్వించి యదనఱకె తనపరాక్రమమునకు వెఱచి పిచ్చపట్టి పోయి పిశాచముచే బాధింపఁబడి నానావికలావస్థలను బొంది స్వర్గమునకుఁ బోయిన ఉదయచోడుని రాజధానియగు కందూరును ముట్టడించి దానినిగూడ దగులఁబెట్టి యంతయు నాశనముఁజేసిన తరువాత కందూరుదయచోడుని కొమార్తయగు పద్మావతిని బెండ్లిచేసికొని సుఖముగా నింటికిఁజేరి యీయనుమకొండ శాసనమును అచింతేంద్రకవివర్యునిచే వ్రాయించెనని చెప్పవలసివచ్చును. ఆహా! ఎంత అసంభవమగు విషయము! వీనినంతయును సమన్వయింపవలయునఁట! లేనియెడ ఆంధ్రుల చరిత్రము తాఱుమాఱై పోవునట! ఎనిమిది సంవత్సరములుగా శేషాద్రి రమణకవులు పత్రికలలో వాపోవుచున్నఘోష. వీనినున్నదున్నట్లుగా నుంచి, చెప్పినది చెప్పినట్లుగానుంచి, ఒకరివి నిజమని, మఱియొకరివి యబద్ధమని చెప్పకుండ సమన్వయము చేయుట శేషాద్రిరమణ కవులకు కాదు కదా వారిని మమ్ముసు బుట్టించిన బ్రహ్మదేవునికైనను సాధ్యము కాదు. వీరివాక్యములనే పట్టుకొని సమన్వయమునే ప్రవాహము నీదుట నాకు సాధ్యము కాదని నాయశక్తతను దెలుపుకొనుచు భావి పరిశోధకులకు విడిచిపెట్టుచున్నాను.



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## ఎనిమిదవ ప్రకరణము.

## కాకతిరాజుల చరిత్రము.

### పండ్రెండవ శతాబ్దస్థితి.

దక్షిణహిందూస్థానమున మహారాష్ట్ర కర్ణాట ద్రావిడాంధ్ర కాళింగులు సుస్థిరమైనయేకసామ్రాజ్యమును నెలకొలుపవలయు నన్నసంకల్పముతోఁ దమతమ యావచ్ఛక్తులను వినియోగించి దక్షిణాపథము నంతయు భయంకరమైనయుద్ధరంగముగఁ జేసికొని వీరాధివీరులై పోరాడుచున్న రాజకీయవాతావరణమును; రాజ్యాధిపత్యములను వహించిన చక్రవర్తులు మహారాజులు సామాన్యముగ శైవమతాభిమానులుగ నున్నను, మాండలికరాజులు సేనాధిపతులు మొదలగు నున్నతరాజకీయోద్యోగీయు లనేకులు జైనమతావలంబకులై జైనమతాచార్యులకుఁ బోషకులై నందున జైనమతము జనసామాన్యమతమై విజృంభించుచుండుటయు, జైనమతావలంబకు లయిన మాండలిక రాజులు సేనాధిపతులు సామ్రాజ్యాధిపత్యము నాక్రమించుటకై ప్రయత్నించు చుండుటయుఁ, జూచి సహింపఁజాలక శైవవైష్ణవ బ్రాహ్మణమతాచార్యు లనేకులు

దక్షిణహిందూస్థానమునఁ దమతమ మతసామ్రాజ్యములను స్థాపించు టకై అభినివేశముతో మతబోధనలు గావించుసమయమున జైన బౌద్ధమత ప్రళయకారకులో యన సంస్కర్త లనేకులు బయలు వెడలి మతసాంఘికవాతావరణమును, అల్లకల్లోలముగావించినకాల మగుటఁజేసి పండ్రెండవశతాబ్దస్థితి అతిభయంకరముగ నుండెను. పండ్రెండవ శతాబ్దప్రారంభమునఁ గర్ణాట మహారాష్ట్రదేశములు పశ్చిమచాళుక్య సామ్రాజ్యమునకును, ద్రావిడాంధ్రదేశములు పూర్వచాళుక్య చోడ సామ్రాజ్యమునకును, కళింగోత్కలములు కళింగ గాంగ సామ్రాజ్యమునకును, లోఁబడి యుండినవి. ఆంధ్ర భారతకృతిపతి యగు రాజరాజవిష్ణువర్ధనుని తనయుఁడును చాళుక్య చోడచక్రవర్తియు నగు మొదటికులోత్తుంగచోడదేవుని చరిత్ర మాంధ్రదేశమునకు సంబంధించినంతవఱకు నాంధ్రులచరిత్రము లోని నాల్గవభాగమున సవిస్తరముగాఁ దెలిపి యున్నాఁడను.

ఇతఁడు క్రీ. శ. ౧౦౭౦ మొదలుకొని ౧౧౧౮ వ సంవత్స రమువఱకుఁ బరిపాలనము చేసెను. ఇతఁడు శివభక్తుఁడై శైవ మతాభినివేశపరవశుఁడై శివాలయములను బెక్కింటిని నిర్మించి ప్రఖ్యాతినొందినను, పరమతసహనము లేనివాఁడని చెప్పుదురు. ఆకాలమునందలి బ్రాహ్మణు లప్పటికే శివుని దైవముగా నంగీకరించిన వారగుటచేత నీతఁడు బ్రాహ్మణద్వేషిగాక యుండెను. ఆకారణము చేత నీతనికాలమున బ్రాహ్మణమతము వర్ధిల్లుచుండె నని చెప్ప వచ్చును. ఆకాలముననే ఆర్యబ్రాహ్మణమత మనేక సంస్కార ములను బొందెను. దక్షిణాపథమునకు వచ్చిన యార్యబ్రాహ్మణులు ద్రావిడులతోడి సంపర్కమువలన శివారాధన మవలంబించినవా రయినను వారికిఁ గర్మప్రధానమైన వైదికమతమే ప్రధానమతముగా నుండెను. ఈమతమును బ్రకాశింపఁజేసినవాఁడు కుమారిలభట్టు.

ఈవైదికమతోద్ధారకుని చరిత్రమును సంగ్రహముగా నాంధ్రుల చరిత్రములోని మూడవభాగమునఁ దెలిపి యున్నాఁడ గావున, నిచ్చట మఱలఁ దెలుపలేదు. కుమారిలభట్టుచేఁ బ్రకాశింపఁజేయఁ బడిన కర్మప్రధాన మైనవైదికమతము నానాఁట వర్ధిల్లుచుండినను, కుమారిలభట్టుయొక్క ప్రతిపక్షు లయిన జైనబౌద్ధమతాచార్యులతో వాగ్వాదములు సలిపి విజయము గాంచినను, ప్రజాపాలనముసేయు మహారాజులను వశులనుగఁ జేసికొని యెన్నివిధములుగా జైనులను బాధించి హింసించినను, అతనిచే బోధింపఁబడిన మతము ప్రజారంజకముగ నుండక పోయెను.

## వైష్ణవ మతము.

దక్షిణ హిందూస్థానమునందు భక్తిప్రధానమైన వైష్ణవ మతము శఠకోపుఁడు, నాథముని, పుండరీకాక్షుఁడు, రామమిశ్రుఁడు, యామునాచార్యుఁడు మొదలగు పరమభాగవతోత్తములచే బోధింపఁ బడు చుండుటచేత తక్కువ జాతివా రనేకులు వైష్ణవభక్తాగ్రేసరులై యున్నతస్థితికివచ్చి భాగవతులచేఁ బూజింపఁబడు చుండిరి. అయినను వైష్ణవ మతముకూడ రామానుజు లవతరించువఱకు కర్మప్రధాన మైన వైదిక మతమునుగాని, వైరాగ్య ప్రధానమైన శైవమతమును గాని, మించి విశేషవ్యాప్తిఁ జెందియుండలేదు.

## శంకర మతము.

గౌతమబుద్ధుని తరువాత మత సంస్కర్తలలో జగత్ప్రఖ్యాతి నొందిన శంకరుఁ డెనిమిదవ శతాబ్దాంతమున మలయాళదేశములోని

కాలడియను గ్రామంబున నొక నంబూద్రిబ్రాహ్మణ కుటుంబమున నవతరించి బాల్యముననే వేద వేదాంతాది విద్యలనెల్ల గ్రహించి బ్రహ్మచర్యమునుండియే సన్న్యాసియై మహాతత్త్వవేత్తయై వ్యాస కృత వేదాంత సూత్రములకును, దశోపనిషత్తులకును, భగవద్గీతలకును మహాభాష్యములను వ్రాసి, ఆసేతు హిమాచలమును సంచారముచేసి, అద్వైత సిద్ధాంతమును బోధించుచు, పరమత ఖండనమును స్వమత మండనమును జేయుచు, ధర్మవ్యవస్థకై భరత ఖండంబున నుత్తర హిందూస్థానమున శృంగేరిలోను, పూర్వహిందూస్థానమున జగన్నాథములోను, పశ్చిమ హిందూస్థానంబున ద్వారావతిలోను, నాలుగు ప్రధాన మఠముల నేర్పఱచి శంకరపీఠములను స్థాపించి, జగద్విఖ్యాతి గాంచెను. ఇతనిచే రచియింపఁబడిన సూత్రభాష్యమును, ఉపనిషద్భాష్యమును, గీతాభాష్యమును, ప్రస్థానత్రయ మందురు. హేతువాదమున నీగ్రంథమును మించినది మఱియొక్కటి గానరాదని కొందఱు తత్త్వవేత్తల యభిప్రాయము. ఇతఁడు బౌద్ధదర్శనములోని సిద్ధాంతములను బెక్కింటిని సంగ్రహించియు, బుద్ధుఁడు విష్ణువుయొక్క యవతారమని వచించియు, బౌద్ధులను బెక్కండ్రను పౌరాణిక హిందూ మతావలంబకులనుగఁ జేసెనని చెప్పెదురు. ఇతఁడు పౌరాణిక మతములతోఁ జాలవఱకు సమాధానపడి తనమతమును మెల్ల మెల్లగ వ్యాపింపఁజేసి కృతకృత్యుఁడయ్యెను. ఇతఁడు రాజాధిరాజులను వశులనుగఁ జేసికొని బౌద్ధులను హింసించెనని చెప్పెడి కథ లెంత వఱకు విశ్వసనీయములో మన మిప్పుడు నిర్ధారణ చేయఁజాలము కాని, హిందూదేశమున బౌద్ధమత వినాశమునకుఁ గొంతవఱకీతఁడు కారణభూతుఁడై యుండవచ్చునని మాత్రము మన మూహింపవచ్చును. ఇతఁడు కుమారిలభట్టు బోధించిన వైదిక మతమునుగూడ

నిరసించినవాఁడు. ఈమహాసంస్కర్త ముప్పదిరెండు సంవత్సరములు జీవించి బదరీ కేదారములో ముక్తిగాంచెనని చెప్పుదురు. ఇతఁడు బోధించిన యద్వైత తత్త్వమును వైదిక మతావలంబకులయిన బ్రాహ్మణు లనేకు లంగీకరించిరి. పదునొకండవ శతాబ్దాంతమునను పండ్రెండవ శతాబ్ద ప్రారంభమునను యాదవ ప్రకాశులను నద్వైతసన్యాసి యొకఁడు కాంచీనగరమునందు నద్వైతమత బోధనలను గావించుచు మహాప్రఖ్యాతి గాంచుచుండెను.

## కాంచీనగరము.

అంతకుఁ బూర్వము జైనబౌద్ధమతాచార్యులకు సయితము ప్రధానస్థలముగా నుండిన యీ కాంచీనగరము, పదునొకొండవ శతాబ్దమునాఁటికి బ్రాహ్మణాధీనమై వైదిక విద్యాబోధక స్థానమై, బ్రాహ్మణ మతములకుఁ బట్టుకొమ్మయై, దక్షిణ హిందూదేశమున విద్యాధికార స్థానమును వహించిన నగరముల నన్నింటి నతిశయించి యొప్పాఱుచుండుటచేత నెక్క డెక్కడనుండియో బ్రాహ్మణ విద్యార్థు లనేకులు విచ్చేసి ప్రసిద్ధులయిన యుపాధ్యాయులకడ విద్యాభ్యాసమును జేయుచు వేద వేదాంతాది విద్యారహస్యముల నేర్చుకొనుచు నుండిరి. మతబోధకు లనేకులా మహానగరమునకు నేతెంచి నేర్పుమీఱ మత బోధనలు గావించు చుండిరి. అట్టివారిలో యాదవ ప్రకాశులను సన్న్యాసియు నొకఁడు. ఇతని ప్రసిద్ధినివిని దూరస్థలములనుండి విద్యార్థు లనేకులువచ్చి శుశ్రూషఁజేయుచు విద్యాభ్యాసమొనర్చుచు నుండిరి. అట్టివారిలో వైష్ణవమతోద్ధారకుఁడును మహాసంస్కర్తయునగు రామానుజాచార్యుఁ డొకఁడు.

## రామానుజాచార్యుఁడు.

## శ్రీవైష్ణవమతము.

ఇతఁడు ద్రావిడదేశములోని భూతపురి యనునామాంతరము గల శ్రీపెరుంబూదూరను గ్రామంబున ఆసూరికేశవసోమయాజి యను బ్రాహ్మణునకును, కాంతిమతి యను భార్యకును, శాలివాహన శకము ౯౩౯ దియగు పింగళసంవత్సర చైత్రశుద్ధపంచమీ గురువారమున నార్ద్రానక్షత్రయుక్త శుభలగ్నమునందు జనించెను.1 ఆళవందారను నామాంతరముగల సుప్రసిద్ధవైష్ణవమతాచార్యుఁడగుయామునాచార్యుని శిష్యవర్గములోనివాఁడగు శ్రీశైలపూర్ణుఁ డీతని మేనమామ. రామానుజుఁడు తన పినతల్లియగు ద్యుతిమతికిని కమలాక్షభట్టునకును జనించిన గోవిందభట్టుతోడఁ గాంచీపురమునకుఁ బోయి యాదవప్రకాశునికడఁ జేరి తన ప్రజ్ఞావిశేషముచేతను, మేధాసంపత్తిచేతను, అత్యల్పకాలములోనే వేదాంతవిద్యారహస్యముల నన్నిటిని గ్రహించి గురుబోధమును ధిక్కరించి శంకరుని యద్వైతసిద్ధాంతమునునిరాకరించివిశిష్టాద్వైతసిద్ధాంతబోధము మొదలుపెట్టి గురువుతో మతసిద్ధాంతవాదములు కావించి యాతని వైష్ణవభక్తాగ్రేసరునిగాఁజేసి తుదకు గురువునకే తాను గురువై యతనిచేఁ బూజింపఁబడె నని వైష్ణవమతగ్రంథములు ఘోషించుచున్నవి. ఇట్లు రామానుజుఁడు శంకరునిమతమును భక్తిప్రపత్తులు లేని వట్టి జ్ఞానమువలన ముక్తిలేదనియు, ప్రపంచము మిథ్యకాదనియు, ముక్తి సమయమున జీవుఁ డీశ్వర స్వరూపము కలవాఁడయినను బూర్ణముగా నీశ్వరస్వరూపము సంభవింపదనియును, ఖండించుచు భక్తివిధానమున శంఖచక్రగదాధారియు గరుడవాహనారూఢుఁడు నగు

1. క్రీ. శ. ౧౦౧౭ వ సంవత్సర మగుచున్నది. ఇది సరియైనదిగఁ గన్పట్టదు ఇది చర్చింపఁ దగిన విషయము.

లక్ష్మీపతియే సర్వేశ్వరుఁడని బోధించుచు వచ్చెను. చోడచక్రవర్తి శంకరమతావలంబకుఁ డగుటవలన రామానుజుని మతబోధము సరిపడకుండెను. ఈచోడచక్రవర్తి యాంధ్రభారతకృతి పతియైన రాజరాజనరేంద్రుని కుమారుఁ డగు కులోత్తుంగచోడదేవుఁడే గాని యన్యుఁడు గాఁడు. ఇతఁడు శైవభక్తుఁ డగుటవలనఁ దన రాజ్యము నందలి ప్రజలెల్లరును శివునే దైవముగా నంగీకరింపవలసిన దని ప్రకటింపించెను. అందులకు రామానుజునిశిష్యులు నిరాకరించిరి. అందులపైఁ జక్రవర్తికాగ్రహము జనించి రామానుజునిబట్టి తన యొద్దకుఁ గొనిరమ్మని భటుల కుత్తరవు చేసెను. పరమమాహేశ్వరాచారభక్తిపరుఁ డైన చక్రవర్తియాజ్ఞను శిష్యవర్గముచే రామానుజుఁడు విని మాఱువేషముతో వెంటనే కాంచీపురమును విడనాడి హొసలరాజుచేఁ బరిపాలింపఁబడు గాంగవాడి దేశమునకుఁ బాఱి పోయెను.

## విఠలదేవరాయలు.

అప్పుడు విఠలదేవరాయలు గాంగవాడిదేశమును బరిపాలనము చేయుచుండెను. ఇతఁడు క్రీ. శ. ౧౧౦౬ వ సంవత్సరమున రాజ్యాధిపత్యము వహించినటులఁ గన్పట్టుచున్నది.1 ద్వారసముద్రము లేక హాలెబీడు రాజధానిగ హొసలబల్లాలరాజులు గాంగవాడిదేశమును బరిపాలించుచుండిరి. వీరు మొదట జైనమతావలంబకులుగ నుండిరి. ఈబల్లాలరాజైన విఠలదేవరాయలు పశ్చిమచాళుక్యచక్రవర్తి యగు యాఱవవిక్రమాదిత్యునికి సామంతులుగ నుండిన మహామండలేశ్వరులలోఁ బరాక్రమవంతుఁడుగను బ్రసిద్ధుఁడుగ నుండెను. రామానుజుఁడు తనశిష్యవర్గముతో నీతనిరాజ్యమునఁ

1. The Making of Mysore by S. Krishna swamy Aiyangar, M. A., p. 14,

ప్రవేశించి జనులకు మతోపదేశమును జేయుచు రాజధానీనగరము నకు వచ్చి కొంతకాల మచ్చటనే నివసించి యుండెను. అప్పు డాదేశపురాజుకొమార్తను బ్రహ్మరాక్షసుఁడు పట్టుకొని వేధించు చుండెను. అందువలన నారాజపుత్త్రిక దిగంబరయై పిచ్చిపట్టిన దానివలెఁ దిరుగుచుండె నఁట. జైనమతగురువు లెందఱో చికిత్సలు చేసినను ఆబ్రహ్మరాక్షసుఁడు విడఁ డయ్యెను.

రామానుజుఁడు బ్రహ్మరాక్షసుని పాఱఁదోలుట.

రామానుజుని మహాత్త్యము తన శిష్యుఁడగు తొండనూరు నంబివలన రాజుభార్య శాంతలదేవి విని, రాజుతోఁ జెప్పఁగా నతఁడు "మన పుత్త్రిక మనస్స్వాస్థ్యమును గలిగించి యెప్పటిస్థితికి రామాను జుఁడు గొనివచ్చెనేని యతఁడే మనకు దైవము, అతఁడే ప్రభువు, అతఁడే గురువు." అనిచెప్పి రామానుజునికి వార్త నంపించెను. రాజుల యాశ్రియము మొదట రామానుజునికంతగా నిష్టములేక పోయెనఁట గాని, మతవ్యాపనమునకు రాజుయొక్క సాహాయ్య మత్యావశ్యక మని శిష్యులు ప్రార్థించుటచేత నంగీకరించి రామానుజుఁడు రాజాం తఃపురమునకుఁ బోయెను. అంతట రాజు తన రాణితోఁ బ్రత్యుత్థా నముచేసి యతనికి నమస్కరించి లోనికిబోయి కూఁతును జూపెను. దిగంబరయైయున్న రాజపుత్త్రికపై రామానుజుని పాదతీర్థమును గుర్వాజ్ఞ శిరసావహించిన శిష్యుఁడొకఁడు ప్రోక్షింప నామెను బట్టి యున్న బ్రహ్మరాక్షసుఁడు విడిచిపోయెనఁట. అంతటనామెను మగ వాండ్రయెదుటఁ దానాస్థితిలో నుండుటకు సిగ్గువడి చివాలున లేచి పోయి వస్త్రాలంకరణ భూషితురాలయివచ్చి వారలకు నమస్కరించి నిలువంబడెనఁట. తల్లిదండ్రులు కొమార్తనుజూచి పరమానందము నొంది రామానుజుఁడు నిజముగా నాదిశేషువయిన యనంతునియొక్క యవతార మేయని విశ్వసించి యాతనిమతమును స్వీకరించిరి. అంతట

రామానుజుఁడు వారల నాశీర్వదించి విఠలదేవరాయనికి విష్ణువర్ధనుఁడని నామకరణము జేసెను. ఇట్లు విఠలుఁడు నూత్నమతకవచమును దొడిగి నూత్ననామమును స్వీకరించి జైనులయెడ ననురాగమును విడిచి వర్తించుచుండ జైనులకు రామాజునియెడ ద్వేష మగ్గలమయ్యెను.

## జైనబౌద్ధమతముల నిర్మూలనము.

అంతట జైనులకు వైష్ణవులకును ఘోరకలహము ప్రారంభమై మతచర్చ లతిభయంకరము లయ్యెను. మహారాజగు విష్ణువర్ధనుఁడు వైష్ణవుల పక్షమునఁ జేరినందున జైనులబల ముడిగిపోయెను. రామానుజుఁడు జైనమతాచార్యులను వాదమున గెలిచెనఁట. వైష్ణవపక్షపాతియై విష్ణువర్ధనుఁడు ౭౯౦ జైనదేవాలయములను నాశనము చేసి అదివఱకా దేవాలయముల పోషణార్థము దానముచేసిన మడులు మాన్యము లూడఁబెఱికికొని వైష్ణవదేవాలయముల కైంకర్యాదుల కొసంగెను. విష్ణువర్ధనుఁడు బేలూరిలో చెన్నగినారాయణుని, తలక్కాడులో కీర్తినారాయణుని, గడగులో విజయనారాయణుని, హారదన హాల్లిలో లక్ష్మీనారాయణుని, మఱియొకచోట మఱియొక నారాయణుని ప్రతిష్ఠింపించి, తొండనూరిలో తిరుమల సాగరమను పేర నొకచెఱువు త్రవ్వించి జైనదేవాలయముల ఱాలతో చీడీలు గట్టించి చెఱువుగట్టక్రింద రామానుజ కూటమును నెలకొల్పి భక్తుల పోషణార్థ మొక సత్రమునుగూడ నిర్మించెను. దొడ్డగుసుసహాల్లిగ్రామమునకు మేలుకోట యనియు, తిరునారాయణపుర మనియు నామకరణము చేసెను. ఇయ్యది క్రీ-శ. ౧౧౮౭-వ సంవత్సరమున జరిగినదని శ్రావణబెలగోలస్థల పురాణమువలనఁ దేటపడుచున్నది.1 వైష్ణవమత మవలంబింపని జైనమతాచార్యు లనేకులు ఱాతి గానుగలలోఁ

1. The Indian Antiquary, Vol II, May, 1873.

బెట్టి చంపఁబడిరి. పద్మగిరిలోఁ బిలువఁబడిన జైనులనేకులు పై రీతిగానే సంహరింపఁబడిరి. 2 ఈ ఘోరపరిశ్రయమునకు భయపడి జైనమతావలంబకు లనేకులు తప్తముద్రాధారణమును గైకొని వైష్ణవులయిరి. ఈ విషయములు స్థలపురాణములలోను వైష్ణవమత గ్రంథములలోను వ్రాయఁబడినవి. ఇట్లని పై గ్రంథములలోఁ జెప్పఁబడి యున్నను విష్ణువర్ధనుఁడు జైనులసంబంధమును విడిచిపెట్టినట్లు శాసనములవలనఁ దెలియలేదు. వైష్ణవ మతావలంబకుఁడని చెప్పఁబడి విష్ణువర్ధనుఁడు హాలెవీడులోని జయంగొండేశ్వర శివాలయమునకు క్రీ. శ. ౧౧౨౧ వ సంవత్సరములో భూదానము చేసినట్లుగ విరూపాక్షపురములోని యొక శాసనమువలనఁ దెలియవచ్చుచున్నది. కేతమల్లుఁ డనువర్తకుఁ డొకఁడు ౧౧౨౧ వ సంవత్సరమున విష్ణువర్ధనహోసలేశ్వరుఁ డనుపేర నొక శివాలయమును గట్టించెను. మఱియు నీతనిపంచప్రధానులలోఁ గొందఱు జైనమతాభినివేశపరవశులుగఁ గన్పట్టుచున్నారు. ఇంతియగాక ౧౧౨3-వ సంవత్సరమున జైనమతావలంబిని యగు తనభార్యకు నొక గ్రామము నీయఁగా నామె దానిని ౨౦౦ బ్రాహ్మణులకు విభాగించి యిచ్చెనఁట! ఆ సంవత్సరముననే యతనిభార్య శాంతలదేవి శ్రవణబెలగోలగ్రామములో గంధవారణమను బస్తిని గట్టించెను. మఱియు ౧౧౨౫ దవ సంవత్సరమున మహోపాధ్యాయుఁడును తార్కికచక్రవర్తియు జైనుఁడు నగు శ్రీపాలుఁడనువానికి భూదానము చేసెను. ౧౧౨౭ వ సంవత్సరమున యాదవపుర మనుమేలుకోటలో చాముండికొండపై నుండు మర్బలతీర్థమునకు (శివాలయములోని యొకభాగముకాఁబోలు) దాన శాసనము వ్రాయించెను. విష్ణువర్ధనుని

---

2· Life And Teachings of Sri Ramanuja by C. R. Srinivasa Aiyengar B. A., p. 215.

కుమారుండును, జ్యేష్ఠపుత్రికయగు హరియలె యనునామెయు, ఆమెచెల్లెండ్రును జైనులనియే చెప్పఁబడుచున్నారు. మఱియుఁ దలకాడు ముట్టడించి వశపఱుచుకొని శైవులయిన చోడచక్రవర్తులచే నాశనముచేయఁబడిన జైనదేవాలయములు పెక్కింటిని పునర్నిర్మాణము చేసినవాఁడును విష్ణువర్ధనుని సైన్యాధ్యక్షుఁడును, మహాయోధుఁడు నగు గంగరాజు జైనులకు జైనమతమునకు మాత్రమే గాక రాజునకును గొప్ప ప్రాపుగ నుండెనని చెప్పఁబడి యున్నది. ౧౧౩౩-వ సంవత్సరమున సైన్యాధిపతి యగుగంగరాజు మరణము నొందఁగా వాని కొమారుఁడు బొప్పరాజు హాలెవీడులో తండ్రి జ్ఞాపకార్థము దోహఘురట్ట మను జైనాలయమును నిర్మించెను. ప్రతిష్ఠాపనకాలమునందు నయకీర్తియను జైనాచార్యుఁడు దివ్య ప్రసాదమును రాజునకుఁ బంపఁగా వెంగాపురము నేలు మాసన్నపై దండెత్తిపోయి వాని నోడించి విష్ణువర్ధనుఁడు మఱలివచ్చుకాలమున నడిత్రోవలో వానిరాణి లక్ష్మీదేవి ప్రసవించి కుమారునిఁ గన్న సమయమునఁ బ్రసాద మందెను. కాఁబట్టి రాజు సంతోషపూర్వకముగా జైనమత గురువుల నాదరించి ప్రసాదమును స్వీకరించెను. జైనమతాచార్యుల శుభాగమనమునకు మిక్కిలి సంతోషించి తనకుమారునకు విజయనరసింహుఁ డని పేరుపెట్టి నూతన జైనాలయములోని దేవుని విజయపార్శ్వనాథుఁ డనవలసినదిగా నుత్తరువు చేసెను. హోసలేశ్వరుని మహాలయమునకు నెదురుగ నన్నూట నలుపదిగజముల దూరములోనున్న యీజైనాలయ మిప్పటికిని జైనయాత్రికులచే దర్శింపఁబడుచున్నది. ఇట్టి చరిత్రాంశములు విష్ణువర్ధనుఁడు జైనులను వధించె ననిదెల్పెడు స్థలపురాణ గాథలను వైష్ణవమత గాథలను బూర్వపక్షము చేయుచున్నవి. క్రీ. శ. ౧౧౧౭ సంవత్సరమున విష్ణువర్ధనుఁడు వైష్ణమతమును స్వీకరించె నని హాలె

వీడులోని యొక శాసనము దెలుపుచున్నది. ఈ విషయము లన్నిటిని సమన్వయించుకొనుట కష్టసాధ్యముగ నుండును. ఏది యెట్లున్నను ఆకాలమున జైను లనేకులు వైష్ణవమతములోఁ జేర్చుకొనఁబడి రనుమాట సత్యము. జైనులను బౌద్ధులను మాత్రమేగాక, తక్కువజాతివారల ననేకులను వైష్ణవులను గావించెను.

### రామానుజుఁడు-తిరునారాయణపురము-మాలమాదిగలు.

బౌద్ధులు వాదములందుఁ గెలువలేక క్రోధోన్మదులై విష్ణ్వాలయంబుల కపాయంబు లాపాదింప నుద్యుక్తు లయినప్పుడు రామానుజుఁడు మాలమాదిగలచే వారలంబట్టి జాతిగానుగలలోఁ బెట్టించి నిశ్శేషముగా నురుమాడించి తన కుపకారముచేసిన యాపంచముల యెడఁ బ్రసన్నుఁడై ప్రతివత్సరంబునందును శ్రీనారాయణదేవుని మహోత్సవకాలమున నేడవదినంబు మొదలుకొని తొమ్మిదవ దినంబు దినత్రయంబును వారలు దేవాలయములోని బలిపీఠము నలు కరుదెంచి కైంకర్యాదు లొనర్చి సేవించు నట్లాజ్ఞాపించె నని ఆచార్య రత్నహారము మొదలగు గ్రంథములలో వ్రాయఁబడినది.

రామానుజుఁడు తనకుమారుఁడైన సంపత్కుమారునితో ఢిల్లీ నగరమునుండి వచ్చునప్పుడు దారిదోపిడికాండ్రచే ముట్టడింపఁబడి చిక్కువడియున్న కాలమున మాలల సాహాయ్యముచేఁ దా నపాయమునుండి తప్పించుకొన్నందులకుఁ బ్రత్యుపకారముగా మాలలకీ స్వాతంత్ర్యము నొసంగెనని ప్రపన్నామృతమను గ్రంథమునందు వ్రాయఁబడినది. ఇట్టి స్వాతంత్ర్యము మేలుకోటలో మాత్రమేగాక బేలూరు శ్రీరంగ దేవాలయములలోఁగూడ సంవత్సరమున కొకమాఱు కలుగఁజేయఁబడినది. ఆ కాలమునఁ బంచములు బ్రాహ్మణులను దాఁకినను బ్రాహ్మణు లపవిత్రతయని తలంపరఁట! 1

1. The Life and Teachings of Sri Rsmanuja by C. R. Srinivasa Aiyangar, p. 224.

## రామానుజుని గ్రంథరచనము-మతవ్యాప్తి.

రామానుజుఁడుగూడ శంకరాచార్యునివలెనే వ్యాసవిరచిత బ్రహ్మసూత్రములకును, ఉపనిషత్తులకును, భగవద్గీతలకును, భాష్యములను వ్రాసెను. ఈ సంస్కర్తచే విరచింపఁబడిన బ్రహ్మసూత్ర భాష్యమును శ్రీభాష్య మనెదరు. ఇతఁడు నయమునను భయమునను తన మతమును వ్యాపింపఁ జేసెను. ఇంతకుఁ బూర్వము శివస్థలముగా నుండిన తిరుమలదేవాలయము నాక్రమించుకొని విష్ణ్వాలయముగ మార్చెను. చోడచక్రవర్తి మరణమునొందిన తరువాత శ్రీరంగము మొదలగు వైష్ణవ క్షేత్రములకుఁజని మతబోధ గావించుచుండెను. కులోత్తుంగ చోడచక్రవర్తి కుమారుఁడు విక్రమచోడుఁడే తండ్రి మరణానంతరము రామానుజుని తనదేశమునకు రప్పించి యాదరించెను. ఈతని సంప్రదాయమును విశిష్టాద్వైత మనియెదరు. ఈ సంప్రదాయమువారిని శ్రీవైష్ణవు లని చెప్పుదురు. ఈతఁడు బౌద్ధమతాచారములను బెక్కింటిని గ్రహించి తన వైష్ణవమతమునందుఁ జొప్పించి మతవ్యాపనము గావించెను. ఇతఁడు ౧౨౦ సంవత్సరములు జీవించి వైకుంఠపదవి కేఁగె ననిచెప్పుదురు.

## విక్రమాదిత్యుఁడు.

క్రీ-శ. ౧౧౧౮-వ సంవత్సరమున చోడచక్రవర్తి యగు కులోత్తుంగ చోడదేవుఁడు మరణము నొందెను. వేఁగిదేశమునకు రాజప్రతినిధిగ నుండిన విక్రమచోడుఁడు ద్రావిడదేశమునకుఁ బోయి సింహాసన మెక్కెను. విక్రమచోడుఁడు వేంగిదేశమును విడిచిపెట్టిన తరువాత నాతనికి దక్షిణమున బల్లాలరాజువలనఁ జిక్కులెక్కువై నందున వేఁగిదేశము విషయమై శ్రద్ధలేక యుండెను. ౧౧౨౦ వ సంవత్సరమున పశ్చిమచాళుక్యుఁ డగు విక్రమాదిత్యుఁడు వేంగిదేశ

ముపై దండెత్తివచ్చి వశపఱుచుకొనియె నని యాంధ్రులచరిత్రము ప్రథమభాగమునఁ జెప్పియున్నాఁడను. ఇతఁ డాంధ్ర దేశము జయించి నాలుగయిదు సంవత్సరములు పరిపాలనము చేసెను. ఆకాలము నందు విక్రమాదిత్యుఁడు, వెలనాటిచోడుని కుమారుఁడును మహామండలేశ్వరుఁడు నగు వెలనాటి రెండవగొంకరాజును రాజప్రతినిధిగ నియమించెను. ఈపశ్చిమచాళుక్య చక్రవర్తి ౧౧౨౬ - వ సంవత్సరమున మృతి నొందెను. చోడచక్రవర్తి యగు కులోత్తుంగుని మరణముతో చోడసామ్రాజ్యముయొక్కయు, విక్రమాదిత్యుని మరణముతో చాళుక్యసామ్రాజ్యముయొక్కయు, వైభవము క్షీణింపనారంభించెను. విక్రమాదిత్యునికిఁ బిమ్మట భూలోకమల్లుఁడు సింహాసనమునకు వచ్చెను. విక్రమాదిత్యుని మరణానంతరము వానికి సామంతులుగ నున్న మహామండలేశ్వరులలో నొక్కఁడగు కాకతీయప్రోలరాజు ఆంధ్రసామ్రాజ్య భవననిర్మాణమునకై పునాదినుంపఁ ప్రయత్నించుచుండెను. ఇతని చరిత్రము మఱియొక ప్రకరణమునందుఁ దెలుపఁబడును గావున నిచ్చట వివరింపలేదు. క్రీ. శ. ౧౧౨౭-వ సంవత్సరముననే విక్రమచోడుఁడు వెలనాటిని మఱల స్వాధీనము జేసికొన్నట్లు విక్రమచోడుని చేబ్రోలుశాసనమువలనఁ దెలియుచున్నది. అయినను ఆంధ్రదేశములోని పశ్చిమభాగమున నున్న మహామండలేశ్వరు లందఱును పశ్చిమచాళుక్య చక్రవర్తులకే కప్పము గట్టుచుండిరి.

## భద్రభూపాలుఁడు.

భువనైకమల్లునకుఁ గప్పముగట్టుచుండిన సామంత ప్రభువులలో నొక్కఁ డగు భద్రభూపాలుఁడు షట్సహస్రదేశ మనియెడు నాఱువేలనాటిని బరిపాలనము చేయుచుండెను. వీనికి రాజరాజమనోజ్ఞు డనియు, దశదిశాభరణాంకుఁ డనియు, నరేంద్రచతురాననుఁ

కనియు, రాజబిరుదములు గలవు ఇతఁడు రవికులశేఖరుం డని చెప్పఁబడుటచేతఁ దెలుఁగు చోడులలోనివాఁడై యుండవచ్చును. ఇతఁడు తెనుఁగునఁ బద్యకావ్యములు వ్రాసి కవిరాజశిఖామణి, కవిబ్రహ్మ, అని పొగడ్తఁగాంచినవాఁడు. ఇతఁడు వ్రాసిన గ్రంథములలో నీతిశాస్త్రముక్తావళియును, సుమతిశతకమును మాత్రము గానిపించుచున్నవి.

కం. శ్రీవిభుఁడ గర్వితారి
క్ష్మావరదళనోపలబ్ధ జయలక్ష్మీ సం
భావితుఁడ సుమతిశతకము
గావించినప్రోడఁ గావ్యకమలాసనుఁడన్.

అని తన నీతిశాస్త్రముక్తావళిని ప్రారంభించెను. ఇతనికవిత కుమారసంభవమువలెఁ గఠినముగాక ద్రాక్షాపాకముగ నతిసరళముగా నుండుననియు, భావములు నూతనములై హృదయంగమములుగా నుండు ననియు నుడువుచు, బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ. గారు రెండుపద్యములను ఆంధ్రపత్రికయందు నుదాహరించి యున్నారు.[1]

ఉ. ఎత్తినకాలె కాని సిరి కెన్నఁడు నిల్చినకాల నిల్వఁగాఁ
జిత్తము లేదు గాన సిరిఁ జెందినవాఁడ పరోపకారమా
* యత్తతఁ జేయు మెవ్వరైనఁబదంపడి వేఁడఁ గొందఱున్
చిత్తమ కాని యిత్త మనుచిత్తము పుట్టునె యెట్టివారికిన్.

1. సాధారణనామ సంవత్సర చైత్రశుద్ధ ప్రతిపత్ భానువాసరంబునఁ బ్రకటితం బయిన యాంధ్రపత్రిక సంవత్సరాదిసంచిక ౧౬౬ దవ పుటములో నీక్రింది రెండు పద్యము లుదాహరించి యున్నారు.

* ఈ పాదమున గణభంగము గానిపించు చున్నది.

చ. అలుకప్రతాపమీఁగి యలవాలము బుద్ధిపరాపవాదముల్
పలుకుట ప్రొద్దుపోక ప్రజబాధదలంపమి పెద్దప్రల్లదం
బలవు వికారమొప్పు వినయంబుమహత్త్వము చేటుబొంకువా
గ్బలము జఘన్యులైన నరపాలురకుం బరపక్షభైరవా.

చాగి బేతరాజు.

బిరుదాంక రుద్రుఁడను నామాంతరముగల చాగిబేతరాజు పల్నాటికి బ్రభువై భూలోకమల్లునకుఁ గప్పము గట్టుచుండెను. ఇతఁడు హైహయవంశజుఁడు. ఈరాజు కామనూరు గ్రామవాస్తవ్యుఁడును ఋగ్వేదపదపాఠియు నగు నొక బ్రాహ్మణునిచే మాధవి1పట్టణమున ప్రతిష్ఠింపఁబడిన త్రిమూర్తి (బ్రహ్మ విష్ణు మహేశ్వర) దేవాలయమునకు శాలివాహనశకము ౧౦౫౧ సౌమ్యసంవత్సరమున (క్రీ. శ. ౧౧౨౯—30) దానశాసనమును వ్రాయించెను. ఈశాసనము వ్రాయఁబడిననాగస్తంభముగూడ నాకాలమునందే ప్రతిష్ఠింపఁబడినది. ఈ శాసనములోని మొదటి రెండు శ్లోకములలో "శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు, కర్కోటకుఁడు, అబ్జుఁడు, మహాంబుజుఁడు, శంఖధరుఁడు, కులికుఁడు" అనెడు అష్టనాగములం గూర్చిన ప్రార్థన గలదు. పల్నాటిలోని మాచర్లగ్రామము (మాధవిపట్టణము) లోని చెన్నకేశవస్వామి దేవాలయములో మఱియొక నాగస్తంభముపై నింకొకశాసనము పండ్రెండవ శతాబ్ద ప్రారంభమునాఁటిది గలదు. ఆశాసనమునందును అష్టనాగములను గూర్చిన ప్రార్థనము గలదు. పల్నాటికి రాజధాని యగు మహాదేవీతటాకము2నందు నొకానొక

1. మాధవి పట్టణము దెనుఁగులో గురిందివిదస్థలమనియు, గురిజాల యనియుఁ జెప్పఁబడు చున్నది.

2. మహాదేవీ తటాకము మాదేవిచెఱువు, మాదేవిచెర్ల, మాచర్ల, యని చెప్పబడుచున్నది.

యాదిత్యునిచే నాదిత్యేశ్వర దేవాలయము నిర్మింపఁబడినది. చంద్ర కులమునందు జనించిన కార్తవీర్యార్జునుని వంశమునందుఁ బుట్టిన చాగి బేతరాజు నలువురు కుమారులలోను రెండవవాఁడగు వీర కాముని కొమారుఁడు బేతరాజు దీనికి భూదానము చేసియుండెను. ఈ యాదిత్యేశ్వరాలయమునకు దానశాసనములను వ్రాయించిన వారిలో నొకానొక కన్నడ నాగిమయ్య కలఁడు. ఈ శాసనములోని లిపిని వ్రాసినవారుకూడ కన్నడము వారే. శాసనము దిగువ వారి నామములు కన్నడభాషలో వ్రాయఁబడినవి. ఈ విషయములు పశ్చిమ చాళుక్యుల యధికారము కొంతకాల మీ దేశమున వ్యాపించె నని చాటుచున్నవి.

## విశ్వబ్రాహ్మణులు.

మఱియు నీ మాచెర్ల శాసనమునందు నింకొక విశేష విషయము గలదు. ఆదిత్యేశ్వర దేవాలయమును నాగస్తంభమును నిర్మించిన శిల్పకారులు కొనియాడఁబడి యున్నారు. బ్రహ్మకుమారుఁ డయిన విశ్వకర్త యీ శిల్పకారులకు మూలపురుషుఁ డనియు, సూర్యుని మామగారనియు, విశ్వకర్మ తనయల్లుఁడైన సూర్యునికి కిరణములను విష్ణుచక్రము మొదలగు దివ్యాయుధములుగా మార్చె ననియుఁ జెప్పఁబడినది. విశ్వకర్మవంశస్థు లయిన ప్రసిద్ధాచార్యులు కొందఱు పేర్కొనఁబడి, వారు శివలింగములను విగ్రహములను చేయు టయందును, వాని వాని స్థానములను గుర్తెఱుఁగుటయందును, చతుర్విధము లయిన ప్రాసాదములను నిర్మించుటయందును, వాస్తు శాస్త్రములోనొక భాగమగు క్షేత్రగణిత జ్ఞానమునందును, వారల వృత్తికి సంబంధించిన పెక్కువిషయముల యందును నేర్పుగలనియుఁ బ్రజ్ఞావంతు లనియుఁ జెప్పబడి యున్నారు.

## భూలోకమల్లుఁడు.

భూలోకమల్లుఁ డనునది బిరుదనామమేకాని నిక్కమైన పేరుగాదు. ఇతని మొదటిపేరు సోమేశ్వరుఁడు. పశ్చిమ చాళుక్య చక్రవర్తులలో సోమేశ్వర నామమును వహించిన వారిలో నీతఁడు మూఁడవవాఁడు. ఇతఁడు ౧౧౨౭ వ సంవత్సరము మొదలుకొని పదునొకొండు సంవత్సరములు అనఁగా ౧౧౩౮ వ సంవత్సరము వఱకుఁ బరిపాలనము చేసియుండెను. ఇతఁడు (ద్రావిడాంధ్ర) మగధ నేపాలరాజులను జయించి పొగడ్తగాంచెనని తెలియుచున్నది. 1 ఇతఁడు సంస్కృతమున మానసోల్లాసము, లేక, అభిలషితార్థచింతామణి యను మహాగ్రంథమును రచించెను. ఇందు రాజధర్మములను గూర్చియు, ప్రజాధర్మములను గూర్చియు నానావిధ విషయములను గూర్చియు, వ్రాయఁబడియున్నది. అనఁగా-రాజనీతి, రాజ్యాంగము, జ్యోతిషము,నవగ్రహఫలములు,భాషలు, శాస్త్రము,కావ్యము, సంగీతము,చిత్రలేఖనము, శిల్పచాతుర్యము, అశ్వశిక్ష, గజశిక్ష, మల్లయుద్ధము, మొదలగు వానింగూర్చిన విశేషాంశములు గలవు. ఇట్టి మహాగ్రంథమునీతఁడు రచించుటచేతనే,సర్వజ్ఞభూపుఁడనుబిరుదమును గాంచెను.ఇతఁడు సింహాసన మధిష్ఠించిన నాలుగవ సంవత్సరమున నీ మహాగ్రంథమును రచించెను. ఇతనికి తరువాత నీతని కుమారుఁడు జగదేక మల్లుఁడు ౧౧౩౮- దవ సంవత్సరమున సింహాసన మెక్కెను. ఇతఁడు పండ్రెండు సంవత్సరములు పరిపాలనము చేసెనుగాని, యీతని కాలమునందలి విశేషాంశము లేవియు గానరావు.

## త్రైలోక్యమల్లుఁడు.

జగదేకమల్లుని సోదరుఁడగు త్రైలోక్యమల్లుఁడు శాలివాహన శకము ౧౦౭౦ ది యగు ప్రమోదూత సంవత్సరమున సింహాసన

1. Jour. B. B. R. A. S., Vol-XI., p. 268.

మెక్కెను. ఈ సోదరు లిరువుర పరిపాలన కాలమున వీరికి లోఁబడి యుండిన మహామండలేశ్వరులు కొందఱు నిరంకుశాధికారులై వీరి యధికారమును ధిక్కరించిరి.

## బిజ్జలుఁడు రాజ్యమాక్రమించుకొనుట.

కాలచుర్యుఁడును హైహయాన్వయుఁడు నగు బిజ్జలుఁడు చాళుక్యుల బలహీనతను దెలిసికొని, చాళుక్య సామ్రాజ్యము నాక్రమించు కొనఁగోరి తక్కిన మహామండలేశ్వరులతో మైత్రిం బాటించి కృతకృత్యుఁ డయ్యెను. ఇతఁడు త్రైలోకమల్లుని యొక్క యుద్ధమంత్రిగను, దండనాయకుఁడుగను నుండెను. ఇతని ప్రయత్నమునకు కొల్లాపుర మహామండలేశ్వరుఁడగు విజయార్కుఁడును, మహామండలేశ్వరుఁడును త్రైలింగ్య సామ్రాజ్య స్థాపకుఁడునగు కాకతీయ ప్రోలాజును, దోడ్పడి, ఇతనికి విజయమును సిద్ధింపఁ జేసిరి. కాకతీయ ప్రోలరాజు త్రైలోక్యమల్లుని నోడించి యతని చెఱఁ బెట్టి ౧౧౫౭ వ సంవత్సరమున విడిచి పుచ్చెను. త్రైలోక్యమల్లుఁడు కళ్యాణపురమును విడిచిపెట్టి ధార్వాడ మండములోని యన్నిగేరికిఁ బోయి కొంత కాలము వఱకు దానినే రాజధానిగఁ జేసికొనియెను గాని, యాతనిరాజ్యము మిక్కిలి క్షీణించిన దయ్యెను. క్రీ.శ. ౧౧౫౭ వ సంవత్సరమున బిజ్జలుఁడు రాజ్యమును వహించినట్లు దెలుపుశాసన మొకటి కలదుగాని, శాలివాహన శకము ౧౦౮౪( క్రీ. శ. ౧౧౬౨) వఱకు రాజబిరుదములేవియును వహింపక మహామండలేశ్వరుండుగనే యున్నట్లు కన్పట్టుచున్నది. ఇతఁ డాసంవత్సరమున త్రైలోక్య మల్లునిపై దండెత్తిపోయి తాను స్వతంత్రరాజు నని ప్రకటింపించెను. త్రైలోక్యమల్లుఁడను రెండవ తైలపదేవుఁడు అన్నిగేరినుండి మఱి కొంత దక్షిణముగా వనవాసికిఁబోయి యచ్చటనే నివసించు

చుండెను. 1 ఇతఁడు క్రీ-శ. ౧౧౬౬ వ సంవత్సరమువఱకుఁ బరిపాలనము చేసినట్లుగఁ గానిపించు చున్నది. 2

## కా ల చు ర్యు లు .

ఈ కాలచుర్యులు హైహయాన్వయులు. కార్తవీర్యార్జునుని సంతతివారమని చెప్పుకొను నొక తెగరాజులు. వీరు చేదిదేశమును బరిపాలించు చుండిన యొక రాజకుటుంబమువారు. కళ్యాణపురమును స్వాధీనము చేసికొని తైలపదేవుని తఱుమగొట్టిన బిజ్జలుఁడీ రాజకుటుంబములోని వాఁడే. హైహయాన్వయు లయిన యీ చేదిరాజులు కాలంజరపురవరాధీశ్వరులమని బిరుదనామమును వహించు చుండిరి. కనుకనే బిజ్జలుఁడును ఆబిరుదమునే ధరించి యుండెను. "ఈ బిజ్జలరాజు ౧౧౫౦ మొదలు ౧౧౬౨-వసంవత్సరమువఱకు రాజ్యము చేసిన (త్రైలోక్య) మల్లుని సేనాధిపతిగానుండి, ౧౧౬౨ వ సంవత్సరమున కళ్యాణపురాధీశ్వరత్వమును తానే యపహరించి, లింగాయత మతమును స్థాపించిన బసవేశ్వరుని తోఁబుట్టువగు పద్మావతియొక్క చక్కఁదనమునకు మక్కువగొని యామెను వివాహమాడి తన మంత్రినిగాఁ జేసికొన్న యా బసవేశ్వరునిచేతనే చంపబడెను." అని, నెల్లూరి మనుమసిద్ధి రాజుయొక్క పూర్వికుఁడయిన బిజ్జనయే యీ బిజ్జలుఁడని యభిప్రాయపడి శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవులచరిత్రయం దట్లు వ్రాసియున్నారు.3 మనుమసిద్ధిపూర్వికుఁడయిన బిజ్జన సూర్యవంశపు రాజు. కళ్యాణపురాధీశ్వరుఁ డయిన బిజ్జలుఁడు చంద్రవంశపురాజు. కావున వీరిరువురకు నేవిధమైన సంబంధమును లేదు. ఈ బిజ్జలరాజు చాళుక్యరాజ్య మపహరించిన

---

1. Jour. R. A. S., Vol. IV., p, 16.
2. P. S & O. C. Ins. No. 140.
3. ఆంధ్రకవుల చరిత్రము, ప్రథమభాగము, పుట ४४.

వాఁడనుమాటయే నిలిచి యుండెను. మఱియు నితఁడుగాని, ఈ తని తరువాతవారుగాని, చిరకాలము రాజ్యఫలము లనుభవించి సుఖతరంబుగఁ జీవింపకపోవుట యటుండ, నచిరకాలములోనే స్వకుటుంబ పరివారసహితముగ నాశనముకూడ గావలసి వచ్చెను.

## మత విప్లవము.

దక్షిణ హిందూస్థానమున మున్నెన్నఁడును గని విని యెఱుంగ నట్టి మతవిప్లవము సంప్రాప్తమయ్యెను. వైష్ణవము వీరవైష్ణవమై విజృంభించుచుండెనని యిదివఱకే తెలిపియున్నాఁడ. స్మార్తమత మొకప్రక్కను, వైష్ణవమత మొకప్రక్కను, జైనమతము వేఱొక ప్రక్కను అభివృద్ధి నొందుచుండ, శైవమతము క్షీణించుటకుఁ బ్రారంభించెను. కాఁబట్టి శైవమతముగూడ నుద్ధరింపఁబడుటకు గొప్ప సంస్కారణకర్త యెదురు చూడఁబడు చుండెను. అతఁడే బసవేశ్వరుఁడు.

## శైవమతోద్ధారకుఁడైన బసవేశ్వరుఁడు.

శైవమతోద్ధారకుఁ డయిన బసవేశ్వరుని చరిత్రము తెలుఁగు బసవ పురాణమునందును, కన్నడ బసపురాణమునందును, అత్యద్భుతముగా వర్ణింపఁబడినది.1 బసవేశ్వరుఁడు శ్రీశైలమునకు పశ్చిమమున నుండు హింగుళేశ్వరాగ్రహారమునందు నివసించుచుండిన

1. తెలుఁగు బసవపురాణమును పాలకుఱికి సోమనాథకవి ద్విపదకావ్యముగా రచించి యున్నాఁడు. ఇతఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలములోనివాఁడు. కన్నడ బసవపురాణమును రచించినవాఁడు భీమకవి. ఇతఁడు దేవరాయల కాలములో నుండుటచేతను, తన గ్రంథమునందు పాలకుఱికి సోమనాథుని పేర్కొని యుండుటచేతను ఆంధ్రబసవపురాణమే మొదటిదిగా నూహింపఁదగి యున్నది.

శివభక్తుఁడైన మండంగి మాదిరాజను బ్రాహ్మణునికి జనించెను.[1] ఈబసవరాజు శివుని వాహనమైన నందియొక్క యంశముచేత భూమి మీఁద నవతరించె నని వీరశైవులు విశ్వసించుచున్నారు. కళ్యాణ పురాధీశ్వరుఁడైన బిజ్జలరాయనికడ బసవరాజునకు మేనమామయైన బలదేవుఁడు ప్రధానమంత్రిగ నుండెను. బసవరాజు తల్లిదండ్రులగు మదాలాంబికయు మాదిరాజును చిరకాలము తమకు సంతానము లేమిచే నొకనాఁడు సంతానార్థమై తమ కులదేవుఁ డగునందీశ్వరునికి మిక్కిలి భక్తితో ముడుపు గట్టిరఁట. తమ మతాచరణ విధుల ప్రకారము పూజార్చనలు ముగించిన తరువాత నందీశ్వరుఁడు ప్రత్యక్షమై మీకోరిక ఫలించు నని చెప్పి యంతర్థాన మొందెనఁట. మదాలాంబిక గర్భమున నందీశ్వరుఁ డుదయించి మూఁడు సంవత్సరములు గర్భముననే యుండుటచేత నాసాధ్వీమణికి గర్భవేదన యధికమయ్యెను.ఆవేదన భరింపఁజాలక ఆయమ నందినాథుని యాలయమునకుఁ బోయి ప్రార్థించెను. ప్రార్థనాదికము ముగిసిన తరువాత నామె యింటికి మరలిపోయి సుఖనిద్రఁ జెందెను. నిద్రలో నామెకు నందీశ్వరుఁడు ప్రత్యక్షమై నీగర్భమున వసించి యున్నపుత్త్రుఁడు నాయవతారమే యనియు, వీరశైవమతస్థాపనకై పంపఁబడినవాఁ డనియు, నతనికి బసవ (వృషభశబ్ద భవము బసవ) నామము పెట్టవలసిన దనియు, చెప్పి యదృశ్యుఁ డయ్యెనఁట. పిమ్మట నామె పుత్త్రినిఁ బ్రసవించినతోడనే యతఁడు లింగధారియై కన్పట్టెనఁట. ఏలయనఁగా గర్భమునందే శివుఁ డతనికి శైవమతముపదేశించుటచేత నీరీతిగా జనించెను. తరువాత బసవేశ్వరుఁ డెనిమిదేండ్ల ప్రాయము లోపలనే సమస్తవిద్యలను నేర్చి మతజ్ఞానమును సంపూర్ణముగాఁ బడసెను.

---

1. కన్నడ బసవపురాణమునందు బసవరాజు కాలడిగి జల్లాలోని భాగేవాడి గ్రామమున జనించినట్లు చెప్పబఁడినది.

ఎనిమిదవయేఁట నతని తల్లిదండ్రులు తమబంధువుల నందఱను బిలువఁబంచి యతని కుపనయనము చేయఁ బ్రయత్నింపఁగా నాతఁడు తండ్రినిజూచి "నాయనా! నేను శివపూజాధురంధరుఁడను; బ్రహ్మ వంశమునకు సంబంధించిన వాఁడను గాను; నేను వర్ణవృక్షచ్ఛేదనమున కుఠారమునంటివాఁడను. నాకు వర్ణభేదముతో నిమిత్తములేదు." అని నిశ్శంకగాఁ బలికెను. అంత ఉపనయన మహోత్సవమునకు విచ్చేసిన యాతని మేనమామయు బిజ్జలుని మంత్రియు నగు బలదేవయ్య మేనల్లుని వర్తనమున కద్భుతపడి మెచ్చుకొని తరువాత తన కొమార్తె గంగాదేవి నిచ్చి వివాహము చేసెను.

వీరశైవసిద్ధాంతము.

రామానుజునివలెనే బ్రాహ్మణమతమును నిరాకరించి నూతన మతసిద్ధాంతమును బోధించుటచేత బ్రాహ్మణులు బసవేశ్వరుని వేధింప మొదలుపెట్టఁగా, నతఁడు స్వగ్రామమును విడిచి మఱియొక స్థలమునకుఁ బోవలసి వచ్చెను. ఒకనాఁడు బసవేశ్వరుఁడు సంగమేశ్వరాలయమునకుఁ బోయి పూజ చేయుచున్న కాలమున, శివుఁడు ప్రత్యక్షమై అద్భుతములును అగమ్యములు నైన సిద్ధాంతములను బోధించి యిట్లనియెను. "నీకు మాయెడఁ గల భక్తిని దెలిసికొంటిమి; శివవేషధారు లయిన జంగములను శివుని యవతారము లని గ్రహించి సత్యమైన మతము ననుష్ఠింపుము; నీవు చేయునట్టి కర్మములయందు వారి ననుసరింపుము; వారు నిన్ను తిట్టినను గొట్టినను వారికి సాష్టాంగ ప్రణామంబు లాచరింపుము; వీరశైవు లయినయెడ వారు నీకు శత్రువులయినను వారిపట్ల మిత్రులభంగివర్తింపుము; లింగాయతులను దూషించువారిని శిక్షించుచు నామతమును వ్యాపింపఁ జేయుటకుఁ బ్రయత్నింపుము; శివున కర్పింపక యేవస్తువును

భుజింపకుము; పరధన పరదారాపేక్షకుఁడవు గాకుండుము; ఇంద్రియా ధీనుఁడవుగాక దృఢమైన హృదయము గలిగియుండుము; జంగముఁడ నేనే యని యెఱుంగుము. లింగాయతులను నీవు గాంచినప్పుడు వారికి నమస్కరింపుము; ఎల్లప్పుడును శివుని స్మరించుచుండుము; సత్యమును వచింపుము; సత్కార్యము లాచరింపుము" అని యుపదేశించి బసవుని కౌఁగిలించికొని యదృశ్యుఁ డయ్యెనఁట! శివుఁ డీవిధముగాఁ దన కుపదేశించిన మతసిద్ధాంతములను బ్రజలకు బోధించుచు నితఁడు వీరశైవమతమును వ్యాపింపఁ జేయుచుండెను. అనేకు లీతని మతము నవలంబింప సాగిరి, బ్రాహ్మణులు భయపడి యితనిజోలికిఁ బోవుట మానిరి.

## బసవేశ్వరుఁడు మంత్రియగుట.

తరువాత కొంతకాలమునకు బలదేవుఁడు మృతినొందెను. అప్పుడు రాజగు బిజ్జలుఁడు బలదేవుని బంధువర్గమును రప్పించి మంత్రిపదవి కర్హు లెవ్వరని యడుగఁగా వారామహాపదవి వహించుటకు బలదేవుని యల్లుఁడగు బసవరాజు యోగ్యుఁడని విన్నవించిరి. బిజ్జలుఁడు దాని నంగీకరించి తనయుద్దేశమును దెలుపుటకు బసవరాజు కడకు కొందఱు మంత్రులను బంపెను. వారు కప్పడి గ్రామమునకు విచ్చేసి రాజుసందేశమును బసవేశ్వరునకుఁ దెలియఁ జెప్పఁగా; నాతఁడు మొట్టమొదటఁ దన కాపని యక్కఱ లేదని చెప్పెను. ఆవచ్చిన వారు ఈపదవి శైవమతవ్యాప్తికనుకూలముగ నుండు నని విన్నవించి కైకొనవలసిన దని ప్రార్థింపఁగా, నంగీకరించి కళ్యాణపురికిఁ బోయెను. అతని జ్యేష్ఠసోదరి నాగలాంబికయు నతనితోఁ గూడ నుండెను. ఇతఁ డాపట్టమునకుఁ బోయినప్పుడు బిజ్జలుఁడు పౌరజనంబులతో నెదురువచ్చి యేనుఁగును దిగి స్వాగతమిచ్చి యాస్థానమునకుఁ గొనిపోయి ప్రధానమంత్రిపదమున మాత్రమే గాక, సైన్యాధ్య

క్షునిగను ధనాగారాధ్యక్షునిగను, నియమించెను. ఇతఁడు మహా రాజునకుఁ దరువాత మహారాజువలె, తన యధికారము రాష్ట్రము నందంతట నెఱపుచుండెను.

### బిజ్జలునికిని బసవేశ్వరునికినిఁ గల సంబంధము.

బిజ్జలుఁడు తన చెల్లెలగు నీలలోచనయను నామెను బసవేశ్వరునకిచ్చి వివాహముచేసెనని బసవపురాణమునందుఁ జెప్పఁబడినది. అయినను జైనులు వ్రాసిన బిజ్జలరాయని చరిత్రమునందు మఱి యొకవిధముగాఁ దెలుపఁబడినది. బసవేశ్వరునకు మిక్కిలి యందకత్తె యగు పద్మావతియను చెల్లెలు కలదఁట. బిజ్జలుఁడామెను మోహించి వివాహము చేసికొనియెనఁట. 1 ఇందేది సత్యమైనను బసవేశ్వరునకును బిజ్జలునకు బాంధవ్యము కలదనుట కేయాక్షేపణమును లేదు.

### బసవేశ్వరునికి బిజ్జలునితోడి విరోధము.

ఇట్టి మహోన్నతపదవికి బసవేశ్వరుఁడు వచ్చినను తన మతమును తన దేవుని మఱవలేదు. ఇతఁడనేకకాద్భుత కార్యముల నెఱవేర్చినట్లుగ బసవ పురాణము పేర్కొనుచున్నది. ఇతనికి చెన్న బసవయ్య యను మేనల్లుఁడు కలడు. ఈ చెన్నబసవయ్య నాగలాంబిక పుత్త్రుఁడు. ఇతనితోఁ గలిసి బసవేశ్వరుఁడు తన మతమును వ్యాపింపఁ జేయసాగెను. ఇతఁడు విషయాసక్తులయిన జంగమగురువులను రాజుయొక్క ధనముతోఁ బోషించు చుండెను. 2 ఇట్లు సర్వస్వాతంత్ర్యమును వహించి యక్రమముగా ధనాగారములోని ధనము నంతయు జంగాల పాలుచేయు చుండుటఁజూచి బసవేశ్వరునికి విరోధి యగు మంచన్నయను మఱియొకమంత్రి, బిజ్జ

1. Sir, W. Elliot's paper, Jour. R. A. S., Vol. IV., p. 20.
2. Jour B.B.R.A.S, Vol. VII. pp. 78 & 89.

లునకీసంగతిని దెలియఁ జేసెను. కొంతకాలము గడచునప్పటికి బిజ్జలునికి బసవేశ్వరునికిని విరోధము బలమయ్యెను. బిజ్జలుఁడు బసవేశ్వరునిఁబట్టి చెఱబెట్టఁ బ్రయత్నించెను. దీనిని తెలిసికొని బసవేశ్వరుఁడు తన యనుచరులతోఁ దప్పించుకొని పోయెను. బిజ్జలుఁడు కొందఱ భటుల నతనివెంటఁ బంపెను బసవేశ్వరుడు. వారలను దఱిమెను. అంతట రాజు స్వయముగా సైన్యమును దీసికొని బసవేశ్వరునివెంటఁ దఱిమెను. వీరశైవు లనేకులు బసవేశ్వరునిపక్షమున నిలిచి ఘోరయుద్ధముచేసి రాజుసైన్యము నోడించిరి. తరువాత రాజు బసవేశ్వరునితో సమాధానము చేసి కొని యథాప్రకార మతనిని పూర్వపదవియం దుంచెను. 1 కాని యీ మైత్రి చిరకాలము నిలిచి యుండలేదు.

## బిజ్జలరాయని వధ.

బిజ్జలుఁడు బ్రతికియున్నంతవఱకుఁ దన మత మభివృద్ధిఁగాంచ నేరదని బసవేశ్వరుఁడు తలపోయుచుండెను. కళ్యాణపురమున బస వేశ్వరునికిఁ బ్రియభక్తులగు నిరువురు శైవులు గలరు. బిజ్జలుఁడు తన మతస్థులయినజైనులను ఆయిరువురును దూషించెడు దూషణవాక్యము లకు సహింపక నోపక వారికన్నుల నూడఁబెఱికించెను. ఈఘోరకృత్య మును బసవేశ్వరుని శిష్యు లయిన వీరశైవులందఱును విని, బిజ్జలు నిపైఁ బగదీర్చుకొనుతలంపుతో బసవేశ్వరుని యింట సమావేశమై నిర్ధారణచేసికొనిరి. అంతట బసవేశ్వరుఁడు బిజ్జలునిఁ జంపుటకై జగద్దేవుని కుత్తరువుచేసి కళ్యాణపురిని శపించుచు నాపట్టణమును విడిచిపెట్టి పోయెను. జగద్దేవుఁ డీక్రూరసంహారమునకు మొదట కొంత సంశయించెను గాని, తల్లి ప్రోత్సహించుటచే ధైర్య

1. Jour. R. A. S., Vol. IV., p. 21; Jour. B. B. R. A. S. Vol. VIII., p. 89.

సాహసములు ముప్పిరిగొనఁ దన మిత్త్రులగు మల్లయ్య బొమ్మయ్య యను వీరశైవుల నిరువురను దోడుచేసికొనఁగా, వీరావేశము మొలకెత్తఁ దిన్నఁగా నీముగ్వురు నంతఃపురమునకుఁ జని, రాజ పరివారమును ద్రోచికొనిపోయి బిజ్జలుని సమీపించి మహోద గ్రులై హరహరా యని ఖడ్గములు దూసి పైబడి యతనిని ముక్కలు చెక్కలుగఁ జెలగి పాఱవైచిరి. ఈకౄర సంహారకు లంతట నంతఃపురమున నుండనొల్లక సాహసవృత్తిచేఁ దప్పించు కొనివచ్చి వీథినిబడి తాముచేసినపనికిం గారణము చెప్పుచు కత్తులం ద్రిప్పుచు చెలరేఁగుచుండిరి.

ఘోరమైన మతయుద్ధము.

అంతట జైనులతోడను వీరశైవులతోడను నిండియుండిన యామహాపట్టణమున నీమహాఘోర సంహారవృత్తాంత మంతయు నొకక్షణములో వ్యాపించి సంక్షుభిత మయ్యెను. పౌరజనంబులు, జైనులును వీరశైవులు నను నిరుకక్షలం జేరి, ద్వంద యుద్ధము చేయఁ గడంగిరి. ఇట్లు మనుష్యులు మనుష్యులతోను, ఆశ్వి కులాశ్వికులతోను, గజాధిరూఢులు గజాధిరూఢులతోను, రథికులు రథికులతోను, బాలురు బాలురతోను, ఘోరముగాఁ బోరాడిరి. పట్టణమంతయు నెమ్ములరాసులతోను, మాంసపిండములతోను, నెత్తురు వఱదలతోను మునిఁగిపోయి, మిగుల భయంకరముగ నుండెను. బసవేశ్వరుఁడు సంగమేశ్వరక్షేత్రమునకుఁబోయి శివుని దేహములోఁ గలిసిపోయెను.[1]

1. Jour. B. B. R. A. S., Vol. VIII., p. 96; Wilson's Mackengie Mss. pp. 300--310.

## చెన్నబసవేశ్వరుఁడు.

జైనులు వ్రాసిన వృత్తాంతము మఱియొకవిధముగాఁ గన్పట్టుచున్నది. బిజ్జలుఁడు శిలాహార రాజగు రెండవభోజుని వశపఱుచుకొనుటకై కొల్లాపురముపై దండెత్తి పోయెను. దండయాత్ర ముగించి మరలి రాజధానికి వచ్చునప్పుడు భీమానది యొడ్డున నొకానొక ప్రదేశమున విడిసియున్న కాలమున బసవేశ్వరుఁ డొక జంగమునకు జైనవేషమును ధరింపించి విషపూరిత మైన యొకఫలము నిచ్చి యతనికడకుఁ బంపెనఁట. బిజ్జలుఁడు జైనుఁ డగుటవలన నను మానింపక యామాయవేషధారివలన నాఫలమును స్వీకరించి వాసన చూఁచి స్పృహతప్పి పడిపోయెనఁట. మాయవేషధారి యగు నాజంగమదేవర తప్పించుకొని పాఱిపోయెను. అంతట బిజ్జలుని కుమారుఁడు మొదలగువా రెల్లరును వచ్చిరి. బిజ్జలుఁడు కొంతసేపటికిఁ దెలివి నొంది, జరగినవృత్తాంత మంతయుఁ దెలిసికొని, తన కుమారుఁ డగు సోమేశ్వరునకు బసవేశ్వరునిఁ జంప నుత్తరువు చేసెనఁట. తత్క్షణమే యిమ్మడిబిజ్జలుఁడు బసవేశ్వరునిఁ బట్టుకొన వలసినదనియు, జంగము లెక్కడఁ గానిపించినను చంపవలసినదనియుఁ, దనపరివారమున కాజ్ఞచేసెను. ఈవార్త విని బసవేశ్వరుఁడు పాఱిపోయెను. ఇమ్మడి బిజ్జలుఁడు స్వసైన్యముతో నతనిని వెంబడించెను. బసవేశ్వరుఁడు మలయాళ దేశమునకుఁ బాఱిపోయి ఉళవి యనుప్రదేశమున దాఁగెనఁట. ఇమ్మడి బిజ్జలుఁ డా పట్టణమును ముట్టడించె నఁట. బసవేశ్వరుఁడు తప్పించుకొనువెఱవు లేక యొకబావిలోఁబడి మృతి నొందఁగా, నతనిభార్యయు విషముగ్రోలి ప్రాణత్యాగము చేసెనఁట. బిజ్జలుని కుమారుఁడు శాంతచిత్తుఁ డైన వెనుక బసవేశ్వరుని మేనల్లుఁ డగుచెన్నబసవయ్య తన మేనమామయాస్తి నంతయు వశ

పఱిచి యతనికి లోఁబడి యాతనిదయకుఁ బాత్రుఁడయ్యెనఁట.1 ఈ చెన్నబసవేశ్వరుఁడు లింగాయతులకు నాయకుఁడై బసవేశ్వరునికంటెను త్తమస్థితికి వచ్చి చక్కని కట్టుదిట్టము లేర్పఱిచి వీరశైవమతము నుద్ధరించెనఁట.2 వీరశైవమతమును బోధించుటకై ప్రణవ మీతని లోపల నావిర్భవించెను. చెన్నబసవపురాణమును బట్టి చెన్నబసవఁడు శివుఁ డనియు, బసవఁడు నందియనియు, బిజ్జలుఁడు ద్వారపాలకుఁ డనియు, కళ్యాణమే కైలాసమనియు, వీరశైవులు ప్రమథగణంబు లనియుఁ దేటపడుచున్నది.3,

## కాలచుర్య వంశము.

బిజ్జలుఁడు క్రీ. శ. ౧౧౬౭ వ సంవత్సరమునఁ జంపఁబడియెను. అప్పటినుండి బిజ్జలుని సంతతివారు ౧౧౮౩ వ సంవత్సరము వఱకును కళ్యాణపురమును బరిపాలించిరి. బిజ్జలుని తరువాత సోమేశ్వరుఁడు, సంకాముఁడు, ఆహవమల్లుఁడు నను కాలచుర్యరాజులు మూవురు పరిపాలించినట్లు కన్పట్టుచున్నది. శా. శ. ౧౧౦౫ (= క్రీ. శ. ౧౧౮౩) వ సంవత్సరమునఁ బశ్చిమచాళుక్య రాజగు నాలుగవ సోమేశ్వరుఁడు కాలచుర్యులనుండి తనపూర్వులు గోల్పోయిన భాగములను మరల స్వాధీనము గావించుకొనియెను. మఱికొన్ని భాగములను దేవగిరియాదవులును, కాకతీయాంధ్రులును, ఆక్రమించుకొనఁగా బిజ్జలునివంశ మంతరించినది.

---

1. Wilson's Mackengie Mss., p. 320.

2. మొట్టమొదట వీరశైవమతమును సంస్కరించి బోధించినవాఁడు ఏకాంతాద రామయ్య యనునాతఁడనియు, బిజ్జలుఁడు జైనుఁ డయినను వీరశైవులయెడ విరుద్ధముగాఁ బ్రవర్తింపలేదనియు, కొంతవఱకు సమ్మతిని గనఁబఱుచుచు వచ్చెననియు, నిజాముమండలములోని నిడుగల్లు శాసనము మొదలగువానివలనఁ దెలియుచున్నది. అయిన నీవిషయ మింకను బరిశోధింప వలసియున్నదని డాక్టరు ఫ్లీటుగారు వ్రాయుచుండిరి.

3. చెన్నబసవపురాణమును పిడుపర్తి సోమనాథకవి పద్యకావ్యముగా వ్రాసియున్నాఁడు.

## చాళుక్య పరిపాలనము.

ఈ నాలుగవ సోమేశ్వరునితోఁ జాళుక్య పరిపాలనముగూడ నడుగంటెను. ఈచాళుక్యుల పరిపాలమునం దచ్చటచ్చట కొందఱు వైశ్యులు మొదలగువారు బౌద్ధవిహారముల నిర్మించి దానధర్మములు మొదలగునవి చేయుచున్నను, అచ్చటచ్చట బౌద్ధమతసంబంధము లయిన చిహ్నములు గానంబడు చుండినను, బౌద్ధమతము క్షీణించిన దనియే చెప్పవచ్చును. వీరశైవమతోద్ధారణముతో జైనమతవిజృంభణ మణఁగిపోవుటయేగాక, క్రమక్రమముగా క్షీణింప నారంభించెను. వర్తకులు రాజకీయోద్యోగులు వీరశైవమత మవలంబించుటచే నామతము వ్యాపించుచుండెను. జైనవిగ్రహముల స్థానముల యందు బ్రాహ్మణులవిగ్రహములు ప్రతిష్ఠింపఁ బడుచుండెను. ఈ కాలమునందే దేశముయొక్క మతసాంఘికస్థితి సంపూర్ణముగా మాఱిపోవుటకు ప్రారంభ మైనది. మఱల పౌరాణికమతము విజృంభింప నారంభించినది.

## పౌ రా ణి క మ త ము.

---

### నిబంధన గ్రంథములు.

పురాతనమైన దేవతార్చనము వర్ధిల్లుచుండెను. న్యాయ విషయములు పురాణములలోను స్మృతులలోను వెదఁజల్లబడి చెదరి పోయి యుండుటచేతను, పరస్పర విరుద్ధములుగ నుండుటచేతను, వాని నన్నిటిని క్రోడీకరించి బ్రాహ్మణులను తదభిమానులగు రాజులచే నిబంధన గ్రంథములను వ్రాయింపవలసి వచ్చెను. న్యాయ. ధర్మశాస్త్ర విషయములందుఁ బెక్కుసందేహము లుప్పతిల్లుటచేత నిబంధన గ్రంథము లత్యావశ్యకము లయినవి. కాబట్టి యీ కాలమునందే యనేక నిబంధన గ్రంథములు వ్రాయఁబడినవి. ఈ గ్రంథ రచన పదునొకొండవ శతాబ్దము మొదలు పదునాలుగవ శతాబ్దాంతమువఱకు జరుగు చుండెను. ధారేశ్వరుఁడు, విజ్ఞానేశ్వరుఁడు, అప

రార్కుఁడు, హేమాద్రి, సాయణుఁడు, మొదలగు నిబంధన గ్రంథకారు లెందఱో గలరు.

## అనంతర రాజకీయస్థితి.

దక్షిణమున హోసలబల్లాలరాజులును, ఉత్తరమున దేవగిరి యాదవరాజులును, తూర్పునఁ గాకతీయాంధ్రులును ప్రబలియుండుట చేతఁ బశ్చిమ చాళుక్యరాజ్యము నాల్గవ సోమేశ్వరునితోనే యంతరింపవలసిన దయ్యెను. ఈ కాలమునందు హోసలరాజయిన వీర బల్లాలుఁడు గాఁగవాడి, నలంబవాడి, బనవాసి రాజ్యముల నాక్రమించుకొని, పరాక్రమ వంతుఁడై పరిపాలనము చేయుచుండెను. ఇతఁడు రామానుజుని శిష్యుఁడగు విష్ణువర్ధనుని మనుమఁడు. ఈ వీర బల్లాలరాజు కళ్యాణపురముపై దండెత్తివచ్చి నాల్గవ సోమేశ్వరుని సైన్యాధ్యక్షుఁడగు బొమ్మరాజు నెదుర్కొని యాతనిఁ గదనరంగమున నోడించి బిజ్జలునియొద్దనుండి గైకొన్న రాజ్యము నాక్రమించుకొనియెను. అటుపిమ్మట శౌణదేశమును బాలించుచుండిన భిల్లముఁడను యాదవరాజు విజృంభించి శాలివాహనశకము ౧౧౦౯ అనఁగా క్రీ శ ౧౧౭ వ సంవత్సరమున నంశల భూమిాశుని దగు శ్రీవర్ధనమను పట్టణమును ముటడించి ప్రత్యండక రాజును భండనమున నుక్కడంచి, మంగళవేష్టకరాజగు వజ్రినిఁ జక్కాడి, కళ్యాణ రాజ్యము నాక్రమించు హోసలయాదవుని ముందునకు జరిగి రానీక హద్దు నియమించి, కృష్ణానది కుత్తరభాగము నంతయు నాక్రమించుకొని, దేవగిరిని రాజధానిగఁ జేసికొని, పరిపాలనము చేయ సాగెను. కుంతలము అనఁగా దక్షిణ మహారాష్ట్రమును కర్ణాటమును విష్ణువర్ధనుని మనుమఁడు వీరబల్లాలరాజు పరిపాలనము చేయుచుండెను. త్రిలింగరాజ్యమును మొదటి ప్రతాపరుద్రుఁడు విస్తరింపఁ జేయుచుండెను. కళింగ గాంగ వంశజు లుత్కలరాజ్యమును గంగానది వఱకు వ్యాపింపఁ జేయుచుండిరి. వేఁగిదేశ మంతయు పేరునకు మాత్రము చోడచక్రవర్తులకు లోఁబడి యున్నను అనేక మండల

ములుగా విభాగింపఁబడి మహామండలేశ్వరు లయిన తెలుఁగుచోడుల చేతను, పల్లవులచేతను, చాళుక్యులచేతను, బరిపాలింపఁబడుచుండి తుదకు కాకతీయాంధ్ర సామ్రాజ్యమునకు వశమైపోయెను. పండ్రెండవ శతాబ్దాంతమునందు దక్షిణ హిందూస్థానమున నేకచ్ఛత్రాధిపత్యమును వహింపవలయునని పైమూఁడు సామ్రాజ్యముల వారును బోరాడుచునే యుండిరి. పండ్రెండవశతాబ్దిస్థితి సంగ్రహముగాఁ దెలిపితిమి గావున, నీ శతాబ్దమునందు మహామండలేశ్వరులుగనుండి కృష్ణానది మొదలుకొని కాంచీపురమువఱకుఁ బరిపాలించిన తెలుఁగుచోడరాజుల వంశములనుగూర్చి నాల్గవ సంపుటమునందు వివరముగా వ్రాసియున్నాఁడను.

## మధ్వాచార్యులు.

ఈశతాబ్దాంతమునందే మఱియొక సంస్కర్త బయలువెడలెను. ఇతఁడే ద్వైతమతస్థాపనాచార్యుఁడగుమధ్వాచార్యుఁడు. ఈమతాచార్యుని కనంతతీర్థు లని మొట్టమొదట నామకరణము చేసిరి. ఇతఁడు శాలివాహన శకము ౧౧౨౧ కి సరియైన క్రీస్తుశకము ౧౧౯౯ దవసంవత్సరమున దక్షిణ కన్నడములోని యుడిపిగ్రామమున జనించెను. ఇతని గురువుపేరు అచ్యుత ప్రేక్షుఁడు, తల్లిపేరు వేదవేది, తండ్రిపేరు మధ్యగేహభట్టు. ఇతఁడును శంకరరామానుజులవలెనే ప్రస్థానత్రయమునకు భాష్యములను వ్రాసి ప్రసిద్ధికెక్కెను. జీవేశ్వరుల కైక్య మెన్నఁడును లేదని యితని సిద్ధాంతమై యున్నది. దీనినే ద్వైతసిద్ధాంత మందురు. ఇది శంకరాచార్యుని యద్వైత మతమునకు విరుద్ధమయినది. ఈమతసాంప్రదాయికులు ద్వైతు లనియు, మాధ్వు లనియుఁ బేర్కొనఁబడుచున్నారు. ఉడిపిగ్రామమున వీరిప్రధానాచార్యపీఠము గలదు. కర్ణాటకమునం దీమత ప్రచార మెక్కువగా నున్నదని చెప్పుదురు. ఈమత కర్త ప్రస్థానత్రయమునకు భాష్యములను మాత్రమేగాక యనేక ద్వైత మత గ్రంథములనుగూడ విరచించెను.



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## తొమ్మిదవ ప్రకరణము.

## కాకతిరాజుల చరిత్రము.

### రుద్రదేవుని రాజ్యవిస్తారము.

ఇట్లు రుద్రదేవుఁడు చాళుక్యచక్రవర్తియైన తైలపదేవుని, కర్ణాటక చోడులయిన భీమచోడోదయ చోడులను, తక్కుంగల శత్రురాజవర్గమును జయించి యాంధ్రదేశమునందు పశ్చిమ చాళుక్యచక్రవర్తుల పరిపాలనమునకు లోఁబడి యున్న భూభాగముల నన్నిటిని స్వాధీనము చేసికొని మహామండలేశ్వరుఁడై రాజాధిరాజై పొగడ్త కెక్కెను. ఇతని రాజ్యముయొక్క విస్తీర్ణ మనుమకొండ శాసనములో నీక్రిందిశ్లోకమున వివరముగాఁ జెప్పఁబడినది.

"రాజ్యం ప్రాచ్యాం లవణజలధే స్తీరపర్యన్తమస్య
శ్రీశైలాన్తం ప్రచరతి సదా దక్షిణస్యాం సమగ్రం
ప్రాతీచ్యాన్తా కటకనికటస్థాయినీ రాజ్యలక్ష్మీః
కౌబేర్యాశాతటవిలసితా మాల్యవన్తం పరిపేదే."

అనఁగా క్రీస్తుశకము ౧౧౬౨ వ సంవత్సరమునాఁటికి కాకతిరుద్రదేవుని రాజ్యము తూర్పున సముద్రమువఱకును, దక్షిణమున

శ్రీశైలమువఱకును, పడమర కటకము (పశ్చిమ చాళుక్యరాజధాని యగు కళ్యాణపురి) వఱకును, ఉత్తరమున మాల్యవంతము (మధ్య మాగాణములలోని పర్వతములు) వఱకును, విస్తరించి యున్నదని పైశ్లోకముయొక్క భావము.

ఈ పైశ్లోకమునం జెప్పంబడిన కాకతిరాజ్యముయొక్క హద్దులు సరియైనవయినయెడలఁ దూర్పున నుండు నిప్పటి గోదావరీ, కృష్ణా, గుంటూరు మండలములు నీరాజ్యములోఁ జేరి యుండవలయును. క్రీస్తుశకము ౧౧౬౨ వ సంవత్సరమునకుఁ బూర్వము ప్రతాపరుద్రుని శాసనము లామండలములో నెచ్చటను గానరావు. అంతియగాక చాళుక్యచోడులకు ప్రతినిధులుగఁ బరిపాలనము సేయుచున్న మాండలిక సామంతులయొక్క శాసనములే పెక్కులు గన్పట్టుచుండుటచేత మొదటి కాకతి ప్రతాపరుద్రుఁడు వారిపై దండెత్తి యుద్ధముచేసి జయించియుండవచ్చును గాని యాభాగములను దన రాజ్యములోఁ గలుపుకొని పరిపాలనము చేసియుండు నని యూహింపరాదు. ౧౧౬౨ వ సంవత్సరమునకుఁ దరువాత ప్రతాపరుద్రదేవుని శాసనములు దక్షారామమునందును, నర్సారావుపేట తాలూకాలోని కుంకలకుంట గ్రామమునందును, కందనోలిమండలములోని త్రిపురాంతకమునందును గానవచ్చుటచేత నప్పటి కాభాగములను జయించె నని స్పష్ట మగుచున్నది. దాక్షారామ శాసనములో త్రిభువన చక్రవర్తి విష్ణువర్ధన మహారాజుయొక్క ప్రవర్ధమాన సంవత్సరములు పేర్కొనం బడుటయేగాక "పెనుగొండపురవరాధీశ్వర" యని కూడఁ బేర్కొనఁబడియెను. ఈశాసనము క్రీ. శ. ౧౧౭౫ వ సంవత్సరమున వ్రాయఁబడినది. ఈతఁ డీశాసనమున విష్ణువర్ధన మహారాజుయొక్క విజయరాజ్య సంవత్సరము లుదాహరించుటకుఁ గారణము గానరాదు.

దీనింబట్టి యితఁడు చాళుక్యచోడ చక్రవర్తులకు సామంతు డని యెంతమాత్రము నూహింపరాదు. నరసారావుపేట తాలూకా లోని కుంకలగుంట గ్రామములో శ్రీభోగీశ్వరస్వామివారి దేవళ ములో ప్రతాపరుద్రునియొక్కయు అతని మంత్రి యైన బొల్లయ్య (మల్లయ్య) ప్రెగ్గడయొక్కయు నామములు మాత్రము గానంబడు చున్నవి గాని తక్కిన యక్షరములు తెలియంబడుచుండ లేదు. ఈ శాసనము శా. శ. ౧౧౧౯ వ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. ౧౧౯౭ వ సంవత్సరమున వ్రాయఁబడినది. ఇది సందేహాస్పదమైన విషయము. కాని యింకను బరిశోధించి చూచినఁగాని యీశాస నమును నమ్మి కాలనిర్ణయము చేయరాదు. "పతిహితచరిత" యని యితని శాసనములలోఁ గన్పట్టినను, ఇతఁడు పశ్చిమ చాళుక్య చక్రవర్తులకుఁ గాని, ప్రాచ్యచాళుక్య చోడచక్రవర్తులకుఁ గాని, సామంతుఁడైన మహామండలేశ్వరుఁడు గాక త్రిలింగ దేశమును స్వతంత్రుఁడై యవక్రపరాక్రమంబునం బరిపాలించిన మహారాజాధి రాజని చెప్పుటకు సంశయింపం బనిలేదు. ఈమహావీరుని పరిపాలన కాలమునఁ బశ్చిమ చాళుక్య సామ్రాజ్యమును, ప్రాచ్యచాళుక్య చోడసామ్రాజ్యమును, అంతరించినవి. త్రైలింగ్య సామ్రాజ్యము విస్తరింప నారంభించినది.

## రుద్రదేవుఁడు విద్యావిభూషణుఁడు.

ఇతఁడు సంస్కృతాంధ్ర కర్ణాటభాషలం దభిమానముతిపా గలిగి పండిత జనంబుల రావించి యాదరింపుచుఁ బండితపక్షుఁడై తానును బండితుఁడు కవియునై బహుగ్రంథములం బఠించుటయే గాక గ్రంథ రచనమునకుం గూడ దొరకొనినటులఁ గానఁబడు చున్నది. ఈతనికి "విద్యావిభూషణుఁ" డను బిరుదనామ మున్న టుల శా. శ. ౧౧౦౧ సంవత్సరమున దాక్షారామ భీమేశ్వరుని

యాలయమున లిఖింపఁబడిన శాసనముం బట్టి దెలియుచున్నది. మఱియు నితఁ డాంధ్రభాషలో "నీతిసార" మను గ్రంథమును రచించినటులఁ గన్పట్టుచున్నది. ఆత్మకూరుసంస్థానమున సంపాదించిన ప్రతిలో నీక్రింది పద్యము గలదని తాము ప్రకటించిన బద్దెన కవి ప్రణీత నీతిశాస్త్ర ముక్తావళీ గ్రంథమున శ్రీరామకృష్ణయ్యగారు నుడివి యున్నారు.

"చం. పరుపడి నాంధ్రభాషగల బద్దెననీతియు సంస్కృతంబుతోఁ
బరఁగఁ బ్రతాపరుద్ర నరపాలునిచే రచియింపఁబడ్డ యా
నరవరునీతిసారము వినం జదువం గడు మంచి దంచుఁ జె
ప్పెరఁ గవి నీతిపద్ధతులుచేసె వినోదము బాలబోధకున్."

నీతిశాస్త్ర ముక్తావళిని రచించిన బద్దెనకవినే భద్రభూపాలుఁడని యీ చరిత్రముయొక్క పూర్వప్రకరణమునఁ దెలిపియున్నాఁడను. ఈభద్రభూపాలునకు నన్నెచోడుఁ డను నామముగూడగలదు. కుమారసంభవమను మహాకావ్యమును రచించిన నన్నెచోడుఁడు నితఁడు నొక్కరో భిన్నులో చెప్పుట కాధారము గానిపింపదు. కుమారసంభవకావ్య రచనకును నీతిశాస్త్ర ముక్తావళి గ్రంథరచనకును విశేషతారతమ్యము గన్పట్టుచున్నది. నీతిశాస్త్రముక్తావళి గ్రంథరచన కోమలమ్మై యున్నది.1 నీతిశాస్త్రముక్తావళిలోని కొన్ని ధర్మములు నీతిసారములోని ధర్మములను బోలియున్నవని పోలిక పద్యములు గొన్ని ముద్రిత గ్రంథమునందు నుదాహరింపఁ బడినవి. నీతిసారముయొక్క శైలి దెలియుటకై వానింగొన్ని నే నిట నుదాహరించుచున్నాఁడను.

1. నేను మొదటి ప్రకరణము వ్రాయునప్పటికి నీతిశాస్త్రముక్తావళీ యను గ్రంథమును జూచియుండలేదు. కనుక భద్రభూపాలుని కాలము భావివిమర్శోధనమునంగాని నిర్ణయింప సాధ్యము గాదు.

" కం. దండము లేకున్ననుఁ బ్రజ
లొండొరువుల నాక్రమింతు రుచితస్థితిమై
నుండవు వర్ణాశ్రమములు
దండింపనిభూమిపతికి ధర యేర్పడునే. "

" కం. ఆజ్ఞలేనిన్నపుఁడు నరయఁ జిత్తరువులో
నున్నరాజుఁ జూడ నొక్కరూప
యానఁద్రోయుసుతుని నైనను దండింప
కున్న రాజ్య మేల నుండుఁ జెడక. "

" కం. ఆపదఁజెందు ప్రజలను
భూపతి మొద లిచ్చి మగుడఁ బ్రోవఁగఁజనుఁ దాఁ
జేపట్టి విడువవలవదు
భూపతికిఁ గుటుంబ మనఁగ భూమియ కాదే. "

" ఆ. కీడు సేయువానికిని మేలు సేయుట
మునులగుణము గాక జనుల నెల్లఁ
బ్రోచువాఁడు కల్లరుల నాజ్ఞవెట్టుట
యాగపశువిధంబు నట్ల కాదె. "

" గీ. ఎంత పెదలియున్న నేరండములు జీలు
గులును దారుకృత్యములకు నగునె
యితరు లెంద యైన నేలిక కథికులై
చేయుపనులు పూని చేయఁగలరె. "

" కం. జూదమును బన్నిదంబును
వాదును బలితోడఁ దేడవలవదు కడుఁ బో
రాదయ్యెనేని భృత్యులు
భేదము గాకుండు గెలుపు పెనుపఁగ వలయున్. "

" కం. ధనమును బ్రాతశ్చాయయు
వనితాజనయౌవనంబె వండినయన్నం
బును గడుమూర్ఖస్నేహం
బును నిల నివి యల్పకాలభోగ్యము లరయన్. "

" కం. దూరము వ్యవసాయకులకు
భారంబు సమర్థులకును భాసురవిద్యా
పారగులకును విదేశము
వైరము ప్రియవాదులకును వసుమతిఁ గలదే. "

" తే. విమతు లావెలింగి వెలిపేది తొడరుట
మిడుత లగ్గిమీఁదఁ బడినయట్లు
తోడులేక యధికుఁ దొడరుట యంబుధిఁ
గలము లేక యీఁదఁ గడఁగినట్లు. "

" ఉ. కొందఱ మేలమాడుటలుఁ గొందఱ వావులుదెచ్చి పిల్చుటల్
కొందఱముద్దుసేయుటయుఁ గొందఱనెయ్యపుఁజూపుసూచుటల్
కొందఱనాత్మభావమునఁ గొందఱమన్నన భృత్యులందు ని
ట్లందఱ నచ్చిభంగుల నృపాగ్రణి వశ్యులఁజేయఁగా దగున్. "

## చెల్లకి గంగాధరమంత్రి.

మొదటి ప్రతాపరుద్రదేవుని మంత్రులలో చెల్లకి గంగాధర మంత్రి యొక ప్రసిద్ధిగాంచిన పురుషునివలెఁ గనుపట్టుచున్నాఁడు. వీని యింటిపేరు మనకుఁ దెలియకున్నను వీనిపూర్వులు ప్రఖ్యాతమైన వేంగీదేశమునందలి చెల్లకి పురవాస్తవ్యులని బలవంతులని మహాత్ములని తెలుపఁబడియుండుటచేత నీ గంగాధర మంత్రి చెల్లకిగంగాధర మంత్రి యని నామకరణముఁ జేసియున్నాను. ఇతఁ డమాత్య పదవిని బొందిఁ బ్రఖ్యాతి గాంచుటయగాక యితఁడు పండితుఁడును గవియుఁగూడ నైయున్నట్టు ఇతనిచే లిఖింపఁబడిన నగరూరు శాసనము వలన విస్పష్టమగు చున్నది.* ఈ శాసనము శా. శ.

* ఈశాసనమంతయుఁ బద్యములతోఁ గూడుకొని గంగాధరమంత్రి విరచితమై వానిచేత కాకతీయ రుద్రదేవరాజున కంకితమిచ్చినట్లుగా శాసనము చివరనుండు చిన్న గద్యమువలనఁ గన్పట్టుచున్నది. అది యెట్టిదైనను ఈశాసనము నగనూరు నుండి తేఁబఁడి కరీమునగరుకలెక్టరు బంగాళాలో పాతఁబడినదని వివరింపఁ బడినది. తెలిఁగానా శాసనములు పుట ౧౨ కాకతీయ శాసనములలో సంఖ్య 6 కరీనగరము శాసనము చూచునది.

౧౦౯౨వ వికృతిసంవత్స మాఘ శుద్ధ పంచమి బుధవారమునాఁడు వ్రాయఁబడినది గావున క్రీ. శ. 1170 నాఁటిదని చెప్పవచ్చును. అఖిల జగజ్జన పూజితుఁడైన అత్రిమహర్షి గోత్రంబున కొమ్మ నార్యుండను నాతఁడు పుట్టి ముక్కలి వైభవోపేతుఁడై చెల్లెకి పురమున ప్రభతోఁ గాపురముసేయు చుండెననియు, అతనికిఁ శ్రీయుతుఁడును, సుకవి బంధుచింతామణియు నగు నారాయణుఁడు జనించెననియు, అతనికి నతనిభార్య అయ్తమాంబకు సమస్తజన చిత్తానంద సంజాతవిస్తృత నానాగుణాఢ్యైన గోవిందుఁడు పుట్టి నిర్మల ప్రథితవిజ్ఞానముతో నొప్పుచుండెననియు, అతనికిఁ బతివ్రతయు గుణవిభాసియు మహాసతియైన తురుకమాంబకుఁ దాను జనించితి ననియుఁ జెప్పుకొనియున్నవాఁడు. ఇట్లు జనించిన తనకు మాతాపితృ వర్గములవారు ప్రేమతోఁ జదువులు చెప్పించిపోషింపుచుఁ బెద్దవానిఁ జేసి లసద్విద్యాతిశయకుశలుం గావించిరని చెప్పుటయెగాక కాకతి ప్రోలరాజు నాకర్షించిన చందముగూడ నీక్రింది పద్యములో స్పష్టీకరించి యున్నాఁడు.

“ చం. సకల కలాధిజ్ఞుఁడనంజాలి సమస్త జనాళిసద్గుణ
ప్రకరము నెప్పుడుఁ బుధసభం బ్రణుతింపఁగ నున్నయట్టినన్
బ్రకటితకీర్తిఁ బ్రోలజనపాలుఁడు ఘోరతరాజిలోలుఁడ
త్యకుటిలచిత్తుఁ డీతఁడని యాదరికం బిలుపించి పంపఁగాన్. ”

“ కం. చనువుమెయినగరిలోఁ దగు
పనులెల్లను బెంపుమెఱసి పరికించుచునే
ర్పున భక్తియుక్తినతిముద
మునఁ జేయుచుఁ దత్పరోక్షమున మతియుఁబ్రభన్. ”

కాకతిప్రోలరాజు కాలముననే గంగాధరమంత్రి సకలకళా విధిజ్ఞుఁడై పండితసభలో సమస్త జనులును వాని సద్గుణములను

స్మరించుచుండఁగాఁ బ్రసిద్ధమైన కీర్తినిబొంది యుండుట విని యా ప్రోలరాజు విని కౌటిల్యములేని మనస్సుగల వానిగా నెఱింగి యాదరముతో రప్పించి అనుమకొండ నగరమున నుద్యోగమొద్దియొ నొసంగ నీతఁడు భక్తియుక్తులు మెఱయ నేర్పుతో నాపనుల నిర్వహించుచుండెనని పైపద్యమువలన విశదమగుచున్నది- ఇట్లు నగర పాలకుఁడుగనో లేక వానిక్రింద నేయుద్యోగిగనో యుండి రాజునకుఁ బ్రీతికరముగాఁ దన విధ్యుక్తకార్యము లను నెరవేర్చుచుండుటచేత ను బ్రతాపరుద్రదేవుఁడు కూడ నాదరము కలవాఁడై,

" చం. వెలయ నమాత్యసంపదయు విశ్రుతమైన నియోగవృత్తులం
దలముసితాతపత్రము లతర్క్యవిభూషణలేపరాంబరం
బులుఁ దగువృత్తులంబడసి భూసురవర్గముఁ బోచిదేవతా
నిలయము లతిఁ జెక్కొనరనిల్పుచుఁ బూజలుఁ బ్రీతిఁజల్పుచున్. "

అని చెప్పుకొన్నట్లుగా, అందలము, వెల్లగొడుగు మొదలగు గౌరవార్హచిహ్నంబులతో నొప్పు సర్వనియోగవృత్తులపై నధికారము గలిగి యుండినట్టి యమాత్యపదవి నొసంగి భద్రపీఠంబునఁ గూరుచుండఁ బెట్టెను. ఇతఁ డా యమాత్యపీఠము నలంకరించిన తరువాత నాయనుమకొండ పురమును నగరముగాఁ గావించెను. ఏప్రక్కను గాంచినను దేవప్రతిష్ఠలు, శివాలయములు, విష్ణ్వాలయములు, బుద్ధాలయములు, వానిముందు కోనేరులు, నచటచట ఘన తటాకంబులు, ఉద్యానవనములు, వేయునేల:—

" కం. తనపెంచిన సన్మానముఁ
దనసంతానంబుఁ గృతియుఁ దన నల్లిల్లున్
వనమును జెఱువును గుడియుం
జనవినుతములైన సప్తసంతానంబుల్. "

అని చెప్పుకొన్నట్లుగా సప్తసంతాన ప్రతిష్ఠలు గావించి జన వంద్యుఁడై సామ్రాజ్యమునం దంతటఁ దన యశఃపుంజమ్ములను వెద

చల్లినాఁడు. మఱియు నితఁడు మహారాజుయొక్క కృపను బడసి విద్వజ్జనంబులను బెక్కండ్రను రప్పించి వారలచేత యజ్ఞములఁ జేయించి వారలకు "డొం డొం డు" అను నగ్రహారము నొసంగి పౌరవులను గావించినాఁడు. అచట త్రికూట నిర్మితశివాలయమును, విలసత్తటాకమును సుందరములయిన వాటికలను, వానిచుట్టును జన సుఖప్రదములైన లుంగ లవంగ తాల మాకందవనంబులను వీనినన్ని టిని శ్రీ నందనమూర్తి రుద్రజననాథు దయచేతనే నెలకొల్పఁగలిగి తినని చెప్పుకొనినాఁడు. ఇతఁడు సద్భావనతోను గడుభక్తితోను బురమధ్యమున నారుదేశ్వర దేవుని సన్నిధానమున లక్ష్మీనాథుఁ డైన ప్రసన్నకేశవ దేవరను బ్రతిష్ఠాపించినాఁడు. పున్నేశ్వర దేవా లయ సాన్నిధ్యమునం దున్నతమైన శివాలయమును నెలకొల్పినాఁడు.

"పురుషనిధి పురుషరత్నము
పురుషోత్తమమూర్తి యనుచుఁ బొగడఁగ జను లు
త్కురుషమతి వెలయఁగం డ్రై
పురుషులఁ జేసితిఁ బ్రతిష్ఠ పూజార్థముగాన్."

అని చెప్పినట్లు త్రిమూర్తుల బ్రతిష్ఠను గావించినాఁడు. గం గాచయుని చెఱువునొద్దఁ గేశవదేవు గుడియును, విప్రులకు సంధ్యా వందనాది కర్మల నాచరించుకొనుటకై జన్నాశ్రయమును గావించి నాఁడు. హిడింబతీర్థమునఁ బూర్వము బౌంధవ్యోత్తములు పెద్దలు భీమనాథుని గేహము మొదలగు దివిజాలయములను బెక్కులు నిలపగా నితఁడు నాచెంతఁ బురుషోత్తముఁడైన హరిని బ్రతిష్ఠించి నాఁడు. ఇంతియగాక పక్షపాత మిసుమంతయు లేనివాఁడై

"పరమేశుఁడు హరి బుద్ధ
స్వరూపుఁడై యప్పురవమలవచించు జినో
హరియనెడు పట్ట శాలం
జిరముగ బుద్ధ ప్రతిష్ఠఁజేసెతి భక్తిన్."

పరమేశ్వరుఁడైన హరియే బుద్ధస్వరూపుఁడై యవతరించెనను విశ్వాసముతోనే గంగాధర మంత్రి దేవుళ్ళందఱితోఁ బాటుబుద్ధ దేవుని గూడఁ బ్రతిష్ఠించి యాలయము గట్టించెను. క్రీడాభిరామములో వల్లభామాత్యకవి పేర్కొని వర్ణించిన బుద్ధాలయ మీ గంగాధర మంత్రి గట్టించినదై యుండనోపు. సంవర్త కేశ్వరమని వ్యవహరింపఁ బడెడి తీర్థమునిస్థానమున విశ్వస్తుత్యుఁడైన శశిఖండ శేఖరునిఁ బూజించి సద్భక్తితో జగద్వంద్యుఁడైన భవానీపతికి గుడియును దటాకమును బ్రతిష్ఠించెను. ప్రతాపరుద్రునిచేఁ బ్రతిష్ఠాపింపఁ బడిన రుద్రవరములోని రుద్రేశ్వరుని సన్నిధానమున గౌరీవల్లభుని ప్రతిష్ఠాపించెను. అతని సన్నిధానముననే చెఱువునందు శ్రీవత్సాంకుని బ్రతిష్ఠగావించెను. మఱియు మంత్రకూటమున త్రిణయనునకు నాలయమును గట్టించి వానిపోషణార్థము వృత్తుల నేర్పాటుచేసెను. "ఆపిమ్మట-"

"శంశిత భక్తి యుక్తి ననిశంబు నిజాంఘ్రులఁగొల్చు నజ్జ భూ
వంశము శోభిలఁ బ్రజ నవాంఛిత పుణ్యఫల ప్రగుస్సురా
ర్యంశజ దర్పహరు నచ్యుతునిన్నగ రూర నేఁజతు
ర్వింశతి మూర్తి యుక్తముగ విశ్వమయాత్ముఁ బ్రతిష్ఠ సేసితిన్."

అని నగరూరులోఁ జతుర్వింశతి మూర్తులతోఁ గూడ నచ్యుతుని ప్రతిష్ఠాపించితినని చెప్పుకొని యున్నాఁడు. నిరువదినాలు గవతారవిగ్రహములతోఁబాటు శ్రీమహావిష్ణు మూర్తిని ప్రతిష్ఠాపించెనని యెఱుంగవలయును. ఇతఁడు శివభక్తి పరుఁడనియు, మహారాజునకు నత్యంత ప్రేమాస్పదుఁడైనవాఁడనియు, ప్రజానురంజనముగు పాలనము చేసిన వాఁడనియుఁ బైని వక్కాణించిన ప్రతిష్ఠాపనలను బట్టియె మనము గ్రహింపపచ్చును. ఈనియోగి బ్రాహ్మణమంత్రి శిఖామణిఁగూర్చి నింతకంటె నెక్కువగాఁ దెలిసికొనుటకు నిప్పటి కంటె సాధనములు దొరకినగాని సాధ్యపడునదికాదు.

## ఏకశిలానగర నిర్మాణము.

ఈ మొదటి ప్రతాపరుద్రదేవుని కాలముననే యోరుగల్లు కోటకట్టఁబడి "ఏకశిలానగర" మను పేరిట రాజధానీ నగరము నిర్మాణము చేయఁబడి యానగరపాలకులనుగా ఇందులూరి పెదమల్లన మంత్రిని, చినమల్లన మంత్రిని నియోగించినటులు కొలని గణపతి దేవకవివర్యునిచే రచియింపఁ బడిన శివయోగసారమను గ్రంథము లోని:—

" అనుమ కొండపురంబు గాదని యానిభుండిల నోరుగ
ల్లనఁబురంబు ఘటించి యచ్చటి కచ్చుగా నరుదెంచి య
మ్మనుజనాథుఁడు నాయకత్వము మల్లమంత్రికి చిన్నమ
ల్లనకు ధారుణి పెద్దసంప్రతి నాతఁడంబున నిచ్చినన్."

అను పద్యమునవలన విశదమగుచున్నది. ప్రతాపరుద్రదేవుఁడు పూర్వుల రాజధాని యగు అనుమకొండ వైభవము శత్రువులచేఁ జెఱుపఁబడ కుండనుండుటకై యంతకంటెను బలమైన దుర్గమును నిర్మింపఁ దలంచి యోరుగల్లు ప్రదేశము తగినదిగా యోచించి కోటను గట్టి యందే నివసించుచుండుటవలన నగరము క్రమక్రమముగా విస్తరింప నారంభించినట్లు గన్పట్టుచున్నది. ఇయ్యది క్రీ. శ. 1170 సంవత్సరము తరువాతనే సంభవించినదని గంగాధర మంత్రి విరచితమైన నగనూరు శాసనమును బట్టి యూహింప వచ్చును. అప్పటికింకను అనుమకొండయె రాజధానిగానున్నట్లు వ్రాయఁబడియున్నది. ఏకశిలానగరమునకు మొదటి నగరాధ్యక్షుఁడుగా నియమింపఁబడినది యిందులూరి పెదమల్లనమంత్రి. ఈ నగరమునకు నాగ్రికమంత్రి (మొదటి శ్రీకరణము) ఇందులూరి చినమల్లనమంత్రి యని శివయోగసారమువలన స్పష్టముగా విదిత మగుచున్నది. అప్పటికి చెల్లెలి గంగాధరమంత్రి వృద్ధుఁడై యుండ

వచ్చును. ఈమల్లనమంత్రి లిర్వురును, అదివఱకు గంగాధర మంత్రికిఁ బూర్వము కాకతి ప్రోలరాజు కాలమున ననుమకొండ పురాధ్యక్షుఁడుగా నుండిన కౌండిన్య గోత్రుఁడును, ఇందులూరి విభుఁడును నైన నానగార్యుఁ డను వానిపుత్రులని శివయోగసార ములోని యీక్రింది పద్యమువలన వేద్యమగుచున్నది.

> " ప్రథఁ గౌండిన్య మునీంద్రగోత్రమున నాపస్తంభసూత్రమ్మునం
> దభవాంఘ్రిద్వయ సేవకుండయిఘనుండై యన్మకొండన్ పురిక్
> విభవం బొందఁగ నిందులూరి విభుఁడై విఖ్యాతినింజెందె వీ
> తభయాత్ముండగు (నానగార్యుఁడు ?) కృతోదారుండు ధీరుండొగిన్. "

## గురు మల్లికార్జున పండితారాధ్యుఁడు.

గురుమల్లికార్జున పండితారాధ్యుఁడు మొదటిప్రతాపరుద్ర దేవునకు సమకాలికుఁడై శైవగురు పరంపరలో నాకాలమున నాంధ్రదేశమున వీరశైవమతమును బ్రబలింపఁజేసిన వారిలో నితఁడొకఁడు. ఈతని తండ్రియైన భీమనపండితుఁ డాంధ్రదేశములో గోదావరీ మండలమునందలి భీమేశ్వరమున (దక్షారామము) భీమే శ్వర లింగమునకు (బురోహితుఁడు) పూజారిగ నుండెను. వీరిది ఋగ్వేదశాఖ, గౌతమగోత్రము, గౌరాంబయీ తనితల్లి, శ్రీశైల మల్లికార్జున దేవుని సేవించి వచ్చిన తరువాతఁ బుట్టినవాఁడగుటచేత జననీజనకు లీతనికి మల్లికార్జునుఁ డన్న పేరు పెట్టిరి. భీమేశ్వరమునకు సమీపమున నున్న కోటిపల్లి నివాసుఁడైన ఆరాధ్యదేవర యీతని గురువుగా నుండెను. ఈయారాధ్యదేవరకు అవాంతరయ్య అను నాతఁడు గురువుగా నుండెను. ఈమల్లికార్జునుఁ డారాధ్యదేవర యొద్దనుండి శైవదీక్ష వహించి శైవమత రహస్యములను జక్కఁగాఁ దెలిసికొని వానిని నొక్కొక్కదానినే యాచరణమునం బెట్టుచుం డఁగా నచ్చటి వైదిక బ్రాహ్మణులు వచ్చి యీతని శైవాచారముల

నధిక్షేపింపుచు వచ్చినను వారికి విభూతి మహిమయు, రుద్రాక్ష మహిమయు, గురుపాదోదక మహిమయు, లింగార్చన మహిమయు, ప్రసాదస్వీకార మహిమయు బోధించి, ఘంటాకర్ణాది భక్తుల చరిత్రలు చెప్పి వారిని మెప్పించి పంపివేయుటయె గాక వీరమాహేశ్వరాచార మార్గమును దెల్పుచు "శివతత్త్వసార" మను శైవమూల గ్రంథమును రచించి యాగ్రంథమునఁ జెప్పినరీతిని దాను బ్రవర్తించుచుండెను. విశేషభక్తితో నత్యద్భుతరీతిని శివపూజలు సలుపుచుండెడివాఁడు.

ఇట్లుండఁగా పోరండ్ల సూరసానమ్మ యనుభక్తురాలును, బెలిదేవి వేమనారాధ్యుఁడును మఱికొందఱు జంగములును జూడ వచ్చిరి. అప్పు డాతఁడు శివపూజ చేసికొనుచున్నను జంగములు లింగరూపులే యనుభావము గలవాడు గనుక వెంటనే శివపూజ నిల్పి వారిని సర్వవిధముగా సమ్మానించి జంగమ పూజకూడ లింగపూజయె యని తెల్పెనఁట. అంతట సూరసానమ్మగారు మల్లికార్జున పండితునకు బసవేశ్వరుని మహిమయు నతని కడనున్న కొందఱి భక్తుల మహిమయుఁ జక్కఁగాఁ దెలిపెను.

ఇతఁడు రచించిన శివతత్త్వసారములో నారాధ్యులవారిని జన్మమెత్తుటకుఁ బొమ్మని స్వర్గమునుండి భూలోకమునకుఁ బంపిన కాలముననే యీ 'శివతత్త్వసారము'ను శివుఁడు బోధించెనని యిట్లు చెప్పి యున్నాఁడు. శివవాక్యము-

" శివమహత్త్వ ప్రతిష్ఠిత వచస్సిద్ధి, శివతత్త్వ సారసంచితకళావృద్ధి,
...............................................ఒసఁగెద."

వీరశైవ గురువునగు మల్లికార్జున పండితారాధ్యుఁడె పాల్కురికి సోమనాథ కవిరచిత 'పండితారాధ్య చరిత్రము'నకు నాయకుం

డును, 'శివతత్త్వసార' మను శతకగ్రంథమునకుఁ గర్తయు నని యా పండితారాధ్య చరిత్ర గ్రంథము వలననె తెలియుచున్నది. పండితా రాధ్య చరిత్రమునందు 'శివతత్త్వసార' గ్రంథము పండితునిచే రచింపఁబడినట్టు విస్పష్టముగా నీ క్రింది పద్యములోఁ దెలుపఁబడినది.

" ఈక్షితిఁ జను పూర్వపక్షసిద్ధాంత, పక్షముల్ తత్కర్మభాగైకపూర్వ,
పక్షేతరజ్ఞానపక్షసిద్ధాంత, పక్షవేదార్థోపపాదితపరమ,
శైవాత్మకాచార సంసిద్ధిశుద్ధ, కేవలభక్తి సద్భావనోపేత,
వీరమాహేశ్వరాచార మార్గాను, సారియై 'శివతత్త్వసార' సత్కృతిని
గావించి కేవల భక్తిగతిఁ బ్రతిష్ఠించి, యాదటఁదానును నట్లవర్తించు
చున్నవాఁడని వెండియును బ్రశంసింప, మన్ననపేర్మిన మల్లికార్జునుఁడు.
దీక్షాప్రకరణ పుట ౫౭.

ఈ శివతత్త్వ సారగ్రంథమునే యారాధ్యులవారును, వారి శిష్యులును, తదితర భక్తులును సాధారణముగ నెప్పుడును బఠించు చుండెడి వారని పండితారాధ్య చరిత్రమునందే పెక్కుతావులఁ బేర్కొనఁ బడియున్నది.

పాల్కురికి సోమనాథకవి విరచితమైన 'అనుభవసార' మను గ్రంథమునందుకూడ బండితుఁడీ గ్రంథమును రచించినట్టులీక్రింది పద్యము వలనఁ దేటపడు చున్నది.

" సీ. శ్రుతి 'ఏకఏవ రుద్రోనద్వితీయాయతస్థే' యనుట యదార్థంబు (దలప)
అవల 'నణోరణీ యాన్మహతో మహీయా' ననదియె యనూన పదము,
పంచి 'యవాగ్గోచరం' బను 'నప్రాప్యమనసాసహ' యనుమాట నిజము
ఏదియుఁగాదనెడు పరమేశ్వరుఁడె యెఱుఁగు నెద్దిదన్నెఱుఁగ దనెడు
ఎట్టులనుచు సంశయింపక శివతత్త్వ, సారగద్యపద్యసమితిశివుని
తెల్పినట్టి మల్లికార్జునపండి, తయ్యగారిఁదలఁతు ననుదినంబు. "

ఈ శివతత్త్వసార గ్రంథమును బ్రకటింపఁ జేసిన యస్మన్మిత్రులును, చరిత్ర పరిశోధకులు, గావ్య విమర్శనా విజ్ఞాన

సంపన్నులును, విజ్ఞాన చంద్రికా మండలి గ్రంథ సంపాదకులు నగు కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులుగారు వ్రాసిన యుపోద్ఘాత భాగమునందు:-

“దీనిని బట్టిచూడఁ బండితయ్య ‘శివతత్త్వసార’మను గ్రంథమును గద్య పద్యములుగఁ జేసినట్లు కానవచ్చు చున్నది. ‘గద్య’ అను పదము ‘హృద్య’ అను పదమునకు మాఱుగ లేఖక ప్రమాదమునఁ బడినదేమో. అట్లుగాక ‘గద్య పద్య’ మన్న పాఠమే నిజమగునేని పండితుఁడు గద్యమునందును నొక శివతత్త్వసారమును రచియించి యుండును. ఇప్పుడు మనకు దొరికినది కేవలము పద్యమయము. ఇందే కొంతగద్యమున్న యెడల లేఖకుఁడు దానిని మాత్రము వ్రాయకుండునా ?”అని వ్రాసియున్నారు. *

ఇట్లు సోమనాథకవి శివతత్త్వసారమును పండితారాధ్యుఁడు రచించెనని చెప్పుటయెగాక తన పండితారాధ్య చరిత్రములో ననేక ప్రకరణములలో ‘శివతత్త్వసారములోని పద్యములనే తన ద్విపదలలోనికిఁ గుదించి యనేక భాగములను జేర్చుకొని యున్నవాఁడు. ప్రకరణములకుఁ బ్రకరణములు సోమనాథకవి ద్విపదలో రూపాంతరము చేసెనని లక్ష్మణరావు పంతులుగారు వ్రాసినారు.

* ఈ శివతత్త్వసారము తొలుత లక్ష్మణరావు పంతులుగారిచే దుర్మతి నామ సంవత్సర జ్యేష్ఠాషాఢ మాసములలో వెల్వడిన ‘ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక మూఁడవ సంచికలోఁ బ్రారంభింపఁబడి శ్రావణ భాద్రపదమాస పత్రికలోఁ గ్రంథ సమాప్తిఁగాంచి ‘ఆంధ్రసాహిత్య పరిషత్సభ వారిచేఁ బ్రత్యేకముగా గ్రంథరూపమున వెల్వడి ౧౨ అణాలు వెలగలిగి యున్నది. ఈ పండితారాధ్యునిగూర్చి విశేషముగాఁ దెలిసికొనఁదలంచినవారా గ్రంథమును జూచుకొనఁ దగును. అందలి సంగ్రహమునే నిందు వ్రాసియున్నాను.

ఈపండితుఁడు శివతత్త్వసారమునే గాక లింగోద్భవదేవు చరిత్రము, రుద్రమహిమ, గణసహస్రమాల, అమరేశ్వరాష్టకము, పర్వతవర్ణనము మొదలగు వానిని రచించినటులు సోమనాథకవి రచిత పండితారాధ్య చరిత్రమువలన మనమూహింపవచ్చును. ఇవన్నియు నితఁడు తెనుఁగున రచించెనో సంస్కృత కర్ణాటభాషలలో రచించెనోఁ లేక కొన్నిఁటి నొక భాషలోను, కొన్నిటిని మఱియొక భాషలోను రచించెనో చెప్పఁజాలము. ఇతఁడు కర్ణాటకమునందును గవిత్వము చెప్పెను. ఇతఁడు గన్నడ భాషలో గణసహస్రనామ, ఇష్టలింగస్తోత్ర "బసవగీత" లను గ్రంథముల రచియించినటులు గనుపట్టుచున్నది. ఇతఁడు బసవేశ్వరుఁడు పంపిన విభూతిని ధరింపఁ గనే యీతనికిఁ గన్నడమువచ్చి యందు గవిత్వము చెప్పఁదొడంగె నని చెప్పఁబడియున్నది. పైనిపేర్కొనఁ బడిన గ్రంథములు గాక "హరలీలలు, మహిమ్నా స్తవము, మలహరణము. పంచగద్యములు శంకరగీతలు, ఆనందగీతలు, బసవగీతలు మొదలగు గ్రంథముల నెన్నిటినో రచించినటుల పండితారాధ్య చరిత్రములోని దీక్షాప్రకర ణమువలనఁ దెలియఁగలదు. అవియెట్లైనను బండితారాధ్యుఁడా కాలమునను దరువాతకాలమునను గవి యని ప్రఖ్యాతిఁ జెందెననుట యీక్రింది వాక్యమువలన దెల్లము.

> " వివరింప శేషునివేయునాలుకలు శివకవిమల్లయ్య జిహ్వానుసరియె
> .........వేయేల కవిమల్లువిషయేంద్రియములు.

దీక్షా. ప్ర. పుట. ౬౪.

కొంతకాలమువఱకు పండితయ్య "శివతత్త్వసారము" శైవు లకు ముఖ్యమైనదిగనుండినను పాల్కురికి సోమనాథుని తరువాత దీని ప్రచారము క్రమక్రమముగాఁ దగ్గిపోయి వెనుకఁబడుటకు ముఖ్య కారణము సోమనాథ కవిరచితమగు "పండితారాధ్య చరిత్రమున".

సోమనాథకవి "శివతత్త్వసారమునందలి పద్యముల యొక్క సారాంశమును వీలయినంతవఱకు మూలశబ్దములతోడనే సోమనాథుడు తనగ్రంథమునందుఁ జేర్చియుండుటయె ముఖ్యకారణ" మని లక్ష్మణరావు పంతులుగారభిప్రాయపడి యున్నారు. వీరిదిసరియైన యభిప్రాయమని నేను విశ్వసించుచున్నాను. ఇప్పటికి దొరకిన "శివతత్త్వసార" ప్రతిలో ౪౮౭ కందపద్యములు గలవు. ఈకారణము చేతనే యితర గ్రంథములుగూడ నామమాత్రావశిష్టము లయి పోయినవి.

ఈ గ్రంథములన్నియు రూపాంతరములను జెంది పండితారాధ్యచరిత్రమునఁ జేరి యుండుటచే పండితారాధ్య చరిత్రమె శైవులలో నెక్కుడు ప్రచారము బొందియుండుట కారణముగా మూలగ్రంథములకుఁ బ్రచారము తగ్గిపోయి యుండుననని భావింప వలసి యున్నది.

## పండితారాధ్యుని కాలనిర్ణయము.

గురుమల్లికార్జున పండితారాధ్యునికి సమకాలికులైన యొక మంత్రి యొక్కయు, నిద్దరు రాజులయొక్కయు కాలము మన మెఱింగి యుండుటచే నీతని కాలము గుర్తించుట కనువగు మార్గము గానుపించుచున్నది. కాలచుర్య వంశీయుఁడగు బిజ్జలరాజు మంత్రి బండారు బసవేశ్వరుని యొక్కయు, వేల్నాటి చోడరాజు యొక్కయు, పానుగంటి యుదయావనీశ్వరుని యొక్కయు కాలమున నీతఁడుండెనని పండితారాధ్య చరిత్రము, శివతత్త్వసారము మొదలగు గ్రంథములు తెలుపుచున్నందున నీతఁడు మొదటి ప్రతాపరుద్రదేవుని కాలమున ముఖ్యము ౧౧౬౦-౧౧౭౦ ప్రాంతముల నీతఁడున్నవాఁడని విస్పష్టముగాఁ తెలియుచున్నది. బిజ్జలుఁడు ౧౧౬౨లో

సింహాసనమెక్కి ౧౧౬౭ లో బసవేశ్వరుని శిష్యులచేఁ జంపఁబడియె నని పూర్వ ప్రకరణమునఁ దెలిపి యున్నాను. ౧౧౬౮ లో బసవేశ్వరుఁడు బిజ్జలుని కుమారుఁడగు వీరసోమేశ్వరునిచే చంపఁబడియెను. 1 భూమిపై నవతార మెత్తుటకు శివుఁడు బసవేశ్వరుని బంపినపుడే పండితునిగూడఁ బంపెననియుఁ బండితారాధ్యుఁడు గుంటూరు మండలములోని యమరావతీ పురమున నుండఁగా బసవేశ్వరుఁడు పంపిన దూత లాతని యొద్దకు వచ్చిరనియు నటుపిమ్మట పండితుఁడు బసవేశ్వరుని చూటకై కల్యాణపురమునకుఁ బయనమై నైజాము రాజ్యములోనిదగు పానుగంటి మీఁదుగా వనిపురమను గ్రామమునకుఁ జేరువఱకు బసవేశ్వరుఁడు కూడలి సంగమేశ్వరునిలో లింగైక్యముఁ జెందెనన్నవార్తఁ దెలియఁగాఁ జాలఁగా విలపించెనని చెప్పఁబడి యున్నది. 2

పండితారాధ్యుని మఱియొక సమకాలికుఁడు వెలనాటి చోడుఁడు. ఈపండితుఁడు చందవ్రోలు (పూర్వము ధనదుపుర మనునది) గ్రామమునకుఁ బోయినపుడా వెలనాటిచోడుని సభకుఁ బండితులచే బౌద్ధులతో వాదించుట కాహ్వానింపఁబడఁగాఁ బోయి వారలతో వాదించి నట్టును, ఈతని శిష్యులు బౌద్ధగురువును జంపి నట్లును, వెలనాటి చోడరాజీతని కనులు తీయించినట్టులును, అందుపైఁ బండితుఁడారాజును శపించి యమరావతికి వెడలిపోగా నారాజు నశించినట్టును, వాద ప్రకరణమునందును, మహిమా ప్రకరణమునందును జెప్పఁబడినది. ఈ రెండవ వెలనాటిచోడుఁడు క్రీ. శ. ౧౧౬౩ మొదలు ౧౧౮౦ వఱకు రాజ్యముచేసి యుండెను.

1. Rice; Mysore Vol. 1. p. 392.

2. దీక్షాప్రకరణము పుట ౮; మహిమా ప్రకరణము, పండిత ప్రలాపము. పుట ౩౦౧

ఈ రెండవ చోడుఁడే తెలుఁగునాఁటను జాలఁ బ్రఖ్యాతిగాంచెను. ఇతఁడు బసవేశ్వరునికి సమకాలీనుఁడనుట నిశ్చయము. కావునఁ బండితుఁడీతని సభకుఁ బోయినదియు నిజమనుటకు సందియము లేదు. పానుగంటి ఉదయాదనీశ్వరుని విషయము పూర్వప్రకరణమునఁ బ్రస్తావింపఁబడి యున్నది. కనుక పండితుని కాలనిర్ణయమునుగూర్చి సంశయింపఁ బనిలేదు. "చందవ్రోలు కైఫీయతు" లోఁ బండితుని కనులు దీయించినవాఁడు కొండపడమటి బుద్ధరాజని యున్నది. ఇతఁడు వెలనాటిచోడుని భార్యకుఁ దోఁబుట్టినవాఁడు. అతనికి మంత్రిగనున్నవాఁడు. ఈతని శాసనమొకటి క్రీ. శ. ౧౧౭౧ నాటిది చందవ్రోలులోనుండుటచేత నీకాలనిర్ణయము పరిష్కారమైనదని చెప్పఁ దగును.

## పండితారాధ్యుని మహిమలు.

"పండితుఁడొక దేవుని యవతారముగాఁడు; నందికేశ్వరుఁడు భూలోకమందు బసవేశ్వరుఁడుగాఁ బుట్టఁబోవునపుడు శివభక్తిని స్థాపించుటలో నాతనికి సాయపడుటకై శివభక్తి, నందిసర్వజ్ఞత, భృంగినిష్ట, దూర్వాసాదులశాపశక్తి, రుద్రాదిగణముల ప్రసాదైక నిరతి, ప్రాక్తనూతన భక్తగణముల ప్రత్యక్షముగఁ గనఁబడు మహిమ, వీరభద్రుని శౌర్యము నను నీగుణములఁదీసికొని శివుఁడొక మూర్తినిఁజేసి నీవు భూలోకమునకుఁబోయి బ్రాహ్మణుఁడుగఁ బుట్టి శివభక్తిని వృద్ధిచేయుమని చెప్పి పంపెనఁట!" ఈకారణముచేతనే కాఁబోలు బుద్ధుఁడు, జీసస్కైస్తు, శంకరుఁడు, రామానుజుఁడు మొదలగు మతకర్తలకు నారోపించు విధముగాఁ బెక్కు మహిమలు పండితారాధ్యచరిత్రమునందీతనికి నారోపింపఁబడి యున్నవి.

ఇట్టి మహిమలను బెక్కింటిని విడిచి యొక్కదాని మాత్ర మిటఁ జేర్కొనుచున్నాను. వెలనాటి చోడుఁడు కన్నులు దీయించెదనని భయపెట్టినపుడు తానె స్వయముగాఁ బండితారాధ్యుఁడు గోరుగల్లుతోఁ దన కన్నులు దీసి పళ్లెములోఁ బెట్టఁగా నాతనికి మరల గన్నులు వచ్చెనఁట. ఈప్రకారము రెండుసారులు జరిగెనఁట. నాలుఁగు కన్నులును బళ్లెములోఁ బెట్టఁగా రాజులును సభాసదులును జూచిరట! మరల రాజాతని కన్నులు దీయింపఁగా నతఁడాతని శపించి యమరావతికేగి యచట శివుని కరుణ వలన మరల గన్నులను బడసెనఁట. అతనికి మూఁడవ నేత్రముగూడఁ గలిగెనఁట. ఈకథయె చందవ్రోలు కైఫీయతులో మఱొక విధముగాఁ జెప్పఁబడినది.

“తదనంతరం తూర్పుదేశమునుండి యీశ్వరప్రసాదర్చితుఁడై సషువంటిన్నీ, అఖండిత వీరశైవాచారవ్రితుడైనషువంటిన్నీ వాణస కులోద్భవులయిన శ్రీమల్లికార్జునపండితారాధ్యులవారు శ్రీశైలప్రదక్షిణేచ్ఛకులై యీమార్గాన చందవ్రోలువచ్చి శ్రీ పాండీశ్వరస్వామివారి యొక్క ముఖమంటపములోవుండి వున్నందున శ్రీమన్మహామండలేశ్వర కొండ పడమటి బుద్ధరాజులుంగారి గుర్వు బౌద్ధమతాను సరణశాస్త్రప్రవీణుఁడై యిక్కడనే వుండినారు. గనుకఁ మల్లికార్జున పండితారాధ్యులవారి బిరుదులు మొదలగు వాని పరిభవం చూచి మతద్వేషంచేతను విరోధించి పరాజయపఱచ వలెనని ప్రసంగంచేసినందువలన ఈశ్వరాంశ సంభూతుఁడు గనుక వారు యిచ్చిన ప్రశ్నలు పూర్వపక్షంచేసి జైనబౌద్ధచార్వాక మతముల ఖండనచేసి పరాజయమును పొందింప చేసిరి. కనుక తదనంతరం బౌద్ధగుర్వు పరిచారకులు తమగుర్వుపరాజయం విచారించి పండితారాధ్యులవారి లింగార్చన కాలమందు నిత్యంవ్రితంగా సర్పించె నక్షత్రహారితి బ్బెడనే బౌద్ధుడు యీమఱించి చోరత్వం చేత తీసుక

పోతూవుండగా పండితారాధ్యులవారి శిష్యుడికి దెలిసి చందవ్రోలుకు పశ్చిమ పార్శ్వంగా వెళ్ళుతూవున్న బెజ్జంణి కనుక్కొని అత్యంత కోపంచాతను గురుదవ్యం అపహరించినందున వాంణ్ని వధంచేసి ఆనకుత హారతి తీసికొని వచ్చి గురువుకు తెలియకుండా శివపూజా దవ్యంలో తెచ్చివుంచినాడు. అటుపిమ్మట బౌద్ధులు కొందఱు పండితారాధ్యుల వారికడకు వెళ్లి అకమంగా జీవహింస చేసిన వారికి శాస్త్రోక్తప్రకారంగా చయ్యతగ్గ పాయశ్చిత్తముకు విధి యేమి నిర్ణయించవలసినదో మాగురువు మిమ్ముమ్మిన అడిగి రమ్మన్నారు. అని చెప్పినంతల్లో యీలాగంటి పని చేయించినవారి కండ్లు తోడించడం విధి అని చెప్పేగనక అప్పుడు బౌద్ధులు యీ క్రమం మీవల్లనే జరిగినదని యావత్తు తెలియచేసి నంతల్లో ఆయన దివ్యజ్ఞానంచేత విచారించి యిందుకు ప్రతి హతంవిచారిస్తిమా అసత్యం పలికినవారమవుతాము ఇది అంతా బౌద్ధులుచేసిన కృత్యముగదా అని తెలిసి స్నాన సంధ్యాద్యనుష్టానమతాను సరణశాస్త్రోక్త ప్రకారంగాను, శివ పూజాక్రియలు జరుపుకొని లింగోద్భవస్వామి వారియెదుట కూర్చుండి సదా శివునియందె భక్తివుంచి యీశ్వరుడికి తన నేత్రములు తీసి లింగోద్భవుని ముందు పెట్టిన తరువాత అతని భక్తివిశేషంవల్ల ఆభక్తు నికి తిరిగి కంన్నులు ప్రసాదిస్తూవచ్చినంతల్లో తన ప్రభావం ప్రకటన చేసే కొఱకు తిరిగి కన్నులు తోడుతూవచ్చినారు. యీప్రకారంగా విషపరీక్షచేసినందున కోపంవచ్చి యింతనుంచి యీచందవ్రోలులో లింగధారిణులైన వారికి శివపూజ చయ్యడానకు హారహతి లేకపో అనిన్ని యీపట్నం కొంతమట్టుకు బస్తిగా వుండకపోననిన్నీ యీ బౌద్ధలకు యీస్థలంలో జయం లేకపోవుననిన్నీ శాపం యిచ్చి అక్కడనుంచి లేచి ఆ గ్రామాన్కు దక్షిణ బాగానవున్నషు వంటి మహాప్రభావంగ గోకర్ణేశ్వరం వెళ్లి శివసాన్నిధ్య మందు

వున్న సమయమున గోకర్ణేశ్వరస్వామివారు యీాయన యందు కరుణించి నిల్పి కన్నులు దయచేసినారు గనుక అక్కడినుండి శ్రీశైలం వెళ్లినారు. పండితారాధ్యులవారి శాపం వల్లను బౌద్ధులు దినదినం ఖిలమై పోయిరి."*

పండితారాధ్యుఁడు చందవ్రోలునుండి వెడలిపోవునపుడు తాను రాజునెదుటఁ దీసిన నాలుఁగు కన్నులును లింగోద్భవదేవుని కర్పించెనఁట. ఆదేవుఁడు వానిని గైకొని తనమూఁడు కన్నులకు జత మూఁడుకన్నులు నింతకుఁ బూర్వమువిష్ణుచే నొకపాదముపై నర్పింపఁ బడినకంటికి జతగా రెండవ కాలిమీాద నొక కన్నును ధరించెనఁట.

చందవ్రోలునుండి పండితారాధ్యుఁడు తాను వెడలిపోవునప్పు డీక్రింది విధముగా వెలనాటిచోడరాజును శపించెను.

" ఈయసంఖ్యాత మహేశ్వరోద్ధతన, మాయత క్రోధోద్ధతానల చటుల విరచిత జ్వాలల వెలనాటిచోడ, ధరణీ తలాధ మేశ్వర పతంగంబు భస్మమయ్యెఁడును దద్బంధు సుతులు, విస్మయంబున నీవు భస్మమైపోదు రని శాపమిచ్చుచు నా పండితయ్య."

ఆ శాపమహిమచే నాచందవ్రోలు నందీక్రింద వర్ణింపఁబడి నట్లుత్పాతములుపుట్టి ప్రజలు చెల్లాచెదరై పాఱిపోయిరఁట.

" పురి మహోత్పాతములు పుట్టె
నేలగాలఁగఁజొచ్చె నింగివడ్డట్టు, చాలి మేఘంబు లా సన్నమై వర్వె,
బవలుచుక్కలు గానఁబడియె ధూమ్రంబు, గవిసెనెల్లెడ వంటకంబులు పుచ్చె,
భూకంపరావ మద్భుతమయ్యె రాత్రి, కాక కౌశిక జంబుకంబు లర్వ దొడఁగె,
గాలిధూళియుఁ బర్వెఁగడు మోరలెత్తి, తూలుచుఁ బశువులు దొరలంగఁజొచ్చె,
నింద్రచాపములు ఖండెందు చాపములు, చంద్రార్క పరివేషజాలముల్వొడిచె;
మనుజేశునకు నంత మంత్రివిరోధ,మును బ్రధాన విరోధమును సామ్తఘటపు,
రోధంబుఁ బుత్రవిరోధంబు నిరప, రాధంబు పుట్టెనూరను మారిమసఁగె

* Local Records Vol 19. p. 433.

ధరణి వెండియు మహోత్పాతములు పుట్టెఁబురి జనులు వెచ్చిరి భూమికి నవధి,
యదియేలతప్పుఁ దాహరగణక్షోభ, మదియేలతప్పు నా యయ్య శాపంబు
మొన్నఁ బండితుఁడు సమున్నతిఁబలికె, నిన్నను నుత్పాతములెల్లఁ గానె నేఁడు
పుట్టె గోత్రకలహములు దమలోన, నెట్టుగానున్నదో యింకఁ జోడనికి
సిద్ధంబు భక్తి విరుద్ధంబు ఫలము, సిద్ధింప నోపునే సేతన నట్టు
కలహంబుగానోపు గ్రందునోపుఁ, బ్రళయంబుగానోపుఁ బ్రజలకనింక
బురినున్కి నిటమీఁద బుద్ధిగాదనుచు, బౌరుగూళ్లకును దమపొందు పట్లకును
వారు వారికనేఁగ వడి నొక్కనాఁడు."

"కపాలాస్థిమాలలు ధరించినటువంటి భయంకరాకారము గల కంకాళము (అస్థిపంజరము లేక ఎముకలగూడు) ఒకటి కనుపించి కన్నుల నిప్పుల రాల్చుచు ఆగ్రహమ్ము పైఁ దొరికి త్రిశూలముతోఁ బొడిచినట్లు వెలనాటి చోడుఁడొక దినమునఁ గలఁ గాంచెను. అప్పటి నుండియు నాతని యుదరమున నొక గ్రంధి (గడ్డ) పుట్టి దిన దినము పెఱిగి జైన బౌద్ధాదులును, వైద్యులును నెన్నియుపాయములు చేసినను మానక,

" ఒడవుచు నొకనాటి కొకనాఁడు పుండు, వ్రీడవుచు రంధ్రములోపుచు జట్లు
సెలయుచుఁ జేవులు చెదరుచు ముఱికి, వలదుచు వాచుచు వ్రయ్యుచు గూడ
గ్రుళ్లుచుఁ గదలుచుఁ గూలుచు నూర్పు, లొల్లనయార్చుచు నూడుచు రసిక
జిల జిల నెత్తురు జీము గాఱుచును, విలివిలియఁగఁ జచ్చి విడిచి చూపఱకు
నేనంగ దోపంగ నిదియెంతపెద్ద, శైవాపరాధికి సర్వపాపునకు
ఘన శివద్రోహికి ఖలునకుఁ దనకు, నను ననంతపురిగరిగెఁ జోడండు,
అంత రాజ్యార్థమైయునిఁ బోరి యవని, సంతానమెల్ల నిస్సంతానమయ్యెఁ.
బాడవ్వ్యె భూమియుఁ బండితవిభుని, యీడిత శాప మహిష్ఠతఁ జేసి,"

మహిమా, పుట ౨౬౦,

బసవేశ్వరుఁడు తనకు దర్శన మీయకుండగనే మరణము నొందినందునఁ బండితుఁడు మిక్కిలి విలపింపఁగా నాతని ప్రాణలింగమందు బసవేశ్వరుఁ డాతనికిఁ గానిపించెనఁట.

" లింగార్చనంబుఁ జెల్లించుచుఁ జెలఁగి, సంగశౌరతులెత్తి మహిత తదీయ"
లింగ గర్భమున నల్లీల నొప్పారు, భంగిగా బసవయ్య భావంబు దోఁప,
కనుగవహర్ష కంకణములు దొరఁగఁ, దనువున రోమాంచ తతులు దలిర్ప,
గంధరంబునను గద్గదము సెక్కొనఁగ, బంధుగానందలి భ్రాంతిఁ బండితుఁడు
కనువిచ్చి జూచుచుఁ గరమర్థి మ్రొక్కుచును భజించుచు నభిస్తుతులు సేయుచు
ఈమూర్తి యస్మదీయేష్టలింగముమ, హాయూర్తిమైన వృషాధీశమూర్తి"

అంతటఁ బండితారాధ్యుఁడు శ్రీశైలము వైపునకువెళ్ళి పర్వతముక్రిందనున్న వెల్లటూరిలోఁ గాపురముండి తన శిష్యుఁడైన దోసయ్యను గిరి ప్రదక్షిణము చేసికొని రమ్మనెను. అతఁడు కొంత దూరము పర్వత యాత్రచేసిన తరువాత నాతనికిఁ గలలో శివుఁడొక ముసలి జంగము వేషమునఁ గానుపించి, యొక చెట్టెక్కించి శ్రీశైల పర్వతముమీఁద నున్నట్టియు క్షేత్రములన్నియుఁజూపి చెప్ప నీకు శ్రీగిరి ప్రదక్షిణ ఫలము వచ్చినదని యనుగ్రహించెనఁట. శైవ మతమునకు గురువైనపండితారాధ్యుఁడు తనకుఁ జిన్ననాటి స్నేహితుఁడనియు, నతనికి యాత్రాఫలము సిద్ధించినదని చెప్పవలసిన దనియు దోసయ్యతోఁ జెప్పెనఁట. అంతదోసయ్య పర్వతము దిగి వెల్లటూరునకువచ్చి పండితునితో నీ సంగతి చెప్పఁగా నాతఁడు సంతోషించె నఁట. శ్రీపర్వతము శివలింగమయముగాన వెళ్ళిన యెడల గాళ్ళతో లింగములఁ దన్నినట్లగును; వెళ్ళకున్న మల్లికార్జునుని జూచుట తటస్థింపదు. అని తలచి తనను శివలోకమునకుఁ దీసికొని పొమ్మని శివుని ప్రార్థించెనట. అంత శివలింగ మాతని నాతని భార్యా పుత్త్రులను దనలోఁ గలుపుకొనెను."

## తెలుఁగు దేశమున బుద్ధపూజలు.

పండితారాధ్య చరిత్రమునందు వెలనాటి చోడుఁడును, చందవ్రోలు కైఫీతునందు దుర్జయ వంశీయుఁడైన కొండ పడమటి బుద్ధ

రాజును బౌద్ధగురువుల శిష్యులనియుఁ దమగురువుల ప్రోత్సాహము వలన వారు శైవుఁడైన పండితారాధ్యుని కన్నులు తీయించిరనియుఁ జెప్పఁబడి యున్నది. కాని, ఈ మండలేశ్వరులచే నీయఁబడిన దాన శాసనము లన్నియు, దొరికినంత వఱకు శివకేశవుల కీయబఁడిన దానములుగ నున్నవేగాని బుద్ధునికిచ్చినవిగాలేవు. తనకుఁ బూర్వు లయిన వెలనాటి రాజులందఱును శైవులుగ నుండిరనియు, దాను మాత్రము బౌద్ధమత మంగీకరించితిననియుఁ, జరమదశలోఁ జెప్పి చోడుఁడు చింతించినట్లు పండితారాధ్య చరిత్రములో నున్నది.

" ధరణీశ్వరుఁడు తమ తరతరంబులకు, హరుని భక్తుల కాని యన్యులు లేరు,
కనియు వినియు నెఱుగని బౌద్ధమతము, దనకుఁ బ్రాప్తంబయ్యె ధర్మేతరంబు
వేదబాహ్యము ముక్తి విముఖంబు గాన్య, వాదంబగును బౌద్ధవాదంబనంగ,
పాపంబు దుర్బోధ పాలైతినింక, మహిమా. పుట ౨౯,

ఇట్లు వెలనాటి చోడరాజుగాని యాతని భావమఱఁదియగు బుద్ధరాజుగాని బౌద్ధమతావలంబులనుటకుఁ బండితారాధ్యచరిత్రయుఁ జందవ్రోలు కైఫీయతును దప్ప మఱియే యాధారములేక పోయి నను, నాకాలము నందును నంతకుఁ బూర్వకాలము నందును, గొంతవఱకుఁ దరువాతి కాలమందును, దెలుఁగు దేశముననను, విశేషముగ గుంటూరు ప్రాంతముననను, చందవ్రోలు వైపునను బుద్ధుని పూజలున్నందునకు గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా లోని అమరావతీ స్తూపమును, పల్నాటిలోని నాగార్జున కొండ స్తూపములును, కృష్ణాజిల్లాలోని నందిగామ తాలూకాలోని జగ్గయ్య పేట, రేపల్లె తాలూకాలోని చందవ్రోలునకు సమీపమున భట్టిప్రోలు స్తూపములు సాక్ష్యములు. చందవ్రోలు భూమిలో జైన బౌద్ధులరాగి ప్రతిమలు పెక్కులు దొరికినవి. * పండితుని కాలము నందు నాప్రాంతమున బుద్ధోపాసన కలదనుటకుఁ గొన్నిదృష్టాంత

* Chandavole :-Close by it were found buried a number of Buddhist or Jain copper images now in the Library at Bezwada.

Sewell's Antiquities Vol. I App. p. III.

ములు గలవు. బెజవాడ మల్లేశ్వరస్వామివారి దేవాలయమునందు మహామండలేశ్వరుండైన భీమన అను రాజుయొక్క సంధి విగ్రహి (మంత్రి)యైన సోమనప్రెగ్గడచే శా. శ. ౧౦౬౯ (క్రీ. శ. ౧౧౪౭) లో వేయంబడిన శాసన మొకటి గలదు. ఈ తండు "ఆంధ్రధరణి పంచారామముల మహాదేవరలకు బుద్ధదేవరకును జేబ్రోలు నమ్మహాసేనునకును (కుమారస్వామి) బిరుదపురము హుంకార శంకరికిం గరము వాసికెక్కిన బెజవాడ మల్లేశ్వర దేవరకు నఖండ దీపములు పెట్టించెను. 1 అమరావతిలో కోట రెండవ కేత రాజు శాసన మొకటి గలదు. 2 అది శా. శ. ౧౧౦౪ అనంగా క్రీ. శ. ౧౧౮౨ నాటిది. ఇందుమూలమున నా రాజు బుద్ధదేవునకుం గొన్ని గ్రామములు మొదలగునవి యిచ్చెను. ఇతని యుంపుడు కత్తెలును బుద్ధదేవర దేవారాధనకై గొన్ని గొఱియల నొసంగిరని తెలియుచున్నది.

అటు పిమ్మటం గొంతకాలము వఱకు నాంధ్రులు పూజించు చుండిరనుట శా. శ. ౧౧౫౬ (క్రీ. శ. ౧౨౩౪) లోని బయ్యాంబ శాసనమువలనం దెలియుచున్నది.3 ఇట్లుపండితుని కాలమునం దెలుగు దేశమునం గొంతవఱకుం బ్రచారమున నున్నను అదియె యంత్యదశ యని చెప్పవచ్చును. ఈ గురుమల్లికార్జున పండితారాధ్యునకుం బ్రతిస్పర్థిగ నేర్పడిన బౌద్ధగురువు బౌద్ధపదపదాచార్యుండని తెలియుచున్నది. ఇతండు బ్రహ్మవంశ సంజాతుండగు బ్రాహ్మణుండేయంట. ఈ బౌద్ధగురువును పండితారాధ్యుని శిష్యులు చంపుటచేతనే వెలనాటి చోడరాజున కాగ్రహము గలిగి పండితారాధ్యుని నవమానించుట సంభవించినది. పండితారాధ్య చరిత్రమునందు:—

"బ్రహ్మవంశజు బౌద్ధపద పదాచార్యు, బ్రహ్మఙ్ఞుం జంపింపం బాడియే యనుచు" అను వాక్యము మహిమా ప్రకరణమునందుం గనుపట్టుచున్నది.

1. Ep. R. 295 of 1892
2. Ep. Ind. Vol. VI. p. 152
3. Ep. Ind. Vol. VI. p. 157

## వీని గ్రంథమునందలి మత విషయములు.

తెలుఁగు దేశమునందలి బ్రాహ్మణులలో నారాధ్యులను పేరిటి యొక తెగవారు గలరు. వీరికి లింగధారణము గలదు. అఱవదేశమునందు స్మార్తులనే శైవులందురు. వారికి లింగధారణము లేదు. ఆదేశము నందలి బ్రాహ్మణేతరులలో వీరశైవులు పెక్కురు గలరు. పెక్కు మఠములును, పండారములును, గురువులును గలరుగాని వారి కెవ్వరికిని లింగధారణ లేదు. కాని శివాధిక్యతను బోధింతురు. కాని కర్ణాట దేశమునందు మాత్రము లింగధారులు గలరు. వారిని లింగాయతు లందురు. వీరిది బసవ సంప్రదాయము. తెలుఁగు దేశమునందలి యారాధ్యులది పండిత సంప్రదాయము. ఈ రెంటికి భేదమేమన నారాధ్యులు శ్రుతిస్మృతులయందుఁ బ్రమాణ భావము కలవారై గృహ్యసంస్కారములను వేదోక్తముగ జరుపు కొందురు. అంత్యసంస్కారమును, ప్రతి సంవత్సర శ్రాద్ధమును నాగమోక్తముగ జరుపుకొందురు. జాతిని పాటింతురు. లింగాయతులకు భక్తియే ప్రధానముగానెంచి వేదాదికములను మన్నింపరు. తెలుఁగు దేశమునందలి జంగములుగూడ నిట్టివారే. "జంధెము తీసివేసికొని జాతిని విడిచి తనలోవచ్చి కలియవలసినదిగా బసవేశ్వరుఁడు పండితునిఁ గోరినట్లును, నాతఁడు "భక్తి మీఁది వలపు బ్రాహ్మ్యంబుతోఁ బొత్తుబాయలేను నేను బసవలింగ" యని ప్రత్యుత్తరమిచ్చెనఁట! ఈతనిచే నేర్పాటు చేయఁబడిన యాచారములనే యారాధ్యులాచరించు చున్నారని యీ సంప్రదాయమువారు చెప్పెదరు. ఇతఁడు శివాధిక్యతనుగూర్చి తనగ్రంథములయందు నెక్కువగాఁ జెప్పియున్నను లింగధారణమును గూర్చి యొంత మాత్రముఁ జెప్పకుండుట యాశ్చర్య కరమైన విషయమె.

ఈ యన గ్రంథమునందు నద్వైతుల మాయావాదము యుక్తులచే ఖండింపఁ బడినది. మాయావాదమును ఖండించుటకై రామానుజకృత శ్రీభాష్యమునందుఁ జెప్పఁబడిన యనిర్వాచనీయానుప

పత్తి మొదలయిన యుక్తులు గ్రహింపఁ బడినవి కాని మాయావాద ఖండనమునందు నితఁడు విశిష్టాద్వైతులతో నేకీభవించిన వాఁడయి నను ఇతర విషయములలోఁ గేవలము ద్వైతిగానే యుండెను. వీని మతమునందు ప్రపంచము సత్యము; ఆత్మకంటె భిన్నము; జీవాత్మ పరమాత్మ లొక్కటికాదు. శివునకు జీవునకుఁ బర్వత పరమాణు భేదము గలదు. భక్తితో నీశ్వరుని సేవించినగాని కేవలము జ్ఞానము వలన ముక్తిరాదు. ఇతఁడు తన మతమును గేవలము యుక్తులచే స్థాపింపఁ బూనినను వేద ప్రామాణ్యమును విడువలేదు. వేదవాక్యములు కేవలము ద్వైతమునే భోదించునని ప్రతిపాదించి యున్నాడు. అద్వైత పరములుగాఁ గానవచ్చెడు వాక్యములకు ద్వైతపరముగా నర్థముఁ జెప్పఁ బ్రయత్నించినాఁడు.

“అద్వైత పరముగాఁ గానవచ్చెడు వాక్యము లీశ్వరుని యైశ్వర్యాద్వైతమునే బోధించునేగాని జీవ శివాద్వైతమును బోధింపవనియు, సర్వము శివుఁడనఁగా సృష్టియంతయు నాతని యధీనమని యర్థమనియు నీతఁడు వాదించియున్నాఁడు. “తత్త్వమసి” యను వాక్యమునకు మధ్వమతస్థులు “తస్య త్వమసి”యని యర్థము చెప్పుట మనమెఱుఁగుదుము. ఈ యర్థమునే పండితుఁడు మధ్వరాయలకు ముందే యీ క్రింది పద్యమునఁ జెప్పియున్నాఁడు.

“కం. జీవుఁడు శివుడను వాక్యము
భావింపఁగ నైక్యమునకుఁ బ్రతిపాదకమే
జీవుండనఁ బశుభృత్యుఁడు
గావున నీవాడ వేఱుగా దనుట శివా ?”

కావున నీలకంఠ శివాచార్యులవారు విశిష్టాద్వైతియైనను, పండితారాధ్యుఁడు మాత్రము ద్వైతియనియే చెప్పఁదగును. పండితుఁడు పండ్రెండవ శతాబ్దివాఁడును, మధ్వరాయలు పదుమూఁడవ శతాబ్దివాఁడు నగుట వలన * మధ్వరాయలే పండితుని వదనుండియో లేక యీ మతమువారినుండియో తత్త్వమసియను

* See Dr. Bhandarkar's Vishnavism P. 50

వాక్యమునకు "తస్యత్వమసి"అని యర్థము చేయుట గ్రహించి యుండునని లక్ష్మణరావుగారభిప్రాయ పడినారు.

ఈ గ్రంథమునందు శివభక్తి మహిమ విపరీతమైన విశేషములతోఁగూడుకొని యున్నది భర్త శివభక్తుఁడు కానియెడల భార్య వానిని విడువ వలయును. అనసూయ నాలాయను మునిపత్నులిట్లు చేసి శివునిచే వరములఁ బొందిరట. శివనిందచేయు గ్రంథములను గాల్పవలయును. తద్గ్రంథకర్తలఁ జంపవలయును. శివనిందకులఁ జంపినను, నా ప్రయత్నమునందుఁ జచ్చినను ముక్తి కలుగును. ఇట్లు శివనిందకులను జంపవచ్చునని యీ గ్రంథమందున్నను, బసవ పురాణమునందుఁ గొందఱు భక్తులు భవులను జంపిరన్నకథలున్నను తరువాతి వీరశైవు లెవ్వరు నిట్టి యమానుష కృత్యముల నొప్పిన వారు కాకుండిరి. కర్ణాటదేశము నందలి లింగాయతులేమి, తెలుఁగు దేశమునందలి యారాధ్యులేమి ప్రభుత్వమువారిచే శాంతి ప్రియులు గనే యెంచఁబడుచున్నారు. శివుని కొఱకు మృతినొందినవారి ప్రేత క్రియలతో నిమిత్తములేదు. వాని పుత్రాదులకు సూతకములేదు. వారి చావులకై యందఱుఁ బండుగలు చేసికొనవలసినది. శివునకు నైవేద్యముఁ జేసిఁగాని ఏ పదార్థమును భుజింపరాదు. శైవులు సూతక దినములలో సంధ్యావందన శివపూజాదికములను మానరు. ఎప్పటివలెనె చేసికొందురు. స్త్రీలు రజస్వలలైన దినములలోను, పురిటి దినములలోను శివపూజలు చేసికొందురు. ఇదేమియని యడుగ యజ్ఞదీక్షితునకు నాశౌచము వచ్చినయెడల కర్మవిడువఁడు. అట్లే చేయవలయు నందురు.

## పాలకుఱికి సోమనాథకవి.

మొదటి ప్రతాపరుద్రుని కాలమునఁ బ్రఖ్యాతికెక్కిన శివ కవులలో ముఖ్యుఁడీపాలకురికి సోమనాథుఁ డని చెప్పఁదగును. ఇతఁడు మొదటి రుద్రదేవుని కడపటి కాలమునను, గణపతిదేవచక్రవర్తి ప్రారంభ పరిపాలన కాలమునను నుండెనని తోఁచెమించుమించుగా క్రీ. శ. ౧౧౯౦ - ౧౨౨౦ సంవత్సరముల నడిమికాలమున నీ వీర

శైవకవి యున్నాఁడని నిర్ణయించుకొనుట కెట్టి సంశయముఁ బొంద నక్కఱ లేదు. వీని కులగోత్ర నామములను గూర్చియు, తదితరవిషయములను గూర్చియు సంవాదము చాల గలదు. సోమనాథకవి బ్రాహ్మణుఁడని కొందఱును, ఆరాధ్య బ్రాహ్మణుఁడని కొందఱును, సహజవీర శైవుఁడగు జంగముఁడని కొందఱును తలంచుచున్నారని వ్రాయుచు నీ విషయమున బాగుగాఁ బరిశ్రమచేసి పత్రికలలోఁ దఱచుగ వ్రాయుచున్న శ్రీయుతులు బండారు తమ్మయ్యనాయఁడుగారు "ఈతఁడు సహజవీర శైవుఁడగు జంగముఁ డనఁగా వీరశైవమతస్థులగు లింగాయతులకు గురుస్థానమును వహించు మతస్థులు లేక మాహేశ్వరు లని వ్యవహరింపఁబడు శాఖకుఁ జెందినఁవాఁడనుట తమ దృఢాభిప్రాయమని కాకతీయ సంచికలోఁ గవినిగూర్చి వ్రాసిన పెద్దవ్యాసములో వ్రాసియున్నారు * ఇతఁ డద్వితీయ పాండిత్యము గలవాఁ డయ్యును, వేదవేదాంగాది నైదుష్యము గలవాఁడయ్యును తన గ్రంథములలో బ్రాహ్మణులను బతితులనియుఁ, దాటిమాలలనియుఁ బచ్చిమాలలనియుఁ, గర్మచండాలు రనియుఁ బలుతావుల నిరసించియుండుటచేతను, పరమతసహనమించుకయు లేకుండ,

" జినసమయస్థుల శిరములు దునిమి
మును విష్ణుసమయుల ముక్కులుగోసి
యద్వైతులను హతహతము గావించి
విద్వేషబౌద్ధుల విటతటమాడి
చార్వాకవాదుల గర్వంబు లణచి "

అని యీ విధముగా బసవపురాణమునఁ బరమత దూషణ భాగంబుల జంకుగొంకు లేక యెక్కించినందువలన నీతని గ్రంథములకు వీరశైవులలోఁ దక్క నితరులలో వీని గ్రంథములకుఁ బ్రచారము చాల తక్కువయని చెప్పవచ్చును. అట్టి దూషణ భాగములను విడిచిపెట్టిన యెడల నీతని జానుతెనుఁగు కవిత్వము నెట్టివారికైనను

* ఈకవినిగూర్చి సమగ్రముగాఁ దెలిసికొనఁదలంచినవారు, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికా సంచికలలోను, భారతీపత్రికాసంచికలలోను, ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలలోను, ఇందువిషయమై విశేషకృషిచేసి సద్విమర్శనములఁ బ్రకటించుచున్న శ్రీయుత బండారు తమ్మయ్యనాయఁడుగారు వ్రాసిన వానిని జదివినవారికిఁ దెలియఁగలదు.

నాహ్లాదకరముగా నుండకమానదు. ఈకారణముచేతనే కాఁబోలు స్మార్తులును, వైష్ణవులు నగు బ్రాహ్మణులు ముట్టనొల్లకున్నారు. ఇతఁడు బసవపురాణము, పండితారాధ్య చరిత్రము, అనుభవసారము, చతుర్వేదసార సూక్తులు, సోమనాథ భాష్యము, రుద్రభాష్యము, బసవరగడ, గంగోత్పత్తిరగడ, సద్గురురగడ, చెన్నమల్లుసీసములు నమస్కార గద్యము, వృషాధిపశతకము మొదలగు గ్రంథములను బెక్కింటిని రచించి యున్నాఁడు. వీనిలో బసవపురాణమును, పండితారాధ్య చరిత్రమును, ద్విపదకావ్యములనుగా వ్రాసియున్నాఁడు. ఇతనికవితాశైలి మనోహరమైనదనుటకును సందియము లేదు. దూషణ ఘట్టములను విడిచిపెట్టిన యెడల వీరశైవుని వాఙ్మయమునం దుత్తమభాగము చాలగలదు. "అనుభవసార పద్యమున సోమనాథకవి "గురులింగతనూజుండ" నని వ్రాయుటచేఁ బలువు రీతనితండ్రి గురులింగార్యుఁడని భ్రమించిరి. గురులింగ మనునది తమ దీక్షాగురువులకు వీరశైవులు వ్యవహరించు విశేషణము గురువేలింగము, లింగమేగురువు, ఇరువురకు నభేదము. అంతేకాదు. చరలింగము అనఁగా జంగమము (భక్తుఁడు) నకుగూడ నభేదమని వారిమతము. గురువు దీక్ష యొసంగునపుడు హస్తమస్తక సంయోగ మొనర్చి భౌతికశరీరమును లింగశరీరముగ మార్చినంతనే తమకు వేఱొక జన్మము కలుగుననియుఁ, గావున గురుఁడే జనకుఁడనియు, నాతని హస్తాంబుజమే తమకు జన్మభూమియనియుఁ దలంచుట వీరశైవుల మతసంప్రదాయము." అని వీరశైవ మతసంప్రదాయముల బాగుగా నెఱింగిన శ్రీ బండారు తమ్మయ్యగారు వ్రాయుచున్నారు. ఈ సంప్రదాయ మెఱుంగని వాఁడనగుటచేత నీసందర్భమునఁ దప్పుటభిప్రాయమునే యిచ్చియున్నాను. బసవపురాణములో:-

> "భ్రాజిష్ణుఁడగు విష్ణురామదేవుండుఁ, జిష్ణువగు శ్రియాదేవియమ్మయును,
> గారవింపఁగనొప్పు గాదిలిసుతుఁడ, వీరమాహేశ్వరాచారతంత్రుండ"

అని చెప్పుకొనియుండుటచేత నీ కవితల్లి శ్రియాదేవియనియు, తండ్రి విష్ణురామదేవుఁడని స్పష్టముగాఁ దెలుపఁబడి యున్నది. ఈతని కవితాగురువు కరస్థలి విశ్వనాథ కవీంద్రుఁడని అనుభవసార

మందలి "విమల చిత్తపూర్తి విశ్వేశమూర్తి, వినమవర్తి భువన వినుతకీర్తి విభుకరస్థలంబు విశ్వేశ సూర్యా జనితవినుత కావ్యశక్తి యుతుండ" అను పద్యమును బట్టియు, "సుకృతాత్ముండగు కరస్థలి విశ్వనాథ ప్రకట వరప్రసాద కవిత్వయుతుండగు" నను బసవపురాణ వాక్యమును బట్టియు, "చరలింగఘనకరస్థలి విశ్వనాథ వరకృపాంచిత కవిత్వస్ఫూర్తిఁ జేర్చి," అను ద్విపద పాదములను బట్టియు, మనకు విశదపడుచున్నది.

"ఖ్యాతసద్భక్తిమైఁ గలకట్టకూరి, పోలిదేవరసద్గురుజశట్టుపింఁడ"

అను బసవపురాణ వాక్యమును బట్టియు, "పరమారాధ్యదేవు మనుమని శిష్యుండ" నను పండితారాధ్య చరిత్రవాక్యమును బట్టియు కట్టకూరి పోతిదేవరయు, బెలిదేవ వేమనారాధ్యుని మనుమఁడును గూడ నీతనికి గురువు లయినట్టు తెలియుచున్నది. సోమనాథుఁడు వీరియొద్దను వేదవేదాంగ విద్యలను నేర్చియుండవచ్చును.

శ్రీ శేషాద్రి రమణకవు లీతఁడు మొదటి ఉత్తమరాజువారను నియోగి బ్రాహ్మణవంశమున జనించిన నియోగిబ్రాహ్మణుఁడనియు, శిఖాయజ్ఞోపవీతముల విడనాడి జంగమములోఁ గలిసి పోయినట్లు యుత్తమరాజ వంశీయుల వలన వింటిమని వ్రాసియున్నారు. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు బసవపురాణమును ముద్రింపించి మొదట సోమనాథుఁ డారాధ్యబ్రాహ్మణుఁడై యుండి బసవేశ్వరుని యందు వ్యామోహ మెక్కువయై జ్ఞానము హెచ్చినకొలది జంగములలోఁ గలసిపోయి,అనుభవసారము నాటికి ప్రథమగణ పరమైన భృంగిగోత్రమును జెప్పికొని యుండునని యభిప్రాయమును దమ పీఠికలోఁ దెలిపియుండిరి. ఆబసవపురాణమును ముద్రింపించుటకుఁ బూర్వము పరిష్కరణ కర్తలుగా నుండిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సోమనాథుఁ డాజన్మాంతము బ్రాహ్మణుఁడుగనే యుండెనని వింత సిద్ధాంతమును దమయుపోద్ఘాతములోఁ బ్రకటించిరి. ఈవాదముల కన్నిటికి యుక్తియుక్తములగు ప్రత్యుత్తరములను "కవికుల గోత్రప్రశంశ" యను శీర్షికగల వ్యాసముతో శ్రీ బండారు తమ్మయ్యనాయుఁడుగారు చెప్పి యీతఁడు జంగముఁడేయని నిరూపించి యున్నారు.

33 క



# కాకతీయాంధ్రరాజయుగచరిత్రము

## పదియవ ప్రకరణము.

### కాకతిరాజుల చరిత్రము.

#### రేచెర్ల బేతిరెడ్డి - రేచెర్ల నామిరెడ్డి.

ఈమహావీరపురుషు లిరువురును మొదటి ప్రతాపరుద్రదేవ మహారాజునకు భృత్యులై భక్తితో నాతని సేవించుచు నామనగల్లుదుర్గమున కధిపతులై యుద్ధముల నజయ్యులై ప్రఖ్యాతిఁ గాంచినవారు. వీరలిరువురును సోదరులు. అయిన నిందెతఁడు పెద్దయో ఎతఁడు పిన్నయో నిశ్చయింప నాకరము గానరాక యున్నది. వీరి గృహనామము రేచెర్లవారని నామిరెడ్డి శాసనముల వలనను, బేతిరెడ్డి భార్యయైనయెఱుకసానమ్మ శాసనమువలనను దెలియుచున్నది. వీరిశాసనములు నైజాము రాజ్యములోని నల్లగొండజిల్లాలో సూర్యపేట తాలూకాలోనున్న పిల్లలమఱ్ఱిగ్రామమునఁ గానంబడుచున్నవి. రేచెర్ల నామిరెడ్డి క్రీ. శ. ౧౧౯౫వ సంవత్సరమునఁ బిల్లలమఱ్ఱిగ్రామమునఁ దనతండ్రి కామయ పేరిటఁ గామేశ్వరదేవుని, తనతల్లి కాచాంబపేరిటఁ గాచేశ్వరదేవుని తనపేరిట నామేశ్వరదేవునిఁ బ్రతిష్ఠాపనముచేసి గుళ్ళుకట్టించి శాసనము వ్రాయించెను. ఆశాసనమునందు

"శ్లో. నానావనీనాథ కిరీటకోటి రత్నాంశు నిర్ఘృష్టనిఖిత పాదపీఠే
నిర్గుప్త మమ్భోనిధివేష్టితాం తాంవిశ్వమ్భరాం శాసతి రుద్రదేవే"

అని నానాదేశరాజుల కిరీటాగ్రిఖచితము లగు రత్నముల కిరణము లచే స్పృశింపఁబడిన పాదపీఠము గల రుద్రదేవుఁడు సముద్రవేష్టిత మైన భూమిని బరిపాలించుచున్నట్లు చెప్పఁబడియెను. ఈశాసనమం దుఁదనతల్లిదండ్రిల నామములను మాత్రము పేర్కొనియెను గాని తనవంశమును వర్ణించి యుండలేదు. తానెచ్చటివాఁడో తనకుంగల బిరుదావళులెట్టివో వానిని సయితముఁ బేర్కొనియుండ లేదు. అయినను క్రీ. శ. ౧౨౦౨ వ సంవత్సరమునందు బిల్లలమఱ్ఱిగ్రామమున నామేశ్వరదేవునికి భూదానము చేసి మఱియొక శాసనము వ్రాయించెను. ఈశాసనములోఁ దనవంశమును, తనకుంగల బిరుదావళులను బేర్కొనెను. ఇతనివంశవర్ణనమునందు మొదట నీక్రింది శ్లోకము గన్పట్టుచున్నది.

"శ్లో. శ్రీమత్పద్మజపాదపద్మయుగళా ల్లోకత్రయాభ్యర్చితా
దుద్భూతే విపులే కులే నరవరో బమ్మాభిధానోఽ భవత్
యః కాఞ్చీనగరీ కవాటహరణం కృత్వా ప్రచణ్డాహవ
క్రీడశ్చోడనరాధిపస్య కృతవా న్మానదుర్మోన్మూలనమ్ "

శ్రీమత్కమలాసను పాదపద్మమునుండి యుదయించినజాతి (శూద్ర వంశము)లో బమ్మఁడను నరవరుఁడుదయించి కాంచీనగర కవాటమును భేదించి చోడనరాధిపునితో గొప్పయుద్ధముఁ జేసి విజయము గాంచినవాఁడని తాత్పర్యము. ఈశ్లోకమునుబట్టి యితని పూర్వులు రాజకీయాధి కారపదవులయందుండి యుద్ధములనుజేసి ప్రసిద్ధికెక్కిన వారనియే తలంపవలసి యున్నది. ఈబమ్మిరెడ్డి వంశమున ముంజ రాజును, అతనికిఁ గాటరాజును, అతనికిఁ గామరాజును, అతనికిఁ గాఘాంబయందు నామిరెడ్డియు జనించెను. ఇతని శాసనములలో

నెచ్చటను బేతిరెడ్డినామము గానంబడదు. "సకలగుణగణాలంకార, ఆమనగంటిపురవరేశ్వర, వీరలక్ష్మీనిజేశ్వర, దోర్బలభీమ, రణరంగరామ, వితరణకర్ణ, శౌర్య సంపన్న, పతిహితాంజనేయ, శౌచగాంగేయ సత్యరత్నాకర, దుష్టజనభీకర, మనుమకులాదిత్య, సుభటసంస్తుత్య, అనుబిరుదు లీతనికిఁ గలిగియున్నట్లుగా నీశాసనమునం బేర్కొనఁబడియెను. మఱియు నీశాసనమునందు —

" శ్లో॥ రాజ్యే నుతే గణపతే ర్నృపతే స్సుజాతే
విద్వద్గణప్రణుత సద్గుణరత్నవార్ధేః
కాన్తిప్రతాపవిభవాద్దధతః ప్రభావం
వ్యక్తం జనే శిశిరధామ సహస్రధామ్నోః. "

అని గణపతిదేవరాజును బేర్కొనియుండుటచేత నితఁడు గణపతిదేవుని రాజ్య ప్రారంభకాలమునఁకూడ నున్నవాఁడని వేద్య మగుచున్నది. క్రీ. శ. ౧౨౦౽ దవ సంవత్సరములో బేతిరెడ్డిభార్య ఎఱ్ఱకసానమ్మశాసనములో నామిరెడ్డిశాసనములోని వంశావళియే సరిగాఁ జెప్పఁబడినదిగాని తుదను గామిరెడ్డికిని, కాచమ్మకును ఆమె భర్త యైన బేతిరెడ్డిజనించె నని జెప్పఁబడినది. నామిరెడ్డి పేరెత్తలేదు. మఱియును నామిరెడ్డిశాసనములో నామిరెడ్డికిఁగల బిరుదావళులే బేతిరెడ్డికిని జెప్పఁబడియెను. ఇంతియగాక యెఱ్ఱకసానమ్మశాసనమునాఁటికి బేతిరెడ్డి బ్రతికియున్నట్టు గన్పట్టదు. అదియునుంగాక యామె శాసనములో ఎఱ్ఱకసానికి బేతిరెడ్డివలన మల్లారెడ్డి యను కుమారుఁడు జనించెనని చెప్పఁ బడుటయేగాక యాతని గుణవిశేషాదులును, పౌరుషపరాక్రమములును వర్ణింపఁబడినవి. ఈశాసనములు మూఁడింటిని బరిశీలింపఁగా నీక్రిందివిధమున దోఁచుచున్నది. క్రీస్తుశకము ౧౧౯౫ దవ సంవత్సరమున బేతిరెడ్డి యామనగల్లు దుర్గమున కధిపతియై పరిపాలనముఁ జేయుచు

ఎఱ్ఱక్కసాని శాసనములో నుదాహరింపఁ బడిన బిరుదావళులను వహించియుండెననియు, ఆకారణముచేత నతని తమ్ముఁడైన నామిరెడ్డి యప్పటి కాబిరుదములను వహించి యుండ లేదనియు, ౧౨౦౨ సంవత్సరమునాఁటికి నామిరెడ్డి యాబిరుదములను వహించియుండుట చేత నప్పటికి బేతిరెడ్డి మృతినొందియుండె ననియు, అతని మరణానంతరము తమ్ముఁ డాబిరుదములను వహించి యామనగల్లుదుర్గమున కధిపతియై యుండెననియుఁ దేటపడుచున్నది. ఎఱ్ఱక్కశాసనము నాఁటికి అనఁగా ౧౨౦౮ దవ సంవత్సరమువఱకు బేతిరెడ్డి బ్రదికియే యున్న యెడల ౧౨౦౨ వ సంవత్సరమున నతనితమ్ముఁడైన నామిరెడ్డి యన్నగారిబిరుదములను వహింపఁజాలఁడు. తనకును దన సోదరునకు నట్టిభేదభావమే లేనియెడల ౧౧౯౫ దవ సంవత్సరమున నట్టి బిరుదావళులు ధరింపకుండుట తటస్థింపదు. "కాఁబట్టి రేచెర్ల బేతిరెడ్డి మొదటి ప్రతాపరుద్రునికాలములోనే యుండెనుగాని గణపతిదేవచక్రవర్తికాలములో లేఁడని చెప్పవలసి వచ్చుచున్నది. ఎఱ్ఱక్కసాని పిల్లలమఱ్ఱిగ్రామములో ఎఱకేశ్వరుని బ్రతిష్ఠించి భూదానములను జేసెను. రేచెర్ల బేతిరెడ్డికి ఎఱ్ఱక్కసాని యందు జనించిన మల్లారెడ్డినిగూర్చి ఎఱ్ఱక్కసానిశాసనములో నిట్లభివర్ణింపఁ బడియెను.

"శ్లో॥ యస్యాః పుత్త్రః పవిత్రోన్నతనుతచరితోద్భూతసుఖ్యాతకీర్తి
ర్మల్లః ప్రోల్లాసితశ్రీర్వితతవితరణ శ్శస్త్రశాస్త్రప్రగల్భః
స్వేనోర్వ్యాలానయుద్ధోద్భటపటుచటులాఖర్వగర్వారివీర
వ్రాతాస్యామ్భోజరాజిప్రవిహితవిజయ శ్రీపదామ్భోజపూజః."

ఎఱ్ఱక్కసానికొడుకైన మల్లారెడ్డి పరిశుద్ధమైన యుత్తమ చరిత్రముచేత విశేషయశస్సును మహాసంపదలనుబొంది దాతయై శస్త్రశాస్త్రమునందుఁ బ్రగల్భుఁడై రణరంగమునందు దనచే ఖండింపఁబడిన శత్రువీరుల ముఖకమలములచే విజయలక్ష్మిపాదముల

నర్పించినాఁడని పై శ్లోకమునకుఁ దాత్పర్యము. ఇట్టి గుణవిశేషములచే నొప్పుచున్న పుత్త్రుఁడప్పటికి యౌవన వయస్కుఁడై యుండవలయునుగాని కేవలము బాలుఁడై యుండఁజాలఁడు. ఇతఁడుగాక మఱికొందఱు పుత్త్రు లుండిన యెడల వారలు పేర్కొనఁబడియే యుందురు. అట్టివారి పేరు లెవ్వరివియుఁ జేర్కొనఁబడి యుండక పోవుటచేతను వారలకు మల్లారెడ్డి యను పుత్త్రుఁడొక్కఁడే కలఁడని నిశ్చయింప వలసి వచ్చుచున్నది. రేచెర్ల బేతిరెడ్డినిగూర్చి శాసనములవలన గ్రహింపందగిన చరిత్ర మింతియే. బేతిరెడ్డి ౧౧౯౪ వ సంవత్సరమునకుఁ దరువాత మృతినొంది యుండ వలయును. ౧౧౯౮ వ సంవత్సరము మొదలుకొని మొదటి ప్రతాపరుద్రుని సోదరుఁడగు మహాదేవరాజు ౧౯౭ దవ సంవత్సరము వఱకుఁ బరిపాలనముచేసి యా సంవత్సరమున దేవగిరిరాజయిన చైత్రపాలునితో జరిగిన యుద్ధమున దు మృతినొందెను. ఆమనగంటి ప్రభువయిన బేతిరెడ్డికూడ మహాదేవరాజుతో యుద్ధమునకుఁబోయి మరణమునొంది యుండవలయును.

ఈ రేచర్ల బేతిరెడ్డినిగూర్చి యనేక గాథలు చిత్రవిచిత్రములుగా బట్టులచేఁ గల్పింపఁబడి పాటలు పద్యము లల్లఁబడి బేతాళనాయుని వంశీయులమని చెప్పుకొను వారిచే గ్రంథస్థములు గావింపఁబడి సర్వత్రవ్యాప్తి చేయఁబడి సత్యమైన చరిత్రాంశములను గప్పిపెట్టుచున్నవి.

### శ్రీవెలుగోటివారి వంశచరిత్రము. [1]

ఈ బేతిరెడ్డిగూర్చి శ్రీవెలుగోటివారివంశ చరిత్రమునందీక్రింది విధముగా వ్రాయఁబడి యున్నది.

---

1. ఈ గ్రంథము పద్మనాయక చరిత్రము, పద్మనాయక చరిత్రమునుబట్టి వ్రాయింపఁబడిన వేంకటగిరివారి వంశావళి, ఆ రెంటి ననుసరించి వ్రాయఁబడిన రావు వంశీయులచరిత్రము మొదలగు గ్రంథములలోఁ దమవంశమునుగూర్చి యసందర్భము లయిన విషయములు గలవని యూహించి శ్రీ వేంకటగిరి మహారాజా గారు శ్రీ వేల్లాల సదాశివశాస్త్రులవారిచేతను, శ్రీ అవధానము శేషశాస్త్రులవారి చేతను నూతనముగా వ్రాయించినది.

"వీరికి మూలపురుషుఁడు బేతాళనాయఁడని ప్రఖ్యాతిగాంచిన చెవ్విరెడ్డి అను రాజు. ఈ రాజు ఘనతఁగాంచిన కాకతి గణపతి దేవుని రాజ్యకాలమున శౌర్యధైర్యాదిలోకోత్తర గుణగణ పరిపూర్ణుఁడై యా మహారాజువలన మిగుల మన్ననగాంచుటయేగాక యనేక బిరుదములను మఱికొంత రాజ్యమును గాంచినవాఁడు. ఈ ఘనుఁడు వర్తమాన వేంకటగిరి సంస్థానాధిపతులగు శ్రీ శ్రీ రాజ గోపాలకృష్ణయాచేంద్రబహాదుర్ కె. సి. ఐ. ఇ. వారికి నిరువది యెనిమిదవ తరమువాఁడు. ఈ రాజశిఖామణి యీ వెలుగోటి శాఖకు మాత్రమేగాక జటప్రోలు, బొబ్బిలి, పిఠాపురము, మైలవరము, మొదలగు సంస్థానాధిపతులకు మూలపురుషుఁడు"

ఇయ్యది బట్టులువ్రాసిన వ్రాఁతలనునమ్మి యవిచార పూర్వకముగా వ్రాయఁబడిన వ్రాఁతవలెఁ గాన్పించు చున్నదిగాని సహేతుకమైన ప్రమాణముతోఁ గూడినదిగఁ గానంబడదు. సోమదేవ రాజీయమునందును, పద్మనాయక చరిత్రమునందును, వేంకటగిరి వారివంశావళి గ్రంథమునంధును, రావువంశీయుల చరిత్రమునందును, వీని నన్నిటిని బరిశీలించి సంస్కరణము గావించి నూతనముగాఁ బ్రకటింపించిన వేంకటగిరి రాజుల వంశచరిత్రమునందును, పిల్లలమఱ్ఱి శాసనములో నుదాహరింపఁబడిన బేతిరెడ్డియే పైసంస్థానాధిపతుల మూలపురుషుఁడైన బేతాళనాయఁడని చూపించిన హేతువులు పరస్పరవిరుద్ధములై యుక్తికిని సత్యమునకును దూరములై యున్నవి. మఱియు నీగ్రంథములలో సత్యములైనట్టియు, నసందర్భములైనట్టియు, విషయము లెన్నో యవిమర్శనపూర్వకముగాఁ జొప్పింపఁబడినవి. వానిని జక్కఁగా విమర్శించి యదార్థమిట్టిదని లోకమునకు వెల్లడిచేయకుండిన యెడల జనసామాన్యమా గ్రంథములలోని గాథలనే పరమప్రమాణములుగా శిరమున

వహింతురు. అందువలన సత్యమైన చరిత్రవ్యాపనకుఁ బ్రతి బంధకము గలుగును. కాఁబట్టి యీ బేతిరెడ్డికిఁ జెవిరెడ్డి యను నామము లేదనియు, బేతిరెడ్డి వేంకటగిరి, మైలవరము, పిఠాపురము, బొబ్బిలి సంస్థానాధిపతులకు మూలపురుషుఁ డని చెప్పఁబడు బేతాళ నాయఁడు కాఁ డనియు, సహేతుకముగా నిరూపింపఁబోవుచున్నాను.

చెవిరెడ్డి గాథ.

(1) ఈ రేచెర్ల బేతిరెడ్డికి బేతిరెడ్డియనియే జన్మనామముండె నుగాని చెవిరెడ్డి యను జన్మనామము లేదని బేతిరెడ్డి భార్యయైన యెఱుకసానమ్మ శాసనములో—

" శ్లో. తస్మా త్తస్యాం సమజని మహాదేవపాదాబ్జభక్తః
ఖ్యాతో బేత స్తతవితరణప్రీణిత ప్రాణివర్గః
ఆశాచక్రే ప్రవితత శరచ్చన్ద్రసాన్ద్రాంశురమ్యా
యస్యాత్యర్థం జనసుఖసముల్లాదినీ భాతికీర్తిః. "

అని సంస్కృతమునందును, "శ్రీమతు రేచెర్ల పిల్లలమఱ్ఱి బేతిరెడ్డి పెండ్లము" అని తెలుఁగునందును, ప్రయోగింపఁబడిన బేతి శబ్దముచేతనే స్పష్ట మగుచున్నది. కాఁబట్టి ప్రకృతము నైజాము రాజ్యమునకుఁ జెందియున్న నల్లగొండమండలములోని యామనగల్లు రాజధానిలోను, ఆమనగంటి కుత్తరభాగమున రెండుక్రోశముల దూరములో నున్న పిల్లలమఱ్ఱి రాజధానిలోను వసించి యా ప్రదేశ మేలినవాఁడు బేతిరెడ్డియే కాని బేతాళనాయఁ డను నామాంతర ముగల చెవిరెడ్డి మాత్రము కాఁడు.

(2) ఇతనికిఁ జెవ్విరెడ్డియను జన్మనామము మాఱి బేతాళ నాయఁడను పౌరుషనామము గలుగుటకుఁ గారణ మత్యద్భుతముగా నీక్రిందివిధమున శ్రీవెలుగోటివారి వంశచరిత్రమునందుఁ దెలుపఁబడి

యున్నది. బేతిరెడ్డికిఁ బూర్వమునఁ బదవతరమువాఁ డగు హేమాద్రిరెడ్డి మహాభుజపరాక్రమము గలవాఁడై రాజ్య పరిపాలనము సేయుచుఁ గోట్లకొలఁది ధనము గడించి యామనగంటి కుత్తరభాగమున ౫ మైళ్ళదూరమున నొకచోట భూమిలోఁ బాతిపెట్టి వానిపై నొకవేదిక గట్టించి యందు నొకవటవృక్షమును వేసి దానిక్రింద నొకభైరవుని బ్రతిష్ఠించి "ధనమును గాపాడి తనకులములో జనించినవారిలో సద్గుణగరిష్ఠుండు సత్కర్మనిష్ఠుండు నై కులదీపకుం డగువానికి సంఘటిల్లఁ జేయవలయు నని ప్రార్థించి తన యభిప్రాయము దెలియునట్లు భూమిలో గుప్తముగ నొకశిలాశాసనమును స్థాపించెనఁట! అనంతరము కొంతకాలమునకు వానివంశమునఁ జెవ్విరెడ్డి యుదయించి లోకోత్తర వీర్యసంపన్నుఁడై చండమార్తాండుని చందమునఁ దేజరిల్లుచు రాజ్యముచేయుచుండి యొక్కనాఁడు మృగయావినోదార్థమై వెడలి పరిజనంబు వెనుకంబడిన నొక్కఁడుగా హేమాద్రిరెడ్డి ధననిక్షేపముచేసిన ప్రాంతంబునకు దైవికంబుగఁ బోయెఁనఁట! అచట నీతని పోష్యవర్గములోఁ జేరిన రేచఁ డను నొకమాలవాఁడు భూమి దున్నుచుండి దైవాధీనముగ హేమాద్రిరెడ్డి స్థాపించిన శిలాశాసనము నాఁగేటిమొనకుఁ దాఁకి బయల్పడఁగా వాఁడు తన యేలిక పోవుచుండుటను జూచి యావృత్తాంతం బంతయు విన్నవించెనఁట! అంత చెవిరెడ్డి యచ్చటికేఁబోయి యాశిలాశాసనము నవలోకించి యావద్వృత్తాంతమును దెలిసికొని యాధనము గైకొనుటకై ప్రయత్నింపఁగా నాచెంత నున్న వటవృక్షము నాశ్రయించుకొని యున్న బేతాళుఁ డాయన ధైర్యమును బరీక్షించుటకై మాయాతిమిరమును మేఘములు నురుములు మెఱుములు వానయు గాలియుఁ గల్పించి పిడుగులు పడునటులఁ జేసెనఁట! అంతియగాక యా వటవృక్ష మాతనియెదుటఁ గూడఁ ద్రోచెనఁట! అప్పుడు

రేచఁడు మూర్ఛిల్లినఁట గాని చెవిరెడ్డి భీతిల్లక సలువం బడఁగా బేతాళుఁడు ఘోరాకృతినిఁ బూని చెవిరెడ్డిమీఁదికి రాఁగా నతఁడు జంకక సుస్థిరచిత్తుఁడై కోపోద్దీపిత మానసుండై ప్రచండతర వేదండ శుండా దండంబుపగిదిఁ దేజరిల్లు నిజభుజాదండంబున మృత్యుజిహ్వాగ్రంబు ననుకరించునట్టి మండలాగ్రంబునెత్తి ఖండింప నుద్యమింపఁగా బేతాళుండు వాని శౌర్య ధైర్య సాహసంబులకు మెచ్చుకొని నిజరూపముతోఁ బ్రత్యక్షమై తన పేరుచెప్పి 'నీధైర్యంబు నకు మెచ్చితి నీవు కోరినవరంబునిచ్చెద వేఁడు' మనియెనఁట! అంత చెవిరెడ్డి తన వంశమువారికి శాశ్వతైశ్వర్యము, రాజ్య భోగము, శౌర్య ధైర్యాది గుణసంపత్తి గలుగ వలయు ననియు, వారు యుద్ధమునకుఁ బోవునపుడు వారికి సహకారముగా ముందు బేతాళుండు నడువవలయు ననియుఁ గోరఁగా నతండా వరముల నొసంగి యంతర్ధాన మందెనఁట! పిమ్మటఁ జెవిరెడ్డి ధనము గైకొను టకుఁ బ్రయత్నింపఁగాఁ దనపూర్వునిచేఁ బ్రతిష్ఠింపఁబడిన భైరవ మూర్తి 'ఓయీ! ధనముగైకొన నీ వర్హుండ వగుదువుగాని దీనిని కొన్ని భూతము లాశ్రయించుకొని యున్నవిగాన నరబలియిచ్చి గైకొనుట శ్రేయోదాయకమని చెప్పి యంతర్హితుం డయ్యెనఁట! అంతట నారాజు నరహత్యకుఁ జింతించు చుండఁగా భైరవుని పల్కులు విన్నవాఁడు గావున రేచండనుమాలవాఁడు తన్ను బలియిచ్చి ధనము గైకొనుమని ప్రార్థించెనఁట! ఇంతకాలము నిన్నుఁ బెంచిన నే నాత్మ సుఖమునకై నదిగాని కేవలమాత్మ సుఖమునకై నిన్నెట్లు బలి యిత్తునని చెప్పఁగా రాజుల ధనము లోకహితమునకై నదికాదు గాన ధర్మజ్ఞులరయిన మీరు నా కోరినవరంబు లొసంగి నన్ను బలియిచ్చిన మీ కెంత మాత్రము దోషము ప్రసక్తింపదని రేచఁడు ప్రత్యుత్తర మొసంగెన్నఁట! అందుల కాతఁడొడంబడియెనఁట! తన వంశము

వారిని చెవిరెడ్డివంశమువారు పోషించుచు వారిగృహములలో వివాహములు జరుగునపుడు ముందుగాఁ దనవంశమువారికి వివాహములు జరుపవలయునని రేచఁడు వరమడిగెనఁట! ఆవరము నొసంగి చెవిరెడ్డి వానిని బలియిచ్చి యా ధనము గైకొనియెనఁట! పదంపడి యాతం డచ్చట సర్వపాపఘ్నముగా శివాలయంబు నిర్మింపించి శివప్రతిష్ఠ గావించెనఁట! ఈ వృత్తాంతము నంతయు విని యోరుఁగంటి నేల్యుచుండిన గణపతిదేవమహారాజు చెవిరెడ్డిని రప్పించి యతని యసహాయశూరత్వమునకు మెచ్చుకొని యామనగంటి రాజ్యముతోఁ జేరిన లక్కసీమనుఁ గజహయాదులను, కల్కితురాయిని, కిరీటమును, కాలికి గండపెండేర మనెడు బిరుదాభరణమును, ఛత్త్రచామరములను, బంగారు పూఁతపనిగల యొక చౌకళికత్తిని బహుమతిగా నొసంగి, పిల్లలమఱ్ఱి బేతాళనాయఁడను పౌరుషనామమిచ్చి పంపించెనఁట! ఆకత్తి యిప్పటికి సంస్థానములోఁ బూజింపఁబడు చున్నదఁట!

ఇది వేంకటగిరిరాజుల వంశ చరిత్రమును వ్రాసిన గ్రంథకర్తలయొక్క నవీన కల్పనమని ఘంటాపదముగఁ జెప్పవచ్చును. ఇదివఱకుఁ బద్మనాయక చరిత్రము నందును, వెలుగోటివారి వంశావళి యందును, రావు వంశీయుల చరిత్రమునందును వ్రాయఁబడిన గాథలకుఁ బ్రత్యక్ష విరుద్ధముగా నున్నది. ఆ గ్రంథములలోని యసందర్భములైన గాథలను జూచి వీరిట్టి నవీన కల్పనకు వెను దీయరైరి. హేమాద్రిరెడ్డి ధనమును బాతిపెట్టి శిలాశాసనము వ్రాయించె ననునది వీరు కల్పించిరి. చెవిరెడ్డి వీరవాఁడై యోరుఁగంటిలో వీరభటుఁడై కొన్నిదినములు గడపెనని పూర్వగాథలలో నున్నది.

"ఉ. అంత నకించనాస్త్రి మహాబలుఁ డప్పుడు బేరిసీమలో
వింతగ నింపుసొంపెసగ వేమఱు నామనగంటిలోపలన్
పంతము మీఱ సోదరులపాటిని నాడకుఁ బిన్నపెద్దయై
కొంతవహించె నచ్చటను గోరికఁ దా వ్యవసాయసాయతన్."

అని వేంకటగిరి వంశావలి గ్రంథమున వ్రాయఁబడినది. "అట్టి వ్యవసాయమునకుఁ బాలికాఁపుగా రేచఁడనునొక పంచముని నిర్ణయించి యుంచెను. నిత్యమును వానికి నియోగింపవలసిన పనులు నిర్ణయించి చెప్పుచుండును." అని రావువంశీయుల చరిత్రమునందు వ్రాయంబడి యున్నది. చెవిరెడ్డి యానతి రేచఁడు నాగభైరవుని గుడికడ నున్న యొక పొలమును దున్నుచుండఁగా నాగఁటికిఁ దగిలి యొక శాసనము గనుపట్టెనని మాత్రమే చెప్పఁబడినది. చెవిరెడ్డి యా శాసనమును జదివి రేచనితో రెండులక్షల ధన మున్నదని చెప్పినట్లుగా పద్మనాయక చరిత్రములో నీ క్రింది పద్యములో:—

"చ. కనుగొనివచ్చి రేచఁ డతికౌతుక మొప్పఁగ రెడ్డిసన్నిధిన్
వినుతవిశేయుఁడై యపుడు నేడుకమీఱఁగ విన్నవింపఁగా
ఘనుఁ డరుదెంచి చూచి కుతుకంబున సాంతముగాఁ బఠించి తా
ననియెను రెండులక్షల పదార్థము లుండెనటంచు వానితోఁ."

అని వ్రాయఁబడినది. కాని వేంకటగిరివంశావళిలో:—

"గీ. కదురయంబున రేచనిఁ గాంచి యచట
గంటె నవలక్ష విత్తంబు గలదు నరుని
బలి యొసఁగి దీనిఁ గైకొనవలయు ననుచు
వ్రాసియున్నది యిక్క మీశాసనమున"

అని రేచనితోఁ జెవిరెడ్డి చెప్పినట్లు భేదముగా నున్నదిగాని హేమాద్రి రెడ్డి ప్రశంస నెవ్వరె త్తియుండలేదు. రేచఁడు మూఁడువరములు గోరినట్లు పద్మనాయకచరిత్రమునందును, నాలుగు వరము లిచ్చినట్లు వేంకటగిరివంశావళి యందును జెప్పఁబడి యుండఁగా వేంకటగిరి రాజులవంశచరిత్ర మను నీనూతనగ్రంథమున నొక్కవరమే పేర్కొనఁబడి యున్నది. తక్కినవరముల సంగతులు నామిరెడ్డి ఎట్టుక్కపొని శాసనములవలన నసత్యములుగ నేర్పడినవి గనుకను,

వారియిండ్ల వివాహములు జరుగు నప్పుడు మాలవాండ్రకుఁగూడ వివాహముచేయు నాచారము ఇప్పటికిఁగూడ జరుగుచున్నది గనుక నీవివాహ వరమును మాత్రిమే పేర్కొని రేచని పేరిట రేచెర్ల గోత్రముఁ బెట్టుకొనుట మొదలగునవి విడిచిపెట్టవలసి వచ్చినది. కాకతిగణపతిదేవరాజు చెవిరెడ్డిని సన్మానించిన తరువాత,

"క. నాఁడాదిగ సుకవీంద్రులు
వేడుక బేతాళుఁ డనుచు వేమఱు దిశలన్
బోఁడిమి నుతింప వినుతుల
కోడక యవ్విభుఁడు ధాత్రినొగిఁ జెలువొందెన్."

అని చెప్పఁబడి యుండఁగా నూతనగ్రంథమునందు బేతాళ నాయఁ డని గణపతిదేవుఁడు పౌరుషనామ మొసంగె నని చెప్పఁబడి యున్నది. ఇట్లీ గ్రంథములందుఁ బరస్పరవిరుద్ధము లైన విషయము లనేకములు గలవు. ఇదివఱ కున్న వెంకటగిరి వంశావళి మొదలగు గ్రంథములలోని గాథలు చరిత్రాంశములకు విరుద్ధములుగ నున్నప్పుడు విశ్వసింపక పోయిన భంగము లేదుగాని యాగాథలను మార్చి వేఱువిధముగఁ జెప్పుటకుఁ గారణమేమి ? పద్మనాయక చరిత్రములో మూలపురుషుఁ డాదిజగన్నాథరా వని చెప్పఁబడియుండఁగా హేమాద్రిరెడ్డి యని నూత్నగ్రంథమునఁ బేర్కొని యున్నారు. చెవిరెడ్డి తండ్రి పోలిరెడ్డియని,

"క. ఆపరమపావనాన్వయ
దీపకుఁడై పోలిరెడ్డి ధృతి జనియించెన్
ఆపుణ్యగుణవరేణ్యుం
డేపుఁ జెవిరెడ్డిఁ గనియె నిల వినుతింపన్."

అని పద్మనాయక చరిత్రమునఁ గానంబడుచున్నది.

ఆదిజగన్నాథరావు పోలిరెడ్డి నామములుగాని, హేమాద్రి రెడ్డి నామముగాని, రేచెర్లనామిరెడ్డి ఎఱ్ఱక్కసాని శాసనములలోఁ గానరావు. ఇవన్నియు నటుండనిచ్చి యొక్క విషయమును విమర్శించి చూతము. చెవిరెడ్డికి బేతాళనాయఁ డను బౌరుషనామమును గణపతిదేవుఁ డెప్పు డొసంగెనో విమర్శించి తెలిసికొను టత్యావశ్యకమై యున్నది. ఎఱ్ఱక్కసాని శాసనమునాఁటికి అనఁగా క్రీ. శ. ౧౨౦౫ వ సంవత్సరమునాఁటికి ఎఱ్ఱక్కభర్త బేతిరెడ్డి యనియే చెప్పంబడి యుండుటచేత నంతకుఁ బూర్వమే యీ వృత్తాంత మంతయు నడచి యుండవలయునుగదా. చెవిరెడ్డియొక్క యిట్టిప్రసిద్ధ కృత్యముల వేనిని ఎఱ్ఱక్క తన భర్తను వర్ణించు సందర్భమున వర్ణింపకుండుటకుఁ గారణమేమి? మఱియు వితరణకర్ణ, శౌచగాంగేయ, సత్యరత్నాకర, దుష్టజనభీకర, వీరలక్ష్మీనిజేశ్వర యను బిరుదములను బేతిరెడ్డి వహించియుండెనని యామె శాసనముంబట్టి తెలియుచున్నది గదా! ఇట్టి వితరణకర్ణుఁడు, శౌచగాంగేయుఁడు, దోర్బలభీముఁడు, రణరంగ రాముఁడు, శౌర్యసంపన్నుఁడు నైన బేతసదండనాథుఁడు తా నైశ్వర్యసంపన్నుఁడై యుండియు, ప్రభువై యుండియు, తుచ్ఛధనమునకై తనయందు భక్తి విశ్వాసములు గలిగి యనేక సంవత్సరములుగాఁ దనచేఁ బోషింపఁబడుచు తన్ను బలియిచ్చి ధనము గైకొను మని చెప్పునంతటి విశ్వాసపాత్రుని రేచఁడను వానిని క్షుద్రదేవతల ప్రీతికై సంహరించె ననుమాట విశ్వసించుట కెంతమాత్రము నొప్పి యుండ లేదు. ఎఱ్ఱక్క సానిశాసనము నాఁటికి గణపతి దేవుని పరిపాలనము ప్రారంభమై పది సంవత్సరములయ్యెను. ఈలోపలనే బేతిరెడ్డి యను బేతాళనాయనికి గణపతి దేవునివలన సమ్మానములు గలిగి పై బిరుదములు వహించుట తటస్థమయ్యెనని చెప్పవత్తురేమో? అదియు విమర్శింతము. ౧౨౦౮ దవ

సంవత్సరమున బేతిరెడ్డి కలంకరింపఁబడిన ౧౨౦౨ వ సంవత్సరమున నామిరెడ్డిగూడ వహించి యుండెను. వెలుగోటివంశ చరిత్రకారులు నామిరెడ్డి బేతిరెడ్డి కన్న యని యూహించుచున్నారు. కాఁబట్టి పై కార్యములకు బిరుదములకు నెట్టి సంబంధము లేదు. నామిరెడ్డి నామము బేతిరెడ్డికి నామాంతరమని చెప్పుటకు వలనుగాదు. నామిరెడ్డిభార్య యైతాంబయని చెప్పబడినది గాని యెఱుక్కయని చెప్పఁబడి యుండలేదు. వాదముకొఱకు నామిరెడ్డి బేతిరెడ్డి కన్న యనియే యొప్పుకొందము. అతఁడు వహించిన బిరుదములచేతను జ్యేష్ఠుఁడగుటచేతను ౧౨౦౨ వ సంవత్సరమున నామనగల్లు ప్రాంత దేశము నతఁడే పరిపాలించుచుండెనని చెప్పక తప్పదు. అన్న పరిపాలనము చేయుచుండ తమ్మునికిఁ గిరీటము నిచ్చె ననుట యసందర్భము గాదా. వాస్తవముచేత నామనగంటి ప్రభువులు కిరీటాధిపతులుగారు. కిరీటాధిపతులని యొకవేళ నంగీకరించినను జ్యేష్ఠుఁడు పరిపాలనము సేయుచుండగాఁ గిరీట మొసంగెననుట ధర్మ విరుద్ధము. అప్పటికి నామిరెడ్డిగూడ మృతినొంది యుండవచ్చునని చెప్ప సాహసింప వచ్చును. అట్లయినచో జ్యేష్ఠుని రాజ్యముతో గూడ కిరీటాది రాజచిహ్నములు తమ్మునికి సంక్రమింపక మానవుఁ అట్టి కిరీటాది రాజచిహ్నములను వహించి యుండఁగా మరలఁ గిరీటము నొసంగ నవసరము లేదు. ఎఱుక్కసాని శాసనమున నామె భర్తయొక్క వీర్యవితరణాది గుణగణంబు లభివర్ణింపఁ బడియెనుగాని యతఁడు కిరీటాధిపతియని యభివర్ణింపఁబడి యుండ లేదు. మఱియు,

"శ్లో. రాజత్కీర్తిర్గణపతినృప స్యాఖిలోర్వీశచూడా
రత్నవ్రాతద్యుతితతి సముద్భాసితాఙ్ఘ్రి ద్వయశ్య
సన్మర్యాదానిరతనిఖిలక్ష్మాజనే వర్తమానే
రమ్యే రాజ్యే విపులసుఖదే ప్రోన్నతస్య ప్రహృష్టైః."

సమస్త భూపతుల కిరీటరత్న కాంతులచేఁ బ్రకాశింపఁ జేయఁ బడిన పాద యుగ్మము గలిగిన ప్రహర్షముచే నిండియున్న గణపతి దేవుని రాజ్యకాలమున అని మాత్రము చెప్పిన తరువాత నామె దాన ధర్మమునుగూర్చి ముచ్చటింపఁ బడియెను. అంతియెగాని తన భర్తయైన బేతిరెడ్డి గణపతిదేవ చక్రవర్తి వలన విశేష రాజ్య వైభవములను గిరీటమును దక్కుఁగల యాయుధ విశేషంబులను బడిసినట్లు చెప్పయుండ లేదు. ఇంక నామిరెడ్డి శాసనమున గణపతి దేవ చక్రవర్తి వర్ణింపఁబడిన పిమ్మట,

"శ్లో. తస్య ప్రసాదా త్పృథువైభవస్య
పృథుప్రదానస్య విభోః పృథుశ్రీః
నామః కృతిస్తుత్యగుణాభిరామః
కాంచామ్బికాసూను రసూనసత్త్వః."

అని గణపతిదేవునియొక్క ప్రాసాదముచేతనే యధికవైభవమును, అధిక సంపదయును, మొదలగువానిం బడసినట్లు చెప్పఁబడి యున్నది. ఇట్లే మొదటి శాసనమునఁ బ్రతాపరుద్రుని ప్రసాదము చేత నామిరెడ్డి యైశ్వర్యమును బొందెనని చెప్పఁబడి యున్నది. ఏతత్ప్రసాద వైభవముచేతనే నామిరెడ్డి పిల్లలమఱ్ఱి గ్రామంబున గట్టించిన కామేశ్వర కాచేశ్వర నామేశ్వర దేవాలయంబు లేక శిలానగరంబునఁ బ్రతాపరుద్రుండు నిర్మింపించిన యాలయత్రయంబు చందంబున నత్యున్నతములై లోకోత్తర శిల్పంబుతో గురువింద శిలామయములై వెలయుచున్నవి. ఎఱ్ఱక్కసానిశాసనము నాఁటికి బేతరెడ్డి మరణమునొందియుండుటచేతనే యామె తనయత్తింటివారి యొక్కయుఁ బుట్టినింటివారియొక్కయు వంశాభివర్ణనము గావించి తన ధర్మములనుగూర్చి చెప్పకొనుట తటస్థించినది. ఈవిషయము లన్నిటినిజూచి విమర్శించినప్పుడు శివిరెడ్డిగాథ విశ్వాసపాత్రమైనది. గాదని నిష్పక్షపాతబుద్ధిగలవారికి బోధపడక మానదు.

ఈగాథల నన్నిటిని విడిచిపెట్టి వెలుగోటివారి వంశవృక్షము నం జేర్పఁ బడిన పురుషులయొక్క కాలనిర్ణయాది విషయములనుబట్టి చూచినను, ఏతచ్చరిత్రములోని పురుషులనుగూర్చి వ్రాయంబడిన యసందర్భవాక్యములనుబట్టి చూచినను, బేతిరెడ్డి వేంకటగిరి, మైలవరము, పిఠాపురము, బొబ్బిలి, జటప్రోలు సంస్థానాధిపతులకు మూలపురుషుం డను సిద్ధాంతము నిలువఁ జాలదు.

## బేతిరెడ్డి మూలపురుషుఁడు కాఁడు.

వెలుగోటివారి వంశచరిత్రమునందుఁ బిల్లలమఱ్ఱి బేతాళనాయనికి "దామనాయఁడు, ప్రసాదాదిత్యనాయఁడు, రుద్రనాయఁడు," అను ముగ్గురు కొడుకులు గలరనియు, వారిలోఁ జ్యేష్ఠుఁడైన దామానాయనికి ౧ వెన్నమనాయఁడు, ౨ సబ్బినాయఁడు, 3 పెద్దన్న, ౪ బ్రహ్మనాయఁడు, ౫ పేర్నిఁడు, ౬ సూర్నిఁడు, ౭ మల్లినీఁడు" అను పుత్త్రులు గలరనియు నుదాహరింపఁబడియెను శ్రీనాథకవిరాజప్రణీతమైన పల్నాటివీరచరిత్రమున బేతినాయనికి దొడ్డనాయఁడును, అతని "పెద్దన్న, బ్రహ్మనాయఁడు, పేర్నిఁడు, సూర్నిడు, మల్లినీఁడు" అను నేవురుపుత్త్రులు గలరనియు, వ్రాయంబడి యున్నది. రేచెర్ల బేతినాయని నామమును గాంచి భ్రమించియో, పల్నాటివీరులలో సుప్రసిద్ధుఁడైన బ్రహ్మనాయఁడు వెలుగోటివారి వంశములోనివాఁడే యై యుండునన్న సంపూర్ణ విశ్వాసముచేతనో, పల్నాటివీరుల కాలముం దెలిపెడి చరిత్రాంశము లెఱుంగమిచేతనో, మఱి యేమికారణముచేతనో, పిల్లలమఱ్ఱి బేతాళనాయని వంశమును పల్నాటిబేతినాయనివంశమును నొక్కటిగఁ జేసి బేతిరెడ్డియే బేతాళనాయఁ డని హేత్వాభాసములతో సిద్ధాంతము చేసియున్నారు.

బ్రహ్మనాయని తండ్రి దొడ్డనాయఁడని పల్నాటివీరచరిత్ర మునం జెప్పఁబడి యుండుటచేతను, పిల్లలమఱ్ఱి బేతాళనాయనికొడుకులలో దొడ్డనాయుఁడను వాఁడు లేకుండుటచేతను, సంబంధమునకుఁ జిక్కుఁగలుగఁగా బేతాళనాయని పుత్త్రులలో దామానాయఁడు జ్యేష్ఠుండగుటంజేసి దొడ్డనాయఁడని పిలువఁబడు చుండవచ్చును గాన, నతనికి దొడ్డనాయఁడని నామాంతర ముండవచ్చు నని సమాధానముఁ జెప్పి సమర్థింపఁ జూచుచున్నారు. రేచెర్ల బేతిరెడ్డి బేతాళనాయఁడని చెప్పుటచేత మఱియొక చిక్కు తటస్థ మయ్యెను. బేతిరెడ్డికి మల్లారెడ్డి యను పుత్త్రుఁడు కలఁడని బేతిరెడ్డి భార్యశాసనములోఁ జెప్పఁబడి యున్నది. అప్పుడు మల్లానాయనికి దామానాయఁడని నామంతర ముండవచ్చునని సమర్థింపఁజూచుచున్నారు. ఈ యంతలబొంతలమాఱి సంబంధమువలన బేతిరెడ్డి కొడుకు మల్లారెడ్డి కొందరకు మల్లానాయఁడుగాను, మఱికొందఱకు దామానాయఁడుగాను, ఇంకకొందఱకు దొడ్డనాయఁడుగాను, వెలుగోటి వంశచరిత్రకారులకు "మల్లానాయఁడు, దామానాయఁడు, దొడ్డనాయఁడు" అను త్రిస్వరూపము లేకరూపముగాను గన్పడఁజేయునట్టి యవతారములఁగాంచి కడగండ్లపాలుగావలసివచ్చినది. పోనిండు. ఆగ్రంథకర్తల యభిప్రాయానుసారముగానే మల్లానాయఁడే దామానాయఁ డనుకొందము. అట్లయిన నెట్టుక్కసానిశాసనమునాఁటికి మల్లానాయఁడు దామానాయఁడు అను దొడ్డనాయనికి సంతానము లేదని యెట్టుక్కసాని శాసనమును బట్టి స్పష్టమేగద! అనఁగా క్రీ. శ. ౧౨౦౮ వ సంవత్సరమునాఁటికి దొడ్డనాయనికి సంతానము జనింపలేదు. ఒకవేళఁ బుట్టినారని యూహించినను శిశువులై యుండవలయును గదా. బ్రహ్మనాయని కాలము మనము తెలిసికొన్నచో యథార్థస్థితి బయల్పడక మానదు. పల్నాటిప్రభు వయిన యలుగురాజు పుత్త్రులలో మలిదేవరాజు పక్ష

మును బూనిన బ్రహ్మనాయనికిని నలగామరాజు పక్షమును బూనిన నాగాంబ యనియెడు నాయకురాలికిని ఘోరయుద్ధము జరిగె ననుట పల్నాటి వీరచరిత్రము వలనఁ బ్రసిద్ధ మగుచున్నది. ఈయుద్ధము క్రీ. శ. ౧౧౭౬—౧౧౮౨ సంవత్సరముల నడుమ జరిగె నని యనేక చరిత్రాంశములను బట్టి నిర్ధారింపఁబడుచున్నది. పల్నాటి వీరచరిత్రమునఁ బ్రతాపరుద్రుఁడు నలగామరాజునకు యుద్ధకాలమున వేయిగుఱ్ఱముల నంపె ననియు, ధరణికోట రాజైన భీమరాజునకు వర్తమానమంపెననియు, అతనికొడుకు రెండవ కేతరాజు రాయబారము వహించెననియు, నలగామరాజునకు సాగిపోతరాజు సాహాయ్యముఁ జేసెననియు, కళ్యాణపురి బిజ్జలునికొడుకు వీరసోమేశ్వరుని కూఁతును మలిదేవరాజునకిచ్చి పెండ్లి చేయఁబడెననియు చెప్పఁబడి యున్నది. హొసల రాజయిన రెండవ వీరబల్లాళుని నామమును, వెలనాటిచోడగొంక రాజు నామమును ఉదాహరింపఁబడినవి. వీరందఱును గొంచె మించు మించుగా సమకాలికులై యున్నారు. వీరిలోఁ గోటకేతరాజు ౧౧౮౨ వ సంవత్సరమునఁ బరిపాలనము వహించినవాఁడు గావునఁ బల్నాటి వీరుల యుద్ధకాలమున నితనితండ్రి భీమరాజు ధరణికోటలోఁ బరిపాలనము సేయుచుండెను. కేతరాజు బ్రహ్మనాయని కడకు రాయబారము గొనిపోయెను. బిజ్జలునికొడుకు వీరసోమేశ్వరుఁడు మృతినొందిన తరువాతనే పల్నాటి యుద్ధము జరిగెనని చెప్పఁబడినందునను, వీరసోమేశ్వరుఁడు ౧౧౭౬ వ సంవత్సరము వఱకుఁ బరిపాలముఁ జేసినందునను, పల్నాటియుద్ధము ౧౧౭౬-౧౧౮౨ సంవత్సరములకు నడుమ జరిగెననుట కేసందేహమును లేదు. ఇంత యేల? మొదటి ప్రతాపరుద్రుఁడు నలగామరాజునకు సైన్యమునంపె నని చెప్పఁబడియుండుటచేత ౧౧౯౬ వఱకుఁ బరిపాలనము చేసిన ప్రతాపరుద్రునితో బ్రహ్మనాయఁడు సమకాలికుఁ డనుట స్పష్టము

గదా. ౧౨౦౮ దవ సంవత్సరమునాటికి బ్రహ్మనాయని తండ్రి యగు దొడ్డనాయఁడనెడు దామనాయఁడను మల్లానాయనికి సంతానమే లేక యుండఁగాఁ బ్రతాపరుద్రునితో సమకాలికుఁడగు తన తాతయైన బేతినాయనితో బ్రహ్మనాయఁడెట్లు సమకాలికుఁడయ్యెను? ఆ యుద్ధమునాఁటికిఁ గోడలితోఁ గాఁపురము సేయుచున్న కొడుకు గూడ బ్రహ్మనాయనికిఁ గలఁడు. అనఁగాఁ బ్రపితామహుఁడు, పితామహుఁడు, మనుమఁడు, వయసువచ్చిన మునిమనుమఁడు నేక కాలమున నున్నవారని చెప్పవలసి వచ్చును. ఇది యెంతయు నసందర్భముగా నున్నదికదా? బేతాళనాయఁడు గణపతిదేవునివలన సత్కారములను బొందక పూర్వమే బ్రహ్మనాయఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమున జరిగిన పల్నాటి యుద్ధములో విజయము గాంచినట్లు బోధయగుచున్నదిగదా? పల్నాటి వీరచరిత్రములో బ్రహ్మనాయనితండ్రి దొడ్డనాయఁడు యుద్ధమునాఁటికిఁ జనిపోయెనని చెప్పఁబడి యున్నది. ౧౨౦౮ దవ సంవత్సరములో సెట్టిక్కసాని శాసనములో నభివర్ణింపఁబడి బ్రతికియున్న యామె పుత్త్రుఁడు మల్లానాయఁడనెడు దొడ్డనాయఁడు ముప్పది సంవత్సరములకుఁ బూర్వమే మృతినొందవలసిన దురవస్థ పట్టినదిగదా! ఆ యాగ్రంథములలోనుండు విషయములను విచారింపక కల్పిత గాథలను బట్టు పొగడ్తలను నమ్మి వంశవృక్షములను గూర్చినచోఁ జరిత్రకారులు తప్పక పరిహాస పాత్రులుగాక మానరు. కాఁబట్టి తేలిన పర్యవసానమేమనఁగా, వెలుగోటివారివంశ చరిత్రమును, తద్వంశ వృక్షమును చరిత్రమునకు విరుద్ధముగాఁ గూర్పఁబడియున్నవనియు, వానినిసంస్కరింపించుకోవలసి యున్నదనియు స్పష్టమగుచున్నది. రేచెర్ల, పిల్లలమఱ్ఱి, బేతిరెడ్డి, వెంకటగిరి, పిఠాపురము, మైలవరం, జటప్రోలు, బొబ్బిలి సంస్థానాధిపతులకు మూలపురుషుఁడు కాఁడనియు, పల్నాటి వీరుఁడైన బ్రహ్మనాయఁడీ పిల్లలమఱ్ఱి బేతిరెడ్డికి మనుమఁడుగాఁడనియు

ఈ బేతిరెడ్డికి మల్లారెడ్డియను కొడుకొక్కఁడే గలఁడనియు, సిద్ధాంత మగుచున్నది. వెలుగోటివారి పూర్వులయిన యనపోతానాయఁడును, మాధవనాయఁడును, వారి శాసనములలో వెన్నమనాయని నుండియే తమ పూర్వులను జెప్పుకొని యున్నారుగాని పిల్లలమఱ్ఱి బేతిరెడ్డిని మూలపురుషునిగాఁ జెప్పికొనియుండలేదు. సర్వజ్ఞ సింగమనాయఁడు సయితము తన సింగభూపాలీయమున ౮ గవ తరములోని దాచి నాయని మొదలుకొని వంశజులను వర్ణించెనుగాని సుప్రసిద్ధులయిన బేతిరెడ్డి మొదలగువారి నెవ్వరిని జేర్కొనియుండలేదు. ఇప్పటివారి కంటె వారు ప్రాచీనులు గనుక వారికీ గాథల పూర్వోత్తర సందర్భములు చక్కఁగాఁ దెలిసియుండవలయునుగదా? వారేల తమ శాసనములందును గ్రంథములందును సుప్రసిద్ధవంశజుల నభివర్ణింపక మౌనధారణము గలిగియుందురు?

## శ్రీ రుద్రదేవుని సమకాలికులు.

కృష్ణానది మొదలుకొని నెల్లూరి మండలమున కందుకూరు (స్కందపురము) వఱకుఁగల దేశము కమ్మకరాశము (కర్మక రాష్ట్రము) అని యాంధ్రచక్రవర్తుల కాలమున వ్యవహరింపఁ బడినది. అటుపిమ్మటఁ బల్లవులకాలమునఁ గమ్మరాష్ట్రము (కర్మ రాష్ట్రము) అని వ్యవహరింపఁబడినది. ఏఁడవశతాబ్ది ప్రారంభమున నీ దేశము పశ్చిమ చాళుక్య చక్రవర్తులచే జయింపఁబడినది. ఈ దేశమును బరిపాలించిన చాళుక్యులలో మొదటివాఁడు కుబ్జవిష్ణు వర్ధనుఁడు. ఈ కుబ్జవిష్ణు వర్ధనునితోఁ గుంతలదేశమునుండి వచ్చిన బుద్ధవర్మ మొదలగు సేనాధిపతులు గొందఱు కమ్మరాష్ట్రమున నధికారములఁ బొందిరి. వీరలు చతుర్థాన్వయులనియు, దుర్జయ

వంశస్థులనియు శాసనములం బేర్కొనంబడిరి. పండ్రెండవ శతాబ్ది వఱకు వీరల చరిత్రము తెలియరాకున్నది.

చాళుక్యులకాలమునఁ గమ్మరాష్ట్రములోని యుత్తరభాగము వెలనాడు లేక ఆఱువేలనాడు (షట్సహస్రదేశము) అనియు, దక్షిణ భాగము కమ్మనాఁడు అనియు, వ్యవహరింపఁబడినవి. త్రినయన పల్లవుని కాలమున మల్లవర్మయను నాతఁడు షట్సహస్రదేశమును సంపాదించెను. పండ్రెండవ శతాబ్ది ప్రారంభమున వేంగీదేశమును చోడదేశమును, రాజ రాజ నరేంద్రుని పుత్త్రుఁడును చాళుక్య చోడ చక్రవర్తియునైన మొదటి కులోత్తుంగ చోడుని కాలమున నేక సామ్రాజ్యమునకు లోఁబఱుపఁ బడినప్పుడు మల్లవర్మవంశజులే రాజ ప్రతినిధులై వేంగీదేశమును బరిపాలించిరి. అప్పుడు దుర్జయవంశస్థ లయిన వీరి బంధువు లెల్లరును వీరికి సామంతులై కమ్మరాష్ట్రము లోని యుత్తరభాగమును బాలించు చుండిరి. మున్నొకప్పు డాంధ్ర సామ్రాజ్యములోఁజేరి పశ్చిమ భాగములుగా నేర్పడి యుండిన కుంతల కొంకణదేశములనుండి యేతెంచి కమ్మనాటియం దధికార మును వహించి ప్రఖ్యాతిఁగాంచిన యీ ప్రభువులే యాంధ్రదేశము లోని యితర భాగములకుఁబోయి యధికారము సలుపునపుడు మొదట కమ్మనాటిరెడ్లు లేక కమ్మవారని వ్యవహరింపఁబడి యుండ వచ్చును. వీరు మొదట జైనమతావలంబకులుగను తరువాత శైవులుగ నుండిరి.

## కోటవంశము.

కోటయన ధరణికోట యని భావము. ఈ ధరణికోట ప్రాచీన కాలమున నాంధ్ర చక్రవర్తు లయిన శాలివాహనులకు రాజధానీ నగరమై ధాన్యకటక మను పేరిట జగద్విఖ్యాతి యశంబుగాంచి

యున్నది. ఇయ్యది ధాన్యాంకపుర మనియు, ధాన్యవతీ పురమనియు, శాసనముల బేర్కొనఁబడినది. పండ్రెండవ పదుమూఁడవ శతాబ్దులలో దీనిని బరిపాలించిన రాజులను కోటవంశమువారని వ్యవహరించు చుండిరిగాని కోట యనునది ధరణికోటనుండి కలిగిన సంజ్ఞ కాని మఱియొండుగాదు. వీరలు విష్ణుపాదోద్భవ సంభవు లయిన చతుర్థాన్వయులమని చెప్పుకొని యున్నారు. ఈ చతుర్థవంశమున మొదట ధనంజయుఁడు జనించినట్లుగా కోటభూతమ దేవిశాసనములోని యీ క్రింది పద్యమువలన బోధపడుచున్నది. 1

"చ. అమలసరోధిఁ జంద్రుఁ డుదయంబగునట్లనెపోలె వారిజా
తమున విరించిపుట్టిన విధంబున గాంచన ధారుణీధరేం
ద్రమున సురావనీజ ముదితంబయి యొప్పగతిం జతుర్థవం
శమున జనించె నుగ్రరిపుసైన్య జయుండు ధనంజయుం డిలన్."

ఈ ధనంజయుని గోత్రంబున విఖ్యాతులైన నరపతు లనేకులు వుట్టినట్లు పై శాసనమునందే వ్రాయఁబడినది. క్రీస్తుశకము పండ్రెండవ శతాబ్ది ప్రారంభమున ప్రోలనాయకుఁడను నాతఁడు ధరణికోట కధ్యక్షుఁడై యుండెను.

## ప్రోలనాయకుఁడు.

ఇతఁడు చాళుక్యచోడ చక్రవర్తియైన కులోత్తుంగచోడునకు సామంత మండలేశ్వరుండై వెలనాటిని బరిపాలించుచున్న మొదటి గోంకరాజు మంత్రులలో నొక్కఁడుగా నుండెను. ఈగోంకరాజునకు ధనదుపురము రాజధానిగ నుండెను. 2 ఈ పురమును ధనదుపురమని మంచనకవి తన కేయూరబాహు చరిత్రమునందు వ్యవహరించి

2. గుంటూరుజిల్లా పెదమక్కేన గ్రామమునకు తూర్పుననున్న శిలాస్తంభము మీఁది శాసనము జూచుకొనఁదగును

1. ఇదియే యిప్పటి గుంటూరుమండలములోని చందవోలు గ్రామముగా నున్నది.

యున్నాఁడు. మఱియు నతఁడీ పురమును దన గ్రంథమున నిట్లభి వర్ణించి యున్నాఁడు.

"సీ. పుష్పకనివహంబు భూమిపై నిలిచిన
యట్లందమైన దేవాలయములు
రూపాద్యచలము బహురూపంబుల నటించు
రమణ శోభిల్లు సౌధముల పెల్లు
అలకాధిపతి నిధు లన్నియు వెలివీట
నిడినక్రియఁ బణ్యవీథికలును
ధాత మేదిని మిన్నుదలఁగనై చినమాడ్కిఁ
గనుపట్టు బహుతటాకముల సొంపు

గీ. నుపవనంబులు సరసులు నొప్పు చేయు
చెలువుఁదోఁటలుఁ బ్రాసాదగు చేలు మెఱయ
నఖిలవిభవంబులను జెలనగుచు వెలయు
ధనదుపురమున కెనయన ధనదుపురము.

మఱియు నీ పట్టణములోని ప్రజలయొక్క వైభవమును నాకవి యా గ్రంథమునందే యిట్లభివర్ణించి యున్నాఁడు.

"గీ. మంటికడవ నులకమంచంబు పూరిల్లు
నూలిచీర రత్నకీలితంబు
గాని పైడితొడవు గలుగు టెఱుంగరు
ధనదుపురములోని జనము లెల్ల."

శ్రీ వెలనాటి గోంకనరేంద్రుని మంత్రులలో నొకఁడైన మన ప్రోలనాయకుఁడు శా. శ. ౧౦౩౦ సంవత్సరము (క్రీ. శ. ౧౧౦౮) లో ధరణికోటలోని అమరేశ్వర స్వామివారికిఁ జేసిన దానమును గూర్చిన శాసన మొకటి యా దేవాలయములో ముఖ మండపమునకు నైరృతమూలనున్న స్తంభముమీఁద నున్నది. ఆ శాసనమునందు:—

"గీ: శ్రీరాజప్రతిశాసనుఁ
డారాధితనీలకంఠుఁ డభినవమదనా
కారుఁడు ప్రోలఁడు విబుధా
ధారుఁడు (నంబెన్నరాంపి?) తనయుఁడు నెగ నెఱ."

ఈ ప్రోలినాయకునిభార్య కొమ్మసాని.

### కోటగండ భూపతిరాజు - భూతమదేవి.

క్రీస్తుశకము ౧౧౬౦ దన సంవత్సరమున కోటగండ భూపతిరాజుయొక్క భార్యయైన భూతమదేవి చేసిన దానములను గూర్చిన శాసనములు గుంటూరు మండలములో నున్నవి. ఆమె తన భర్తయొక్క వంశమునిట్లు చెప్పియున్నది. ధనంజయగోత్రమున చోడరాజును, వానికి గండభూపతియును, వానికి ముమ్మడి భీమరాజును, వానికి గండభూపతిరాజును జనించినట్లు పెదముక్కాన శాసనమునఁ జెప్పియున్నదిగాని, ప్రోలనాయకునకు వీరలకు నెట్టి సంబంధము గలదో తేటపఱిచి యుండలేదు. ఈ శాసనమునం జేర్కొనంబడిన రాజుల వృత్తాంతము లేశమాత్రమును దెలియకున్నది.

### కోటకేతరాజు.

క్రీస్తుశకము ౧౧౫౨ వ సంవత్సరమున శ్రీమన్మహా మండలేశ్వరుండైన కోటకేతరాజు ధాన్యకటకమునకుఁ బ్రభు వయ్యెను. ధరణికోట రాజులలో నితఁడు సుప్రసిద్ధుఁడు. ఇతని శాసనములు గుంటూరు మండలములోను అమరావతి వేల్పూరు మొదలగు గ్రామములలో నున్నవి. ఇతఁ డమరావతీ శాసనములోఁ దన్ను గూర్చి,

"స్వస్తిశ్రీ చతుస్సముద్రముద్రిత నిఖిలవసుంధరా పరిపాలక, శ్రీమత్త్రినయన పల్లవప్రసాదాసాదిత కృష్ణవేణీనదీ దక్షిణషట్స

హస్త్రావనీ వల్లభ, భయలోభ దుర్లభ, చోళ చాళుక్య సామంత మదానేకప మృగేంద్ర, విభవామరేంద్ర, శ్రీమదమరేశ్వర దేవ దివ్య శ్రీపదపద్మారాధక, పరబలసాధక, శ్రీధాన్య కటకపురవరాధీశ్వర, ప్రతాపలంకేశ్వర, కళిగళ మోళడక్కె, బెట్టరగవక్కె, గండరగండ గండభేరుండ, జగమెచ్చుగండ, నన్నిమార్తాండనామాది ప్రశస్తిసహిత శ్రీమన్మహా మండలేశ్వర కోటకేత మహారాజులు" అని చెప్పుకొని యుండుటచేత నితఁ డాకాలమున సుప్రసిద్ధుఁడై యుండవలయు ననుటకు సందియ ముండఁబోదు. ఇంతప్రఖ్యాతి గలుగుటకుఁ గారణము లేకపోలేదు. వేంగీరాజప్రతినిధియై చాళుక్య రాజభవన మూలస్తంభమని ప్రసిద్ధిగాంచి రాజమహేంద్రవరము మొదలుకొని కాళహస్తివఱకుఁ గల యాంధ్రదేశమును బాలించిన గొంకరాజునకు కోటకేతరాజు మేనల్లుఁడుగ నుండెను. ఈగొంక రాజు వెలనాటి మొదటిగొంకరాజునకు మనుమఁడు. చాళుక్యచోడ చక్రవర్తియైన మొదటికులోత్తుంగునిచేఁ బెంచుకొనఁబడిన కులోత్తుంగరాజేంద్రచోడునికిఁ బుత్త్రుఁడు. ఈ రెండవ గొంకరాజు తనతోఁ బుట్టినయైన సబ్బమదేవిని కోటకేతరాజు తండ్రియైన భీమరాజునకిచ్చి వివాహము చేసెను. అప్పటినుండియు నీవంశమున కధికప్రఖ్యాతి గలిగెను. ఈసంబంధమునుగూర్చి యమరావతిలోని కేతరాజుశాసనములలో నొకదానిలో,

"శ్లో. గొంకక్షితీశశశినో భగినీ గుణాఢ్యా
సబ్బాహ్వయా కమలచారుతరా స్ఫుటశ్రీః
తస్యాఽభవత్ ప్రియతమా పురుషోత్తమస్య
... ... ... ... ...
తస్మాత్తస్యాం సమజనిసుధారశ్మికాంతి ర్వ్యవస్య
త్తేజోరాజ ద్గుణగణనిధిః కేతుభూపోఽభిరూపః."

అని కేతరాజు తండ్రి భీమరాజు గొంకరాజు సోదరిని వివాహమాడినట్లును దెలుపఁబడినది. కాఁబట్టి కోటభీమరాజు క్రీ. శ. ౧౧౮౨ వ సంవత్సరమునకుఁ బూర్వము ధరణికోటలోఁ బరిపాలనము సేయుచుండెను. వీర లుభయులును పల్నాటివీరచరిత్రమునఁ బేర్కొనఁబడిరి. కేతరాజు తనశాసనములోఁ దన పూర్వులను గొందఱను బేర్కొని యున్నాఁడు. భీమరాజునకు (మొదటి) కేతరాజు, కేతరాజునకు (మొదటి) భీమరాజు, భీమరాజునకు (రెండవ) సబ్బమదేవియందుఁ దాను జనించినట్లు చెప్పుకొని యుండుటచేత ధరణికోట రాజులలో కేతనామముగలవారిలో నితఁడు రెండవవాఁడగా నుండెను. కోటభూతమదేవి భర్తయైన గండభూపతికిని కేతరాజు తండ్రియైన భీమరాజునకుఁ గల సంబంధము తేటపడకున్నయది. అయినను వీర లిరువురు నేక కుటుంబములోనివారైయై యుండవలయును. కేతరాజునకు చోడరాజను జ్యేష్ఠసోదరుఁ డొకఁడు గలఁడు.

### బౌద్ధమతము - బుద్ధునిపూజను.

కోటకేతరాజు కాలమున బౌద్ధమతమును బుద్ధుని పూజలు నాంధ్రదేశమునఁ బూర్తిగా నశింప లేదని కేతరాజు శాసనము వలనఁ దెలియుచున్నది. ఇతనికాలమునాఁటికి ధాన్యకటకములోని బుద్ధునిచైత్య మింకను సురక్షితముగానే యున్నట్లు గాన్పించుచున్నది. ఇతఁడు శా. శ. ౧౧౦౪ వ సంవత్సర మాఘశుద్ధ దశమీ గురువారమునాఁడు శ్రీమద్బుద్ధదేవునకు కండ్రవాటిలోని క్రొంతేరు, కొండపడమటి సీమలోని మేడికొండూరు, డోంకిపఱ్ఱు, అను గ్రామములను దానము చేసెను. బుద్ధదేవుని దీపారాధానమునకై నేతికొఱకు గొఱ్ఱెలను గొల్లబోయలకు దానము చేసెను. ఇతని యుంపుడుకత్తె లగు సూరమదేవియును, ప్రోలమదేవియును గూడ బుద్ధుని దీపారాధనముకై నేతికొఱకు బోయలకు గొఱ్ఱెలను దానము చేసిరి.

కోటకేతరాజు శైవుఁడై యుండియు బుద్ధోపాసనము చేయు ప్రియురాండ్ర ప్రీతికై పైదానములను జేసియుండును.

### కేతరాజుయొక్క బ్రాహ్మణాగ్రహారములు.

తనతల్లి సబ్బమదేవికిఁ బుణ్యముగా సబ్బాంబికా పురమని పేరుపెట్టి గొండనాతవాడిలోని కాకొల్లు గ్రామమును, తనతండ్రి భీమరాజునకుఁ బుణ్యముగాను భీమవరమని పేరుపెట్టి గొండనాత వాడిలో జింజిపాడు, చల్లగర, తాడువాయి అను గ్రామములను, తన జ్యేష్ఠసోదరుఁడు చోడరాజునకుఁ బుణ్యముగాను చోడవరమని పేరుపెట్టి గొండనాతవాడిలోని యమ్మలపూడి గ్రామమును, తనకుఁ బుణ్యముగాను జగమెచ్చు గండాపురమని పేరుపెట్టి గొండనాత వాడిలో కుంటిమడ్డి, ఉప్పలపాడును, కొండపడమటి సీమలో సత్తెన పల్లి, చింతపల్లి, కేతపల్లి, ఎఱ్ఱగుంట గ్రామములను, దొడ్డికంద్ర వాడిలో ఒంకదొన గ్రామమును, బ్రాహ్మణోత్తములకు దానము చేసెను.

### కోటబయ్యల మహాదేవి.

నతవాటిసీమకుఁ బరిపాలకుఁడయిన శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవ మహారాజునకుఁ గొమార్తెయైన బయ్యలమహాదేవి 8 వ కేతరాజునకుఁ బట్టమహిషి యని గనుపట్టుచున్నది. ఈమె క్రీ. శ. ౧౨౩౮ వ సంవత్సరము వఱకు జీవించి యున్నట్లు కనంబడుచున్నది. ఆ సంవత్సరమున నీమె ధాన్యకటకములోని బుద్ధదేవుని దీపమునకై నేతిని సమకూర్చుటకై గొఱ్ఱెలను బోయలకు దానము చేసి యున్నది. ఈమె పుట్టినింటివారుకూడ చతుర్థకులస్థులమని చెప్పుకొన్నారు. ఈమె కాకతీయ గణపతిదేవ చక్రవర్తి తోఁబుట్టు

వగు మేళాంబిక లేక మైలమ్మయొక్క కూఁతురు. ఈ సంగతి మఱి యొక తావున సవిస్తరముగాఁ దెలుఁబడును.

కోట చేతరాజు - కోట గణపాంబ.

మహామండలేశ్వరుఁడైన కోటకేతరాజునకు రుద్రిరాజు జనించెను. ఈ కోట రుద్రిరాజు కాలముననే కాకతీయ గణపతిదేవ చక్రవర్తి వెలనాటి భూపతులను జయించి సామంతులనుగఁ జేసి కొనెను. ఈ దండయాత్రికుఁ బూర్వముననే వెలనాటి పృథ్వీశ నరేంద్రునకును, పాకనాటి దేశప్రభువును కాంచీపుర చోడచక్రవర్త లకు సామంతుఁడుగ నుండిన మనుమసిద్ధిరాజు తండ్రియగు తిక్క నృపాలునకును, ఘోరమైన యుద్ధముజరిగి యా యుద్ధమునందు పృథ్వీశ నరేంద్రుని మస్తకము తునుమంబడియెను. తరువాత కాక తీయ గణపతిదేవ చక్రివర్తి యీ దేశముపై దండెత్తివచ్చి వెల నాటి ప్రభువులను జయించి దేశమంతయుఁ దనరాజ్యమునఁ జేర్చు కొనియెను. అప్పుడు మఱియొక యుపద్రవము తటస్థింపకుండ నీప్రాంతమునఁ దనరాజ్యము బలపడుటకై తన రెండవకొమార్తయైన గణపాంబా దేవిని ధరణికోటరాజును మహామండలేశ్వర రుద్రదేవ రాజు పుత్త్రుఁడునైన మహామండలేశ్వర బేతరాజున కిచ్చి వివాహము గావించెను. రుదిరాజునకు బిమ్మట బేతరాజు రాజ్యమును బాలించెను. ఇతడెంతకాలము పరిపాలము చేసెనో తెలిసికొనుట కాధార మేమియును గానరాదు. ఇతఁడు గణపతిదేవ చక్రవర్తి దండయాత్రిలతోఁగూడ యుద్ధములు చేయుచుండి వయసు మీఱకి మున్నె మరణముఁ జెందియుండవలయును. ఇతని మరణానంతరము కోటగణపాంబా మహాదేవి చాలకాలము ధరణికోటయందుఁ బరి పాలనము చేసెను. ఈమె దానశాసనములు క్రీస్తుశకము ౧౨౭౪ గవ సంవత్సరములోఁ గనంబడు చుండుటచేత నీమె చాలకాలము బ్రతికి

యుండెనని చెప్పవచ్చును. తన యక్కగారైన రుద్రమహాదేవి పరిపాలనముతోఁగూడఁ దన పరిపాలనమును సాగించి యుండ వలయును. భర్తమరణానంతరము గణపాంబ ధర్మకార్యముల ననేక ములను గావించెను. ఈమె తనభర్త స్వర్గస్థుఁడైన తరువాత ధాన్య కటకములోని యమరేశ్వరాలయముయొక్క గోపురమున సువర్ణ కలశములను నిర్మించెను. ఈమె యొక శివాలయమును నిర్మించి అందు తన భర్తపేరిట బేతేశ్వర నామముతో లింగప్రతిష్ఠ గావించెను. ఈ బేతేశ్వరాలయ గోపురమునందుఁగూడ సువర్ణకలశ ములను బెట్టించెను. ఈ శివాలయము సంరక్షణము కొఱకు ధాన్య సమృద్ధమైన బెనదేవి యను గ్రామము నొసంగి దానశాసనము వ్రాయించెను. ఇంతియగాక బ్రాహ్మణుల కనేక దానములను గావించెను. మఱియును దనతండ్రి గణపతిదేవ చక్రవర్తిపేరిట గణపేశ్వర శివాలయమును నిర్మింపించి దాని సంరక్షణమునకుఁగాను చింతపాడను గ్రామమును దానము చేసెను. ఈమె మహేశ్వర ధ్యానము చేయుచుఁ దన యవసాన కాలమును గడపెనని చెప్పఁ బడినది. 1

## బుద్ధవర్మవంశము – కొండపడమటి బుద్ధరాజు.

ఇతఁడు కొండపడమటిసీమకు ప్రభువు. కనుక నితనికి గిరి పశ్చిమ శాసనుఁ డను బిరుదము గలదు. ఇతఁడు చోడచక్రవర్తులకు సామంతుఁడుగ నుండెను. వెలనాటి ప్రభువులకు ముఖ్యబంధువు. ఇతఁడు బుద్ధవర్మ వంశములోని వాఁడ ననియు, చతుర్థాభిజనుండ ననియుఁ జెప్పుకొని యున్నవాఁడు. ఇతఁడు కొండవీటికిఁ బశ్చిమ భాగమున నున్న సీమను బరిపాలనముఁ జేయుచు వెలనాటి రాజుల తోడి బాంధవ్యమువలనఁ బ్రఖ్యాతి గాంచెను. వెలనాటి రాజుల

1. Epigraphia Indica, No. 16, Yanamadala Inscription.

యొక్క రాణులందఱు నీబుద్ధరాజవంశమున జనించినవారు. ఇతని యొక్క శాసనములు నరసారావుపేట తాలూకాలోని నాదెండ్ల లోను, గుంటూరు తాలూకాలోని చేబ్రోలులోను గలవు. ఇతని శాసనములలో దుర్జయకులాభరణుఁ డనియు, ఏలాదయసింహుఁ డనియు, అనియాంకభీముఁ డనియు బిరుదము లీతనికిఁ గలవని చెప్పఁ బడియెను. బుద్ధవర్మవంశమున మండరాజును, అతనికి గండమరాజు ను, అతనికి (రెండవ) మండరాజును, అతనికిఁ గుండాంబికయందు మల్లరాజు, బుద్ధరాజు, అంకమ, లేక అక్కమ్మయు జనించెను. వీరిలో రెండవవాఁ డే మనబుద్ధరాజు. ఇతని చెల్లెలయిన అక్కమ్మ వెలనాటి ప్రభువైన రాజేంద్రచోడునకిచ్చి వివాహము చేయఁబడి యెను. ఈ రాజేంద్ర చోడుఁడే వేంగీదేశరాజప్రతినిధియై యాంధ్ర దేశములోని వేంగీభాగమును బరిపాలించెను. గుంటూరుమండలము లోని సిరిపుర శాసనమున నితనింగూర్చి యీ క్రిందిపద్యము చెప్పఁ బడినది.

"చం. ఇల వెలనాటిగొంకవసుధీశతనూభవుఁ డైనచోడభూ
తలపతి చోడపట్నము ముదంబున గట్టి భుజాబలంబునం
గొలని జయించి యందు రిపుకుంజరు భీముఁ జంపె నాంధ్రభూ
తలము పదాఱువేలు సతతస్థితినేలె సురేంద్రలీలలన్."

ఈ రాజేంద్రచోడుని మఱఁదియైన కొండపడమటి బుద్ధరాజు ధనదుపురము (చందవ్రోలు) లోని పాండేశ్వర దేవాలయమునకు నాదెండ్లలోని కొంతభూమిని దానము చేసెను. మొదటికులోత్తుంగ చోడచక్రవర్తియొక్క సైన్యాధిపతియు, మొదటిగొంకరాజుయొ క్క సోదరుఁడునైన పండయరాజుచే నిర్మింపఁబడినదిగావున నాయా లయమునకు పాండేశ్వరాలయ మని పేరు కలిగెను. ఈకొండపడ మటిరాజులు నాదెండ్లలోని మూలస్థానేశ్వర దేవాలయమునకుఁ గావించిన దానములను గూర్చిన శాసనము లాదేవాలయమున

ననేకములు గలవు. వీరివంశమున జనించిన జయాంబిక వెలనాటి ప్రభు వైన మూఁడవకులోత్తుంగ చోడగొంకరాజునకుఁ బట్టమహిషియై పృథ్వీశ నరేంద్రునకుఁ దల్లియై పిఠాపురములోని కుంతీమాధవ స్వామి యాలయమును నిర్మించి నవఖండవాడగ్రామమును దానము చేయుటయేగాక సింహాచలములోని నృసింహుని విగ్రహమునకు సువర్ణకవచమును సమర్పించెను.

## నతవాటిసీమరాజులు.

హైదరాబాదు రాష్ట్రములోని మధిరెజిల్లా కాకతీయాంధ్ర చక్రవర్తుల పరిపాలన కాలమున నతవాటిసీమ యని వ్యవహరింపఁబడుచుండెను. ఆకాలమున దీనికి మడపల్లెదుర్గము రాజధానిగ నుండెను.1 ఇయ్యది చాళుక్యులకుఁ బూర్వము నేత్రపాటి విషయ మను పేరితోఁ బరఁగుచుండి తూర్పున నేలూరునకు సమీపముగా నున్న దెందులూరునఱకును విస్తరించి యుండెను. విష్ణుకుండినవంశజుండయిన విక్రమేంద్రవర్మ శాసనములలో నొకదానియం దీ సీమ యుదాహరింపఁబడినది. దుర్జయవంశజుల మనియు, చతుర్థాన్వయుల మనియుఁ జెప్పుకొనిన రాజు లీ నతవాటిసీమను మొదటి ప్రతాపరుద్రుని కాలమునఁ బరిపాలించుచుండిరి. అప్పు డీ మండలమును బరిపాలించుచున్నవాఁడు కాకతీయులకు బంధు వగు దుర్గరాజుకొడుకు బుద్ధరాజు. పండ్రెండవ శతాబ్ద్యంతమున మహామండలేశ్వరుఁడైన బుద్ధరాజు కుమారుఁడు రుద్రరాజు మడపల్లె రాజధానిగ నతవాటి సీమను బరిపాలనము సేయుచుండెను.

---

1. మడపల్లె యనునది ఏలూరికి సమీపమున నున్న మాదేపల్లి యని యొకరు వ్రాసిరి కాని యది సరికాదు. మడపల్లె బెజవాడ హైదరాబాదు రైలుమార్గమున నున్న మధిరెస్టేషనునకు సమీపముననుండు మడపల్లె యనునదియే.

2. ఆంధ్రులచరిత్ర భా. ౧. పే. 363. (పూ. ము.)

## బుద్ధరాజుకొడుకు రుద్రరాజు.

శ్రీమన్మహా మండలేశ్వర రుద్రదేవరాజు కాకతిప్రోలరాజు యొక్క పుత్త్రులలో నొక్కఁడును, మొదటిప్రతాపరుద్రుని తమ్ముఁడును, గణపతిదేవ చక్రవర్తియొక్క తండ్రియు నగు మహాదేవరాజుయొక్క పుత్త్రిక యగు మేళమాంబికను (మైలమ్మ) వివాహముఁ జేసికొనియె నని త్రిపురాంతకములోని మేళమాంబిక శాసనమువలనఁ దెలియుచున్నది.[1] రుద్రరాజునకు మేళాంబికవలన నెనమండ్రు కుమారులును బయ్యలమహాదేవి యను కొమార్తయుఁ గలిగినట్లుగా ధాన్యకటకములో నమరేశ్వర దేవాలయములోని బయ్యలమహాదేవియొక్క దానశాసనములో స్పష్టముగాఁ జెప్పబడినది.[2] ఈమె బుద్ధదేవునికి దానముచేసిన ట్లిట వఱకే వ్రాసియున్నాను. బయ్యలదేవి తండ్రియైన యీ రుద్రదేవరాజు బుద్ధరాజునకు ద్వితీయపుత్త్రుఁడని త్రిపురాంతక శాసనములోఁ జెప్పఁబడినది. ఈ నతవాటి సీమరాజులు మొదట చాళుక్యచోడ చక్రవర్తులకు సామంతులుగా నుండి తరువాత కాకతీయులతోడి సంబంధబాంధవ్యముల చేత గణపతి దేవచక్రవర్తి కాలమున నాతనికి సామంతులైరి. బందరుజిల్లాలోని ఉయ్యూరు పరగణాలోఁ జేరిన ముదునూరు గ్రామములోని రామేశ్వర దేవాలయములో నున్న యొక శాసనములో నీ క్రింది శ్లోకమునందు కాకతీయ కుందాంబ యీ రుద్రదేవరాజునకు భార్యయైనటులఁ గానంబడుచున్నది.

"బుద్ధారాధిపసూనురుద్రనృపతిః శ్రీనాథవాటీశ్వరో
యస్యా భూజ్జనకోస్య కాకతి మహాదేవక్షితీశాత్మజా
కుందాంబా జననీ ద్విషద్గజహరే శ్రీమాధవక్ష్మాపతే
ర్దేవీత్వం సముపేత్య సంప్రతి మహాదేవీప్రసూతే సుతాన్."

1. No. 204 of the Epigraphical Collection for 1905.
2. No. 15, B, Two Pillar Inscriptions at Amaravaty,

పై శ్లోకమునఁ జెప్పఁబడిన మహాదేవియొక్క భర్తయైన మాధవనృపతికి శ్రీనాథవాటీశ్వరుఁడైన బుద్ధరాజు కొడుకు రుద్రరాజు తండ్రియనియు, కాకతిమహాదేవరాజుయొక్క కొమార్తయైన కుందాంబ తల్లియనియు, బోధపడుచున్నది. ఇతర శాసనప్రమాణమునుబట్టి రుద్రదేవరాజునకు వివాహము చేయఁబడిన మహాదేవరాజుకొమార్తపేరు మైలమ్మ యని మన మెఱింగి యున్నాము. కుందాంబకు మైలమ్మ యను నామాంతరము గలదేమో భావిపరిశోధనమునం దెలిసికొనవలసి యున్నది. కాకతికుందాంబ శాసనమునుబట్టి శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవరాజుయొక్క యెనమండ్రు కుమారులలో మాధవనృపతి యొక్కఁడని స్పష్టమగుచున్నది. కాకతీయరాజ బంధువులైన యీ మండలేశ్వరు లందఱును, పైవెలనాటి గణపతిదేవ చక్రవర్తి దాడి వెడలినప్పుడు జరిగిన యుద్ధములలో భాగస్వాములై యుండి యాచక్రవర్తికి జయము సమకూర్పించినవారుగా నుందు రనుటకు సందియము లేదు.

## రుద్రప్రనిమరణము - విప్లవము

ఇతని మరణమునుగూర్చి గొప్ప సంవాదము గలదు. క్రీ. శ. ౧౧౯౭ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౧౧౯౯ వ సంవత్సరము వఱకు నడిమికాలమునఁ గాకతీయ సామ్రాజ్యము ఘోరమైన మహావిప్లవము పాల్పడినటులు గొన్నిదృష్టాంతములవలన దెలియుచున్నది. కాకతీయ సామ్రాజ్యమునకుఁ బశ్చిమోత్తరభాగమున సేవణ వంశీయులదైన యాదవ సామ్రాజ్యము ప్రవర్ధమానముగ వర్ధిలుచుండెను. శౌణదేశాధీశ్వరుండగు సింగభూపతి మరణానంతరము వాని కుమారుఁడగు జైతుఁగి యను జైత్రపాలుఁడు క్రీ. శ. ౧౧౯౧ సంవత్సరమున సామ్రాజ్య భారమును వహించి పరిపాలనము చేయుటకుఁ బ్రారంభించెను. కాకతీయ సామ్రాజ్యమునకు సరిహద్దు సామ్రాజ్యమగుటచేత రెండు సామ్రాజ్యములకు వివా

దములు పుట్టి యప్పటప్పట యుద్ధములు జరగుచు నచ్చెను. రుద్రదేవునకు జైత్రపాలునకు యుద్ధములు జరిగి యుండలేదనుకొనుట గొప్ప పొరబాటుగాని యన్యముకాదు. ఇందు హేమాద్రివిరచితమైన వ్రతఖండములోని రాజప్రశస్తియు, పైతాను శాసనమును కాకతీయ సేనానుల శాసనములును గొంతవఱకు సత్యమారసి తెలిసికొనుటకు తోడ్పడు చున్నవి. ఈరాజప్రశస్తిలో "త్రిలింగాధిపుఁ డయిన రుద్రునిఁ బశువునుగాఁ జేసి పురుషమేధమను యజ్ఞముఁజేసి త్రిలోకములను జయించె" నని యతిశయోక్తిగ నింద్యముగ వర్ణింపఁబడెను. అచింతేంద్రకవి రుద్రదేవుని శాసనములో నుదయరాజును తైలపదేవుని రుద్రదేవుఁడు చంపెనను సందర్భమున నెట్టి యతిశయోక్తులతోను, అవమానోక్తులతోను నెట్లు వర్ణించెనో, ఈహేమాద్రికవియుఁ దనరాజప్రశస్తిలోను నట్లే రుద్రునిగూర్చి పలికి యున్నాఁడు. ఇయ్యది సత్యమని పాటించినచో రుద్రదేవుఁడు జైత్రపాలునితోనైన యుద్ధమున మరణముఁజెంది యుండవలయును.

"విశాలాంధ్రదేశమున కధిపతియై యప్రతిహత పరాక్రమముతోఁ జిరకాలము రాజ్యమేలి రాజ్యతృష్ణాధురంధరుఁడగు మహాదేవ రాయలను తమ్మునిచేఁ జంపఁబడెను. భ్రాతృహంతకుఁడగు నీతఁడు రాజ్యమునకు వచ్చుటకుఁ బౌరు లంగీకరింపలేదు. కుమారుఁడగు గణపతిదేవుఁడు తండ్రి యుండఁగా రాజయ్యెను.'' అని యొక వింతవ్రాఁతను శేషాద్రిరమణకవులు వ్రాసియున్నారు. *

ఇట్టి క్రొత్తసిద్ధాంతమును కవులు వెలువరించునపుడు లిఖిత మూలకమగు ప్రబల ప్రమాణమును గనుపఱచ వలసి యుండెను. హేమాద్రి తన వ్రతఖండమున రుద్రదేవుని జైత్రపాలుఁడు సంహ

* ఆంధ్రపత్రిక-ప్రజోత్పత్తి సంవత్సరాది సంచిక. పేజి. ౧౯౩.

రించెనని వ్రాసిన దానిని యుక్తియుక్తముగ ఖండింపఁ గలిగి నపుడె వీరి వ్రాఁతపాటింపఁదగినదిగా నుండునుగాని యూరక రుద్రదేవుఁ డాంధ్రుఁడను కారణమున దురభిప్రాయముతోఁ జెప్పుటగాని వ్రాయుటగాని తగదు. హేమాద్రిపై తాను శాసనమును వ్రాయించిన రామచంద్రదేవుని కాలమునాటివాఁడు. అనఁగా జైత్రపాలుని వంశీయుఁడైనవాఁడును, రెండవ ప్రతాపరుద్రదేవుని సమకాలీనుఁడును నైనవాఁడు. ఏవిధమైన ఋజుభారమును వహింపక యింత విస్పష్టముగ రుద్రదేవుని మహాదేవరాజు చంపెననియు, నతఁడు భ్రాతృహంతకుఁడనియుఁ జెప్పుటయు న్యాయ్యము కాదు. బహుశః శేషాద్రిరమణ కవులిట్లు వ్రాయుటకు ముఖ్యకారణ మీ వాక్యములకు దిగువను వ్రాసిన వాక్యములోని విషయమై యుండవచ్చునని మన మూహింప వచ్చును. "రుద్రదేవుని యనంతరము రాజ్య మల్లకల్లోలమైనట్లును రామప్ప గుడులలోని శాసనమునందు గలదు; అపుడు రుద్రసేనాని జీర్ణాంధ్ర సామ్రాజ్యమును బునరుద్ధరించెనని యీ శాసనము నందలి శ్లోకము వలన గ్రహింప నగును." అని వ్రాయుట చేత శేషాద్రిరమణ కవులు పై యభిప్రాయమును వెల్వరించుటకు సాహసించిరని మనకు విస్పష్టమగుచున్నది. ఈ శాసనమును బురస్కరించుకొనియె కాకతీయసంచికా సంపాదకుఁడు "ఇటులు దుర్నిరీక్ష్య తేజోవంతమై విరాజిల్లుచుండిన యాంధ్ర సామ్రాజ్యమునుజూచి దేవగిరి యాదవు లసూయాగ్రస్తులై యనుమకొండపై దాడివెడలిరి. రుద్రదేవుఁడు నసమాన పరాక్రమమున వారినెదుర్కొనెను. కాని విధివశముచే యుద్ధరంగమునం దసువులను బాసెను. యాదవరాజగు జైతుగి యొక యాంధ్రరాజును పశువుగ నుపయోగించి యొక నరమేధము నొనర్చెనని హేమాద్రి తన వ్రతఖండమునఁ బేర్కొని యున్నాఁడు. పై తాను శాసనమునుండి యాతని తనయుని జెటంబెట్టనని తెలియుచున్నది. కాకతి రుద్రునకి సంతాన మేమియు లేకుం

మటచే నాతఁడు పై శాసనము నందలి యాంధ్రరాజు గాఁ జాలఁడు. కాన హేమాద్రి పేర్కొనిన తెలుఁగు రా జీరుద్రదేవుఁడేయని తేలుచున్నది. క్రీ. శ. 1197 నకుఁ బిమ్మట రుద్రదేవుని ప్రశంస గానవచ్చుటలేదని యిదివరలోఁ జెప్పియుంటిమి. కాన నారుద్రదేవుని మరణము నా సంవత్సరముననే జరిగి యుండుననిస్పష్టమగు చున్నది."అని నొక్కి వక్కాణించు చున్నారు.

ఇంతటితోఁ దనివిఁ జెందక "క్రీ. శ. 1198 లో దేవగిరి యాదవరాజగు జైతుగి యను నాతఁడు అంధ్రదేశముపై దండెత్తి వచ్చెను. అంత నాంధ్రులకు యాదవరాజులకు నొక ఘోరయుద్ధము జరుగ నందు జైతుగి మహాదేవరాజును జంపి యాతని తన యుఁడగు గణపతిని చెఱగొని దేవగిరికి మరలెను. ఇంతకంటెను మహాదేవరాజునుగూర్చిన విశేషము లేవియు లేవు." అని గూడ వ్రాసియున్నారు. ఇంతటితో విరమించినను గొంత బాగుండెడిది గాని, ఆపైని తమ యపూర్వ కల్పనాసామర్థ్యము నంతయు నీదిగువ వాక్యములలోఁ గనుబఱచినారు.

"ఆతని తనయుఁడును గాకతీయ రాజ్యమున కనంతరవారసుఁడు నగు గణపతిదేవుఁడు శత్రులచేఁ జిక్కుటయు, దేశమునకెక్కుఁడనర్థమును గల్పించినవి. శత్రురాజు లనేకులు నూతనముగ బయల్వెడలిన యీ కాకతీయ రాజ్యమును సమూలముగ నాశన మొనర్చి రెండవ ప్రోలరాజును, రుద్రదేవుఁడును దమ కొనర్చిన పరాభవములకు బ్రతీకార మొనర్చు నుత్సాహముతో ననుమకొండ రాజ్యముపై దాడి వెడలిరి. మఱికొందఱు సామంతు లీ యదనున స్వాతంత్ర్యముఁ బ్రకటించిరి. కాని యాంధ్రుల యదృష్టవశమున నవక్రవిక్రములగు గాకతీయసేనానులు, దేశభక్తియుఁ, రాజభక్తియుఁ

బురికొల్పవైరివాహిని నడ్డగించిరి. ఇట్టివారిలో గాకతీయ సామ్రాజ్య మూలస్తంభులన నొప్పు రేచర్ల వంశీయు లగ్రగణ్యులు. రేచర్ల రుద్ర సేనాని కాలాంతరుద్రుఁడై నాగతి భూపాలుఁడు మున్నగు నీపరిత్యర్థి భూపాలురం దఱిమి, కాకతీయ సామ్రాజ్యము నకాలప్రళయజలధి మగ్నముగాకుండ రక్షించి, బందీవిముక్తుఁడై యేతెంచిన గణపతి దేవున కొసంగెను. దీనికి పాలంపేటు శాసనము ప్రమాణము."

ఇయ్యవి కాకతీయ సంపాదకుఁడు పోయిన పోకడలు. వీరు గన్పఱచి నట్టి యపూర్వచారిత్రిక పరిజ్ఞాన మెట్టిదో యొకింత విమ ర్శించి పరిశోధించినఁ గాని యందలి యదార్థ విషయము చదువరు లకు ద్యోతకముకాదు. పైతాను శాసనమును, పాలంపేట శాసన మును, హేమాద్రి వ్రతఖండమును వీరు పరిశోధించి వ్రాసినవ్రాఁ తవలె చదువరుల భ్రమింపఁజేయును. మనము సూక్ష్మదృష్టితో వీరు చూపిన ప్రమాణము లనే పరిశీలించి విమర్శించిన యెడ వీరెట్టి బోల్తాలు గొట్టినారో సులువుగానే తెలిసికొన వచ్చును.

శేషాద్రి రమణకవులకు పైతాను శాసనము, హేమాద్రివ్రత ఖండములోని విషయములు తెలియకున్నను పాలంపేట శాసనముఁ బురస్కరించుకొని యూహించి వ్రాసినవ్రాతయగుటచేత నందు సం పూర్ణప్రమాదములు దొరలినవి. ఇంతయేల? పెక్కుశాసనములలో, అందు ముఖ్యముగా, కుందవరము, పాఖాల, మొదలగు శాసనము లలో మహాదేవరాజు పరిపాలనము చేసినట్లే గలదు. పాలంపేటశాస నములోని శ్లోకములలోఁగల భావమును శేషాద్రిరమణ కవులుగాని, కాకతీయసంచికా సంపాదకుఁడు గాని సరిగా నర్థము చేసికొన్నట్లు గానరాదు. వీరు చెప్పిన విషయము లా శాసనమునందుఁ గాను రావు. మరియును శేషాద్రిరమణ కవులు మహాదేవరాజు రాజ్యపరి

పాలనము చేసినట్లు తెలిపెడి కుందవర శాసనములో నీదిగువ శ్లోక
ము నెత్తిచూపి యున్నారు.

"తస్మాదనంతరం తస్యమహాదేవ్యో మహీపతిః
అనుజోమను జాకారమహాదేవ్యో మహీమధాత్."

మహాదేవరాజు కొమార్తెయు, గణపతిదేవ చక్రవర్తి చెల్లెలు
నగు కుందాంబ యభిప్రాయము కంటె శేషాద్రి రమణకవుల యభి
ప్రాయములనే పరమప్రమాణములుగాఁ గైకొనవలసిన దని తలం
తురు కాఁబోలు! వీనిం బ్రకటించుటవలన శేషాద్రి రమణకవులు
తమయభిప్రాయమును తామె ఖండించుకొన్న ట్లగుచున్నది. ఈసం
దర్భమున వీరి యభిప్రాయములు పాటింపఁ దగినవి కావని స్పష్ట
మగుచున్నది. ఇంక కాకతీయసంచికా సంపాదకుని యభిప్రాయము
లెంతవఱకు సరియైనవిగ నున్నవో విమర్శింతము. ఇరువదియేండ్లకుఁ
బూర్వమీశాసనము లెవ్వియుఁ బ్రకటింపఁ బడని కాలమునందుఁ
గేవలము స్థానికచరిత్రములపై యాధారపడి నేను వ్రాసిన వాక్యము
లలోని భావమునే యనుకరించుచు నూతన పరికరములను నూతగాఁ
గొని యుండియు, వానిలోని భావములను సరిగా నర్థముఁ జేసికొనక
యపూర్వకల్పనములకుఁ బాల్పడినవారు కాకతీయసంచికా సంపాద
కులు. ఈ సంచికలో వీరు వెల్వరించిన యభిప్రాయములందలి
సత్యమును గూర్చి విమర్శించుచు శ్రీ మదాంధ్ర భాషాసాహిత్య
పరిషత్పత్రికయందు శ్రీయుత కుందూరి యీశ్వరదత్తు గారిట్లు వ్రాసి
యున్నారు. అదియు విమర్శనీయముగాన నావాక్యముల నిటఁ
బొందుపఱచుచున్నాను.

"37 వ పుటలో రుద్రదేవుని మరణమునుగూర్చి యీచరిత్ర
కారుఁడు వ్రాసిన వాక్యములు గమనింపుఁడు—"పై తాను శాసనము
నుండి యీ రాజు (జైతుగి) మఱియొక యాంధ్రరాజునుజంపి

యాతని తనయునిఁ జెరపట్టెనని తెలియుచున్నది.'' దీనికి వారిచ్చిన ప్రమాణము ఎపిగ్రాఫియా యిండికా సంపుటము, కాని, వీరా పై తాను శాసనమును జదివియుండినచో నిట్టి యసత్యపు వ్రాతల వ్రాసియుండరు. పై తాను శాసనములో (1) జైతుగి యాంధ్ర రాజును జంపినట్లుగాని (2) అతని తనయునిఁ జెఱపెట్టెననిగాని లేదు. ఆ శాసనములలో జైతుగి "యః సంఖ్యేత్రికళింగరాజ మవధీః" అని యున్నది. ఈ త్రికళింగరాజె త్రిలింగరాజని భ్రమపడి, భండార్కరు పండితుఁడు హేమాద్రి పేర్కొన్న తిల్లింగ నృపతియగు రుద్రదేవుఁడీ కళింగాధిపతియని వ్రాసియుండెను. శ్రీ వీరభద్రరావుగారును భండార్కర్ పండితుని వాక్యములే యాంధ్రుల చరిత్రలో వ్రాసిరి. భండార్కరు పండితుఁడు త్రికళింగాధి పతియుఁ త్రిలింగాధి పతియు నొక్కరేయని పడిన విభ్రాంతి వీరభద్రరావుగారిని మోస పుచ్చినది. వారిద్దఱి త్రోవనే రామారావుగారనుసరించిరి. ఈ త్రికళింగాధిపతి బిరుదము చరిత్రములో, గాకతీయుల కెక్కడను లేదు. అది కళింగ గాంగ వంశజులకును, చేది రాజులకును, గలదు. ఇందునుగూర్చి గోడవర్తి రామదాసుగారు వ్రాసిన వ్యాసములు చదివినచోఁ గొన్నివిషయములను దెలిసికొనవచ్చును. పై తాను శాసనములో గణపతిదేవుని తండ్రి ప్రశంసయే లేదు. రామారావు గారింతటితోఁ నూరకుండిన బాగుండెడిది. 38 వ పుటలో నీ జైతుగియే క్రీ. శ. 1198 వ సంవత్సరములో నాంధ్రదేశముపై దండెత్తివచ్చి మహా దేవరాజునుజంపి యాతని తనయుఁడగు గణపతిదేవుని చెఱగొని దేవగిరికి మరలెనని వ్రాసిరి. ఇది యంతయు రామారావుగారి స్వకపోల కల్పితము. పై తాను శాసనము పరిశీలింపని కారణమె వీరి నీపొరపాట్లకుఁ దెచ్చినది. ఆ శాసనములో గణపతి దేవుని ప్రశంస యిట్లున్నది:—

"కారాగారాత్సమానీయ కరుణా వరుణాలయః. ప్రియం వదాస్య మకరోత్క్షితేర్గణపతిం పతిం" అని పై శ్లోకములో జైతుగి గణపతిదేవుని కారాగార మందుంచెననికాని, యాతని దేవగిరికి గొంపోయెననికాని లేనప్పుడు రామారావుగారేపప్రమాణము చొప్పున పై వ్రాతలు వ్రాసిరో! జైతుగి కారాగారమునుండి విముక్తుని జేసి, గణపతి దేవుని క్షితి పతిగా నొనర్చెనని యున్నదే!

37 వ పుటలోపల యాదవరాజగు జైతుగి యొక యాంధ్ర రాజును బలువుగ నుపయోగించి యొక నరమేధము నొనర్చెనని హేమాద్రి తన వ్రతఖండమునఁ బేర్కొని యున్నాడని వ్రాసి, తర్వాతఁ హేమాద్రి పేర్కొనిన తెలుఁగు రాజీ రుద్రదేవుఁడేయని తేలుచున్నదని" వ్రాసిరి. ఆ విషయము స్పష్టముగ హేమాద్రియే చెప్పినాఁడు. చూడుఁడు:—

" త్రిలింగాధిపతేః పశోర్విశసనం రుద్రస్యరౌద్రాకృతేః
కృత్వా పూరుషమేధ యజ్ఞ విధినాలబ్ధ స్త్రీలోక జయః॥.

వీరీ హేమాద్రిరాజు ప్రశస్తి సంచిక యనుబంధములో నిచ్చి పై శ్లోకములోని ‹విశసనం' అను పదమును ‹వివశనం'అని దిద్ది ప్రకటించిరి. ఈ మార్పును దానికి వారు దిగువ వ్రాసిన యర్థము నకును బరస్పర సంబంధములేదు.

మహాదేవరాజునుగూర్చి యొనర్చిన ప్రశంస పరిహాసాస్పద ముగ నున్నది. ఈ రాజు క్రీ. శ. 1195–1198 సంవత్సరములమధ్య రాజ్య మొనర్చెనని వ్రాసిరి. దీనికిఁ గారణము రుద్రదేవుఁడు క్రీ. శ. 1195 సంవత్సరములో మరణము నొందెనని వారిది వఱకొకసారి వ్రాసియుండుటచేతను, గణపతిదేవుని రాజ్యారంభ కాలము క్రి. శ. 1198 యగుట చేతను నైయున్నది. కాని రుద్ర

దేవుఁడు క్రీ. శ. 1195 లో నొకసారియు, క్రీ. శ. 1195 లో నొకసారియు మరణించెనని వ్రాసిన వ్రాఁతల కీమహాదేవరాజు కాల నిర్ణయము ప్రతి బంధకముగాదా?”

అని యంతటితో విడిచి పెట్టక,

“గణపతిదేవ మహారాజునుగూర్చి వ్రాయుచు వారు 38 వ పుటలో గణపతిదేవుఁడు దేవగిరిలో బందిగ నుండి 1209 లో తిరిగి స్వరాజ్యమునకు వచ్చెననియు నాతని రాజ్య కాలము మాత్రము 1198 నుండియే పరిగణింపఁ బడియెననియుఁ దెలియుచున్నది.” అని నిర్వచించిరి. గణపతిదేవుఁడు దేవగిరిలోఁ బదేండ్లు కారాగార మందుండెనని వ్రాయుట నిరాధారమైన చరిత్ర విషయము. పై తాను శాసనములో నట్లులేదు; వీరాధారముగాఁ గైకొనిన భండార్కర్ పండితుఁడు సహితమును జెప్పలేదు. మరల 39 వ పుటలో రేచర్ల రుద్రసేనాని కాకతీయ సామ్రాజ్యము నకాలప్రళయ జలధిమగ్నము గాకుండ రక్షించి, బందీవిముక్తుఁడై యే తెంచిన గణపతి దేవుని కొసంగెను. దీనికి పాలంపేట శాసనము ప్రమాణము.” అని వారు వ్రాసిరి. పాలంపేట శాసనములో గణపతి దేవుఁడు బందీకృతుఁడై యుండెననియుఁ నట్టి బందీకృత విమోచనానంతరము రుద్రసేనాని గణపతి దేవునకు రాజ్యము నొసంగెననియు లేదే; ఇదియొక యప్రామాణ్యమైన విషయము. వీరి స్వకపోల కల్పనము. పాలంపేట శాసనములోని యీ క్రింది శ్లోకములు వారివింత చరిత్రాంశమునకు మాతృక—చదువరులు గమనింతురుగాక: ఈ శాసనమునకును వారిచ్చిన చరిత్రాంశమునకును సందర్భ మేమియులేదు. *

* “శ్రీమద్రుద్ర నరాధిపే రిపుమహీపాలాద్రి వజ్రేదినం
యాతే కాకతినాథ భోగ్యవిలసత్స్వర్గైకరాకర్షణే
సంభ్రాంతాః సమముద్ధితాః సరభసం నైకిక్ష్మాపాలకాః॥
శూరః స్వామిహితః సునిశ్చితమతిర్యః కాకతీయశ్రియా
పాదేభూరిషు కంటకేషు నిహతేరీక్షణేషు మోహాత్తృణం
త్రైవిద్యేవ్యథితే చతాన్భుజబలాధుద్ధృత్యపిష్టాహంతా
త్తాముత్థాపయదవ్యథం స్థిరతరం రేచర్లరుద్రస్వయం॥
Hyd. Arch Ser. No. 3. కాకతీయసంచిక అనుబంధము. పే. 57 సం॥ 18.

ఇంతవఱకు వెలువడ్డ పై విషయములను గూర్చి శేషాద్రి రమణ కవులు, కాకతీయసంచికా సంపాదకుఁడు చేసిన వ్యాఖ్యలును, వానిపై ఈశ్వరదత్తుగారు చేసిన విమర్శనయొక్క రీతియును జదువరులకు బోధపఱుపఁ బ్రయత్నించితిని. ఇప్పు డిందలి సత్యమును దెలిసికొనుటకు మన మొకించుక సాహసింపవచ్చును. ఇరువదేండ్లకుఁ బూర్వము పాలంపేట మొదలగు తెలింగానాశాసనములు వెలువడని కాలమున కీ. శే. డాక్టరు భండార్కరు పండితుని వ్రాఁత నాధారము చేసికొని స్థానికగాథలఁ బరిశీలించి యాంధ్రులచరిత్రము వ్రాసినవాఁ డనగుటచేత నపుడు మహదేవరాజు జైతుఁగితోడ జరిగిన యుద్ధములోఁ జనిపోయినవాఁ డనియు, గణపతిదేవుఁడు జైతుఁగిచేఁ జెఱనుంచఁబడి తరువాత విడిచిపెట్టఁబడి యుండునని విశ్వసించి వ్రాసినవాడనగుట నిజమేకాని యిప్పుడట్టి యవకాశము లేదు. కాని పై తాను శాసనములో జైతుఁగి గణపతిదేవునిఁ జెఱనుండి విడిపించి క్షితిపతినిగాఁ జేసెనని యున్నది గాని కాకతీయ సంచికా సంపాదకుఁడు చెప్పిన ట్లిందేమియుఁ జెప్పియుండలేదు. శేషాద్రి రమణకవులు చేసిన యూహలకుఁ గాని. కాకతీయసంచికా సంపాదకుఁడు చేసిన యూహలకు గాని పాలంపేట శాసనము ఋజుభారమును వహించునట్టిది కాదు. కాని యాశాసనమును నిందలి చిక్కును విడఁదీయుటకుమాత్రము సాధనముగాఁ గొనవచ్చునని నా యభిప్రాయము. ఇంక గణపతిని జెఱనుంచినవాఁడు జైతుగి కానియెడల మరెవ్వరై యుండురో విచారింపవలయును. పాలంపేట శాసనములో నిజముగా నేమి వ్రాయఁబడి యున్నదో చదువరులు ముందుగాఁ దెలిసికొన్నఁ గాని సత్యము గోచరించుట సాధ్యముకాదు. పాలంపేట రుద్రసేనాని శాసనము రుద్రదేవుని మరణానంతరము జరిగిన విషయములను దెలుపుచున్నదిగాని రుద్రదేవుఁడు మరణించుటకుఁ బూర్వము నడచిన వృత్తాంతములను దెలిపియుండలేదు. ఈశ్వరదత్తుగారు వ్రాసి

నట్లు పాలంపేట శాసనములో గణపతిదేవుఁడు బందీకృతుఁడై యుండెననిగాని, అట్టి బందీకృత విమోచనానంతరము రుద్రసేనాని గణపతిదేవునకు రాజ్యము నొసంగెనని కాని లేదన్నవిషయము స్పష్టమె. గణపతిదేవుని బందీకృతునిగాఁజేయ సమర్థతగలవారు జైతుగిగాని రుద్రదేవుఁడుగాని యై యుందురు. రుద్రదేవుఁ డవక్ర పరాక్రముఁడై రాజ్య మేలుచుండ నితర సామంత మండలాధీశ్వరులు శత్రువులై యిట్టి పనిఁజేయ శక్తులు కలవారా? జైతుగి గణపతిని కారాగారమునుండి విడిపించి క్షితిపతినిగాఁజేసెనని పైతాను శాసనము స్పష్టముగాఁ దెలుపుచుండ జైతుఁగియె యతనిఁ జెఱలో నుంచెనని చెప్పుట కవకాశము గానరాదు. అతఁడు గాకుండిన రుద్రదేవుఁడే యాతనిఁ జెఱలోనుంచి యుండునా? రుద్రదేవుని తమ్ముఁడు మహాదేవుఁడు. ఈ మహాదేవునకు బయ్యమాంబకు జనించినవాఁడు గణపతిదేవుఁడు. గణపతిదేవుని చెల్లెలు కుందాంబ. కుందవరశాసనమని యొకశాసనము కాకతీయ సంచికయందుఁ జేర్పఁబడినది. * ఈ శాసనమును రచించినవాడు బాలసరస్వతియను సత్కవిరచించెనని యిందేగలదు ఈ కుందపుర శాసనములో శక సంవత్సర సంఖ్యను తెలుపు భాగము పోయినను ప్రమాదియను తెలుఁగు సంవత్సరము నామము మాత్రము నిలిచియున్నది. ఈ ప్రమాది సంవత్సరమునఁ బూర్వమున వేముల కొండయని యిపుడు కుందపురమని వ్యవహరింపఁబడు గ్రామము తనతండ్రి పెండ్లినాఁడు తన కరణముగా నీయఁగా నీ కుందాంబ నా గ్రామమును బ్రాహ్మణులకు దానముచేసి యీ శాసనము వ్రాయించెను. రుద్రదేవుని హనుమకొండ శాసనము క్రీ. శ. ౧౧౬౨ చిత్రభాను సంవత్సరమని మన మెఱుంగు

* కాకతీయ సంచికానుబంధము 14 కుందవర శాసనము. పేజి. 45 శ్రీదూపాటి వేంకటరమణాచార్యులుగారు పంపిన నకలునుండి గ్రహింపఁబడినదం యందు వ్రాయఁబడియుండినది. తెలిఁగాణా శాసనములలోఁ గానరాదు.

దుము గావున నీ ప్రమాది సంవత్సరము క్రీ శ. ౧౨౨౦ సంవత్సర మగునని మనము నిశ్చయింప వచ్చును. కావున నీ శాసన మత్యంత ప్రాముఖ్యము గలదిగాఁ గనుపట్టుచున్నది. ఈమె గణపతిదేవుని తరువాత మహాదేవరాజునకును బయ్యమాంబకును జనించిన కొమార్తె యని తెలియుచున్నది. రుద్రదేవునకుఁ బిమ్మట మహాదేవుఁడు "తస్మాదనంతరం తస్య మహాదేవోమహీపతిః" అని రాజ్యమునకు వచ్చినట్లుగాఁ జెప్పియున్నది. ఈమెతండ్రి యీమెను మంచి వరునికిచ్చి వివాహముఁ జేయనెంచి మంత్రివరులతో నాలోచించి శ్రీనాతవాటిరాజవంశము కాకతీయ రాజవంశమునకుఁ దగినదనియు, కాకతీయ రాజవంశమునకుఁ దరువాతను "శ్రీ కాకతీశవంశేన తదేవ విమలంకులం "అని నాతవాటివంశమె విమల తరమైనదని, దానితో సంబంధము బంగారమున మణిదాపిన ట్లుండునని భావించి కులములన్నిటిలో తిలాకాయమానమగు నీనాతవాటి కులమున, అనేకదుర్గములను సాధించిన వాఁడును, సద్గుణయుతుఁడు నగు దుర్గరాజు రాజయ్యెను. అతని పుత్త్రుఁడు బుద్ధరాజు. వానికుమారుఁడు "దొడ్డప్పాడరిగండభైరవుఁడను బిరుదమును వహించి ప్రసిద్ధిగాంచిన రుద్రరాజునకు మహాదేవరాజు తన కొమార్తె యగు కుందాంబిక నిచ్చి వివాహము గావించెను. ఈ కుందాంబా రుద్రదేవులకు మహాదేవుఁడు, మాధవుఁడు, అని పిలువఁబడు నతఁడు జనించె" నని యీ శాసనమునందుఁ దెలుపఁబడెను. ఇంతియగాక గణపతిదేవ చక్రవర్తి పరాక్రమము నభివర్ణించుచు "తత్వాత్వం పరిపూర్ణ మండలయుతం ముక్త్వాకళంకంపునః" జన్మశ్లాఘ్యమితే కలాభృతి చలాచరాచ లక్ష్మీస్థిరా " యని చంద్రుఁడు కళంకమును విడిచి చంద్రుఁడు పరిపూర్ణ మండలమును ధరించెననియు, లక్ష్మిచాంచల్యమును వదలి స్థైర్యమును బూనెననియు జెప్పి యుండుట యొకింత పరామర్శింపఁ

దగినదిగా నున్నది. ఇందు ప్రోలరాజును బ్రశంసించిన తరువాత రుద్రదేవుని దుర్వారదోర్విక్రముం డనియు, క్షత్రియ వినాశకుం డనియు, నూటికి మించిన పురములను దహించి త్రిపురదహనుఁడగు రుద్రునిగూడ జయించిన వాఁడను నర్థమిచ్చు భావములుగల శబ్దములతోఁ బొగడఁబడి యుండుటవలన నొకింత సంశయము బాధించు చున్నది. తనతండ్రిని జంపి యన్నను జెఱనుంచిన వానిని నీరీతిగా నెవరైన స్తుతింపఁబూనుకొందురా యని సందియము. ఇయ్యది రుద్ర దేవుఁడు మహాదేవరాజును జంపి గణపతిదేవునిఁ జెఱఁబెట్టెనని వాదించువారి వాదనకు నద్దుతగులుచున్నట్లు గన్పట్టవచ్చును గాని గణపతినిగూర్చి చెప్పునపుడు కళంకమును బోఁద్రోఁచుకొని పరిపూర్ణ మండలమును బొందిన చంద్రునితోఁ బోల్చివర్ణించి యుండుటచేత నితఁడు మహాదేవరాజుతోఁ గలిసి రుద్రదేవునిపై బాల్యమునఁదిరుగు బాటు చేసెనేమో యని యనుమానించుటకుఁ గూడ నవకాశమిచ్చు నట్టి ధ్వనినిగూడ సూచించుచున్నది.

అప్పుడిట్లు సమన్వయము చేయవలసి యుండును. ఈశ్వర దత్తుగారు చేసిన యాక్షేపణములను విమర్శనమును జూడఁగావారు తమ యభిప్రాయమును విస్పష్టము చేయకున్నను ఒక విధముగా సమన్వయము కుదురుచున్నది. ఎట్లనఁగా మహాదేవరాజు శేషాద్రి రమణకవులు చెప్పినట్లుగా రాజ్య తృష్ణాధురంధరుడగుటచేతనో, స్థానిక చరిత్రము నందు ముఖ్యముగాఁ బ్రతాపచరిత్రమునఁ జెప్పి నట్లు తండ్రినిజంపి రుద్రదేవుఁడు రాజ్యమేలు చున్నాఁడను భావము చేతనో తన యన్నగారయిన రుద్రదేవునిపై నీర్ష్య వహించి ద్వేషముఁ బ్రేరేప నతనింజంపి రాజ్యమాక్రమించుకొన వలయునని పలుమాఱు ప్రయత్నించుచున్నట్టి వైపరీత్యము గలుగకుండ మంత్రులు మొదలగు వారు వారించుచున్నను, తన్నుఁ జంపుటకై తమ్ముఁడుచేయు చుండె

గంపుబనుల నన్నింటిని సైచి రుద్రదేవుఁడు వానిని క్షమించుచున్నను, అట్లు క్షమించుటయు, సైచుటయు యుక్తము గాదని మంత్రి పురోహితాది జనంబులు నొక్కి చెప్పుచున్నను, రుద్రదేవుఁడు వారి మాటలను బెడచెవిఁబెట్టి తమ్ముని నాదరించుచు వచ్చుటచేతనే తుదకు మహాదేవరాజు తనకు మిత్రులయిన సామంత మండలాధిపతులతోఁ జేరి తిరుగుబాటుచేసి రుద్రదేవుఁడు నగరమున లేని కాలమున సింహాసనము నాక్రమించుకొని యుండుననియు, తరువాత రుద్రదేవుఁడీ సమాచారమును దెలిసికొని స్వసైన్యముతో వచ్చి తమ్మునితో యుద్ధముచేసి యుండుననియు, నా యుద్ధములో మహాదేవరాజు ప్రాణములఁ గోల్పోయి యుండుననియు, అంతటితో నూరుకొనక తండ్రితోఁ జేరి తిరుగుబాటుచేసిన గణపతిదేవుని చెఱ పెట్టెననియు నూహింప వలసి యుండును. ఈ విప్లవమును విని యాదవరాజయిన జైత్రిపాలుఁడు దండెత్తిరాగా నాతనితో జరిగిన యుద్ధమునందు రుద్రదేవుఁడు మరణముఁ జెందఁగా జైతుఁగి గణపతిదేవుని చెఱనుండి విముక్తినిగావించి రాజునుగాఁజేసి వెడలిపోయి యుండుననికూడ నూహింప వలసి యుండును. అటుపిమ్మట నాగతి భూపాలుఁడు మొదలగు శత్రురాజులు గణపతిపై దండెత్తివచ్చి యాతని రాజ్య భ్రష్టునిగాఁజేయఁ జూచినప్పుడు గణపతిదేవుని సేనానియగు రేచర్ల రుద్రిరెడ్డి యపరాక్రముఁడై వారిలోఁ గొందఱను సంహరించియు గొందఱను దఱిమివేసియు విప్లవమును వెంటనే యణచివేసి కాకతిరాజ్య లక్ష్మిని సుస్థిరముగా నిలిపి యుండును.

## మహాదేవరాజు రాజ్యపరిపాలన కాలము.

ఈసందర్భమున మఱొక్క విషయముచర్చింపవలసియున్నది. చరిత్రపరిశోధనమున నాఱితేఱిన చరిత్ర పరిశోధకుఁడును నామి

తుఁడు నగు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖర శర్మగారు "కళింగ సంచికలోఁ బ్రకటింపఁ జేసిన కాకతీయులనాటి కళింగ మను వ్యాసము వారి సమ్మతిని గైకొనకయె కాకతీయసంచికలోఁ బ్రకటింపఁబడినది. అందలి పొరబాటు నొకింత సవరించవలసి యున్నది.

"కావున శకవర్షములు ౧౧౧౭, ౧౧౨౦ లలోపుననే మొదటి రుద్రదేవుఁడు కాలము చేయుటయు, అతనివెనుక మహాదేవరాజు సింహాసన మెక్కి కొంతకాలము రాజ్యము పాలించి కాలవశుఁడగుటయు, సంభవించినట్లు తెలియఁదగి యున్నది. మహాదేవరాజు మూఁడు నాలుఁగు సంవత్సరములకంటె ఎక్కువకాలము రాజ్యము చేయలేదు."

ఈ వీరి యభిప్రాయము ఈ వ్యాసములోనే యీ వాక్యములకుఁ బైనవ్రాసిన "శకము ౧౧౧౭ వఱకు మొదటిరుద్రదేవుఁడు రాజ్యము చేయుచు డినట్లు శాసనముల నిదర్శనము గలదు.1 గణపతిదేవచక్రవర్తియొక్క ౬౨ వ విజయరాజ్య సంవత్సరము శకవర్షము ౧౧౮౨ అయినట్లు ఆతని త్రిపురాంతక శాసనము 2 వలనఁ దెలియుచుండుటచేత అతఁడు శకవర్షము ౧౧౨౦ లో సింహాసన మెక్కినట్లు స్పష్టమగుచున్నది." అను వాక్యములలోని యభిప్రాయములకు భంగకరముగాఁ గన్పట్టుచున్నది. మహాదేవరాజు పరిపాలనముచేసి యుండెనో చేసియుండినయెడల నెంతకాలముచేసియుండు నన్న ప్రశ్నమట్లనే సంశయాస్పదమై నిలిచి యున్నది. గణపతిదేవచక్రవర్తి రుద్రదేవుని మరణానంతరము సింహాసన మెక్కినది వాస్తవమగునేని శర్మగారు వచించినట్లు మహాదేవరాజు మూఁడు నాలుఁగు సంవత్సరములు పరిపాలనముఁ జేసెననుటకు సమన్వయము కుదురదు. కనుక మహాదేవరాజు సింహాసనమెక్కి పరిపాలనము

1. ఆంధ్రపత్రిక; సారస్వతానుబంధము; రుధిరోద్గారి; భాద్రపదమాసము.
2. Ep. coll. 196 (1905)

చేసినది క్రీ. శ. ౧౧౯౮ వ సంవత్సరములో కొన్ని నెలలు మాత్రమె యైయుండవలయునుగాని యంతకంటె నెక్కువకాలము పట్టి యుండదు. లేనియెడల మహాదేవరాజు పరిపాలనము చేసినదే వట్టి దని చెప్పవలసియుండును. ఇక్కడ శర్మగారు పొరబాటుపడిరని తలంచుచున్నాను.

మహాదేవరాజు ప్రతాపరుద్రునితో జరిగిన యుద్ధములోఁ గాని యాతని సామంతులతో జరిగిన యుద్ధములోఁగాని తప్పక మరణముఁజెంది యుండుననియె తలంపవలసి యుండును. గణపతి దేవ చక్రవర్తి పంద్రెండు సంవత్సరములు కారాగార మందుండె నని కాకతీయ సంచికా సంపాదకుఁడు వ్రాసినది సర్వాబద్ధమని చెప్పఁదగి యుండును. 1195 మొదలుకొని 1198 వఱకు మూఁడు సంవత్సరములు మాత్రమె మహాదేవరాజు పరిపాలనము చేసిన వాఁడని యొకవంకఁ జెప్పుచు గణపతిదేవుఁడు ౧౨ సంవత్సరములు చెఱశాలలో నుండెననుట యెట్లు పొసఁగును? గణపతిదేవ చక్రవర్తి చెఱలోనున్న ౧౨ సంవత్సరముల కాలము కాకతీయ సామ్రాజ్య సింహాసన మధిష్ఠించిన వాఁడెవ్వఁడు? అంతకాలము కాకతీయ సామ్రాజ్య మరాజకముగా నుండెననియా వీరి యభిప్రాయము? ఇంతటి మహాద్భుత విషయమును గల్పనచేసి కాకతీయ సంచిక నీరీతిగాఁ జెఱిచి పెత్తనమిచ్చిన యాంధ్రేతిహాస పరిశోధక మండలికిఁ గూడ నప్రతిష్ఠ తెచ్చుచున్నాఁడే?

ఔరా! సాహసము! వీరి ననవలసిన పనిలేదు. శిక్షణ శీలములు లేని యువకునిపై యీ భారమును బెట్టిన యాంధ్రేతిహాస పరిశోధకమండలి వారిదిగాని యీ తప్పు వీరిదికాదు.

---



# కాకతీయాంధ్రరాజయుగ చరిత్రము.

## పదునొకండవ ప్రకరణము.

### కాకతిరాజుల చరిత్రము.

## కాకతి గణపతిదేవచక్రవర్తి పాలనము

(క్రీ. శ. ౧౧౯౮ మొదలుకొని క్రీ. శ. ౧౨౬౧ వఱకు.)

శౌణదేశాధీశ్వరుం డయిన జైత్రపాలుం డను యాదవరాజునకును ఆంధ్రదేశాధీశ్వరుం డయిన కాకతి రుద్రదేవరాజునకును జరిగిన మహాయుద్ధములో రుద్రదేవరాజు వీరమరణము నొందిన వెనుక నతని తమ్ముని కుమారుం డైన గణపతిదేవుండు సింహాసనారూఢుం డయ్యెను. ఇతండు మహాదేవరాజునకు బయ్యామాంబికవలన జనియించినవాండు.1 ఇతండు తన పెదతండ్రి యైన ప్రతాప రుద్రదేవునిచే నుద్ధరింపంబడిన త్రైలింగ్య సామ్రాజ్యమును నలుడల విస్తరింపం జేసి చక్రవర్తి పదమును వహించి సప్తమచక్రవర్తి యని యాంధ్ర

1. పూర్వగ్రంథములలో గణపతి మొదటిప్రతాపరుద్రునికొడు కని వ్రాయంబడెనుగాని యది సరికాదు. శాసనములలో గణపతి మహాదేవరాజు కొడుకని స్పష్టముగాం జెప్పంబడియెను.

భూస్థలినంతట వేనోళ్ళఁ గొనియాడఁ బడుచుండెను. అప్పటినుండియు యాదవు లనేకపర్యాయము లాంధ్ర దేశమాక్రమించుకొనుటకై ప్రబల ప్రయత్నములు చేయుచువచ్చిరిగాని తెలుంగువారు వారిని గోదావరినది దాఁటి దిగువకు రానీక నిలిపిరి. పశ్చిమ చాళుక్యసామ్రాజ్య మంతరించిన వెనుక కర్ణాటక దేశమున కధిపతులైన భళ్ళాణరాజులు సయితము త్రిలింగ దేశమును వశపఱచుకొన వలయు నని భగీరథ ప్రయత్నములు గావించిరిగాని తెలుంగువారి పరాక్రమము ముందట నవియన్నియు భగ్నములై పోయినవి. గణపతిదేవుఁడు సింహాసన మెక్కినతోడనే మండలేశ్వరు లనేకులచేఁ బరిపాలింపఁబడుచున్న యాంధ్రదేశమునంతయు నేకచ్ఛత్రముక్రిందికిఁ దీసికొని రావలయు నని నిశ్చయించి తదనుగుణముగా సమర్థులయిన మంత్రులను సేనాధిపతులను నియమించుకొని వారలసాహాయ్యముతో విజయయాత్రలు ప్రారంభించి యొక్కొక్క మండలేశ్వరుని జయించి వశపఱచుకొని సామంతునిగఁ జేసికొనుచుండెను. గణపతిదేవుఁడు రాజ్యతంత్రజ్ఞాన ముగలవాఁడు గావున నేపని ప్రారంభించినను ఆతనికి విజయమే సమకూఱుచుండెను. కృష్ణానది మొదలుకొని కాంచీపురమువఱకుఁ గల తూర్పుతీరమునంతయుఁ గమ్మనాటిరెడ్లు, పాకనాటిరెడ్లు, చోడులను పేరితోఁ బరిపాలనము సేయుచుఁ బేరికిమాత్రము కాంచీపుర చోడచక్రవర్తులకు సామంతుల మని చెప్పుకొనుచు నైకమత్యము లేక తమలోఁదాము పోరాడుచుండఁగా గణపతిదేవ మహారాజు వారల నందఱను జయించి యేకసామ్రాజ్యమునకు లోఁబడిన వారినిగఁజేసి దేశమున సద్ధర్మపరిపాలనము నెలకొల్పవలయు నని తన యావచ్ఛక్తిని వినియోగించి తుదకుఁ గృతార్థుఁడై శాశ్వతమైన కీర్తిని గడించెను.

## వేంగీదేశములోని కల్లోలములు.

వెలనాటి భూపతులు పేరికిమాత్రము చాళుక్యచోడ చక్రవర్తులకుఁ బ్రతినిధులై విక్రమసింహపుర మను నెల్లూరు మొదలుకొని యుత్తరమున సింహాచలపర్యంతమును గల వేంగీదేశమునంతయు ననేక మండలాధిపతుల సాహాయ్యముతో నిరంకుశముగాఁ బరిపాలనము సేయుచుండఁ బండ్రెండవ శతాబ్దాంతమున గొప్పకలవరము జనించి చాళుక్యచోడ చక్రవర్తుల యధికారమంతయు సంపూర్ణముగా క్షీణించుటయేగాక వెలనాటిరాజులలోఁ గడపటివాఁడయిన పృథ్వీశ్వరునితోఁ గూడ వెలనాటి సామ్రాజ్యలక్ష్మి కాకతీయులను శరణు చొచ్చెను. పండ్రెండవ శతాబ్దాంతమున పృథ్వీశ్వర మహారాజునకును విక్రమసింహ పురాధిపతియైన తిక్కభూపాలునకును జరిగిన మహాఘోరయుద్ధములో పృథ్వీశ్వరరాజు వీరమరణము నొందెను. అంతట పూర్వచాళుక్యుఁ డయిన బేతవిజయాదిత్యునివంశమున జనించిన మల్లపదేవుఁ డను నాతఁడు విష్ణువర్ధననామముతో క్రీ. శ. ౧౨౦౨ వ సంవత్సరమునఁ బీఠికాపురమునఁ (పిఠాపురమున) బట్టాభిషిక్తుఁడై పదిసంవత్సరముల కాలము పరిపాలనము చేసెను. ఇతనికి మల్లపదేవచక్రవర్తి యను బిరుదనామము గలదు.

## తెలుఁగునాయకులు, లేక తెలఁగాలు.

ఆకాలమున నిప్పటి కృష్ణామండలములోని యేలూరు, కొల్లేరుకోట, లేక, ఆకువీడు, గణపవరము, ముఖ్యపట్టణములుగ నుండి తెలుంగు నాయకులచేఁ బరిపాలింపఁబడు చుండినటులఁ గనుపట్టుచున్నది. ఏలూరునకు కొలనుపుర మనియు, కమలాకర పురమనియుఁ బేరులున్నట్టుగాఁ దెలుంగునాయకుల శాసనములం గనుపట్టుచున్నది.

వీరు చాళుక్యుల కాలమునను కాకతీయుల కాలమునను సామంత మండలేశ్వరులుగ నుండి కమ్మసేనా నాయకులవలెనే ప్రసిద్ధిగాంచి యుండిరి. గణపవరమునకు పద్మినీపురమను నామ మున్నట్టు గణప వరములోని సువర్ణేశ్వరస్వామి వారి దేవాలయములోని యొకశాస నమువలనఁ దెలియుచున్నది. ఇక్కడ నొక గొప్ప కోటయుండెను. ఇయ్యది కొంతకాలము కోనసీమరాజులయిన రాచవారి వశమునను, మఱికొంత కాలము కొలనురాజు లయిన తెలఁగాల వశమునను ఉండెను. ఈప్రాంత దేశమంతయుఁ గొలనుపురాధిపతులయిన తెలుగు నాయకులచేతనే పరిపాలింపఁబడుచుండె ననుటకు లేశమాత్రమును సందియము లేదు. పైని జెప్పిన కోట లన్నియును తెలుఁగు నాయ కులచేతనే కట్టఁబడినవి. వీరికిని వేంగిరాజప్రతినిధు లయిన వెలనాటి కమ్మవారికిని యుద్ధము లనేకములు జరిగినవి. తుదకు తెలుఁగునా యకులు వెలనాటి ప్రభువులకు లోఁబడిన సామంతమండలాధి పతు లుగనే యుండుచు వచ్చిరి. “భీమనాయకుఁడు, కాటయనాయకుఁడు” అను పేరులుగల తెలుగునాయకు లనేకులు పండ్రెండవశతా బ్దినందుఁ గృష్ణాగోదావరీ నదులకు నడుమనుండు దేశమును బరి పాలించిరి. కాకతిగణపతిదేవుని రాజ్యారంభకాలముల శ్రీమన్మహా మాండలిక కేశవదేవరాజు, వాని పుత్త్రుఁడు సామినాయకుఁడును, ఏలూరు (కొలనుపురము) రాజధానిగ నీమండలమును బరిపాలనము సేయుచుండిరి. కేశవనాయకుఁడును వాని కుమారుఁడును, వెలనాటి ప్రభువుల యధికారము క్షీణించుకాలమున స్వతంత్రులుగఁ బరిపా లనము చేసిరి. కేశవనాయకుని దానశాసనము లనేకములు కొలను (ఏలూరు) పురములఁ గానంబడుచున్నవి. క్రీ. శ. ౧౨౩౦ వ సంవ త్సరమునాఁటికి నీమండలమంతయును కాకతీయగణపతిదేవ చక్ర వర్తిచే జయింపఁబడెను. తెలుఁగు నాటిరెడ్లకు తెలఁగాలని పేరు

గలిగినది. చాళుక్యులు తెలుఁగుదేశముపై దండెత్తివచ్చి జయించి నప్పుడు వారితో వచ్చిన సేనను సేనాధిపతులు మొదట కమ్మనాటిలో వసించుచుండి తరువాత నితరస్థలములకుఁ బోవఁ బ్రజలు క్రొత్తవారికిని ప్రాంతవారికిని భేదము దెలియుటకై కమ్మనాటినాయకులను కమ్మవారనియు, అదివఱకే తెలుఁగుదేశమున నున్న తెలుఁగు నాయకులను తెలఁగా లనియు వ్యవహరింపసాగిరి. నాటినుండియుఁ గమ్మవారును, తెలఁగాలును వేర్వేఱు తెగవారుగా నుండుట తటస్థమైనది. కాని క్రీస్తుశతాబ్దారంభమున నాంధ్రసామ్రాజ్య విజృంభణకాలమున వీరును వారు నొక్క తెగనే యుండిరి.

ఈ మాండలిక కేశవరాజునకు వానికుమారునకును, అనంతప్రెగ్గడయు, వానికుమారుఁడు మల్లాప్రెగ్గడయు మంత్రులుగా నుండిరి. ఈ మల్లాప్రెగ్గడ సుప్రసిద్ధుఁ డగుటచేత నతని సంతతివారికి మల్లాప్రెగ్గడవారని యింటిపేరు కలిగినది.

## గణపతిదేవుఁడు వెలనాటిని జయించుట.

కాకతి గణపతిదేవ చక్రవర్తి క్రీ. శ. ౧౨౨౫ వ సంవత్సరము నాఁటికి వెలనాటి దేశమును సంపూర్ణముగా జయించెను. నతవాటి సీమరాజులు ధరణికోట రాజులు, గుడిమెట్టరాజులును, తల్లివంక చుట్టాలు, తండ్రివంక చుట్టాలు, వియ్యాలవారు నగుటచేత గణపతిదేవ మహారాజు వారల సాయముతో వెలనాటి నవలీలగా జయింపఁ గలిగెను. వెలనాటిని జయించుటతో మాత్రము తృప్తి నొందక వెలనాటిసైన్యాధిపతులతో బాంధవ్యమును నెఱపి యాభాగమునఁ దనపాలనము దృఢముగ నాటుకొనునట్లు గావించెను. ఇతఁడు వెలనాటికి రాజధానియైన ధనదుపురమునందలి యైశ్వర్యమునంతను జూఱఁగొని యేకశిలానగరమునకుఁ జేర్చుటయేగాక ప్రఖ్యాతి

గాంచిన వీర పురుషులకెల్ల రకు నుద్యోగము లొసంగి యాదరించెను. శాత్రివులకుఁ దక్క మఱియెవ్వరికి నొత్తుడు కలుగనీయనందున నీతని పరిపాలనము వెలనాటి ప్రజల కనుకూలముగ నుండెను. వెలనాటిని జయించిన స్వల్పకాలములోనే యీ భాగము నందంతట శాంతిని నెలకొలిపి మఱియెన్నఁటికిని దిరుగఁ బడకుండునట్లు చక్కని యేర్పాటులను గావించెను.

## గజసాహిణి జాయపనాయకుని సంబంధము.

అయ్యావంశమున జనించిన భీమయ్యయను కమ్మనాటినాయకుఁ డొకఁడు వెలనాటిలోని క్రొయ్యూరునందు నివసించి యుండెను. ఆ భీమనాయకునకు రాజాంబికవలన జల్లయ, నారయ, అను మూవురుపుత్త్రులు జనించి వెలనాటి చోడ మహారాజు కొలువున నుద్యోగములను వహించి యుండిరి. వారిలో జల్లయ యొకానొక కన్నరదేవుని యుద్ధములో జయించినందున సేనాధి పత్యమును బడసెను. రెండవాఁ డయిన నారపనాయకుఁడు (నారాయణ) చోడ రాజుయొక్క ప్రేరణముచేతఁ గృష్ణానది సాగరగామియగుచోట నేర్పడియున్న ద్వీపము నిర్జనభూమియైయుండ నందొక కోటను గట్టి ప్రాకారములు, రాజమందిరములు, విశాలభవనములు, మిద్దెలు, మేడలు నిర్మించి, తోఁటలను వేయించి, యొక మహాపట్టణముగఁ జేసి, తన ప్రభువుపేర చోడసముద్రమను నొక తటాకమును ద్రవ్వించి, చోడేశ్వరాలయమును నిర్మింపించి, జననివాసయోగ్యమైన పుణ్యభూమిగఁజేసి ప్రసిద్ధిఁ గాంచెను. మఱియు నచ్చోట నొక విష్ణ్వాలయమును, కరాళభైరవాలయమును నిర్మింపించెను. వడ్లకూరు గ్రామమున భీమేశ్వరాలయము నిర్మింపించి భీమసముద్రమను తటాకమును ద్రవ్వించెను. ఇతని ధైర్యసాహస పరాక్రమములను మెచ్చుకొని చోడమహారాజు తెలగడదీవి మొదలగు గ్రామముల కాధి

పత్యము నొసంగుటయేగాక యితని సామర్థ్య మెఱింగినవాఁ డగుట చేతఁ దనకు సైన్యాధ్యక్షునిగఁ జేసికొనియెను. ఈ సైన్యాధ్యక్షుఁ డయిన నారపనాయకునకు చోడినాయకుఁడు, భీమనాయకుఁడు, పిన్న చోడి నాయకుఁడు, బ్రహ్మనాయకుఁడు నను నలువురు పుత్త్రులు వెల నాటి చోడరాజునకు సేనాధిపతులై చతుస్సముద్రములవఱనుండి దేశమును శత్రుబాధనుండి సంరక్షించు చుండిరి. వీరిలో మూఁడవ వాఁడయిన పిన్నచోడునకు దామాంబ (దామమ్మ) వలన నారాంబ (నారమ్మ,) పేరమాంబ (పేరమ్మ) యను కూఁతులును; పృథ్వీ నాయఁడు, జాయపనాయఁడు, నారపనాయఁడు (నారాయణుఁడు), నను పుత్త్రులును జనించిరి. అంతఁ గొంతకాలమునకు గణపతిదేవ మహారాజు సేవణ కర్ణాట లాట కళింగ చోళ ధరాధిపులను జయించి వెలనాటిపై దండెత్తివచ్చి వెలనాటిని జయించి యీ ప్రసిద్ధమైన ద్వీపముతోఁగూడ నాక్రమించుకొనియెను. వెలనాటిలో దొరికిన దృఢకాయులను, ఏనుఁగులను, గుఱ్ఱములను నానావిధము లయిన రత్నములను ధన కనక వస్తువాహనాదులను గూఱఁగొనియెను. ఇంతియగాక పిన్నచోడుని కూతులయిన నారాంబను పేరమాంబను పెండ్లియాడి యీ సుందరీమణుల ద్వితీయ సోదరుఁడైన జాయప నాయకుని బుద్ధివిశేషమును, ధైర్యసాహసములును, పౌరుష పరాక్ర మములును, గుణసంపదయును తన్ను నాకర్షింపఁగా సంతోషించి తన గజసైన్యమున కధిపుని గావించి బిరుదముల నొసంగి యున్నత మైన పదవికిఁ గొనివచ్చెను. అందువలన జయపనాయకుని యెదుట శత్రువులు తలయెత్తి చూచుటకు భయపడు చుండిరి. గణపతిదేవ చక్రవర్తి బాహుదర్పముచేత నేగాక, రాజనీతి వేత్తయైన ప్రతి భాశాలియునై యుండినందు వలన, రాజ్యమును విస్తరింపఁజేసి చక్ర వర్తియగుట తటస్థించెను. జయపనాయకుఁడు శాత్రవులను నిర్జించుట

చేత వైరిగోధూమ ఘరట్టమను బిరుదమును పొంది విఖ్యాతిం గాంచెను. ఇతఁడు గణపతిదేవుని పేరిట గణపతీశ్వరాలయమును గట్టించి దానికి ననేక గ్రామములను దానము చేసెను. ఈ దాన శాసనము శా. శ. ౧౧౫౩ ఖరసంవత్సర వైశాఖశుద్ధ తృతీయ దినమున వ్రాయఁబడినది. ఈ శివాలయము పోషణమునకై పడవ యొక్కంటికి నొక్కపణము పన్నుగఁ గైకొనుటకు నియమింపఁబడి యెను. 1 మఱియు నితఁడు శా. శ. ౧౧౫౭ వ సంవత్సర వైశాఖ శుద్ధ తృతీయా శనివారమునాఁడు తామ్రపురము (చేఁబ్రోలు) లో తన తండ్రిపేరిట చోడేశ్వర లింగమును ప్రతిష్ఠాపించి యా శివాలయమున కెదుట దేవదాసీలు నివసించుటకై రెండేసి యంతరవులుగల రెండు వరుసలయిండ్లను గట్టించి దేవుని యంగరంగ భోగములకై మొగ్రంతకూరు (చేఁబ్రోలునకు ౬ మైళ్ళ దూరముననున్న మోదుకూరు) గ్రామమును దానము చేసెను. 2

## ఇందులూరి సోమయామాత్యుఁడు.

మొదటి ప్రతాపరుద్రుని మంత్రులలో నొక్కఁడగు ఇందులూరి పెదమల్లన మంత్రికి సోమరాజు, పెదగన్నణరాజు నను నిర్వురు పుత్రులు గలరని శివయోగసారమను గ్రంథమువలనఁ దెలియుచున్నది. వీరిరువురును గణపతిదేవ చక్రవర్తికి మంత్రులుగను దండనాథులుగఁ గూడ నుండి యాతని వెలనాఁడు కళింగదేశ, దండయాత్రలలోఁ బాల్గొని యాతని కపారమైన విజయమును సంఘటింపఁ జేసి ప్రఖ్యాతులైరని శివయోగ సారమను గ్రంథమునఁ దెలుపఁబడినది. వీరిలో సోమయామాత్యుఁడు కాకతిగణపతిదేవ చక్రవర్తి

1. Epigraphia Indica Vol. III P. 82 ff; No. 15, Ganapeswaram Inscription of the time of Ganapati.

2. Ibid No. 5, Chebrolu Inscription of Jaya.



ప్రతాపరుద్రుని శిరస్సు.



పూజ జరుగుచున్న పద్మాక్షిగుడిలోని విగ్రహము.

కడ నొక ప్రధానమంత్రిగను, దండనాథుఁడుగనుండి యోరుగల్లు నకుఁ బూర్వభాగముననుండెడి దేశములమాత్రమె గాక కళింగము లోని భూములనుగూడ జయించెనని యాగ్రంథమున స్పష్టముగఁ నీ క్రిందిపద్యములలోఁ జెప్పఁబడినది.

"సకలవేద శాస్త్రసంపన్నుఁ డమితయ
శోధనుండు బంధుసుజన పోషకుఁడు
గరిమెపోచమాంబికా వరసుతుఁడు
కేవలుండె సోమమంత్రి విభుఁడు."

"కం. మహిరుద్రరాజు కనుజుఁడు
మహాదేవుఁడు తత్సుతుండు మఱిగణపతినా
నహితభయంకరుఁ డాతని
మహిమము (    ) సోమమంత్రీశ్వరుఁడున్."

"చ॥ ఇలబహుసైన్యముల్ గొలువ నేకశిలాపురి పూర్వదిక్కునఁ
గలరిపు భూములెల్లఁగొని గర్వమునై (    ) కాడిమండలీ
కులనవలీలఁదోలి (ను) రిగోగుల నాడును గొల్చివీడునా
వెలసిన దుర్గముల్ గొనుచు వేగమె గౌతమిదాటి యుమ్మలన్. ॥

"కం. మాడియు రెండుంగొనియూ
డాడెడి పన్నెండు మన్నియములు నొడిచినా
నాడె కళింగయనీమను
గూడినఘనిగొనెనె సోమమంత్రుల ముఖ్యుఁడొగిన్."

ఆ. లీలఁగొలని మండగిరుల వెసదోలి
గొలఁకవీడు దాను గొనుటఁజేసి
కాకతీశుఁడైన గణపతియును దాను
కొలఁకసోముఁ డనఁగ వెలసె జగతి."

అప్పటినుండియు వీరికి ఇందులూరి వారను నింటిపేరు మాఱి పోయి కొలను వారను నింటిపేరు వచ్చినట్లుగాఁ దెలియుచున్నది.

## కొలనువీడే ఏలూరు పురము.

నిజాము రాష్ట్రములోని కొలను పాకయె కొలను వీడని పెక్కండ్రు భ్రమపడు చుందురు. ఈ కొలనువీడు ఏలూరుగాని కొలను పాకగాదు. క్రీస్తుశకారంభమునుండి కొంతకాలము 'ఏలూరు' అను నామమె మొదట నుండినను ప్రాకృత శాసనములలో 'ఏలూరా' యని మొదటి వ్యవహరింపఁ బడినను; తరువాత ౮ శతాబ్దినుండి ౧౫ శతాబ్ది వఱకును ఏలూరు కొలను వీడని యనేక శాసనములలో వక్కాణింపఁబడి యున్నది. ఇదియె సంస్కృతమున సారసిపురమనియు, కమలాకర పురమనియు, పద్మినీ పురమనియును, వ్యవహరింపఁ బడుచు వచ్చినది. మహమ్మదీయ పరిపాలనము వచ్చిన నాటనుండియు నేలూరని మరల వ్యవహరింపఁ బడుచున్నది. ఆ కాలమున నీ కొలనువీడు జలదుర్గములలో శ్రేష్ఠమైనదిగా శివయోగ సాగరమున వర్ణింపఁబడినది. ఈ వీడు గొలనునడుమఁ గట్టఁబడి యుండుటచేత కొలనువీడని చరిత్రమునఁ బ్రసిద్ధి గాంచినది. చాళుక్యాంధ్రుల పరిపాలనకాలమున రాజమహేంద్రవరము రాజధానీ నగరముగాఁ జేయఁబడిన వెనుక కొలనువీడు చాళుక్యాంధ్ర రాజప్రతినిధులకు ముఖ్యస్థానమై పఱగుచుండెను. కాకతీయాంధ్ర చక్రవర్తుల కాలమునందుకూడ రాజప్రతినిధులకు ముఖ్యస్థానముగ నుండెను. చాళుక్యుల పరిపాలన మంతరించిన వెనుక నీ దుర్గమును బరిపాలించుచుండిన తెలుఁగు నాయకులు (తెలఁగాలు) "మండలేశ్వరులు" స్వతంత్రులైరి. కాకతి గణపతిదేవ చక్రవర్తికాలమున "ఇందులూరి సోమరాజను సోమయమంత్రి" క్రీ. శ. ౧౨౨౮ వ సంవత్సరప్రాంతమున నీ మాండలిక రాజులను బాఱఁదోలి యాభాగమును గాకతీయాంధ్ర సామ్రాజ్యములోఁ గలుపుకొనినాఁడు.

## కళింగముపై దండయాత్ర.

క్రీ. శ. ౧౧౮౬ వఱకు దరువాతను మొదటి రుద్రదేవుని శాసనములు గోదావరి మండలమునఁ గానరాకుండుటచేత నీ శాసనములవలనఁ గాకతీయులు, కళింగదేశము సరిహద్దుల వఱకు వచ్చిరని స్పష్టపడుచున్నను కళింగదేశమును తమ సామ్రాజ్యమునఁ జేర్చుకొనుటకు దండెత్తిరో లేదో స్పష్టపడకున్నది. రుద్రదేవుని మరణానంతరము సంభవించిన విప్లవకాలములో కళింగదేశ సరిహద్దులను పరిపాలించుచున్న సామంతమండలాధిపతులు కాకతీయ సామ్రాజ్యమునుండి విడివడి స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించుచున్నట్లు గోదావరిమండలములోని దక్షారామములోని గణపతిదేవ చక్రవర్తి సేనాని "కాకతిరాజ్యసమర్థుఁ" డని బిరుదము పొందిన రేచర్ల రుద్రరెడ్డికి మంత్రిగ, ముఖ్యసేనానిగ నుండిన రాజనాయకుని క్రీ. శ. ౧౨౧౨వ సంవత్సరమునాటి దానశాసనము గన్పట్టుటచేత మొదట కళింగదేశముపై దండయాత్ర సాగించిన ఇందులూరి సోమయామాత్యునితోఁ బోయిన సేనానులలో ముఖ్యుఁడు రాజనాయకుఁ డొకఁడని స్పష్టపడుచున్నది. ఓరుగంటిపురములో సంభవించిన విప్లవకారణమువలన ప్రాగ్దేశముననున్న మాండలికులు స్వాతంత్ర్య పతాకముల నెత్తిరని మన మూహింపవచ్చును. వీరలనెల్లరను జయించి తాత తండ్రుల ప్రతిష్ఠను సుస్థాపనగావించి రుద్రదేవుని సామ్రాజ్య సంస్థాపన ప్రయత్నము సఫలీకృతము గావించి సామ్రాజ్య సంరక్షణభారము తనపైఁ బడినందున సామ్రాజ్యమునఁ గంటకములవలెనున్న యీ సామంత మాండలికులను జయించుటకై గణపతిదేవ చక్రవర్తి చుట్టుపట్టులనున్న కొందఱు సామంతనృపతులతో సంబంధ బాంధవముల నెఱపి తన స్థితిని, తన సామ్రాజ్యమును కట్టుదిట్టము గావించుకొను తలంపుతో నీ కళింగదేశ దండయాత్రకుఁ బూనుకొని

యెనని విస్పష్టమగుచున్నది. ఈ విషయము గణపతిదేవచక్రవర్తి కాలమునాటి యుప్పరపల్లి శాసనమువల్లఁగూడ ధ్రువపడుచున్నది.1 ఈ శాసనములో రేచర్లరుద్రునకుఁ బ్రధానియైన రాజనాయకుఁ డిట్లు వర్ణింపఁబడియున్నాఁడు.

“ కులతిలకుఁడు వసుధామర
జలధి సుధాకరు డశేషజననుత చరితుం
డలఘుఁడు రిపుతరు దావా
నలుఁడనఁగా బరఁగె రాజనాయకుఁడుర్విన్.

ఇతనివిజయములు పై శాసనములోనిట్లు వర్ణితములై యున్నవి.

“బొక్కెరలోని వీరభటావళి వధించి గోధుమరాతితల దెంచి ఉదగిరి సాధించి పడిరాయనిందోలి దాక్షారామ భీమేశ్వర దేవర కక్షయ దీపఁబులునిల్పె.........”ఇందలి బొక్కెరయనునది గంజాము మండలములోని బొక్కెరయని శాసన పరిష్కర్తలు నిర్ణయించి యున్నారు. ఇందలి ఉదయగిరి యనునది నెల్లూరి మండలములోని యుదయగిరిగాక కళింగదేశములోని యుదయగిరి యనియె మనము భావించుట సమంజసముగఁ గన్పట్టుచున్నది. ఈ కళింగ దండయాత్రను ఇందులూరి సోమయామాత్యుఁడు సాగించిన విధానము కొలని గణపతిదేవ కవి విరచితమైన శివయోగ సారమున నభివర్ణింపఁబడిన దానిని పైన వివరించియే యున్నాఁడను. ఈ సందర్భమున నా మిత్రుఁడు సోమశేఖరశర్మగారు ‘కాకతీయ కళింగ’ మను వ్యాసమునఁ దెలిపిన భాగము నిదివఱకె కళింగసంచిక యందు బ్రకటించి యుండుటచేత నా వాక్యములనే యిచట నుదహరించు చున్నాను.

1 Hyd Arch. Ser. No. 3. p. 16.

"పైనుడివినదేగాక కాకతి గణపతిదేవుని కళింగ యుద్ధములను పేర్కొను శాసనము లింకను గలవు. 1 గణపతిదేవుని మోటుపల్లి శాసనము 2 గూడ నతఁడు కళింగముపై దాడివెడలినట్లు సూచించు నీ క్రింది శ్లోకము గలదు.

కంఠాలాఖండ వైరావణ కటక రణక్షోభ సంభ్రాంతీ
భృంగీ సంగీతాకల్ప కల్ప ద్రుమవనవిటపప్రాంత దో
లాధిరూఢః గాయం గాయం రమతే సురపుర
సదృశో విక్రమం యస్యతాద్యక్తం గ్రామారంభ
లంబాపటహారవదురాతంక తామ్యత్కలింగం ||

గణపతిదేవుని ఏకామ్రనాథ శాసనమున, 3

యస్యాదయ కృత్త చేతోరింఘణ స్సింహణోయ య
చ్చటుల సుభట దాటీ దత్తషంగః కళింగః
అపిచయ దుపసేవాజీవి నేలాటగౌడో
గణపతి నృపతేః కః శ్లాఘతే విక్రమాయ||

అనికలదు. ఇదియు కళింగసూచనమే. గణపతిదేవుని పాఖాల శాసనములో 4 కూడ,

" కాశీనాథః కళింగః శకఫగణి పతిర్మాలవః కేర
ళేశస్తామ్నాణోజూణ భూపః కురుపతిరరి మర్దాధి
పోమాగ ఘేశః నేపాళశ్చోభి పృథ్వీపతిరితి వినతా
న్యగ్రతో రాజవర్గా న్నామగ్రాహం గృహిత్వాసదసి
సదసి యద్దర్శకా దర్శయంతి||"

1. Ep. Ind. Vol. III, p. 84; Ind. Ant. Vol. XXI p. 188.
2. Ep. Ind. Vol. XII, p. 188;
3. Ind. Ant. Vol. XXI, p. 197.
4. Hyd. Arch Ser. No. 4 and 5.

అని కళింగ విజయ సూచనకలను కాని కాశీనాథ, శశ ధరణిపతి, మాళవ, కేరళ, కురుపతి, మాగధదేశము, నేపాళాధి పతులను అందఱను వరుసపెట్టి జయించినట్లుండుటచేత ఈ విజయము లని చెప్పఁకొనఁబడినవన్నియు వట్టి బూటకములని బరిగణింప వలసి యుండుననుటకు సందియము లేదు. అయినను తుమ్మాణ కళింగములు సరిహద్దు రాజ్యము లగుటచే నిందు రవంతయేని సత్యముండక పోదని యనుమానింప వచ్చును. ఇదియునుంగాక, ఒడ్డాది మత్స్య వంశజుఁడైన అర్జున దేవని 'దిబ్బిడ' తామ్ర శాసనమున వీరవల్లి తాలూకాలోని 'దిబ్బిడ' గ్రామ సరిహద్దులలో "కాకతిఖండి" అను నది యొక సరిహద్దుగ దెలుపఁబడినది. అది గ్రామమో యేమో ? ప్రాయికముగ కళింగమున ఆ సరిహద్దువఱకు అనఁగా విశాఖ పట్టణ మండలములోని వీరవల్లి తాలూకా వఱకు కాకతీయ రాజ్యము వ్యాపించి యుండెనేమో.

రాజనాయకుని దాక్షారామ శాసనము శకవర్షము ౧౧౩౪ నాటిది. గనుక కాకతీయులకు కళింగ విజయము అంతకు పూర్వమె సంభవించినదని చెప్పవచ్చును ..............................

ఈ కాలమున కాకతిగణపతి దేవునికి సమకాలికులై కళింగ మును బరిపాలించు చుండిన గంగవంశపురాజులు ఇరువురు గలరు. (౧) మూఁడవ అనంగ భీమదేవుఁడు. ఇతఁడు మన్ మోహన్ చక్ర వర్తిగారి పరిగణన ప్రకారము శకవర్షము ౧౧౩౩ మొదలు ౧౧౬౦ వఱకు పరిపాలించెను. (౨) అతని కొడుకైన మొదటి నరసింహదేవ చక్రవర్తిగారి పరిగణనము ననుసరించి శకవర్షము ౧౧౬౦ మొదలు ౧౧౮౬ వఱకు పరిపాలించెను. కాకతీయులు కళింగముపై దండెత్తి జయించుటకు వీరిరువురి పాలనమే చాలయుక్తముగ నుండెను. ఏల యన ఉత్తర హిందూస్థానమున కంతకు సంభవించిన మహమ్మదీయ విప్లవోపద్రవము ఈ అనంగదేవ భీముని యొక్కయు, ఈతనితండ్రి రాజరాజు దేవుని యొక్కయు, కాలముననే సంభవించెను. • బఖ్తి

యార్ ఖిల్జీ ప్రాపక ప్రోత్సాహములవలన మహమ్మదీయులు ఉత్తరపు తట్టునుంచి కళింగ గంగవంశపు రాజ్యము నెదుర్కొనుచుండిన కాలమునందె కాకతీయులు ఉత్తరముగఁ దమరాజ్యమును కళింగమున వ్యాపింపఁ జేసికొనుచుండిరి. ఈ మూఁడవ అనంగభీమ దేవుని కాలమునను, అతని కుమారుఁడు మొదటి నరసింహదేవుని కాలమునను గూడ మహమ్మదీయ సేనా వాహిని తడవతడవకు సముద్రపు పొంగువలెవచ్చి, కళింగోత్తర భాగముపైఁ బ్రవహించి దానిని ముంచెత్తుచునే యుండెను. మహమ్మదీయుల తోడి యాపోరాటములలో వారిని జయించి కొంచెము విశ్రాంతి గైకొని తేరుకొన్నమీఁదట గంగవంశ భూపతులు వేంగిదేశముపై దృష్టి మరల్చిరి. ఈ కాలమున అని యంక భీముని శాసనములు రెండు దాక్షారామమున గానిపించుచున్నవి. అందొకటి శకము ౧౧౪౨ నాటిది. రెండవదిశకము ౧౧౪౪ నాటిది. రెండవ శాసనము చెడిపోయినది. ఇందు రాజ రాజు కుమారుఁడును, హరి పద ప్రియరావు తాఖ్యుఁడును అగు "అనింక్క భీముడు" (అనంగ భీముఁడు లేక అని యంక భీముఁడు) పేర్కొనఁబడి యున్నాఁడు. అటుపిమ్మట దాక్షారామ భీమేశ్వరునికి చేయబడిన దానమును వర్ణించు సందర్భమున కొన్నియక్షరములు పోయినవి. తరువాత"... స్రిజకేన, ద్రుతజిత విలసద్వేంగి భూ మండలేన, అని కలదు. అంతటితో శాసనము ముగియును. అని యంకభీముని దండాగ్రేసర వల్లభుఁడు "జెసాప్రిజకు" డని మనకుఁ దెలియును గనుకను శకవర్ష కాలముగూడ మొదటి శాసనకాలమునకు సమీపమున నుండుటచేతను రెండవ శాసనమునందలి "స్రిజకేనయనునది "జెస్రాజకేన" యుండఁదగునని నా నమ్మకము. తరువాతి "ద్రుతజిత విలసద్వేంగీ మండలేన" అనునది "జెస్రాజకు" నికి విశేషణము. ఈ విశేషణము ననుసరించియే అనియంకభీముఁడు వేంగీమండలమును మరల కాకతీయులనుండి జయించెనని నిశ్చయింపవచ్చును. దక్షిణ కళింగమునే కాక

1. S. I. I. Vol. IV No. 1360.

అనంగభీముఁడు వేంగిని కాకతీయులనుండి జయించెననుటకు ఈ శాసనములే మన కాధారములు.

కాకతి గణపతిదేవుని ప్రధానియైన హేమాద్రిరెడ్డియొక్కయు, కాకతిగణపతిరాజుల గజసాహిణియు అనుంగు, అయిన జాయపనాయకునియొక్కయు, శాసనములు దాక్షారామమున వరుసగా శకము ౧౧౬౯ లోను,1 శకవర్షము ౧౧౭౨ లోను2 మనకుకాన్పించుచున్నవి. వీటిమూలమున వేంగివైపు కాకతీయుల యుత్తరపు సరిహద్దు సురక్షితముగ నుండలేదనియు, స్థానికులైన సామంతులవలననో, లేక కళింగాధిపతులవలననో, వారి మండలికులవలననో, కాకతీయుల యుత్తరరాజ్యమునకు ఉపద్రవము సంభవించుచునే యుండెననియు, ఆ కారణముననే కాకతి గణపతి మహాప్రధానిమల్లల హేమాద్రిరెడ్డియు, అనుంగు జాయపనాయకుఁడు, నిటురావలసి వచ్చెననియు, వారి శాసనములు దాక్షారామమున గనఁబడుటకు ఆ ప్రాంతపు "కల్లోలములే" కారణములై యుండుననియు, ఊహింపఁదగియున్నది. ప్రాయికముగ కాకతీయ రాజ్య మిట్టి విపత్పరంపరలకు లోనైన కాలముననే కావచ్చును, పాండ్యదేశాధిపతియైన జటావర్మ సుందరపాండ్యుఁడు విక్రమించి, కాకతీయ సామంతులను కాంచి నుండి తరుమగొట్టి దానిని స్వాధీనపఱచుకొనియెను. ఈ కాలముననే గణపతిదేవ చక్రవర్తి పాదపద్మారాధకుఁడయిన కాలపనాయకుఁడు వేంగివిషయమునకు అధిపతిగ నియమితుఁ డయ్యెను. శకవర్షము ౧౧౭౮ (౧౧౬౪) నాటి యాతని శాసనమున నతనికి "వేంగీవిషయాధినాథ" యను బిరుదముండుటయె యిట్టి యూహ కెడమిచ్చుచున్నది.3 కాకతి గణపతిదేవచక్రవర్తి శకవర్షము ౧౧౮౯ లో కాలగతి నొందెను. అతని యంత్యకాలమునను, ఇంచుక యనంతరముకూడ కాకతీయసామంతులు అవన్యవనోద్భవు లయిన మహారాజ సింహాదులు వేంగివిషయము కళింగ గాంగభూభుజులకు వశముగాకుండ దానిని గాపాడుచునే వచ్చిరి. వీరి శాసనములును4 దాక్షారామమున శకవర్షము ౧౧౮౪ ప్రాంతముల గానవచ్చుచునేయున్నవి."

(1) S. I. I. Vol. IV. No. 1339. (2) S. I. I. Vol. IV, No. 1045 (3) S. I. I. Vol. IV No· 602.

4. S. I. I. Vol. IV. Nos. 1341, 1342-A. 1342-B.

## విశ్వేశ్వర శివదేశికులు.

వేదవేదాంతార్థము లెఱింగిన జ్ఞానసంపన్నుఁడని ఖ్యాతిఁ గాంచిన యీ శివయోగి శైవగురుపరంపరలోనివాఁడు. కాకతి గణపతిదేవ చక్రవర్తికి గురువును మహాప్రధానియునై రాజకీయార్థిక సాంఘిక విషయంబులఁ దగు నాలోచనములం జెప్పుచు రాజ్యతంత్రమును నడిపించుచు నా చక్రవర్తి యౌన్నత్యమున కంతకుఁ గారణభూతుఁ డయ్యెను. ఆంధ్రదేశములోఁ బ్రఖ్యాతిగాంచిన శ్రీ గోసఁగి, శ్రీశైలము, శ్రీపుష్పగిరి మొదలగు శైవమఠములకెల్ల నధికారిగనుండి శ్రీ కాకతి రుద్రదేవ చక్రవర్తిచే శైవమతము నాంధ్రదేశమున వ్యాపింపఁజేసిన గురుమల్లికార్జున పండితారాధ్యుల వారి తరువాత నితఁడు సుప్రసిద్ధిఁ గాంచెను. సోమదేవ రాజీయాది గ్రంథములలో గణపతిదేవుని సచివాగ్రణియని పేరెన్నిక గాంచిన శివదేవయ్యయను నాతఁడీ విశ్వేశ్వర శివదేశికులేయని చెప్పవచ్చును. ఇతఁడు గానియెడల నితనివలెఁ బ్రసిద్ధిగాంచినట్టి యితని కుమారుఁడగు పరిపూర్ణ శివమహామునియై యుండవలయునుగాని, యన్యులు మాత్రము గారు. విశ్వేశ్వరశివదేశికులే శివదేవయ్యయని నా యభిప్రాయము. వీర లిరువుర దాన శాసనములు భట్టిప్రోలు త్రిపురాంతకము మొదలగు ప్రదేశములఁ గానంబడుచున్నవి. కాకతి గణపతిదేవ చక్రవర్తిని జూడవచ్చిన తిక్కన సోమయాజి,

"గీ. వసుమతీనాథ యీతఁ డీశ్వరుఁడు గాని
మనుజమాత్రుండు గాఁడు పల్కులు నిజము
యనుమతంబున నీవు రాజ్యంబు సెమ్మి నేలు"

మని చెప్పి కొనియాడిన దీ విశ్వేశ్వర శివదేశికులనే యైయుండవలయును గాని యట్టివారు మఱియొక రాయాస్థానమునం గనుపట్టరు.

కాటచమూపతి - చౌండ సేనాధిపతి.

వీర లిరువురును గణపతిదేవ చక్రవర్తి సేనాధిపతులు. కాట చమూపతికొడుకు చౌండ సేనాధిపతి. ఈసేనాధిపతు లిరువురు నుత్తర దేశము నేలు రాజులతో గణపతిదేవుని పక్షముననుండి యుద్ధము చేయుచు మన్నన గాంచుచుండిరి. వీరి నివాసస్థలము నిర్మల యను పట్టణము. చతుర్థవంశమున దుర్జయుఁడు జనించెను. అతని వంశమున మల్లాలనాథుఁడుపుట్టి పెద్దముట్టిగండఁడను వీరుని నతనిబంధువర్గమును నాశనము గావించెను. మల్లాలనాథునికొడుకు సబ్బిసేనాధిపతి. ఇతఁడును శత్రురాజుల నిర్జించెను. ఇతనికి అచ్చమ యను భార్యయందుఁ గాటచమూపతి జనించెను. ఈకాటచమూపతి మొట్టమొదట కాకతి రుద్రదేవ రాజుకడను, అటు పిమ్మట గణపతిదేవ చక్రవర్తి కడను సేనాధిపతిగనుండి బొల్లమాంబవలన పోతనాయఁడు, చౌండ సేనాధిపతి, అను నిరువురు కొమారులను గాంచెను. కాటచమూపతి శా. శ. ౧౧౬౨ శార్వరిసంవత్సర ఫాల్గునశుద్ధ ౧౧ స్థిరవారము నాఁడు కొండిపర్తియను గ్రామమునందు త్రిమూర్తులను నొకటఁ బ్రతిష్ఠ గావించి దేవాలయమును గట్టించి బెల్లము చెఱువు గ్రామ మును దేవుని కైంకర్యములకై దానము చేసెను. చౌండసేనాధిపతి శత్రుసేనను జయించినపిమ్మట కొండిపర్తికి చౌండసముద్రమని పేరుపెట్టి చౌండసముద్రమను నొకతటాకమును ద్రవ్వించి చౌండే శ్వరలింగమును బ్రతిష్ఠగావించి యున్నతమైన దేవాలయమును బ్రాకారములనునిర్మింపించి సువర్ణ కలశములను బెట్టించి యాదేవుని కైంకర్యమునకై అనకుర్తియనుగ్రామము నొసంగెను. వీరును దుర్జయ వంశజుల మని చెప్పుకొన్నవారు.

గంగయసాహిణి.

ఈ గంగయసాహిణి గణపతిదేవ చక్రవర్తియొక్క మహా ప్రధానులలో నొక్కఁడు. ఇతఁడు హైదరాబాదు రాజ్యములో నల్ల

గొండజిల్లాలోని పానుగల్లు మొదలుకొని మార్జవాడివఱకును గల తెలుఁగు దేశమునంతను ప్రతినిధిపరిపాలకుఁడై పరిపాలించెను. కడప మండలములోని పులివెందల తాలూకాలోని మోపూరు మొదలుకొని మైసూరు రాజ్యములో చింతామణి తాలూకాలోని మిండిగల్లు వఱకుఁగల ప్రదేశమునకు (7000 గ్రామములు గలది) మార్జవాడి లేక మహారాజపది యను నామము గలదు. మార్జవాడికి కైవార ముకోట యని యొక శాసనమున నున్నది. ఈనాటికి వల్లూరుపట్టణము రాజధానిగ నుండెను. కాబట్టి రాజప్రతినిధిగ నుండిన గంగయ సాహిణి కడప, కందనోలు, అనంతపురము, బల్లారి, నెల్లూరు, గుంటూరు మండలములకు సర్వాధికారియై పరిపాలించెనని యనేక శాసనములం బట్టి నిర్ధారిత మగుచున్నది.

### గంగయసాహిణి కాయస్థుఁడు.

మహారాజ ప్రతినిధియైన యీ గంగయసాహిణి కాయస్థకులస్థుఁ డని కడప మండలములోని పుష్పగిరిలో నున్న యొక శాసనములో వ్రాయఁబడిన యీ క్రిందిశ్లోకము వలనఁ దెలియుచున్నది.

"యో గండపెండేరక నామధేయః
కాయస్థవంశోద్భవకర్ణధారః
శ్రీగంగ సేనాపతి రస్య కాన్తా
కాన్తిర్హిమాంశోరివ కొంబలాయః"

### గంగయసాహిణి పూర్వచరిత్రము.

గంగయసాహిణికిని మనుమసిద్ధి రాజునకును వైరము గలదని తిక్కన సోమయాజి విరచితమైన నిర్వచనోత్తర రామాయణములో

"ఉ. రంగదుదారకీర్తి యగు రక్కెసగంగని బెంజలంబుమై
భంగ మొనర్చి మన్న జనపాలుఁడు బల్విడి నాఁచికొన్న రా

జ్యాంగములెల్ల నిచ్చి తన యాశ్రితవత్సల వృత్తి యేర్పడన్
గంగయసాహిణిం బదము గైకొనఁ బంచెఁ బరాక్రమోన్నతిన్."

అను పద్యమువలన బోధపడుచున్నది.

"ఇట్టి మహాపరాక్రమవంతుఁడైన గంగసాహిణి నొకమండలాధిపతిగ నున్న మనుమసిద్ధి యెట్లు జయించి యతని రాజ్యాంగములెల్ల నాఁచికొనియెనో, ఎట్లాతఁ డాశ్రితుఁడై యితనిం బ్రార్థించెనో, ఎట్లీతఁ డాశ్రితవత్సలవృత్తి యేర్పడునట్లుగా నాఁచికొన్న రాజ్యాంగములెల్ల నిచ్చి పదముగైకొనఁ బంచెనో, ఎంతమాత్రమును బోధపడకున్నది." అని యీ చరిత్రముయొక్క నాల్గవ సంపుటములో మనుమసిద్ధి రాజుంగూర్చిన ఘట్టమున వ్రాసియున్నాను. ఇటీవల స్థానిక చరిత్రములం బరిశోధింపఁగా గంగయసాహిణియొక్క పూర్వవృత్తాంతము కొంతవఱకుఁ దెలియవచ్చినది. గంగయసాహిణి మొట్ట మొదట గణపతిదేవ చక్రవర్తికొలువులో నుండెనియు మనుమసిద్ధి రాజు తండ్రియైన తిరుకాళచోడమహారాజునకు (తిక్కరాజు) అగ్రసేనాధిపతిగ నుండెననియు, సిద్ధవటముసీమలోని యోగూరు స్థానిక చరిత్రమునందుఁ జెప్పబడుచున్నది. ఇతఁడు మొదట తిక్కభూపాలునకు సేనాధిపతిగ నుండి యతని యనంతరమున కలుకడపురవరాధీశ్వరుం డయిన శ్రీమన్మహామండలేశ్వర త్రైలోక్యమల్ల భుజబల వీరనారాయణ రాయదేవమహారాయల సైన్యాధీశుఁడై యోదుకూరునందుండి ములికినాటిని బరిపాలనము సేయునపుడు తిక్కరాజు కొడుకయిన మనుమసిద్ధిరాజునకును గంగయసాహిణికిని, యుద్ధము జరిగి యుండవచ్చును. ఆ యుద్ధమునందు గంగయసాహిణి నోడించి యతం డాశ్రయించుటచేతఁ దన యాశ్రితవత్సలవృత్తి యేర్పడినట్లుగా యథాస్థానమునకుం బంచెనని స్పష్టమగుచున్నది. శా. శ. ౧౧౬౮ (క్రీ. శ. ౧౨౪౭) ప్లవంగసంవత్సర పుష్యశుద్ధ ౧౩ బుధ

వారమునాఁడు గంగయదేవ మహారాజునకు భృత్యుఁడైన జొత్తి రామినాయకుఁడు ములికినాటిసీమలోని సిద్ధవటమునకుఁ బశ్చిమమున రెండుపరువుల దూరమునఁ బినాకినీనదీ తీరంబున నున్న జ్యోతిగ్రామములోని సిద్ధనాథుని గుడిగోపురము కట్టించి యగ్రహారము నొసంగి శాసనము వ్రాయించెను. కాఁబట్టి క్రీ. శ. ౧౨౫౭ వ సంవత్సరమునఁ గాని తరువాతఁగాని కాకతి గణపతిదేవ చక్రవర్తి దక్షిణదేశమునకు దండెత్తివచ్చుట సంభవించి యుండును.

గణపతి దక్షిణదేశముపై దండెత్తుట.

గణపతి చక్రవర్తి వెలనాటిరాజులను జయించిన తరువాత వెలనాటికి దక్షిణభాగమై యున్న కమ్మనాటిని బరిపాలించుచున్న చోడరాజులను గూడ జయించెను. కొట్యదొన (కొణిదెన) పురాధీశ్వరుండును, నన్నెచోడ భూపాలుని, కుమారుండు నైన త్రిభువనమల్లచోడ భూపాలుని, వాని యాప్తవర్గములోని మఱికొందఱు చోడరాజులను జయించి సామంతులనుగఁ జేసికొనియెను. అటుపిమ్మట కందుకూరుసీమలోని యద్దంకిపై దండయాత్ర వెడలి యాపట్టణమేలుచున్న సేవణదేశస్థుఁడైన మాధవరాజును జయించి యటనుండి ములికినాటి దేశముపై దండెత్తిపోయి ములికినాడు పొత్తపినాడు, రేనాడు, గండికోటసీమ మొదలగు ప్రదేశముల నెల్ల జయించి యటనుండి కాంచీపురమును ముట్టడించెను. ఈ దండయాత్రకుఁ గారణము పాండ్యులు మొదలగు దాక్షిణాత్యులు కాంచీపురమునుండి తెలుగుచోడులను దఱిమి యాపట్టణమాక్రమించుకొని యుండుట చేతఁ దెలుగుచోడులు గణపతి చక్రవర్తి సాహాయ్యము నపేక్షించి యుందురు. అట్లుగాక కేవలము ద్రవిడదేశ విజిగీషామనీషం దండెత్తిపోయి యుండవచ్చును. ఎట్లయిన నేమి? గణపతిదేవ చక్ర

వర్తి దక్షిణదేశముపై దండెత్తిపోయి కాంచీపురము వఱకునుగలదేశము నంతయు జయించెను. ఆకాలమున గణపతిదేవ చక్రవర్తి గoగ యదేవమహారాజును జయించి యతనినే తనకు సైన్యాధ్యక్షునిగఁ జేసికొని నటులు గాన్పించుచున్నది.

గణపతి పాండ్యులను జయించుట.

మనుమసిద్ధి తండ్రి యగు తిక్కరాజు కాలమునఁ బాండ్యులు కాంచీపురముపై దండెత్తివచ్చి యారాజ్య మాక్రమింపఁగాఁ దిక్కరాజు పాండ్యులతో యుద్ధముచేసి వారలను దఱిమి మరల చోడుని సింహాసనమునఁ గూరుచుండఁబెట్టి చోళస్థాపనాచార్య బిరుదమును వహించెనని తిక్కరాజుం గూర్చి వ్రాసిన పత్రికరణమునఁ దెలిపి యున్నాఁడను. తిక్కరాజు మరణానంతరము పాండ్య రాజులు తమ తొంటిపూనికను విడనాడక కాంచీపురము మొదలుకొని యుత్తరభూమిని జయింపఁగోరి పలుమాఱు దాడి వెడలి వచ్చి నెల్లూరునకు దిగువ నున్న దేశమును గల్లోల పెట్టుచుండిరి. వారిలో జటవర్మ సుందర పాండ్యమహారాజు ప్రముఖుఁడై క్రీ. శ. ౧౨౪౯ వ సంవత్సరమునఁ గాంచీపుర మాక్రమించుకొని యుండఁ గణపతిదేవుఁడసంఖ్యాకము లయిన సైన్యములతో నేతెంచి సుందరపాండ్యమహారాజును కాంచీపురమునుండి పాఱఁద్రోలి యాపురము స్వాధీనపఱచుకొనియెను.

సామంత భోజమంత్రి.

ఇచ్చటనే క్రీ. శ. ౧౨౪౯ వ సంవత్సరమున గణపతిదేవ చక్రవర్తి యాజ్ఞను శిరమున వహించి యాతని సచివాగ్రణియు, సైన్యపాలుఁడును, చక్రధారియునై కాంచీపురపాలకుఁడుగా నియమింపఁబడిన సామంతభోజుఁడు కాంచీపురములోని యేకామ్రేశ్వరునకు

కాలత్తూరనియెడు గ్రామమును దానముచేసి శాసనము వ్రాయించెను. ఈ సామంతభోజునియొక్క శాసనము మఱియొకటి కాళహస్తిలో మణికంఠేశ్వరుని గుడికి నెదుట నున్న ఱాతిపైని గనుపట్టుచున్నది. భోజమంత్రి కాశ్యపసగోత్రజాతుఁడయిన దాచమంత్రికిని నారీరత్నమును సోమనాథునికి (శివునకు) భక్తురాలు నగు వాచాంబకును కుమారుఁడని చెప్పంబడి యుండుటచేత నితఁడు నియోగి బ్రాహ్మణుఁడుగా నూహింప దగియుండెను. ఇతఁడు కాళహస్తీశ్వర నగరమునఁ బ్రతిదినకైంకర్యాదులను జరుపునట్లు చేసె నని గ్రంథలిపిలో వ్రాయఁబడిన యాశాసనము దెలుపుచున్నది.1

## పాండ్యులు మరల నెల్లూరు నాక్రమించుట.

కాకతి గణపతిదేవ చక్రవర్తి దక్షిణ దిగ్విజయ యాత్రను ముగించి స్వస్థలమైన యోరుఁగంటికిఁ జేరిన తరువాత జటవర్మ సుందరపాండ్య మహారాజు మఱుసటి వత్సరమున మరల దాడి వెడలి కాంచీపురమును, విక్రమసింహపురమును (నెల్లూరు) స్వాధీనపఱచుకొనియెను. ఇందులకుఁ గారణము విక్రమసింహ పురాధిపత్యముకై తెలుఁగు చోడరాజులు తమలోఁ దాము పోరాడి యొకపక్షమువారు పాండ్యుల సాహాయ్యమును గోరి యుందురు. క్రీ. శ. ౧౨౭౦ వ సంవత్సరమున జటవర్మ సుందరపాండ్య మహారాజు మనుమ సిద్ధిరాజును నెల్లూరునుండి పాఱఁద్రోలి సిద్ధిరాజునకు శత్రువు లయిన వీరులను పట్టాభిషిక్తులను గావించి విక్రమసింహపురములోని పల్లికొండ పెరుమాళ్ళ దేవునకు సుందరపాండ్య సంది యను భవమును గట్టించుటయే గాక యా దేవుని నిత్యకైంకర్యాదులకు మండనాటిలోని

1. The Indian Antiquary; Ekamranatha inscription of Ganapati. Vol. XXI p. 197., No. 15 Ganapeswaram Inscription of the Time of Ganapati

మావడికుండ గ్రామమునుండి వచ్చెడి సమస్తము లయిన పన్నులను వినియోగించుటకై యా గ్రామమును కళింగరాజు (తెలుఁగురాజు) యొక్క పేరిరణముచేత దానము చేసి శాసనము వ్రాయించెను.1 అయినను గణపతిదేవ చక్రవర్తియొక్క సైన్యాధిపతుల తోడ్పాటుతో విజయగండ గోపాలదేవుఁడు మొదలగు తెలుఁగు చోడరాజులు పాండ్యుని వాని సైన్యములను నెల్లూరిమండలమునుండి పాఱఁద్రోలిరి.

గంగయ సాహిణి బాహత్తరి నియోగాధిపతి.

కాకతి గణపతిదేవ చక్రవర్తి గండికోట, ములికినాడు, రేనాడు, పెనదాడి, పెడకల్లు, సకిలినాడు, ఏరువనాడు, పొత్తపినాడు మొదలగు సీమల నెల్ల జయించి గంగదేవ మహారాజును తనకు సైన్యాధ్యక్షునిఁగ నియమించి యాతఁడు తనకుఁ బ్రతినిధిగ నుండి పై సీమలను బరిపాలించునటు లనుజ్ఞ నొసంగెను. కాఁబట్టి యప్పటినుండియు గంగయ సర్వాధికారియై సైన్యాధ్యక్షుఁడై ప్రతినిధిపరిపాలకుఁడై మిగుల వాసి గాంచెను. గణపతిదేవ చక్రవర్తికి లోఁబడిన సామంతరాజుల నెల్లరను శాసించి యదుపులోనుంచి ప్రఖ్యాతుఁడై నందున గంగయసాహిణికి మాండలిక బ్రహ్మరాక్షసుఁ డనియు, రక్కసగంగనియుఁ బేరులువచ్చెను. ఆకాలమునం దాంధ్రచక్రవర్తియైన గణపతిదేవుని రాష్ట్రంబున డెబ్బదిరెండు వినియోగంబులవారు గలరు. వారి కెల్లరకు నీతం డధిపతి గావున బాహత్తరి నియోగాధిపతి యని బిరుదమును వహించెను. అయ్యలరాజు నారాయణామాత్య విరచితమైన హంసవింశతి యను ప్రబంధమునందు:—

"గురు మహాప్రధాన సామంత సేనాపతి ద్వారపాల కావసరిక ఘటికానిర్ధారక గణక లేఖక పౌరాణిక పురోహిత జ్యోతిషిక

1. Nellore Inscriptions, Part II page 830, No. 16.

కార్యజవిద్వాంసక దేవతార్చక మాలాకారక పరిమళకారక చేష్టాధికార గజాధికారాశ్వాధికార భాండాగారాధికార ధాన్యాధికారాంగరక్షక సూతసూద బేతాళమత తాంబూలిక తాళవృంతక నరవాహన చ్ఛాత్త్రిక దామరిక కళాంచిక శరశారిక కీరమాలక పాదుకాధార నర్తక గాయక వైణిక శాకునికమాగధ వైతాళిక స్తుతిపాఠక పరిహాసకక్షౌరక రజక సౌచిక చర్మకారక ముద్రాధికార పురపాలకగజవైద్యాశ్వవైద్య పశువైద్య భేరీవాదక మురజవాదక కారకకుంభకారక చిత్రకారక వ్యావహారిక మృగయాది పక్షివాహక ఫణిహారి కోగ్రాణాధికార వైశ్యజనంబు" లాదిగా డెబ్బదిరెండు వినియోగంబుల వారిని బేర్కొని యున్నాఁడు.

## గంగయ సాహిణి దానధర్మములు.

గంగయ సాహిణి చేసిన దానధర్మములనుగూర్చి శాసనములనేకములు కడప కందవోలు మండలములలో ననేకములు గానవచ్చును. ఆ కాలమునాటి ప్రభువులవలెనె దేవతా బ్రాహ్మణభక్తి గలవాఁడగుటచేత నితఁడనేక శివాలయములకును బ్రాహ్మణులకును దానధర్మములను గావించి ప్రఖ్యాతుఁడయ్యెను. ఇతఁడు శా. శ. ౧౧౭౭ (క్రీ. శ. ౧౨౫౫) రాక్షసనామ సంవత్సర శ్రావణ శుద్ధ ౧౫ మంగళవారమునాఁడు చంద్రగ్రహణ పుణ్యకాలమున త్రిపురాంతకములోని త్రిపురాంతకేశ్వరునకు మోడివాడి గాడిలోని పూలచెరువు గ్రామమును ధారాపూర్వముగ దత్తముగావించెను. మఱియును మైదకూరు పట్టణమున శకవర్షము ౧౧౮౧ సిద్ధార్థి సంవత్సర పుష్య ౧౧ మకర సంక్రాంతి పుణ్యకాలమున బ్రాహ్మణులకు ఊవృత్తులుగల శ్రోత్రియాగ్రహారమును జేసి ధారాపూర్వకముగ దత్తము గావించెను. ఇంతియగాక త్రిపురాంతములోని శ్రీమూల

స్థానదేవునికి బోయపల్లి రెడ్లపల్లి గ్రామములలో భూదానములను చేసెను.

## జన్నిగదేవ సిద్ధయదేవుల యుద్ధము.

గంగయసాహిణి ములికినాటి దేశమును బరిపాలనము చేయుచున్నకాలమునఁ గాంచీపురమునుండి భీమయదేవ మహారాజు కుమారుఁడు సిద్ధయదేవ మహారాజు ములికినాటిని జయించి స్వాధీన పఱుచుకొన వలయునని దండెత్తివచ్చి పట్టపురావి గ్రామమునకుఁ బూర్వభాగమునందు రెండుపర్వుల దూరమునఁ బినాకినీనదికి నుత్తర భాగముననున్న సోమశిల పట్టణముకడ దండుదిగి యుండఁగా గంగయ సాహిణితోఁ బుట్టువుకునూఁడైన మురారి నారాయణ చలమర్తిగండ గండపెండేర జన్నిగదేవమహారాజు సైన్యమును గూర్చుకొనివచ్చి గంగయసాహిణి పక్షమునఁ సిద్ధయదేవుని సేనల నెదుర్కొని ఘోరయుద్ధము చేసెను. ఒకటి రెండు సారులు సిద్ధయ దేవ మహారాజునికే జయము కలుగుటయు. సిద్ధయదేవుఁడు వీరమరణము నొందుటయుఁ దటస్థించెను. గణపతిదేవ చక్రవర్తికిని గంగయసాహిణికిని బిమ్మట జన్నిగదేవ మహారాజు కాకతీయ రుద్రదేవునికి సైన్యాధ్యక్షుఁ డయ్యెను.

## గణపతిదేవ చక్రవర్తి జైనబౌద్ధులను జంపించుట.

పండ్రెండవ శతాబ్దమున వీరశైవమతము త్రిలింగదేశమునఁ బ్రవర్ధమానమై వ్యాపించుచుండినను జైను లనేకులు సురక్షితులై యుండుచు వచ్చిరి కాని గణపతిదేవ చక్రవర్తి కాలమున నతఁడు మొదట శైవమతాభిమానియు నద్వైతవాదియునై యుండి జైనుల యెడఁ బ్రబలద్వేషమును జూపుచుండె నని యనేక గాథలవలనఁ దెలియుచున్నది. ఏకశిలానగరమున జైను లనేకులు నివసించుచుం

డఁగా సహింపఁ జాలక శైవులును బ్రాహ్మణులును చక్రవర్తిని ప్రేరేపింప నతండు జైనుల ననేకులఁ జంపించెనట. ముప్పదియాఱు జైనగ్రామములను నాశనము గావించెను. ఈ ఘోరకృత్యముల నన్నిటిని తిక్కనసోమయాజి ప్రేరేపణచేతనే జరిగించె నని సోమదేవరాజీయాది గ్రంథములం జెప్పఁబడినది గాని యది యంతగా విశ్వసింపఁ దగినదిగాఁ గనుపట్టదు. ఎందుకనఁ దిక్కన సోమయాజి గణపతిచక్రవర్తిని సందర్శించె నని చెప్పఁబడు విషయము పూర్వగాథలలోఁ గానంబడుచున్నది గాని శాసనాది దృష్టాంతములవలనఁ దెలియంబడ దని తిక్కన సోమయాజి మనుమసిద్ధి రాజులంగూర్చిన ప్రకరణమునం జర్చించియున్నాఁడను. ఒకవేళ నీ గాథయే నిజమైన దైనయెడల నియ్యది క్రీ. శ. ౧౨౫౮ వ సంవత్సరమునఁ జరిగి, యుండవలయును. గణపతి చక్రవర్తి యద్వైతవాది యని గణపతి చక్రవర్తికూతురైన గణపాంబయొక్క యెనమదల శాసనములోఁ జెప్పఁబడినది. గణపతిదేవ చక్రవర్తి కాలముననే జైను లయిన కంసాలులనుండియు, సెట్టిపెద్దలయిన తెలగాలనుండియు గ్రామకరణోద్యోగములు దొలఁగింపఁబడి నియోగి బ్రాహ్మణుల కీయఁబడినవి. అంతకు బూర్వము వీరలు బ్రాహ్మణులకుఁ బ్రతికూలముగ నుండుట చేత నిప్పాటు సంభవించినది. దీని నంతయును విచారించి చూడఁగా గణపతిదేవ చక్రవర్తి యితర విషయములం దెట్టి సుగుణాఢ్యుఁడైనను ఈ మతవిషయమున సహనములేనివాఁ డని స్పష్టమగుచున్నది. కాఁబట్టి బౌద్ధదేవాలయంబులు జైనదేవాలయంబులు గూలంద్రోయించె ననియు, జైనగ్రామముల నశింపఁజేసె ననియు, తిరుగఁబడిన జైను లనేకుల సంహరించి యనేకులను దేశమునుండి వెడలఁగొట్టించె ననియుఁ జెప్పెడి గాథలలోఁ గొంతవఱకు సత్యము గల దని విశ్వసింపవచ్చునేమో!

## చెన్నాప్రెగడ గణపామాత్యుఁడు.

ఇతఁడు గణపతిదేవుని బ్రాహ్మణ మంత్రులలో నొక్కఁడై సర్వాధికారియై ప్రసిద్ధిగాంచినవాఁడుగా నుండెను. ఈ మంత్రిశిఖామణి శా. శ. ౧౧౬౭ విశ్వావసునామ సంవత్సర పుష్యశుద్ధషష్ఠి కుజ వాసరంబున మకరసంక్రాంతి నిమిత్తమునఁ గాకతి గణపతిదేవ మహారాజునకు ధర్మముగా త్రిపురాంతక దేవున కంగరంగభోగములకై నడిపింపఁబడుచున్న త్రిపురాంతక గ్రామములో సుంకము లేకుండ మున్నూరు నివేశనములను పెఱుకవాండ్రకు దానము చేసె నని మాత్రము త్రిపురాంతక శాసనములలో నొకదానింబట్టి తెలియుచున్నది.

## మేచయ నాయకుఁడు.

ఈ మేచయనాయకుఁడు గణపతిదేవ చక్రవర్తి కాలమున నేకశిలా నగరపాలకుండును అతని కనుంగుఁ దలవరియునై యొప్పుచుండె నని మారనకవికృతమైన మార్కండేయ పురాణముయొక్క యవతారికలో నీ క్రింది సీసపద్యములోఁ జెప్పబడియున్నది.

“ సీ. ఏరాజు రాజుల నెల్ల జయించి ము
న్వెట్టికఁ బట్టెఁ దోర్విక్రమమున
నేరాజు సేతుసీహాద్రి మధ్యోర్వి
నేకపట్టణలీల నేలె బ్రాలె
నేరాజు నిజకీర్తి నెనిమిది దిశల ను
ల్లాసంబు నొంద నలంకరించె
నేరాజు తన తేజమీజగంబునకు న
ఖండైకనిభవంబుగా నొనర్చె
నట్టి కాకతి గణపతిపృథ్వినాథు
ననుఁగుఁ దలవరి ధర్మాత్ముఁడధికపుణ్యుఁ

డయిన మేచయ నాయకు ప్రియసనూజ
నతులశుభలక్షణ స్ఫురితావలాంగి. ''

ఈ మేచయ నాయకుని కొమార్తెయైన మల్లమాంబికను మల్లచమూవల్లభుని కుమారుఁడగు నాగయరథినీశ్వరుండు వివాహముఁ జేసికొనియెను. రుద్రమదేవిం గూర్చి వ్రాయుప్రకరణమున నీ నాగయ చరిత్రము వివరింతును.

అద్దంకిప్రభువు మాధవ నాయకుఁడు.

చోడ చక్రవర్తుల పరిపాలనమునం దెప్పుడో మహారాష్ట్ర సేవణ దేశమునుండి వచ్చిన నాయకులు కొంద ఱద్దంకి సీమకు నధికారులుగ నేర్పడిరి. సేవణరాజులు యాదవు లగుటం జేసి వీరిని గూడ యాదవులనుగానే భావింపవలసి యున్నది. ఈ ప్రభువుల శాసనములు క్రీ. శ. ౧౨౧౦ వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౧౨౭౫ వ సంవత్సరవఱకు నద్దంకి సీమలోఁ గానంబడుచున్నవి. గణపతిదేవ చక్రవర్తికాలమున నీసీమ కధిపతియై పరిపాలనము సేయుచున్నవాఁడు శ్రీ మన్మహా మండలేశ్వర మాధవమహారాజుగా నుండెను. అతివిషమహామూరూఢ ప్రౌఢరేఖా రేవంతుఁడనియు, పరబలకృతాంతుఁడనియు, శరణాగత వజ్రపంజరుఁడనియు, మండలీకరవంవోలి యనియు, జీవరక్ష చక్రనారాయణుం డనియు బిరుదములను బొందినవాఁడుగా నుండెను. ఇతఁడు శా. శ. ౧౧౩౦ విభవ సంవత్సర భాద్రపద శుక్లపక్ష దశమీ సోమవారమునాఁడు సంక్రాంతి సమయమున శ్రీ మాండుకేశ్వర మహాదేవునకుఁ గుండ్లకమ్మకుఁ బడమట నున్న కొటికలపూడి గ్రామమున నలువది పుట్లపొలము దానము చేసెనని వంగవ్రోలు తాలూకాలోని మణికేశ్వర గ్రామ

---

I. Nellore Inscriptions. Vol III. Ongole No. 76.

ములోనున్న పాండుకేశ్వర దేవాలయమున కెదుట నున్న జాతిపై వ్రాయఁబడిన శాసనమును బట్టి దెలియుచున్నది. కనుక నితఁడు క్రీ. శ. ౧౨౧౮-౯ వ సంవత్సర ప్రాంతమున నద్దంకిసీమను బరిపాలనము సేయుచుండె ననుట యథార్థమని స్పష్టపడుచున్నది.

ఇరువది ముప్పది సంవత్సరములకుఁ పిమ్మట వ్రాయఁబడిన శాసనములలో నీతఁడు కాకతి గణపతిదేవ చక్రవర్తికి సామంతుఁడై యున్నటుల వ్రాయఁబడియుండుటం జేసి యీ నడుమకాలముల నెప్పుడో కాకతి గణపతిచే జయింపఁబడి యాతనికి సామంతుఁడై యుండెనని నిశ్చయింపక తప్పదు. కాఁబట్టి గణపతిదేవుఁడు వెలనాటిని జయించిన పిమ్మట క్రీ. శ. ౧౨౨౧ వ సంవత్సర ప్రాంతమున నే యీ మాధవనాయకుని జయించి యుండును. ఈతనిది సాలంకాయన గోత్రము. ఇతఁడు క్రీ. శ. ౧౨౩౯-౪౦ వ సంవత్సరము విషువ సంక్రాంతినాడు తన తల్లిదండ్రులకును గణపతిదేవ మహారాజునకును ధర్మార్థము నాగులుప్పలపాడు గ్రామములో మల్లికేశ్వరాలయము గట్టించి యా శివాలయమునకును, పూజారులకును, వైదిక బ్రాహ్మణులకును, నియోగి బ్రాహ్మణులకును, దేవస్థానము నౌకరులయిన మంగలవాండ్రకును, భోగమువాండ్రకును వృత్తిక్షేత్రములను దానము చేసి ప్రఖ్యాతుఁ డయ్యెను. ఇతనిభార్య చూడబావి. ఈమెయందు నీతనికి సింగళదేవుఁడు, సారంగపాణి దేవుఁడు, గోపాల దేవుఁడు నను మూవురు పుత్త్రులు జనించిరి.

### సింగళదేవ మహారాజు.

మాధవదేవరాజునకుఁ పిమ్మట సింగళదేవ మహారాజు ప్రభు వయ్యెను. తండ్రివలెనే యీతఁడును చక్రినారాయణుఁ డాదిగాఁ గల బిరుదముల నన్నిటిని వహించెను. ఇతని శాసనములు క్రీ. శ. ౧౨౪౭ వ సంవత్సరము మొదలుకొని క్రీ. శ. ౧౨౬౪ వ సంవత్స

రమువఱకుఁ గానిపించుచున్నవి. ఈయనకు సోమరాజు ప్రధానిగ నుండెను. ఒంగోలులోనున్న శ్రీమల్లినాథ దేవుని నిత్య నైవేద్యము నకై భూదానముచేసి వ్రాయించిన యెండ్లూరు శాసనములో "సమస్తరాజ్య భరణ నిరూపిత మహామాత్యపద విరాజమాన మానోన్నత ప్రభుమంత్రోత్సాహ శక్తిత్రయగుణసంపన్నుఁడును, బాహాసప్తారి నియోగాధిపతియును, సకల లక్ష్మీపతియును, సమస్తసేనాధిపతియును, పతికార్య ధురంధరుఁడు" నని యీతనింగూర్చి వ్రాయఁబడినది. సోమరాజునకు వెనుక మాయదేవప్రెగ్గడ మహాప్రధాని యయ్యెను.

శ్రీసారంగపాణిదేవ మహారాజు.

ఇతఁడు సింగళదేవునకుఁ జ్యేష్ఠసోదరుఁడును మాధవదేవరాజునకు ద్వితీయపుత్రుఁడునై యుండి సింగళదేవునకుఁ బిమ్మట ప్రభుత్వపదవిని వహించెను. ఇతఁడు గణపతిదేవచక్రవర్తికి సామంతుఁడై అద్దంకిసీమను బరిపాలనము సేయుచు విక్రమసింహ పురాధిపతియైన మనుమసిద్ధిరాజుతోడ యుద్ధములు సేయుచుండెను. ఒకయుద్ధములో నితని మనుమసిద్ధిరాజు జయించినట్లుగాఁ దిక్కన కవిసార్వభౌముఁడు తన నిర్వచనోత్తర రామాయణ పీఠికలో వ్రాసియున్న వివరమును నాల్గవ సంపుటమునఁ దెలిపియున్నాను. ఇతఁడును తనతండ్రియైన మాధవదేవరాజు వహించిన 'అతివిషమహయారూఢ ప్రౌఢరేఖారేవంతుఁడు, పరబల కృతాంతుఁడు, శరణాగత వజ్రపంజరుఁడు, మండలీకర వందోళియు, జీవరక్ష చక్రనారాయణుఁడు నను బిరుదములఁ నన్నిటిని వహించెను. ఇతనికి గోవిందనాయకుఁడు మంత్రిగ నుండెను. ఈసారంగధరుఁడు బ్రాహ్మణపక్షపాతియు, బ్రాహ్మణ భక్తుఁడునై యుండెను. ఇతఁడు సారంగపురమను నగ్రహారమును గల్పించి ౪౭ భాగములుగ విభాగించి వివిధగోత్రు లయిన బ్రాహ్మణులకు భక్తివిశ్వాసపూర్వకముగా ధారాదత్తముచేసి తామ్రశాసనము వ్రాయించియిప్పించెను.

# చాగివారి వంశ చరిత్రము

చాగివారు కాకతీయ చక్రవర్తుల కాలమున గుడిమెట్ట రాజధానిగ నందిగామసీమను బరిపాలనము చేసిన సామంతమండలేశ్వరులుగ నుండిరి. చాగివారిలో వేఱొక కుటుంబమువారు పల్నాడు పరిపాలించుచుండిరని పల్నాటి వీరచరిత్రమునఁ జదివి యున్నాము. పల్నాటిచాగివారు హైహయవంశజుల మయిన క్షత్రియుల మని చెప్పుకొని యుండుట మన మెఱుంగుదుము. గుడిమెట్ట చాగివారు దుర్జయవంశజుల మనియు, మనుకుల సంభవుల మనియుఁ, జెప్పుకొని యున్నారు. దుర్జయవంశజు లయిన రాజు లనేకులు విష్ణుపాదోద్భవులమైన చతుర్థాన్వయులమని బాహాటముగాఁ జెప్పికొని యున్నారు అదియును గాక వీరలు కాకతీయ రాజబంధువులుగఁ గనుపట్టుచున్నారు. వీరి శాసనములం దెచ్చటను కాకతీయులకు సామంతుల మని చెప్పికొని యుండలేదు. గుడిమెట్ట చాగివారిలోఁ గొందఱు మనుకుల సంభూతుల మని చెప్పుకొని యుండుటచేత వారిసంతతివారు తమది సూర్యవంశమనియు, వసిష్ఠ గోత్రమనియుఁ జెప్పుకొనసారంభించిరి. గణపతిదేవ రాయలకాలమునం దుండిన చాగిపోతరాజు గోదావరి మండలములోని పెద్దాపుర సంస్థానిక లయిన వత్సవాయవారికి మూలపురుషుఁ డని యేనుఁగు లక్ష్మణకవి ప్రణీతమైన రామవిలాస మను ప్రబంధమున వర్ణింపఁబడి యున్నది.

“ గీ. సహ్యజాతీరమునకు భూషణ మనంగ
సిరుల కిరవగు గుడిమెట్టపురము దనకు
రాజధానిగ సత్కీర్తిభోజరాజు
చాగిపోతక్ష్మాభర్త జగతి యేలె. ”

ఈ సాగివంశపు రాజులయొక్క శాసనములు కృష్ణామండలములో నందిగామ సీమలో నున్న గుడిమెట్ట, ముక్త్యాలఁ అను మంచి పల్లె, పెనుగంచిప్రోలు, నవాబుపేట, మొదలగు ప్రదేశములందును బెజవాడలోను గానంబడుచున్నవి. నందిగామ తాలూకాలోని ముక్త్యాలగ్రామములో నున్న చెన్నకేశవస్వామి దేవాలయముయొక్క తూర్పుప్రాకారమునకు సామీప్యమునఁ బాఁతియున్న నాగులబండ అను స్తంభముమీఁద వ్రాయఁబడిన శాసనములో విష్ణువునాభినుండి బ్రహ్మజనించెననియు, వానినుండి దుర్జయుఁడు, పుట్టెననియు అతని వంశమున ముప్పరాజు జనించెననియు, అతనివంశమున గోంకదోరప రాజును, అతనికి పోతరాజును, ఆ పోతరాజునకు రాజాంబికయందు త్యాగిరాజు (చాగిరాజును), లేక, దోరపరాజును, అతనికి చాగి పోతరాజును జనించి రని చెప్పఁబడినది. గుడిమెట్టలోని యొక శాసనములో చాగిదోరప రాజునకు చిమ్మాంబికయందు పోతరాజు జనించెననియు, అతనికి రాజాంబిక యను పతివ్రతయైన భార్యకల దనియు వ్రాయఁబడియున్నది. ఏనుఁగు లక్ష్మణకవి ప్రణీతమైన రామ విలాసములో సూర్యాన్వయమున సాగిపోతరాజు జనించెననియు, అతనికి నరసింహరాజును, అతనికి పోతరాజును, మాచరాజును, వారిలో మాచనృపతికి ఎఱపోతరాజును, అతనికి తెలుఁగురాజు, రామరాజు ననువారును బుట్టిరనియుఁ జెప్పఁబడి యున్నది.* పైని జెప్పిన వారిలో నరసింహభూపతి కుమారుఁడైన పోతరాజును లక్ష్మణ కవి తన గ్రంథమునం దీవిధముగా నభివర్ణించియున్నాఁడు.

" మ. స్థిరభక్తిన్ గుడిమెట్టలోపలఁ బ్రతిష్ఠించె న్కృపాసింధుబం
ధురసౌధంబున విశ్వనాథుఁ బరమాత్మున్ రాజనారాయణున్

---

* ఇది తప్పని గ్రహింపవలెను. నరసింహవర్ధక యనునది పోతరాజునకు విశేషణము.

సురవంద్యున్ బెజవాడయందు నిలిపెన్ సుశ్లోక ధర్మైకత
త్పరశీలుం డగుమన్నపోతనృపుఁడే తన్మాత్రుఁడే యెన్నఁగన్. ''

గుడిమెట్ట శాసనములో దోరపరాజునకు చిమ్మాంబికయందు జనించిన పోతరాజు పరిపాలనమును వర్ణించుచో,

'' శ్రీకృష్ణవేణ్యాస్తటభూమిభాగే
శ్రీపోతభూపో గుడిమెట్టనామ్ని
విశ్వేశ్వరాఖ్యం శివ మాదిదేవం
సంస్థాపయామాస పురే స్వకీయే. ''

ఇంతియెగాక బెజవాడ కనకదుర్గాంబయొక్క యాలయము లో శ్రీ నరసింహవర్ధన చాగిపోతరాజు పేరిటి శాసన మొకటి గలదు. ఈ పోతరాజు త్రిపురాంతక కాశ్మీరమల్లేశ్వర విశ్వనాథ చోడనారాయణ స్థానంబులఁ గనక కలశంబులను బెట్టించి సింహగిరియందు నరసింహునకు సాగిపోత సముద్రం బను చెఱువు గట్టించి శ్రీ పర్వతంబున (శ్రీశైలమున) మల్లికార్జున దేవునిముందట నందికేశ్వరునిం బ్రతిష్ఠించి దేవభోగంబులకై కంభముపాడు, ముచ్చింతలు, బూదవాడ మొదలగు గ్రామముల నిచ్చి, బ్రాహ్మణోప భోగంబులుగా ననేకాగ్రహారంబు లొసంగె నని బెజవాడ శాసన మునఁ జెప్పఁబడి యున్నది. ఈ శాసనము కాకతిగణపతిదేవ చక్రవర్తి సింహాసన మధిష్ఠించిన క్రీ. శ. ౧౧౯౯ వ సంవత్సరమున వ్రాయఁబడినది. ఈ కుటుంబములోనివాఁ డగు చాగిమనుమగణపతిదేవుని శాసనములు గూడ పెక్కులు నందిగామసీమలోఁ గాన వచ్చుచున్నవి. అతఁడును, చాగిరాజును కాకతిగణపతిదేవునకు సమకాలికులు. వీరు నతవాటిసీమలో నధికారములను వహించియుం డిరి.

ఈ సాగివంశపు రాజుల చరిత్రమును సంపూర్ణముగాఁ దెలిసి కొనుటకు మఱికొంత కాలము పట్టును. ప్రస్తుతము దొరకిన సాధనము లసమగ్రములుగ నున్నవి.

సాగివంశీయుల గూర్చి మఱికొన్ని విశేషాంశములు.

సాగివంశీయులలోఁ జారిత్రిక పురుషుఁడుగ మొదట నెన్నఁ దగినవాఁడు ముప్పభూపతి. ఇతఁడు రణవీరుఁ డగుటవలన రాజేంద్ర చోడ చక్రవర్తి యాదరమునకుఁ బాత్రుఁడై రాజచిహ్నములగు భాలే, భేరి, శంఖము, ఆనకము, కాహళములను పంచమహాశబ్దములను అరయతాపట్టకమును బొందెను. మరియు నితఁడు రాజలాంఛనములగు స్వర్ణమయమగు పల్లకియు, నక్షత్రయుతాంబరమునుబోలిన యుల్లెడయును, పూర్ణేందు శుభ్రమగు ఛత్రమును, చంద్రునిహసించు హేమదండముగల చామరమును గలిగియుండెను 1 కాని కొన్ని శాసనములలో ఈ గౌరవచిహ్నములను బొందినది ముప్పభూపతిగాక వాని కుమారుఁడగు దొరభూపతియని తెలుపఁబడుచున్నది.2 దొరభూపతి తరువాత "త్యాగ, సత్య, శౌర్యాది గుణమణివిభూషితుఁడగు పోతరాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడె గుడిమెట్టరాజధానీ నగరముగ మొదట నతవాటిసీమను బరిపాలించినవాఁడు. మల్లనామాత్యుని తనయుఁడగు కవలియ (కావలి)సింగనామాత్యుఁడు సచివోత్తముఁడుగ నుండెను.3 శ్రీశైలసందీపితయుగ్మముగల కల్లయనాయకుఁ డీతనికి సోదరుఁడు. ఇతనికి పోలమదేవి యను నొక

(1) 313 of 1924

(2) 271 1897 of 253 of 1893

(3) 253 of 127 వీరికుటుంబమువారే సాగివారికి వంశపరంపరగా వచ్చుచున్న మంత్రులు.

కొమార్తెయుఁ గలదు. ఆపెభర్త నామము దుర్గరాజు. పోతరాజు గావించిన ప్రతిష్ఠలను పై పేరాలో వివరించియున్నాను. గుడిమెట్ట శాసనము ప్రకారము విశ్వేశ్వరాలయము గట్టించినవాఁడు మొదటి పోతరాజు. రామవిలాస ప్రబంధము ప్రకారము నరసింహుని కుమారుఁడైన మనుమపోతరాజు. కాని రామవిలాసము చెప్పిన విషయము సత్యముకాదు. రామవిలాసములోఁ జెప్పినట్లు నరసింహుని కుమారుఁడు పోతరాజని తలంచుటకు నెట్టిశాసనాధారమును గానరాదు. నరసింహవర్ధనుఁ డనునది రెండవపోతరాజునకు బిరుదువాచకముగాని యొకపేరుగాదు. ఈ రెండవపోతరాజు "శ్రీయోగానంద నరసింహదేవదివ్య శ్రీపాద పద్మారాధకుఁడని, శ్రీనరసింహవర్ధనస్వాగిపోత ధరణీపతి" యని బెజవాడ శాసనములో పేర్కొనఁబడినాఁడు.4 శ్రీ నరసింహదేవ దివ్య శ్రీపాద పద్మారాధకుఁ డగుటవలన నితనికి నరసింహవర్ధనుఁ డని బిరుదము లభించెను.5

కావున నరసింహవర్ధన చాగిపోతరాజన నరసింహుని కుమారుఁడగు చాగిపోతరాజని యనుకొనుట పొరపాటు. రామవిలాసము సాగివారి పరిపాలనమునకుఁ దరువాత నెంతోకాలమునకుఁ బిమ్మట వ్రాయఁబడియుండుటచేత మొదటిపోతరాజు కృత్యములను రెండవ పోతరాజున కంటఁగట్టబడినవిగా భావింపవలసి యున్నది.

---

(4) No 335 of 1892

(5) జుజ్జూరు శాసనము (326 of 1924) యిటులనే తెల్పుచున్నది. మఱియు నితఁడు నరసింహదేవ దివ్య శ్రీపాదపద్మారాధకుఁడనుట సింహాచలమున నరసింహస్వామికి 'సాగిపోతసముద్రి' మనునొక చెరువుమ త్రవ్వించెనను విషయము (301 of 1924) ధ్రువపరచుచున్నది. అంతియెగాక యీనరసింహవర్ధనయను పదము రెండవపోతరాజునకు పిమ్మట రాజ్యమునకు వచ్చిన గణపతియు, తననామమునకు జోడించుకొనుటవలన (no 234 of 1905) నదిబిరుదు వాచకమని చెప్పకయే చెప్పుచున్నది.

పోతరాజు చావునకొక చిత్రకథ జనశ్రుతి రూపకముగ నున్నది.6 వేములవాడ భీమకవి యొకప్పుడు పోతరాజు ప్రధాన నగరమగు గుడిమెట్టకు వెళ్ళెనట. సాగిపోతరాజాతని గుఱ్ఱమును తన సాహిణమున గట్టిపెట్టించి యాతడు వేడినను గుఱ్ఱమును వదలలేదట. అందుపై భీమకవి కోపించి యీ విధమున శపించెనని యొకపద్యము ప్రచారమున నున్నది.

హయమదిసీత పోతవసుధాధిపు డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ సహ్యజవారధి మారుడంజనా
ప్రియతనయుండు లచ్చనవిభీషణుఁ డాగుడమెట్ట లంకనా
జయమును బోతరక్కసుని చావును నేడవనాఁడు చూడుఁడీ

కవిశాపదగ్ధుడై పోతరాజు మరణించెనట !

ఈ కట్టుకథ నమ్ముటకు వీలులేకుండ నున్నది. ఈపద్యము రెల్లూరి తిరుమలయ్యదని అప్పకవి చెప్పుచున్నాడు. ఈపోతరాజు సాగిపోతరాజు కాడనియు, లేటవరపు పోతరాజనియు, యతని గూర్చి తురగారామకవి యీ పద్యము జెప్పెననియు మరియొక వాదముగలదు.7 చాగిపోతరాజును, భీమకవియు సమకాలికులని యన్నను, యీ భిన్నవాదముల మధ్య నేది నిజమో నిశ్చయించుట కష్టముగానున్నది.

పోతరాజు పల్నాటి యుద్ధమునకు వచ్చినట్లు శ్రీనాథకవి విరచితమగు పల్నాటి వీరచరిత్రమున 8 నిట్లు తెలుపబడినది.

---

(6) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'చాటుపద్యమణిమంజరి' నుండి

(7) కీ. శే. కం. వీ. గారి ఆంధ్రకవుల చరిత్రము, కి. శే.గు. శ్రీరామమూర్తి గారి కవిజీవితములు జూడనగు.

(8) మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండారములోని యముద్రిత ప్రతి

సాగిపోతరాజు సత్యాఖ్య ప్రెగడ
గుండమదేవుడు గొబ్బూరిరాజు
మొదలయిన వారలు ముఖ్యులౌ బంట్లు
యేనూరుతో గూడి నెనుబదినూర
నెనిమిది వేలతో నేతెంచిరపుడు

సుప్రసిద్ధ చరిత్రకారులెల్లరు పల్నాటి యుద్ధము 1098–1104 శా. శ. లో జరిగి యుండునని చెప్పుచున్నారు, పోతరాజు కుమారుఁడగు రెండవ దోరభూపుని శాసనములు శా. శ. లో జరిగి యుండునని చెప్పుచున్నారు. పోతరాజు కుమారుడగు రెండవదోర భూపుని శాసనములు శా. శ. 1117 వరకును అతని కుమారుడగు రెండవపోతరాజు శాసనములు శా. శ. 1119 నుండియు కననగు చున్నవి. రెండవదోరభూపతి శా. శ. 1117, 1119 ల నడుమ కాల ధర్మము నొందియుండును. అందువలన నతడు రమారమి శా. శ. 1119 వరకు రాజ్యమేలెనని నిశ్చయింప వచ్చును. దోరభూపతి బెజ వాడ నగరమున పదునయిదు వత్సరములు రాజ్యమేలెనని తెలియు టచే9 శా. శ. 1103 లేక 1104 లో రెండవభూపుని పరిపాలన ప్రారంభమయి యుండును. దీని ననుసరించి పల్నాటి యుద్ధానంతరము దోరభూపుని పరిపాలనము ప్రారంభింప బడినదని తేలుచున్నది. పోత భూపుడు పల్నాటి యుద్ధమునకు వెళ్ళుటయు, యుద్ధానంతర మతని కుమారుడగు రెండవదోర భూపుని రాజ్యపాలనము ప్రారంభింపబడు టయుఁ జూడపోతభూపతి యొకవేళ పల్నాటియుద్ధమున మరణించె నేమోయని యూహించుటకును అవకాశము కలదు.

(శా. శ. 1104 - 1119)

పోతరాజునకు పిమ్మట చాగిరాజను నామాంతరము గల10 రెండవ దోరభూపతి రాజ్యమునకు వచ్చెను. ఇతడు తన ప్రధానునగ

(9) 335 of 1892 'చాగిరాజః పంచదశవ షాణి విజయవాటీకాంథ్నా మార్గేణశశాస......'—

10. No. 300 of 1924.

రమును గుడిమెట్టనుండి బెజవాడకు మార్చి పదునయిదు వత్సరములు రాజ్యమేలెను. రాజ్యమునకు రాకపూర్వమే తనతండ్రిచే గుడిమెట్టలో ప్రతిష్ఠింపబడిన విశ్వేశ్వరునకు, దాసీజనమునకు, తదితరస్వామి సేవకులకు మాన్యము లొసగెను.11 ఇతనికి పోతరాజను తనయుడే గాక గణపతి భీమరాజు అను కుమారులును గలరు.

దోరభూపతికి పిమ్మట అతని కుమారుడు రెండవ పోతరాజు రాజ్యమునకు వచ్చి బెజవాడ ప్రధాన నగరముగ12 నాతవాటిసీమను పరిపాలించెను. ఇతని శాసనములు శా. శ. 1119 మొదలు శా. శ. 1152 వరకు కనబడుచున్నవి. ఇతడు పెక్కు ధర్మకార్యము లొనర్చెను. ముక్తీశ్వర మహాదేవరకు గుడికట్టించెను. త్రిపురాంతక కాశ్మీర మల్లేశ్వర విశ్వనాధ చోడనారాయణ దేవాలయములకు గనక కలశముల బెట్టించెను. సింహాచల శ్రీనరసింహునకు చాగిపోత సముద్రంబను చెరువు త్రవ్వించి నరసింహవర్ధన త్యాగిపోతరాజను కీర్తి వహించెను. శ్రీశైలమున మల్లికార్జున దేవరకు నందికేశ్వరుని బ్రతిష్ఠించి దేవభోగంబులకు కంభముపాడు, ముచ్చింతల, బూద పాడు మొదలగు గ్రామముల నొసగెను.13 ఇంతియేగాక ముక్తీశ్వరునకు హవిర్బల్యర్చనార్థము "ముక్తి" యను గ్రామమును, యిరువదియయిదు గోవులను, రత్నమయ కిరీటమును సమర్పించెను.14 బెజవాడలోని శ్రీ మల్లేశ్వరస్వామికి హవిర్బల్యర్చనార్థము నొంచిడ్ల గ్రామమును జక్కమపూడిలోని రెండు భాగముల నొసంగెను. రాజనారాయణదేవరకు జక్కమపూడిలో మిగిలిన మరియొక భాగమును గోగ్రాసార్థము గోరాలంకయును నొసంగెను.15 తన సోదరుడగు గణపయతో కలిసి, కురుకూరిలో నున్న సోమనాథస్వామికిని, స్వయంభూదేవరకును మాన్యము లొసగెను16 అను మంచిగ్రామ

12 No 296 of 1892 13 No 301 of 1924 14 No 300 of 1924
15 No 335 of 1892 16 No 273 & 275 of 1924

మున శివాలయము నిర్మించి ఆ మహాదేవునకు భూమి లొసంగెను.17 తన పేర పోతాపుర మను అగ్రహారమును పెంపొందించి హింతాలతా నారికేళవృక్షములతో విలసిల్లునట్లు చేసెను.18

ఈ దేవతారాధనలతో ప్రొద్దుపుచ్చక నాతవాటి మహీతలము ధనధాన్యములతో తులతూగుటకు పాలేటినుండి కావేరినిబోలు నొక పెద్దకాలువను త్రవ్వించెను.19

రెండవ పోతరాజు ననంతరము రాజ్యమునకు వచ్చినవాడు. అతని సోదరుడు ముప్పాంబికవలన దోరభూపతికి కలిగినవాడు గణపయ. ఈతని శాసనములు క్రీ. శ. 1172 వరకు కనబడుచున్నవి. ఇతడు కృష్ణాతీరముననున్న దాములూరు శ్రీ అమరేశ్వరస్వామికి సమర్పించెను.20 తల్లియగు ముప్పాంబతో త్రిపురాంతకమునకుజని యట గోదానము సల్పెను.21 ఇంతకన్న గణపయరాజు గురించి విశేషములు తెలియవు. ఇతనికి దిన్నాంబికవలన మనుమచాగి గణపయ యను నొక కుమారుడు కలిగెను.22

రెండవ చాగిరాజునకు మనుమ డగుటవలన ఇతనికి మనుమ చాగియని నామకరణము చేయబడెను. మనుమచాగి గణపయ యనియు నామాంతరముగలదు. ఇతడు వేదాద్రిలోని ప్రతాప నృసింహస్వామికి వేముపల్లిగ్రామము సమర్పించెను.23 శ్రీ వత్స గోత్రజుడగు చేవలింద్రయజ్వనుని మనుమడును అన్ని మంచికుమార స్వామి యజ్వకుమారుడును నగు సోమయాజి భాస్కరుడు రాజ్యాభి వృద్ధికై చాగిమన్మ గణపేశ్వరుడను పేర నొక శివాలయము నిర్మింప నీప్రభువు కొంతభూమి యాదేవునకు మాన్యమొసగెను.24 ఇంతకన్న విశేషాంశములు చాగివారినిగూర్చి తెలియవు. ఇతని కుమారుడగు మహామండలేశ్వర చాగిపోతరాజు (III)శాసనమొకటి బెజవాడలో 25కనబడుచున్నది కాని యాతని పరిపాలనగూర్చి మరెట్టియంశము లభింపకున్నది.

---

17 284 of 1924 18 bid 19 284 of 1924 20 No 255 of 1897 21 234 & 235 of 1905 22 No. 283 of 1924 23 309 of 1924 24 283 of 1924 25 787 S. I. I. IV.

ఈ కుటుంబముతో సంబంధముగల చాగివారి శాసనములు మరికొన్ని గలవు. చాగిభీముని కుమారుడగు దోరభూపతి నత వాడి సీమలో పరిపాలనము సల్పుచు ఏలేశ్వర మహాదేవుని ప్రతిష్ఠించి మున్నానది కవతలనున్న కొన్నిభూములను హవిర్బల్యర్చనార్థ మొసంగెను.26 పెనుగంచి ప్రోలులో శా. శ. 1179 లో చాగిమన్మ పోతరాజను నొకఁడు రాజ్యముచేసినట్లు ముప్పాల శాసనము27 తెల్పుచున్నది. వీరుకాక యితర శాసనములవలన చాగిరాజుమనుమఁడును, భీమరాజు తనయుఁడునునగు మనుమచాగిరాజు,28 చాగిమన్మరాజు29 రుద్రయత్యా'30 అనువారలు తెలియ వచ్చుచున్నారు. కాని పరస్పరము వీరికిగల సంబంధము తెలియరాదు.

## మఱియొక రేచర్ల బేతభూపతి.

గణపతిదేవ చక్రవర్తి కాలమున రేచర్లవంశీయుఁడైన మఱియొక బేతభూపతి ప్రఖ్యాతుఁడై యున్నటుల గార్ల శాసనమున నభివర్ణింపఁబడి యున్నాఁడు1 ఈశాసనము కాకతిగణపతిదేవ చక్రవర్తికూఁతురు రుద్రమదేవి పరిపాలన కాలమున శా. శ. ౧౨౦౯ (క్రీ. శ. ౧౨౮౭) సర్వజిత్సంవత్సర చైత్రశుద్ధ ౮ నాఁడు రేచర్ల బేతభూపతివంశములోనివాఁడయిన బొప్పరాయనిచే లిఖింపఁబడిన దానశాసనముగాఁ గన్పట్టుచున్నది. ఈ శాసన మొకగొప్ప శిల మీఁద వ్రాయఁబడి చాలభాగము భూమిలో పూడిపోయియున్నందున గొంచెము భాగము మాత్రమె గాన్పించుచున్నదని శాసనము దిగువను దెలుపఁబడినది. ఈ శాసనమునందు బేతభూపతియు, వాని కుమారుఁడు బొప్పయయు, వానికుమారుఁడు గణనాథుఁడును,

26 279 of 1924 27 257 of 1924 28 259 of 1924 29 254 of 1924 30 317 of 1924.

1. తెలింగానా శాసనముల సంపుటము; పేజి, 161, 10 గార్ల శాసనము.

వాని కుమారుఁడు బొప్పరాయఁడనియు వరుసగాఁ దెలుపఁబడియుం డుటచేత బొప్పరాయనికి బేతభూపతి ప్రపితామహుఁడుగఁ బేర్కొనఁ బడియున్నాఁడు. కావున నీ బేతభూపతి మొదటి ప్రతాపరుద్రుని కడపటి కాలముననుం, గణపతిదేవ చక్రవర్తి పరిపాలన ప్రారంభ కాలముననుం, నున్నవాఁడని స్పష్టమగుచున్నది. విష్ణువు నాభిపద్మ మునందు జనించిన బ్రహ్మచే సృజింపఁబడిన చతుర్థకులమున రేచర్ల వంశమున బేతభూపతి జనించి నానాసేనాధిపతియై ప్రఖ్యాతవంతుఁ డై యుండెనని యీ శాసనము చాటుచున్నది.* ఇందలిబొప్పరా యఁడుగూడ సామంతశేఖరుఁడుగఁ బేర్కొనఁబడి యున్నాఁడు. పిల్ల లమఱ్ఱి శాసనములో వర్ణింపఁబడిన ఎఱకసాని భర్తయగు రేచర్ల బేతిరెడ్డి యిందు వర్ణింపఁబడిన బేతిరెడ్డియు నొక్కఁడేయగునా లేక వేఱ్వేఱు వ్యక్తులా యను సంశయము కలుగుచున్నది. రేచెఱువు లను గ్రామమె శాసనములలో రేచర్ల యని వ్యవహరింపఁబడు చున్నదను విషయము శాసన పరిశోధకులకుఁ దెలిసిన విషయమె. కాఁబట్టి రేచర్ల యనునది రేచఁడను మాలవానిఁ బట్టి వచ్చినది కాదని స్పష్టమగుచున్నది. ఇంకొక విశేషముగలదు.

ఎఱకసానికి పిల్లలమఱ్ఱి శాసనము వేయించిననాటికి మల్లయ యను కుమారుఁడున్నట్లు చెప్పఁబడియుండఁగా నీశాసనమునందు బేతభూపతికి బొప్పయకుమారుఁ డున్నట్లు చెప్పఁబడియున్నది. ఆరెడ్డి యు నీరెడ్డియు నొక్కఁడేయైన యెడల బేతిరెడ్డికి ఎఱకసాని గాక మఱియొక భార్యయుండి యామెకు బొప్పయ యను కొడుకుండి నటుల నూహింపవలసియుండును గాని వెలుగోటివారి వంశచరిత్ర

---

* శ్రీభామినీపతేర్నాభి పంకజే పద్మభూరభూత్
తేనసృష్టమిదం సర్వంతత్ర ర(మ్యా) మహీతలే॥
నానాసేనాధిపాజాతాశ్చతుర్థకుల వల్లభాః
తత్ర రేచర్లవంశోభూత్ ఖ్యాతిమాన్బేతభూపతిః॥

మునందు పిల్లలమఱ్ఱి బేతాళనాయనికి "దామానాయఁడు, ప్రసాదాదిత్యనాయఁడు, రుద్రనాయఁడు" అను కొడుకులు గలరని చెప్పఁబడి యుండుటవలన నీ శాసనములలోఁ జెప్పఁబడిన యిర్వురకంటెను భేతాళనాయఁడు భిన్నుఁడై యుండవలయునని విశదమగుచున్నది.

## రేచెర్ల దామానాయఁడు.

చెవ్విరెడ్డియను నామాంతరముగల పిల్లలమఱ్ఱి బేతాళనాయనికి 'దామానాయఁడు ప్రసాదాదిత్యనాయఁడు రుద్రమనాయఁడు' అను మూవురు పుత్త్రిలుండినట్లుగా వేంకటగిరివారి వంశావళిలో నుదాహరింపఁబడిన యీ క్రింది పద్యములో దెలుపఁబడినది.

"శా. తారుణ్యా పరిథమాన ధైర్యుఁడగు బేతాళావనీభర్తకున్
క్షీరల్ పుత్త్రిలు దామభూపతి ప్రసాదిత్యుండు రుద్రక్ష్మా
ధారుండున్ జనియించిరంత ద్విజగద్ధర్మ ప్రతీపాలనక్
శ్రీ రాజిల్లఁగ శౌరి మువ్వురయి ధాత్రి న్మించినా రెన్నఁగన్."

పిల్లలమఱ్ఱి రేచెర్ల బేతిరెడ్డియు పల్నాటి వీరుఁడైన రేచెర్ల బ్రహ్మనాయని తాత యగు బేతినాయఁడును, చెవ్విరెడ్డి యను నామాంతరముగల పిల్లలమఱ్ఱి బేతాళనాయఁడే యని శ్రీ వెలుగోటివారి వంశ చరిత్రమునందు వక్కాణింపఁబడిన హేతువులు పరస్పర విరుద్ధములై పొందిక లేక యున్నవని పదియవ ప్రకరణమున సవిస్తరముగాఁ జర్చించి యున్నాను. కాఁబట్టి యీ బేతాళనాయఁడు రేచెర్లవారి కుటుంబములోఁ జేరిన మఱియొక నాయకుఁడో లేక వెలుగోటివారి పూర్వులు భ్రమచేత రేచెర్ల బేతినాయనినే యీతఁడని తమ వంశమునకు మూలపురుషునిగాఁ జేసికొనిరో యేమో నిర్ధారించుటకును పాలుపోకయున్నది గావున భావి పరిశోధనమునఁ గాని యిందలి సత్యము బోధపడఁ జాలదు. అయినను వీరిని రేచెర్ల బ్రహ్మనాయని జ్ఞాతికోటిలోని వారిఁగా నంగీకరింపవచ్చును.

బేతాళనాయని మూవురు పుత్త్రిలయొక్క చరిత్రము గూడ సంద ర్భాను సారముగ రచింపబడి యుండలేదు. వీరిని గూర్చిన శాసన మొక్కటియు నింతవఱకుఁ గానిపింపలేదు. వీరి చరిత్రమున కాధార మంతయు నైవారు ప్రకటించిన గ్రంథములే యైయున్నవి. ఆ గ్రంథ ములలోని చరిత్ర మెంతవఱకు విశ్వసింపఁ దగినదో అంతవఱకే మనము గ్రహింపవలసి యుండును.

సీ. చటుల ఖడ్గా ఖడ్గి సమరప్రవీణుండై
ఖడ్గనారాయణ ఖ్యాతి నొందె
గణ పరాఙ్ముఖ రాజరమనుజేకొని రాయ
గాయ గోవాళాంక కలితుఁ డయ్యెఁ
ఆజిబలాధికుఁ డొటచే నెంతయు
బలభీమ విశ్రుతిఁ బొలుపు మీఱె
బ్రిథి తారి రాజన్య భయద విక్రమమునఁ
బ్రతిగండ భైరవ ప్రథ వహించె
మఱియుఁ బెక్కైన బిరుద నామములఁ దనరి
బాహువిక్రమ దాన సంపదలతోడఁ
దనరుచుండె సమంచి తోద్దామయశుఁడు
భువనహితకారి యగు దామభూవిభుండు."

ఈపై పద్యములోఁ బేర్కొనఁబడిన బిరుదావళుల ననేకులు వహించుట యాకాలమునం దాచారమై యుండెను. ఇంతకన్న నీతని చరిత్ర మేమియును జెప్పఁబడి యుండలేదు.

## రేచర్ల ప్రసాదాదిత్యనాయఁడు.

బేతాళనాయని పుత్త్రిలలో నీతఁడు సుప్రసిద్ధుఁడైనవాఁడుగఁ జెప్పఁబడియెను. ఇతనిం గూర్చి రావు వంశీయుల చరిత్రమునం దొక రీతిగను వెలుగోటివారి వంశచరిత్రమునందు మఱియొక రీతిగను వ్రాయఁబడి యున్నది. "రెండవ కుమారుఁడైన ప్రసాదాదిత్య

నాయఁడును దక్కిన ౭౬ గోత్రముల నాయకులు గాకతీయ గణపతి రాయలవారి కొలువు కూటములో నుండఁగా నొకప్పుడు గణపతి రాయలవారి పట్టణమును శత్రురాజులు ముట్టడి వేసిరి. అపుడు గణపతి రాయలవారు తమ కొల్వులోనుండు ౭౭ గోత్రముల నాయకులను జూచి మీ లోపల నెవ్వరీ శత్రువులను జయింతురో వానిని నేను గొల్వుకూటములో లేచి యెదురుసని తెచ్చి నాసింహాసనముపైఁ గూర్చుండఁ బెట్టుకొందు” ననియు మిగత ౭౬ గోత్రముల నాయకులచే నతనికి మ్రొక్కులు వేయింతు ననియుఁ జెప్పెను; ఆ మాటవిని యంద ఱూరకుండఁగా నీపప్రసాదాదిత్యనాయఁడు లేచి నే జయించెదనని విన్నవించి గణపతిదేవునివలన సెలవునొంది శత్రువుల మీఁద యుద్ధమునకు వెడల వారలతోఁ గఠినమైనయుద్ధముం జేసివారల జయించివచ్చి గణపతి రాయలవారి వలనఁ బ్రత్యుత్థానార్ధాసనాది సత్కారములను, ఇతరులగు ౭౬ గోత్రముల నాయకులచేఁ బ్రణామము నెట్టించుకొనునట్టి మర్యాదను, గాలిపెండేరమను బిరుదాభరణమును ‘కాకతిరాజపూజిత’ అనెడు బిరుదును శ్వేతచ్ఛత్ర ధ్వజములను బొందెను;” అని వ్రాయఁబడి యున్నది. గాని శత్రువు లెవ్వరో ఎవ్వరితో వీరు పోరాడిరో దెలిపి యుండలేదు. ఇతని పరాక్రమమును మెచ్చుకొని యీ గణపతి చక్రవర్తి గౌరవించి యుండును గాని యితనివంటిమహాశూరు లనేకు లాతని కొల్వుకూటములో నాతని సేవించి యుండఁగా నెల్లరకు నవమానకరముగా నర్ధాసనమిచ్చి వారలచే మ్రొక్కింపఁజేసె ననుట నిరాధారమై పరిహాస్పదముగ నున్నది. ఇతని ప్రతాపమును వర్ణించుచు నొకపదశీ మీఁది రీతిని వెలుగోటివారి వంశచరిత్రమునందును, రావు వంశ్యుల చరిత్రమునందును బ్రకటింపఁబడినది.

"సీ. ధరణిపై డెబ్బదేడ్గురు నాయకులలోనఁ
బటు ప్రతాపస్ఫూర్తిఁ బరఁగినాఁడు
చండ భుజా దండ మండి తారాతుల
భండనంబులఁ జాలఁ జెండినాఁడు
ఏపున నోర్గల్లు నేలు రుద్రునిచేత
నందెయుఁ బెండెంబు నందినాఁడు
విక్రమంబున ధరాచక్రంబులోఁ గల
బిరుదులు తనవిగాఁ దిరిగినాఁడు
వాఁడు రిపురాజ పన్నగ వైనతేయ
రాజితంబైన కేరళీరాజ ఘనుఁడు
భాసురుం డగు రేచెర్లశాసనుండు
సత్యసంధుండు సత్ప్రసాదిత్యఘనుఁడు."

ఈ పైఁజెప్పఁబడిన రుద్రుఁడు మొదటి ప్రతాపరుద్రుఁడనుట సరిపడదు. కడపటి ప్రతాపరుద్రుఁ డనుటయు సరిపడదు. ఇందలి రుద్రుఁడెవ్వఁడు ? కాకతి గణపతి చక్రవర్తి కూతుఁరగు రుద్రదేవి కావలయును. ఈమె రుద్రదేవుఁడని వ్యవహరింపంబడి యుండుటచేత రుద్రుఁడనఁగా రుద్రమదేవి యనియే యర్థము చేసికొందము. అందెయుఁ బెండెంబు గణపతిదేవుని వలన బొందెనని పైని చెప్పిన దానికి విరుద్ధముగా రుద్రమదేవి వలనఁబొందెనని చెప్పఁబడియున్నది. వెలుగోటివారి వంశచరిత్రమునందు గణపతి చక్రవర్తిచేత నర్థాసనమును బొంది ౭౬ పద్మనాయకులచేతఁ బ్రణామంబులు పొందెనని చెప్పఁబడి యుండఁగా రావువంశీయుల చరిత్రములో నుదాహరింపఁబడిన యొక సీసమాలికలో

"భూరి జయుండయి యోరుగంటికి రాఁగ
రుద్రమూర్తి ప్రతాపరుద్ర విభుఁడు
ఎదురుగా వచ్చియు హితుఁ డవు నీవంచు
ఘనతఁ బ్రసాదిత్యుఁ గౌఁగలించి
హొన్నైన కాల్పెండె మిచ్చి దోడ్కొని వచ్చి

ముందఱఁ గూర్చుండ మొదల నిల్పి
విడిది కంపెడు వేళ వేడ్కతో లేచియుఁ
గౌఁగలించి జయంబు గాఁగఁ బనిచి
మఱునాఁడు దెబ్బదేగ్గురు నాయకులు గొల్వ
తన సముఖాన కతంబు రాఁగఁ
దా లేచి యపుడు సంతస మంది యాతనిఁ
బ్రియముతోఁ గూర్చుండఁ బెట్టికొనుచు
దెబ్బదేగ్గురు చేత మ్రొక్కులు వేయించి
మించఁ బ్రతిజ్ఞ జెల్లించె విభుఁడు"

అని చెప్పఁబడి యుండుటచేత రుద్రవిభుఁ డనఁగా రుద్రదేవి యని యర్థము చేసికొనవలసిన పక్షమున రుద్రమదేవి యంతటి చక్రవర్తిని యెదురుగా వచ్చి ప్రసాదాదిత్యుని కౌఁగిలించుకొన్నదని చెప్పవలసి వచ్చును గదా ? అది యెంత యసహ్యాకరముగా నుండఁ గలదో వేఱుగఁ జెప్ప నక్కఱ లేదు. పూర్వకవుల యుద్దేశ్యము రుద్రవిభుఁ డనఁగా రుద్రమదేవి గాక మొదటి ప్రతాపరుద్రుఁడని. అనఁగాఁ బ్రసాదాదిత్యనాయఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలమున నున్నవాఁడని వారి యభిప్రాయము. అది కాలనిర్ణయమున కడ్డము వచ్చుచున్నదను భావముతో వెలుగోటివంశచరిత్రకారు లాప్రతాప రుద్రునికి బదులు గణపతిదేవుఁడని మార్చిరి. ఇట్టిమార్పు చేసినందులకుఁ బ్రమాణము నేమియుఁ జూపినవారుకారు. కనుకఁ బ్రసాదాదిత్యనా యఁడు మొదటి ప్రతాపరుద్రుని కాలముననుండెనో రుద్రమదేవికాల ముననుండెనో యెవ్వరికిని దెలియదు. నాకుఁ దెలిసి నంతవఱకు శాసన ములలో నెచ్చటను వీరినామములుగాన్పింపలేదు. భావిపరిశోధనమునఁ గాని వీరి యుదంతము దెలియంబడదు. అంతవఱకు నీతఁడు గణపతి దేవునితుదికాలమున నున్నవాఁడని యూహింతము. గణపతిదేవుఁడు పాండ్యరాజులతోఁడఁ జేసిన యుద్ధములలో నితఁడును నీతని సహో దరుఁ డగు రుద్రమనాయఁడును గూడ నుండి రని యూహించుటకు

మాత్రము గొంచె మవకాశము గలదు. ఎట్లయినను కాకతీయచక్రి వర్తులర్ధాసన మిచ్చిరనియు తక్కిన ౭౬ పద్మనాయకులితనికి మొక్కిరనుటయు నేయాధారమును లేక యెంతమాత్రము విశ్వసింపరాదు. ఇది యిట్లుండఁగా మఱియొక వింత యేమన:—

> " ధరణి ఘనమైన రాయపితామహాంక
> బిరుదు డెబ్బదియేడ్గురు వరుస నాయ
> కులుగఁ జేసియు భైరవువలన వచ్చ
> దృఢవరంబుగఁ గొనెఁ బ్రసాదిత్యవిభుఁడు"

అని వెలుగోటివారి వంశావళియందు వరుసగ డెబ్బదియేడ్గురను నాయకులనుగఁజేసి భైరవువలన రాయపితా మహాంకబిరుదమును బొందెనఁట ! ఈ పద్యమునుబట్టి ౭౭ నాయకులు ప్రసాదాదిత్యునివలన నేర్పడిరను భావము పై పద్యమున ద్యోతక మగుచున్నది. పరస్పర విరుద్ధములైన విషయము లెన్నియో గలవు. గ్రంథవిస్తరభీతిచేత వాని నన్నింటిని జర్చించుట విడిచి పెట్టుచున్నాఁడను.

## రేచర్ల రుద్రిమనాయఁడు.

ప్రసాదాదిత్య నాయని తమ్ముఁడగు రుద్రినాయఁడును ప్రసిద్ధుఁడైన వీర శిఖామణియై యుండవలయును. ఇతనికి రాయపితామహాంక మను బిరుదము గలదని యీ క్రింది పద్యములోఁ జెప్పఁబడినది.

> " మ. ఒగి నుక్కుంబొడిరాల రాయదురు మున్నుగ్రీవులై యివ్వడున్
> దగ నీయందయ యందునుండి తలక్రిందై వైరిభూపాలకుల్
> జగతీభారమునన్ పసిండి పొడి నిచ్చల్ రాయచున్నా రదే
> తగదే రాయపితామహాంక జయ భద్రా రుద్ర నిన్ జెందినన్"

మఱియును, "పాండ్యగజకేసరి కాకతిరాజ్య ప్రతిష్ఠాపనాచార్య" బిరుదులు గలవని యీ క్రింది పద్యములోఁ జెప్పఁబడినది.

"ఉ. వాలని విక్రమస్ఫురణ వారలు పాండ్యబలంబు దంచుచున్
గేళి జయించి పాండ్యగజకేసరినామము గాల్చి రెంతయున్
జాలినవారుగా నెగడి సత్కృతి కాకతిరాజ్యల
క్ష్మిలలనా ప్రతిష్ఠితగఁ జేసిరి భూజను లెల్ల మెచ్చఁగన్"

కాకతిరాజ్య ప్రతిష్ఠాపనాచార్యు లయిన వారొక్క రుద్రనాయఁడు మాత్రమే గాక యనేకులు గలరు. ఈ రేచెర్ల రుద్రనాయఁడు రుద్రదేవి కాలమున నధిక ప్రఖ్యాతికి వచ్చినటులు గానంబడుచున్నది. గావున నీతనివిషయమిక్కడ సంక్షేపించి రుద్రమదేవిం గూర్చి వ్రాయు ప్రకరణమున మరల నక్కాణింతును. పద్మనాయక వీరు లనేకులు గణపతిదేవ చక్రవర్తికి విశ్వాసపాత్రులయిన భృత్యులుగనుండి యుద్ధములం దాఱితేఱిన రణశూరులై కాకతి రాజ్య ప్రతిష్ఠాపకులన్న ఖ్యాతిని సంపాదించి రనుటకు సందియము లేదు గాని తక్కిన శాఖలలోని మహావీరులైన సైన్యాధిపతులకంటె వీరే యగ్రగణ్యులని కాకతీయ చక్రవర్తు లందఱను విడిచిపెట్టి వీరలకే యర్ధాసనములిచ్చి సమ్మానించిరనుట మాత్రము విశ్వసింపఁ దగినది కాదు.

## రాజగురు విశ్వేశ్వరగోళకీ శైవమఠము.

కాకతిగణపతిదేవ చక్రవర్తికి శైవదీక్ష నొసంగిన గురువు విశ్వేశ్వరశంభువను గోళకీమఠాధిపతి. అందువలన నితఁడు రాజగురువని వ్యవహరింపఁబడినాఁడు. గణపతిదేవ చక్రవర్తికిని దరువాత నాతని కొమార్తె రుద్రమదేవ చక్రవర్తికిని గొంతకాలము చేదోఁడువాదోడుగనుండి రాజ్యాంగపరిపాలనాది సమస్త రాజకీయ వ్యవహారములందు పాల్గొన్నట్టి మంత్రియగు శివదేవయ్య యను

నాతఁడే యీతఁడు. ఈయన ప్రతిభావిశేష మసాధారణమైనది. ఈతని నివాసస్థలము మొట్టమొదట వంగదేశమునందలి దక్షిణరాఢామండలములోని పూర్వగ్రామ మనునదిగా నుండెను. ఇతఁడు గోళకీశైవ మతాధిపతులలో నేఁడవ వాఁడుగా నుండెను. ఈమతము పాశుపతశైవమతమునకు సంబంధించినది. ఈపాశుపతశైవమతమె కాలాముఖమని, లకులేశ్వర మతమని వేర్వేఱు నామములతోఁ గూడ వ్యవహరింపఁబడుచుండెను. శైవాగమ తంత్రగ్రంథములలో ఆమర్దకమతాధిపతిగనుండి యీ మతమును పోషించిన యేదూర్వా సుఁడు గలఁడో యాదూర్వాసుఁడే యీ మతప్రతిష్ఠాపకుఁడని భావిపఁబడుచున్నాఁడు.1 శైవాగమ తంత్రవాఙ్మయము ప్రపంచములోఁ బుట్టుటకుఁ గారణభూతుఁడు దూర్వాసుఁడే యని తంజావూరు మండలములోని తిరువలూరు గ్రామవాసియైన "నిర్మలమణిగురు" యను నొక శైవబ్రాహ్మణుఁడు, అఘోర శివాచార్య కృతమగు "క్రియాక్రమోద్యోతక" మను గ్రంథమునకు "లఘుప్రభ" యనుపేరిట వ్రాసిన వ్యాఖ్యానగ్రంథమునఁ దెలిపియున్నాఁడు. మహాభారతములో పాండురాజపత్ని యగు కుంతీమహాదేవికి సంతానార్థము మహామంత్రోపదేశము చేసిన దూర్వాస మహర్షియె యీ దూర్వాసమహర్షియె యుండఁబోలు. పరాశక్తిస్తవముతోఁ గూడుకొన్న పరాశక్తి మహిమ్నమను చిన్నగ్రంథమును రచించినవాఁడు గూడ నీ దూర్వాసుఁడే యని భావింపఁబడుచున్నాఁడు. డా. ఆఫ్రెక్టు అను వారు తమ "Catalogues Catalogurum" అను గ్రంథములో నట్టివే దూర్వాస విరచితములైన మఱికొన్ని గ్రంథములను దెలిపియున్నారు.

---

1 See Dr. Hultshus Report on Sanskrit Manuscripts No 2 introduction Page XVI.

ఈ గోళకీమతాధిపతులయిన శైవాచార్యులలో మొదటి వాఁడు సంభవ లేక సద్భావశంభువను నాతఁడు పదపశతాబ్దియందనో పదునొకండవ శతాబ్ది మొదటనో చేదిదేశమును బరిపాలించిన మొదటియువరాజదేవుఁడను కాలచుర్యరాజునకు సమకాలికుఁడై యుండెను. ఈచేదిరాజ్య మిప్పటి మధ్య హిందూదేశము (Central India) లోనిది. ఈదేశమునకు త్రిపురియనునది రాజధానిగ నుండెను. దీని నేయిప్పుడు "తేవా" రందురు. ఈమొదటి యువరాజదేవుని భార్య నోహల; ఇతని కుమారుఁడు లక్ష్మణరాజు. వీరు కదంబగుహాకుటుంబమునకు సంబంధించిన శైవాచార్యులకు గొన్ని దానములను జేసి యున్నారు. ఆకాలమున నీచేదిరాజ్యములో చేరిన డాహలమండలము శైవాచార్యు లనేకులకు నాటపట్టయి యుండెను. కాళచురిరాజయిన యువరాజదేవుని రాజ్యము గంగానర్మదానదులకుమధ్యను తొమ్మిదిలక్షల గ్రామములతోఁ గూడుకొని యుండెనఁట. ఈగోళకీశైవమతమును స్థాపించిన సద్భావశంభువను శివాచార్యునకు నారాజశేఖరుఁడు గోళకీమతపోషణార్థము మూఁడులక్షల గ్రామములం గలిగిన ప్రదేశమును దానముచేసియుండెనని మల్కాపురశాసనమువలనఁ దెలియుచున్నది. ఈ సద్భావ శంభుశిష్యుఁడు సోమశంభువు. ఇతఁడే సోమశంభు పద్ధతి యను గ్రంథమును రచించినవాఁడు. శైవాగమ తంత్రగ్రంథములఁ బఠించిన వారికి సోమశంభుపద్ధతి పరిచితమైనదే యని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. ఇతఁడు సద్భావశంభుని శిష్యుఁడనియు, క్రీ. శ. 1073 సంవత్సరప్రాంతమున నున్నవాఁడనీ డా. ఆఫ్రెక్టు నుడువు చున్నాఁడు. విద్యారణ్యకృత మగు "సర్వదర్శన సంగ్రహ" మను గ్రంథమున నీ సోమశంభు పద్ధతి నిర్వచింపఁబడినది. నిర్మలమణిగురు ప్రణీతమగు "లఘుప్రభ" యను వ్యాఖ్యాసయితము సోమశంభుపద్ధతిని దఱచుగాఁ బ్రశంసించుటయే

గాక మల్కాపుర శాసనములో నుదహరింపఁబడిన కేరళదేశీయుఁడగు విమల శివాచార్యుని, ధర్మశివాచార్యుని, విశ్వేశ్వర శివాచార్యుని గూడఁ బ్రశంసించి యున్నది. సోమశంభుని శిష్యుఁడు వామశంభువు. ఈయన శిష్యప్రశిష్యులు గడచిన వెనుక శక్తిశంభువు వచ్చెను. ఈయన శిష్యుఁడు కీర్తిశంభువు. వీనిశిష్యుఁడే కేరళదేశీయుఁడైన విమలశివుఁడు. వీని శిష్యుఁడే ధర్మశివుఁడు. ఈయన శిష్యుఁడే గౌడరాఢా దేశమునందలి పూర్వగ్రామ నివాసియగు విశ్వేశ్వర శివుఁడు. ఇతఁడే మనకాకతీయ గణపతిదేవ చక్రవర్తి దీక్షాగురుఁడును, మల్కాపుర శాసనమునఁ బేర్కొనఁబడిన దానప్రతిగ్రహీతయునై యున్నాఁడు. త్రిపురములోని గోళకిగిరియను కొండమీఁదను నీశైవమఠము నిర్మింపఁబడి యుండుటచేత నీమఠమునకు "గోళకీమఠ" మను పేరు వచ్చినట్లు కనంబడుచున్నది. ఈతనికి నొక్క కాకతిగణపతిదేవ చక్రవర్తియె గాక చోళరాజు, మాళవరాజులను వారు శిష్యులుగ నున్నట్లును, కలచురిక్ష్మాపాలు నకు దీక్షాగురువుగ నున్నట్లును మాల్కాపుర శాసనము దెలుపుచున్నది. ఈశాసనములో:-

"శ్రీ చోళేశ్వరమాళవ క్షితిపతీ రాజన్యచూడామణీ యచ్ఛిష్యౌకిమతః పరంగణపతిః క్షోణీపతిర్యత్సుతః నస్సాత్కాన్యముదేసదేశిక వరశ్శైవాగమాంభోనిధి శ్శ్రీవిశ్వేశ్వరదేశికః కలచురిక్ష్మాపాలదీక్షాగురుః"

అని చోళమాళవరాజులను నూరక శిష్యులని మాత్రము చెప్పుచు కాకతిగణపతి భూపాలుని" తన కుమారునిగఁ జెప్పుకొనుట కర్థమేమో బోధపడకున్నది. దీక్షను బొంది శిష్యులయిన వారిని పుత్త్రులుగ గురువులును, గురువులను దండ్రులునుగ శిష్యులును జెప్పుకొనుటకై శైవసంప్రదాయమని చెప్పినను శిష్యులయిన చోళమాళవరాజులను విడిచి యొక్క గణపతినే కుమారుఁడని చెప్పుటలో విశేషమేమో బోధపడకున్నది. గణపతిదేవ చక్రవర్తి యాస్థానమం దీతనికి బలుకుఁబడి యత్యధికము గనంబడుచున్నది.

## గణపతిదేవుని పరిపాలనము.

కాకతిగణదేవుఁడు సింహాసనారూఢుఁడైన వెనుక నాంధ్రభాష మాతృభాషగాఁ జేసికొన్న మహాజనుల నెల్లర నాంధ్ర సామ్రాజ్యము క్రిందికిఁ దీసికొని రాఁగోరి ఎట్టిప్రయత్నములకుఁ గడంగెనో యట్టిప్రయత్నములన్నియు నీశ్వరానుగ్రహమువలనఁ గొనసాగి జయప్రదములయినవి. మండూకము నొకదాని మ్రింగ నోరప్పలించుకొనివచ్చి పైఁబడెడు భుజగేంద్రంబుల నొక్కొక్కదాని నదిమిపట్టి పెట్టెలోఁ బెట్టి వశపఱుచుకొనునట్టి ప్రజ్ఞాధురంధరుండయిన యొకగారడివాని పగిది సమరగాంగేయుఁడని వీరాగ్రగణ్యులచేత ననేక భంగులఁ గొనియాడంబడెడు మనయీ కాకతి గణపతిదేవ చక్రవర్తి తనకాలంబున నాంధ్రసామ్రాజ్యము నాక్రమింప నెదుర్కొను మహామండలేశ్వరుల నొక్కొక్కనినే జయించి గర్వభంగము గావించి యదిమిపట్టి కప్పములు గైకొనుచు సామ్రాజ్యమునకు వన్నెయు వాసియుం గలుగఁజేసి సర్వవిధములఁ బ్రజల యైశ్వర్యాభివృద్ధికై ప్రయత్నించి చాలవఱకు సఫలీకృత మనోరథుఁ డయ్యెను. అతఁడు మతాభినిరతి కలవాఁడగుటంజేసి ఘనకార్యనిర్వహణమున నెట్టి యంతరాయములు సంఘటిల్లుచు వచ్చినను నిరుత్సాహుఁడుగాక మరల మరలఁ బ్రయత్నించుచు వచ్చినందున విజయము నొందుచు వచ్చెను. అతని మంత్రివర్గములోఁ బ్రముఖుఁడైన శివదేవయ్య రాజ్యతంత్రజ్ఞుఁడగుటవలన నాతనిమాట జవదాటక నేర్పుతో రాజ్యపరిపాలనము సేయుచు వచ్చినందున దక్షిణ హిందూస్థానమును బరిపాలించిన చక్రవర్తులలో నధిక ప్రఖ్యాతిని గాంచెను. ఆంధ్రభూమి నంతనేక చ్ఛత్రముక్రిందికిఁ గొనివచ్చిన తరువాత నీతఁడు రాజ్యాంగమును, రాజధానీ నగరమునుఁ దుర్గమును, సైన్యమును బలపఱచుటకై భగీరథ ప్రయత్నములు గావించెను. ఆ కాలమున నాంధ్ర

సామ్రాజ్యము ఢిల్లీ చక్రవర్తులకు మోహమును గలిగించుచుండెను. చంద్రధ్వజులయిన తురుష్కులకు భయాకరముగ వర్ధిల్లుచు వారలను మత్సరపూరితులను గావించు చుండెను. దుర్గములోపల రాజ భవనమునకుఁ జుట్టును ఉన్నతమైన శిలాప్రాకారమును, దానిచుట్టును మిక్కిలి యగాధమై జలపూరితమైన యగడ్తను నిర్మింపించుటయే గాక ప్రాకారమునకు లోపల రాజవీథుల నేర్పఱచి యచ్చటచ్చట నశ్వ రథ గజ పదాతి వర్గంబులఁ బెట్టించి, అహోరాత్రములు వీర భటు లశ్వారూఢులై విహరించునటుల నియమించి, ఉన్నతములై సుందరములైన రాజభవనములను గోపురములను బెక్కింటిని గట్టించి గోపురములఁ బసిండికుండలతో నలంకరింపఁజేసి, ఏక శిలానగరమున కెంతో శోభను గల్పించెను. ఇతఁడు తన రాజ్యమునందంతట నూర్ల కొలఁది శివాలయములను స్థాపించెను. గణపవరంబులని తనపేరిట నూర్లకొలఁది గ్రామంబులను నెలకొల్పుటయెగాక త్రాగ శుద్ధ జలము లభింపక ప్రజలు కష్టపడుచున్న ప్రదేశముల ననేక తటాకములను ద్రవ్వించెను. దుర్గమంబులైన యరణ్య ప్రదేశంబుల మంచి బాటలను వేయించుటయే గాక యక్కడక్కడ సత్రములను చలి పందిరులను గట్టించుచు వచ్చెను. తనరాజ్యములోని ప్రజలకు దేశ భక్తియును పాపభీతియుఁ గలుగునటుల బోధింపించుచు వచ్చెను. ప్రజల మానధనంబులకు భంగమును గలిగించునట్టి జార చోరాది క్రూర జనంబుల శిక్షింపించుచు మిక్కిలి జాగరూకుఁడై పరిపాలనము సేయుచు వచ్చెను. ఈ యాంధ్రచక్రవర్తి కాలమున విదేశములతోడి వాణిజ్యమును సముద్రయానమును విశేషముగా సాగుచు వచ్చెను.

## మోటుపల్లి ప్రసిద్ధమైన రేవుపట్టణము.

ప్రాచీన కాలమునుండియు గుంటూరుమండలములో బాపట్ల తాలూకాలో బాపట్లకు సమీపమున సముద్రతీరమునందున్న మోటుపల్లి యను గ్రామము ప్రసిద్ధమైన రేవుపట్టణముగా నుండి చీనా, బర్మా, పారసీకము మొదలగు విదేశములతో వాణిజ్యము నెఱపుటకు నాంధ్రదేశములో నొక ప్రధానస్థాన మయ్యె నని యాంధ్రుల చరిత్రము ప్రథమభాగమున సవిస్తరముగా వ్రాసియున్నాను. ఈ మోటుపల్లికే వేలానగరమనినామాంతరముగలదు. ఈవేలానగరము ఆంధ్రశాతవాహనుల కాలమునను, ఆంధ్రపల్లవుల కాలమునను, ఆంధ్రచాళుక్యుల కాలమునను, ఆంధ్రచోడుల కాలమునను ప్రసిద్ధికెక్కిన పట్టణముగ నున్నను క్రమముగా చాళుక్యుల పరిపాలనానంతరము వాణిజ్యము క్షీణింప నంతఁగా గణనకు రాక యుండెను. మోటుపల్లికడ మెట్టపట్టిన యోడలలోని సరకులను ఆసమీపమునందలి మండలేశ్వరులు కొల్లగొనుచుండుటచేత నావికులా రేవునకుఁ జేరుటకే భయపడు చుండిరి. అందువలనఁ బ్రసిద్ధి గాంచిన వర్తకులెవ్వరు నాపట్టణమున నివాసముగా నుండక పోయిరి. కాకతి గణపతిదేవచక్రవర్తికిఁ బూర్వము కొంతకాలమునుండి విదేశవ్యాపారము నడుపువర్తి వర్తకులకు నభయశాసన మీఁగల చక్రవర్తి గాని మహారాజుగాని లేనందువలననే యా ప్రసిద్ధమైన రేవుపట్టణమున కాగతి పట్టెను. గణపతిచక్రవర్తి తాను సింహాసనారూఢుఁడై వెలనాటిని జయించిన పిమ్మట నీ వేలానగరము నుద్ధరించి విదేశవ్యాపారమును పెంపునొందింపవలయు నన్న సంకల్పము మనస్సున నంకురించిన వెంటనే యుపేక్షింపక మంత్రులతో నాలోచించి యందులకుం దగిన ప్రయత్నములను గావించెను. అప్పు డా గణపతిచక్రవర్తి వర్తకులకు నభయశాసన మొసంగెను. "నా జీవితముకన్నను

నా ప్రజలసంరక్షణమే నాకు నెక్కువ ప్రీతికర మైన విషయ" మని యీ యభయశాసనమున వ్రాయించెను. మఱియు నాశాసనము వలన సత్ప్రభుత్వముయొక్క ధర్మములను గాపాడుటకును, కీర్తికొఱ కై యధికాభినివేశముతో సముద్రయానము చేసి విదేశములతో వ్యాపారము చేయునట్టి వర్తకులయందలి ప్రేమచేత నొక్కకూప శుల్కముమాత్రము గాక తక్కిన సుంకముల నన్నిటిని వదలివేసితి మని లిఖింపఁబడియెను. ఉత్తరమునుండి దక్షిణమునకుఁ గాని, దక్షి ణమునుండి యుత్తరమునకుఁ గాని పోవునట్టి యోడలు వాయువశ మున నీరేవున నెఱక పట్టిపోయినయెడల నావికుల నోడదొంగలు కొల్లగొనకుండఁ గట్టడచేయుటయె గాక వర్తకులు నిర్భయము గా రాకపోకలు జనుపుటకుం దగిన మార్గముల నేర్పఱిచెను. ఎగు మతి దిగుమతి సరకులపై శుల్కపరిమాణము ముప్పదింట నొక్క టిగ నిర్ణయించెను. శ్రీగంధము ౧ కి గ ౧, పచ్చకర్పూరమునకు, చీనికర్పూరమునకు, ముత్యాలకు వెల గ ౧ కి ౧౦॥౩, పన్నీరు దంతము, జవ్వాది, కర్పూరతైలము, రాగి, తగరము, సీసము, పట్టునూలు, పవడము, గంధద్రవ్యములకు వెల గ ౧-కి ౧౦।-, మిర్యాలు వెల గ కి ౧॥।-, పట్టుస్వరూపము ౧-కి గ ౧ కి ౧॥।౦,

ఈరీతిగ సుంకము విధింపఁ బడియెను. ఈసరకుల నామములను బట్టి యే యాకాలమును నం దారేవుపట్టణ మెంతప్రసిద్ధ మైనదిగ నుం డెనో, ఏయే దేశములతోడ వ్యాపారము చేయుచుండెనో వేఱుగఁ జెప్ప నక్కఱలేకయె బోధపడక మానదు. కాకతిగణపతిదేవ చక్ర వర్తియొక్క కృపావిశేషము చేతనే యీ రేవుపట్టణము పునరుద్ధా రణము గావింపఁ బడుటయు, ఆతని కొమార్తయైన రుద్రమదేవి కాలమున వెనీసువర్తకుండైన "మార్కో-పోలో" అను వానిచేత శ్లాఘింపఁ బడుటయు సంభవించినది. కాకతిగణపతి సిద్ధయదేవ మహారాజును మోటుపల్లికిఁ బాలకునిగ నియమించెను.

## ధర్మపరిపాలనము.

ఈ యాంధ్రచక్రవర్తి ప్రభుత్వకాలమున ధర్మము వర్ధిల్లె ననియు, ద్విజులలోఁ బ్రముఖు లైన వార లున్నతపదవులకు వచ్చి రనియు, వృద్ధులయెడ గౌరవము, ప్రేమ, మొదలగువానిని ప్రజలు కలిగి యుండి రనియు, శాస్త్రజ్ఞానము, కళలు వికసింపఁ జేయఁబడిన వనియు, పల్నాటిలోని దుర్గిపట్టణమున గంగయసాహిణిచే లిఖియింపఁబడిన దానశాసనములో నుదాహరింపఁ బడియెను. ఈ గంగయ సాహిణికి మంత్రిగ నుండిన నామయపండితుఁడు దుర్గయపట్టణమున తన తండ్రికిఁ బుణ్యము ప్రాప్తించుకొఱకు వంకేశ్వరాలయమును నిర్మింపించెనని దెలియుచున్నది. కాకతి గణపతిదేవచక్రవర్తి ప్రజారంజకముగఁ బరిపాలనముసేసి సత్కీర్తి వడయుటకుఁ గారణభూతుఁ డైనవాఁడు శివదేవయ్య యను నాతని ప్రధానమంత్రియె గాని యన్యుఁడు గాఁడని యిదివఱకె దెలిపియున్నాను. ఈ శివదేవయ్యయను నైయోగి కారాధ్య బ్రాహ్మణుఁడు రాజ్యతంత్రజ్ఞుఁడు మాత్రము గాక పండితకవియుం గూడ నైయుండెను. అతఁ డాంధ్రమున "పురుషార్థసార" మను నీతిగ్రంథమును రచించెను. ఇందలి కవనము మృదు మధుర పద ఘటిత మై యొప్పుచున్న దని దెలుపుటకై రెండు పద్యములను మాత్ర మీ దిగువ నుదాహరించు చున్నాను.

+ క. ప్రజఁ జెఱిచి కూడఁ బెట్టిన
నిజధన మది వలయు వ్యయము నిచ్చలుఁ జేయన్
బ్రజయును ధనమును బొలిసిన
భుజబలమున నిలువఁ దల మె భూపతి కెందున్."

క. జనలక్ష్మికి ధనలక్ష్మికి
ననుపమ మగుధర్మ లక్ష్మి కాత్మయ మూలం

బని యాత్మరక్ష మఱవక
జననాథుఁడు సేయవలయు సతతము ప్రీతిన్."

కాకతి గణపతిదేవ చక్రవర్తికిఁ బుత్త్రికా సంతానమె గాని పుత్త్రసంతానము లేక యుండెను. ఈయనకు గణపాంబ రుద్రాంబ యను నిరువురు కొమార్తెలు గలరని యింతకుఁ బూర్వమె దెలిపి యున్నాను. ఇతఁడు తన పెద్దకొమార్తె యయిన రుద్రాంబను కుమారునిగ భావించుకొని యామెకు విద్యాబుద్ధులు గఱపించి రాజ్యతంత్ర జ్ఞానమును గలిగించి తనకుఁ బిమ్మట నామెయె సింహాసనారూఢయై యాంధ్ర సామ్రాజ్యమును బరిపాలింప నియమించి యఱువదిరెండు సంవత్సరములు ప్రజారంజకముగ నిరంకుశపాలనము చేసి మిక్కిలి వృద్ధుఁడై క్రీ. శ. ౧౨౬౧-౧౨౬౨ వ సంవత్సరమున స్వర్గస్థుఁడై కీర్తిశేషుఁ డయ్యెను.

---

## వెలమవీరుల చరిత్రము.

కాకతి గణపతిదేవ చక్రవర్తికి భృత్యులుగ నుండి విక్రమాఢ్యులని ప్రసిద్ధిగాంచిన వెలమవీరులు గొందఱు కాకతీయచక్రవర్తుల ప్రాపునఁ బ్రబలి నాయకత్వములం బడసి బహుభూములను బరిపాలించినటులు గాథ లనేకములు చూపట్టుచున్నవి. వెలమువారు సంస్కారశూన్యులై శూద్రప్రాయులయిన క్షత్త్రియసంతతివారమనియు, సచ్ఛూద్రుల మనియుఁ జెప్పుకొను తెగల వారలలో నొక

---

+ పురుషార్థసార మను గ్రంథము శివదేవయచే రచింపఁబడినదని శ్రీయుత మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారిచే బ్రకటింపఁబడిన నీతిశాస్త్రముక్తావళి గ్రంథ పీఠికలో వ్రాయఁబడినది.

రుగ నున్నారు. ఈ తెగవారిని గూర్చిన చరిత్రము సాంతముగా నిందు దెలుపుటకు సాధ్యపడక పోయినను గొంతవఱ కయినను వివరించుట యావశ్యకముగఁ గానంబడుచున్నది. వెలమ శబ్దము "వెళ్ళానైత్రి" అను శబ్దమునుండి పుట్టినదని కొందఱు చెప్పుచున్నారు. "వెళ్ళానైత్రి" అనఁగా నీరును గట్టువారు (వ్యయసాయకులు) అని యర్థము. వర్మ శబ్దభవము వెలమ యని చెన్నపురి రాజకీయ కలాశాలయందు సంస్కృతోపన్యాసకులుగా నుండి కీర్తిశేషులయిన ఎమ్. శేషగిరి శాస్త్రులవారు "శబ్దశాస్త్ర" మను తమ గ్రంథమునందు వ్రాసి యున్నారు. దక్షిణహిందూస్థానములోని దేశములను బరిపాలించిన వారిలో వర్మశబ్దమును నామముల తుదను బెట్టుకొన్నవారు పల్లవులు, కదంబులు, చాళుక్యులు మొదలగు వారుగా నున్నారు. పై కలాశాలయందు శేషగిరిశాస్త్రులవారికిఁ బూర్వ మాపదవియందే యుండిన అపర్టుగారు పల్లవులే వెలమలని వ్రాసియున్నారు. శబ్దము యొక్క వ్యుత్పత్తి యెట్టిదైనను వెలమలును కమ్మవారివలెనె మిశ్రజాతివా రయినటులు చరిత్రము వేనోళ్ళఁ జాటుచున్నది. చరిత్రమునందు రెడ్లకును కమ్మవారికిని వెలమవారికిని సంబంధములు గానంబడుచున్నవి. ఇంతమాత్రముచేత నీ మూడు తెగలవారు నొక్క తెగలోనుండి యేర్పడినా రని చెప్పుటకును సాధ్యపడదు. ఆంధ్రసామ్రాజ్య విజృంభణకాలమున యదు వృష్ణిభోజాంధకు లనియెడు జాతుల వారికిని యవనశకపహ్లవాదులకును గలిగిన సమ్మేళనమువలన నూత్నరక్త మీజాతులయందుఁ బ్రవహింపఁగా వీరలు విజృంభించి గంగాతీరము మొదలుకొని కన్యాకుమారివఱకుఁ గల దేశములను వేర్వేఱు వంశనామములతో వేర్వేఱుకాలములందుఁ బరిపాలించుచు వచ్చి రని చరిత్రము సాక్ష్య మిచ్చుచున్నది. ఆంధ్రసామ్రాజ్యము భగ్నమైన వెనుక వల్లభవంశ మను పేరిట సురాష్ట్రదేశమును బరిపాలించినవారును, చాళుక్యవంశ మనుపేరిటఁ గుంతల

వేంగీదేశములను, కాకతీయు లను పేరిటఁ దెలుఁగుదేశమును బరిపాలించిన వార లీ వెలమ కమ్మ తెగలవారే గాని యన్యులుగాఁ గనుపట్టరు. ఈరెండు తెగలలోని వారును వారివారి నామాంతములను రెడ్డియను బిరుద వాచక పదమును జేర్చుకొని వ్యవహరింపఁబడుచు వచ్చినను రెడ్లకు ప్రతిస్పర్ధులుగ నుండుచు వచ్చిరి. రాష్ట్రకూటులకును చాళుక్యులకును, కృష్ణా గోదావరీ మండలములలో కొండెసిగలు గలిగియుండిన కమ్మవారికి పంటమహాన్వయులయిన కొండవీటి రెడ్లకును, పద్మనాయకులకును, జరిగిన యుద్ధములు చరిత్రమున సుప్రసిద్ధములుగ నున్నవి.

## పద్మనాయకులు లేక పద్మవెలమలు.

వెలమలలో నొకశాఖవా రని చెప్పంబడెడి పద్మవెలమలే పద్మనాయకుల మని చెప్పుకొనుచున్నారు. సత్యైకదృష్టితోడను నిష్పక్షపాతబుద్ధితోడను విమర్శించి చూచిన పక్షమునఁ బద్మనాయకులు కేవలము వెలమలలోనుండి యేర్పడినవారుగాఁ గనుపట్టరు. పద్మనాయకు లన నెవ్వరో మనము తెలిసికొనుటకుఁ బూర్వము పద్మనాయకుల మని చెప్పుకొనువారిచేఁ బ్రకటింపఁబడినవారి గ్రంథములలో నేమి వ్రాయఁబడినదో విచారింపవలసియుండును. పద్మనాయకకులజు లయిన వెలుగోటివారి వంశచరిత్రమునందు "వీరు నాల్గవ వర్ణములో నత్యుత్తమమ్మైన పద్మనాయక కులమువారు. ఇందుఁ బద్మనాయకుఁ డనఁగాఁ బద్మబాంధవుం డగు సూర్యుఁడు" అని వ్రాయబడియుండియు నేమికారణము చేతనో "లేదా, పద్మనాయకుం డనఁగాఁ బద్మపతియను రాజు అతఁడు.

"శ్లో. మహాపద్మపతిః కశ్చిన్నందః క్షత్త్రవినాశకృత్" అని పురాణములయందుఁ జెప్పఁబడినవాఁడు; ఆతనివిషయము సంక్షేపముగ నిట్లుండఁ దగినయది:—

"మహానంది యను రాజునకు వివాహితశూద్రస్త్రీయందు మహాపద్మపతి యను వాఁ డుదయించె. ఆతఁడు సూర్యచంద్రవంశజు లగు రాజులను దనకు వందనాదు లాచరింపుఁ డని నిర్బంధించి వశ పడనివారిని విక్రమము పేర్మి లోఁబఱుచుకొని కొన్నిసంవత్సరములు కారాగృహమున నుంచెను. అపుడు వారు జాత్యుచితసంస్కారవిహీనులై పెద్దకాలంబు కారాగృహంబున నుండ నోపక పద్మపతి కభివాదనాదుల నాచరింప నంగీకరించి తదనుగ్రహంబున వెడలి వింధ్యగిరిదక్షిణప్రాంతమున వంగకళింగాంధ్రాదిదేశములు చేరి యచ్చటచ్చట రాజ్యముల నాక్రమించుకొనిరి. ఇట్లు కాఁగా వారు పద్మపతివలన బహుకాలము జాత్యుచితసంస్కారహీనులై యొక తెగవారుగా నేర్పడి శూద్రప్రాయులై యున్నందున నేకులమువారనియుఁ జెప్పుటకు వీలు లేక పద్మనాయక కులమువా రని వ్యవహరింపఁ బడుచు వచ్చిరి. అనఁగాఁ బద్మపతి యనువాఁడు నాయకుఁడుగాఁ గల కులమువా రని యభిప్రాయము" ఇట్లు బొబ్బిలివారి రావు వంశీయ చరితము ౪౯ పేజిలో వ్రాయఁబడినది.'' అని వ్రాయించినారు. పద్మనాయఁడను నాతఁ డెవ్వఁడో వీరికి బోధపడ లే దని పై వాక్యములంబట్టి దెలియుచున్నది. అయిన నేతద్గ్రంథకర్తలు "బేతాళనాయఁడు రేచర్లవంశజులకు మూలపురుషుఁడుగా నుండినట్లు వెలమ కులమువారి కందఱకుఁ బ్రథమము పద్మనాయకుఁ డను నతఁడు మూలపురుషుఁడై మహాప్రసిద్ధుఁడుగా నుండి తన్మూలమునఁ గులము వా రందఱు పద్మనాయకకులమువా రని వ్యవహారింపఁబడుచున్నా రని చెప్పినం జెప్పవచ్చును గదా" యని వ్రాయుట వింతగ నున్నది. వెలమకులము వారి కందఱకుఁ బద్మనాయకుఁడు మూలపురుషుఁ డని చెప్పుటకుం గల యాధార మెయ్యదియుఁ గానం బడదు. పద్మనాయక కులముయొక్క యుదంత మెఱుంగక యె నాల్గవవర్ణములో నత్యుత్తమ మైన దని వ్రాయుటయు వింతగ నున్నది. చతుర్థవర్ణ

ములోఁ జేరిన తక్కిన శాఖలవారికంటె నెట్లుత్తమ మయినదో ప్రమాణములు చూపింపకపోవుట వలన నం దేద్దియో విశేషముండె నని బోధపడక పోదు. రావువంశీయచరిత్రమునందు "ఏకులమువారనియుం జెప్పుటకు వీలు లేక పద్మనాయక కులమువా రని వ్యవహరింపఁబడుచు వచ్చి" రని తేటతెల్లము సేయుచుండ వేఱుగ వ్యాఖ్యాన మేల? పద్మనాయకు లొకప్పుడు క్షత్రియులుగ నుండి శూద్రప్రాయు లయి పోయి రని తెలుపుచు అందులకుఁ బ్రమాణముగా ననేకక్షత్త్రియులు శూద్రులయిపోయిరని పురాణాదులలోనుండి కొన్ని వాక్యములను బ్రకటించి యుండిరి. అయ్యవి వీరినిగుఱించి వ్రాయఁబడినవి కావు.

> " వసిష్ఠ కౌండిన్య ధనంజయానాం
> గోత్రోద్భవా కాశ్యపగోత్రజాతాః
> శూద్రా ఇ వాత్యంతగృహీత వేషాః
> భూపా భవిష్యంతి కలౌ యుగే హి."

అని వసిష్ఠ కౌండిన్య ధనంజయ కాశ్యపగోత్రజాతు లయిన రాచవారిని గూర్చి చెప్పఁబడిన వాక్యములు గాని పద్మనాయకులను గూర్చి చెప్పినవి కావు. రావువంశీయ చరిత్రకారునకుఁ గూడ సందియము తోఁచి స్పష్టముగఁ జెప్పఁజాలక "అట్టివారు(శూద్రవేషధారులగు క్షత్రియులు) ఆంధ్రాది దేశములలోనే స్థిరపడిన ట్లుండుటం బట్టి వారే పద్మనాయకు లను నామముననుండిన శాఖవారుగా ననుమానింపఁబడుదురు." అని వ్రాసి యున్నారు. ఇటీవలి శూద్రులు క్షత్త్రియులై రనుటకుఁగారణమువర్ణాశ్రమధర్మములోఁ జేరినకులముచేతగాక క్షాత్త్రమును దాల్చి భూమిని జయించి పాలించుట యని చెప్ప వచ్చును. అట్టివారు పదునెనిమిది జాతులలోను గూడ నుండిరనుటకు లేశమాత్రమును సందియము లేదు. కాఁబట్టి పద్మనాయకుల

నిజస్థితి దెలిసికొనుటకుఁ బ్రయత్నింతము. ఈ వెలుగోటి వంశములోని వారి ప్రేరణముచేతనే వ్రాయింపఁబడిన పద్మనాయక చరిత్రమునం దు నేమి వ్రాయఁబడినదో విచారింతము. అందు వెలమల జన్మవృత్తాంతమును గూర్చి యీ క్రిందిరీతిని వ్రాయఁబడి యున్నది.

"క. శూరుల జన్మస్థానము
నారసి నియమింపఁ గూడ దది యె ట్లన్నన్
వీరులు షణ్ముఖమారులు
సూరిజనులఁ బోల మిగులఁ జోద్యం బగుచున్"

ఉ. కొందఱు రెడ్డినాయకులు గోప్యము నందిరి మానుషంబునన్
గొందఱు లక్కనాయకులు కుంభిని క్షీరజలోక్తిఁ బొల్చిరా
కొందఱు కొంకణోద్భవులు ఘోరపరాక్రమలీలఁ గ్రాలఁగా
నందఱు నేకమై ధరను నద్భుతలీలఁ జెలంగి రెంతయున్."

అని శూరులజన్మస్థానము నియమింపఁ గూడ దనియు మానుషవంతులును పరాక్రమవంతులునైన కొందఱు రెడ్డినాయకులును, కొందఱు లక్కనాయకులును, కొందఱు కొంకణోద్భవులును, ఏకమై యద్భుతలీల విహరించి రని నుడివియున్నాఁడు. మఱియు నాగ్రంథమునసే యనేక విధములుగా నాకాలమునాఁటి గాథలను బురస్కరించుకొని కాఁబోలు వచించియున్నాఁడు.

"గీ. కొంకణాదిక సేతువు కుంభినులను
నాంధ్రద్రవిడాదిదేశంబులందు వెలమ
పేరు ప్రఖ్యాతి నొంది విస్తార మగుచు
గరము బహుముఖవర్ణసంగతులఁ దనరి"

"క. లోహము తామ్రము సిద్ధుఁడు
సాహసమునఁ జేయి రజతస్వర్ణము భంగిన్
యాహతమైన కులంబున
నూహం బ్రబలించె నృవతి యుర్విపు లెన్నన్.

"క. మధుశ్రిత జలకణ సంతతి
ముద్రిత వరశుక్తి పతిత మూర్తము భంగిన్
శూద్రాభావం బయ్యెను
రుద్రక్షితిపాలు వాక్యరూఢిఁ జెలంగెన్"

"గీ. ఊరివరద నీరు సురకసరయుఁ జేరి
తీర్థయోగ్య మైన తెరగు గాదె
కాలచోదితమునఁ గాక తీశ్వరుఁ గొల్చి
కాపు లెల్ల వెలమ కమ్మ లైరి."

పద్మనాయక చరిత్రములో నుదాహరింపఁబడిన పై పద్యములను బట్టి కొంకణాది దేశములనుండి వచ్చిన కుంభినులు మొదలగు వారిని తక్కిన తెగల వారలు వెలమలుగ భావించి తమకన్నఁ దక్కువగఁ జూచుచున్నటులను వారలు శూద్రులు గాక పోయినను ప్రతాపరుద్రక్షితిపాలునిచే గౌరవింపఁబడి రనియు వెలమవారిలోను గూడ నూత్నరక్తము ప్రవహించుచుండె ననియు భావము సూచింపఁబడుచున్నది గదా. అప్పటికి వాడుకలోనుండు గాథలను బురస్కరించుకొని పద్మనాయక చరిత్రకారుఁ డట్లు వ్రాసియుండు ననుటకు సందియము లేదు. మఱియు నాతఁడు స్వవచనవ్యాఘాతముగా నా గ్రంథముననే మఱియొకచోట,

"క. తొలి కాల ముర్వి గొడవల
వెలియై యాలములయందు విహరించుటచే
నిల కాపుజనులు గొందఱు
వెలమ లనన్ జగతిలోన విశ్రుతు లగుటన్."

అనియు వ్రాసియుండెను. అంతటితోఁ దృప్తినొందక,

"క. పద్మం బోలెడు సద్మకు
సద్మగతి న్నాయకాఖ్య సరణిదలిర్పన్
సద్మ రమాతరుణీ ముఖ
పద్మమునం బొలుచు లక్ష్మీ భావ మనంగన్."

"గీ. దైత్యవిధ్వంసి పాదపద్మజు లటంచు
వేదములు పల్కుఁ గావున విదితముగను
శూద్రకులజులు నాట సంసూచితముగఁ
బద్మజఖ్యాతి నియమించి పలికి రపుడు."

అని విష్ణువుయొక్క పాదపద్మమునందుఁ జనించుటచేతఁ బద్మజులను సంజ్ఞకలిగి నటుల నుడివెను. అదియునుంగాక తక్కిన వెలమతెగలవారిని గ్రిందపఱుచుచు పద్మనాయకుల నధికు లని చెప్పి

"గీ. తారకలలోన గ్రహరాజు వేఱయైన
భాతి దశవిధ వెలమలఁ బాయఁ ద్రోచి
సప్తసప్తతి పద్మజసముదయంబు
పద్మనాయకు లనఁగను బ్రబలె జగతి."

అని పొగడి యున్నాఁడు. విష్ణువు పాదపద్మమునందు జనించుట చేతనే వీరికి పద్మజులను పేరు గలిగిన దనియు, అందువలననే పద్మనాయకు లను నామము వహించి రనియుఁ జెప్పుట సయుక్తికముగాఁ గనుపట్టదు. ఎందుకన విష్ణుపాదోద్భవసంభవుల మని పంటరెడ్లు, కమ్మవారు, మొదలగు తెగలవా రెల్లరును జెప్పుకొనియున్నవా రయినను వారలకు పద్మనాయకులను పేరు గ్రంథములను వినంబడదు. శ్రీనాథకవి తన భీమఖండమునందు వెలమలు గమ్మలు ఒంటరులు మొదలగు వారల నెల్లరను బద్మనాయకు లని చెప్పినట్లుగా నాకడనున్న ముద్రితప్రతిలో నున్నది. అయినను రావువంశీయ చరిత్రములో కీర్తిశేషులయిన గురుజాడ శ్రీరామమూర్తిపంతులు గారు పద్మనాయకులను వెలమలను వేర్వేఱు తెగవారినిగ శ్రీనాథ కవి పేర్కొనియెనని వ్రాసియున్నారు. అట్లయిన యెడల పద్మవెలమలకు పద్మనాయకులను నామము గలుగుటకు వేఱు కారణ ముండవలయు నని గనుపట్టక మానదు. ఎంత మందబుద్ధులకైనను పద్మనాయకకుల మన్నతోడనే పద్ముఁ డనువాఁడు నాయకుఁడుగాఁ గలిగిన సమూహ మని యర్థము గాక మానదు. అందువలన వేర్వేఱు తెగ

లనుండి యేకారణముచేతనో వేఱుపడి వచ్చి ప్రత్యేకముగా నొక తెగవా రయి రని తెలుపుటకుఁ బద్మనాయకకుల మనునదే సాక్ష్యముగ నున్నది. అందులకు గ్రంథముల నాధారము లేవైనఁ గలవా యని పరిశీలించినచోఁ గొంతవఱకుఁ గన్పట్టక మానవు.

పద్మనాయకులయొక్క పూర్వు లెవ్వరును తాము క్షత్త్రియ కులమువారని చెప్పికొని యుండ లేదు. పద్మనాయకులలో సుప్రసిద్ధులయిన రేచెర్లవారు చతుర్థవర్ణమునందు జనించినవార మని స్పష్టముగఁ దెలుపుకొనియుండ తద్వంశజులయిన వెలుగోటివారు ప్రకటింపించిన గ్రంథములందును రావువారు ప్రకటింపించిన గ్రంథములందును పద్మనాయకు లొకప్పుడు క్షత్త్రియకులమువారు గానే యుండి తరువాత శూద్రు లయి పోయి రనియు తక్కిన శూద్రజాతులవారి కెవ్వరికి క్షత్త్రియనామము వర్తింప దనియు వ్రాయఁబడియున్నది. ఇది యెంతమాత్రమును విశ్వసింపఁ దగినది కాదు. ఆంధ్రదేశములో క్షత్త్రియుల మనిపించుకొనుచున్న రాచవారి యొక్క పూర్వులు సయితము వారిశాసనములలో చతుర్థకులమువార మని చెప్పుకొని యుండఁగాఁ బెక్కుతెగలలో నుండి వచ్చి యేర్పడిన యీశాఖ వారు తాము మాత్రము క్షత్త్రియసంతతివార మనియుఁ దక్కిన వారు కా రని వ్రాయించుట వింతగా నుండకమానదు. అందునకు వీ రొక గొప్పకారణము దెలుపుచున్నారు.

సహపంక్తి భోజనము.

ఒకప్పుడు ఢిల్లీచక్రవర్తి దండెత్తివచ్చి విశేషసైన్యములతో నోరుఁగల్లు ముట్టడించినప్పుడు కమ్మసేనానులు చాలకాలము పోరాడి యోడిపోయి రనియు, తరువాత పద్మనాయకు లనంబడెడు నీ వెలమ వారు ప్రతాపరుద్రునితో "స్వామీ మేము దేవరకుఁగా ప్రాణములు సమర్పింప సిద్ధముగా నున్నాము. మేము జీవించియుండఁగా బర

రాష్ట్రులు కోటలోఁగా లిడరు. మేము విజయమునంది వచ్చితిమేని తమతో సహపంక్తియును సమానప్రతిపత్తియును నీయవేడెద" మని చెప్పఁగా నతఁ డందునకు సమ్మతించె నఁట! అప్పుడే వారలు ప్రాణముల కాసింపక కోటబురుజుల నాక్రమించి సంరక్షించుచు నుండుటచేత శత్రువులు చేయునది లేక విచ్చిపోయి రట! అపుడు ప్రతాపరుద్రుఁడు వాగ్దానము ప్రకారము వెలమవారియెడ మిక్కిలి కృతజ్ఞుఁడై వారలకు సహపంక్తి యొసఁగి గౌరవించె నఁట! మొదట కాకతీయులు కులముచేత క్షత్రియు లయినప్పుడు గదా యిట్టికార్యము యొక్క ఘనత వెల్లడి యగుటకనువై యుండును?

## కాకతీయులు చతుర్థకులజులు.

కాకతీయులు క్షత్రియకులమువారు కారనియు, చతుర్థకులజులే యనియు గొన్ని శాసనములలో స్పష్టముగాఁ గానంబడుచున్నది. అందొకటి మల్యాలగుండయ దండనాథుని యొక్కయు, గోనబుద్ధారెడ్డికూఁతురునగుకుప్పాంబయొక్కయువర్ధమానపుర దానశాసనము.1 దానిలో

" అసృజ చ్చతురో వర్ణాన్ ముఖభాహూరుపాదతః
అన్యా న్యచ్ఛాపచాదీని భూతాని స్థావరాణిచ.
" అథ స్వీకృతవర్ణోక్త ధర్మనిర్మలచేతసః
జాతాన్ ద్విజాతయః పశ్చా చ్చతుర్థకులముజ్జ్వలం."
" తత్రానేక నృపాల ఫాల లిఖితాం వీరాంకవర్ణావళిం
దర్శం దర్శ మనర్గళం సమచర త్త్రిద్రవః పరితాపానలః
యస్యోదంచిత కాకతీశ్వరకుల క్షీరాబ్ధి సంవర్ధన
ప్రోత్సాహకృతి చంద్రమా స్సమభవ త్ప్రోల్ఫాభిధానో నృపః"

అనియు, మఱియు నాతనియొక్క బూదపూరు (భూతపుర) శాసనములో

---

1 ఈశాసనము యొక్క ప్రతియును దీనిక్రింది శాసనము యొక్క ప్రతియును శ్రీయుత మానవల్లి రామకృష్ణకవి ఎమ్. ఏ. గారిచే నిటీవల నొసంగఁబడినవి.

తెలింగానాశాసనములు, పేజీ ౫౩, బూదపూరం శాసనము.

" తేషాం మహీయమహిమం మహితస్తురీయో
వర్ణాశ్రియః ప్రసవభూమి రతిప్రసిద్ధః
శుద్ధోఽభవ త్సమధికంచగుణార్ణవానాం
దుగ్ధాబ్ధివ త్స్ఫురుషరత్నగుణై రు పేతం
ప్రశస్త మస్తిత త్రాపి కాకతీయకులం (మహత్)"

అనియు వ్రాయఁబడియున్నది. ఇంతియ గాక కాకతీయ రాజులు చతుర్థాన్వయులయిన కమ్మనాటి వెలనాటి రాజులతో సంబంధములు చేయుచుండెడి వారని పూర్వప్రకరణముల ననేక దృష్టాంతముల శాసనములనుండి యెత్తి చూపించియున్నాను. కాఁబట్టి కాకతీయులతోడి సహపంక్తి భోజనము దొరకినమాత్రముచేత వీరలు తక్కిన వెలమ కమ్మశాఖల వారికన్నఁ గులాధిక్యము గలవా రని చెప్పుటకుఁ గారణ మగపడదు గదా! పద్మనాయకులు చెప్పుకొను పై గాథను బట్టి వీరలకుఁ బ్రతాపరుద్రునికిఁ బూర్వము వానితో సహపంక్తి భోజనము లేదని యర్థ మగు చున్నది గదా. అందునకుఁ గారణ మెద్దియో యుండ యుండక మానదు. ఇంతకుఁ బూర్వము పద్మనాయక చరిత్రము నందలి వీరల జన్మాదికమును గూర్చి నిగూఢముగా దెలిపిన పద్యములను వివరించి యున్నాను. అవి గాక పద్మనాయకచరిత్రము లోనివని మఱికొన్నిపద్యములు రావువంశీయుల చరిత్రము. నందు నుదాహరింపఁబడియున్నవి. అయ్యవి సత్యాన్వేషణ పరులైన వారిని గమ్యస్థానమునకుం గొనిపోవుటకుం జాలియున్నవి.

"సీ. రెడ్డిసంతతికి మాఱొడ్డిభేదం బైన
కుల ముద్ధరించి రీవెలమవారు
పద్మనాయకమానభంగంబు గాకుండ
బలియురై నెగడి రీవెలమవారు
గడిదేరి కాకతిగణపతి గొలిచియు
నిల నేలు ప్రభువు లీవెలమవారు
కాపులమాటకై కడగి వెలమలందు
నిలిచినశూరు లివెలమవారు
సమరగాంగేయపటిమచే జరుపువారు
మిగుల మానంబునకుఁ బ్రాణ మిచ్చువారు
వినయఘను లైన నెరమన్నె వెలమవారు
పద్మజఖ్యాతిచే భువిఁ బరఁగువారు."

అని పద్మనాయక చరిత్రమునం దొక పద్యము గానంబడు చున్నది. దీనిలోని "రెడ్డిసంతతికి మాఱొడ్డిభేదంబైన కుల ముద్ధరించి రీవెలమవారు" అను మొదటిచరణముయొక్క భావమును దెలిసి కొనవలసియున్నది. రెడ్లను బ్రతిఘటించి వేఱుపడిన కులము నుద్ధార ణము చేసి రని భావ మేర్పడుచున్నది. ఇందలి భావమును దెలుప పఱచునట్టి గాథ యెద్దైన గలదా యని మనము దెలిసికొనవలసి యున్నది. అయ్యది పల్నాటి వీరచరిత్రమునం గానంబడుచున్నది. అందు బ్రహ్మనాయఁడు నాయకురాలితోఁ జేసిన యుద్ధము కులము పోరని పలుతావులఁ బేర్కొనఁ బడియున్నది. అందు కులవిచక్షణము లేక బ్రహ్మనాయఁడు మాలలు, మాదిగలు, గొల్లలు, కంసాలులు, కమ్మరులు, కుమ్మరులు. రజకులు, రెడ్లు, మొదలగు తెగలవారితోఁ గలిసి చాఁపకూడుకుడిచె నని చెప్పఁబడి యున్నది. ఇట్టిచాఁపకూడు కుడుచుటకూడపల్నాటి యుద్ధమునకుఁబ్రథమకారణములలో నొక్క టిగా నున్న దని వల్లభామాత్య ప్రణీత మైన క్రీడాభిరామ మను గ్రంథమునందు.

"గీ ఆరువల్లి నాయినారి దుర్మంత్రంబు
కోడిపోరు చాఁపకూటికుడుపు
ప్రథమకారణములు పల్నాటి యేకాంగ
వీరపురుషసంప్రహారమునకు"

అని స్పష్టముగఁ జెప్పఁబడినది. "కోడిపందెములో సంభవిం చిన కలహ మీయుద్ధమునకు మూలకారణము" అని విల్సను గారు వ్రాసియుండఁగా వారు పల్నాటి వీరచరిత్రమును సరిగాఁగ్రహింప లేదని పల్నాటివీరచరిత్రములోని బాలచంద్ర యుద్ధభాగమునుప్రక టించిన శ్రీఉమాకాంతముగారు తమభావమును వెల్లడించినారు. పైనుదాహరింపఁబడిన క్రీడాభిరామములోని పద్యమునుబట్టికోడిపోరు గూడ పల్నాటియేకాంగవీరపురుషసంప్ర హారమునకుప్రథమకారణ ములలో నొక్కటిగా నున్న దని బోధపడకమానదు. ఈపల్నాటి వీరయుద్ధమున మాలలు గోసంగులు కూడ నాయకులుగ నుండి యుద్ధము చేసిరని పల్నాటివీరచరిత్రమునుండి కొన్ని దృష్టాంతముల

నింతకుఁ బూర్వము చూపించి యున్నాను. కాఁబట్టి పల్నాటి వీరులలో సుప్రసిద్ధుఁడైన రేచెర్ల బ్రహ్మనాయఁడు రెడ్డికులమునకు మాఱొడ్డి నానాజాతులలోనుండి నాయకుల నేర్పఱుచుకొని జాతి భేదములను బాటింపక పైని జెప్పిన కులములవా రందఱితోడను గలిసి భ్రాతృభావమును బలపఱుచుకొనుటకై చాఁప కూడుభుజించి ప్రతిపక్షులను జయించి కులము నుద్ధరించి గౌరవము దెచ్చినవాఁడగుటంజేసి పద్మనాయక చరిత్రములో "రెడ్డిసంతతికి మాఱొడ్డి భేదంబైన కులముద్ధరించిరీ వెలమవారు" అని వ్రాయుటసంభవించినది. బ్రాహ్మణులుసయితము పద్మనాయకులలోఁ జేరిరనియూహించుటకు గూడ పల్నాటి వీరచరిత్రమునఁ గొన్ని వాక్యములు గానంబడు చున్నవి. బ్రహ్మనాయనికొడుకైన బాలచంద్రుఁడు తనమిత్త్రుఁడైన అనపోతు అనెడి బ్రాహ్మణుని తనతోఁ గూడయుద్ధమునకుఁగొనిపోక మర్మము వెట్టి యాతని నింటికిఁ బంపినప్పు డాతఁడు బాలచంద్రుని కార్యమును గర్హించి యీక్రిందిరీతిని జింతించుచు పౌరుషముచే నాత్మహత్య గావించుకొని ప్రాణంబుల విడిచెను.

"వెంగలినైతిని వెలమలవద్ద
గలిమి కోసము వచ్చి కలియుట లేదు
కులమునఁ గాద వని కూడుట లేదు
తల్లిని తండ్రిని దాయాదిజనుల
నెడఁ బాసి నీ పొందు నే నమ్మియుంటిఁ
బగవాఁడ నైతిని బాంధవతతికిఁ
బాసి పోఁదగు నయ్యా బ్రహ్మన్నతనయ"

పల్నాటి భూమిపతులు గూడ గొల్ల సవతి తల్లుల బిడ్డ లని స్పష్టముగ "క్రీడాభిరామ" మను గ్రంథమున నీ క్రింది పద్యములో వాకొనఁబడియున్నది.

"సీ. ఇచ్చోట భుజియించి రేక కార్యస్థులై
సామంతనృపతులు చాఁపకూడు
ఇచ్చోటఁ జింతించె నిచ్చ నుపాయంబు
నలినాక్షి యాకొమ్మ నాయిరాలు
నిజ మను శుద్ధికై నిప్పుల యేటిలో
నోలాడె నిచ్చోట బీలసాని

యిచ్చోటఁ బోరిరి యిల పణంబుగ గొల్ల
సవతితల్లులబిడ్డ లనఁ బతులు
ధీరులగు వార లేవురు వీరపురుషు
లై మహోద్ధతి నిచ్చోట నాజిఁ బడిరి
యనుచుఁ జెప్పుదు రైతిహ్య మచట నచట
జనప పెద్దలు పల్లెదేశములయందు.''

హైహయవంశజుల మయిన క్షత్త్రియుల మని చెప్పుకొనెడి రాచవారుసయితము "గొల్ల సవతి తల్లుల బిడ్డలని'' పేర్కొనఁబడు చుండఁగాఁ బద్మనాయకులు కులమునఁ దక్కినవారలకన్న నెట్లధికు లగుదురో యూహింప నలవిగాక యున్నది. గొల్లలు ధర్మశాస్త్రము నందు సచ్ఛూద్రులని పరిగణింపఁబడినవా రగుటచేత వెలమలకు, రెడ్లకు, కమ్మవారికి గృహసేవకులుగ నుండి వంట మొదలగు పనులు చేయుచుందురు. వల్లవుఁడనగా గొల్లవాఁడని మాత్త్రమె గాక వంట లవాఁ డని యర్థముకూడ గలదు. పద్మనాయకులలో "వల్లవాదిత్యా నల్లవత్రినేత్రా వల్లవచక్రవర్తి'' యను బిరుదములు గలవారు వల్లవులనియు, వారు ౭౭ గోత్రములలోని వారనియు రావువంశీయుల చరిత్త్రమున మొదట నుదాహరింపఁబడిన గోత్రవివరణముం గూర్చిన పట్టికవలనఁ దెలియుచున్నది. పద్మనాయకులలోఁ గొందఱు "గోసంగి వైరి తలగుండు గండా'' యను బిరుదును వహించినవారు గోసంగు లనియె యూహింపనలసియుండును. ఎన్నివిధములుగా నాలోచించి నను బ్రహ్మనాయఁడె నానాజాతినాయకుల నొక్కచోటికిఁ జేర్చి రెడ్లతో ప్రతిఘటించి పోరాడినవాఁడు. వాని తరువాతనే పద్మనాయ కులు కాకతీయులను గొల్చుచు గణపతిచక్రవర్తి రుద్రమదేవి ప్రతాపరుద్రచక్రవర్తి మొదలగువారి పాలనములో గొప్ప పదవులను వహించి కాకతీయ రాజ్య సంరక్షకులై యొప్పిరి ఈపద్మనాయకులలోఁ గొందఱు "బిరుదునాయకురాలి రణరంగ రాఘవ త్రిసహస్రబాహో'' యను బిరుదును వహించినవా రుండుట చేత వీరలు బ్రహ్మనాయని కాలములో నాయకత్వమును బొందినవా రనుటకు సంశయము కలుగరాదు. పద్మనాయకులలోఁ గొందఱు "వాలు చెవులును వేలుగడ్డమును కుమురకుం గొండనారికె గల

రెడ్డినాయకచ్ఛాళ్లా, గుండిచెర్వుకట్టమెక్కి- చెడ్డమార్గంచు గవిని దూరే రెడ్డినాయకచ్ఛాళ్లా" మొదలగు బిరుదులను వహించినవారగుటచేత రెడ్లకుఁ బ్రబలవైరులుగ నుండి రని వేద్య మగుచున్నది. బ్రహ్మనాయనియన్న బాదన్న యని పల్నాటి వీరచరిత్రమున వ్యవహారింపఁబడినది. బాదన్న యనునది పద్మన్న యను పేరికి వాడుకగా వ్యవహరింపఁబడిన నామము. కాఁబట్టి బ్రహ్మనాయనియన్న యగు పద్ముఁడు నాయకుఁడు గాఁగల కులమని చెప్పవచ్చును. కాని మాదృశ్యుడయిన పద్ముఁడు నాయకుఁడని చెప్పినచోఁ బొసఁగ నేరదు. ఆపద్ముఁడు పద్మసాలెకులమునకు సంబంధించినవాఁడుగఁ గన్పట్టు చున్నాఁడు. ఎట్లయిన నేమి పద్మనాయకులు బ్రహ్మనాయని కాలముననే ప్రఖ్యాతిని గాంచి యుండిరి. పద్మనాయకులలో ననేకులు మొట్టమొదట రాష్ట్రకూటులకు రాజధానిగ నుండిన మాన్యఖేతమున (మన్నెఖేడము) నుండుచు వచ్చి యారాజ్య మంతరించిన వెనుక ననేకులు పల్నాటికి వచ్చి చేరిరి. కొందఱు గిరిదుర్గముల కధిపతులై మన్నెలను పేరితో వ్యవహారింపఁబడుచు వచ్చిరి. వీరిలో ననేకులు, మాతంగులు, గోసంగులునై యుండిరనియు, వీరలకు నెఱమన్నెలు, సురమన్నెలు నను నామములు గలవనియుఁ జెప్పుటకుఁ గూడ గొన్నిదృష్టాంతములవలన నవకాశము కలుగుచున్నది. పద్మనాయకుల జన్మకథన మెట్టిదైనను, ఉత్తరహిందూస్థానమున రాజపుత్త్రులనెడు మహావీరు లెట్టిపౌరుష పరాక్రమంబులు నెఱపిరో అట్లే యీదక్షిణహిందూస్థానమున వెలమవీరులు అత్యద్భుతములయిన పౌరుషపరాక్రమములం జూపి వాసికెక్కిరి. ఈవెలమవారు, కమ్మవారు, రెడ్లు, రాచవారు, తమలోఁ దాము పోరాడక కేవలము దేశాభిమానమే విధ్యుక్తధర్మమని యైకమత్యముతో నుండిన యెడల దక్షిణహిందూదేశమున మసల్మానుల కడుగుపెట్టసాధ్యము గాక యుండెడిది. ఉత్తరహిందూస్థానమున రాజపుత్త్రులం బోలె ఈ తెగలవారు దక్షిణహిందూస్థానమున బహుశతాబ్దములు మహమ్మదీయులతోఁ బోరాడి వాసికెక్కి విద్యానగర సామ్రాజ్య మస్తమించిన వెనుక దమస్వాతంత్ర్యముల గోలుపోయిరి.



# కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము.

## పండ్రెండవ ప్రకరణము.

## శ్రీ రుద్రమదేవి పరిపాలన చరిత్రము.

(క్రీ. శ. ౧౨౬౦ మొదలుకొని క్రీ. శ. ౧౨౯౬ వఱకు.)

### కాకతిరుద్రమదేవిభర్త చాళుక్య వీరభద్రుఁడు.

కాకతిప్రోలరాజు త్రైలింగ్య సామ్రాజ్య ప్రతిష్ఠాపనకై తన జీవితము సర్వస్వమును సమర్పించి సామ్రాజ్య భవనమునకుఁ బునాదు లేర్పరించెను. మొదటి ప్రతాపరుద్రదేవుఁడు సామ్రాజ్య విస్తృతికై తన జీవితము నంతయు వినియోగించినాఁడు- కాకతిగణపతిదేవ చక్రవర్తి పితృదత్తమయిన యాసామ్రాజ్యము నే శత్రువుల బాఱినుండి తప్పించి నిష్కంటకము గావించి యవక్రపరాక్రమముతో నఱువది రెండేండ్లకాలము నాంధ్రదేశము నేకచ్ఛత్రముక్రిందకుఁ గొనివచ్చి పరిపాలనము చేసి తనయనంతరము సామ్రాజ్యమునకు నెట్టియుపద్రవముఁ గలుగకుండుమార్గమును ద్రొక్కినాఁడు. ఎందఱు

భార్యలను గట్టుకొన్నను నీతనికిఁ బురుషసంతానముఁ బ్రాప్తిం పఁలేదు. ఇతని పట్టపురాణి సోమాంబాదేవి. ఇంతవఱకుఁ దెలిసిన దానిఁబట్టి యీతని కిర్వురు కొమార్తెలు గలరు. రుద్రాంబ మొదట జనించినది. తరువాతఁ బుట్టినది గణపాంబ. నేనీ యాంధ్రులచరిత్రము వ్రాసి ప్రకటించు వఱకుఁ బూర్వగ్రంథములలోను నూతనగ్రంథములలోను గూడ రుద్రాంబ గణపతిదేవ చక్రవర్తి భార్యయని వక్కాణింపఁబడి యుండుటంజేసి యాంధ్రప్రపంచ మట్లే యవిచార పూర్వకముగా విశ్వసించి యుండెను. కాని నిక్కము విచారింపనామె యాతనికొమార్తగాని భార్యకాదని విస్పష్టము కాఁగలదు. రుద్రాంబాదేవి గణపతిపుత్త్రికయై యుండఁగా భార్య యని వాడుకలోనికి వచ్చి విశ్వసింపఁబడుటకు హేతు వేమో యెంతమాత్రమును బోధ పడ కున్నది. రుద్రమదేవి పరిపాలనము చేయుచున్న కాలమున హిందూదేశమును జూడవచ్చిన "మార్కోపోలో" అను వెనీసు వర్తకుఁ డొకఁడు "కాకతి గణపతి యనంతర మతనిభార్య రుద్రమదేవి యతని కంటెను మిక్కిలి వైభవముతో రాజ్యము చేయుచున్నది." అని నుడివి యున్నాఁడు. విదేశీయుఁడగుటఁ జేసి యతఁడట్లు వ్రాసియుండునని యూహింతమన్నను, స్థానిక వృత్తాంతములలో సయితము భార్య యనియే చెప్పఁబడినది. స్థానిక చరిత్రములోని విషయము లన్నియు పరమసత్యములనుగా మన మెంతమాత్రమును భావింపరాదు. అయ్యవి యవిమర్శపూర్వకముగాఁ బ్రజలచేఁ జెప్పుకొనఁబడునట్టి గాథలను బురస్కరించుకొని వ్రాయఁబడినవి. ఈగాథలను వినియుండుటచేతనే కాఁబోలు మహామహోపాధ్యాయ కోలచల మల్లినాథసూరిగారి పుత్త్రుండగు కుమారస్వామి సోమయాజిగారు సంస్కృత ప్రతాపరుద్రీయమునకు వ్రాసిన వ్యాఖ్యలో నొకచోట

" పురా కిల కాకతికులసంభూతే గణపతినామ్ని మహారాజే, దుహితృ మాత్రసంతానే, కదాచి ద్దైవ యోగేన కాలపరిపాక ముపేయుషి, తన్మహిషీ రుద్రదేవీనామ రాజ్ఞీ, బహూని వర్షాణి తద్రాజ్య మకంటకం పరిపాల్య, పరిణతా సతీ దౌహిత్రే ప్రతాపరుద్రే రాజ్యధురాం నిదధే. తా మిమాం కథాం మనసి నిధాయాహ యో రుద్ర ఇతి "

అని వ్రాసియున్నారు.

"పూర్వము కాకతికుల సంభూతుఁ డగు గణపతిమహారాజు పుత్రికా సంతానము మాత్రము కలవాఁడై దైవయోగముచేతఁ గాలగతిని జెందఁగా నతని భార్యయగు రుద్రాంబిక రాజ్యభారమును వహించి అనేక సంవత్సరములు నిష్కంటకముగాఁ బరిపాలనముచేసి తాను వృద్ధురా లగుటయును, తన దౌహిత్రుఁడు వయస్సు వచ్చిన వాఁడగుటయును తలపోసి రాజ్యభార మాతనికి నొప్పగించె నని" ఈ మహావ్యాఖ్యాత ఇట్టి భ్రమ నొందుటకు కారణము ప్రతాప రుద్రీయములో

" శ్లో॥ యో రుద్రో రజతాచలే స్థితి మగా దర్ధాంగనారీః పురా
సోఽయం సంప్రతి కాకతీశ్వరకులే సర్వాఙ్గనారీః స్థితః
స్థానే యద్విషమావలోకనకళా మాత్రేణ భస్మీకృతా
న్యాస స్త్వైరిపురాణి చిత్ర మధునా ఖడ్గే విషం ధార్యతే "

అని మొదలుగాఁగల చోటులఁ బుంలింగముగా ప్రయోగింపఁ బడి యుండుటయెగాని యన్యముగాఁ గనుపట్టదు. అర్ధాంగనారియై కైలాస మందున్న రుద్రుఁడు కాకతివంశమందుఁ బూర్ణముగ స్త్రీ శరీరమునే ధరించియున్నవాఁడని పైశ్లోకమునందుఁ జెప్పబడియుండుటచేత వ్యాఖ్యాత పాఠకులకు దానిని బోధపఱుచుటకై పైని వ్యాఖ్యానములో వివరించినవిధముగా రుద్రమదేవి గణపతిభార్య యని సంబంధమును దెలిపియుండెను.

రుద్రమహాదేవి గణపతిభార్య యని గ్రంథకర్త లనేకులు వారికిం దోఁచినట్లుగ వ్రాయుట వింతగా నుండక మానదు. వచన సోమదేవరాజీయమునందు "గణపతి సకలసేనాసమేతుండై మహాదేవ రాజసమేతముగ దేవ గిరిమీఁదికి దండు వెడలి వారితో మాస త్రయంబుయుద్ధముచేసియందుగదాయుద్ధమున మహాదేవరాజుసమసిన నది గని గణపతిమహారాజు క్రోధాన్వితుండై జగడంబు చేసి దేవగిరి రాజును జంపిన వారు శరణాగతులై తమ కూఁతురగు రుద్రమహాదేవిని గానుకఁగాఁబెట్టినవారు పడుచును గైకొని యేకశిలానగరమునకువచ్చెను." అని రుద్రమదేవి దేవగిరి యాదవరాజు కుటుంబమున జనించిన దని కూడ చెప్పిరి. ఇది పద్యకావ్యము ననుసరించి వ్రాయఁబడిన వచనకావ్యము గావున నక్కడఁగూడ ఇదే రీతిగఁ జెప్పఁబడి యుండును. ఇట్లే స్థానికచరిత్రములందును వ్రాయఁబడినది. మార్కో-పోలో వ్రాఁతను బట్టి పాశ్చాత్యులు కూడ కొందఱు భార్య యని వ్రాసిరి. వీనినన్నిటినిజూచి ఆంధ్రకవుల చరిత్రములో శ్రీవీరేశలింగము గారు రుద్రమదేవి గణపతిభార్య యని వక్కాణించి యున్నారు. కీర్తిశేషులయిన శ్రీరామమూర్తిగారును కవిజీవితములయందు మొదట గణపతిభార్య రుద్రమదేవియని యుదాహరించినారు గాని డాక్టరు హుల్ట్జుగారు "ఇండియన్ అంటిక్వెరీ"లో వ్రాసిన లేఖనమును జూచిన తరువాత వెనుకటి యభిప్రాయమును మార్చుకొనిరి. హిందూదేశ కథాసంగ్రహములో ప్రథమభాగమున శ్రీ కొమరరాజులక్ష్మణరావు ఎం. ఏ. గారు కూడ రుద్రమదేవి గణపతిభార్య యనియె చెప్పి యున్నారు ఇంతియ గాక క్రిందటి సంవత్సరమున ప్రకటింపఁబడిన శ్రీ వెలుగోటివారి వంశచరిత్రమునందు సయితము రుద్రాంబిక గణపతిదేవుని కూఁతురను వాదము గలదని యెఱింగియు విమర్శింపక దానిని విస్మరించి రుద్రమదేవి గణపతిభార్య యని కంఠోక్తిగాఁజెప్పఁబడియెను. ఇట్లిందఱు గ్రంథకర్తలు పరమవిశ్వాసభావముతో నంగీక

రించిన ధ్రాసింత మనునో్ౕరిచిపుచ్చుటకు హేతువులేవియని చదువరులు బ్రశ్నింపవచ్చును. రుద్రాంబిక గణపతిపుత్రురని చెప్పుటకు బలవత్తర మయిన ప్రమాణముగలదు. వానిందెలుపుటకుఁ బూర్వము పైనుదహ రించిన యభిప్రాయములను గూర్చి యొకింత విమర్శచేయవలసి యున్నది. ఆయభిప్రాయములలో నొక్క ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత యభిప్రాయమును విమర్శించిన పక్షమునఁ దక్కినవన్నియు విమర్శింప నక్కఱలేకయె మనకు సత్యము గోచరముకాఁగలదు. ఏకారణము చేత నట్లు వ్రాసినను ఈసందర్భమున వ్యాఖ్యాతవిభ్రాంతి నొందె ననుటకు సందియము లేదు.

విద్యానాథమహాకవిప్రణీతమైన ప్రతాపరుద్రీయమును బరి శోధించి రుద్రాంబిక గణపతిదేవుని కొమార్తె యని మొదట కనిపెట్టిన వాఁడు శాసనపరిశోధకుఁడైన "హుల్ట్జు" అను జర్మనీ దేశపండితుడు ఈయన క్రీ.శ.౧౮౯౧-వ సంవత్సరమున జూలైనెలసంచిక "ఇండియన్ ఆంటిక్వెరీ" అను గ్రంథములో ౧౯౭-వ పేజీలో కాంచీపురములో గణపతిదేవుని కాలమున వ్రాయఁబడిన దానశాసనము నొకదానిం బ్రకటించుచు, అందు గణపతికి వెనుక రాజ్యమునకు వచ్చిన వారిని నిర్ధారణసేయుచుఁ ఈక్రిందిరీతిని వ్రాసి యున్నాఁడు.

"ఆమెతండ్రిగణపతి పుత్రసంతానము లేనివాఁడయినందున నామెను (రుద్రాంబిక) కుమారునిగానే పేర్కొని రుద్రుఁడని పురుష నామమును బెట్టెను. అతని మరణానంతరము ఆమె సింహాసన మెక్కి నట్లు గాన్పించుచున్నది. ఆమె "రాజు రుద్రమహారాజు" అని మూల గ్రంథములోఁ బేర్కొనఁ బడియుండఁగా వ్యాఖ్యానములో రుద్రాంబిక యని పేర్కొనఁ బడియెను."

ప్రతాపరుద్రీయములో నాటకప్రకరణములో నొకచోట.—

"శ్లో. సైవోమా చేతి నిర్దిష్టా సోమా చేతి ప్రథా మగాత్
తవ మాతా శివా సాక్షా ద్దేవో గణపతిః పితా."

అని పురోహితుఁడు రుద్రాంబికతల్లి సోమాంబను ఉమాదేవి యనియు, తండ్రియైన గణపతిని శివుఁ డనియు రుద్రాంబికతో పలికి నట్లుగాఁ జెప్పఁబడినది.

ఇదివఱకే వ్యాఖ్యాత రుద్రాంబిక గణపతి దేవుని భార్య యని చెప్పియున్నవాఁ డగుటచేత

"వ్యా. రుద్రాంబాయాః పితరౌ సోమాంబాగణపతిదేవౌ తయో రుమా
మహేశ్వరాత్మకత్వం లోకవిదితం। తతః స్వయంభూమహారాజయోః
పితాపుత్త్రీభావోఽస్తి"

అని వ్రాసి యీసోమాంబయు గణపతియు కాకతీయులుఁ గాక వేఱుకుటుంబములోని వారని భావించెను. ఈ విషయమును గూర్చి ప్రతాపరుద్రీయములో నాటకప్రకరణములో అంకారంభమున పురుష నామమును దాల్చి పురుషవేషముతో నున్న రుద్రాంబికతో పురోహితునకును మంత్రికిని జరిగినసంభాషణములను గూర్చి శ్లోకముల నుదాహరించిన యెడల నందలి నిజము చదువరులకు విస్పష్టము కాఁగల దను భావముతో వాని నిట నుదాహరించుచున్నాను.

"తత్ర ప్రవిశతి యథానిర్దిష్ట వేషో రాజా చామర గ్రాహిణీచ
రాజా.—సహర్షాతిశయం। అయే ప్రసాదాతిశయః పరమేశ్వరస్య

శ్లో॥ సోమార్కాభిజనం త మద్య జయతి శ్రీకాకతీయాః స్వయం,
పాతివ్రత్య ముపైతి సాంప్రత మమీ ష్వస్మాసు విశ్వంభరా
అస్మాభీ ర్నిజదోః ప్రసూతి మధునా ధన్యా మజో మన్యతే
యత్కర్తవ్య ముపాదిశ త్కులపతి ర్దేవ స్స్వయంభూస్స్వయమ్॥

పురోధసః.—మహారాజ భవాదృశా ఏవ పర మర్హంతి తాదృశ మహిమ్నో దేవస్యహితోపదేశాన్॥ అథవా కి మత్రాభినవం। పుత్రాణాం హితోపదేశాధికారః పితు రేవ య థేష్టం కథియాంతి తద్విదః॥

శ్లో॥ సైవ్యోమా చేతి నిర్దిష్టా సోమాచేతి ప్రథా మగాత్
తవ మాతా శివా సాక్షాద్దేవో గణపతిః పితా."

మంత్రిణః—ఏవమేవైతత్, అన్యథా కథమీశ్వరస్య ప్రసాదాదృతే నిరంకుశం స్త్రీవ్యక్తివిశేషస్య లోకాధిపత్యం। ఏవం మానుషశంభునా గణపతిమహారాజేన అభ్యంతర స్యానుభవమహిమ్నః సదృశ మత్ర పుత్రి ఇతి వ్యవహారః కృతః। తదనుగుణా చ రుద్ర ఇతి వ్యవహారః కృతః। తదనుగుణాచ రుద్రఇ త్యాఖ్యా"

"రాజు (పురుష వేషముతో నున్న రుద్రాంబిక) రంగస్థలమునకు నేతెంచి కాకతీయులకు కులదేవుఁ డయిన స్వయంభూదేవుఁడు భవిష్యత్కాలమున నెట్లు రాజ్యపరిపాలనము నిర్వహింపవలయునో ఉపదేశ మిచ్చుటకై తనస్వప్నములో సాక్షాత్కరించె నని చెప్పెను.

అంతట పురోహితుఁడు "నీవంటి ప్రజలుమాత్రమే స్వయంభూదేవుని సాక్షాత్కారమును ఉపదేశమును బొందుటకు నర్హులనియు, అట్టిది కుమారునకు తండ్రి చేయవలసిన విధ్యుక్తధర్మములలో నొక్కటి గావున నందు నూత్న విశేష మేమియును లే దనియును, నీతల్లికి సోమాంబ యనియు, నీతండ్రికి గణపతి యనియు నామములుండుటచేత స్వయంభూదేవుని (అర్ధనారీశ్వరుని యొక్క యొక యాకృతి) సంతాన మనిపించుకొనుటకు నీకు సత్త్వము గలదనియు" ప్రత్యుత్తరము చెప్పెను.

అటుపిమ్మట మంత్రి "అట్లు కాదేని నిరంకుశాధికారముగల యొక మహారాజువలె నొక స్త్రీ దేశమును బరిపాలించుట యెట్లు సాధ్యమగును కనుకనే ఈశ్వరాంశసంభూతుఁడైన గణపతిమహా

రాజు తన దివ్యజ్ఞానముచేత తనకు జనించియుండిన బిడ్డ దేశపాల నము చేయుటకుం దగిన గుణవిశేషములు గలిగియున్న దని తెలిసి కొని లోకవ్యవహారము కొఱకు కుమారుం డనియే ప్రకటించి రుద్రదేవుఁ డని నామకరణము చేసె'' నని చెప్పి పై పురోహితుని యభిప్రాయమును బలపఱిచెను.

ఈ భావమె పైన నుదాహరించిన శ్లోకములలోను వాక్యము లలోను స్పష్టముగాఁ గనుపట్టుచున్నది. దీనింబట్టి వ్యాఖ్యాత చెప్పిన విధముగా రుద్రాంబికతండ్రి కాకతి గణపతి చక్రవర్తి గాక మఱి యొక గణపతి యని యూహించుటకు ననువుపడునా? అట్లయిన యెడల కాకతి సామ్రాజ్యము భర్తయైన కాకతి గణపతిచక్రవర్తి వలనఁ గాక తండ్రియైన గణపతివలన రుద్రాంబికను సంక్రమించిన దని చెప్పవలసి వచ్చును. అది చరిత్రాంశమునకు విరుద్ధ మని యెఱుం గుదుము. కనుక పై సంభాషణముల యందలి భావమువలన కాకతి గణపతిచక్రవర్తికి రుద్రాంబిక కూఁతురనియు, పుత్త్రులు లేనికారణ మున నామెను పుత్త్రినిగాఁ జూచుకొనుచు నామెకు రుద్రదేవుఁ డనియె పురుషనామ ముంచె నని సుస్పష్ట మగుచున్నది. శ్రీరామ మూర్తిగారు కవిజీవితములయందు మొదట తక్కిన వారివలెనె భ్రమపడి భార్యయని వక్కాణించి యున్నమాట వాస్తవమెగాని తరువాత పైనిజెప్పిన విధముగాఁ గనఁబఱిచి పుత్త్రిక యని సిద్ధాం తము చేసియున్నారు. ఇట్లని యెఱుంగక వెలుగోటివారి వంశచరిత్ర మునందు భార్య యని కవిజీవితములయందు వ్రాసిన వాక్యములు ప్రమాణములుగా నెత్తి చూపఁబడినవి గావున నయ్యవి నిష్ప్రయో జనములు. డాక్టరు హూల్ట్జుగారు గాని శ్రీరామమూర్తిగారు గాని శాసన ప్రమాణ మేమియుఁ జూపినవారు కారు రాబర్టు స్యూయల్

గారు మాత్రము గుంటూరు మండలములో కాకాని గ్రామములో నొక శాసనము గల దని నుడివి యందును గూర్చి యిట్లు వ్రాసి యున్నారు.[1]

"ఓరుగంటి రుద్రమహాదేవి రాజ్య పరిపాలన కాలమున శా. శ. ౧౧౯౨ క్రీ. శ. ౧౨౭౦ సంవత్సరములో కృష్ణామండలములోని (ప్రస్తుతము గుంటూరు) కాకాని (కుక్క-కాకాని) గ్రామములో గోపాలస్వామి గుడికి నెదుట నొక శిలాశాసనము గలదు. కాకతి గణపతి దేవుని కూఁతు రని చెప్పఁబడినది కావున నీ శాసనము మిక్కిలి ముఖ్య మయినదిగా నున్నది.

అని వ్రాసియున్నారు కాని శాసనమును జక్కఁగాఁ బరిశీలించి దాని ప్రతి నెత్తికొని వివరముగా వ్రాయుట కాయన శ్రద్ధ తీసికొని యుండలేదు కనుక సందేమి కలదో యింతవఱకు నెవ్వరును జెప్పియుండలేదు.

వెలుగోటివారి వంశచరిత్రము ప్రాఁతగ్రంథమునందు

"గీ. ఘనత నాప్రసాదిత్యుండు కాకతిగణ
పతి చనిన నతని సుతకుఁ బట్టణంబు
రమణతోఁ గట్టి కాకతి రాయరాజ్య
స్థాపనాచార్య బిరుదు దాఁ దనరఁ గాంచె"

అని కొమార్తెగాఁ జెప్పఁబడినది. అయినను వెల్లాల సదాశివ శాస్త్రిగారిచే విరచితమైన నూత్న గ్రంథ మగు వెలుగోటివారి వంశ చరిత్రమునందు పై విధముగా వ్రాయుట లేఖకప్రమాదమనియు, అతని సుతకు బదులుగా "అతని సతికి" అని యుండినను నుండవచ్చు నని సెలవిచ్చి యున్నారు. పైని జూపిన ప్రమాణములను బట్టియు ఈక్రిందఁజూపబోవు శాసనప్రమాణమును బట్టియు, పూర్వగ్రంథ మునం జెప్పబడిన ప్రకారము కొమార్తె యనియే సిద్ధాంత మగుచు న్నది.

---

1. Lists of Antiquities Vol. I, Pp. 74 ar d 75.

కూఁతురనుటకు బలవత్తరమైన ప్రమాణము.

ఇంతవఱకు ఏచరిత్రకారులును ఏశాసనపరిశోధకులును చూపింపని బలవత్తరమైన శాసన ప్రమాణమును గనఁబఱిచి రుద్రాంబిక గణపతిచక్రవర్తి కొమార్తెయని నిశ్శంకముగా సిద్ధాంతము చేయుచున్నాను. గుంటూరుజిల్లాలో మంగళగిరి తాలూకాలో చేరినశ్రోత్రియాగ్రహారమైన మల్హాపురమను గ్రామమునకుఁ బడమట విశ్వేశ్వరస్వామివారి యాలయమునకు ముందర నున్న శిలాస్తంభము మీఁదిశాసనము కాకతి రుద్రాంబకాలమునను రెండవప్రతాపరుద్రునికాలమున నున్న కాకతీయ గురుపరంపరలోనివాఁడగు విశ్వేశ్వరశివునికిరుద్రాంబచేసిన దానశాసనమైయున్నది. ఇందు కాకతీయ వంశమభి వర్ణింపఁబడినది. ఇందు శాసనమును వ్రాసినకవి గణపతి చక్రవర్తిని వర్ణించుచుకడపట—

" కతి కతిన సంతి భూపాః కతి కతి వా గుణగణాభరణాః
గణపతినృపతి స్త్వేకో నరపతిశతపోషకః క్షోణ్యాం॥
నిస్సాణరవసంత్రస్తాః క్షణాద్గణపతేర్నృపాః
అపి త్యజంతి దుర్గాణి నధరామైవ కేవలం॥

అని చెప్పిన తరువాత రుద్రదేవిని గూర్చి (ప్రారంభించి

" రుద్రమదేవీ సముదభూ త్కారుణ్యా త్సర్వభూభృతాం
గంభీరాన్మహత స్తస్మాల్లక్ష్మీ రత్నాకరాదివ॥
సర్వోర్వీశకిరీటకుట్టిమతటీవిన్యస్త పాదాంబుజా
శా స్త్యేషా చతురంబురాశిరసనాం శ్రీరుద్రదేవీ భువం।
యస్యాజన్మమహోత్సవేగణపతేఃక్ష్మాపాలచూడామణేః
విస్ఫూర్జత్కలికాలకల్మషకథాధ్వాంతౌఘు తేజోనిధిః॥
సామ్రాజ్యేఽఖిలవర్జితం విరచితే శ్రీరుద్రదేవ్యా స్వయం
చాతుర్వర్ణ్యనిజస్థితి ర్విజయతే విద్రాతి కాలః కవిః॥
ధర్మోఽసౌ భగవాన్విభాతి దురితం దూరేద్విజానాంద్విషః

తన్నామగ్రహభూషితా నిజపురాన్నిర్యాంతి పర్యాకులాః॥
ఆక్రామంతి తరత్తరంగ విగళద్దుగ్ధాబ్ధిఫేనావలీ
రాచామంతిశరచ్ఛశాంకవిసరజ్యోత్స్నాప్రవాహామృతమ్
ఆకర్షంతి సురేంద్రదంతిదశనప్రాకారలగ్నాం శ్రియం
ముక్తాహారలతాయితా, ప్రతిదిశం రుద్రాంబికాకీర్తయః ''

అని రత్నాకరమునందు లక్ష్మియుదయించినట్లుగానే గణపతి దేవునికి రుద్రదేవి జనించెనని చెప్పియామెను విశేషముగా నభివర్ణించి యున్నాఁడు. ఇందువలన రుద్రదేవి గణపతిదేవచక్రవర్తి కూఁతురనుట నిర్వివాదాంశ మని చరిత్రమున స్థాపిత మగును.

ఒక్క మల్కాపుర శాసనమందే గాక కోటగిరి తామ్రశాసనము, కొలనుపాక, పానుగల్లు శాసనములు, అని తల్లికలువచేరుశాసనమునందును, గూడ రుద్రాంబ గణపతిదేవ చక్రవర్తి కొమార్తె యనియే చాటుచున్నవి. కొలను గణపతిదేవ కవి విరచితమైన "శివయోగసార" మను గ్రంథమునఁ గూడ—

'' వెండియు గణపతిధరణీ
మండలపతి పుత్రి రుద్రమహీదేవి కొగిన్.''

అని కూఁతురనియె వక్కాణింపఁ బడెను. ఈవిషయము నేటిచరిత్రకారులందఱ అంగీకరించిన విషయమే గనుక నికముందు దీనింగూర్చి మెట్టిచర్చతోను నిమిత్తములేకయె స్థిరపడిన చారిత్రకాంశముగనే గ్రహింపఁదగును.

రుద్రాంబ రాజ్యభారమును పూనుట.

కాఁబట్టి కాకతి గణపతిదేవ చక్రవర్తి తనకు పురుషసంతానము లేని కారణమున తనకొమార్తెలలో నొకతెయగు రుద్రదేవిని కుమారునిగా భావించుకొని యామెకు రుద్రదేవుఁడనియె నామమును

పెట్టి పెంచెనని ప్రతాపరుద్రీయమను గ్రంథమును బట్టి మనము తెలిసికొని యున్నాము. కాకతి గణపతిచక్రవర్తి బ్రతికియుండగానే రుద్రదేవి రత్నసింహాసన మధిష్ఠించి యాంధ్రసామ్రాజ్యభారమును వహించిమిక్కిలిమనోరంజకముగాఁ బరిపాలనము సేయనారంభించెను.

ఈమె శా. శ. ౧౧౮౦ వ సంవత్సర మనఁగా క్రీ. శ. ౧౨౫౮ గవ సంవత్సరములో సింహాసన మెక్కెనని త్రిపురాంతక శాసనములలో నొక దానివలన బోధపడుచున్నది.1

ఈమె "రుద్రదేవమహారాజు" అను నామముతో వ్యవహరింపఁబడుచు వచ్చెను. ఈమె యప్పుడుపురుష వేషముతో నేకొల్వుకూటమునకు నేతెంచి మంత్రులతో రాజ్యాంగ విషయములను గూర్చి ముచ్చటించుచుండెనని తెలియుచున్నది. ఈమె చక్రవర్తి పుత్రికయగుటం జేసి యీమె కీర్తియె లోకమున వ్యాపించెనుగాని యీమె భర్త యెవ్వరో యాయన చరిత్రమెట్టిదో యాంధ్ర ప్రపంచమింతవఱకు సరిగా నెఱుంగదు.

కాకతిరుద్రమదేవిభర్త చాళుక్యవీరభద్రుఁడు.

కాకతీయ గణపతిదేవ చక్రవర్తికి రుద్రమమహాదేవియను కూతురుండినట్లును, ఆమెను, చాళుక్యవంశీయుఁడైన వీరభద్రేశ్వరుఁడు పెండ్లిచేసుకొని "ధాత్రీభారధురంధరుఁడైనట్లుగా, ఆతనిమంత్రి విష్ణువనునాతఁడు తనతల్లి తల్లాంబకు సుకృతమగు నట్లుగా శా. శ. ౧౧౮౧ వ సంవత్సరమున (క్రీ. శ. 1259) పశ్చిమగోదావరి మండలములోని తణుకుతాలూకాలో జుత్తిగగ్రామములోని శ్రీసోమేశ్వర స్వామి కఖండవర్తిదీప మొకటి సమర్పించినట్లు వ్రాయించినశాసనములో

1. Epigraphical Report for 1905-6.

" శ్రీమత్కాకతి వల్లభగణపతి
క్షోణీశ చూడామణేర్జాతారా
జ్యరమేవ రుద్రమహాదేవీను
రూపాన్వితా తాం సౌభాగ్యబలాదు
రూహ్యావిధివత్ చాళుక్య వంశాగ్రణీః
ధాత్రీభారధురంధరో విజయతే శ్రీ
వీరభద్రేశ్వరః 1......................"1

అనువాక్యములలో స్పష్టముగా వివరింపఁబడినది. ఈచాళుక్య వీరభద్రేశ్వరునితండ్రి ఇందుశేఖరుఁడనియు, తల్లిఉదయాంబాదేవి యనియు, పశ్చిమగోదావరి మండలములోని పాలకొలను గ్రామము లోని క్షీరా రామేశ్వరుని కఖండదీపము నాచంద్రతారకంగా నుండు నటుల చాళుక్య వీరభద్రునితల్లి ఉదయాంబాదేవి దానముచేసి యా యాలయములోని యొక శిలాస్తంభము మీఁద వ్రాయించిన దాన శాసనములోని యీక్రింది శ్లోకములవలనఁ దెలియుచున్నది.

" లక్ష్మీపతేర్భగవతో బ్రహ్మాసీన్నాభి పంకజాత్ 1
తస్మాద త్రిరతశ్చంద్ర స్తద్వంశే విష్ణు వర్ధనః ॥౧॥
చాళుక్యాధిపతేః తస్మాదిందుశేఖరభూపతిః
తస్మాదలభతేవార్యా * వీరభద్ర క్షితీశ్వరం
అగణ్యపుణ్యనిలయం సత్కీర్తిరుదయాంబికా
శాకాబ్దేవసుమాతంగ రుద్రసంఖ్యోప శోభితే
మార్గశీర్షేహరిదినే వీరభద్రక్షి (తిశితుః)
పుణ్యసంప్రాప్త యేనూనంతజ్జనన్యుదయాంబికా
ప్రాదాద ఖండమతులం క్షీరారామనివాసినే
మహేశాఖి లేశాయ దపమాచంద్ర తారకం "2

జుత్తిగశాసనము శా. శ. ౧౧౮౧ సంవత్సరములోను, పాల కొలను శాసనము శా. శ. ౧౧౮౮ సంవత్సరములోను వ్రాయఁ బడినవి. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికయందు శ్రీయుత జయంతి

(1) Ep. R. of 1921. Ins. No. 343. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము ౨౨ సంచిక ౪. 1933.

(2) S. I. Ins. Vol V, Ins. No. 122, A. R. No. 509 A. of 1893.

రామయ్యగారు జుత్తిగ కొలనుపాక శాసనములను రెంటిని "రెండు కాకతీయశాసనము" లను పేరునఁ బ్రకటించుచు "వీరభద్రేశ్వరుఁడు "ధాత్రీభారధురంధరుఁ" డనుటవలన మామగారయిన గణపతిదేవు నిచేఁ గొంత దేశమునకుఁ బరిపాలకుఁడుగా నియమింపఁ బడినట్లూహింపవలసియున్నది." అని వ్రాసియున్నారు. కానివీరుప్రకటించిన రెండవ శాసనమగు కొలనుపాక శాసనములో చాళుక్యవీరభద్రుని తండ్రి యగు ఇందుశేఖరుని లెంకయు (భృత్యుఁడు)ను, మాచమనాయకునికిని మాడచి యనునామెకు పుత్రుఁడునగు పోతినాయకుఁడు గూడఁ వీరాధివీరుఁడుగా వర్ణింపఁబడి యుండుటయెగాక:—

" లక్ష్మాబాయాంసుతో జాతశ్రీమహాదేవరాజతః
నామ్నేందు శేఖరో రాజాకుమారశ్శివయోరివ॥
ఇందుశేఖరనరేంద్ర నందనేనందతి స్వయమశేషనందనే
జగ్మషాం వితరణంరణం ముహుస్స్వస్థతై విదుషాంద్విషామపి॥"

అనుశ్లోకములు వ్రాయఁబడి యుండుటచేతగూడ కాకతీయుల కాలమునందు గణపతికాలమునకుఁ బూర్వమునుండియు చాళుక్య వీరభద్రునితండ్రియగు ఇందుశేఖరుఁడును, తాతయగు మహాదేవ రాజునుగూడ మండలాధిపతులుగా నుండిరని యూహింపవచ్చును. చాళుక్య వీరభద్రునియొక్కయు, వానిమంత్రియొక్కయు, తత్సంబంధులయొక్కయు, శాసనములు గోదావరీ మండలమున జుత్తిగ, పాలకొలను గ్రామములోఁ గనుబట్టుటచేత వీరుమొదట "నిడుదప్రోలు" (నిడుదవ్రోలు) పట్టణాధీశ్వరులుగా నుండి యాప్రాంత ప్రదేశమును బరిపాలించుచుండెడి మండలాధీశ్వరులని స్పష్టముగాఁ జెప్పవచ్చును. ఇంతియగాక వీరికిని గోదావరి మండలములోని కోనసీమ లేక కోనమండలమును బరిపాలించి హైహయ రాజవంశము (కార్తవీర్యార్జునుని వంశము) వారికిని సంబంధబాంధవ

ములుగలిగి యున్నట్టు పాలకొలను శాసనములు ధ్రువపఱచుచున్నం దున చాళుక్యవీరభద్రుని వంశమువారు గోదావరి మండలములోని వారని స్పష్టముగా నుడువ వచ్చును. ఇందుశేఖరునికిని వానిభార్య ఉదయమహాదేవికిఁ బుట్టినకూతురును, చాళుక్య వీరభద్రుని సోదరి యునగు అన్యమాంబాదేవి కోనమండలాధి పతియుహైహయాగ్రేస రుఁడునగు భీమవల్లభనృపాలుని భార్యగానుండెనని పాలకొలనుక్షీరా రామేశ్వరుని యాలయములోని యొకశాసనమువలనఁ దెలియుచు న్నది. భీమవల్లభనృపాలునకు అన్యమాంబకుఁ బుట్టినవాఁడు కోనగణ పతిదేవ మహారాజని మఱియొక శాసనమునుబట్టి దెలియుచున్నది.1 భీమవల్లభ నృపాలునితండ్రి రాజపఱేడనిగూడఁ దెలియుచున్నది. 2 కోనగణపతిదేవ మహారాజునకు నిడుదప్రోలి చక్రవర్తియైన మహా దేవరాజుకూతురయిన ఉదయమహాదేవి లేక పినఉదయ మహాదేవి నిచ్చి వివాహము గావించిరి.3

---

(1) "రాజాసహస్రిబాహో శ్రీకులేద్భీమ వల్లభః
చాళుక్యకులజా తస్యపత్న్యాశీదన్యమాంబికా॥౧॥
తయోర్గణపతిర్ద్వీరో జాతః
జయంతఇవకాంతః

(2) తస్మాద్రాజపఱేండు భూపతిరభూదాత్రేయ గోత్రోం
సతస్తత్సుతోఽజని భీమవల్లభనృపః శ్రీహైహయాగ్రేసరః
దేవీకులేందు శేఖరధరాధీశోదయాంబాసుతా
చాళుక్యేశ్వర వీరభద్ర (జననీ?) తస్యాన్యమాంబాప్రియా.
(ఇందు భగినీయనుటకు బదులుగా జననీయని పడుట శాసనలేఖకుని పొర పాటుగా గ్రహింపవలసి యుండునని గ్రహించునది)

(3) స్వస్తిలోకాశ్రయ శ్రీవిష్ణువర్ధన మహారాజులయిన మహాదేవచక్రవర్తి కూఁతురు ఒదయమహాదేవి అమ్మంగారు తమపురుషుండైన స్వస్తిసహస్ర బాహుప్ర తాప వీర్యగుణసంపన్నులైన శ్రీమన్మహామండలేశ్వర కోనగణపద్దేవ మహారాజు నకున్ను, తమకున్ను, పుణ్యముగాను

నిడుదవోలును బరిపాలించిన చక్రవర్తి బిరుదాంచితులగు చాళుక్యరాజులకు మంత్రులుగానుండెడి వారిందులూరి వారని శివయోగసారమను గ్రంథమున నీక్రిందిపద్యములో—

" హరితగోత్ర జాతుడగుచు నాపస్తంబ
విశదసూత్రమునను వేంగినాటి
భూమినొక్క బ్రసిద్ధిబొందెను నూకనా
ర్యుండు సుజనబంధు మండనుండు.
ఆనూకన ప్రెగ్గడకును
సూనుండై బల్లపెగ్గడ సుధియొప్పారెన్
దీనిధి నిరవద్యాపుర
మానవనాథులకుఁదా నమాత్యుండగుచున్.
అతనిసుతుడు వరశివాచారరతుఁడు
జననుతుండు ధైర్య శౌర్యయుతుఁడు
జగతి నిడుదవ్రోలి చక్రవర్తులరాజ్య
మహిమఁదాల్చె నాగమంత్రి యనఁగ ॥"

వరసక్రమమున నిందులూరి నూకరాజును, వానికుమారుఁడు బల్లపగ్గడను, వానికుమారుఁడు నాగయమంత్రిని బేర్కొనియున్నాఁడు. శివయోగసారగ్రంథకర్త వంశమునకు నిడుదవ్రోలి చక్రవర్తుల మంత్రివంశమునకు సంబంధ బాంధవములు గలవు. ఈగ్రంథములో నుదహరింపఁబడిన విషయము లెక్కుడు ప్రామాణ్యములై యున్నవి, ఈపై విషయము లనుబట్టి కాకతి రుద్రాంబ భర్తను గూర్చియు నిదివరకుఁ దెలియంబడని విషయములను గొన్నిటిని దెలిసికొనఁగలిగినాము. కాకతీయసంచికలో చాళుక్యవీరభద్రుని రుద్రాంబ భర్తయనిగుర్తించుటయెగాని తదితర విషయములనుగూర్చి తెలిసికొనఁబ్రయత్నింపకుండుటయెగాక యసంబద్ధవిషయములను, బెక్కింటినిబేర్కొనుటకూడ సంభవించినది. రుద్రమదేవి మల్కాపురశాసనకాలము క్రీ. శ. 1261 నాటికితండ్రి గణపతిదేవ చక్రవర్తియు,

భర్తచాళుక్య వీరభద్రేశ్వరుఁడు బ్రదికియున్నవారుగాని కాకతీయ సంచికలోఁ జెప్పినట్లువారు మరణించియుండలేదు. కాకతిగణపతిచక్రవర్తిమరణించినది 1261 కాదు. అతఁడు మఱికొంతకాలము బ్రదికియున్నవాఁడు.

## మల్కాపుర శాసనము.

౧౧౭3 వ శక సంవత్సరమునకు సరియైన దుర్మతిసంవత్సర చైత్రబహుళాష్టమీ శుక్రవారమునాఁడు కాకతిగణపతిదేవ చక్రవర్తి మందరమను గ్రామమును, ఆదినముననే వానికూతురు రుద్రమదేవి వెలంగపూఁడి యనుగ్రామమును రాజగురువైన విశ్వేశ్వర శంభువను శైవాచార్యునకు దానముచేసిరనియు విశ్వేశ్వర శివుఁడా రెండుగ్రామములను గలిపి "విశ్వేశ్వరగోళకి" యనుపేరిటనొకయగ్రహారమును బ్రతిష్ఠించి యచటవిశ్వేశ్వర శివాలయము, మఠము, సత్రము మొదలగునవి నిర్మాణముచేసెనని చెప్పుటయాశాసనముయొక్క ముఖ్యోద్దేశమైనను బెక్కువిశేషాంశములందుఁ జేర్కొనఁబడియున్నవి. ఈశాసనములో నభివర్ణింపఁబడిన విశ్వేశ్వర శివాచార్యునిగూర్చిన విశేషచరిత్రాంశములను పూర్వప్రకరణమునందు దెలిపియున్నాను. ఇపుడు శ్రీయుత జయంతిరామయ్యపంతులుగారు,ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక శుక్ల సంవత్సరాశ్వీయుజ కార్తికమాసముల సంచికలో మల్కాపురశాసనమును బ్రకటించుచు వానిపీఠికలో విశ్వేశ్వరగోళకీ యగ్రహారమును గూర్చిశాసనములో వ్రాయఁబడినదానిని తెలుఁగులోని కనువదించిన భాగమునే యీక్రిందవివరించుచున్నాను.

### పూర్వకాలపు గ్రామనిర్మాణ పద్ధతి

"తనకు దానముగా నొసంగఁబడిన మందర, వెలంగపూఁడి గ్రామములు రెంటిని జేర్చి విశ్వేశ్వరగోళకి యనుపేరుతో నొక

యగ్రహారమును, అందు విశ్వేశ్వరాలయమును, సత్రము మొదలగు నవియు విశ్వేశ్వరశివుడు ప్రతిష్ఠించెను. ఇరువదిమంది ద్రావిడ బ్రాహ్మణుల రప్పించి యీగ్రామమందు నిలిపి వారి కొక్కొక్కరికి రెండేసిపుట్లవంతున భూమి యిచ్చి మిగిలినభూమి మూఁడుభాగములు చేసి యందొకభాగము విశ్వేశ్వరునకును, నూతనముగా స్థాపింపబడిన శుద్ధశైవమఠమునకును విద్యార్థులకును గలిపి యొక భాగమును మూఁడవభాగము "ప్రసూత్యారోగ్య శాలలకు" ను సత్రమునకు నిచ్చెను. క్రొత్తగాఁ బిలిపింపఁబడిన ద్రావిడబ్రాహ్మణులు వీరశైవ మతానలంబు లనియు నామతమువా రాంధ్రులలో లేకపోవుటచేత ద్రావిడులు రప్పింపఁబడి రనియుఁ దోఁచుచున్నది. ప్రసూత్యారోగ్య శాలలు రెంటిలో నారోగ్యశాల యనఁగా సామాన్యరోగులకుఁ జికిత్ససేయుశాల. ప్రసూతిశాల యనఁగా గర్భవతు లగుస్త్రీలు సుఖప్రసవ మగుటకుఁగా నేర్పడినశాల. ఈ రెంటికి నిప్పు డాంగ్లేయ భాషలో General Hospital, Maternity Home అని పేరులు. ఇట్టియారోగ్యశాల లా కాలమందుఁ గూడఁ గల వని యిప్పటి నవీన నాగరకు లెఱుంగుదురుగాక ! అన్నసత్రములో బ్రాహ్మణులు మొదలుకొని చండాలురపర్యంతము వచ్చినవారందఱకు నన్నము పెట్టెడు నియమ ముండినది. నేఁటి నిమ్నజాత్యుద్ధారకు లీవిషయము గ్రహింతురుగాక! పైని స్థూలముగా సూచింపఁబడిన దానముల వివర మీక్రిందఁ జూపఁబడుచున్నది.

ఋగ్యజుస్సామవేదాధ్యాపకులు ముగ్గురు; పదవాక్య ప్రమాణసాహిత్యాగమవ్యాఖ్యాత లయిదుగురు; వైద్యుఁ డొకఁడు; కరణ మొకఁడు; ఈపదిమందికి నొక్కొక్కనికి రెండుపుట్లు చొప్పున నిరువదిపుట్లభూమి. దేవాలయములోనాట్యముచేయు వేశ్యలు పదిమంది; మద్దెల మొదలగు వాద్యములు వాయించువా రెనమండ్రు; ఈపదు

నెనిమిదిమందికి 1 కి పుట్టిపందుము ప్రకార మిరువదియేడుపుట్లభూమి. ఈపదునెనిమిదిమంది పేళ్ళును శాసనస్తంభము మొదటిప్రక్క యడుగున వ్రాయఁబడియున్నవి. ఈక్రిందఁ జేర్కొనఁబడిన:—
1 కాశ్మీరదేశీయుఁడు, 14 పాటకత్తెలు, 6 జేగంటలు (కరడలు) వాయించువారు, 2 వంటబ్రాహ్మణులు, 4 పరిచారకబ్రాహ్మణులు, 6 మఠసత్రములం దుండు నితరబ్రాహ్మణులు, 10 వీరభద్రులను గ్రామరక్షకులు, 20 వీరముష్టు లను భటులు, 5 బంగారు, రాగి, పాషాణము, వెదురు, ఇనుము వీనితోఁ బనిచేయువారు 1 కుమ్మరి 1 స్థపతి, 1 కాసె (కారుఁడు) 1 మంగలి, 1 శిల్పి యను డెబ్బది ముగ్గురకు డెబ్బదిమూఁడుపుట్లభూమి.

తోఁటనిమిత్తము నివర్తనము భూమిలోఁ బదునాఱవవంతు గ్రామాయవ్యయముల లెక్క నుంచుటకై నియమింపఁబడిన విశ్వేశ్వరశివుని స్వగ్రామమగు పూర్వగ్రామ నివాసులును, సామవేదులును శ్రీవత్సగోత్రులు నగు బ్రాహ్మణులకు ముప్పది పుట్లభూమి కూడ నీయఁబడినది. ఈభూమియంతయుఁ జేరి 150 పుట్లయినది. ద్రావిడబ్రాహ్మణుల కిచ్చిన 120 పుట్లును, తోఁట కిచ్చినభూమియుఁ జేరి గ్రామముగుడికట్టు 270 పుట్లు పైచిలుకైనది.

పై నుదాహరింపఁ బడిన గ్రామరక్షకు లగు “వీరభద్రులు” బీజచ్ఛేద శిరచ్ఛేద కుక్షిచ్ఛేదాది కర్మలు చేయువా రనియున్నది. వీరశైవులలోఁ గొందఱు పుణ్యము వచ్చునని తమతమ యవయవముల ఛేదించుకొను నాచారము పూర్వముండినఁదఁట. అంతసాహసము చేయువారు కావుననే గ్రామరక్షణమునకు సమర్థు లని యూహింపవలయునా లేక యాగ్రామరక్షకులు గ్రామములోఁ దప్పుచేసినవారికి రాజుచే విధింపఁబడిన శిరచ్ఛేదాదిదండనకార్యముల నిర్వహించువా రని తలంపవలయునా? ఈవిషయ మింకను విచారింపవలసియున్నది.

ఈప్రకారము వృత్తులను బొందినవా రందఱును దమతమ నియతకార్యముల యథావిధిగా నొనర్చుచుఁ దమతమవృత్తుల శాశ్వతముగా ననుభవింప వలయును. పురుషులు లేనప్పుడు స్త్రీలు తమకార్యముల నితరులచేతఁ జేయించుచు వృత్తుల ననుభవించునది. ఈయేర్పాటు నంతను బరిశీలించుటకై సంవత్సరమునకునూఱునిష్కముల జీతము (ఆచారభోగము) మీఁద నొక స్థానాచార్యుఁడు నియమింపఁబడెను. ఈతఁడు తనపని సరిగాఁ జేయనియెడల స్థానపతులు వేఱొకని నాపదవికి నియమింపవలయు నని యున్నది. ఇచ్చటనేకాక యనేకములైన యితరస్థలములందుఁ గూడ విశ్వేశ్వరశివుఁడు శివాలయములు సత్రములు ప్రతిష్ఠించినట్లు శాసనము చెప్పుచున్నది."

## ప్రతాపరుద్ర చక్రవర్తి జననము.

మల్కాపుర శాసనమునందు మఱియొక విశేషము గనుబట్టుచున్నది.

> "యస్యాః కాకతి వంశమౌక్తికమణేః శ్రీరుద్రదేవస్సుత
> త్తస్యాః కింకథయానువైభవమతః శ్రీరుద్రదేవ్యాఃపరం"

అని ప్రకృతశాసనమునందు చెప్పియుండుటచేత రుదర్రమ దేవికి రుద్రదేవుఁడని కుమారుఁ డుండెనని కొందఱు తలంచుచున్నారు. ప్రతాపరుద్రీయనాటక ప్రకరణమునందు స్వయంభూదేవుఁడు రుద్రమదేవితో:—

> "స్వీకృతపుత్రీ భావేనదౌహిత్రే ప్రాజ్ఞమాజ్ఞయ
> అస్మిన్నిధేహిధారే యేగుర్వీముర్వీధురాం"

పూర్వము నాయాజ్ఞచే నీవు పుత్త్రీభావముతో స్వీకరించిన దౌహిత్రుఁడును, ధురంధరుఁ డగు నీతనియందు భారమైన యీ

యుర్వీభారము నుంచుమని చెప్పినట్లుండుట చేత రుద్రియుదేవికి రుద్రదేవుఁడు కూతురుబిడ్డ యగు మనమఁడేగాని పుత్త్రుఁడు గాడని స్పష్టపడుచున్నది. అందువలన శాసనములోని "సుత" శబ్దమునకు పెంపుడు కొడుకని యర్థము చెప్పికొనుటయె సమంజసముగా నుండును. ఇంకను లోతునకుఁ బోయి విచారించినయెడ ప్రతాపరుద్రిమదేవికి పెంపుడు కూతురునకుఁ బుట్టిన బిడ్డఁడేగాని తన గర్భమునందు జనించిన యాఁడుబిడ్డకుఁ బుట్టినకొడుకుఁ గాడని తేటపడక మానదు. ఈ కాకతీయాంధ్ర రాజయుగమునందు రాజగురువైన విశ్వేశ్వరశివాచార్యుఁడును, వాని శిష్యుఁడగు కాకతీయగణపతిదేవ చక్రవర్తియు, బలాఢ్యులైనవాని మంత్రిలును, అత్యంతరాజభక్తితోఁ బ్రవర్తించిన వానిసేనానులును, మిత్రులును పండితులైన యితరమేధావులును, ఆకాలమున నత్యద్భుతమైన కార్యమును నిర్వహించిరి. గణపతిదేవ చక్రవర్తికిఁ బురుషసంతానము లేకపోవుటచేతను, రుద్రిమదేవి స్త్రీ యగుటచేతఁ దనమరణానంతరము నామె పొందెడు రాజ్యాధిపత్యమునకు శత్రువులవలన నెట్టియుపద్రవము, భంగము కలుగునో యన్న గట్టిభయమాతని పీడించుచుండుటచేత మంత్రులతో నాలోచించి యామెను కొడుకుగా భావించి కొంతకాలము లోకమునకట్లు ప్రకటించి వ్యవహరించినట్టు గనంబడుచున్నది.

అందుచేతనే ప్రతాపరుద్రీయమునందు,

"అన్యథాకథ మీశ్వరప్రసాదాదృతే నిరంకుశం స్త్రీవ్యక్తివిశేషస్య లోకాధిపత్యం ఏవం మానుషశంభు నాగణపతి మహారాజేన అభ్యంతరస్యాఽనుభవమహిమ్నః సదృశమత్రపుత్ర వ్యవహారః కృతః తదనుగుణా చరుద్రఇత్యాఖ్యా"

ఈశ్వరుని ప్రసాదమె లేకపోయిన యెడల ఒకయాఁడుదానికడ్డుకలేని లోకాధిపత్య మెట్లు సమకూరును? మానుష శంభువైన

గణపతిమహారాజుచేత తన కొమార్తెయొక్క భావికాలమాహాత్మ్య మును దెలిసికొని దన యంతఃకరణ ప్రవృత్తికిఁ దగినట్లు పుత్త్రుఁడని వ్యవహారము చేయఁబడినది. తదనుగుణముగా రుద్రుఁడని పేరు కూడఁ బెట్టబడినది-" అని స్పష్టముగాఁ దెలుపఁబడి యుండెను. కాకతీయరాజవంశమునందు జనించిన రుద్రమ్మను రుద్రయ్య యని వ్యవహరించుట యెప్పటినుండి ప్రారంభమయ్యెనో అప్పటినుండి యిప్పటివఱకును రాచకొలమువారిలో, వెంకమ్మను వెంకయ్య యనియు. సుబ్బమ్మను సుబ్బయ్య యనియు, నరసమ్మను నరసయ్య యనియు, పుల్లమ్మను పుల్లయ్య యనియు, అమ్మ" యను స్త్రీవాకచ పదమునకు మాఱుగా, "అయ్య"యను పురుషవాచక పదమునే వ్యవహరించుట పరిపాటియై నడచుచుండుట నేటికిని జూచుచున్నాము. ఇదియొక నిర్దిష్టమైన దృష్టాంతముగా నున్నది. ప్రతాపరుద్ర చక్రవర్తి తల్లిదండ్రు లెవ్వరు? ప్రాచీనస్థానిక చరిత్రము లీతని తల్లి రుద్రమదేవి కూతురగు ముమ్మడంబ యని తెలుపుచున్నవి. ప్రతాపరుద్రీయమునందు

" కౌసల్యాసీత్ప్రథమజననీ దేవకీచ ద్వితీయా
విష్ణోర్మాతా తదను మహితా ముమ్మడంబా తృతీయా
యస్త్రేతాయాం రఘుపతిరభూ ద్ద్వాపరే శౌరిరాసీ
స్త్రితుంక్షోణీం సజయతికలౌ వీరరుద్రావతారః"

శ్రీవిష్ణువునకు మొదట గౌశల్యయు, బిమ్మట దేవకియు, వెనుక ముమ్మడంబయుఁ దల్లులైరి; అతఁడును త్రేతాయుగమున రాముఁడుగను, ద్వాపర యుగమునఁ గృష్ణుఁడుగను, కలియుగమున వీరరుద్రుఁడుగను నవతరించెనని చెప్పియుండుటచేత ప్రతాపరుద్రుని తల్లి ముమ్మడంబ యని ధ్రువపడుచున్నది. మఱియుఁ బ్రతాపరుద్రీయమునందు,

" మురారేర్యః పూర్వం జలనిధిసుతాయా ముదభవ
న్మహాదేవాజ్జాతస్సపున రవనీభృద్దుహితరి।
వపుషా స్కా-మోయం జయతి జగతీభాగ్యవిభవైః
ప్రతాపశ్రీరుద్ర స్స్వయమితిమనీషామృగదృశాం"

పూర్వము మురారి యయిన శ్రీవిష్ణువు లక్ష్మీదేవియందుఁ బుట్టిన మన్మథుఁడే నేఁడు మహాదేవునకును రాజపుత్రికకను జన్మించి ప్రతాపరుద్రుఁడను పేరుతో సర్వవైభవముల ననుభవించుచున్నాఁడని బుద్ధిమంతులు దలంచుచున్నారు." అని యభివర్ణించి యుండుటచేత ప్రతాపరుద్రుని తండ్రి మహాదేవరాజని స్పష్టపడుచున్నది. ఇప్పుడు ప్రతాపరుద్రునితండ్రి మహాదేవరాజనియుఁ దల్లి ముమ్మడమ్మయనియుఁ దెలిసికొన్నారము. ఈముమ్మడమ్మ రుద్రమదేవి కౌరసపుత్రికకాదనియు, ఆమె పెంపుడు కొమార్తె యనియు శివయోగసారము గ్రంథములోని—

" అనుపితరుద్రమాంబికకు 'నాత్మజ'నాఁ బొగడొందుముమ్మడ
యమ్మకు మహాదేవరాజునకు నాత్మజుఁడైన ప్రతాపరుద్రుఁడా
సకలమహీభరంబును వెసన్ దనయంత వహించిదాల్చెనా
యకమహిమంబులం దొరిదె (?) యన్నయదేవుఁడు రుద్రదేవుఁడున్.''

అను పద్యమువలన స్పష్టముగానే తద్గ్రంథకర్త తెలుపుచున్నాఁడు. ఆనాఁడు కాకతీయరాజవంశమునందలి వింతచరిత్రాంశములను మనము జాగరూకతతోఁ బరిశీలించిన పక్షమున మనకు నిందలి సత్యము బోధపడక మానదు. క్రీ. శ. 1261 వ సంవత్సర మునాటికి (మల్కాపురశాసనకాలము) గణపతిదేవుఁడు జీవించి యుండఁగానే ప్రతాపరుద్రదేవుఁడు యౌవనారంభదశలోనికి వచ్చినట్లు మల్కాపుర శాసనము తెలుపుచున్నదని శ్రీయుత రామయ్యపంతులుగారు వ్రాయుచున్నారు. నిజముగా మల్కాపురశాసన కాలమునాటికి రుద్రదేవునకు వయస్సెంత యుండునో తెలిసికొనవలసి యున్నది. స్థానికచరిత్రములందు ప్రతాపరుద్రదేవుని జననము పలువిధములుగాఁ దెలుపఁబడి యుండెను గాని యిదియె సత్యమని విశ్వసించుటకు సాధ్యముకాదుగాని కొంచెమెచ్చుతగ్గుగా ప్రతాపరుద్రుని జననకాలమును నిర్ణయింపవచ్చును. ఈసందర్భమునఁ గాకతీయ సంచికలోని వ్రాఁతల నొకింత విమర్శింపవలసియున్నది. కాకతీయ సంచికలోనే తత్సంచికా సంపాదకుఁడు ప్రతాపరుద్రదేవుని

తల్లి యగు ముమ్మడంబ రుద్రమదేవి యౌరసపుత్త్రిక యగునో కాదో విచారింపకయె కూఁతురను భావముతోనే యూహలపైయూహలతో చరిత్రమల్లుటకుఁ బ్రారంభించెను.

కాకతీయసంచిక సంపాదకులయిన మారేమండ రామారావు గారిట్లు వ్రాయుచున్నారు.

"క్రీ. శ. 1254 లో నీమె (రుద్రమదేవి) కూఁతురు ముమ్మక్కకుఁ బ్రతాపరుద్రదేవుఁడు జనన మందెను. 1258—1296 నడుమ 40 సం॥ గలవు. పౌత్రదర్శనము గల్గుటకీమెకు 1258 నాటికి ముప్పది నలువది యేండ్లైన నుండవలెను. దానినిబట్టి రుద్రమ క్రీ. శ. 1220-1225 ల నడుమ జన్మించెనని యూహింపవచ్చును. ఈమెకుఁ బుత్త్రికోదయమైన వెంటనే భర్తమృతి నందియుండును. దానఁజేసి తన యనంతర మీమెయె కాకతీయసామ్రాజ్యమున కధిపతి గావలసి యుండుటచే గణపతిదేవుఁ డీమెకవసరమగు రాజకీయ శిక్షణము నొసంగెను."

రుద్రమదేవి భర్తయగు చాళుక్యవీరభద్రేశ్వరుని మంత్రి యగు విష్ణువు తనతల్లి తల్లాంబకుఁ బుణ్యముగాను సోమేశ్వరస్వామికిఁ జేసిన దానశాసనము జుత్తిగ గ్రామమునఁ గనుబట్టుటచేతను, అయ్యది శా. శ. ౧౧౮౧ (క్రీ. శ. 1259) సంవత్సరము కలదియగుటచే నప్పటికి వాని ప్రభువగు చాళుక్యవీరభద్రుఁడు బ్రదికి యున్నట్టే గన్పట్టుచుండఁగా ముమ్మక్క పుట్టినతోడనే తండ్రి చనిపోయెనని కంఠోక్తిగాఁ బలుకుట సాహసముగాదా!

ఇంతేకాదు పాలకొలను గ్రామములోని శ్రీరారామేశ్వర స్వామి యాలయములోని చాళుక్య వీరభద్రేశ్వరుని తల్లియగు ఉదయాంబ దానశాసనము శా. శ. ౧౧౮౮ (క్రీ. శ. 1266) సంవత్సరముకలది యగుటచేత నప్పటి వఱకైన రుద్రమదేవి భర్త బ్రదికి యున్నవాఁడని యూహించుట కయిన నవకాశము లేకయుండెనా? అదియెట్లైనను మల్కాపుర శాసనమునాటికి అనఁగా క్రీ. శ. 1261 సంవత్సరములో రుద్రాంబభర్త బ్రతికియున్నాఁడని చెప్పకతప్పదు. రుద్రాంబభర్తతోఁ జాలకాలము కాపురము చేసినదనియే మనము తలంపవలయును.

కొలను గణపతిదేవకవి "శివయోగసార", మను గ్రంథమున "అకుపిత రుద్రాంబికకు "నాత్మజ" నాఁబొగడొందు ముమ్మడమ్మకు" నని స్పష్టముగా ముమ్మడమ్మ రుద్రమదేవిగర్భమునఁ బుట్టినపుత్త్రిక కాదనివిశదపఱిచిన దానిని బలపఱచునట్టి గ్రంథము మఱియొకటి గలదు.

చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములో "వెలుగోటి వారి వంశచరిత్ర" యను పేరుతో నున్న యొక పుస్తకములో గణపతి దేవునకు పుత్రసంతతి లేక రుద్రాంబికయను కొమార్తె యుండెననియు గణపతికిఁ బిమ్మట రేచెర్ల ప్రసాదాదిత్యుం డామె పురుషుఁడని ప్రకటించి సింహాసనంబునం గూరుచుండఁ బెట్టి రాజ్యంబును దానే నిర్వహించుచు నామెకొక కన్యనుదెచ్చి పెండ్లిచేసెననియు, ఆకన్య కాపురమునకు వచ్చినతరువాత తనభర్తను స్త్రీనిగా నెఱింగి విషణ్ణ హృదయయై యుండునంత నీ ప్రసాదాదిత్యుండు తెలిసికొని యొక మహాపురుషుని యనుగ్రహమున నా రామాతిలకము పుత్రరత్న మును గాంచునట్లుగాఁ జేసి రుద్రదేవిని జంపి యా చిన్నవానిని రాజ్యాధిపతిని గావించెనని యున్నది."

ఈపై విషయము ప్రసాదాదిత్యున కా కాలమున నంతటి ప్రాముఖ్యము గలదని సూచించుటకై యట్లు వ్రాయబడినను ముమ్మడమ్మ రుద్రమదేవి కూతురు గాదనిమాత్రము విశ్వసించుటకు జాలియున్నది. ఇందుఁ జెప్పబడినట్లు పెండ్లితంతుగూడ జరుపఁబడి యుండునని గూడ విశ్వసింపవచ్చును. ఆమెయందు జాలిగొని రుద్రమదేవి యామెను బుత్రికనువలెఁ బెంచి వయస్సు వచ్చిన వెనుక మహాదేవరాజున కిచ్చి పెండ్లిచేసి యుండవచ్చును. వయస్సు లో నిద్దరకు నెంతో తారతమ్య ముండదు.

రుద్రాంబ కూతురు రుయ్యాంబ.

రుద్రాంబకు రుయ్యాంబ యను గాదిలిసుత యున్నట్లు శివ యోగసారమునందుఁ జెప్పఁబడియెను. మఱియును ఇందులూరి

అన్నయదేవుఁడను బ్రాహ్మణామాత్యుఁడు రుయ్యాంబను బెండ్లిచేసి కొన్నట్లా గ్రంథమునందిట్లు చెప్పఁబడినది.

"కాకిత రుద్రాంబ గాదిలి సుతయైన
రుయ్యాంబఁ బెండ్లాడి రూఢి కెక్కె,
అద్రిజలకమాంబలన విలసిల్లెడు
కుల భామినులను మక్కువ వరించె"   శి. సా.

ఇప్పుడీ యిందులూరి అన్నయదేవుడెవ్వరో, మహాదేవ రాజెవ్వరో. మనము తెలిసికోవలసి యున్నది. మహాదేవరాజును గూర్చి శివయోగసారము నందేమియుఁ జెప్పియుండ లేదు గాని యిందులూరి యన్నయదేవుని గూర్చియు, వానివంశమును గూర్చియు, శివయోగసార గ్రంథావతారికయందు, జాలవర్ణింపఁబడి యున్నది.1 అదియంతయుఁ గాకతీయ రాజవంశమునకు వన్నెదెచ్చునంతటి ప్రాముఖ్యము వహించినదిగా నున్నది.

---

1 ఈ శివయోగసారమను గ్రంథమునుఁ గూర్చి "సుభాషి" పత్రిక మొదటి సంపుటము. మొదటిసంచికలో నాచే వ్రాయబడి ప్రకటింపఁబడినఁ "అన్నయదేవుఁడు - వింతచరిత్రాంశములు" అను వ్యాసములోనే యిట్లు వ్రాసియున్నాను. (1927, సంIIము. అక్టోబరు నెల.)

"కవివంశమామూలాగ్రముగా వర్ణింపఁబడిన యవతారికగల పూర్వభాగము యొక్క ప్రతియొకటి నామిత్రులగు శ్రీయుత వేమూరి విశ్వనాథశర్మ ఎం. ఏ. ఎల్.టి.గారి కిటీవలలభించినది. నా ప్రార్థనముపైనినే నా కవివంశ చరిత్రమును వ్రాసికొనుటకై దయతో నొకమాఱుప్రతి నొసంగిరి. అందులకు వారికి నా కృతజ్ఞతా వందనములను దెలుపుచున్నాను. ఇన్నూఱుసంవత్సరములకిందట వ్రాయఁబడిన గ్రంథమగుటచేత మిక్కిలి శిథిలమై యున్నది. నడుమ గొంత భాగము నశించిపోయినది గాని తప్పులుకుప్పలుగానున్నను కవివంశవర్ణన భాగము మాత్రము పోలేదు. ఈకవిశిఖామణి కౌండిన్యసగోత్రుఁడు: ఆపస్తంబసూత్రుఁడు నియోగి బ్రాహ్మణుఁడు ఆదిమూలనామాత్యుని పుత్త్రుడు: శ్రీగురుచన్నసదాశివ యోగీంద్రుని శిష్యుఁడు, శివభక్తుఁడు ఆశ్వాసాంతగద్య మిట్లున్నది.

ఇది శ్రీ గురుచన్నసదాశివయోగీంద్ర పాదారవింద మధుకరాయమాన శివభక్తసమారాధన కోలని యాదిమూలనామాత్య పుత్త్ర, అన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతిసుముఖ కవిజనమిత్ర సరసకవిత్వ విరచిత ప్రభావగణపతిదేవ ప్రణీతంబైన శివయోగ సారంబు.'

## ఇందులూరి అన్నయామాత్యుఁడు.

అవక్రపరాక్రమముతో నాంధ్రదేశమును ముప్పదియైదు లేక నలువది సంవత్సరములు పరిపాలనము చేసి ఖ్యాతిఁగాంచిన కాకతి రుద్రమదేవి చక్రవర్తిని కల్లుడును, కాకతి ప్రతాపచక్రవర్తికిఁ బినతల్లి పెనిమిటియునగు నీ యిందులూరి అన్నయామాత్యుడు గణపతిదేవ చక్రవర్తి మంత్రియును, సైన్యాధ్యక్షుఁడుగా నుండి కళింగ దండయాత్రలు నడిపించిన సోమయామాత్యునికి దమ్ముఁడును, అతని ప్రసిద్ధ సేనాపతులలో నొక్కఁడునగు పెదగన్నయామాత్యుని పుత్రుడు నైన ప్రతిభాశాలి. ఇతఁడు రుద్రమదేవి కాలమునను రెండవ ప్రతాప రుద్రదేవుని కాలమునను సమున్నత పదవిని వహించుటయె గాక తన ప్రతిభా విశేషముచేఁ గాకతీయాంధ్ర సామ్రాజ్యమును బోషించుచు, తుదకా మహాసామ్రాజ్యముతోనే యస్తమించిన మహావీర సైన్యాధిపతియుఁ మహామాత్యుఁడు నై యున్నవాఁడు. స్ఫురద్రూపియు, బాహుబలసంపన్నుఁడు మాత్రమె గాక మంచిరాజనీతి విశారదుఁడు నై యాకాలమున విశ్వేశ్వరశివదేశికుని యపరావతారముగ సర్వజనులచేఁ బరిగణింపఁబడుచుండిన వాఁడు. కనుకనే కొలని గణపతిదేవకవి తనచేవిరచింపఁబడిన "శివయోగసారం"బను వేదాంత గ్రంథమున నవతారికలో వీనిని తన పూర్వులలోని వానిగఁ జెప్పుచు నిట్లభివర్ణించి యున్నాఁడు

"అత్యుత్తమంబైన యత్యాశ్రమస్థుండు
కారణ జన్మసంగతి వహించె
వికట సామ్రాజ్య సంపదలు సకల బంధు
కోట్లతోడను పంచుకొని భుజించె
మోపురిరాజుల సేపణంచుచు రాయ
చౌహత్తమల్లుఁడై జగతిఁ బరఁగె
ఖిలగిరి వనదుర్గ జలకోట మల్లుఁడై
గ్రక్కున చెక్కుఁ దుర్గములు గొనియె

నొసి తురకల గెలిచి ప్రతాపరుద్ర
మనుజనాయకు కోట నేమరకఁ గాఁచె
ననుచుఁ బొగడంగ నెగడె నియ్యవని నిందు
లూరి యన్నయదేవుఁ డనూనబలుఁడు"

## ముమ్మడమ్మ భర్త మహాదేవరాజెవ్వఁడు?

ఈమహాదేవరాజు నిరవద్యాపురాధీశ్వరుఁడును, చాళుక్య విష్ణువర్ధన వంశీయుఁడును నగు మహాదేవచక్రవర్తియై యుండునని నేను గుర్తించి "సుభాషి" పత్రికలోని "అన్నయదేవుఁడు—వింత చరిత్రాంశము"లను నా వ్యాసములోఁ దెలిపియున్నాను.[1] ఇప్పుడిం దునుగూర్చి కాకతీయ సంచిక సంపాదకులగు మారేమండ రామరావు ఎం. ఏ. బి.ఇడి గారు తమ కాకతీయ సంచికలో నీ క్రిందివిధముగాఁ గొన్ని యపూర్వ వాక్యములను లిఖించి ప్రకటించి యున్నారు.

"ఈమహాదేవరాజెవ్వరో నిర్ణయించుటకింతవరకును సరియైన యాధారములు గానరావు. దక్షిణహిందూదేశశాసన సంపుటములో కొన్ని శాసనములలో సర్వలోకాశ్రయ, విష్ణువర్ధనాది బిరుదాంకితుఁడును, చాళుక్యవంశీయుఁడును, నిడుదప్రోలు పాలకుఁడునగు నొక మహాదేవరాజు గాంచనగు చున్నాడు. ఈతఁడు శా. శ.1218-1228 లగు క్రీ. శ. 1296-1306 సంవత్సరముల నడుమ రాజ్యమేలి యుండెను. ప్రతాపరుద్రునితండ్రి యీతఁడే యనుటకుఁ గొన్ని యభ్యంతరములున్నవి. చాళుక్యాన్వయుఁడగు వీరభద్రునికిని గాకతీయరాజపుత్రిక యగు రుద్రమదేవికిని గూతురగు ముమ్మడంబ తానును చాళుక్యాన్వయుఁడగు మహాదేవరాజు నుద్వాహమగుట విహితముగ గన్పట్టుటలేదు. అదియునుంగాక ప్రతాపరుద్రుని జన్మకాలమగు క్రీ.శ.1254 సంవత్సరమునకును, చాళుక్యమహాదేవరాజు

(1) "సుభాషి" 1927, అక్టోబరు నెలసంచిక చూడండి

నాటి క్రీ. శ. 1296 నకును నడుమ నలువదిరెండు సంవత్సరముల వ్యత్యాసము గనుపడుచున్నది. ఈతఁడే ప్రతాపరుద్రుని తండ్రియై యుండి, యాతని 10 లేక 16వ రాజ్యసంవత్సరము వరకునుజీవించియే యుండినచో, నాతని ప్రశంస యించుకంతయు తాత్కాలిక శాసన వాఙ్మయాదులలోఁ గన్పడకుండుట చిత్రముగనున్నది."[1] కాని, మఱియొక మారేమండ రామారావు బి.ఏ. (ఆనర్సు) అనువారికిది చిత్రముగాఁ గన్పట్టుటలేదు. ఇవిగో వారివాక్యములు వినండి

Now, the *Sivayogasara* throws much new light on this point. In the first place it casts a doubt as to the relation between Rudramba and her first daughter, Mummadamba. Mummadamba is said to have been treated by the Queen as her own daughter. In fact, they were not mother and daughter. There is a tradition which states the same thing. It is said that a girl called Mummadamba was brought to Warrangal as bride to Rudradeva Maharaja alias Rudramba, that on the discovery of the latter's sex, the girl felt sorry and as a recompense was married to an illustrious person. Prataparudra is said to havo been the first of that Union. The *Sivayogasara* confirms the statement that Mummadamma was not the natural daughter of Rudramba. Secondly the book also confirms what Vidyanatha says about the parentage of Prataparudra. Maha deva and Mummadamba are said to be his father and mother. The celebrated Historian of the Andhras, Mr. Chilukuri Virabhadra Rao, identifies this Mahadeva with Mahadeva Chakravarti of Niravadyapura or Nidadavolu, who ruled between S. S. 1218-1222.[2]

---

(1) "కాకతీయసంచిక" పుట ౬౪.

(2) Quarterly Journal of the Andhra Historical Research Society, Rajahmundry. Vol. III, parts 2. 3 & 4. page 117.

ఈ పై వాక్యముల భావమిట్లున్నది. "ఇందునుగూర్చి శివయోగ సారమిప్పుడు నూత్నప్రకాశమును బ్రసరింపుచున్నది. మొట్టమొదట అయ్యాది రుద్రమదేవికిని ఆమె మొదటి కూతురగు ముమ్మడంబకుఁగల సంబంధము విషయమై సంశయము వెలిపుచ్చుచున్నది. ముమ్మడమ్మ రాణివలనఁ గూతురువలెఁ జూచు కొనఁబడినదని తెలియఁజేయబడుచున్నది. నిజముగా వారు తల్లికూతుండ్రు కారు. ఈ సంగతి తెలియఁజేయు గాథకూడ గలదు. రుద్రదేవమహారాజను పేర వ్యవహరింపఁబడు రుద్రాంబకై వధువుగా ముమ్మడంబ అను నొక కన్య యోరుగల్లునకుఁ గొనిరాఁబడియెను. ఆమె రుద్రమదేవిని స్త్రీనిగా గ్రహించి విచారింపుచుండ దుఃఖపరిహారార్థ మామె నొక ప్రఖ్యాత పురుషునకిచ్చి వివాహము గావింపఁబడెను. ఆదంపతుల పుణ్యఫలమె ప్రతాపరుద్రుఁడు. ముమ్మడమ్మ రుద్రమదేవి యారసపుత్రిక కాదని శివయోగసారము చాటి చెప్పుచున్నది. ఇదిగాక యాగ్రంథము ప్రతాపరుద్రుని తల్లిదండ్రులను గూర్చి విద్యానాథుడు చెప్పిన దానిని ధ్రువపఱచుచున్నది. ముమ్మడమ్మ మహదేవులు ప్రతాపరుద్రుని తల్లిదండ్రులని చెప్పఁబడుచున్నారు. సుప్రసిద్ధాంధ్ర చరిత్రకారులగు చిలుకూరి వీరభద్రరావుగారు ఈ మహాదేవరాజే నిరవద్యాపురా (నిడుదవ్రోలు) ధీశుఁడై శా. శ. 1218–1222 లలో బరిపాలనము చేసిన మహాదేవచక్రవర్తి యని నిర్ధారణ చేయుచున్నారు.

ఇంకొక తమాషాగలదు; చూడండీ. పులిమీద పుట్రపడినట్లు మఱి నాలుగు సంవత్సరములు జరిగినవెనుక మఱియొక మారేమండ రామరావు బి.ఏ. (ఆనర్సు) బి.ఇడి గారవతరించి "శివయోగసార" మను గ్రంథమును దామేగనుపెట్టినట్లుగా నందునుగూర్చి యొకవ్యాసమును వ్రాసి ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలోఁ బ్రకటించినారు. అందలి

యుపోద్ఘాతవాక్యముల చదువరుల వినోదార్థమిట నుదాహరించు చున్నాఁడను.

"చరిత్రమునకును మతమునకును గూడ మిక్కిలి ముఖ్యమగు నీ గ్రంథము చరిత్రకారుల దృష్టినాకర్షింపలేదు. ఇయ్యది పూర్వోత్తరభాగములు గలది. ఒక్కొక్క భాగమున నాల్గాశ్వాసములు గలవు. ఇందలి యుత్తరభాగము వారంగల్ శైవపరిచారిణీమండలి వారిచే ముద్రింపఁబడినది. హైదరాబాదు లక్ష్మణరాయ మండలి వారియొద్ద పూర్వార్థ చతుర్థాశ్వాసమును, రాజమహేంద్రవర గౌతమీ గ్రంథాలయమున మొదటి మూడాశ్వాసములును గలవు.

పై గ్రంథాలయప్రతి యరుదైనది. శిథిలావస్థలో నున్నది. సుమారైదు మాసములకుఁ బూర్వము నేను జూచినపు డందలి నాలుగైదు పుటలలో నెడమవైపున నొక యంగుళము భాగము మాత్రము పోయినది. కొలఁది దినములకిత్రి మీవ్యాసమును రచించునపుడు తిరిగి యాగ్రంథమును బరిశీలింపఁగా నావపుటలో సగముభాగ మదృశ్యమై యితరస్థలములలో గొన్ని క్రొత్తశిథిలము లేర్పడినవి. గ్రంథమునఁ గొన్ని తప్పులుకూడ గలవు. ఆంధ్రలోకము మీగ్రంథమును గూర్చి జాగ్రత్త దీసికొనవలసి యున్నది"[1] ఏమి హేతువుచేతనో వీరి వ్యాసమసంపూర్ణముగాఁ బ్రకటింపఁబడి నేటికిని బూర్తిగావింపఁబడక యట్లే నిలిచి యున్నది. ఎంతగట్టిగా నొక్కి నొక్కి చెప్పినను, ఏదుర్ముహూర్తమున వీరి హస్తమావాత్రప్రతిపై బడినదో గాని యాగ్రంథమటు పిమ్మట మటుమాయమై పోయినది. ఈ ప్రతిపోయిన విషయము నామిత్రులును, ఈ వ్రాఁతప్రతిని నేను తిరిగి వారికిచ్చివేసిన తరువాత గౌతమీ గ్రంథాలయమువారికి నొసంగిన వేమూరి విశ్వనాథ శర్మగారు నాతోఁ జెప్పఁగా నేను

(1) ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సంపుటము ౨౧ సంచిక ౫.

మిక్కిలి చింతించితిని. కాకతీయసంచిక సంపాదకులు మాత్ర మా "శివయోగసార గ్రంథావతారిక" లోని పద్యముల నన్నిటిని సుభా షినుండి గ్రహించిరని పాఠకు లనుకొందు రేమో యను సంశయము గలిగి గౌతమీ గ్రంథాలయములోని ప్రతినుండి గ్రహించినవని చెప్పుకొనిరి. అట్లే విశ్వసింతము గాక !

మహాదేవరాజు రుద్రమదేవి మఱిదియై యుండడా !

ఈ భిన్నవ్యక్తులుగాఁ గన్పట్టెడు మారేమండ రామారావుల చిత్రచర్యలను గూర్చిన చర్చలట్టుండనిచ్చి కాకతీయసంచిక సంపా దకులయిన మారేమండ రామారావు ఎం. ఏ. బి. ఇడి గారికి నీ మహాదేవరాజు వలన గలిగిన శంకలను దీర్చివేయుభారము నాపైన బడినందున శంకానివృత్తిమార్గ మన్వేషించుట నాకు తప్పనిపని యైనది. అందుకై నాశక్తికొలఁది ప్రయత్నించి చూతును.

ఈ కాలమున మనకిర్వురు చాళుక్య మహారాజులు గన్పట్టు చున్నారు. వారెవ్వరనఁగా నొకరు రుద్రాంబభర్తయైన వీరభద్రే శ్వరుని తండ్రితండ్రి (తాత) యైన మహాదేవరాజు, ఇతనికి చక్రి వర్తి" యను బిరుదము గానరాదు. నిడుదప్రోలు పాలకుఁడగు మఱి యొక మహాదేవరాజుగలఁడు. ఇతనికి మాత్రము చక్రవర్తి యను బిరుదము గలదని శాసనములవలనఁ దెలియుచున్నది. ఇతఁడే ముమ్మ డమ్మభర్త యని నేనిదివఱకె "సుభాషి" పత్రిక యందు "అన్నయ దేవుఁడు—వింతచరిత్రాంశము" లను వ్యాసములో గుర్తించి యు న్నాను. కొలనుపాక శాసనములో రుద్రమదేవి భర్తయగు చాళు క్యవీరభద్రేశ్వరుని వర్ణింపుచు—

రెండవ వైపు.

22 ........................భార్యై
23 వ్విఖ్యాత్వస్యతస్యాః పతిరభవ
24 దగ్గోవీరభద్రాభిధాన స్సా
25 ందర్య్యోగ్గణేందుమస్త్వాం
26 పతిమపిమహాసా
27 మందభాసావిత్వన్ (।) య
20 ద్వైదగ్ధ్యం విదగ్ధం యదును
29 వితరణం యాచకో
30 దూయదాజ్ఞాం రాజానోయ
31 (త్ర) తాపం విమతనృపత
32 యోజాగ్గనతే జ్ఞాతభావాః ॥ దే
33 ష్ఠశ్చాలుక్య వంశార్ణ్ణవ......

మూండవ వైపు

1 శివాఖ్యయ్యా త్తేజస్ఫూర్తి (వీ)
2 రైరవినృపతి తమస్సంచయై
3 షుయాతం॥'' లక్ష్మాంబా
4 యాంసుతో జాత శ్రీమహా
5 దేవరాజతః । నామ్నేందుశే
6 ఖరో రాజకుమారశ్శివయో
7 రివ॥ ఇందుశేఖర నరేంద్ర
8 నందనే నందతి స్వయమ
9 శేషనందనే । జగ్ముసాంవిత
10 రణం రణం ముహుస్స్వస్థ
11 తైవవిదుషాంద్విషామపి॥''

అని యుండుటచేత మహాదేవరాజునకు లక్కాంబికయందు జనించినట్టి ఇందుశేఖర రాజకుమారునకు వీరభద్రుఁడు జ్యేష్ఠుఁడుగా జనించినట్లు కనంబడుచున్నది.1

పాలకొలనులోని శాసనమువలన ఉదయమహాదేవి యిందుశేఖరునిభార్యయనియు,వీరభద్రేశ్వరునితల్లియనియు నింతకుపూర్వమె తెలిసికొనియున్నాము.2 ఈదంపతులకు జ్యేష్ఠుఁడుగా జనించినవాఁడే చాళుక్య వీరభద్రేశ్వరుఁడని కొలనుపాక శాసనమువలన నూహింపవచ్చునుగదా. జేష్ఠకుమారుఁడని తెలిసికొన్నతోడనే యింకను కుమారులొక్కఁడో యిద్దఱో యుందురని స్ఫురింపక మానదుకదా. ఇట్టి సందర్భమున మహాదేవరాజే యిందుశేఖర, ఉదయాంబల ద్వితీయ పుత్త్రుఁడని నేనూహచేసితిని.ఇట్టినాయూహను బలపఱచు కారణములు గలవు. వాని వివరింతును వినుఁడు. ఇందుశేఖరునకు నుదయాంబకు వీరభద్రుఁడను కుమారుఁడు మాత్రమెగాక అన్నెమాంబలేక అన్యాంబయనుకొమార్తె యొండుగలదనియు, ఆమెహైహయాన్వయుఁడును, కోనమండలాధిపతియు రాజపతేని పుత్త్రుఁడు నగు భీమజనవల్లభ నృపాలుని భార్యగా నుండెననియు పాలకొలను శాసనములలో అన్యమాంబశాసనము3 వలన విదితమగుచున్నదని యింతకుఁబూర్వము దెలిపియున్నాను. అన్యమాంబ చాళుక్యవీర భద్రేశ్వరునకు సోదరిగ నుండినవుడు వానితమ్ముఁడైన మహాదేవరాజునకుఁ గూడ సోదరియని మనము విశ్వసింపక తప్పదు. చాళుక్యకులజ యగు అన్యమాంబికకును, హైహయాన్వయుఁడగు భీమజనవల్లభ నృపాలునకు జనించిన పుత్త్రిరత్నము కోనగణపద్దేవ మహారాజని పాలకొలను క్షీరారామేశ్వరుని దేవాలయములోని మఱియొక శాసనములో—

1 తెలింగానా శాసనములు- పుట ౯౧.
ఆంధ్రసాహిత్యపరిత్పత్రిక. సంపు. ౯౩ సంచిక ౪. పుట. ౧౩౯.
కాకతీయసంచిక- అనుబంధము. పుట ౬౬.

(2) S. Ins. Vol. IV No 122, A. R. No. 509 A of 1893,
(3) S. I. Ins. Vol. IV No. 121. A. R. No. 509 of 1893.

"రాజాసహస్రబాహోః శ్రీకులేభూద్భీమవల్లభః
చాళుక్యకులజా తస్య పత్న్యాసీదన్యమాంబికా।
తయోగ్గణపతిర్వీరోజాతః కోణావనీపతిః జయంత్త ఇవ కాంత్తః."

అని వ్రాసియుండుట వలన ధ్రువపడుచున్నది 1

మహాదేవచక్రవర్తి యొక్క కూతురయిన ఉదయ మహాదేవి యొక్క రెండు దానశాసనములు సాలకోలను శ్రీరారామేశ్వరుని యాలయములోఁ గలవు. ఒకటి తన తల్లిదండ్రుల కొఱకును, మఱియొకటి తనకును. తనభర్త్తయగు కోనగణపద్దేవ మహారాజు కొఱకును బుణ్యమునకు గాను జేయబడిన దానశాసనములై యున్నవి.2 ఒకదానిలో పిన ఉదయ మహాదేవి యని పేర్కొనఁబడియెను. ఇందు శేఖరునకు నుదయాంబకు ద్వితీయపుత్రుఁడగుట చేతనే మహాదేవచక్రవర్తి తనతల్లి నామమును తన కొమార్తెకుఁ బెట్టుట సంభవించినది. అప్పుడు నాయనమ్మ ఉదయమహాదేవియు, ఆమె మనుమరాలు ఉదయమహాదేవియు నుండుటచేత నెల్లవారు మహాదేవచక్రవర్తి కూతురిని పిన ఉదయమహాదేవి యని వ్యవహరించుట సంభవించినది. అన్యమాంబ మహాదేవ చక్రవర్తితోఁడ బుట్టువుగనుకను తనతోఁబుట్టువు జ్యేష్ఠకుమారుఁడును, మేనల్లుఁడు నగు కోనగణపతిదేవ మహారాజునకు మహాదేవచక్రవర్తి తన కూతురిని పిన ఉదయమహాదేవినిచ్చి వివాహము చేయుట సంభవించినది. ఇందువలన పినఉదయమహాదేవి రెండవ ప్రతాపరుద్రచక్రవర్తికి సోదరియో లేక సవతి సోదరియో యని తేటపఁడుచున్నది. పిన ఉదయాంబతల్లి ఎవ్వరో శాసనములలోఁ గానరానందున నీమె

(1) S. I. Ins. Vol. IV, No. 123, A. R. No. 509 B. of 1893
(2) S. I. Ins. Vol IV, No. 125, A. R. No. 511 of 1893
(2) S. I. Ins. Vol IV, No. 124 A. R. No. 510 of 1893
(3) S. I. Ins. Vol IV, No. 127 A. R. No. 512 A of 1893.

ముమ్మక్క గర్భమున జనించిన పుత్రికయె యని గట్టిగాఁ జెప్పుటకు సాధ్యము గాకయున్నది. ఈ మహాదేవచక్రవర్తి రుద్రమదేవి చక్రవర్తిని కల్లుఁడగుటచేతను, రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తికి దండ్రియగుటచేతనే సామంతమండలాధీశ్వరులును ప్రజలును గూడ మహాదేవరాజును గౌరవార్థము మహాదేవచక్రవర్తి యని వ్యవహరించుటకు నాటంకముఁ జూపక సహించుటకుఁ గారణమయ్యెను. ఈ చాళుక్య వంశములో నితఁడొకఁడే యిట్టి బిరుదము వహించుటకు మూలకారణము పైఁజెప్పినట్టిదే యై యుండును.

లక్ష్మణరాయపరిశోధక మండలివారు ప్రకటించిన కొలను పాక శాసనములో చాళుక్యాన్వయుఁడగు వీరభద్రుడు కాకతీయ రాజపుత్రిక యగు రుద్రమదేవికి భర్తయని వ్రాయబడి యుండెనే కాని కాకతీయసంచిక సంపాదకులగు మారేమండ రామరావుగారు చెప్పినట్లు ముమ్మడమ్మ వీరభద్ర రుద్రమదేవులకు కూతురని వ్రాయబడి యుండలేదు. అట్లూహించుటకునైన ముమ్మడమ్మ పేరే యందు గానరాదు. ఇదివట్టి యసత్యకల్పనము. శివయోగసారములోఁ జెప్పినఁ "ఆత్మజనాఁ బొగడొందు" అనునదియే సత్యము. కావున చాళుక్యాన్వయుఁడగు మహాదేవరాజు ముమ్మడమ్మను పెండ్లిచేసికొనుటలో దోషములేదు. ఆమెనిజముగాఁ దన కొమార్తెగా నుండుట చేతనే రుద్రమదేవి తన మఱదికి నిచ్చి వివాహము చేయుటకు సమ్మతించినది. పెద్దలంగీకరించిరి. మఱది కుమారుని పుత్రునిగా భావించి పెంచినది. అంతియగాని మఱియొకటిగాదు. ఇయ్యది గణపతిదేవ చక్రవర్తియు, రాజగురు విశ్వేశ్వర శివదేశికుడు, చాళుక్య వీరభద్రేశ్వరుఁడు మొదలగువారు బాగుగా నాలోచించి జరిపినతంతు గాని వేఱొండు గాదు. ఈ విషయమును మారేమండ రామరావు బి. ఏ (ఆనర్సు) బి.ఇడి, గారంగీకరింపఁగా మారేమండ రామరావు ఎం. ఏ. బిఇ.డి గారు,

"అకుపితరుద్రమాంబికకు నాత్మజనాఁ బొగడొందు ముమ్మడ
య్యకుమహాదేవరాజునకు నాత్మజుఁడైన ప్రతాపరుద్రుఁడా
సకలమహీభరంబును వెసన్ దన యంతవహించిదాల్చెనా
యకమహిమంబులన్ దొరిగె యన్నయదేవుఁడు రుద్రదేవుఁడున్."

అను శివయోగసారములోని పద్యమునందున్న కడపటి రెండు పాదములను తాము సంపాదకీయ వ్యాసమునఁ జదువరులకుఁ గానరాకుండఁజేసి యెంత మాత్రమును జర్చింపక యేమియుం దెలియనివానివలె విడిచిపెట్టి విపరీత వ్యాఖ్యానమునకు గడంగినారు. ఇప్పటివఱకు దొరకిన సాధనములను బట్టి ముమ్మడంబ రుద్రమదేవికి నిజమైన కూతురుకాదని, ముమ్మక్క భర్త నిడుదవ్రోలు పురాధీశుడైన చాళుక్య మహాదేవచక్రవర్తి యనియు, రుద్రమదేవి తన మఱదియైన మహాదేవుని కుమారుడైన ప్రతాపరుద్రునికి సామ్రాజ్యమును సంక్రమింపఁ జేసినదని స్పష్టమగుచున్నది.

## రుద్రమదేవి పరిపాలన ప్రారంభకాలము.

రుద్రమదేవి గణపతిదేవి చక్రవర్తికాలముననే రాజ్యాంగమున జోక్యముకలిగించుకొని పరిపాలనము చేయుచున్నట్లు కొన్ని నిదర్శనములు గనుపట్టుచున్నను క్రీ.శ. 1261లో సింహాసన మధిష్ఠించినట్లు గనుపట్టుచున్నది. ఆకాలమునందు సుప్రసిద్ధ సామంత మండలాధిపతులలో నొక్కఁడగు మల్యాలగుండ దండాధిపుఁడు క్రీ. శ. 1259 సంవత్సరమునాటి బూదపూరు శాసనములో శ్రీమన్మహామండలేశ్వర రుద్రదేవ మహారాజులు (రుద్రమదేవి) ఒరంగల్లు మొదలిపట్టణముగా సుఖసంకథా వినోదంబులం బృథ్వీరాజ్యము సేయుచుండ నామెకు దాను దక్షిణ భుజముగా నుంటినని చెప్పుకొని యుండుటచేత 1261 పూర్వమునుండియు రుద్రమదేవి పరిపాలనము సేయుచుండెనని నిశ్చయింప వచ్చును.[1] కాకతి గణపతిదేవచక్రవర్తి

1 తెలింగానా శాసనములు. బూదపూరి శాసనము సంఖ్య ౨౦. పేజీ. ౫౮.

క్రీ. శ. 1267 సంవత్సరములో మరణము జెందెను. ఈమె పరిపాలన ప్రారంభమున మరల శత్రువులవలన నుపద్రవములు సంభవించెను. ఈ సందర్భమునఁ గాకతీయ సామంతమండలాధీశ్వరులు కొందఱు కూడ తిరుగుబాటు చేసిరి. గణపతి మరణమునకుఁ బూర్వమునను, పరమునందును గూడ కాకతీయ సామంతులును, ఆవణ్యావనోద్భవులు నయిన మహారాజ సింహాదులు వేంగివిషయమును కళింగగాంగ రాజులకు స్వాధీనముగాకుండ గాపాడగల్గిరి. వీరిశాసనములు 1262సంవత్సర ప్రాంతములందు దాక్షారామమునఁ గానవచ్చుచున్నవి. దక్షిణ దిశను కాయస్థకులాన్వయులును బ్రహ్మరాక్షస గండబిరుదాంచితులు నైన జన్నిగదేవుఁడు త్రిపురాంతకదేవుడు, అంబయదేవుఁడు మొదలగు వారు తిరుగుబాటుచేసి ధిక్కరించిరిగాని యా తిరుగుబాటణచి వేయబడినది. ఇదే సమయమని కాంచీనగరమును జయించిన జటావర్మ సుందరపాండ్యుఁడు మహారాజసింహుని వశ్యునిగావించుకొని యాతని మైత్రిని సంపాదించి దండెత్తివచ్చి విక్రమసింహపురమను నెల్లూరు నాక్రమించు కొనియెను. గణపతిదేవచక్రవర్తి కాలమున నడగి మడగియుండిన కాంచీపుర పల్లవసామంతులు గుంటూరు మండలములోఁ దిరుగుబాటుచేసిరి. గణపతి యంత్యకాలమున నాగదేవరాజు గుంటూరు మాండలికుఁడుగ నుండెను. రుద్రమదేవియొక్క సకలసేనాధిపతి పట్టసాహిణియైనపడికము బొప్పదేవుఁడను నాతఁడునాగదేవరాజును, వానిబలమునునాశనముఁజేయుట వలననే గాఁబోలు, నతనికి "గోదావరీతీర సమరగాండీవి" యనియు, "గొంటూరి నాగదేవతల గొండుగండ" యనియు, "కళింగమండలి కథాటి సమర్థరాయకువరు తొండిపాడిరాయ కువరుపడి ఘూణమల్ల" యనియు, "కాకతీయ గణపతిదేవ మహారాజదివ్య శ్రీపాదపద్మారాధక" యనియు బిరుదములున్నట్లు అతని త్రిపురాంతక శాసనమున

గన్పట్టుచుండెను.1 మఱియు నీశాసనమునందు కళింగదేశమునగ త్త రువులు పుట్టినట్లు శాసనమున సూచనలు గలవు. కళింగదేశమాండ లికు లయిన చాళుక్య విజయక్షితీశుని యొక్కయు, ఒడ్డాది అర్జున దేవుని యొక్కయు, శాసనములు దాక్షారామమున గొన్ని గన్పట్టుచున్నవి. ఈ సందర్భమునఁ గాళింగ సామంతులతో సంఘట్ట నలు సలిపి విక్రమపౌరుషములు చూపిన కాకతీయసామంతుల శాస నములు గూడఁ గన్పట్టుచున్నవి. ఇట్టిశాసనములు 1274 మొదలు కొని 1287 వఱకు గలవు. పోతినాయకుఁ డొకఁడు తన కొమాళ్ళగు సూరప, పోతయ, మారయలతోఁ గలిసి గజపతులతో యుద్ధములు చేసి జయించినట్లు వారిబిరుదములు తెలుపుచున్నవి. నల్లపనాయుని ప్రోలినాయునికి "పాణ్యంధాళరాయధూమకేతు" అనియు, "కాళ వరాయది శాపట్ట"యనియు, సేవణరాయ లవణపాంచణు"అనియు, "ఒడ్డియరాయమానమర్దన" అని బిరుదము లున్నట్లు పులిదండి శాసనమువలనఁ దెలియుచున్నది.2 ఒడ్డియరాయఁ డనఁ గళింగ భూవిభుఁడే.తరువాతనీభూభాగమంతయు, అన్నయదేవ రుద్రదేవులను కాకతీయసైన్యాధ్యక్షులచే జయింపఁబడి సింహాచలమువఱకునుండు దేశమంతయుఁ గాకతీయసామ్రాజ్యమునఁ జేర్పఁబడినదని ఘంటాపథ ముగఁ జాటవచ్చును.

## మల్యాలగుండ దండాధిపుఁడు.

కాకతి గణపతిదేవచక్రవర్తి కడపటి పరిపాలనకాలమునను, రుద్రమదేవ చక్రవర్తియొక్క ప్రారంభపరిపాలనమునను మిగుల బ్రఖ్యాతిగాంచిన మల్యాలగుండాంరాజు రుద్రమదేవికి దక్షిణభుజముగా నుండినవాఁ డని యతని బూదపూరు శాసనమువలనఁ దెలియుచు

1. Ep. Colln. 194 of 1905.

(31) ఆంధ్రపత్రిక సారస్వతానుబంధము దుందుభికార్తిక బ 30 శని.

న్నది. ఇతఁడు కాకతీయచక్రవర్తుల పక్షమునుండి దేవగిరిరాజు లయిన సేవణవంశీయులతో జరిగిన యుద్ధములలో నాయకుఁడై విజయములను గాంచినట్లు గనుబడుచున్నది. ఆతఁడు గోనబుద్ధారెడ్డి కల్లుఁడు. బుద్ధారెడ్డికూతురగు కుప్పాంబయొక్క భర్తయై యున్నాఁడు. ఇతఁడు దుర్జయవంశీయుఁడై యున్నాఁడు. ఇతని బూదపూరి శాసనమునందే కాకతీయవంశము చతుర్థాన్వయమని చెప్పఁబడినది. వీనియొక్కయు, వీని భార్య కుప్పాంబయొక్కయు శాసనములు పెక్కులు తెలింగాణాలోఁగలవు. ఇతఁడు గొప్పసైన్యాధిపతిమాత్రమె గాక సంకిసపురాధినాథుఁడై, విద్వద్గోష్ఠులతోఁ గూడఁ గాలము గడుపుచుండెనని వీని శాసనములవలనఁ దెలియుచున్నది. ఇతఁ డనేక తటాకములను నిర్మించెను. ఇతఁడు గణపతిదేవ చక్రవర్తి పేరిట నొక తటాకమును ద్రవ్వించి గణపసముద్రమని పేర్వెట్టి కులశీలవిద్యాతపస్సంపన్ను లయిన బ్రాహ్మణులను రప్పించి వారల కనేకవిధములయిన మడులు మాన్యములు గల్పించి సత్కరించి కీర్తిగన్నవాఁడు. ఇతఁడు మరణముఁ జెందిన వెనుక నీతని భార్య కుప్పాంబ కూడ ననేకధర్మములను బ్రతిష్ఠాపనలను గావించెను. గణపతిదేవ చక్రవర్తికాలమునఁ బ్రఖ్యాతి కెక్కిన సేనాధిపతులగు కాటచమూపతి, చౌండసేనాధిపతి, జావసేనాధిపతి మొదలగువారు గుండదండాధిపుఁడును గూడఁ బ్రసిద్ధవీరవంశమని చెప్పఁదగిన మల్యాలవంశములోని వారే. వీరందఱు మహావీరులును, మహాసేనానులునై యుండి విశేషప్రఖ్యాతిఁ గాంచినవారే.

## రుద్రాంబిక మహాదేవరాజును జయించుట.

గణపతి చక్రవర్తి యవసానకాలమునఁ జెప్పినరీతిగా శివదేవయ మొదలుగా గల మంత్రివర్గమును, జన్నిగదేవ మహారాజు మొదలుగాఁ గల సేనాధిపతులును, ప్రసాదాదిత్యనాయఁడు మొదలుగాఁగల భృత్యవర్గమును ధైర్యసాహసములను జూపి రుద్రదేవుని పట్టాభిషిక్తురాలినిగఁ జేయుట వీరవరులయిన మాండలిక రాజులలోఁ గొందఱకు నవమానకరముగఁ గన్పట్టెను. ఆంధ్రసామ్రాజ్య పీఠము నధిష్ఠించిన యొక్క యాఁడుదాని పాదపద్మములకు మ్రొక్క వీర పురుషాగ్రగణ్యులకుఁ దలవంపులుగఁ గన్పట్టెను. ఇట్లు మాండలిక రాజులు గొందఱు చక్రవర్తిని యెడగల భయముచే మిన్నకుండినను రాజద్రోహులై దేవగిరి ప్రభువులైన యాదవులతోడఁ గుట్రలుచేసి తుదకు యాదవులు దండెత్తి వచ్చునటులఁ జేసిరి. ఇక్కడ యోరుగంటిలో గణపతి చక్రవర్తి మరణముఁ జెందిన సంవత్సరముననే యక్కడ దేవగిరిలో యాదవప్రభు వయిన కృష్ణభూపతి కూడ మరణముఁ జెందెను. అతని సోదరుఁడగు మహాదేవరాజు పట్టాభిషిక్తుఁడయ్యెను.

ఈ మహాదేవరాజు స్త్రీలను శిశువులను ఎప్పుడును జంపినవాఁడుకాఁడు గావున నీతఁడు పట్టాభిషిక్తుడయిన తోడనే యీతని పరాక్రమమునకు భయపడి యాంధ్రులొక్క యాఁడుదాని మాళవులొక్క శిశువును సింహాసన మెక్కించిరని శాసనములోఁ గవులు గొనియాడిరి. ఆ స్తోత్రముల కుబ్బి ప్రతాపవంతుఁడైన మహాదేవరాజు త్రిలింగదేశముపై దండెత్తి రాఁ బ్రయత్నించెను. ఇంతలో రుద్రాంబాదేవి యూరుకొనక తన తండ్రివలన నీ రాజ్యతంత్రజ్ఞానమును చక్కఁగా గ్రహించినది గావున నిసుమంతయుఁ గొంకక

యెంతమాత్రము నుపేక్షింపక శిథిలములయిన దుర్గభాగములనన్నిటిని బాగుచేయించి విశ్వాసపాత్రులయిన మంత్రిసేనాపతి సామంత భట వర్గమును రప్పించుకొని కోటల నన్నిటిని సురక్షితములుగఁ గావించెను. ఏకశిలా నగరమునకుఁ జుట్టును గంపకోటను గట్టించెను. దీనికి లోతట్టున మట్టికోటను గట్టించెను. దీని చుట్టును గొప్పయగడ్తను ద్రవ్వించెను. భూమికోటకు గవనులు ౮ దియును, దిడ్లు ౧౮ను, పుట్టకోటకు గవనులు ౪ ను, దిడ్లు ౭ యును, రాతికోటకు గవనులు ౪ ను, దిడ్డు ౮ దియును, రాతికోటకు లోతట్టున రాతి సోపానములను పెట్టించి ఆలంగముమీఁద తనబంధువర్గములోని వీరభటుల నుండ నియమించి తక్కిన తనబంధువర్గము నంతయు రాతికోటకు లోతట్టుననున్న యిటుకకోటలో నుండ విధించెను. కొమ్మ ౧కి యిద్దఱును: బురుజు ౧కి పేఁబదుండ్రును, దిడ్డి ౧కి నూఱ్ఱురను. గవను ౧కి ఏనూఱ్ఱురను వీరభటులను గాపువెట్టెను. బుద్ధగణపతి నారాధింపఁగోరి వడ్డపల్లెకును అటనుండి ఏకవీరా మహాదేవిని గొలుచుటకై మొగలిచెర్లకును బోయి అయిదు దినములచ్చట నున్న కాలమున హరిహర దేవుఁడును, మురారి దేవుఁడును ఆమెను బట్టుకొనఁ బ్రియత్నించిరి. అప్పుడెద్దియో యొక యుపాయమును బన్ని తన కొమార్తెయైన ముమ్మక్కతోఁగూడ దప్పించుకొని వచ్చి యేకశిలా నగరమునం బ్రవేశించి కొంతసైన్యమును బంపించి వారల నిరువురను జంపించి వారల యైశ్వర్యమునంతయుఁ జూఱఁగొని యాధనముతో పద్మాక్షీదేవికి మహోత్సవములు గావించెను. అప్పుడు దేవగిరినుండి మహాశూరుఁడైన మహాదేవరాజు అసంఖ్యాకములైన సైన్యములతో దండెత్తివచ్చి యేకశిలా నగరమును ముట్టడివేసెను. ఇట్లు మూఁడులక్షల సైన్యముతోవచ్చి మహాదేవరాజు ముట్టడించి

నను భీతినొందక రుద్రమదేవి వెలమ సేనానియగు రుద్రమనాయని నగరపాలకుండును సేనానియు నగు నాగచమూపతిని హెచ్చరించి యా సేనానుల సాహాయ్యముతో పదునేను దినములు ఘోర యుద్ధముసేయఁగా యాదవసైన్యంబులు వెలమ కమ్మవీరుల ధాటికి నిలువంజాలక పలాయనంబులయ్యెను. రుద్రమదేవి యంతటితోఁ దృప్తినొంది యూరకుండక తానె నాయకత్వమును వహించి యాదవ సైన్యంబులను వెంటాడించి నురుమాడుచు దేవగిరివఱకుఁ దఱిమి గొట్టఁగా మహాదేవరాజు తాను జేసిన యవివేక కృత్యమునకుఁ బశ్చాత్తప్తుఁడై రుద్రమదేవిని శరణువేడి కోటి ద్రవ్యంబు లపరాధముగ నిచ్చుకొని సంధి గావించుకొని నిజరాజధానికిఁ బోయెను. అప్పుడు రుద్రమదేవి తనదేశమునకును మహాదేవరాజు దేశమునకును సరిహద్దున జయస్తంభములను పాతించి వానిపై శాసనములను వ్రాయించి యేఁబదిలక్షల హొన్నులను తన సైన్యములకుఁ బంచిపెట్టెను.

## జన్నిగదేవసాహిణి.

కాయస్థకుల సంజాతుండైన యీజన్నిగదేవసాహిణి రాజభక్తి గలిగి తన మేనమామ యైన గంగయసాహిణికిఁ దరువాత సైన్యాధ్యక్షుఁడును, ఆప్తమంత్రులలో నొకఁడునై దక్షిణభాగమున ననఁగా మార్జవాడి మొదలుకొని పానుగంటివఱకుఁ గల దేశమును బరిపాలించుచుండెను. ఇతఁడు బ్రతికి యున్నంతవఱకుఁ రుద్రమదేవికి దక్షిణ భుజంబుగ నుండి యామెకు శత్రువులై రాజద్రోహమును జేయ బూనిన సేనానులను మాండలిక రాజులను శిక్షించుచు వచ్చి అరాజకమనెడి యుపద్రవమునుండి దేశమును రక్షించెను. ఇతనికి బ్రహ్మరాక్షసుఁడు మొదలుగాఁ గల బిరుదము లనేకములు గలవు. ఇతఁడు శా. శ. ౧౧౮౨ రౌద్రిసంవత్సర చైత్రశు ౧౧

గురువారమునాఁడు పొత్తపినాటి సీమలో బాహునదికి దక్షిణభాగమున నున్న పురందిలూరనియెడు గ్రామమును శ్రీపర్వతామల బసవగోళక మఠమునకు సంబంధించిన నిజగురు శాంతపూర్వశివ దేశికులకు బ్రాహ్మణాతిథ్యభ్యాగతపూజార్థము సమర్పణము చేసినట్లుగ పొందలూరు గ్రామములోని యీశ్వర దేవాలయములో రంగమండపమున కెదుటనున్న ఱాతిస్తంభముపై గల శాసనమువలనఁ దెలియుచున్నది. జన్నిగదేవ మహారాజు పరిపాలనకాలములో పల్నాటిసీమలోని కారెముపూడి గ్రామమునఁ బ్రతిష్ఠచేయఁబడిన సురేశ్వరాలయమునకుఁ బ్రాకారమును గోపురమును నిర్మింపఁబడినవి. నామయ యను కరణముచే దుర్గిలేక దుర్గయపట్టణమున గోపీనాథుని యాలయము శా. శ. ౧౧౯౧ అనఁగా క్రీ. శ. ౧౨౬౯ వ సంవత్సరమున గట్టఁబడినది. ఈ సంవత్సరమునకుఁ దరువాత నీతనినామము మఱి యెచ్చటను వినంబడనందున నీతఁడు క్రీ.శ. ౧౨౭౦ వఱకుమాత్రము జీవించెనని యూహింపఁదగినది.

## త్రిపురాంతక దేవమహారాజు.

కాయస్థకులార్ణవ చంద్రు లయిన గంగయసాహిణియు అతని మేనల్లుఁడైన జన్నిగదేవ సాహిణియు స్వర్గస్థు లయిన పిమ్మట త్రిపురాంతక దేవమహారాజు రుద్రమదేవికిఁ బ్రధానియు సైన్యాధ్యక్షుఁడునై కమ్మనాడు, ములికినాడు, పొత్తపినాడు, గండికోట మొదలగు సీమలకు నధికారియై ప్రతినిధిపాలకుండై పరిపాలించి వాసికెక్కెను. మఱియు నితఁడు తన శాసనములలో "శ్రీమన్మహామండలేశ్వర బాహత్తరనియోగాధిపతి, అనేక దేశాధిపతి చాతుర్వర్ణసముద్ధరణ, పశ్చిమరాయదామోదర దిశాపట్ట, ఏకాంగవీర, వీరావతార, అతివిషమహామూరూఢ ప్రౌఢరేఖారేవంత, విజయలక్ష్మీకాంతనాయక, నారాయణ, కదనప్రచండ స్తంభ స్తంభితసకలక్షితిపాల,

శౌర్యయశస్తోమ, తిలకితదిగంగనాముఖ, వితరణ గుణవినిర్జిత, కామధేను కల్పద్రుమ, ప్రణత సకలనరపతి మణిమకుట కోటిమకరికాచుంబ్యమాన చరణనఖకిరణ కందళ, కాకతికులతిలక, రుద్రదేవ మహారాజ చరణనళినయుగళ సమారాధన, సమధిగత సకలరాజ్యాధిపత్యమహావిభవ, చలమర్తుగండ, మూరురాయ జగదళ మండలీక బ్రహ్మరాక్షస, గండపెండారు, త్రిపురాంతకదేవ మహారాజులు" అను విశేషణములతో బేర్కొనఁబడి యుండుటచేతనే రుద్రమదేవి చక్రవర్తిని కాలమున నప్రతిమానప్రతాపవంతుఁడై యుండె నని వేద్యము గాకమానదు. ఈబిరుదావళి నంతయు గణపతిదేవ చక్రవర్తి సైన్యాధ్యక్షుఁడైన గంగయ సాహిణియు వహించి యుండుటచేత నితఁ డాతనికి కుమారుఁడో సోదరుఁడోయై యుండవలయు నని యూహించుచున్నాఁడను. అంబదేవ మహారాజు కుమారుఁడు త్రిపురాంతకదేవుఁ డని సిద్ధవటము సీమలోని వరికుంట గ్రామములో నొక శిలాశాసనమునం గలదని యొకస్థానిక చరిత్రమునం జెప్పఁబడినది గాని దొరతనమువారి శాసనపరిశోధకులు "అంబయదేవ మహారాజును" త్రిపురాంతకదేవుని కనిష్ఠ సోదరునిగాఁ బేర్కొని యున్నారు.[1] వీరి సిద్ధాంతమే సరియైనది కావచ్చును. అంబయదేవుఁడు త్రిపురాంతకదేవుఁడు వీర లుభయులును గూడ కడప మఠాధిపతియైన అఘోరశివాచార్యులవారి శిష్యులయిన వీరశైవులుగా నుండి యనేకదానములను జేసి ప్రఖ్యాతి వహించియుండిరి. త్రిపురాంతకదేవుఁడు మొదట దువ్వూరును తరువాత ములికినాటి సీమలోని వల్లూరుపట్టణమును రాజధానులుగఁ జేసికొని పరిపాలనము చేసెను. రుద్రమదేవి పరిపాలన ప్రారంభకాలమున స్వతంత్రులగుటకుఁ బ్రయత్నించి దేశముయొక్క శాంతికి భంగము కలిగించిన విజయగండ

1. Annual Report on Epigraphy for No.1906. 492. Public 2nd July 1906.

గోపాలుఁడు, ఎరువమానుమిలిదేవరాజు, సిద్ధయదేవ చోడరాజు, మొదలగు చోడులను జయించి దేశమున శాంతిని నెలకొల్పె నని తెలియుచున్నది. ఇతఁడు వీరశైవుఁడై నందున శైవగురువులకును శైలమఠములకును, త్రిపురాంతకములోని శ్రీత్రిపురాంతక దేవున కును శ్రీశైల మల్లికార్జున దేవునకును అనేక భూదానములను జేసి యుండె నని త్రిపురాంతకము మొదలయిన ప్రదేశములలోఁ గల యనేక శిలాశాసనముల వలన వ్యక్తమగుచున్నది.

## అంబయదేవ మహారాజు

త్రిపురాంతకుని కనిష్ఠసోదరుఁడుగాఁ జెప్పఁబడిన యంబయ దేవమహారాజు గండికోట మనోరథపురము రాజధానిగ గండికోట, ములికినాడు, రేనాడు, పెనాదాడి, పెడకల్లు, సకిలియెరువ, పొత్తపి నాడు, మొదలుగాఁగల సీమలనేలుచు త్రిపురాంతక దేవునకు సహా యుఁడై యుండెను. ఇతనికి ఘోడెరాయగంగిదేవయ్య సేనాపతిగ నుండెను. అంబదేవుఁడు శ్రీపతి గణపతి యనువానిని జయించి "రాయసహస్రమల్లుఁడు" అను బిరుదమును వహించెను. మఱియు నితఁడు దోర్దర్పమున నెల్లశత్రురాజుల యుద్ధరంగమున నెదుర్కొని యెరువమల్లిదేవుని, కేశవదేవుని, సోమిదేవుని, అల్లుగంగుని, దేవ బ్రాహ్మణులకు గర్భ శత్రువైన మల్లికార్జును, కదంబ రాజయిన దామోదరుని జయించెను. రాజ్యభ్రష్టుఁడైన మనుమగండగోపా లుని విక్రమసింహ పురంబున సింహాసన మెక్కించెను. కాడవరా యని నాశనము గావించెను. ఇతఁడును త్రిపురాంతక దేవునివలెనే బ్రాహ్మణులకు దేవ మత గురువులకు దేవమఠమునకు శివాలయము లకు ననేక భూదానములను గావించెను. ఊటుకూరు నందొక గొప్ప చెఱువు త్రవ్వించి అంబసముద్రమని పేరుపెట్టించెను. ఇతని మంత్రి అత్తిరేల యనుగ్రామములోని పరశురామేశ్వరుని యాలయమునకు

మాన్యము లొసంగి యారామముల నిర్మించి సత్రములనుగట్టించెను. కొన్నిగ్రామములలో చెఱువులు కాలువలు త్రవ్వించెను. పొత్తపి నాటి సీమనంతయు గొలిపించి కొలయేర్పరించెను. మఱియు ననేక సత్కార్యము లాచరించినట్లు దెలియుచున్నది. త్రిపురాంతక దేవుఁడును, అంబయదేవమహారాజును రుద్రమదేవి కాలమున మాత్రమే గాక రెండవ ప్రతాపరుద్ర చక్రవర్తి కాలమునఁ గూడనుండి రుద్రమదేవి యనంతరము స్వాతంత్ర్యము లగుటకుఁ బ్రయత్నించియు సాధ్యముగాక యతనివలనఁ బరాజితులై తమతొంటి యధికారములను గోల్పోయినట్లు గన్పట్టుచున్నది.

## గోనగన్నారెడ్డిసాహిణి.

కాకతి రుద్రమదేవి సైన్యాధిపతులలో నొక్కఁడగు గోనగన్నయసాహిణి వర్ధమానపురము రాజధానిగా నాంధ్రసామ్రాజ్యము యొక్క పశ్చిమభాగమున కంతయునధికారియై పరిపాలనముసేయుచు నామెకు దక్షిణభుజమై యొప్పియుండెను. ఈగోనగన్నారెడ్డికి విఠలనాథుఁడు సేనాపతిగా నుండెను. ఇతఁడు సర్వరాష్ట్ర సమస్త ప్రజారక్షణార్థమై రాచూరుదుర్గమును శా. శ. ౧౨౧౬ (౧౨౯౪) సంవత్సర మార్గశీర్ష శుద్ధ సప్తమినాడు నిర్మించెనని యాదుర్గముపై నొకగోడమీఁద లిఖింపఁబడిన శాసనమువలనఁ దెలియుచున్నది. ఆశాసనములో గోనగన్నయ్యరెడ్డి సమస్త గుణగణాకరుండనియు, సత్యరత్నాకరుండనియు సౌజన్యగౌరవుండనియు, అరిగండభైరవుండనియు, సాహసోత్తుంగుడనియు, కాకతీయ కటకసన్నాహుఁ డనియు వీర వితరణోత్సాహుఁడనియు, కడుపులూరి పురవరాధీశ్వరుండనియు, వీరలక్ష్మీ నిజేశ్వరుండనియు, మనుమ కుల మార్తాండుఁడనియు, మీసరగండఁడనియు, ఉభయబల గండఁడనియు, గండరగండఁడనియు, అభంగగండభేరుండుఁ డనియు, హన్నిబ్బరగండఁడ

నియు, హదిమువ్వరగండఁ డనియుఁ లాడకువర పెండారుఁ డనియు చోళజగజాళవీర కాంతికాఱుఁ డనియు, గళమాళియనియు, సంతతా ర్చిత శశిమాళి యనియు, కామినీజయంతుం డనియు, దుష్టతురగ రేఖా రేవంతుఁ డనియు, సమరసమయుం డనియు, దుర్వార వీరా వతారుం డనియు, కోసఁగిమైలి తలగొండుగం డనియు, ఉప్పలసో మని తలగొండుగం డనియు, పందిభూపాలుని తలగొండుగండనియు, అక్కినాయకుని తలగొండుగం డనియు, మేడిపలికాచయనాయకరి శిరశుండనియు, కందూరి కేశినాయని తలగొండుగం డనియు, ఱాపాక భీమనిర్ధూమధాముం డనియు, నిరుపమసంగ్రామ రాముండనియు, తెఱాలజాటదిశాపట్టనియు, ఏఱువతొండ గ్గోధూమ ఘట్టనఘరట్ట నియు, బేడ చెలుకినాయని నిస్సాహణాపహరణుండనియు, సహజ కార్య భరణుం డనియు, కోటపెమ్మాడిరాయ కంఠాభరణ చూఱ కాఱుం డనియు, చోడోదయ పట్టసూత్ర తురంగాపహారుం డనియు, రుద్రదేవ దక్షిణ భుజదండుఁ డనియు, నిజకీర్తిపూరిత బ్రహ్మాండ కరండుం డనియు, పరబలోద్దండుఁ డనియు, శ్రీసోమనాథదేవ దివ్య శ్రీపాదపద్మారాధకుం డనియు, పరబల సాధకుండనియు, అనేక బిరు దునామములతో నభివర్ణింపఁబడి యుండెను. ఇతఁడు సంతతార్చిత శశిమాళి యని పేర్కొనఁబడుటచేతనే శివభక్తుఁడని తెల్లమగుచు న్నది. ఇతఁడు వర్ధమానపురమునందుండి ప్రభుత్వము సేయుచుండగా తద్రాజ్య రక్షామణియైన విఠలనాథుఁడు శ్రీనారాయణ దేవదివ్య శ్రీపాదపద్మా రాధకుండని పేర్కొనంబడి యుండుటచేత నాతండు విష్ణుభక్తుఁడని వేద్యమగుచున్నది. ఈవిఠలనాథుఁడు ఆదవని, తుం బుకము, మానువ, హాలువ, దుర్గములు సాధించినట్లుగా రాచూరు శాసనమున లిఖియింపఁ బడినది. పై గన్నయ్య రెడ్డికిఁ జెప్పబడిన విశేషణములలోఁ బేర్కొనంబడిన పట్టణము లన్నియును రాచూరు

మండలములోనివిగ నున్నవి. ఆపట్టణముల యొక్కయు వాని నాయకులయొక్కయు చరిత్రమును దెలుపునట్టి శాసన ప్రమాణము లేవియు దొరకి యుండనందునఁ జెప్పుటకు సాధ్యపడదు.

గోనబుద్ధారెడ్డి రంగనాథరామాయణము.

ఈగోనగన్నారెడ్డి రంగనాథ రామాయణమును రచించిన గోనబుద్ధారెడ్డి తండ్రియగునేమో కొంచెము విచారింపవలసి యున్నది. రంగనాథుఁడను నాతఁడు రామాయణమును ద్విపదకావ్యముగా రచించెను. కనుకనే యీగ్రంథమునకు రంగనాథరామాయణ మను పేరుగలిగిన దని చెప్పుదురుగాని గ్రంథమునందు గోనబుద్ధరాజు రచించినట్లు గానంబడుచున్నది. మనుమూరి సంస్థానాధిపతియగు బుద్ధరాజున కాశ్రితుఁడయిన రంగనాథుఁ డనుకవి తన ప్రభువుపేరిట రచించెనేకాని బుద్ధరాజు రచింపలేదనియు బుద్ధరాజు రచించియుండునేని బుద్ధరాజు రామాయణ మను పేరే నిలిచి యుండునుగాని రంగనాథ రామాయణ మనుపేరు నిలిచి యుండుటకుఁ గారణము గానరాదనియును, గొందఱు చెప్పుదురు. మఱికొందఱు రంగనాథుఁడు బుద్ధరాజునకు బంధుఁడనియు దూపాడుపరగణా కధికారిగ నుండె ననియుఁజెప్పుదురు. ఈగ్రంథమునకు మొదట బుద్ధరాజునకుఁ "కవిలోక భోజుండు" అని విశేషణము చెప్పఁబడినది. నిజముగా బుద్ధారెడ్డియే యీ గ్రంథమును రచించి యుండినయెడలఁ దానుకవిలోక భోజుండని యాత్మస్తుతి చేసికొనునా యని కొందఱు శంకించుచున్నారు. ఈ యుత్కృష్టమనోహర మైన కావ్యము ఎవరు రచించినను ఇందలి కాండాంతమునందలి

''ద్వి అని యాంధ్రభాషాధీశనిభుఁడు
వినుతకావ్యాగమ విమల మానసుఁడు
పాలితాచారుఁ డపారధీశరధి

భూలోకనిధి గోనబుద్ధభూవిభుఁడు
తమతండ్రి విఠ్ఠలధరణీశు పేరఁ
గమనీయగుణధైర్య కనకాద్రి పేరఁ
బనిబూని యరిగండ భైరవు పేర
నాచంద్రతారార్కమై యొప్పమీఱ
భూచక్రమున నతిపూజ్యమై వెలయు
నసమానలలితశబ్దార్థసంగతుల
రసికమై చెలువొందు రామాయణంబు
పరఁగ నలంకారభావనల్మిండఁ
గరమర్థి.........కాండంబు సెప్పె.''

అనువాక్యములవలన గోనబుద్ధరాజు తనతండ్రివిఠ్ఠల ధరణీశు పేరరచించినట్లు వ్రాయబడియున్నది. దీనింబట్టి బుద్ధరాజు తండ్రి విఠ్ఠలనాథుఁడని స్పష్టమగుచున్నది. కాని ఉత్తర రామాయణమును ద్విపదగా రచియించిన కాచవిభుఁడును పినవిఠ్ఠలభూపతియును తమ తండ్రి బుద్ధరాజనియును బుద్ధరాజు గోన కోటగన్నక్షితీంద్రునకును అన్నమాంబికకును దనయుండనియును తద్గ్రంథ పీఠికలో

"ద్వి గోనకులార్ణవకువలయేశుండు
నానొప్పుకోట గన్నక్షితీంద్రునకు
ననఘాత్మయగుచున్న యన్నమాంబికకుఁ
దనయుండు బుద్ధాభిధానుండు పనుప
నారయ మత్స్యకూర్మాది దివ్యావ
తారంబులం దెల్లఁ దలఁచి చూడంగ
రామావతారంబు రమణీయ మగుట
రాముపావనచరిత్రము దివ్యభాష
లోకానురంజన శ్లోకబంధములఁ
జేకొని వాల్మీకి చెప్పినజాడ
మాతండ్రి బుద్ధక్షమానాథు పేర
నాతతనృపకైరవాప్తుని పేర
ఘనుఁడు మీసరగండ కాచవిభుండు

వినుతశీలుఁడు పినవిఠల భూపతియు
నని జనుల్ మముఁ గొనియాడఁగ మేము
వినుత నూతన పద ద్విపదరూపమునఁ
బ్రాకటంబుగ నాంధ్రభాషను జెప్పఁ
గైకొన్నయుత్తరకథ యెట్టిదనిన''

అనివ్రాసియున్నారు. రంగనాథ రామాయణములో బుద్ధభూవిభుని తండ్రి విఠలధరణీశుఁ డనియు, ఉత్తర రామాయణములో బుద్ధారెడ్డి తండ్రిగన్నారెడ్డియనియుఁ జెప్పఁబడి యుండుటచేత నొండొరులకు, గల సంబంధమును దెలిసికొనుటలోఁ గష్ట మెక్కువయగుచున్నది. పైరాచూరు శాసనములోఁ బేర్కొనంబడినగోనగన్నారెడ్డియును, విఠలనాథుఁడును రంగనాథ రామాయణములోను ఉత్తర రామాయణములోను బేర్కొనంబడిన విఠలధరణీశుఁడును గన్నక్షితీంద్రుఁడును ఒక్కరే యని చెప్పవచ్చును గాని బుద్ధరాజుతండ్రి గన్నక్షితీంద్రుఁడా యనునది సందిగ్ధముగా నున్నది. రాచూరు శాసనమును బ్రకటించిన శ్రీమానవల్లి రామకృష్ణకవి. ఎం. ఏ. గారు గోనగన్నయ్యరెడ్డియు, విఠలనాథుఁడును సోదరు లనియు, పినతండ్రి పెదతండ్రులను గూడ తండ్రులని చెప్పు ఆచారము కలదు గావున గన్నయ్యరెడ్డి కుమారుఁడైన బుద్ధారెడ్డి పినతండ్రియైన విఠలధరణీశునికిఁ గృతి నొసంగుచు తండ్రియని పేర్కొని యుండునని యూహించుచున్నారు.

## బుద్ధారెడ్డి కూఁతురు కుప్పమాంబ శాసనము.

గోనబుద్ధారెడ్డికి కుప్పమాంబ లేక కుప్పసానమ్మ యను నొక కొమార్తెగలదు. ఈమెశాసనములు: బూదవూరు, వర్ధమానపురము

లలో రెండు మూఁడు గలవు. ఈమె తనబూదవూరి శాసనములో నీ క్రిందివిధముగా ఈశ్వర భట్టోపాధ్యాయుల వారిచే నభివర్ణింపఁబడినది.

"శ్రీగోనవంశనిజశేఖరబుద్ధయాఖ్యపుత్రీ పవిత్రచరితా భరితాగుణౌఘైః
శృంగారసారకరణిః కరణీయదక్షా కుప్పాంబికాజని చ తస్య సతీ కళత్రమ్"

బుద్ధారెడ్డి యింటిపేరు గోనవారుకాని కోనవారు కారని గనంబడుచున్నది. రంగనాథరామాయణముద్రణకర్తలుగోనశబ్దమును కోనశబ్దముగ మార్చినట్లు గన్పట్టుచున్నది. అయినను తెలుగుభాషలో కకారము గకారముగా నుచ్చరింపఁబడు పదము లనేకములు వాడుకలోఁ గలవు. ఈ గోనబుద్ధారెడ్డి కూఁతు రయిన యీ కుప్పమాంబ కాకతి రుద్రదేవీ ప్రసాదాసాదిత రాజ్యలక్ష్మీనివాసుండైనశ్రీమల్యాల గుండదండాధీశ్వరుని కిచ్చి వివాహము చేయఁబడియెను. ఈమె శా. శ. ౧౧౯౭ ధాతసంవత్సర మాఘశుద్ధ దశమీ గురువారము నాడు స్వర్గస్థుఁడైన తనభర్త గుండయపేరను లింగప్రతిష్ఠ గావించి బూదువూరను పోతుమడుగునభూదానముల ననేకములనుగావించెను.

## రుద్రమదేవి అంగరక్షకులు.

క్రీ. శ. 1250 నుండి రుద్రమదేవిపరిపాలన ప్రారంభకాలమున నిడువలును రాజునకు గణపతిదేవచక్రవర్తికి తంత్రపాలుఁడుగా నుండిన ప్రోలరాతు రుద్రమదేవికిఁగూడ మొదట తంత్రపాలుఁడై వ్యవహరించినవాఁడు. వీనికొడుకులు ఎక్కినాయఁడు, రుద్రినాయఁడు పినరుద్రినాయఁడు, పోతినాయఁడు ననువారు నల్వురు ప్రఖ్యాతులై యున్నట్లు దెలియుచున్నది.1 అటుపిమ్మట వల్లయనాయకుఁడను మహాయోధుఁడొకఁడు ఆమెకు రుద్రమదేవికి అంగరక్షకుఁడుగాను, తంత్ర

1. Report on Epigraphy 1916. page 135 para 52.

పాలుఁడుగనుండినటుల 1270 సంవత్సరమునాటి యొక శాసనము వలనఁ దెలియుచున్నది.1 రుద్రమదేవి సామంతులలో నొకఁడును, ప్రోలరాజుపుత్త్రిలలో నాల్గవవాఁడునగు పోతినాయకుఁడు రావూరను గ్రామమున నొక దేవాలయమును బ్రతిష్ఠగావించి అన్మకొండలోఁ గొంత భూదానమును గావించినాఁడు. వీనికొడుకులు సూరపనాయఁడు, పోతయనాయఁడు, మారయనాయఁడు ననువారు మూవురుగలరు. వీరిలోఁ గడపటి వారిరువురును మహాసామంతులుగా నుండి గొప్పబిరుదములను వహించియుండిరి. వీరలు దుర్జయకులాభరణులుగాను, వలవుట్ల గోత్రీయులుగను వక్కాణింపఁబడిరి. రుద్రమదేవియాంతరంగికోద్యోగీయులలో మారమరాజు, ప్రోలంరాజు దారపనాయండు, మారినాయండుగలరని దెలియుచున్నది.2

## గణపతిదేవచక్రవర్తికూతురు గణపాంబ.

గణపతిదేవచక్రవర్తికి రుద్రమదేవిగాక గణపాంబయను మఱియొక కొమార్తెగలదని యిదివఱకె దెలిపి యున్నాను. ఈమె ధరణికోటరాజధానిగా క్రీ. శ. 1182 సంవత్సరము మొదలుకొని క్రీ. శ. 1228 వఱకు నాత్వోలనాడును బరిపాలించిన మహామండలేశ్వరకోట కోటకేతరాజు (4) నకు మనుమఁడును, అతనికిగుండాంబికవలన జనించిన మహామండలేశ్వర రుద్రదేవమహారాజునకును పండాంబికకును బుత్త్రుఁడునైన మహామండలేశ్వర బేతరాజునకిచ్చి వివాహముచేయఁబడినదనికూడఁ దెలిపి యున్నాను. ఈమెను గూర్చి నామిత్రులు శ్రీయుత భావరాజు వేంకటకృష్ణరావు పంతులుగారు తాము రచించిన "విదేశయాత్రికులు ప్రాచీనాంధ్రదేశము" అను గ్రంథములో నిట్లువ్రాసియున్నారు.

---

1. Report on Epigraphy 1921. page 120.
2. Report on Epigraphy 1916. page 135. para 52.

"బేతరాజు ఇంచుమించుగా క్రీ. శ. ౧౨౪౮ మొదలుకొని ౧౨౫౮వఱకు పదిసంవత్సరములుమాత్రము రాజ్యముచేసెను. అతఁడు మామ గణపతిదేవునితో కాంచీపురముపై దండెత్తిపోయి యచట సంగ్రామరంగమున వీరస్వర్గమును బొందినట్లు యూహించుట కవకాశము గన్పడుచున్నది. బేతరాజును గణపాంబామహాదేవి "క్షితిధరలసన్మస్తకన్యస్తపాదుఁడని"యు, "తేజోధ్వస్తాఖిలరిపుతముఁ" డనియు దన యుద్వాహమునకు బూర్వమే యోధాగ్రేసరుఁ డనియు, నతుల బలపరాక్రమశాలి యనియు, విఖ్యాతయశుఁ డయ్యెననియు వర్ణించెను.1 బేతభూపతికి సంతానము లేదు. కావున నాతని వెనుక గణపమదేవి రాజ్యభారము వహించెను. భర్తజీవించి యుండిన కాలమునఁగూడ నాతఁడు కార్యాంతరమున దేశాంతరములందుండిన కతన తానే ధరణికోట రాజ్యమును దీక్షతోఁ బాలించుచుండినట్లు ఆమె వేయించిన దానశాసనములందు జెప్పుకొనియెను....... భర్తపరమ వైష్ణవభక్తుఁడై యుండ నామె పరమమాహేశ్వరాచార వ్రతమును బూనియుండెను. మహారాజ్యభారము బూని, తల్లిబిడ్డలనరయురీతిని బ్రజలరక్షించుచు ఎల్లవేళలందును, ఈశ్వరార్చనలు జరుపుచు ఆనందమును బొందుచు సుఖముగా నాగణపమదేవి దినములను గిరిసుతవలె గడపెను. ప్రజలామెను మహాలక్ష్మీస్వరూపురాలని భక్తితోఁ గొలుచుచు నారాధించుచుండిరి, పరమపావనమైనయామె జీవితమునుగాంచి అచ్చెరువందిసుకవియొకఁడు తనవాక్కు సార్థకమగునట్లు నీరీతిగా వర్ణించెను.

"యద్భర్తా హర పూజనైక నిరతో యస్యాశ్చ దృష్టిశ్శ్రుతీ
శంభోరన్వహ కారితోత్సవలసత్సంగీత సక్తే సదా
ఇత్థం యా దివసాన్ సుఖం గమయతి ప్రాజ్యేపి రాజ్యే స్థితే
తన్మన్యే నరి గణపాంబికా గిరి సుతా సుతో కః ప్రభుః?"

4· Ep. Ind Vol III· p. 95-96.

మార్కోపోలో మోటుపల్లిరేవును జూడవచ్చినది ఇంచుమించుగా క్రీ. శ. ౧౨౯౧ వ సంవత్సరమని యింతకుముందు తెలిపియుంటిమి. కావున నతఁడు ఆంధ్రదేశమునకు గణపాంబామహాదేవి విజయరాజ్యవర్షములు నలభయిఅగునేట నేతెంచి యుండెనని నిస్సంశయముగ విదితమగుచున్నది. ఇందుల కావెనీసువాస్తవ్యుఁడు "ఈ మహారాణిభర్తచనిపోయినది మొదలుకొని నలుబదిసంవత్సరములనుండి భర్తృకరాజ్యభారమును తానుబూని భర్తకంటె నధికతరమగు దక్షతతో ప్రజ్ఞతతో బుద్ధితో ప్రజానురంజకముగ దేశమును బాలించుచున్నది." అని వ్రాసిన నాలుగువాక్యములును యదార్థములగుచున్నవి. బేతరాజు క్రీ. శ. ౧౨౫౦వ సంవత్సరమున మరణించెను. కావున మార్కోపోలో వచ్చునాటికి గణపాంబామహాదేవి రాజ్యపాలన మారంభమై నలుబదియేండ్లు గడచెను. మన కథానాయకుఁడు ప్రశంసించిన మహారాణి గణపమదేవులనుటకు ప్రమాణములింకను రెండుగలవు. గణపమదేవి యేలుచుండిన రాజ్యమామెభర్త బేతభూపతిది. రుద్రమదేవి ఏలుచుండిన మహారాజ్యము ఆమె జనకునిదిఁ భర్తదిగాదు. గణపతిదేవుఁడు పుత్రసంతానము లేనివాఁడుగావున పెద్దకూతురు రుద్రాంబికను కుమారునిగ భావించి విద్యాబుద్ధులుచెప్పించి రాజనీతియు, మహారాజ్యసంరక్షణా విధానమును ఉపదేశించి తనకాల మాసన్నమైదనదని తెలిసికొనినపుడు మంత్రిపురోహిత సేనాపతి సామంతమాండలికుల నెల్లరను రావించి వారిసమక్షమున నామెకు రుద్రదేవమహారాజను పురుషనామముతో పట్టాభిషేక మొనరించెను. ఆవృత్తాంతము క్రీ. శ. ౧౨౬౦ ప్రాంతమున జరిగియుండెను. అప్పటినుండి లెక్కించిచూచినను మార్కోపోలో మోటుపల్లికి వచ్చునాటికి రుద్రమదేవి సింహాసనమెక్కి ముప్పదియేండ్లు మాత్రమె గడచెను...... కావున నప్పటికామె జీవించి

యుండెనో లేదో కూడ నిస్సంశయముగాఁ దెలియరాదు. మరియు గణపాంబ సామంత మండలేశ్వరియైనను, తన చిన్నరాజ్యమున సర్వతంత్ర స్వతంత్రురాలుగా నుండెను. ఆమె యశస్సు అప్పటికి జగద్విఖ్యాతమై యుండుననుటయె సమంజసముగా నుండెను.1

మార్కో. పోలో ఆఱువేల్నాటి వర్ణనము.

"మాబారు దేశమునుండి యుత్తరముగా దాదాపు వేయిమైళ్ళు చనిన నీవు ముటఫిలి రాజ్యమును ప్రవేశింతువు. పూర్వమీ దేశ మొకరాజు పాలనమందుండెను. ఆతఁడు చనిపోయినదాదిగా ఆతని రాణి నలువది సంవత్సరములనుండి పరిపాలించుచున్నది. ఆమెకడు ప్రజ్ఞావంతురాలు భర్తమీదగల ప్రేమవలన తిరిగి యామె వివాహ మాడలేదు. కడచిన నలువది సంవత్సరములనుండియు, ఆమె రాజ్యము నేలుచుండినట్లు ఆమెభర్తకూడ నేలియుండలేదు. ఆమె నీతియు ధర్మమును మూర్తిగొన్నట్లు పరిపాలించెను. శాంతియు సౌఖ్యము ఆమెపరిపాలనమున పెట్టినపేరులయ్యెను. ఇంతవఱకు నే రాజును, ఏరాణియు నీరాజ్యము నింత ప్రజారంజకముగఁ పరి పాలించి యుండలేదు. అందువలన జనులామెను భక్తివిశ్వాసగౌర వములతో పూజింతురు; ఇచ్చటిజనులు విగ్రహారాధకులు. స్వతం త్రులు. పారతంత్రము నెఱుఁగరు. వారికి మాంసము పాలు యాహారములు."

" ఈరాజ్యమునందు వజ్రములు దొరకును. వజ్రములభించు తెఱగు ఇట్టిది. ఈప్రాంతమున నేటవాలుగనున్న ఎత్తైన పర్వ తపంక్తులు చాలగలవు. వర్షపాతమిచ్చట విశేషముగ నుండును. వర్షములు కురిసినప్పుడు కొండలమీదనుండి నీరు త్రుళ్లింత లిడుచు

1 విదేశ యాత్రికులు—ప్రాచీనాంధ్రదేశము. పేజీలు, ౧౨౪–౧౩౦.

వాకలవలె వడిగా క్రిందికి బ్రవహించును. వర్షములు వెలిసిన తరువాత నావాక లెండిపోవును. అంతట జనులు ఆయేటి గర్భములందు ఇసుకలో గులకరాళ్ళయందు వజ్రములకై వెదకుదురు. అప్పుడు వారికి రత్నములు విరివిగా లభించుచుండును. కాని గ్రీష్మతాపమునకు వెఱచి జనులు కొండలలోనికి పోరు. అచ్చట త్రాగుటకు గ్రుక్కెడు నీరుకూడ లభించదు. అదియునుగాక నక్కడ భయంకరమైన విషసర్పములు అసంఖ్యాకములుగ నుండును. సర్పములేగాదు క్రూరజంతువు లనేకములుగూడ గలవు. వాటియునికి భరింపరాని యుష్ణము కారణము. వజ్రములపై నాసగొని జని యావిషసర్పముల కాటులకు మరణించిన వారెందరోగలరు."

"ఈకొండల నడుమ పెద్దపెద్ద లోయలున్నవి. ఏటవాలుగ నుండుటచేతను, నాలుగు ప్రక్కలను ఎత్తైన కొండలుండుటచేతను, ఈలోయలోనికి మార్గములు లేవు. వజ్రములకై వెడలునపుడు సన్నగా కోసిన మాంసపుముక్కలను తీసికొనిపోయి జనులాకొండ లోయలందు పారవేయుచుందురు. అచ్చట నివసించు పాములను భక్షించుటకై గరుడపక్షులా ప్రాంతములందు విశేషముగానున్నవి. అవి సర్పములకై ఆకాశముమీద నెగురుచున్నపుడు మాంసపు ముక్కలు విసరబడుటగాంచి, వాటికై లోయల యడుగుభాగమునకు హుటాహుటి దిగుచుండును. ఱాళ్ళ నడుమ చిక్కుకున్న మాంసపు ముక్కలను, వాటికి గ్రుచ్చుకున్న ఱాళ్ళతో సయితము గ్రద్దలు తన్నుకొని పోవుచు, నేకొండకొననో నేచెట్టుమీదనో గూటిలోనో పిల్లల యాహారమునకై పెట్టుచుండును. గ్రద్దలు వ్రాలుటచూచి, జనులు ఱాళ్ళు గ్రుచ్చుకొనిన మాంసపు ముక్కలకై ఆపక్షులను తఱిమివేసి యామాంసపుముక్కలను దెచ్చుకొందురు. అందు తఱచుగా నితరఱాళ్ళతోపాటు వజ్రములుగూడ నుండును. ఆకొండ

లోయల యడుగున వజ్రములట్లు కుప్పతిప్పలుగా బడియుండుట నిజముగా నాశ్చర్యకరమైన విషయము. కాని కొండలోనికి వజ్రములకై ప్రాణములపై నాశవీడి యెవడును చనఁజాలఁడు. అచ్చటి సర్పములు మనుష్యులను సయితము: మ్రింగివేయగలవు. వజ్రములకై జనులు అప్పుడప్పుడు గ్రద్దల గూండ్లకడకేగి వాటిరెట్టలను వెదకి యందు రత్నములను గాంచుటయుగూడ గలదు. మాంసపు ముక్కలతో పాటు అందు చిక్కుకొనిన రాళ్ళనుగూడ పక్షులు మ్రింగి రాళ్ళను జీర్ణము చేసుకొనలేక రెట్టలో కలిపి విడుచును. ఒకప్పుడీ పక్షులను పట్టుకొని జనులు రత్నములకై పొట్టలజీల్చి చంపుదురు. వాటిలో గూడ వజ్రములు లభించుటయు గలదు."

"పెద్దపెద్ద వజ్రములు ముటఫిలిసీమయందుతప్ప నింకెక్కడను లభింపవు. మనపాశ్చాత్య దేశములకు గొనిరాబడునవి ఇచ్చటి వారు మంచివాటిని ఏరుకొనగా మిగిలిన రెండవరకపు సరకులని నమ్ముడు. ఇచ్చటి రాజులు, శ్రీమంతులును మేలయినవాటిని తామే ఉపయోగించు కొందురు."

"ఆదేశమున నత్యద్భుతములయిన సన్ననూలు బట్టలు నేయుదురు. అవి సాలిపట్టువలె బహుసున్నితముగా నుండును. ఎంత వెలయిచ్చిన నంతకు సరిపోవునట్టి రంగు సన్ననూలు సెల్లాలిచ్చట లభించును. ఏదేశమునందైనను వాటిని చూపించినపుడు ఏరాజును, ఏరాణియుగూడ వాటిని ధరింప నిచ్ఛఁగొనకుండ జాలరు. అచ్చట జనులకు గొఱియలమందలు లెక్కకుమిాఱి యున్నవి. మఱియు వారికి గావలసినవన్నియు గావలసినవాటికంటె నత్యధికములుగ లభించుచున్నవి."[1]

---

1 ఈ పై వర్ణనము శ్రీయుత భావరాజు వేంకటకృష్ణరావు బి. ఏ. బి. ఎల్ గారి విదేశయాత్రికులు-ప్రాచీనాంధ్రదేశమునుండి గ్రహించినదిగా నెఱుంగునది.



# కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము

పదుమూఁడవ ప్రకరణము.

## త్రిశతవీరగణ కులమను మున్నూఱు కాఁపుల చరిత్రము.

భారతవర్షమున యుగయుగములనుండి నాగరికతా విజ్ఞానములచే నొప్పుచు జన్మభూమినే నమ్ముకొని భూసేవకులై భూమిని సర్వసస్యాఢ్యగ నొనరించి సమస్తైశ్వర్యములచేతను భరతఖండమునకు వన్నెయు వాసియుఁ గల్పించి ప్రపంచమునఁ బేరుమోసిన కులములలోఁ గాపుకులమునే ప్రప్రథమమున నెన్నఁదగియుండును. వివిధకాలములందు వివిధ కారణాంతరములచే నీమెట్టుకాపుకులము వేర్వేఱు శాఖలుగఁ జీలిపోయి భాషాభేదములచే నొప్పెడు రాష్ట్రములలో మతభేదములచేతను, అన్యజాతి సంపర్కములచేతను, విడిపోయి వేర్వేఱు నామములతో వ్యవహరింపఁబడెడు వేర్వేఱుశాఖలనుగూర్చిన చరిత్ర మీగ్రంథమునఁ దెలియఁజెప్పుటకుఁ గాని తెలిసికొనుటకు గాని సాధ్యము కానిపని. ఈకాకతీయాంధ్రయుగ చరిత్రమును బునర్విమర్శగావించి మరల వ్రాసి ప్రచురింపనున్న

కాలమున నాకీమున్నూరు కాఁపుకులమును గూర్చి గొన్ని విషయములు తెలియవచ్చుటచేతను, కాకతీయ చక్రివర్తుల సేనానులలోఁ బెక్కండ్రు, అందు ముఖ్యముగా గణపతిదేవ చక్రవర్తి గజసేనకధ్యక్షుఁడును, అనుంగు మిత్రుఁడై "నృత్త" శాస్త్రమను నొక గొప్పశాస్త్రగ్రంథమును రచించినవాఁడును, గణపతిదేవ చక్రవర్తి భార్యలగు నారమ్మపేరమ్మలకుఁ దోఁబుట్టువునగు జాయపనాయక సాహిణియు, దాదిసోమయసాహిణియు, దాదినాగయగన్న సేనానియు, విరియాల మల్లయసేనానియు, కోసిగె ఈశ్వరదేవుఁడు మొదలగు ప్రసిద్ధవీర సేనానులగు వారలీ కులశాఖకు సంబంధించిన వారేయని గుర్తించుటచేతను, మఱికొందఱు నాయకులుగూడ నీతెగలోనివారేయై యుందురని యనుమానించుటకుఁ గూడ నవకాశము గల్గుటమూలముననను, నీకులమునుగూర్చి తెలిసికొనవలసిన యావశ్యకత గన్పట్టి గొంతవఱకుఁ దెలియవచ్చినందున నావిషయములను గూర్చి భావిపరిశోధకుల ప్రయోజనము కొఱకుగాను, సంఘముయొక్క శుభోదయము కొఱకుగాను, ఈచరిత్రభాగమునందు నొకింత ప్రశంసింపఁ దప్పినదికాదు.

ఆంధ్రేతర దేశములను మాట యటుండనిచ్చి తెలుఁగు దేశమున మాత్రము నాగరికతా విజ్ఞానభేదముల వలన వెలువడిన శాఖాభేదములెట్టివైనను శ్రేష్ఠకులములని (సెట్టికులములు) రాట్కులములని (రెడ్డికులములు) రెండుతరగతులుగా విభాగించి పరిశీలించినచో వీని తత్త్వ చరిత్రము గొంతవఱకు మనకు సులువుగా బోధపడ వచ్చును.

ఆంధ్రదేశచరిత్రములో బ్రాహ్మణశాఖలకుఁ జేరిన వ్యక్తులను గుర్తించుటకు సాధ్యపడునట్లుగా బ్రాహ్మణేతర కులములలోని

వ్యక్తులను గుర్తించుట యంత సుసాధ్యముగాఁ గన్పట్టదు. బ్రాహ్మణేతర కులములలోని వ్యక్తులను గుర్తించుటకు శాసనములలోఁ గాని కావ్య గ్రంథములలోఁగాని యావ్యక్తుల కులనామములు పేర్కొనఁ బడినప్పుడే వానింజెప్పుట సాధ్యపడునుగాని యట్లుగాక యేవిష్ణువు యొక్కయో, ఏబ్రహ్మ యొక్కయో, పాదపద్మములనుండి పుట్టిన కులమని చెప్పిన మాత్రమునఁ జతుర్థకులమని బోధపడవచ్చునుగాని యావ్యక్తుల కులములను గుర్తించుటకు సాధ్యముగాదు. వాని నితర కారణములచే దెలిసికొనిగుర్తింపవలసి యుండును. బ్రాహ్మణేతర కులము లసంఖ్యాకముగ నుండుటచేత సులభసాధ్యముగాఁ గన్పట్టదు అందువలనఁ గొన్ని కులములకుఁ జారిత్రక ప్రఖ్యాతిఁ గలుగుటయు, మఱికొన్నిటికిఁ గలుగకపోవుటయుఁ, దటస్థించుచున్నది. ప్రపంచము లోఁ జారిత్రికపురుషులను గాని స్త్రీలనుగాని గన్నకులముల కే యెక్కువగౌరవము కలుగుచుండఁగా జూచుచున్నాము. అలస భావమును విడిచి యాయా కులములవారు చరిత్రమునఁ బ్రఖ్యాతు లయినఁ దమపూర్వుల చరిత్రమును దెలిసికొనుటకుఁదప్పక ప్రయత్నింప వలయును. ఇట్టి అలసభావము చేతనే మున్నూటి కాఁపుకులము వారు తమకుఁ బ్రఖ్యాతమైన చరిత్రస్థానమున్నను గుర్తింపఁజాలక పోయినారు. ఇప్పుడిప్పుడే గన్నులు దెఱచి చూఁచుచున్నారు. అజ్ఞాన కృతములయిన గాథలలో మునిగిఁపోయి నిజమైన చారిత్రకజ్ఞానము లేకపోవుటచేత నెదుగుబాదుగు లేక యాంధకారమున బడియున్నారు. చారిత్రికజ్ఞానము కలిగినప్పుడే యా వ్యక్తికిఁగాని, యా కులమునకుఁ గాని యా జాతికిఁగాని యభ్యున్నతి కలుగఁగలదు. ఎందఱెందఱో కాపుకులముల వారుండఁగా, ఎన్నెన్ని శాఖలోఁ గాపువారి పేరిట నుండఁగా "మున్నూటికాఁపుల" మని వీరేల చెప్పుకొనవలసి వచ్చె నని మొట్టమొదట నేను వీరికులమును గూర్చి విన్నపిమ్మట బాగుగా

యోచించి పరిశీలించితిని. యోచించినకొలఁది, పరిశీలించినకొలఁది, పూర్వగ్రంథములను బరిశోధించినకొలఁది యనేకవింత విషయములు పొడఁగట్టినవి. వాని సత్యాసత్యము లెట్లైననను వీరి చరిత్రము తెలుఁగుతల్లి కంఠమున ధరించిన మంగళసూత్రమువలె మెఱయు చున్నట్లుగా నాకన్నుల యెదుట మెఱయుచున్నది. అదియంతయు నేనిప్పుడు విప్పిచెప్పుటకు శక్తుఁడను గాఁజాలను, కాని క్రమముగా పరిశోధనగావించి తెలిసికొన్న దానినంతయు సవిస్తరముగా ముందు విన్పింతును. ఇందు నాకిప్పుడు దెలియవచ్చిన కించి ద్విషయమును మాత్రమె విన్పింప సాహసించుచున్నాను.

"మన దేశమునందు "అష్టసహస్రము, షట్సహస్రము, (ఆఱు వేలు, ఆఱునూఱులు, అయిదునూఱులు, అష్ట, పంచ, చతుర్, త్రి, ద్వి, ఒంటు-మొదలగు సంఖ్యాపూర్వక వంశనామములవలె, నీ "త్రిశత వంశము" అను మున్నూఁటి కాపువంశనామముగూడ లోకములో నొకటిగ నలరారుచున్నది. వివిధకాలములందు, వివిధ కారణాంతరములచే నాయాసంఖ్యావాచక శబ్దములు, వంశనామ ములుగ నేర్పడి యుండినవి. పై వానిలోఁ గొన్నిటికి నిరాధారములు, సత్యదూరములు, ఈర్ష్యాకల్పితములు నగు పెక్కు పుక్కిటి గాథలు ఏనాఁడో, ఏపుణ్యులచేతనో ముడిపెట్టఁబడి లోకమున గర్ణాకర్ణికగ వ్యాపింపఁజేయఁబడి యున్నవి. క్షాత్రయుగము (Epic Age) నుండి యు నీత్రిశతవంశము, బలపరాక్రమ సంపన్నములగు మున్నూఱు కర్షక (పంటకాపు) కుటుంబములు కారణాంతరములచేఁ గూడి, యొక ప్రత్యేకకర్షక (పంటకాపు) శాఖగా నేర్పడి లోకమున వర్తిం చుచు, క్రమక్రమముగ, నానూఱులు వేలై, యావేలేలక్షలై యిం కను బెరుగుచుండియు, నాప్రాచీన త్రిశత (మున్నూఁటికాఁపు) వంశ నామము నేటికిని ధరించి, వివిధప్రాంతముల కెగఁబ్రాకి నేఁడు విరా

జిల్లుచున్నవి. ఇట్లని యీవంశపు పుట్టుకను (Origin) గూర్చి యిద మిత్థమని నిర్ణయించి సిద్ధాంతము సేయుటకు కొన్నికొన్ని ప్రబల సాధనములేగాక భాషాశాస్త్రపు రహస్య చరిత్రకూడ మిక్కిలి తోడ్పడుచున్నది."[1]

అని దక్కనులోని హైదరాబాదునుండి ప్రకటింపఁబడుచున్న "గోల్కొండ పత్రిక" యను ద్వైవారపత్రికలో నామిత్రులును చరిత్ర పరిశోధకులును నగు శ్రీయుత ఓగిరాల సుబ్బారావుగారు "శ్రీత్రిశతవంశాభ్యుదయ" మను పేరిటి వ్యాసములో వ్రాసి యున్నారు.

ఈ నామిత్రుని వ్యాసమును గోల్కొండ పత్రికలోఁ జదివి నప్పుడు మొదట నాకు స్ఫురించిన విషయము పదునేనవశతాబ్ది మధ్యకాలమున నుదయగిరి చంద్రగిరి రాజ్యములను బరిపాలించిన సాళువ నరసింహరాయల సేనానియు, మంత్రియు సామంతమండలా ధీశ్వరుఁడునగు నార్వీటిబుక్క భూపాలుని నుద్దేశించి "దేవశాస్త్రి" అను నొక భట్టుకవి పంటపదునాల్గు కులములను బేర్కొనుచుఁ జెప్పిన యీక్రింది సీసపద్యము జ్ఞప్తికి వచ్చినది.

సీ. పంటాన్వయముననుఁ బదునాల్గుశాఖలఁ
జక్కగా వివరింతు సత్యమరసి
మోటాటి వెల్నాటి మొరసు నేరడయోధ్య
పంటపొంగలినాటి పాకనాటి
భూమంచి కుంచేటి మున్నూటి గోకేటి
యొనరగండియకోట యోరుగంటి
యనఁబరగుచునుండు నాంధ్రావనీస్థలి
గౌరవాధిష్టిత కాపుకులము

(1) గోల్కొండ పత్రిక, యువనామ సంవత్సర పౌష్య శు ౧౫ సోమవారము. ౧౩౪౫ ఫ. దహుమర్ ౨౬ వ తేదీ సోమవారమునాటి పత్రికను జూచునది.

పంటపదునాల్గు కులములంచంట జగతి
దరదరంబులనుండియు వరలెడినుడి
వీని కుపజాతులున్నవి వివిధములుగ
భుజబలాటోప పిన్నమభుక్క భూప! ''

పదునేనవ శతాబ్దిలో మున్నూటికులము పంటపదునాల్గు కులములోనిదిగఁ బరిగణింపఁ బడుచున్నట్టు పై చాటుపద్యమువలనఁ గూడ స్పష్టపడుచున్నది. ఇంతియగాక శ్రీ సుబ్బారావుగారు వీరి పూర్వచరిత్రను బ్రశంసించుచు, "ఈవంశపుఁగాఁపులు మొదట మిథిలకాఁపులనఁ బరగిరి. పయి కారణాంతరములచే మున్నూటి కాఁపువంశము వారని వ్యవహారమునకు వచ్చిరి." అని కూడ వ్రాసిరి. అయిన నిందు మొదటిదాని నంగీకరింపవచ్చును. రెండవది సంశయాస్పదమైన విషయము. మొదటిదాని నంగీకరించుటకు హేతు వేమనఁగా క్షాత్రయుగమున విదేహదేశము పంటకాఁపులకుఁ బ్రధాన స్థానముగ నుండెను. వీరలకుఁ బ్రభువైన జనకమహారాజు మిథిలా నగరము రాజధానిగా విదేహదేశమును బరిపాలించిన కాపుమహారాజే. వీని నిజమైన పేరు సీరధ్వజుఁడు. సీరమనఁగా నాగలి, నాగలి ధ్వజముగాఁ గలిగినవాఁడు గావున సీరధ్వజుఁడని నామమీయఁ బడినది. దక్షిణాపథగాథలలో కాపుసంఘము వారియొక్క ధ్వజము నాగలి యని చెప్పబడుచున్నది. జనకమహారాజు జ్ఞానవంతుఁడై క్రమముగా రాజర్షిగాఁ బరిణామముఁ జెంది పిమ్మట బ్రహ్మణ్యుఁడై (బ్రాహ్మణుఁడై) యుండెనని బ్రాహ్మణాద్యుపనిషద్గ్రంథము లుద్ఘోషించుచున్నవి. నాగటిచాలులోఁ బుట్టిన భూపుత్రికయగు సీతను కొమార్తెనుగఁ బెంచి శివునివిల్లువిఱిచినవానికిఁ దనకూఁతునిచ్చి వివాహముఁ జేయుదునని దేశదేశములఁ జాటింపింపఁగా విశ్వామిత్ర మహర్షిచే ధనుర్వేదమున శిక్షితుఁడైన శ్రీరామచంద్రమూర్తి వానిచేఁ బ్రేరితుఁడై తన యనుజన్ముఁడైన లక్ష్మణునితో మిథిలా

నగరమునకుఁ సీతస్వయంవరము నాటికిఁ బోయెను. ఏ మహారాజు నకు సాధ్యముకాని శివునివిల్లు విఱుచుటయను నొక మహత్కార్య మును త్రుటికాలములో నిర్వహించి రాముఁడు సీత పాణిగ్రహణము జేసిన విషయము రామాయణాది మహాకావ్యముల యందభివర్ణింపఁ బడినది జగద్విదితమైన విషయమెకదా. ఈ శివుని మహాధనస్సును మహాసభారంగస్థలికి మున్నూరు వీరులు మోచుకొని వచ్చినట్లుగా శ్రీమదాంధ్రభాగవతమున నీక్రింది పద్యములో నిట్లభివర్ణించి యున్నాఁడు.

మ. ఒకమున్నూఱుగదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షుచాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁ గోలంద్రుంచు చందంబునన్
సకలోర్వీశులు చూడఁగా విడిచె దోశ్శక్తిన్ విదేహక్ష్మా
పకగేహంబునసీతకై గుణమణి ప్రస్ఫీతకై లీలతోన్. ”

ఒక్క బమ్మెరపోతనయె తెలుఁగు భాగవతముననిట్టి కల్పన చేసి వ్రాసినాఁడనుట సరియైన మాటకాదు. సంస్కృతభాగవతమున గూడ నిట్లేగలదు.

“ యోలోకవీర సమితౌధనురైశముగ్రం సీతాస్వయంవరం గృహేత్రిశతోపనీతం
ఆదాయాబాల గజలీల ఇవేక్షు యష్టిం సజ్జీకృతం నృపవికృష్యబభుజమధ్యే!”

సంస్కృత భాగవతమున “త్రిశత” శబ్దముండుటయు, ఆత్రి శత యనునదియె యీకులము వారిలో నొకకుటుంబమునకు నింటి పేరుగానుండుట వింతగొల్పునేమో? ఆశివుని మహాధనస్సును గదల్చి తెచ్చిన యా మున్నూఱు మహావీరుల సంతానమే యీమున్నూఱు కాపుకులమని నిర్ణయింపవలసి యున్నది. అట్టి తమ ప్రాచీన సంప్ర

* శ్రీమన్మహా భాగవతము, నవమస్కంధమున 10 అధ్యాయము, శ్రీరామ చరిత్రము చూడుఁడు.

2. శ్రీమద్భాగవతే నవమస్కంధే దశమాధ్యాయే పంచమః శ్లోకః

దాయకథనమును విస్మరింపక దానినిల్పుకొని వచ్చుచుండుటచేత నే వీరిప్పటికిని మున్నూఱు వారని వ్యవహరింపఁ బడుచుండుటను జూచుచున్నాము గాని యియ్యది నడుమ తెచ్చిపెట్టుకొన్నది గాదని స్పష్టపడఁగలదు. ఇట్టి విశిష్టవిషయము మున్నూఱున కంటిపెట్టుకొని యుండుటచేత నే మున్నూఱనునది కాపులలో నొకశాఖకు కులనామముగా నిలిచిపోయినదని చెప్పనగును. ఇయ్యది యేదో సంఖ్యామాత్రము చేత నే జ్ఞాపకముంచుకోఁ బడినది కాదనితోఁచును.

మఱియు మూఁడువందల సంవత్సరముల క్రిందట వామన పండిత కవీశ్వరులనువారు మహారాష్ట్రభాషలో వ్రాసిన వామన పండితీయమను రామాయణములో "త్రిశతగణ శివాచేసత్వరేత్యధనుస్యా, వుస్తలితినధలేజే.........॥" అని, దీనిచేఁగూడ త్రిశతవీర గణములచే శివునివిల్లు సీతాస్వయంవరరంగమునకుఁ గొనితేఁబడినదని నిశ్చయింపఁబడినది.

కాని సంస్కృత రామాయణమున మాత్రము "త్రిశత" యనుటకుబదులుగా "శతాని పంచాసత్" అని యైదువేలుగాఁజెప్పఁబడియెను. తెలుఁగురామాయణమున(భాస్కరరామాయణము)నైదు నూర్లగా మార్చఁబడినది. ఈమార్పునకుఁ గారణ మిట్లు గన్పట్టుచున్నది. సంస్కృతరామాయణములోనిసంఖ్య భాస్కరరామాయణ కర్తకు నతిశయోక్తిగాఁ గానుపించినందునను కాఁబోలు నైదువేల నుటకు బదులుగా నైదునూర్లని మార్చియుండును. కావున సంస్కృత రామాయణమునందలి యతిశయోక్తియు భాస్కరరామాయణము నందలి మార్పునుగూడ రెండును సత్యదూరములైనవిగా నున్నవని చెప్పఁదగును. సంస్కృతభాగవత గ్రంథకారుఁడు వ్రాసిన "త్రిశత" శబ్దము నాంధ్రభాగవత గ్రంథకారుఁడైన బమ్మెరపోతనామాత్యుఁడు ప్రాచీనసాంఘిక చరిత్ర సంప్రదాయములను బాగుగా గుర్తెఱింగిన

వాఁడగుటచేత మూలగ్రంథకారునితోఁ బూర్తిగా నేకీభవించి యది సత్యమని యుద్ఘాటించినాఁడు. ఈసందర్భమున నిజాము రాష్ట్రాంధ్రుఁడును, అనుభవజ్ఞుఁడును నైన బమ్మెరపోతనామాత్యునివాక్యమె మనకు నెక్కువవిశ్వాసార్హమైనదిగా నున్నది. కనుక, "త్రిశత" యనునదే త్రేతాయుగకాలమునుండి పరిపాటియైన సంఖ్యాశబ్దమును బుద్ధిమదగ్రగణ్యులైన పెద్దలు గ్రహింపఁగలరు. ఈత్రిశతవీరుల సంతానమే త్రేతాయుగము గడచిపోయి మున్నూఱుకులమువా రాంధ్రదేశమున స్థిరపడిన తరువాత వామన పండితకవీశ్వరునినాటికి మున్నూరు వీరుల సంతానము మున్నూరు వీరగణములుగాఁ బెంపు నొందె ననుటకు సంశయింపం బనిలేదు. వాల్మీకి మహర్షి రామాయణము నొక మహాకావ్యమునుగా విరచించి యుండుటచేత నందలి విషయములన్నియుఁ దూచా తప్పకుండ సత్యబద్ధములని విశ్వసింపఁ జాలము. అందువలననే రామాయణములు పెక్కులు పుట్టుటయు వానిలో నీవిషయమును గూర్చి వ్రాయునప్పుడు పదివేలని, పదునాఱువేలని, అయిదువేలని, ఆయిదువందలని యీరీతి పలురీతుల పేర్కొనఁబడుటయె యిందుకు దృష్టాంతముగఁ జూపవచ్చును. మహారాష్ట్రభాషయందు వ్రాయఁబడిన నిగమ పురాణము మొదలగు రామాయణములలో "త్రిశతు" లనియె వ్రాయఁబడినట్లుగా వినుచున్నాను. కొందఱదృష్టిలో కవికల్పితమైన కావ్యముకంటె వ్యాసప్రోక్తమైన భాగవతమే బలీయమైన ప్రమాణముగా గ్రహింతురు. జైనబౌద్ధరామాయణములు ముందుపుట్టినవి. వాల్మీకిరామాయణము తరువాత పుట్టినది- కనుక, ఇందునుగూర్చి పరిశీలించునపు డారెండు రామాయణములను గూడఁ బరిశీలింపవలసి యున్నది. ఆదిని విదేహదేశమునందలి "కుశీలవు" లను పాటకులగు బిచ్చగాండ్రు పాడునట్టి రామాయణకథా పాఠమును దొలుదొల్త విమర్శించిన గాని సత్యము దృగ్గోచరముకాదు. త్రిశత వీరు లావిర్భవించిన మొదటి దేశము గదా విదేహదేశము.

భారతవర్షమున వర్ణవ్యవస్థ యేర్పడుటకుఁబూర్వమె కాణ్డులు, కాణ్ణులు, కాలులు, కారులు, అను తెగలవారు, పుణ్డులు, పుణ్ణులు, పులులు, పురులు, అను తెగలవారితో సమ్మేళనముఁ జెందిన వెను కనే కాంపులను తెగ యేర్పడినది. వీరు తొలుత వర్ణవ్యవస్థ యేర్ప డినపుడు వైశ్యవర్గములోనికి వచ్చినారు. వాణిజ్యము, వ్యవసా యము, పాశుపాల్యము ననునవి మూఁడు వృత్తులు వెశ్యులకేర్పడుట చేత వీరలు వాణిజ్యవైశ్యులు, భూవైశ్యులు గోవైశ్యులునను త్రివిధ వైశ్యులుగ నేర్పడినారు. వీరిలో కాంపులు లేక కాఁపులు భూవైశ్యులు గానున్నారు. కాంపుల సృష్టిజనకుని సృష్టి. ఈకాపుమహారాజు నాగలి ధ్వజమునందు గలిగియుండి భూమిని దున్నుటచేత వైశ్యుఁడై వైశ్య వృత్తులగు వ్యవసాయము, పాశుపాల్యము, వాణిజ్యమును పోషించి యజ్ఞాదిక్రతువులాచరించుటచేత రాజన్యుఁడై పిమ్మట బ్రహ్మనుగూర్చి తర్కించుటచేతఁబ్రహ్మణ్యుఁడై రాజర్షియు, బ్రహ్మర్షియు నైనాఁడు. ఇందుకు వేదప్రామాణ్యముగలదు.

"యో యజ్ఞాచ్ఛందోభ్యస్త స్మాద్యద్య ప్రబ్రాహ్మణోప్యే దీక్షితే రాజన్యోవా వైశ్యోవా బ్రాహ్మణ ఇత్యేవైనమాహుః తేత్స్రిబ్రాహ్మణోజాయతే."

మఱియు బ్రాహ్మణుఁడైనవాఁడు యజ్ఞదీక్షనుగాని వేదదీక్ష నుగాని యిచ్చినప్పుడు క్షత్రియుఁడైనను, వైశ్యుఁడైనను బ్రాహ్మణుఁ డగునని కాణ్వశతపథము ౭౪. ౨. ౧. ౨౭) నందు గలదు.

ఐతరేయ బ్రాహ్మణమందుకూడ-

"సహదీక్షమాణ ఏవబ్రాహ్మణతాముపైతి." అని చెప్పబడినది. (౭. ౨౩)

ఇట్లుండుటచేతనే జనకమహారాజట్టి పదవిని బొందెను. ఈ కారణముచేతనే వైదేహకులలో బ్రాహ్మణక్షత్రియ వైశ్య శూద్ర

శాఖలుగూడ గలవని యొప్పుకొనక తప్పదు. అప్పుడు వారివృత్తులను బట్టియె వారిశాఖలను నిర్ణయింపవలెను. ఈతెగలను గూర్చి స్మృతులలో భిన్నవిధములుగా వ్రాయఁబడియుండుటయు మనము గుర్తింపఁగలము. తైత్తిరీయసంహితాభాష్యమున "వైదేహి" అను విశేషణమునకు నర్థము వ్రాయుచుఁ "వశిష్ఠదేహసంబంధినీ" అని వ్రాయఁబడినది.1 విదేహ రాజపుత్రిక యగుటచేత సీతకు "వైదేహి" యని నామాంతరము గలదని రామాయణము వలన మనకు విదితమగుచున్నది. రాముఁడార్యపుత్రుఁడనియు స్పష్టపడుచున్నది. వీరిరువురకు జరిగిన వివాహమె సీతాకళ్యాణమను పేరిట శ్రీరామనవమినాఁడు నేఁటేట దేశమున వివాహములు జరుపఁబడు చుండుట మన మెఱుంగుదుము. ఏదేశమునకైనను ప్రజలనామములనుబట్టికాని ఆపేరుగల రాజునుబట్టికాని పేరువచ్చి యుండును. కనుక వైదేహులను బట్టి దేశమునకుఁ బేరువచ్చినదా లేక వైదేహుఁడను రాజును బట్టి దేశమునకు బేరు వచ్చినదా? యను విషయమును దెలిసికొనవలసి యున్నది. ప్రజలను బట్టి దేశమున కాపేరు వచ్చిన దందుమా విదేహదేశ మేర్పడుటకుఁ బూర్వమే యాపేరుగల ప్రజలుండిరని సిద్ధాంతము కాగలదు. విదేహుఁడను రాజునుబట్టి యాదేశమునకుఁ బూర్వమాపేరు గల ప్రజలుగలరని కాని లేరని కాని యూహింపనవకాశము గలదు. వైదేహకులు వైశ్యులను ప్రజాసంఘమునకుఁ జేరినవారని యైకకంఠ్యముగా శాస్త్రవేత్తలెల్లరు నంగీకరించిన విషయమును బట్టి దేశమేర్పడుటకుఁ బూర్వము వైదేహకులు లేరని చెప్పరాదు. కాని విదేహదేశమునకు విదేహమాధవుఁ డను నొక రాజు వలన నాపేరు వచ్చినట్లు శతపథబ్రాహ్మణములోని యీ క్రింది కథవలనఁ దెలియుచున్నది. విదేహుఁడైన మాధవుఁడు అగ్నివై

1. Vedic Index Vol. II. P. 298 and Keith's Veda of Black yajus School Vol. I. P. 138.

శ్వానరుని నోట గఱచుకొని బయలుదేఱెను. రాహుగణములో జేరిన గోతముఋషి (గోతమరాహుగణుఁడు) యతనిఁ బలుకరింపఁగా నోటనున్న యగ్ని పడిపోవునన్న భయముచే మాటాడకుండెను. "ఆజ్యాహుతిఁగన్నయో యీ నిన్నుఁదోడ్పడఁ బ్రార్థించుచున్నాము" అని యాతఁడు మాటాడకున్నను బురోహితుఁడు పలికెను. ఆజ్యము పేరెత్తినతోడనే అగ్ని వైశ్వానరుఁడు రాజునోటనుండి జ్వాలలఁబ్రజ్వలింపఁజేసెను. గూగథుఁడు బిగఁబట్టుట కశక్తుఁ డయ్యెను. అతని నోటనుండి జాఱి యీభూమిపైఁ బడెను. అప్పుడు విదేహమాథవుఁడు సరస్వతీ నదియొడ్డున నుండెను. అంత వైశ్వానరుఁడు భూమిని దగులబెట్టుకొనుచు ప్రాచీదిక్కు వైపునకుఁ బోయెను. పిమ్మట విదేహమాథవుఁడను రాజును, గోతమరాహుగణుఁ డను పురోహితుఁడును వైశ్వానరుని వెంబడించి పోయిరి. ఈనదుల నన్నిటిని దగ్ధము గావించెను గాని హిమవత్పర్వతమునుండి ప్రవహించుచున్న సదానీర (గండకీ) యను నదినిమాత్రము దగ్ధము గావింపఁజాలక పోయెను. అందువలనఁ బ్రాహ్మణులు పూర్వకాలమున నానదిని దాటరైరి. అయినను ఇప్పుడు దానికిఁ దూర్పునఁ బెక్కండ్రు బ్రాహ్మణులుగలరు. ఆకాలమునందా నదికిఁ దూర్పుననుండు దేశము వైశ్వానరుఁడు రుచిచూడనందున వ్యవసాయములేక బీడుపడి గడ్డి, గాదములతో నిండి యుండెను. అయిన నీదినములలో యజ్ఞముల మూలముగా బ్రాహ్మణులు వైశ్వానరునకు రుచిచూపించినందున భూమి విరివిగా వ్యవసాయము చేయఁబడుచున్నది. మిక్కిలి శీతముకలదగుటచేత నానది వేసవికాలమునందు నయితము దగ్ధము గావింపఁబడని నదివలెనె ప్రవహింపుచుండును. పిమ్మట విదేహమాథవుఁడు నేనెక్కడ నివసింపవలసినవాడనని యగ్నినిగూర్చి పలికెను. ఈనదికిఁ దూర్పుభాగమున నివసింపుమని పలికెను. ఇప్పటికి నయితము సదా

నీరనది (గండకీ) కోసలవిదేహదేశములకు సరిహద్దుగా నున్నది. ఎందువల్లనన వీరు మాధవుని సంతతివారుగనుక. (శతపథ బ్రాహ్మణము 1, 4, 1,)

కనుక నీ దేశము విదేహమాధవునిచే జయింపఁబడిన దేశము గనుక విదేహదేశమని పేరు వచ్చినట్లు పైగాథమూలమునఁ దెలియుచున్నది. కాని, ఇందుకు భిన్నముగా మఱియొక గాథ విష్ణుపురాణమునందు గలదు. ఒకప్పుడు ఇంద్రుని యజ్ఞమును బరిసమాప్తి నొందించి వశిష్ఠుఁడు నిమియను రాజుయొక్క యజ్ఞమును బ్రారంభించుటకై మిథిలానగరమునకుఁ బోయెను. అతఁడు వెళ్ళునప్పటికిఁ "నిమి" యను రాజు గౌతమునిద్వారా యజ్ఞములను బరిసమాప్తముఁ జేసికొని నిద్రపోవుచుండెను.

తన్ను విడిచి గౌతముని చేఁబట్టి యజ్ఞకార్యము ముగించినందుకుఁ గోపించి వశిష్ఠుఁడు నిమి (రాజు) విదేహుఁడు- విగతదేహుఁడగుగాకయని శపించెనఁట. రాజుమేల్కొని నిద్రపోవువానిని శపించినందున వశిష్ఠుఁడును విగతదేహుఁడగుగాకయని ప్రతిశాపమిచ్చెనఁట! అంత ఋషులు నిమియొక్క మృతకళేబరమును మథించిరి. ఆమథనము వలన "నిమి'' యను కొడుకు పుట్టెనఁట! నిమియొక్క కొడుకు మిథియనియు నతఁడే మిథిలానగరమును నిర్మించి జనకుఁడనఁ బరఁగెననియు, భవిష్యత్పురాణమున "నిమేః పుత్రస్తుత త్రైవ...... పూరి జనన సామర్థ్యాత్ జనకః సచకీర్తితః" అని చెప్పఁబడియున్నది. నిమిపుత్త్రుఁడయిన మిథియనువాఁడు "తస్యపుత్రో మిథిర్నామ మిథిలాయేన నిర్మితా । ప్రథమోజనకోనామ జనకా దప్యుదావసుః" అని మిథిలానగరమును నిర్మించిన ప్రథమ జనకుఁడని పేరుగన్నట్లు రామాయణమున గూడ వర్ణింపఁ బడియెను. ఈ ప్రథమ జనకునకు ౨౧తరమువాఁడగుకుశధ్వజుఁ డను నాతఁడే సీతతండ్రియైన

జనకుఁడని రామాయణమున. దెలుపఁబడినది. (బాలకాండము. ఏక సప్తతి తమస్సర్గము) విదేహదేశమునకుఁ మిథిలానగరము రాజధాని యైనట్లుగానే యాకాలమునందు కోసలదేశమునకు నయోధ్యరాజధానిగ నుండెను. బౌద్ధయుగ కాలమున నాదేశములందు మహావిప్లవములు సంభవించుటచేత గంగాతీరప్రాంత ప్రదేశములనుండి యచ్చటి కాపుజనులు వివిధశాఖలవారు శాతవాహనాంధ్రులు దక్షిణాపథమును బరిపాలించుటకుఁ బూర్వముననే గోదావరీతీరస్థభూములకు వలసివచ్చి నివాసముల నేర్పఱచుకొనిరని చరిత్రమును బట్టి తెలియుచున్నది. అప్పుడు శాక్యులు, వైదేహులు, మల్లులు. లిచ్ఛవీలు మొదలగువారు వజ్జియనులను పేరుతో నీ దేశమునకు వలసివచ్చి స్థిరపడిపోయిరి. శాక్యులకు, వైదేహులకు, లిచ్ఛవీలకుఁ బరస్పర సంబంధములు గలియుటయెగాక స్థానికప్రజాసంఘములతోఁ గూడ సంబంధము లేర్పడినవి. లిచ్ఛవీలయింటఁ బుట్టినగి లక్ష్మిగనుక యామెను బొందుటకై తగవులాటలు జరుగుచుండెను. ఈ ప్రదేశమున వీరలందఱును నిక్ష్వాకులని వ్యవహరింపఁబడిరి. పూర్వ మీ ప్రదేశము నుండియే రామునిభార్య సీతను లంకాపురాధినాథుఁడగు రావణుఁడు (దక్షిణాపథప్రభువు) యతివేషముదాల్చి యెత్తుకొని పోయెనని రామాయణము దెల్పుచున్నది. ఆంధ్ర శాతవాహన వంశపురాజుల యనంతర మిన్నూరు సంవత్సరము లిక్ష్వాకువంశపురాజు లాంధ్రదేశమును బరిపాలించినట్లు చరిత్రము దెలుపుచున్నది. అందు కీదేశమున వెల్వడిన శిలాశాసనములనే ప్రబల దృష్టాంతములుగాఁ జూపవచ్చును. కనుక అయోధ్య, మిథిలానగరము నుండి కాపుప్రజ లీప్రాంతములకు వలస వచ్చిరని చెప్పవచ్చును. ఇందసత్యమేమియును లేదు. ఈ యిక్ష్వాకులనే ఒఖ్ఖాఖులులని, ఓఖులులని, ఓఖులుఖియులని ప్రాకృతభాషా శాసనములలో వ్యవహరించినారు. వీరినే కన్నడ భాషలో ఒక్కలిగార సంఘమనుచున్నారు. తెలుఁగులో వీరినే

రెడ్లని, రెడ్డికాపులని, తెలుఁగుకాపులని, కమ్మకాపులని, వెలమకాపులని, వేర్వేఱు కారణములచే వేర్వేఱు నామములతో వ్యవహరించుచున్నారు. వీరెల్లరును వైశ్యవృత్తులనే యవలంబించినను క్షాత్రమును వహించి క్షత్రియధర్మమును గూడ నిర్వర్తించుచుండిరని చరిత్రముగూడ వేనోళ్ళఁ జాటుచున్నది.

పైని నే నుదహరించిన "త్రిశతవీరగణకుల" మను మున్నూరు కాపుకులము వారుగూడ పై కాపుకులములలో నొకశాఖవారుగాఁ బ్రఖ్యాతివహించి యున్నారు. వీరలు తమ పూర్వచరిత్ర సంప్రదాయమును మఱువక "త్రిశతు" లనుటకు బదులుగా "మున్నూఱు" అని దేశభాషాపదమును గ్రహించి మున్నూఱు కాపులమని వ్యవహరించుకొనుచున్నారు. ఈకులమువారిలో వివాహముల కాలమున జరుపఁబడు చర్యలను, సంభాషణలను, ఆచారములను జూచినప్పుడు వీరు వీర కాపుకులమని నిస్సంశయముగా బోధపడఁగలదు.

పెండ్లి నాలవనాఁడు కంకణవిసర్జనము జరిగిన తరువాత పెండ్లికొడుకు నాగలికఱ్ఱ భుజముపైనఁ బెట్టుకొని మోటత్రాఁడు చేతిలో నుంచుకొని వెళ్ళి పెరడులో నొక ప్రక్కన మంత్రోచ్చాటణచేసి నీళ్ళుచల్లి ఒకగుంటబావివలె త్రవ్వి, ఒకభాగమును పొలమువలె దున్నుటయు, తదుపరి వరివిత్తులు చల్లుటయు, పిమ్మట నీళ్ళు చల్లుటయు జరుగును. అటుపిమ్మట పెండ్లికూతురు తలపైన పెఱుగు చల్దిపెట్టుకొని, ఒకచేతితో అంబలి, మఱియొక చేతితో నీళ్ళుతీసికొని వచ్చుట జరుగును. పెండ్లికొడుకు వరిపంట నలికినచోట దంపతులిరువురు పై తెచ్చిన పెఱుగన్నమును అంబలిని భుజింతురు. వీని నంతయు బంధువర్గము వారెల్లరును జూచి యాశీర్వదించి పోవుదురు. అనంతరము పెండ్లికొడుకు ఒకబొమ్మను అలంకరించి "నాగలి దున్నపోవుచున్నాను. పిల్లను దీసికొనుము; మోటకట్టఁబోవుచున్నాను

పిల్లను దీసికొనుము; పొలములో విత్తులు చల్లబోవుచున్నాను, పిల్లను దీసికొనుము.'' అని మున్నాఱు పలికి ఆబొమ్మను పెండ్లి కూతురుచేతఁ బెట్టును. అంతట పెండ్లికూతురు "నేను పెఱుగు చల్ది తీసికొని వచ్చెదను, పిల్లను తీసికొనుడు; నేను అంబలికొని తెచ్చెదను, పిల్లను దీసికొనుడు; వరిచేనును కలువఁబోయెదను, పిల్లను తీసికొనుడు" అని పలుకును. ఇట్టి సంభాషణతో పెండ్లిముగింపుకాఁబడు నాచారము గలదు. వీరుకూడ కాపుసంఘములోని వారని చెప్పుట కింతకంటె ప్రబలనిదర్శనమేమి కావలయును?

ఈ కాకతీయాంధ్రరాజయుగమున మున్నూరు కాపుస్త్రీలు గావించిన శాసనములుగూడఁ గొన్ని గాన్పించినవి. అయ్యవి తూర్పు గోదావరిమండలములోని దాక్షారామ భీమేశ్వరస్వామివారి యాలయమునం గలవు.

చతుర్థవంశమున జన్మించినవాఁడును, నూకనార్యుని పుత్త్రుఁడు, వినయాకరుఁడును, విఖ్యాతుఁడును, నైన పెదమున్నూంటి వీరపనాయకుఁ డను వీరపరెడ్డికిని లక్ష్మీసమానురాలయిన లక్ష్మాంబకును జనించినట్టియు, స్త్రీలలో నుత్తమురాలును, మత్స్యకులైకభూషణుఁడును శ్రీమన్మహామండలేశ్వరుఁడును నగు నొడ్డాది జయంతిరాజుకొడుకు అర్జునదేవియు, నగు సూరమదేవి యను నామె తనతల్లిదండ్రులకు ధర్మువుగాను వడ్డాది అలికట్టినాటిలోని "సంకు భీమాపురమును" భర్త యనుమతిని గైగొని తానును భర్తయుఁ గలిసి దాక్షారామ భీమేశ్వరస్వామికి శా. శ. ౧౧౭౪ అనఁగా క్రీ. శ. 1252 వ సంవత్సరమున ధారాపూర్వకముగా నిచ్చెను.[1] మఱియు నీవీరపరెడ్డియొక్క మఱియొక కొమార్తయు, స్వస్తిసహస్ర బాహు ప్రతాపవీర్య గుణసంపన్నులయిన శ్రీమన్మహామండ

(1) S. I. I. Vol IV. No. 1043 Page 345. A. R. No 211 of 1893

లేశ్వరు లయిన కోన రాజేంద్ర చోడుండైన వెన్నయచోడరాజు మహాదేవియైన బిమ్మలదేవి శా. శ. ౧౧౫౯ అనఁగా క్రీ. శ. 1237 నందు పైదాక్షారామ భీమేశ్వరస్వామికి నితాంతకాంతి విరాజిత మహాచంద్ర మండలాకారముగల యద్దము నొకదాని సమర్పణముఁ జేసికొని శాసనము వ్రాయించెను.[1]

శా. శ. ౧౦౦౬ సంవత్సరమునకు సరియైన క్రీ. శ. 1084 న "చక్రవర్తి శ్రీకులోత్తుంగ చోడదేవర అనుంగు గుద్దవాదినాట్టిపెద్ద డాకరేమి పెద్ద మున్నూటి సమర మొదలి బేతినాయకు కూంతురు జయమ యిండ్దులయామినీశ్వరమహాదేవర సన్నిధానమున"[2] కులోత్తుంగ చోడసత్రమునకుఁ గావించిన భూదానములను గూర్చి వక్కాణించుచున్నది. ఇందు పై రెండు శాసనములలోఁ గన్పట్టెడి, దేవి, మహాదేవిశబ్దములు గానరావు గాని అనుంగు శబ్దము గాన్పించు చున్నది.

శా. శ. ౧౧౮౫దవ సంవత్సరమునకు సరియగు క్రీ. శ. 1263వ తాడితోఁటోత్సవమునకుఁ "పెద్దమున్నూఁటి సానియైన వాసాసాని యెఱ్ఱమనాయకు చిమ్మాసాని...... చాపర్తి ఉపేంద్ర దేవుని మహాదేవుని దేవియైన అమ్మాసాని శ్రీభీమేశ్వరదేవరకు అంగ రంగభోగ నైవేద్యమునకు విశ్వనాథపట్నమును దానముచేసిన శాసనముగలదు.[3] ఇట్లే సానిశబ్దముగల శాసనములు పెక్కులు గలవు.[4]

---

(1) S. I. I. Vol IV. No. 1145. A R. No. 280 of 1893.
(2) S. I. I. Vol IV. No. 1015. A. R No. 190 of 1893.
(3) S' I. I. Vol IV. No, 1245 P. 432 A. R. No. 353 of 1893
(4) S. I. I. Vol IV See Nos. 1251, 1261, 1326, 1359, 1357, 1358, 1368.

ఇక్కడ మనల నొకపెద్ద సమస్య యెదుర్కొనుచున్నది. ఈ శాసనములలో ప్రయోగింపఁబడిన అనుంగు, సాని, రెడ్డి, నేడు, సెట్టి శబ్దములు దేశీయభాషాపదములు. ఆర్య, నాయక, దేవి, మహాదేవి యను పదములు సంస్కృత భాషాపదములు. ఈ శాసనములన్నియు బదునొకండవ, పండ్రెండవ శతాబ్దులలోనివిగ నున్నవి. ఈవిషయమై, చరిత్రపరిశోధకాగ్రగణ్యులును, భాషాభిజ్ఞులునగు శ్రీయుత జయంతి రామయ్యపంతులువారికి వారి యభిప్రాయమును దెలుపఁ వలసినదని నామిత్రులొకరు వ్రాయగా నీ క్రిందివిధముగా జాబు వ్రాసి వారి యభిప్రాయమును దెలిపినట్లు నామిత్రులు నాకుఁ దెలిపినారు.

"మున్నూటివారు శూద్రులయినట్లే కనబడుచున్నది. తొలుత మున్నూఱు కుటుంబములొకశాఖగా నేర్పడుటచేవారికి మున్నూరను పేరువచ్చినట్లును, వారిలో రెండు శాఖలుగా నేర్పడుటచేత పెద మున్నూర్వారు, చినమున్నూర్వారు అనుభేదములు కలిగినట్లును, కనుపట్టుచున్నది. కాని చినమున్నూరనుపేరు మాత్రము కానవచ్చుట లేదు. పెదమున్నూటిశాఖకు సంబంధించిన మూడు శాసనభాగము లీ క్రిందనుదహరించుచున్నాఁడను. అవియన్నియు నీజిల్లాలో దాక్షారామ గ్రామమందు భీమేశ్వరుని యాలయమందున్నవి." అనివ్రాసి పైనిచూపిన మూఁడుశాసనముల కాపీలను వ్రాసి అనుంగు మిత్రుఁడు, సమర మొదలి ముఖ్యుఁడు (కులముపెద్ద) అని అర్థము చెప్పిరి.

" శాసనము సులభముగా నన్వయించుటకై వర్ణక్రమమునం దక్కడక్కడ చిన్నమార్పులను మాత్రము చేసినాను"

"దాక్షారామ శాసనములందు మాత్రమె యీ శాఖవారుదాహరింపఁబడి యుండుటచేతఁ బూర్వమీ జిల్లాయందే యీజాతి వారుండినట్లు తోఁచుచున్నది. ఈకాలమందీ పేరుగలవా రిచ్చట లేరు. ఆపేరు దేశనామములు బట్టి కలిగినదిగాని జనసంఖ్యనుబట్టి కలిగినది గాదు."

"గుంటూరుజిల్లా పల్నాడు తాలూకా యని యొక తాలూకా గలదు. అందుఁ బూర్వము మున్నాఱు పల్లెలుండినవని శాసనములు చెప్పుచున్నవి. కాని యీదేశములోఁ బూర్వమందు కాని, ఇప్పుడు కాని "మున్నూటివా" రున్నట్లు కనపడదు."

"మున్నాఱువారు" అను జాతివారు ద్రావిడులలో నున్నట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. వా రేవర్ణమువారో తెలియదు. అఱువద్రబాహ్మణులలో అష్టసహస్రము వారను నొకశాఖగలదు. ఆంధ్ర బ్రాహ్మణులలో ఆరువేలవా రున్నారు. ఈవిషయము లింతవఱకే నాకు తెలియును."

కాని పంతులవారీ విషయ మింతవఱకే నాకు తెలియునని చెప్పినది సరికాదు. శ్రీపంతులవారు పెద్దలగుటచే మఱచియుందురు.

8—12—1925 తేదీని రాజమహేంద్రిపురములో ఆంధ్ర ఇతిహాసపరిశోధకమండలి వారి వార్షికోత్సవ సమయమున వినిపించిన యధ్యక్షోపన్యాసములో—

" They will find for instance, that Daksharama had in olden times a Vernacular folk name Daka-Remi which was perhaps the crude form which subsequently devoloped into the sanskritized form Daksharama, that the place then

abounded in dancing girls whose number was large enough to constitute two societies called the " Big Three Hundred" and the " Little Three Hundred " పెద్దమున్నూరు, చిన్నమున్నూఱు and that measures were in those days, stamped with the kings seals and were called after the names of the kings whose seals they bore. "

అని వాక్రుచ్చియున్నారు. ఇప్పుడు వీరీయభిప్రాయమును విడిచిపెట్టియున్నారో, లేక దీనిని మఱచి వారట్టి జాబువ్రాసి యున్నారో నాకు తెలియదు.

బహుశః "అనుంగు, సాని, శబ్దములు పంతులవారిని భ్రమ ప్రమాదముల పాలుచేసి యుండును. ఇప్పుడు తెలుఁగుభాషలో దొర, దొరసాని శబ్దములను వ్యవహరించు చున్నాము. వీనికి దుష్టార్థము లెవ్వరిచ్చుచుండ లేదు. పూర్వకాలమున సాని యనుపదము సకలవర్ణములలోను, సకలకులములలోను వ్యవహరింపఁబడుచున్నట్టు పెక్కుప్రమాణములను జూపఁగలము. అట్లే అనుంగు శబ్దమునకుఁ గూడ చూపవచ్చును.

ఈశాసనకాలమునకుఁ గొంచెము పూర్వముననే యున్న నన్నయ భట్టు శ్రీమదాంధ్రభారతమున నాదిపర్వమున సప్తమాశ్వాసములో ద్రౌపదీస్వయంవరమునకై పాండవులు బ్రాహ్మణ వేషములతో ద్రుపదుపురంబున నొక కుంభకారగృహంబున నున్న కాలమున నర్జునుఁడు మత్స్యయంత్రమును గొట్టిన తరువాత ద్రౌపదిని వెంటఁ బెట్టుకొని తాము బసచేసియున్న యింటికి మరలివచ్చి నప్పుడు "దృష్టద్యుమ్నుఁడు" వీరినిఁ జూడవచ్చి తిరిగి తనతండ్రి కడకుఁబోయి వీరి నిజవృత్తమును జెప్పుసందర్భములో

"అయ్యిద్దరును గృష్ణనల్లొప్పఁ దోడ్కొని
చని యొక్క ముదసలి సానికపుడు
మ్రొక్కి యక్కన్యను మ్రొక్కించి మఱియొక్క
గారవర్ణుఁడు పంపఁ గడకతోడ."

కుంతికనుటకు బదులుగా ముదుసలిసానికని చెప్పినాఁడు. సానిశబ్దమునకుఁ జెడు అర్థమున్న యెడల నన్నయభట్టు ప్రయోగమును జేసి యుండునా?

"వాసవ సన్నిభుండగు దివాకర రాజునకుం బులోమక
న్యాసమశీలయై నెగడు నాయనసానికి నుద్భవించెగం
గానలి లేశహాస శశికాశ వికాస పయోజ కీర్తికాం
తా సహితుండు ధీప్రకర సుధాముండు సోముఁడున్నతిన్."

గుంటూరు మండలములో నాదెండ్ల మూలస్థానేశ్వరాలయము లోని యొక శాసనములో

"(శ్రీ) వేంగీ వసుధాంగనా తిలకమై శిష్టక్షమాదేవబృం
దావాసంబగు వానరంబుపతి యుద్యత్కీర్తి యాజ్ఞత్రయ
వ్యావర్ధిష్ణు పవిష్ఠత ప్రకట పుణ్యారంభుఁడై యొప్పె స
ద్భావిం బోతనసోవయాజినిచిత బ్రహ్మాండ తేజుండిలన్.
అతనికి నాత్మజుండు సుజనాగ్రణి దోడ్డపనాయకుండు ద
త్సుతుఁడన వద్యకీర్తిమతి సూర్యుండు వాని తనూజుండు జ్వల
ప్రతుండగు మంత్రి శ్రీధరుండు వానికి సూరవసానికిన్ బృహ
స్పతి నిభుఁడుద్భవించె బుధబంధు నిధానుండు గంట డిమ్మహిన్."

గుంటూరు మండలములో అమరావతీ గ్రామమందు అమరేశ్వరస్వామి యాలయములో

(శ్రీ) రమ్యంబగు వారిజాసన .........షట్కర్మధ
ర్మారంభుండిల నప్పనార్యునకు నుద్యన్మూర్తిగా వానికిం 2

దానాకల్పవధూ..............గుడ్డిసానికిం బుత్రకు

డారంగా............... పై బుధులత్యంతంబు వర్ణింపఁగాన్

సుప్రసిద్ధాంధ్ర కవియగు బమ్మెరపోతన తన తెలుఁగు భాగవతమున

"మానినులీడుగారు బహూమాన నివారిత దీన మానస
గ్లానికి, దాన ధర్మమతి గౌరవ మంజులతాగభీరతా
స్థానికి ముద్దుసానికి సదాశివ పాదయుగార్చనానుకం
పానయ వాగ్భవానికి బమ్మెరకేసయ లక్కసానికిన్."

అని తల్లిని బేర్కొనవలసి వచ్చినప్పుడు కూడ సానిశబ్దమును జేర్చి ప్రయోగించినాఁడు. దీనికి విపరీతార్థమేమయిన నున్న యెడల నిట్లు ప్రయోగించి అపహాస్యభాజనుఁడగునా? కావున నీశబ్దములో దూష్యమేమియుఁ గానరాదు. ఈప్రమాణములన్నియు బ్రాహ్మణులను గూర్చినవియె- తక్కిన వర్ణములనుగూర్చి నవియుఁగూడ పెక్కులు గలవు.

శ్రీయుత జయంతి రామయ్యపంతులవారు శ్రీనాథవిరచితమైన భీమేశ్వర పురాణమును బఠించియుండుటచేతను చేబ్రోలు శాసనములో "మున్నూఱుసాను" లని యుండుటచేతను, హైదరాబాదు రాష్ట్రమునందు మూఁడులక్షలమంది కాపుకులమువారు గల రను విషయము వారికి స్ఫురణకు రానందునను మొదట వారట్లు వ్రాసియుందురుగాని యావిషయ మెఱింగిన తరువాతను తొంటి యభిప్రాయమును మార్చుకొని మఱియొక విధముగా నామిత్రునకు వ్రాసియుండుటచేత వారియభిప్రాయమును ఖండించి వ్రాయుట యనావశ్యకమని తలంచుచున్నాను. అట్టి యభిప్రాయమునే వారు గాని మఱియొకరుగాని సమర్థింపఁ బూనుకొన్నచో సహేతుకము లయిన ప్రమాణములతో వారి సిద్ధాంతమును ఖండించుటకుఁ బూనుకొందునని తెలుపుచు గ్రంథవిస్తరభీతిచే నింతట విరమించెదను. అనుబంధమును జూడుఁడు.



# కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము.

పదునాల్గవ ప్రకరణము.

## శ్రీవీరప్రతాపరుద్ర దేవచక్రవర్తి పాలనము.

(క్రీ. శ. ౧౨౯౫ మొదలుకొని క్రీ. శ. ౧౩౨౬ వఱకు)

ఇట్లు పదుమూఁడవ శతాబ్ది యంతమున రుద్రదేవికి దౌహిత్రుఁడును పెంపుడు కుమారుఁడు నైన శ్రీ కాకతి వీరప్రతాపరుద్రదేవ మహారాజు త్రైలింగ్య సామ్రాజ్యభారమును వహించి అధ్యాసిత వజ్రసింహాసనుండై శిష్టరక్షణమును దుష్టశిక్షణమును గావింపుచు ప్రజాపరిపాలనము చేయ నారంభించెను. ఇతఁడు యౌవనవంతుఁడైన వెనుక రుద్రదేవికాలమున దేశమునకు బాధ కలిగించుచుండిన సామంతనృపతులను జయించి యాంధ్రసామ్రాజ్యము దినక్రమ ప్రవర్ధమానమై వెలుంగునట్లు ప్రయత్నించి సఫలీకృత మనోరథుఁడయ్యెను. ఆంధ్రభాషను మాటలాడిన ప్రజలనెల్ల నేకచ్ఛత్రము క్రిందికిఁ గొనివచ్చెను. ఈరెండవ ప్రతాపరుద్ర చక్రవర్తికాలంబున నాంధ్రసామ్రాజ్యము నవలక్షధనుర్ధరులతో నొప్పుచుండెను.

## ఏకశిలానగరము.

ఆకాలమున నుత్తరహిందూదేశంబునం దురుష్కులకు రాజధానీనగరమై ప్రసిద్ధి వహించియున్న ఢిల్లీ నగరమునకన్న నైశ్వర్య ప్రభావమున మిన్నయై దక్షిణహిందూస్థానంబునం గల పురంబులలో నెల్ల మేటియై శత్రుజన భయంకరమై, ఏకశిలానగరము వన్నెకెక్కి యుండెను. ఎక్కడఁజూచినను దేవాలయ గోపురంబులును, ఎక్కడ వీక్షించినను రాజభవనంబులును రమణీయంబులై ప్రకాశించు చుండెను. ఏకశిలానగరములోని సౌధాగ్రములు మణిహేమకుంభములతో నలంకరింపఁబడి యున్న వని యొకకవి వర్ణించియున్నాఁడు. మంచనగోవిందశర్మయను బ్రాహ్మణుఁడు టిట్టిభసెట్టి యను వైశ్య మిత్త్రునితోడ నేకశిలానగరమును బ్రవేశించిన విధానమును వల్లభామాత్యకవి క్రీడాభిరామ మను గ్రంథమున నిట్లభివర్ణించియున్నాఁడు.

"సప్తపాతాళ విష్టప మహాప్రస్థాన
ఘంటాపథం బైన ఘనసుపరిఖ
తారకామండల స్తబకావతంసమై
కనుచూపు గొనని ప్రాకారరేఖ
పుంజీభవించినభువన గోళము భంగి
సంకులాంగణమైన వంకదార
మెఱుఁగు లెక్కలతోడి మేరుశైలముఁబోలు
పెనుపైఁడి తలుపుల పెద్దగవిని
గీ. చూచిచేరెఁ బ్రవేశించెఁ జొచ్చెఁ బ్రీతి
సఖుఁడు దానును రథఘోట శకటకరటి
యూథసంబాధముల కొయ్యనోసరిలుచు
మందగతి నోరుగల్లు గోవిందశర్మ."

ఘుటీయు:—

"రాజమార్గంబు వారణఘటా ఘోటక
శకటికాభటకోటి సంకులంబు
ధరణీస్థలీరజ స్త్రసరేణు బహుళంబు"

నని యభివర్ణించి యున్నాఁడు. ఏకశిలానగర దుర్గ ప్రాకార ములను వెలుపలను లోపలనుగూడ వాటిక లనియు వాడలనియు, వ్యవహరింపఁబడెడు పేటలు విస్తరిల్లి యుండెను.

## నాగయగన్న మంత్రి.

ఇమ్మహా నగరమున కంతకును ప్రతాపరుద్రుని మంత్రులలో విఖ్యాతుండగు "గన్నమనాయఁడు" అను సేనాని రక్షఃపాలుఁడై క్రిమశిక్షణము నెఱపు చుండెను. ఈగన్నయమంత్రి మడికిసింగనకవి విరచిత మైన పద్మపురాణకృతికి భర్తయైన కందనమంత్రికి పిన్న తాత యని (అనఁగా గన్నయమంత్రి జ్యేష్ఠభ్రాత యైన గణపతికి కందనమంత్రి మనుమఁడని) శ్రీ వీరేశలింగము పంతులుగా రాంధ్ర కవులచరిత్రములో మడికిసింగనకవిం గూర్చి వ్రాయు సందర్భమునఁ దెలుపుటచేఁ నీగన్నయమంత్రియు వారు నియోగిబ్రాహ్మణుఁ డని యభిప్రాయపడినట్లు విదిత మగుచున్నది. ఆ యభిప్రాయము సరి యైనదికాదు. గన్నయమంత్రి చతుర్థకుల భూషణుఁ డని మారన కవి కృతమైన మార్కండేయపురాణములో విస్పష్టముగాఁ దెలుపఁబడి యున్నది. గన్నయమంత్రికి నాయకత్వము ప్రతాపరుద్రునివలననే యనుగ్రహింపఁబడినట్లుగా మార్కండేయ పురాణమున నీక్రింది పద్యములోఁ జెప్పఁబడినది.

"ఎలమిఁ బ్రతాపరుద్ర మనుజేంద్రునిచేఁ బడసెం బ్రవీణుఁడై
కొలిచియు శౌర్యలీల రిపుకోటి రణావనిఁ గీటడంచియు
న్నలరిపుతుల్యవిక్రముఁడు నాగయగన్నవిభుండు తేజము
ల్వెలసిత రాజ్యచిహ్నములు విశ్రుతలక్ష్మియు నాయకత్వమున్."

ఈగన్నమంత్రి కాకతిక్ష్మాతలాధీశకటకపాలుఁ డని మార్కండేయ పురాణమునం బలుతావులఁ బేర్కొనఁబడి యుండుటయే గాక యీ క్రింది పద్యములోఁ బ్రత్యేకముగా నభివర్ణింపఁబడియెను.

" సీ. తన సుందరాకృతిఁ గని వెఱఁ గందిన
వనిత లంగజు నొప్పఁ దనువుఁ జేయఁ
దన కళాచతురత్వమున కద్భుతం బందు
బుధులు భోజుని నేర్పు పొల్లు సేయఁ
దననయాభిజ్ఞత వినినప్రాజ్ఞులు దివి
జేశుని తజ్జ్ఞత యేపు దింపఁ
దనయాశ్రయంబున మను బంధు మిత్త్రవ
ర్గము కల్పతరువు నాశ్రయముఁ దెగడ
గీ. నెగడె జగమున నెంతయుఁ బొగడువడసెఁ
గాకతిక్ష్మాతలాధీశకటకపాలుఁ
డమలసితకీర్తి ధనలోలుఁ డన్వయాబ్జ
షండ దినవల్లభుఁడు గన్నసైన్యవిభుఁడు "

ఇతఁడు ప్రతాపరుద్రకటాక్షవీక్షాపేక్ష పరాక్రమపరికారుం డగుటయ గాక విద్యావిభూషణుం డగుటవలన శ్రుతిస్మృతి సంపన్ను లయిన భూసురోత్తములును, సమస్తశాస్త్రవిదు లయిన విద్వాంసులును, అఖిలపురాణ ప్రవీణు లయిన పౌరాణికులును, సరససాహిత్య విద్యావిశారదు లయిన కవివతంసులును, తన్నుఁ బరివేష్టింప నప్పటప్పట రమ్యహర్మ్యతలంబుల సుఖోపవిష్టుండై సరసకథా వినోదంబులఁ గాలంబు గడపుచుండెను. ఇట్లు విద్వజ్జనానుగ్రహంబుఁ బడసిన యాగన్నమంత్రి తిక్కన సోమయాజి శిష్యుండయిన మారయకవివర్యునిచే మార్కండేయపురాణమును దెనిఁగింపఁ జేసి యేతత్కృతికి నాయకుం డయ్యెను. ఈనాగయ గన్నవిభుఁడు ప్రతాపరుద్ర దేవసామ్రాజ్య వర్ధనస్థిరవినీతికరణకుశలుండని మారనకవి

యీ క్రిందిపద్యములోఁ జె
ప్రతిభావిశేషమును వేనోళ్ళఁ జ

" తనసముజ్జ్వలమూర్తి జనలోచనాంభోజ
 ములకు మార్తాండుని మూర్తిగాఁగఁ
దననయోపార్జిత ధనమున కర్థిహ
 స్తములు నిక్షేపణస్థలులు గాఁగఁ
దనభూరితరతేజ మనుపమ నిజవంశ
 భవనంబునకుఁ బ్రదీపంబు గాఁగఁ
దనవినిర్మలయశంబునకు దిశాతటం
 బులు దృఢశాసనశిలలు గాఁగఁ
గీ. ప్రకట గుణగణసంపదఁ బరగుచున్న
ధన్యుఁ డధికపుణ్యుండు ప్రతాపరుద్ర
దేవసామ్రాజ్యవర్ధనస్థిరవినీతి
కరణకుశలుండు నాగయగన్నవిభుఁడు."

## ఎల్లయనాయకుఁడు - మేచయనాయకుఁడు.

ఇట్టి ప్రసిద్ధిగాంచిన నాగయగన్న విభునకు నిరువురు సోదరులు గలరు. వార లిరువురును గూడ ప్రతాపరుద్రుని సేనానులుగ నుండిరి. వారిలో ఎల్లయ సైన్యనాథుఁడు గన్నమంత్రికిఁ బెద్దతమ్ముఁడు. ఉన్మదపరిపంథిసింధుర సమాజ విదారణసింహ మని కవు లీతనిం గొనియాడుచుండిరి. ఇతనికంటెను మూఁడవసోదరుఁడైన మేచయనాయకుఁడు సుప్రసిద్ధుఁడు. ఆకాలమునం దితఁ డెట్టిప్రఖ్యాతి వహించి యుండినదియు నీక్రింది పద్యములవలన బోధపడకమానదు.

" చ. నయవినయాభిరాముఁ డగు నాగయ గన్నని కూర్మితమ్ముఁడ
 న్వయనవరత్న దీపము దివాకర తేజుఁడు రాజనీతి ని
 శ్చయనిపుణుండు నిర్మలవిచార వివేక పరాయణుండు మే
 చయరథినీశుఁ డుజ్జ్వలయశస్స్ఫురణం బొగ డొందె నిద్ధరన్."

త్రము.

వ్రిల్ల

... చెలిమి సేయ

సకలమేప ... నజాకరములఁ
దనజయశ్రీవినోదంబు సలుపఁ
దతరిపుమకుట రత్నప్రభాజాలాత
పంబునఁ దనపదాబ్జంబు లలరఁ
గీ. దనరుఁ జలమర్త్యగండప్రతాపరుద్ర
మనుజవిభునకు సేనానియును మహాధి
కారియును నాప్తుఁడును నై పొగడ్త కెక్కి
మేరు ధీరుఁడు నాగయ మేచశౌరి.''

## బెండపూడి అన్నామాత్యుఁడు.

కాశ్యపగోత్ర జాతుఁడైన పోల యామాత్యునకు ద్వితీయ పుత్త్రుఁడైన అన్నయమంత్రి శ్రీ వీరప్రతాపరుద్రచక్రవర్తియొక్క రాజ్యభారధురంధరులలో నొక్కఁడుగా నుండెను. శ్రీనాథమహాకవి తన భీమఖండమును ఈయన్నమంత్రి మనుమఁడును అల్లయవీరభద్రారెడ్డిమంత్రియు నగు అన్నమంత్రికి నంకితము సేయుచు పీఠికలో నీవిధముగా నభినుతించి యున్నాఁడు.

'' సీ. కాకతిక్ష్మాపాల గంధ దంతావళ
ధ్వజినీమహీధురంధరుఁ డనంగ
నవలక్ష కోదండనాథ రాజ్యాంబోధి
సద్వర్ణపూర్ణిమా చంద్రుఁడనఁగ
నాంధ్రభూమండలాధ్యక్ష సింహాసన
సంప్రతిష్ఠాపనాచార్యుఁ డనఁగ
వీరరుద్రాశేషవిశ్వంభరాధీశ
పృథుల పేర మనఁగ

సీ. యవనసంహారవిలయ కాలాగ్ని యనఁగ
ఘాటి విఘటిత కుమ్మటోద్యానుఁ డనఁగ
విశ్వలోక ప్రశస్తుఁడై వినుతి కెక్కె
నతుల బలలీల పోలయయన్నశౌరి. ''

ఈతఁడు ప్రతాపరుద్రుని గజఘటసేనల కధ్యక్షుఁ డనియు, నవలక్షధనుర్ధరులు గల రాజ్యాధిపతి సేనాసముద్రమునకుఁ జంద్రుని వంటి వాఁ డనియు, ఆంధ్రభూమండలాధ్యక్ష సింహాసన ప్రతిష్ఠాపకుండనియు, వీరరుద్రమహారాజు యొక్క సమస్త రాజ్యభారధురంధరుఁ డనియు, యవనుల (తురుష్కుల) సంహరించుటలోఁ గాలాగ్నిరుద్రకల్పుఁ డనియు, గుమ్మట యను ప్రదేశమును జయించె ననియు, పై పద్యమునఁ జెప్పఁబడి యుండెను. మఱియు నితనికి కొలని ప్రతాపరుద్రుఁడు విభాకరగ్రహణకాలమున నొకయగ్రహారమును దానము చేసె నని పై భీమఖండములోని యీక్రింది పద్యములోఁ జెప్పఁబడియున్నది.

'' కొలను ప్రతాప రుద్రనృపకుంజరుచేత నరేంద్రసారణీ
సలిలవివర్ధమాన బహుసస్యసమాకుల మగ్రహారమై
వెలయ విభాకరగ్రహణవేళఁ దగంగఁ బరిగ్రహించి బం
ధుల భరియించె నన్నవిభుతో సరియెట్లు పృథాను లెవ్వరున్.''

ఈ యన్నమంత్రి పరమమాహేశ్వరాచారతత్పరుఁ డైన నియోగి బ్రాహ్మణుండు. ఇతని దానశాసనములు కృష్ణామండలములోని శ్రీకాకులమునం గలవు.

సాహిణిమారుఁడు – భాస్కరరామాయణము.

భాస్కరరామాయణ కృతికిఁ బతి యైన సాహిణిమారుఁడు (మారయసాహిణి) ప్రతాపరుద్రుని యశ్వసైన్యంబున కధ్యక్షుఁడుగ

నుండెను. అయోధ్యాకాండాది పద్యములో "బుద్ధయ కుమార సాహిణి మారా" యనియు, కాండాంతపద్యములో "కాచమాంబా కుమారా" యని కుమార రుద్రదేవుఁడు సంబోధించి యుండుటచేత సాహిణిమారుఁడు బుద్ధయకును కాచమాంబకును జనించె నని స్పష్ట మగుచున్నది. ఈబుద్ధయ రంగనాథరామాయణమును రచించిన గోనబుద్ధారెడ్డి యని కవులచరిత్రము దెలుపుచున్నది. "కోనకాట భూపతికుమారుఁడు రుద్రరాజు; రుద్రరాజు కుమారుఁడు బుద్ధరాజు, బుద్ధరాజు కుమారుఁడు విఠ్ఠలరాజు; విఠ్ఠలరాజు కుమారుఁడు బుద్ధ రాజు; బుద్ధరాజ కుమారుఁడు మారయ" యని కవులచరిత్రములో వంశక్రమము చెప్పఁబడినది కాని యిది యెక్కడనుండి గైకొనఁబడి నదో దెలియరాదు. "రంగనాథ రామాయణము బుద్ధరాజు రచి యించిన ట్లుండుటచేతను, భాస్కర రామాయణ మారాజుపుత్త్రుఁ డైన మారని కంకితము చేయఁబడుటచేతను సాహిణిమారుఁ డా బుద్ధరాజు కొడుకే యైన పక్షమున" అని సందేహించి వ్రాయుట చేత పైని జెప్పిన వంశక్రమము సరి యైనది కా దని మన మూహిం పవచ్చును. రంగనాథరామాయణమును రచించిన గోనబుద్ధారెడ్డి కుమారుఁడు మారయయని యనేకులు నిశ్శంకముగాఁ జెప్పి యున్నారు. సాహిణిమారునితండ్రి గోనబుద్ధారెడ్డి క్రీ. శ. ౧౨౭౭ లో నుండెను. బూదుపూరి శాసనములో "శ్రీగోనవంశ నిజశేఖర బుద్ధయాఖ్య పుత్త్రీ పవిత్రచరితా భరితాగుణౌఘైః" అనియు, "శా కాబ్దే వసునందశంకరమితే శ్రీధాతృసంవత్సరే' యనియు నున్నవి" అని ప్రబంధమణి భూషణముయొక్క పీఠికలో శ్రీమానవల్లి రామ కృష్ణయ్యగారు వక్కాణించి యుండుటయే గాక వారు ప్రకటించిన యాబూదుపూరి శాసన వ్యాఖ్యానములోనే సాహిణిమారుని తండ్రి యు రామాయణకృతికి కర్తయు నగు బుద్ధయను నొక్కరేయని

నిరూపించుటకుఁ జాలినంత ప్రమాణము గానరాదని వ్రాసియున్నారు. కాఁబట్టి రంగనాథ రామాయణమును రచించిన బుద్ధారెడ్డి సాహిణిమారుని తండ్రియగునా కాదా యని శంకింపలేదు. అట్లయిన పక్షమున బుద్ధరాజు పుత్త్రులు కాచవిభుఁడును విఠ్ఠలరాజును ద్విపదగా రచించిన యుత్తర రామాయణ పీఠికలో సుప్రసిద్ధుఁడైన సాహిణిమారుఁడు తమ సోదరుఁ డని చెప్పికొనియుండక పోవుటకుఁ గారణ మేమి ? తండ్రియును సోదరులును మహాకవులై సలక్షణమైన శైలితో నొప్పుచున్న కావ్యమును రచియించి లేక రచియింపించి యుండఁగా మారయ సాహిణి మరల రామాయణమును రచియింపం జేయుటకుఁ గారణ మేమి ? ఆ రామాయణము మల్లికార్జునభట్టు, కుమార రుద్రదేవుఁడు, భాస్కరుఁడు, అయ్యలార్యుఁడు నను నల్వురు కవులచే రచియింపఁబడి యుండఁగా దానికి భాస్కరరామాయణ మని పేరు గలుగుటకుఁ గారణ మేమి ? ఈ నల్వురు కవులకుం గల సంబంధమెట్టిది ? ఈవిషయంబుల నన్నింటిని పర్యాలోచించినం గాని సత్యము తేటపడఁ జాలదు. తిక్కన సోమయాజి పితామహుఁడైన మంత్రి భాస్కరుఁడు రామాయణమును రచింప, నేమి కారణముచేతనో యారణ్యకాండము దక్క తక్కిన కాండము లన్నియు నశించిపోఁగా వానిని మారయసాహిణి యాస్థానకవి యగు హుళక్కి లేక హుళిక్కి భాస్కరుఁడును అతని పుత్త్రుఁడైన మల్లికార్జునుఁడును, శిష్యుఁడైన కుమారరుద్రదేవుఁడును, మిత్త్రుఁడైన అయ్యలార్యుఁడును మరల రచించి రనియు పూర్వపక్షవాదమై యున్నది. ఇట్టి యభిప్రాయమునకుం గల కారణము లాంధ్రకవుల చరిత్రమున వివరముగా వ్రాయఁబడినవి. శ్రీమద్రామాయణమును రెనిఁగించినది హుళుక్కి భాస్కరమహాకవి కాని మంత్రిభాస్కరుఁడు కాఁడనియు, హుళుక్కి భాస్కరుఁ డరణ్యకాండమును యుద్ధకాండములోఁ గొంత

భాగమును రచించె ననియు, బాల, కిష్కింధా, సుందరకాండము లను దత్పుత్త్రుఁ డగు మల్లికార్జున భట్టును, అయోధ్యాకాండమును శిష్యుఁ డగు కుమారరుద్రదేవుఁడును, యుద్ధకాండ శేషమును మిత్త్రుఁ డగు నయ్యలార్యుఁడును విరచించి రనియును, ఇందఱు కవులీ గ్రంథమును విరచించుటకుఁ గల కారణము తనచే శిక్షితు లగు శిష్యవర్గముతోడఁ గూడ నీ గ్రంథమున నుండుటకు భాస్కరుఁడు తలఁచెననుట సమంజస మనియు ప్రతిపక్షుల వాదమై యున్నది. మంత్రిభాస్కరుఁ డైనను హుళక్కి లేక హుళక్కి భాస్కరు డైనను రామాయణ మంతయుఁ గాక కొంచెము భాగమును మాత్రమె రచించిన వారుగా నున్నారు. మంత్రిభాస్కరుఁడు సాహిణిమారుని కాలమువాఁడు కాఁ డనుట నిశ్చయము. దశగతులను గ్రంథమును భాస్కరుఁడను మహాకవి యొకఁడు సాహిణిమారుని కాలమున నున్నవాఁ డనుట నిశ్చయము. సాహిణిమారుఁడు రెండవ ప్రతాప రుద్రచక్రవర్తి సైన్యాధిపతులలో నొక్కఁ డనుటయు నిశ్చయము. క్రీ. శ. ౧౩౧౧ వ సంవత్సరమున గురిజాల పింగళిస్థలములు చేరి యున్న పల్నాటి సీమ కధికారిగ నియమింపఁబడిన మాచయ సాహిణింగారు ప్రతాపరుద్రుని గజసాహిణియైన గుండయనాయనింగారికిని మారయసాహిణింగారికిని పుణ్యముకొఱకు దానశాసనము వ్రాయించియుండెను.1 కనుక భాస్కర రామాయణము సాహిణిమారుని కంకితము చేయఁబడుటచేతను, దశగతులను దెనిఁగించిన భాస్కర మహాకవి తదాస్థానకవిగ నుండుటచేతను, అంతకుఁ బూర్వము రంగ నాథరామాయణమును తరువాతను ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము నుండుటచేతను; ఈ రామాయణమును భాస్కరరామాయణ మని యిటీవలివారు వ్యవహరించు చున్నారు. సాహిణిమారుఁడు గోన

1. Annual Report on Epigraphy for 1910. para 48.

బుద్ధారెడ్డి పుత్త్రుడే యైనపక్షమునఁ దండ్రియు సోదరులును రామాయణమును సలక్షణముగా భాషాంతరీకరించియుండ నీవిధముగా నింద అచేత రామాయణమును వ్రాయించి తాను కృతినాయకుం డగునా యని యొక గొప్పశంక కలుగక మానదు. కృతినాయకుని వంశ మైనను భాస్కరరామాయణమున వర్ణింపఁబడియుండ లేదు.

మల్లికార్జునభట్టు కాండాంతగద్యములలో "శ్రీ మదష్టభాషా కవిమిత్త్ర కులపవిత్రభాస్కర సత్కవిపుత్త్ర మల్లికార్జునభట్ట ప్రణీతం" బని వ్రాసికొని యుండుటచేత నతండు మారయసాహిణియాస్థానకవియగు భాస్కరుని పుత్త్రుడని యుభయ పక్షములవారును జెప్పుచున్నారు.

ఇతఁడు సాహిణిమారుని యాస్థానకవి యగు భాస్కరుని పుత్త్రుఁడే యైన వారియాజ్ఞ ప్రకారము రామాయణమును రచింపఁ బూనినవాఁడే యైన యెడల బాలకాండము మొదట కృతినాయకుని సంబోధింపక కాండాంతమున శివుని సంబోధించి ప్రభువుయొక్కయు తండ్రియొక్కయు నాజ్ఞల నుల్లంఘించునా? కిష్కింధాకాండాది నున్న పద్యము సాహిణిమారుని గూర్చిన సంబోధనముకలది కాదు. కాండాంతమునందలి పద్యములు రెంటిలో నొకటి సాహిణిమారునిఁ గూర్చిన సంబోధనము గలదియు, మఱియొకటి శివునిం గూర్చిన సంబోధనము గలదియు నై యున్నవి. సుందరకాండము మొదట సాహిణిమారుని సంబోధించుచున్న పద్యము గలదు గాని కాండాంతమునందలి పద్యములు రెండును శివుని సంబోధించునవిగా నున్నవి. కాఁబట్టి మల్లికార్జునభట్టు రచించిన భాగములు శివుని కంకితము చేయఁబడినవి గాని సాహిణిమారుని కంకితము చేయఁబడినవి కావనియు, సాహిణిమారునిఁ గూర్చిన రెండుపద్యముల నెవ్వరో చాటువులుగాఁ జెప్పిన నిటీవలిలేఖకులు వానిని దెచ్చి వీనికి ముడిపెట్టి

రనియు, మల్లికార్జునభట్టు సాహిణిమారుని కాలమువాఁడు కాఁడ నియు నూహింపవలసి వచ్చుచున్నది.

అయోధ్యాకాండమును రచించిన కుమారరుద్రదేవుఁడు తన భాగమును సాహిణిమారుని కంకితము చేసినది వాస్తవ మనుటకు సందియము లేదు. కాని యతఁడు భాస్కరుని శిష్యుఁ డను మాట విశ్వసింపఁదగినదిగాఁ గనుపట్టదు. ఇతఁడు సాహిణిమారుని తల్లిదండ్రుల నామములను దెలిపియున్నాఁడు. "ఇది సకలకలావిశారద శారదాముఖ ముకురాయమాణ సారస్వతభట్టబాణనిశ్శంక వీరమారయకుమార కుమారరుద్రదేవ ప్రణీతం" బనిగద్యములో వ్రాసికొని యుండుటచేత నితఁడు సాహిణిమారుని కుమారుఁ డని నిశ్చయించుచున్నారు. ఇట్టి అభినవభట్టబాణ బిరుదాంకితుఁడు, సకలకలావిశారదుఁడు, భాస్కరుని శిష్యుఁడై భాస్కరుని యాజ్ఞప్రకారము దీనిని రచించియున్న యెడల తనగురువును బేర్కొనక యిట్టిబిరుదములు చెప్పుకొని గురుధిక్కారమును గావించునా? ఇంత విద్యావంతుఁడైన కుమారుఁడు గలిగియుండియు సాహిణిమారుఁడు రామాయణము నంతయు నీతనిచేతనే వ్రాయింపకుండుటకుఁ గారణంబేమి? అరణ్యకాండము సాహిణిమారుని కంకితము చేయఁబడియున్నది గాని రచనావిధాన మంతయు నన్నెచోడ తిక్కనాది కవివరుల రచనావిధాన క్రమమును బోలియున్నది. ఈకాండమున నాశ్వాసవిభాగము చేయఁబడినది. అంతియ గాక యీకాండమునందలి ప్రథమద్వితీయాశ్వాసాంత పద్యములు కృతిపతిని గూర్చిన సంబోధనములు గాక ప్రథమద్వితీయాంతములుగా నున్నవి. ఇట్టి మార్గమును తదితర కాండములను రచించిన కవు లెవ్వరు నవలంబించి యుండలేదు. ఈ కాండముయొక్క గద్యములో "ఇది సకలసుకవిజనవినుత యశస్కర భాస్కర ప్రణీతం" బని యున్నది. ఈ భాస్కర మహాకవి

యొక్క ప్రతిభావిశేషము వేఱుగ గద్యములోఁ జెప్పుకొన నక్కఱ లేకయ యారణ్యకాండరచనమే వేనోళ్ళఁ జాటుచున్నది. యుద్ధ కాండముతుదను:—

"చ. అమరహుళిక్కి భాస్కరమహాకవి చెప్పఁగ నున్న యుద్ధకాం
డము తరువాయి చెప్పెవికటప్రతిభాషణుఁ డప్పలార్యస
త్తమసుతుఁ డయ్యలార్యుఁడు కృతస్థితి నార్యులు మెచ్చునట్లుగా
హిమకర తార భాస్కర మహీవలయ స్థిరలక్ష్మి చేకుఱున్."

అని చెప్పియుండుటచేత యుద్ధకాండములోఁ గొంత భాగము (౧౧౩౮ పద్యములు) హుళిక్కిభాస్కరుఁడు చెప్పెనే గాని హుళిక్కి భాస్కరుఁడు తనకు మిత్త్రుఁ డని యెక్కడను జెప్పి యుండలేదు. మఱియు యుద్ధకాండాంతమునందలి పద్యములు శివుని సంబోధించు నవిగా నున్నవి గనుక నితఁడు సాహిణిమారుని కాలములోనివాఁడు కాఁ డనుట నిశ్చయము. వేదగిరి నాయనింగారి ప్రేరణముచేత నీ గ్రంథభాగము నయ్యలార్యుఁడు వ్రాసె నని ప్రాచీనతాళపత్త్ర సంపుటములలోఁ గొన్నిట వ్రాయంబడియుండుటంజేసి యితఁడు క్రీ. శ. ౧౧౭౦-౮౦ నడుమకాలమున నున్నవాఁ డనుట నిశ్చయము. కాఁబట్టి రామాయణములోని విశేషభాగము సాహిణిమారుని మర ణాంతరమే రచింపఁబడి యుండవలయును. అట్లు గాకయున్నశివునిం గూర్చిన సంబోధనములు గల పద్యము లీ రామాయణమున నుండు టకే ప్రమేయముం గానరాదు. ఎన్నివిధములుగాఁ బరిశీలించి చూచి నను ఆరణ్యకాండము తక్కినకాండములకంటెఁ బూర్వము రచింపఁ బడి యుండు నని విదిత మగుచున్నది. అట్లయిన యెడల రంగనాథ రామాయణమును రచియించిన బుద్ధరాజునకుఁ బుత్త్రుఁ డని చెప్పఁ బడెడి సాహిణిమారుఁడు రామాయణము నంతయు విడిచి ముందుగా భాస్కరమహాకవిచే నారణ్యకాండము నంకితము బొందుట కేమి

హేతువో దెలియరాదు? భాస్కర రామాయణముం గూర్చినయథార్థకథన మింకను మఱుంగుననే యున్నది. అయ్యది భావిపరిశోధనముల మూలమునం దెలిసికొనవలసి యున్నది. సాహిణిమారుఁడు రంగనాథరామాయణమును రచించిన గోనబుద్ధరాజు (బుద్ధారెడ్డి) కుమారుఁడు కాఁడని తోఁచుచున్నది.

ప్రతాపరుద్రుఁడు త్రిపురాంతకాంబదేవుల జయించుట.

కాకతిరుద్రమదేవి మరణానంతరము ములికినాటిసీమలోని వల్లూరు పట్టణము రాజధానిగ ములికినాటిని బరిపాలించు చున్న త్రిపురాంతక దేవమహారాజును గండికోట దుర్గము రాజధానిగ గండికోటసీమ మొదలగు ప్రదేశములను బరిపాలించు చున్న యంబయ దేవమహారాజును స్వామిద్రోహులై సామ్రాజ్యాధికారమును ధిక్కరించి స్వతంత్రులై వర్తింప, వారలను శిక్షింపఁ, బ్రతాపరుద్రుఁడు తనసైన్యాధిపతులతో గజసాహిణి గుండయనాయనిం గారిని, గజసాహిణి మాచానాయనింగారిని బంపించెను. వీరలు త్రిపురాంతకాంబయ దేవులను జయించి సామ్రాజ్యాధికారమును దిరుగ నెలకొల్పి స్వామిద్రోహరగండ, స్వామివాచకరగండ, ఇమ్మడినిశ్శంకవీర, పరమమాహేశ్వర, సమయచక్రవర్తి, కలియుగ వీరభద్ర, కీర్తిసముద్ర, జమలికభోగలింగ, మొదలుగా గల బిరుదముల నెట్టినో పడసిరి. ప్రతాపరుద్ర చక్రవర్తి సకలసేనాపతి మహారాయపట్ట సాహిణి సోమయనాయనిం గారిని గండికోట సీమకుఁ బరిపాలకునిగ నియమించెను. ఇందులకు నిదర్శనములు త్రిపురాంత కాంబదేవులు తమగురువు పుష్పగిరి మఠాధిపతియైన అఘోరశివాచార్యులు మొదలగువారికిఁ జేసిన దానశాసనములు క్రీ. శ. ౧౩౦౮ గవ సంవత్సరమువఱకుఁ గానంబడుచున్నవి. తరువాత మహారాయపట్ట సాహిణి సోమయ నాయనింగారు పరిపాలించు చున్నందులకు వారికాలమున

నాగరాజు అయ్యపరాజు కొడుకులు బయ్యన, చిన్నయ అనువారలు శుల్కాధికారులుగ నుండి మార్గశుల్కములను గైకొనుచుండి యా సుంకమునుండి తలకంటిదేవికి అఖండదీపారాధనకై నెల ౧-కి ౨రూకలు ధారాపూర్వకముగ దత్తము గావించి శా. శ. ౧౨౩౧ (క్రీ. శ. ౧౩౦౯) సౌమ్యసంవత్సర ఫాల్గుణ శు ౭ గురువారమున తలకంటిదేవి గర్భాలయమున నుత్తరభాగమున శిలాశాసనము వ్రాయించి రని జమ్ములమడుగు స్థానిక చరిత్రము వలనఁ దెలియుచున్నది.

## శైవమత ప్రాబల్యము — జైనమత నిర్మూలనము.

తన మాతామహి తండ్రియగు గణపతిదేవ చక్రవర్తివలెనే ప్రతాపరుద్రుఁడు శైవమతాభినిరతి గలవాఁ డగుటంజేసి శైవమత గురువు లనేకు లాంధ్ర దేశమునకు రాఁదొడంగిరి. శైవమఠములు పెక్కులు గలవు. వానిలో శ్రీశైలము, పుష్పగిరి, కోసఁగి, కోటిఫలి మఠములు ప్రధానములు. ఆంధ్రదేశంబున దక్షారామము త్రిపురాంతకము మొదలగు శైవక్షేత్రము లయిన పుణ్యక్షేత్రము లనేకములున్నను శ్రీశైలము పురాతన కాలమునుండి ప్రధానక్షేత్రముగా నుండెను. జన్మమెత్తినందున కొక్కసారి యైనను శ్రీశైల మల్లికార్జునదేవుని సందర్శింపకున్న ముక్తి కలుగనేరదని యాకాలపు శైవుల విశ్వాసమై యుండెను. మండలేశ్వరు లయిన మహారాజులకు సామంత నృపతులకు, గురువు లారాధ్యబ్రాహ్మణులును శివయోగు లయిన బ్రహ్మచారులును; మంత్రులు లింగధారు లయిన నియోగి బ్రాహ్మణులు; మహావీరు లయిన సేనాధిపతులు మొదలగు వారికి గురువులు జంగమదేవరలు. ఈవీరశైవులకు వీరశాక్తేయము నందుఁ గూడ నభిరతి మెండుగ నుండెను. ఇంక మైలారు వీరభటులంగూర్చి

చెప్పనేల? వీరశైవభక్తావేశ పరవశులై యున్నప్పుడు శివుఁడు ప్రమథగణంబులతోఁ గూడి తమతో నృత్యము సలుపుచుండెనని భావించి భయంకర నృత్యములను చేయుటకు వెనుదీయ కుండిరి. ఏకశిలా నగరవీథులలో విహరించుచు మైలార దేవుని యుత్సవము నాఁడు మైలారు వీరభటులు చేయు వీరకృత్యములను జూచి వర్ణించినవిధమును వల్లభామాత్యుఁడు తనక్రీడాభి రామములో నీక్రింది పద్యములోఁ జూపియున్నాఁడు.

"సీ. అవఅవమందు నెట్టని చంద్రమల్లెలఁ
జోద్యంపు గుండాలు చొచ్చువారు
కరవాడి యలుగుల కనరుపాతరలలో
నుట్టిచేరులు గోసి యురుకువారు
గాలంపు గొంకిఁ గంకాళిచర్మము గ్రుచ్చి
యుసువీధి నుయ్యెల లూగువారు
కటికి యొగ్గాళంపు గండకత్తెర వట్టి
మిసిమింతులును గాక మ్రింగువారు
గీ. సందులను నారసంబులు సలుపువారు
యెడమగుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తి గైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలారు వీరభటులు."

గీ. వీరమైలారు దేవరవీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గోరగపడుచు
నాడుచున్నది చూడు మర్థాభినయము
తాను నెట్టిగసీ లంత గాని లేదు.

చ. వెనుకకు మొగ్గ వ్రాలి కడు విన్ననువొప్పఁగఁ దొట్టి నీళ్ళలో
మునిఁగి తదంతరస్థమగు ముంగర ముక్కున గ్రుచ్చికొంచు లే
చెను రసనాప్రవాళమున శీఘ్రము గ్రుచ్చెను నల్లపూస పే
రనుపమలీల నిప్పడు నుపాయము లిట్టివి యెట్లు నేర్చెనో."



ఉత్తరకొండను గల జైనవిగ్రహములు.



హనుమకొండ సహస్ర స్థంభ దేవాలయము-మంటపము



హనుమకొండ సహస్ర స్థంభ ప్రధానాలయము

*(By the Courtesy of A. H. R. Society, Rajahmundry.)*

జైనమతావలంబకులును స్మార్తమతావలంబకు లయినబ్రాహ్మణులునుగాక తక్కిన యగ్రవర్ణముల వారిలో మూఁడింట రెండు పాళ్ళు శైవులుగ నొకపాలు వైష్ణవులుగ నుండిరి. వీరిలో వీరశైవులు రాజ్యాధికార ప్రాబల్యము గలవా రగుటచేత బ్రాహ్మణులు వీరితోడ మైత్రి గలిగి యుండవలసిన వారైరి. అందువలన వీరలుభయులకు జైనపండితులు శత్రువులుగ నుండిరి. మొదటి ప్రతాపరుద్రుని కాలము మొదలుకొని కాకతీయాంధ్ర చక్రవర్తులు జైనమతాచార్యులపట్ల నిరాదరమును శైవులపట్ల ప్రేమను జూపుచుండిరి. జైనమతమునం దాదరముతగ్గినతోడనే జైమతాచార్యులనేకులు త్రిలింగ దేశమునువిడిచి పెట్టి కర్ణాట మహారాష్ట్రదేశములకు వలసపోయిరి. ఇంకను మఱికొందఱు జైనమతాచార్యులుధాన్యకటకము (ధరణికోట) ఏకశిలానగరము మొదలగు ప్రదేశముల నివసించియుండఁగా వారలకును బ్రాహ్మణులకును మతవివాదములును శాస్త్రచర్చలును జరుగుచు వచ్చెను. ఆవివాదములను గూర్చినగాథ లనేకములు గలవు గాని యవి యంతగా విశ్వాసార్హములుగా గన్పట్టవు. అయినను బ్రాహ్మణు లనేక మాయోపాయములను గల్పించి ప్రతాపరుద్రుని తమ కనుకూలునిగఁ జేసికొని జైనమతాచార్యుల బాధించుచు వచ్చిరని జైనులుచెప్పెడి గాథలవలనఁ దెలియుచున్నది. అందువలన జైనమతము త్రిలింగదేశమున నాశనమైనది. మహావిద్వాంసు లయిన జైనమతాచార్యు లనేకులు వైష్ణవ మతాచార్యు లయినట్లుగాఁ గన్పట్టుచున్నది.

### జైనులు బ్రాహ్మణులను శపించుట.

మంత్రవాదుల సాహాయ్యముతో మాయోపాయములు గల్పించి తమ్ము జయించి నందులకుఁ గనలుచు దుఃఖమును భరింపఁ

జాలక రోషమును బెంచి జైనమతాచార్యులు బ్రాహ్మణుల నీవిధముగా శపించిరి!

"ఈప్రతాపరుద్రుఁడు బ్రాహ్మణులు గావించిన మాయతంత్రము నెఱుంగఁ జాలక మూర్ఖుఁడై మనకంటె బ్రాహ్మణులు మంత్రశక్తి కలవారనియు నధికులనియు విశ్వసించి బ్రాహ్మణ ప్రేరితుఁడై జైనుల మైన మనమతగ్రంథము లను దగ్ధము గావించి మనమఠులు మాన్యము లాక్రమించుకొని మనశత్రువులకు ధారపోయుచుండెను; ఇంక మనము బ్రదికి యుండినను జచ్చినవారితో సమానులగముదా; మనము నేటిదినము జీవించియున్నను రేపటిదినము మరణమునొంద వలసినవారమె; మన మందఱము నొక్కసారిగఁ బ్రాణములం ద్యజింతము; ఓబ్రాహ్మణులారా! మీరు మాగ్రంథములతోఁబాటు దగ్ధము చేయక నిలుపుకొన్న మా యమరకోశము దక్క తక్కిన మీవేద శాస్త్రగ్రంథములు తొంటిప్రఖ్యాతిని విడిచి నిరుపయోగములై పోవును గాక! మాభూములలో నెవ్వరు నివసింతురో వారలకు జయము కలుగకుండును గాక! అన్యాయముగా బ్రాహ్మణులను గెలిపించుటకై మాయతంత్రమును గావించిన మంత్రవాదులును వారి సంతతివారును బిచ్చగాండ్రై తిరిపెమెత్తుకొని బ్రదుకుదురు గాక! (వీరె విప్రవినోదు లనంబడువారు.) చక్రవర్తి సరియైన విమర్శచేసి సత్యమును గ్రహింపఁజాలక బ్రాహ్మణులు కల్పించిన మాయలోఁ జిక్కుకొని వారల కనుకూలుఁడై మానాశనమునకుఁ గారకుఁ డయ్యెను గావున నీతఁడు శీఘ్రకాలములోనే పరరాష్ట్రాధిపతిచేతఁ జెఱఁగొనఁబడు గాక! అంతటితో నీతని సామ్రాజ్యము భగ్న మగును గాక!

అని శపించి యనేకులు ప్రాణత్యాగము చేసికొనిరఁట! ప్రాణత్యాగము చేయ నొల్లని మతాచార్యు లనేకులు విష్ణుభక్తి

పరాయణులై వైష్ణవాచార్యులైరి. తరువాత వీరలు ప్రతాపరుద్రు నకు గర్భశత్రువులుగ నుండి యుత్కలరాజుతోఁ గుట్రలు గావించి ఢిల్లీచక్రవర్తు లగు తురుష్కులను దాడి వెడలి వచ్చునట్లుగఁజేసి కాకతీయాంధ్ర సామ్రాజ్యమును భగ్నముఁ జేయుకార్యమునం దోడ్పడిన వారైరి. ప్రతాపరుద్ర చక్రవర్తి యెంతటి సమర్థుఁడైనను జైనులకుఁ గావించిన యపకృతివలనఁ దాను శత్రువులచేఁ జిక్కి పరిభవము నొందుటయు సామ్రాజ్యమును గోలుపోవుటయు సంభవించెను. ఇంటిగుట్టు లంకకుఁ జేటని తనరాజ్యములో మిత్రరూపమున నున్న యీ జైనశాత్రవులే పరరాష్ట్రాధిపతు లయిన తురుష్కులకు రాజ్యమర్మములను దెలిపి తన దేశమునకు రాజ్యమునకు మహాపకారమును గావించిరి. ప్రతాపరుద్రుఁడు తన పరిపాలనములోఁ గావించిన యీ మహాపరాధమె యిన్నూఱు సంవత్సరములనుండి వర్ధిల్లిన సామ్రాజ్యమున కాతనితోడనే వినాశము గలిగించినది.

## ఏకశిలానగరములోని ప్రసిద్ధదేవాలయములు.

ఏకశిలానగరములో నున్న ప్రసిద్ధదేవాలయములను క్రీడాభిరామ మను గ్రంథమున వల్లభామాత్యకవి యీ క్రింది సీసపద్యములోఁ జక్కఁగాఁ బేర్కొని యున్నాఁడు.

"సీ. అదె భైరవస్థాన మట మీఁద నల్లదె
ఛమడేశ్వరీ మహాశక్తి నగరు
వీరభద్రేశ్వరాగారమంటప మదె
యదె బౌద్ధదేవు విహారభూమి
అదె ముద్దరాల్మసానమ్మ నివాసంబు
నల్లదె కొమరుసామయ్యనగరు
అదె పాండవుల గుడి యట దక్షిణంబున
గర్తారుఁ డుండు తుర్కలఁమసీదు
గీ. కొంతదవ్వుల నదె మహాగోపురముల
పైఁడికుండలు రవిదీప్తిఁ బ్రజ్వలించి
కాన నయ్యెను మేరుశృంగములఁ బోలెఁ
గేశవశ్రీస్వయంభూని కేతనములు"

క్రీడాభిరామమును రచించిన కవి ప్రతాపరుద్రుని యనంతర కాలమున నున్నవాఁడు గావునఁ దనకాలమున నున్న తుర్కల మసీదు గూడ నిందుఁ జేర్కొనినాఁడు గాని ప్రతాపరుద్రుని యనంతరమె తురక లేక శిలానగరమున నివసించినవారగుటచేత నయ్యది ప్రతాపరుద్రునికాలమున లేదని తెలిసికొనవలయును. పైని జెప్పిన వానిలో కేశవాలయమును శ్రీస్వయంభూదేవాలమును మిక్కిలి గొప్పవైనటులఁ గానంబడుచున్నవి. శివుని యవతారముగాఁ బరిగణింపఁబడెడు భైరవునియొక్క పూజ లాకాలమున బాహాటముగా జరుగుచుండెను. భైరవుని యాకృతి వీరభయానకరసముల నుట్టిపడఁ జేయుచుండెను.

భైరవార్చనము.

ఈ కాలమున భైరవార్చనము శ్రేష్ఠమైనదిగా నెంచఁబడక పోయినను ఆకాలమున నధిక విశ్వాసముతో భైరవారాధనము సలుపఁబడుచుండెను. అప్పటి భైరవార్చనముకన్న నంతకుఁ బూర్వముండిన భైరవార్చనము దుర్నీతితోఁ గూడుకొని యుండెను. అయిన నీమతము (బ్రాహ్మణాద్యగ్ర) వర్ణములవారిలోఁ నంతగా వ్యాపించి యుండలేదు. భక్తులు భక్తిపారవశ్యముచేత ప్రాణము లర్పించుకొని ముక్తిఁ బొందుటయు నప్పటప్పట కలుగుచుండెను. గోవిందమంచనశర్మ భైరవాలయంబును బొడఁగని నమస్కరించి భైరవుని నీక్రిందివిధముగా సంబోధించినట్లు క్రీడాభిరామమునఁ జెప్పఁబడియెను.

"మ. అమితోత్సాహముతోడ నీవు పటుబాహాధక్క యొక్కొక్క మా
టు మనఃకంపము నొందఁ జేయఁ దోలుకాడుక్ వార్ధి వేలాలుఠ
త్కమఠంబై వలమానమీనమయి యుద్యన్నక్రమై యుత్తర
త్తిమిమై యుల్లలదంబు మగ్నధునిమై ధీరా మహాభైరవా."

మైలారదేవుఁడు.

బ్రాహ్మణేతర జాతులలో భైరవార్చనముతో పాటు మైలారుదేవుని పూజ కూడ ముఖ్యమైనదిగఁ బరిగణింపఁ బడుచుండెను.

ఏకశిలానగరమున మైలారుదేవుని యుత్సవములు మహావైభవముతో జరుగుచుండినవి. ఆకాలమునందలి కవివర్యులచే నీమైలారుదేవుఁ డే విధముగాఁ బ్రశంసింపఁ బడుచుండెనో క్రీడాభిరామములోని యీ క్రింది పద్యమువలన బోధపడఁగలదు.

"సీ. శవివారసిద్ధి సజ్జనపారిజాతంబు
వరదాత యాదిత్యపరభోగి
మాధవీరమణుండు మాయావినోదుండు
సూళవీప్రియభర్త మహితయశుఁడు
పల్లెంబనాయకుం డెల్లవేల్పులరాజు
కనపనేఁటల వేడ్క కాంఁడ్ర భర్త
కత్రిశాలాస్వామి కరుణాపయోరాశి
పుణ్యకీర్తనుఁడైన ప్రోలియయ్య
తే. గీ. మంచు కుఁచాల గొలువంగ మాయలేళ్లఁ
బట్టి కట్టంగ నేర్చిన బాసవెల్లి
భైరవునితోడి జోడు 'మైలారుదేవు
డోరుగంటినివాసి మే లొసఁగు గాత..'

ఇట్లు భైరవుఁడు మొదలగు దేవతల మహోత్సవములు గాక యేక శిలానగరమున నాంధ్రదేశమున జరుగు దేవతామహోత్స వములలో ఏకవీరామహాదేవియొక్క మహోత్సవము ప్రశంసనీయ మైనది. జమదగ్ని మహాముని భార్యయు పరశురాముని తల్లియు నగు రేణుకాదేవియె ఏకవీరామహాదేవి యను పేర నాంధ్రులచేఁ గొలువఁబడుచుండెను. ఏకవీరామహాదేవి యాదిశక్తియొక్క యప రావతార మని యాకాలమున భక్త్యావేశముతో సమస్తజనులచే నారాధింపఁ బడుచుండెను. ఉత్సవదినములలో ఏకవీరామహాదేవి యెదుట బవినీలు పరశురాముని కథలు పాడుచుండిరి.

### వీరపురుషారాధనము.

మఱియు నాకాలమున వీర పురుషుల నారాధించు నాచా రము గలదు. యుద్ధములయందు మహాశూరులై పోరాడి ప్రాణ ములర్పిం గోల్పోయిన వారిని జనసామాన్యము వీరు లను పేరితో

గుళ్ళు కట్టి యారాధించుచుండెను. ఇట్లారాధింపఁబడు వీరపురుషుల యొక్క విగ్రహము లాంధ్రదేశమునం దంతటను గలవు. అందును ముఖ్యముగా పల్నాటివీరుల యాలయము లాయేకశిలానగరమునందు ప్రసిద్ధమైనవిగ నుండెను. అప్పటికే పల్నాటివీరుల చరిత్రము ద్విపద ప్రబంధముగ రచింపఁబడి దేశమునం దంతటఁ బఠింపఁబడుచుండెను. ఈప్రబంధమును పాడునపుడు వీరపురుషుల శౌర్యప్రతాపములం బ్రకటించు నభినయాది కృత్యము లీ క్రిందివిధముగా క్రీడాభిరామమున నభివర్ణింపఁబడియెను.

"మ. ద్రుతతాళంబున వీరగుంభితకథం దుంధుంకిటాత్కారసం
గతి వాయింపుచు నాంతరాలికయతిగ్రామాభిరామంబుగా
యతిగూడం ద్విపదప్రబంధమున వీరానీకముం బాడెనో
క్కతె ప్రత్యేకముగాఁ గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్.

సీ. గర్జించి యరసి జంఘాకాండయుగళంబు
వీరసంబెట కోల వ్రేయు నొకఁడు
ఆలీఢపాదవిన్యాస మొప్పఁగ వ్రాలి
కుంతాభినయముఁ గైకొను నొకండు
బిగువుఁ గన్నుల నుబ్బు బెదరుచూపులతోడ
ఫీట్కార మొనరించుఁ బెలుచ నొకఁడు
బటుభుజావష్టంభపరిపాటి ఘటియిల్ల
ధరణి యాస్ఫోటించి దాఁటు నొకఁడు

తే. ఉద్దివ్రకటింప నెక్కురుఁ డోలవాడు
బయల గుఱ్ఱంబు భంజళిఁ బఱపు నొకఁడు
కుడుము దాటించుచును బెద్దకొలువులోనఁ
బడతి పల్నాటివీరులఁ బాడు నపుడు."

మఱియు నామహాకవి వారు ధరించికొన్న యలంకారములతోఁ గూడ వీరకుమారకోటి నిట్లభివర్ణించియున్నాఁడు.

"ఉ. పచ్చని పిండిగందమును బాలము సేసయు నెఱ్ఱపూవులం
గ్రిచ్చిన కంఠమాల్యములు గుప్పఁగనల్లిన వేణిబంధముల్
కచ్చుల వీరసంబెటయుఁ గ్రొత్తమణుంగగు కాసెపుట్టముల్
బచ్చలు చెక్కినట్టిరవణంబులు వీరకుమారకోటికిన్."

ఘటికాయంత్రము, పూటకూళ్ళు.

కాకతీయ ప్రతాపరుద్రుఁడు పరిపాలనము చేయునప్పుడు కాల పరిమాణముం దెలుపునట్టి ఘటికాయంత్రములు గల వనియు వానిం బట్టి గంటలు కొట్టఁబడుచుండు ననియు క్రీడాభిరామములోఁ గల యీ క్రిందిపద్యమువలన దెలియుచున్నది.

"మ. ఉడువీథిన్ శిఖరావలంబియగు నంధ్రోర్వీశు మోసాలపై
గడియారంబున మ్రోసె రెండెఁమిదుల్ ఘంటాఘణాత్కారముల్
నడలెన్ భానుఁడు పశ్చిమంబునకు వైశ్యాపూటకూటింటికిన్
గుడువం బోదమె లెక్క యిచ్చి కడునా కొన్నార మిప్పట్టునన్."

అని మంచనగోవిందశర్మ యను బ్రాహ్మణుఁడు తనచెలి కాఁడగు కోమటి టిట్టిభసెట్టితోఁ బలికినట్లు వ్రాయఁబడియుండుటం జేసి యాకాలమునం గూడ కాలపరిమాణముం దెలిపెడు గడియార ములు గల వని తెల్లమగుచున్నది గాని యాగడియారములు ఇప్పటి గడియారమువంటిది గాక మఱియొక విధ మైనవిగా మనము గ్రహిం పవలయును. అప్పుడు గడియలను బట్టి గంటలు కొట్టబడుచుండెను. అట్లగుటచేతనే యాంధ్రోర్వీశుమోసాల రెండెనిమిదులు (౧౬) మ్రోగెనని చెప్పఁబడియెను. ఈకాలమునందలి నగరములలో బలెనే యాకాలమునందును సొమ్ముతీసికొని భోజనము పెట్టునట్టి పూఁట కూళ్ళయిండ్లు గల వని కూడ పై పద్యమువలన బోధపడుచున్నది. ఆకాలమున నొక్కరూకకు వడ్డించు భోజనపదార్థములను గూడ కవి యీవిధముగా నభివర్ణించియున్నాఁడు.

"ఉ. కప్పురభోగివంటకము కమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును గ్రొత్తగఁ గాఁచిన యాలనేపెస
ర్పప్పును గొమ్మునల్లనఁటిపండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడఁ ద్రాంబెరుగు లక్ష్మణ యొజ్జల యింటిరూకకున్."

పూఁటకూళ్ళుపెట్టు నిప్పటియిండ్లవలెనే యాకాలమునాఁటి పూఁటకూటి యిండ్లును దుర్నీతికిఁ బట్టుకొమ్మలై యుండె ననియే కవి చెప్పియున్నాఁడు.

"గీ. సంధివిగ్రహయానాది సంఘటనల
బంధకీజారులకు రాయబారి యగుచు
పట్టణంబున నిత్యంబు పగలురేయు
పూటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు."

మాచల్దేవివారాంగన.

అగ్నిసాక్షికముగా వివాహముఁ జేసికొన్న దేవులుగాక పూర్వరాజులు భోగకాంతల నుంపుడుకత్తెలనుగాఁ బెట్టుకొనెడు నాచార మానాఁడు గలదు. ఆయాచారమును ప్రతాపరుద్రచక్రవర్తి కూడ నవలంబించి యుండెను. ఆతని యుంపుడుకత్తెలలో మాచల్దేవి యను వారాంగన విశేషప్రసిద్ధి కలది. ఈమె మందిరమును గాంచి యచ్చెరు వందుచు మంచన గోవిందశర్మ ప్రక్కనున్న వారిని ప్రశ్నించినప్పుడు వార లీ క్రిందివిధముగాఁ బ్రత్యుత్తర మిచ్చి రని క్రీడాభిరామమునఁ జెప్పఁబడియెను.

"శా. ద్వీపాంతంబున నుండి వచ్చితివె భూదేవా, ప్రశాంతం మహా
పాపం, సర్వజగత్ప్రసిద్ధ సుమనోబాణాసనామ్నాయ వి
ద్యోపాధ్యాయి ప్రతాపరుద్రధరణీశోపాత్త గోష్ఠీ ప్రతి
ష్ఠాపారీణ నెఱుంగ వయ్యెదవు మాచల్దేవి వారాంగనన్.

ఆకాలమునం దరువాతికాలమునను మాచల్దేవి చరితమును గూర్చి నాటక మాడుచుండి రని యాగ్రంథమునందే తెలుపఁబడినది. మఱియు విటకాఁ డగు నా గోవిందశర్మ మాచల్దేవిని

గీ. కల్ల చెప్పము విను నీకుఁ గలప్రసిద్ధి
ఢిల్లి సురతాణికిని లేదు వల్లభోష్ఠి
యాదిలక్ష్మికి నీకును భేద మేమి
యుదధి జనింపకుండుట యొకటి దక్క."

అని యామెను శ్లాఘించినట్లు చెప్పియున్నాఁడు.



# కాకతీయాంధ్ర రాజయుగ చరిత్రము.

---

## శ్రీవీరప్రతాపరుద్రదేవ చక్రవర్తి పాలనము.

## మహమ్మదీయుల దండయాత్ర.

### పదునైదవ ప్రకరణము.

ప్రతాపరుద్రునకు సమకాలికుఁడైన రామచంద్రదేవుఁడు దేవగిరిరాజధానిగ మహారాష్ట్ర కుంతల దేశములను బరిపాలనము సేయుచుండెను. దక్కను దేశమును బరిపాలనము సేయుచుండిన స్వతంత్రరాజులలో ప్రతాపరుద్రునకుఁ దరువాత నీతఁడు మిక్కిలి బలాఢ్యుఁడని చెప్పఁదగినవాఁడుగ నుండెను. ఈతఁడు క్రీ. శ. ౧౨౭౧ మొదలుకొని క్రీ. శ. ౧౩౧౦ వ సంవత్సరమువఱకుఁ బరిపాలనము చేసెను. ఈయాదవరాజునకును ప్రతాపరుద్రునకును మనస్పర్థలు గలిగియుండియు నుభయులు బలాఢ్యు లగుటచేత నొండొరులను జయించుకొను ప్రయత్నమును విడిచి మౌనము వహించి యున్నకుండిరి. ఇట్లుండ, నుత్తరహిందూస్థానమున ననేకము లైన మార్పులు రాజ్యాంగమున జరుగుచుండెను. అదివఱకు నూఱువత్సరముల క్రిందట ఢిల్లీ సామ్రాజ్యమును విస్తరింపఁ జేయుచుండిరి. రాజపుత్రు లనేకులు బహుసంవత్సరములు మహమ్మదీయులతోఁ బోరాడి పోయినవారు పోఁగా హతశేషు లయిన వారు పర్వతప్రాంతభూములకు నెడారులకుఁ బోయి వేఱ్వేఱుసంస్థానములను స్థాపించి మహమ్మదీయులకు వశ్యులు గాక పౌరుషపరాక్రమములు నెఱపుచుండిరి. అయినను మహమ్మదీయులలో నొకవంశమునకుఁ బిమ్మట మఱియొక వంశమువారు వచ్చి క్రూరములైన దండోపాయములచే

సాధువు లయిన హిందూప్రజల హింసించుచు ఢిల్లీనగరమునఁ బరిపాలనము సేయుచు సామ్రాజ్యమును విస్తరింపఁ బ్రయత్నించుచుండిరి. బలవంతు లయిన యిట్టి శాత్రవులను గూర్చి యించుకయుఁ దలపోయక శాస్త్రవ్యాసంగములతోడను విద్వత్పండితగోష్ఠులతోడను కాలము వెళ్ళఁబుచ్చుచు రామదేవుఁడు స్వరాజ్య సంరక్షణమునం-దేమరి యుండెను. ఈతని రాజ్యమునకు దిగువను ప్రతాపరుద్రుని రాజ్య ముండుటచేత నీతఁడును ఉత్తరహిందూస్థానమునందు జరుగుచున్న చర్యలను పరికింపక మౌనధారణము వహించి తన్నుఁగట్టుకొనఁ దాళ్ళు తానే తెచ్చుకొన్నవాఁ డయ్యెను. మహమ్మదీయులవలన తనకు నపకృతి కలుగు నన్న తలంపు లేనివాఁ డగుటచేత సరిహద్దున నుండు దుర్గములను బలపఱచుకొనుటకుఁ బ్రయత్నింపక రాజధానీదుర్గమును మాత్రమె బలపఱుచుకొని యుండెను. అధిక ప్రఖ్యాతిఁ గాంచిన వీరు లయిన సేనానాయకు లనేకు లీతని రాజ్యమునం దుండిరి. అప్పుఁడు జలాలుద్దీ నను ఖిల్జీవంశస్థుఁడు ఢిల్లీ సింహాసనము నాక్రమించుకొని పరిపాలనము సేయుచుండెను. ఈతఁడు వృద్ధుఁ డగుటవలన రక్తమును బ్రసరింపఁ జేయుటయందు వాంఛ లేని వాఁడుగ నుండెను. అయినను నిరక్షరకుక్షియు, క్రూరుఁడు నైన యీతని సోదర పుత్త్రుఁడు అల్లాఉద్దీను సైన్యాధ్యక్షుఁడుగ నుండెను. ఇతఁడు బుందేలుఖండు (Bundelkhand) మాళవదేశములపై దండయాత్ర వెడలి వానిని జయించి యింకను మహాయుద్ధములను జేయ నభిలాష కలిగియుండెను.

## అల్లాఉద్దీను దక్కను దండయాత్ర.

ఇతఁ డెనుబదివేల యాశ్వికసైన్యముతో గంగాతీరమునందలి కురాయను ప్రదేశమునుండి బయలుదేఱి విదర్భదేశము మీఁదుగా వచ్చి యాకస్మికముగా దేవగిరిని సమీపించెను. అప్పుడు రామదేవుని సైన్యము రాజధానీ నగరమున బహుస్వల్పసంఖ్య కలదిగ నుండెను.

సైన్యమును సమకూర్చుకొని యెదుర్కొనుటకు నైన నవకాశము చిక్క దయ్యెను. మఱికొంద ఱితఁడు రాజధానీనగరమున లేఁ డని చెప్పెదరు. ఏది నిజ మైనను అల్లా ఉద్దీను దండెత్తి వచ్చె నన్నమాట విన్నతోడనే యెల్లటోనాలుగు వేల సైన్యమును పోగుచేసికొని మహమ్మదీయసైన్యాధిపతికిని దేవగిరి దుర్గమునకును నడుమ నిలిచి శత్రువుల నడ్డగింప బ్రయత్నించెనుగాని విశేషకాల మెదుర్కొని పోరాడుటవలనఁ బ్రమాదము గల దని యెఱింగి యప్పటికి భోజన పదార్థములచే దుర్గము నింపఁబడియె నని తెలిసికొన్నవాఁ డగుట వలన వెంటనే వెనుకకు మరలి దేవగిరిదుర్గములోఁ బ్రవేశించెను. అంతట మహమ్మదీయులు పట్టణము నంతను దోఁచుకొని కోటను ముట్టడించిరి. ఇంతియ గాక అల్లా ఉద్దీను చక్రవర్తి సైన్య మింకను వెనుకనే యున్న దనియు, ఈ వచ్చిన సైన్యము దానిలో నొక భాగ మనియు వదంతి కలుగఁజేసెను. రామదేవుఁడు మూర్ఖముగా నెదుర్కొనుటవలన లేశమాత్రమును బ్రయోజనము లే దని యూహించి సంధికై ప్రయత్నము చేసెను. అల్లాఉద్దీను తన సైన్యము యొక్క బలహీనతను దాను బాగుగా నెఱింగినవాఁడు గావున విశేషముగా సువర్ణము నొసంగినయెడ ముట్టడిని విడిచిపెట్టి పోదు నని తెలియఁజేసెను. ఇంతలో రామచంద్రదేవుని కొడుకు శంకరదేవుఁడు కొంత సైన్యమును గూర్చికొని తండ్రికి సహాయపడుటకై వచ్చుచుండెను. దానిం గనిపట్టి వేయిసైనికుల దుర్గముకడ నుంచి అల్లా ఉద్దీను తక్కిన సైన్యముతో శంకరదేవుని నెదుర్కొనియెను గాని హిందువులసంఖ్య యధికముగా నుండుటచేత మహమ్మదీయులు నిలువ లేక వెనుకకు మరలుచుండిరి. ఇంతలో కోటను ముట్టడించి యున్న సైనికులు వచ్చి కలిసి కొనిరి. ఈ సైన్యమును జూచి హిందువులు ఢిల్లీనుండి క్రొత్తగ సైన్యము వచ్చిన దని భయపడి పలాయనులైరి. రామచంద్రదేవుఁడు సంధి చేసికొనఁగోరఁగా మహమ్మ

దీయసేనాపతి యెక్కువ ధనమును గోరెను. ప్రతాపరుద్రుఁడు మొదలగు హిందూరాజులు పంపిన సైన్యములు దేవగిరికి వచ్చుచుండెను కాని యింతలో నదివఱకు కోటలోఁ దోయఁబడిన బస్తాలు ధాన్యపుబస్తాలు గాక ఉప్పుబస్తా లని తెలిసికొనఁబడియెను. భోజనపదార్థములు గూడ చాలకయుండెను. ఈ హేతువుచేత రామదేవుఁడు సంధిచేసికొనుట తప్ప దయ్యెను. అప్పుడు ౬౦౦ మణుగుల ముత్యములను వేయి వెండినాణెములును రెండు విలువగల నగలును ౪౦౦౦ పట్టుపీతాంబరములును బహుమానముగ నిచ్చుటయే గాక కొంత దేశము నొసంగి ప్రతిసంవత్సరము కప్పము చెల్లించుటకు నొడంబడినందున నా మహమ్మదీయ సేనాపతి ముట్టడి విడిచిపెట్టి ఢిల్లీనగరమునకు మరలి పోయెను.

### అల్లాఉద్దీను చక్రవర్తియగుట.

అల్లాఉద్దీను ఢిల్లీకి మరలిపోయిన తరువాత వృద్ధుఁడై డెబ్బదియేండ్లు వయస్సు నిండిన పెద్దతండ్రిని జంపించి క్రీ. శ. ౧౨౯౬ వ సంవత్సరములో సింహాసన మెక్కెను. ముల్తానునకు సైన్యమును బంపి జలాలుద్దీను కొడుకులను జయించెను. సింధుదేశమునుండి మంగోలియాజాతి వారిని దఱుమఁగొట్టెను. అధికసైన్యములను బంపి సురాష్ట్రము లేక ఘూర్జరమును కైవశముఁ జేసికొనియెను. ఇచ్చటనే మలిక్ కాఫూర్ అనువానిని బానిసగఁ బట్టుకొని పోయెను. ఇతఁడే తరువాత అల్లాఉద్దీను సైన్యమున కధ్యక్షుఁడై ప్రసిద్ధుఁడయ్యెను. మంగోలియాజాతివా రనేకులు దాడివెడలి వచ్చి ఢిల్లీనగరమును సమీపింపఁగా వారలతో ఘోరయుద్ధముచేసి వారిని పాఱఁదోలెను. ఈవిజయముతో నుప్పొంగినవాఁడై భరతఖండమున నేకమతము నేకసామ్రాజ్యము నెలకొలుపవలయు నని యూహించెను గాని హిందూదేశమున మతముతోఁ బ్రసక్తి కలుగఁ జేసికొనుట ధారు

కపాయకర మని తెలిసికొని యేకమత స్థాపన మనుదానిని విడచిపెట్టెను. మంగోలియా జాతివారి వలన నింక నపాయము లేదని తెలిసికొన్న తరువాత తన దృష్టిప్రసారమును దక్షిణహిందూ స్థానమువైపునకుఁ బఱపెను. అల్లాఉద్దీను విద్యావిహీనుండును క్రూరుడును విషయాసక్తుఁడు నైనను మంచి సమర్థుఁడు గనుక నేర్పరులయిన చారులను బంపి త్రిలింగదేశము నేలుచున్న ప్రతాపరుద్రుని రాజ్యాంగ బలముయొక్క శక్తిని రాజ్యతంత్ర రహస్యములను దెలిసికొని త్రైలింగ్య సామ్రాజ్యమును ఢిల్లీ సామ్రాజ్యమున గలుపుకొనవలయునని సంకల్పించెను. ఇట్టి సంకల్పమును నెరవేర్పఁగల సమర్థుఁడు తనకడనున్న బానిసవాఁడగు మలిక్ కాఫూర్ కన్న మఱియొక్కఁడు లేఁడని యాతని సైన్యాధ్యక్షుని గావించి త్రిలింగ సామ్రాజ్యమును జయింపఁ బంపి రాజపుత్ర సింహమును చితోడ్ గడమున కధిపతియు నగు భీమసింహుని రాణి పద్మిని నపహరింపఁ గోరి తమకంబుతోఁ దాను చితోడ్ గడముపైకి దండెత్తిపోయెను.

## మలిక్ కాఫూర్ ప్రథమ దండయాత్ర.

బానిసవాఁడయ్యును మలిక్ కాఫూర్ ధైర్యసాహసాది గుణవిశేషంబులచే మేటియోధుఁ డనిపించుకొని ఢిల్లీచక్రవర్తి యనుగ్రహమునకుఁ బాత్రుఁడై సైన్యాధ్యక్షపదవిని వహించి ప్రచండశాసనుఁడై యాసేతు హిమాలయ మేకచ్ఛత్రాధిపత్యముగా రాజ్యమేలవలయునని యువ్విళ్ళూరుచున్న వాఁ డగుటచేత పదివేల గుఱ్ఱపుదళముతోడను నలువదివేల పదాతివర్గముతోడను త్రిలింగదేశముపై దండెత్తివచ్చెను. ఇయ్యవి క్రీ.శ. ౧౩౦౩ వ సంవత్సరమునజరిగెను. క్రీ. శ. ౧౨౯౪ గవ సంవత్సరమున జయింపఁబడినది మొదలుకొని దేవగిరి నేలు రామచంద్రదేవుఁడు ఢిల్లీ చక్రవర్తితో మైత్రి కలిగియుండెను. కావునఁ దురుష్కసైన్యము లాతని రాజ్యమునకు

నేవిధమైన నష్టమును గలిగింపనందున రామదేవుఁడు సైన్యమునకుఁ దోడ్పడియెను. మహమ్మదీయులు తన దేశముపై దండెత్తి వచ్చుచున్నారనెడు భయంకరమైనవార్త చారులవలన విని ప్రతాపరుద్ర చక్రవర్తి భయకంపితుఁడు గాక మంత్రిసామంత వర్గముతోడ నాలోచించి యాశాత్రవసైన్యము నెదుర్కొనుటకై లక్షసైన్యమును బంపెను. ఈ సైన్యమున కంతకును ప్రతాపరుద్ర చక్రవర్తి పినతల్లిభర్త అన్నయదేవుఁడధ్యక్షుఁడుగ నుండెను. అశ్వ సైన్యమున కధిపతియైన మారయసాహిణియు గజసాహిణి మేచయ నాయఁడు నీతనికిఁ దోడుగా నుండిరి. ఇంకను కమ్మసేనానులు వెలమ సేనానులు పెక్కండ్ర సాహాయ్యముతో అన్నయదేవుఁడు మలిక్‌కాఫూర్ నెదుర్కొన గోదావరీ తీరమువఱకుఁ బోయి రేవుల నన్నిటిని గాచుకొని యుండెను. మలిక్‌కాఫుర్ ఆంధ్రదేశమును ప్రవేశించినతోడనే దేవాలయంబులఁ గూలంద్రోయుచు, పల్లెలను, పట్టణములను దోఁచుకొని తగులంబెట్టుచు భూమియు నాకాశము నొక్కటే జ్వాలఁగా నగ్నిఁ బ్రవహింపఁజేయుచు వచ్చుచుండఁ బ్రజలు భీతాహులై స్వస్థలములను విడనాడి యరణ్యప్రాంతములకుఁ బాఱిపోవుచుండిరి. ఇట్లు సాధువులు నిరపరాధులు నగు ప్రజలను సంక్షోభపెట్టుచు మలిక్‌కాఫుర్ గోదావరీ నదివఱకు వచ్చెను. అప్పుడుభయసైన్యములకును ఘోరమైన యుద్ధము ప్రారంభమయ్యెను. మహమ్మదీయ సైనికులు గోదావరినిదాటి రావలయునని యెన్నెన్నో ప్రయత్నములను గావించి భగ్నమనోరథులైరి. అనన్య సామాన్య క్షాత్రతేజంబు వహించి విక్రమ సింహంబులవలె విజృంభించి మొక్కవోని పౌరుషముతోడ శాత్రవవీరుల మార్కొని హిందూ వీరవరాగ్రణులు పోరాడి శాత్రవులచే సయితము పలు ప్రకారంబుల గొనియాడఁబడుచుండిరి. ఉభయపక్షములలోను వేలకొలఁది సైనికులు రణభూమికిఁ దమ ప్రాణంబు లర్పించి స్వామిభక్తిని బ్రకటించిరి.

మహమ్మదీయులు గోదావరీనదిని దాటి రాలేకపోవుటయు గాక తమస్థానంబుల సుస్థిరచిత్తులై నిలువఁజాలకపోయిరి. హిందువులు గోదావరీనదిని దాటివచ్చి పైఁబడఁగా శత్రువులయొక్క మధ్య భాగము విచ్చిపోయెను. అంతట హిందూరాహుత్తులు శత్రువులం దఱిమిరి. ఒకభాగమిట్లు పాఱినతోడనే తక్కిన మహమ్మదీయ సేనానులుకూడ సుస్థిరచిత్తులై నిలువంబడి పోరాడఁ జాలక వెనుదీసిరి. హిందూసైనికులు నారిని సరిహద్దులను దాటువఱకుఁ దఱుముచునే యుండిరి. ఈ దండయాత్రయందు మహమ్మదీయసైన్యము విశేషముగా నష్టమయ్యెను. మలిక్ కాఫుర్ సంపూర్ణముగా పరాభూతుఁడై ఢిల్లీకిఁ బాఱిపోవలసినవాఁ డయ్యెను. హిందువులవలన గలిగినఁ పరిభవమే మలిక్ కాఫుర్ హృదయమునకు శూలమై నాటి యెప్పటికైనను బగదీర్చుకొన వలయునన్న సంకల్ప మాతనికి బుట్టించెను. అట్టి యదనుకై మలిక్ కాఫుర్ నిరీక్షించుచుండెను.

"శివయోగసారమున:-

"ఓపితరకల గెలిచి ప్రతాపరుద్ర
మనుజనాయకుకోటనే మరకగాచె
ననుచుఁ బొగఁడఁగ నెగడెనియ్యవనియందు
లూరి యన్నయవేవుడనూనబలుఁడు."

అని చెప్పఁబడియుండుటచేత అల్లాఉద్దీనుని నోడించి తరుమగొట్టి ఏకశిలానగరదుర్గమును గాపాడినవాఁడు రుద్రమదేవి యల్లుఁడు ఇందులూరి అన్నయామాత్యుఁ డని స్పష్టపడుచున్నది.

## మలిక్ కాఫుర్ ద్వితీయదండయాత్ర.

ఇట్లాంధ్రులు విజయము గాంచుటకును, మహమ్మదీయులు పరాజితులగుటకును నత్యాశ్చర్యమును జెంది సేవణదేశమును

పాలించు రామచంద్రదేవుఁడు ఢిల్లీచక్రవర్తికిఁ గప్పము గట్టుట మానుకొనియెను. ఇయ్యది ఢిల్లీచక్రవర్తి యాగ్రహమునకుఁ బాత్రుని గావించెను. మహారాష్ట్ర త్రిలింగదేశములను జయించుటకై అల్లాఉద్దీను చక్రవర్తి ముప్పదివేల గుఱ్ఱపుదళమును లక్షకాల్బలము నిచ్చి మలిక్‌కాపురును క్రీ. శ. ౧౩౦౭ వ సంవత్సరము మార్చి నెలలో మరలఁ బంపెను. ఇట్టి మహాసైన్యముతోడ మలిక్‌కాఫుర్ దేవగిరికి వచ్చి దేవగిరిదుర్గమును ముట్టడింపఁగానే యా మహాసైన్యము నెదిరించుట కష్టమని రామచంద్రదేవుఁడు వానికి లోఁబడియెను. అంతట మలిక్‌కాఫుర్ సంతోషితస్వాంతుఁడై రామచంద్రదేవుని ఢిల్లీకిఁ బంపించి తా నా దేశమును విడిచి యేకశిలానగరముపై దండెత్తివచ్చెను. ఈరెండవసారియు మహమ్మదీయులకు నాంధ్రులకు మహాఘోరాహవము వాటిల్లెను. ఈ యుద్ధమునందు ఆంధ్రభటులు వేనవేలు హతమైరి. కాని విజయము మరల నాంధ్రులకే సంప్రాప్త మయ్యెను. మలిక్‌కాఫుర్ పరాభూతుఁడై ఢిల్లీకిఁ బాఱిపోయెను. ఆఱుమాసములకుఁ బిమ్మట రామచంద్రదేవుఁడు ఢిల్లీచక్రవర్తిచే సర్వసత్కారములను బొంది చెఱనుండి విముక్తిఁ గాంచెను. నాటనుండి ఢిల్లీచక్రవర్తికి విశ్వాసపూర్వకముగాఁ గప్పము చెల్లించుచుండెను. ఇట్లు తాను తురుష్కులచే జయింపఁబడి ఢిల్లీచక్రవర్తికిఁ గప్పము గట్టుచుండఁగాఁ దన ప్రతిపక్షియైన ప్రతాపరుద్రుఁడు స్వతంత్రుఁడై యుంట రామదేవునకు మనం బెరియించుచుండెను. అసూయాతత్పరుఁడై రామదేవుఁ డట్లు మహమ్మదీయులతోడఁ గుట్రలు చేసి వా రాంధ్రదేశముపై దండెత్తివచ్చునటులఁ బ్రోత్సహించెను. రెండు తడవ లాంధ్రులతోఁ బోరాడి యోడిపాఱినవాఁ డగుటచేత మలిక్‌కాఫుర్ చక్రవర్తి యనుజ్ఞగైకొని నలువదివేల గుఱ్ఱపుదళముతోడను లక్షకాల్బలముతోడను బుందేలుఖండము మార్గము మీఁదుగా బయలుదేరి వచ్చి దేవగిరిలోఁ గొంత

కాలము నివసించి రామచంద్రదేవుఁ డొనరించిన యాతిథ్యము నంగీకరించి తన సైన్యమునకుఁ గావలసిన పదార్థముల నన్నిటిని నతఁడే సమకూర్పఁగాఁ గృతజ్ఞతావందనపూర్వకముగ గ్రహించి యచ్చట నుండి బయలువెడలి యాంధ్రదేశమును బ్రవేశించెను. ఈ తృతీయ దండయాత్ర క్రీ. శ. ౧౩౦౯ వ సంవత్సరాంతమున సలుపఁబడినది.

## మహమ్మదీయుల తృతీయదండయాత్ర.

మరల మలిక్ కాఫుర్ మహాసైన్యముతో దండెత్తి వచ్చుచున్నాఁడను వార్త వ్యాపించినతోడనే దేశమున నొక మహాసంక్షోభము జనించెను. మహమ్మదీయులు తమ పూన్కిని విడువక యిట్లు పలుమాఱు దాడివెడలి వచ్చుటవలన హిందువుల ధైర్యకంచుకము సడలుచుండెను. అయినను ప్రతాపరుద్రుని సేనానులు రణశూరు లగుటచేత నించుకయుం జలింపక చక్రవర్తి యాజ్ఞను విశ్వాసపూర్వకముగాఁ దల నిడికొని తమతమ నియమిత స్థానంబులను విడువక ప్రాణంబు లర్పింపవలసినను వెనుదీయక శౌర్యాగ్నిఁ బ్రజ్వలింపఁ జేయుచు శత్రువుల నెదుర్కొని భయంకరముగాఁ బోరాడిరి. మహమ్మదీయులకు గుఱ్ఱపు దళ మధికముగా నుండుటచేతను సరిహద్దుల మార్గములందు హిందువులు సుస్థిరచిత్తులై నిలువంబడి పోరాడఁజాలక దారి యిచ్చుటచేతను మహమ్మదీయు సేనాధిపతికి మార్గము సులభసాధ్య మయ్యెను. శాత్రవసైన్యంబులు సరిహద్దు కోటల నాక్రమించుకొని గోదావరివఱకు రాగ హిందువుల కాందోళన మెక్కువయ్యెను. ప్రసిద్ధులయిన సేనాను లందఱును రాజధానీ దుర్గమును బ్రవేశించిరి. వేలకొలఁది రాచవారు, కమ్మవారు, వెలమవారు, రెడ్లు, వంటరులు మానమును గోలుపోవుటకన్నఁ బ్రాణమును గోల్పోవుటయే శ్రేయమని రణసూమికిఁ దమ ప్రాణంబు లర్పించి శాశ్వతమైన యశంబును సంపాదించిరి. శత్రువులు మార్గమధ్యమున

వాణీకవిదేవునిచే సంరక్షింపఁబడుచున్న సర్బరదుర్గమును ముట్టడించి యగ్నిహోత్రమును దాఁగొలిపి ప్రజ్జ్వలింపఁజేసిరి. వాణీకవిదేవుని వీరభటులు స్త్రీశిశుసమేతముగా నా యగ్నిహోత్రము నెదుర్కొని వీరస్వర్గమును జూఱఁగొనిరి. అగ్నిహోత్రము పాల్పడక బ్రతికి బైల పడిన వీరభటులు ప్రాణ మున్నంత దనుక శత్రువీరులతో ఖడ్గయుద్ధములు చేసి నేలఁగూలిరి. సర్బరదుర్గము మహమ్మదీయుల యధీనమాయెనని అమీరుఖుస్రూ యను చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. ఇట్లు మహమ్మదీయులు హిందువులతో బాహుయుద్ధముఁ జేయుచుఁ దోలుకొని వచ్చుచుండ హిందూసేనాను లెల్లరును మరలి యేకశిలానగరదుర్గములోఁ బ్రవేశించిరి. శత్రువు లోరుగంటి దుర్గమును ముట్టడించిరి. తురుష్కసైన్యము లోరుగంటి కోటచుట్టును నివాసస్థానము లేర్పఱచుకొనిరి.

ఈ యోరుగంటి కోటగోడ మట్టితోఁ జేయఁబడి ఉక్కుబల్లెముతోఁ బొడిచినప్పటికైన నొక్క పెల్లయినను రాలకుండునట్టిదిగా నుండె నని చరిత్రకారులే వ్రాసియున్నారు. తురుష్కసైన్యము లోరుగంటి కోట చుట్టును నివాసస్థానము లేర్పఱచుకొనిరి. మట్టికోట వెలుపలి ప్రాకారము యొక్క చుట్టుకొలత పంద్రెండువేల యైదు వందల నలువదియాఱు గజము లుండె నని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు.

తురుష్కసైన్యము లనేక భాగములుగ విభాగింపఁబడి యొక్కొక్కభాగము పండ్రెండువందల గజముల స్థలము చొప్పున నాక్రమించుకొని ప్రాకారముచుట్టును విడిసియుండిరి. ఈప్రకారముగా నేకశిలానగరదుర్గము చుట్టును నెంతమాత్రమును తెఱపి లేక యుండ మహమ్మదీయభట్టు లాక్రమించుకొని యుండిరి. "ఖ్వాజానసీరుల్ ముల్కుసీ రాజిద్దౌలత్" అనువాని నధికారము క్రింద నీసైన్యముం

పఁబడియెను.ఒకనాటిరాత్రి కోటలోనుండి వినాయక దేవుఁడ నెడుసేనాపతి యొకఁడు మూఁడువేల గుఱ్ఱపుదళముతో వచ్చి కఱ్ఱాబేగు అను మహమ్మదీయసైన్యాధిపతి పైఁబడియెను. ఉభయసైన్యముల కప్పుడు ఘోరయుద్ధముజరిగెను.హిందువుల మూఁడు వేలగుఱ్ఱపుదళమును సైన్యాధిపతితోఁగూడ నాశన మయ్యెను.మహమ్మదీయ భటులు పిశాచములవలె సుస్థిర చిత్తులై నిలువఁబడి యుద్ధముచేసిరి. ఇట్లు కొన్ని దినములు జరుగునప్పటికి మహమ్మదీయ సేనాలు విజృంభించి శత్రువులు తమపై గురిపించు నగ్నిహోత్రములోఁ బడి మిడతలవలె మ్రగ్గుచున్నను భీతచిత్తులు గాక అప్రతిమాన ప్రతాపముతో వీరరసము మూర్తీభవించినదో యన నాయగ్నిహోత్రము నెదుర్కొని "హుజ్జాహుజ్, ఖుజ్జాఖుజ్" అను ధ్వనులు మిన్నుముట్టుచుండఁ దెంపరులై పోయి కోటకు వెలుపలి ప్రాకారముగా నున్న మట్టిగోడ నాక్రమించుకొనిరి. అక్కడినుండి చూడ వారలకు ఱాతికోట గానిపించుచుండెను. ఇంతవఱకు వచ్చిన తరువాత సంధిచేసికొన కుండుట నీతికాదనియు నపాయకర మనియు నిశ్చయించి మంత్రివర్గముతో నాలోచించి ప్రతాపరుద్రుఁడు రహస్యముగా మలిక్ కాఫురునకు సందేశమును బంపెను. ఎట్లయినను ప్రతాపరుద్రుఁడు లోఁబడిన దే చాలు నని మలిక్ కాఫుర్ సంతోషించెను. తాను లోఁబడినందునకు గుర్తుగాఁ దన సువర్ణప్రతిమను వారికిఁ బంపి యనేక రత్నాభరణములను ధనము నొసంగెనఁట ! అంతట మలిక్ కాఫుర్ ముట్టడిమాని ధనభారమును వహించిన వేయియొంటెలతోడ క్రీ. శ. ౧౩౧౧ వ సంవత్సరము మార్చినెల ౧౬ వ తేదిని ఢిల్లీకిఁ బయనమై పోయెనని అతిశయోక్తిగా అమీరుఖుస్రూ యను మహమ్మదీయ చరిత్రకారుఁడు వ్రాసి యున్నాఁడు.

## ప్రతాపరుద్రుఁడు

### శ్రీశైలమునకుఁ బోవుట.

ప్రతాపరుద్రుఁడు మహమ్మదీయులతోఁ జేసిన యుద్ధమువలన నధికనష్టమును బొందినవాఁడు గావున మరలధనమును సంపాదించి రాజ్యమును బాగుపఱచుకొనవలసి యుండెను. అదియునుగాక తన రాజ్యమునకు దక్షిణపుసరిహద్దులలోనుండుమండలేశ్వరులు స్వతంత్రు లగుటకుఁ బ్రయత్నములు సలుపుచుండుటవలన వారలను శిక్షించి సరిహద్దులను గాపాడవలసియుండెను. మఱియును మతాభినిరతి కలవాఁడు గావున మార్గమధ్యమున నుండు శ్రీశైలక్షేత్రమునకుఁ బోయి మల్లికార్జునస్వామిని సందర్శింపఁ గోరి ప్రతాపరుద్రుఁడు ముందుగాఁ ద్రిపురాంతమునకును పిమ్మట శ్రీశైలమునకును బోయి యాక్షేత్రములకు ననేకభూదానములను గావించెను. అచ్చటినుండి ప్రతాపరుద్రుఁడు బయలుదేఱి కొచ్చెర్లకోటదుర్గమునకుఁ బోయి యచ్చట కొంతకాలము నివసించెను. ఆకాలములోఁ దన వేటకాం డ్రగు ఇరికప్ప, కేతినాయకుఁడను వారికి నచ్చట నొకప్రదేశమున నడవి నఱికి గ్రామమును గట్టవలసిన దని యుత్తరవు చేసెను. దీనినే దుప్పిపాడు లేక దూపాడు అని జనులు వ్యవహరించుచున్నారు. దీని చుట్టునుండు దేశమును దూపాడుసీమ యని పేరుపెట్టి అనుమకొండ నివాసియైన శ్రీనాథరాజునకిచ్చెను. అతఁడొకభవనమును గట్టుకొని యాసీమను బరిపాలించుచుండెను. కళ్యాణపురమునుండి సిరిసింగళ మహాదేవుఁడను నతఁడు తన మేనమామకూతురైన సింగళదేవితోఁ గూడ లేచివచ్చి ప్రతాపరుద్రుని నాశ్రయించినందువలన నతనికి నందికోటకూరుసీమ నొసంగెను. అతఁడా యరణ్యప్రాంతమును జక్కపఱచి గ్రామములను గట్టించి తనచరిత్రముతో సంబంధించిన

నామములనే వానికిఁ బెట్టెనఁట! అతఁడు పాలుత్రాఁగిన ప్రదేశము నకుఁ బాలమాఱ యనియు, అతఁడు శత్రువులతోడఁ బోరాడనపుడు కంఠహారమును విడిచిపెట్టిన స్థలమునకు వనమాలపా డనియు, అలుగులఁ దాను పోరాడిన స్థలమునకు అలుగులూ రనియు, నామములు కలిగె నని జనులు చెప్పుకొందురు. ప్రతాపరుద్రచక్రవర్తి యీకాలముననే కందనోలిసీమను విడెము కొమ్మరాజునకు నొసంగెను ఈమండలేశ్వరునకు నాగరాజు అను నియోగిబ్రాహ్మణుఁడు మంత్రిగ నుండి యనేక గ్రామములను నిర్మించి దానధర్మములను గావించి ప్రఖ్యాతి.గాంచెను; శా. శ. ౧౨౩౨వ సంవత్సరములో (౧౩౧౦) నీతనిపేరిటదానశాసనములు ముద్దనూరు, కొల్వ, దామగట్ల మల్యాల, అనుప్రదేశములందు గానబడుచున్నవి.

## జుట్టయలంక గొంకారెడ్డి.

ములికినాఁడు, పొత్తపినాడు, గండికోటసీమలో నివసించి యున్న త్రిపురాంత కాంబదేవుల బంధువయిన మల్లరాజు మొదలగు వారు కొందఱు వడ్డెరాజులతోఁ గలిసి తిరుగఁబడి స్వతంత్రులగుటకు బ్రయత్నింపఁగాఁ బ్రతాపరుద్రుఁడు చతురంగబలసమేతుఁడై పోయి వారిని నోడించి యాదేశములకుఁ దనపుత్త్రుఁ డయిన జుట్టయలంక గొంకారెడ్డిగారిని నధిపతిని గావించెను. ఇతని శాసనములు కొన్ని ములికినాటిసీమలోఁ గానవచ్చుచున్నవి. అందు చెందూరి శాసనము లో నిట్లున్నది.

"స్వస్తిశక వర్షంబులు ౧౨౩౬ (౧౩౧౩) అగునేటి ప్రమాదీచ సంవత్సరశ్రావణ శు ౧౨ బుధవారమునాడు స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర కాకతీయ ప్రతాపరుద్రదేవమహారాజు కుమారుఁడు మూఱులోక గండమూర్తి ముకుంద కుంత తీక్ష్ణత్రిప్రతిజ్ఞపరశుబిరుదాంక

రుద్రబిరుద బ్రహ్మరాక్షస గండికోట దుర్గవిభాళ మల్లదేవర గొండుగండ స్వయంభూనాథ దేవదివ్యశ్రీపాదపద్మా రాధకమహా రాయ కంఠకాలనాయకుండైన జుట్టయలంకగారు" జుట్టయప్రతాప రుద్రుని కుమారుడని యాశాసనములోని సంస్కృతశ్లోకములలో గూడఁ జెప్పఁబడినది. ఈజుట్టయ గొంకారెడ్డి ప్రతాపరుద్రున కౌరస పుత్రుఁడై నదియు, మఱియొక పుత్త్రుడైనదియు, భావిపరిశోధనము వలనఁ దెలిసికొనవలసియున్నది. ఎట్టిపుత్త్రుఁడైనను క్రీస్తుశకము ౧౩౧౩ వ సంవత్సరప్రాంతమున ములికినాడు గండికోటసీమలను బరిపాలనము సేయుచుండె నని యాప్రదేశములోని శాసనములే వేనోళ్ళఁ జాటుచున్నది.

## ప్రతాపరుద్రుడు పాండ్యరాజులను జయించుట

మహమ్మదీయులు ప్రతాపరుద్రునిపై దండెత్తివచ్చినారనియు, ప్రతాపరుద్రుడు శత్రువులతోఁబోరాడలేక సంధిచేసుకొన్నాఁడనియు విన్నతోడనే పూర్వవైరమును మనస్సునందుంచుకొన్న వీరపాండ్య విక్రమపాండ్య సుందరపాండ్య కులశేఖరపాండ్య పరాక్రమపాండ్యు లను నీయైదుగురు పాండ్యరాజులు కాంచీపురమును ముట్టడించి చోడ రాజైన మనుమగండ గోపాలుని నచట నుండి పాఱద్రోలి యాపట్టణ మాక్రమించుకొనిరి. మనుమగండ గోపాలుఁడు ప్రతాపరుద్రచక్రవ ర్తికిఁ గప్పము చెల్లించు సామంతప్రభువు గావున ప్రతాపరుద్రచక్ర వర్తిపక్షమున నతని మహామంత్రులలో నొక్కఁడును, ప్రతినిధి పాల కుఁడును సైన్యాధ్యక్షుఁడు నగు ముప్పిడి నాయకుఁడను కమ్మసేనాని పద్మనాయక వీరుఁడయిన రేచెర్ల యెఱ్ఱదాచానాయని పాండ్యుల మీఁదికిఁ బంపించెను. ఎఱ్ఱదాచానాయఁడు కాంచీపురసామీప్యమునఁ

పాండ్యులతో ఘోరయుద్ధముచేసి వారలను జయించి గజతురగచ్ఛత్ర చామరాందోలికాదులు పెక్కులు గ్రహించుటయుగాక శిరోభూషణ మగు నఱచేతి వెడల్పుగల యొకగొప్పపచ్చను ఒకస్వర్ణమయసింహాసనమును దీసుకొని వచ్చి తాను దెచ్చిన ధనకనకవస్తువాహనాదులు నమూల్యరత్నాదులును ప్రతాపరుద్రునకు సమర్పించెను. ప్రతాపరుద్రుఁడు మెచ్చి వానికి "పంచపాండ్యదళవిభాల" "కంచికవాటచూరకార" అను బిరుదముల నొసంగె నఁట! ఇతఁడు పాండ్యరాజును జయించినట్టు సింగభూపాలీయ మను గ్రంథమునందలి యీక్రింది శ్లోకమువలనం గూడ దెలియుచున్నది.

శ్లో. యస్యాసిధారామార్గేణ దుర్గే ఽపి రణాఙ్గణే
పాండ్యరాజగజానీకా జ్జయలక్ష్మీ రుపాగతా.
ఖడ్గనారాయణే తస్మిన్ భవతి శ్రీ రతిస్థిరా
భూ రభూ త్కారిణీ వశ్యా దుష్టరాజగజాంకుశా."

" చ. వెలయఁ బ్రతాపరుద్రవిభు వీరభటావళి చూడ నాజిలో
బలమునఁ గుంత మందుకొని చయ్యన వచ్చి గజంబు నొర్చి దో
ర్బల మధికంబుగా నెగడఁ బైకొని తా జయలక్ష్మి చేకొనన్
గెలచెను బాండ్యరాజగజకేసరి దాచయశౌరి పాండ్యులన్."

అని వ్రాయఁబడిన పద్యమువలనను రేచెర్ల దాచానాయఁడు పాండ్యులను జయించె ననుట ధ్రువపడుచున్నది. ప్రతాపరుద్రుని పేరిటిశాసన మొకటి తిరుచునా పల్లెలో జంబుకేశ్వరాలయములో నుండుటచేత నీదండయాత్రలోఁ బ్రతాపరుద్రుఁడు కూడ నుండెనేమో యని సందియము కలుగుచున్నది. ప్రతాపరుద్రుఁడు స్వయముగా దక్షిణదిగ్విజయయాత్ర చేసినను చేయకపోయినను ఇతఁడు సైన్యముల నంపి పాండ్యులను జయించినది వాస్తవ మనుటకు సందియము లేదు.

## ముప్పిడినాయకుఁడు రవివర్మను జయించుట.

విక్రమసింహ పురాధిపతియైన నల్లసిద్ధిరాజునకు జ్యేష్ఠకుమారుఁడైన మనుమగండ గోపాలదేవ చోడ మహారాజు కాకతీయ సైన్యాధిపతుల సాహాయ్యముతోఁ గాంచీపురమును మరల స్వాధీనము చేసికొని పరిపాలనము సేయుచుండఁగాఁ బరాభూతులయిన పాండ్య రాజకుమారులను దోడుచేసికొని కేరళదేశాధీశ్వరుండై రవివర్మ క్రీ. శ. ౧౩౧౩-౧౪-గవ సంవత్సరమునఁ గాంచీపురమును రెండవ మాఱు ముట్టడించి మనుమగండగోపాలునిఁ బాఱఁదోలి రాజ్యమాక్రమించుకొని కాంచీపురమునఁ బట్టాభిషిక్తుఁ డయ్యెను. ఈవృత్తాంతమును విని ప్రతాపరుద్రుని మహాప్రధానులలో నొక్కఁడగు ముప్పిడినాయకుఁడు దాక్షిణాత్యులను కాంచీపురమునుండి తఱుము గొట్టుటకై నియోగింపఁబడియెను. ఈముప్పిడినాయకుని తండ్రి నాగినాయఁడనియు, తల్లి గంగసానమ్మ యనియు, కందుకూరి సీమలోని గుడ్లూరు నీలకంఠేశ్వర స్వామివారి యాలయసమీపమునం బడియున్న యొక శిలాశాసనముం బట్టి దెలియుచున్నది. ఈసీమయందితని దానశాసనము లనేకములు గలవు. ఈకమ్మ సేనాధిపతియైన ముప్పిడినాయకుఁడు కాంచీపురమును ముట్టడించి పాండ్యకేరళుల తోడ ఘోరయుద్ధము చేసి రవివర్మ యాదిగాఁ గల రాజకుమారవర్గమును బాఱఁద్రోలి కాంచీపురమునం బ్రవేశించి మానవీరుని పట్టాభిషిక్తుని గావించెను. శ్రీమన్మహామండలేశ్వర మనుమగండ గోపాలదేవ చోడమహారాజే మానవీరుఁడని పేర్కొనం బడియెనని తోఁచుచున్నది. గాంచీపురము కొంతకాలమునుండి విక్రమసింహ (నెల్లూరు) పురాధిపతులయిన తెలుఁగు చోడులచేఁ బరిపాలింపఁ బడుచుండుటచేత మానవీరుఁడు తెలుఁగు చోడులలోని వాఁడుగానే పరిగణింపఁ బడవలయును. ముప్పిడినాయకుఁడు క్రీ. శ. ౧౩౧౭వ సంవత్సరముజూను

నెల ౧౧వ తేదిని మానవీరునికి పట్టబంధమును గావించి సింహాసన మెక్కించి ౧౬ వ తేదిని కాంచీపురములో నున్నట్టి అరుళాల పెరుమాళ్ల దేవాలయమునకు దానధర్మములను గావించి శాసనము వ్రాయించెను. పెయ్యూరు కొట్టమునాటిలో "అయిరచేరి" గుమ్మడిపూండి పాలెములలో పెయ్యూరు గ్రామమువలనను, కచ్చియూరు నాటిలోని పాండైపాక్కమను గ్రామమువలనను వచ్చెడి సంవత్సర పాదాయము ౧౦౨౨ గండగోపాల మాడలలోను ౨౮౦ మాడలు వేగవతీనదికి దక్షిణపుటొడ్డున నొక పుష్పోద్యానవనమును నిర్మించి నానావిధ ఫలపుష్పజాతి వృక్షములను నాటుటకును, దాని సంరక్షణము చేసెడి నౌకరుల జీతముకొఱకును, ౩౬౦ మాడలు దేవుని నిత్యకైంకర్యముల కొఱకును, ౩౮౨ మంటపము లాదిగాఁ గట్టడముల కొఱకును వినియోగించు నిమిత్తము దానశాసనమును లిఖించెను. ఈ శాసనమునుబట్టి కాంచీపురముగూడ నాంధ్రసామ్రాజ్యమునఁ జేరియున్నదని విస్పష్టమగు చున్నది.1

అల్లా ఉద్దీను మరణము, ఢిల్లీలో అల్లకల్లోలములు.

ప్రతాపరుద్ర చక్రవర్తి దక్షిణ దిగ్విజయ యాత్రలు ముగించి దేశమున శాంతి నెలకొలిపి రామరాజ్యముగ నాంధ్ర సామ్రాజ్యమును బరిపాలనము సేయుచుండెను. అల్లాఉద్దీను చక్రవర్తి సైన్యాధ్యక్షుఁడైన మలిక్ కాఫురు నెడ పక్షపాతమును జూపుచు మిక్కిలి యనురాగము గలిగి యుండుటచేత నీతనిమెడ ననేకుల కసూయ జనించెను. చక్రవర్తికిని వాని భార్యాపుత్రులకును బలవద్విరోధ మేర్పడియెను. మలిక్ కాఫుర్ వారలనుబట్టి చెఱలోఁ బెట్టెను. ఘూర్జరము చక్రవర్తియధికారమును దిరస్కరించెను.

---

1 Epigraphia Indica, Vol. VII. No. 18. Arulala Perumal Inscription of the Time of Prataparudra.

చితోడ్‌గడ మను రాజపుత్రసంస్థానము స్వాతంత్ర్యము నొందెను. దేవగిరిలో రామచంద్రదేవుఁడు వాని కుమారుఁడు శంకరదేవుఁడు మరణమునొందిన తరువాత రామదేవుని యల్లుఁడగు హరిపాల దేవుఁడు మహారాష్ట్రమునుండి తురుష్కులను దఱిమెను ప్రతాప రుద్రచక్రవర్తి మరలఁ బురికొని బలవంతుఁడై తనతో సమానుఁడై యొప్పుచుండెను. ఈసమాచారములను విని ఢిల్లీచక్రవర్తి దుఃఖము తోఁ గ్రుంగి, చేయునది లేక వ్యాధిగ్రస్తుఁడై యుండ విషప్రయోగ మును జేసి మలిక్ కాఫుర్ తనప్రభువును జంపించె నని చెప్పుదురు. అల్లాఉద్దీను క్రీ. శ. ౧౩౧౬లో చనిపోయెను. అల్లాఉద్దీనుచనిపోయిన తోడనే యతని పెద్దకుమారునికన్నుల నూడఁ బెఱికి వానిఁ జెఱ నుంచి యాతని తమ్ముఁడై దేండ్లవాఁడొకఁడుండగాఁ వానికిబట్టము గట్టి తానే పరిపాలనము సేయఁ బ్రారంభించెను. కాని వాని పరిపాలన మొల్లక వాని సేవకులే వానిని మట్టు పెట్టిరి. అల్లాఉద్దీనుని నాలుగవ కుమారుఁడు ముబారిక్ అనువాఁడు క్రూరుఁడై తనసోదరుల నంద అను జంపి పట్టాభిషిక్తుఁ డయ్యెను. ఇతఁడు ౧౩౧౮ దవ సంవత్సర మున మహారాష్ట్రదేశముపై దండెత్తివచ్చి దేవగిరిదుర్గమును ముట్ట డించి హరిపాలదేవునిఁ బట్టికొని మహాక్రూరుఁడై బ్రదికియుండఁగానే వాని చర్మ మొలిపించి చంపించి యారాజ్యమును దనసామ్రాజ్య ములోఁ గలుపుకొనియెను. ఢిల్లీనగరమునఁ బ్రవేశింపఁగానే ఖుస్రూ యను వానిసేనాధిపతి యానీచునిఁ దల నఱికివైచి తాను రాజ్యా రూఢుఁడయ్యెను. ఈఖుస్రూ యను వాఁడు ప్రచ్ఛన్నవేషముతోఁ నున్న హిందువగుటచేతఁ దురుష్కుల ద్వేషింప నారంభించెను.

అతని యనుయాయు లందఱును ఢిల్లీనగరములోని మసీదు లలో విగ్రహములను బ్రతిష్ఠింపసాగిరి. ఢిల్లీనగర మంతయు నల్ల కల్లోలముగా నుండెను, ఆసమయమునఁ బంజాబు దేశమునకు సుభా

దారుగా నున్న గజీబేగు తుఘ్లఖ్ అనువాఁడు వచ్చి ఖుస్రూను జంపి ఢిల్లీస్వాధీనముఁ జేసికొని గ్యాసుడ్డీను అను పేరు పెట్టుకొని రాజ్యపాలనముచేయఁ బ్రారంభించెను.

భాషాభివృద్ధి.

ప్రతాపరుద్రచక్రవర్తి యాంబాల్యకవితారసజ్ఞుఁడును, విద్వద్గోష్ఠి ప్రియుండును నగుటచేతఁ దనయాస్థానమున విద్వన్మహాకవుల ననేకులను నిలిపి పోషింపుచు వచ్చెను అట్టివారిలో విద్యానాథ మహాకవి యగ్రగణ్యుండని చెప్పందగును. అమ్మహాకవి ప్రతాపరుద్ర యశోభూషణంబను నలంకారశాస్త్రమును రచించి యాచక్రవర్తి కంకితము చేసెను. రుద్రభట్టను మఱియొక విద్వత్కవి సంస్కృత కర్ణాటభాషలయందుఁ బెక్కుగ్రంథములను రచించెను. త్రిపురాంతకకవి సంస్కృతాంధ్రముల ననేకగ్రంథములను రచించెను. ఇతఁడు ప్రేమాభిరామ మను వీథినాటకమును సంస్కృతమున రచింప దానిని శ్రీనాథమహాకవి వల్లభామాత్యుని పేరితోఁ దెనిఁగించి క్రీడాభిరామ మని పేరుపెట్టెను. ఈగ్రంథమునుండి యనేకపద్యముల నుదాహరించియే యున్నాను. ఇతనికాలమున మారనకవి మార్కండేయపురాణమును రచించి యితని మంత్రులలో నొక్కఁడగు గన్నమంత్రికి నంకితము చేసెను. భాస్కరకవి దశగతులను రామాయణమును రచించి యితని సైన్యాధిపతులలో నొక్కఁడగు సాహిణిమారుని కంకితము చేసెను. మంచనకవి కేయూరబాహుచరిత్రమును రచించి నందూరిగుండ నామాత్యుని కంకితము చేసెను. శివదేవయ్య యను ప్రధాని మంత్రి శివతత్త్వసార మను గ్రంథమును రచించెను. ఇంకను శైవు లనేకులు శైవగ్రంథములను రచించి యుండిరి. కావున నీచక్రవర్తి పరిపాలనకాలమున సంస్కృతాంధ్రభాషలు రెండును వర్ధిల్లిన వని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

## పరిపాలన వివరణము.

ఈతని ప్రభుత్వకాలమున నాంధ్రసామ్రాజ్యము రాష్ట్రములుగను, విషయములుగను, నాడులుగను, సీమలుగను విభాగింపఁబడి నియమితాధికారులచేఁ బరిపాలింపఁ బడుచుండెను. ఆకాలమున డెబ్బదిరెండు నియోగములు (Departments.) గల వనియు, వానిని విచారించు నధికారులు గల రనియు గంగయ సాహిణిం గూర్చి వ్రాయు ప్రకరణమునఁ దెలిపియున్నాఁడను. దానింబట్టియే పరిపాలనము పగడుగా నుండె నని తేటపడఁగలదు. రాజప్రతినిధులు, మండలాధికారులు, సైన్యాధిపతు లొకచోటనుండి మఱియొక చోటికి మార్పఁబడుచుండి రని వారిశాసనములు వేర్వేఱుకాలముల వేఱువేఱు దేశములందు గానంబడుటయె యిందునకు నిదర్శనముగాఁ జెప్పవచ్చును. రాజకీయాధికారు లెల్లరును శాఖాభేదములచేతను మతభేదములచేతను వేఱుపడియున్నను చక్రవర్తియాజ్ఞ సుగ్రీవాజ్ఞగా శిరమున వహింపఁబడుచుండెను. చక్కనిబాట లేర్పడియెను. వాణిజ్యము విదేశములతోడ దినదిన ప్రవర్ధమానమై యతిశయించుచుండెను. వేయునేల? ఈతని పాలనమున నాంధ్రుల ప్రతిభావిశేషము విదేశములందు వేనోళ్ళఁ గొనియాడఁబడుచు ఢిల్లీ చక్రవర్తులకు ప్రక్కలోని బల్లెమై నిదుర పట్టనీయక భయంకరమై యొప్పుచుండెను.

## ఇతరప్రసిద్ధ సేనానాయకులు.

కలియుగ వీరభద్రుఁ డని బిరుదుగాంచిన దేవరినాయనింగారు పల్నాటియందును, సోమయ వెంకయసాహిణింగారు వెలనాటియందును, కాచయబొప్పనింగారు కమ్మనాటియందును, పోతయసాహిణింగారు పాకనాటియందను ప్రతాపరుద్రుని కడపటికాలమున

నధికారపదవులను వహించి ప్రసిద్ధికెక్కియుండిరి. వీరిశాసనము లా యానాములలోఁ గనుపట్టుచున్నవి.

## రాజ్యవిస్తారము.

తూర్పున సముద్రముహద్దుగా దక్షిణమునఁ గాంచీపురముఁ హద్దుగా నుత్తరమునఁ గళింగదేశములోని సింహాచలపర్యంతమును పశ్చిమంబునఁ గల్యాణకటకమువఱకును ప్రతాపరుద్రుని సామ్రాజ్యము విస్తరించి యుండెనని చెప్పవచ్చును. అనఁగా నిప్పటి నిజాము రాజ్యములోఁ బదింటఁ దొమ్మిదిభాగములును, విశాఖపట్టణములోని సింహాచలమునకు దిగువభాగమును, గోదావరి, కృష్ణ, గుంటూరుఁ నెల్లూరు, చెంగలుపట్టు, చిత్తూరు, కడప, అనంతపురము జిల్లాలోని యుత్తరభాగము, బల్లారిజిల్లాలోని పశ్చిమభాగము, కందనోలుజిల్లా యును చేరియున్నవని నిస్సంశయముగాఁ జెప్పఁదగును.

## ఆంధ్రులు మహమ్మదీయుల నోడించుట.

గ్యాస్ ఉద్దీన్ తుఘలఖ్ ఢిల్లీనగరమునఁ బట్టాభిషిక్తుఁడైన వెనుక మంగోలియాజాతివా రయిన మొగలులవలన నేయుపద్రవముఁ గలుగకుండ సరిహద్దుప్రాంతముల సైన్యములను నిలిపి చక్కని కట్టుబాటుల నేర్పఱచి తన దృష్టినంతయు దక్షిణాపథము వంకకుఁ ద్రిప్పెను. తనకుఁ బ్రక్కలో బల్లెముగా నుండిన ప్రతాపరుద్రచక్రవర్తియొక్క పరాక్రమమును గూర్చినకథలు ఢిల్లీచక్రవర్తికి విన వచ్చుచుండెను. ఎందఱెందఱో రాజు లా యాంధ్రచక్రవర్తియెడ నసూయామాత్సర్యగ్రస్తులై యున్నారని గూడ నాతఁడు దెలిసి కొనియెను. ప్రతాపరుద్రుని యాస్థానమున నుండు సేనాపతులలో పద్మనాయకులకును దక్కన శాఖలవారలకును వైషమ్యములు వెలసి యున్నవనియు నిది దండయాత్రకు ననుకూలసమయ మనియు నేక

శిలానగరమునుండియు, దేవగిరినుండియు ప్రతాపరుద్రుని శత్రువుల వలన సమాచారము లంపఁబడెనని కూడ వదంతులు గలవు. ఇంత కన్న మంచిసమయము దొరకదని ఢిల్లీచక్రవర్తి క్రీ. శ. ౧౩౦౭వ సంవత్సరమున తన జ్యేష్ఠకుమారుఁ డైన అలూఫ్‌ఖానుని బదివేల గుఱ్ఱపుదళమును లక్షకాల్బలము నిచ్చి యాంధ్రదేశము మీఁదికిఁ బంపెను. ఈయలూఫ్‌ఖానునియొక్క నిజమైన నామము మలిక్ ఫకీరుద్దీన్ జూనా యని. ఈదండయాత్రలో అలూఫ్‌ఖానుని వెంబడించి వచ్చిన సైన్యములు చెందేరి, బుదావూన్, మాల్వా యను ప్రదేశములం బ్రసిద్ధికెక్కినవై యున్నవి. ఇట్టి ప్రసిద్ధిగాంచిన సైన్యముతోడ శత్రుదేశములఁ గొల్లగొనుచు నాంధ్రదేశమునఁ బ్రవేశించిన తోడనే ప్రతాపరుద్రచక్రవర్తి యించుకయుఁ జలింపక యాంధ్రసామ్రాజ్యమున మిక్కిలి పేరుమోసిన సేనానుల వీరుల నెదుర్కొనఁ బంపెను. అప్పు డుభయపక్షములవారికిని ఘోరసంగ్రామము జరిగెను. ఆంధ్రుల గుఱ్ఱపుదళముకంటెను దురుష్కుల గుఱ్ఱపుదళము బలాఢ్యమైనదియు నధిక సంఖ్యకలదియు నగుటచేత తుట్టతుదకు నాంధ్రులు బట్టబయల శత్రువుల నెదుర్కొనుటకంటె దుర్గములోనుండి యెదిరించుట యుక్తమని తలంచి వెనుకకు మరలి యేకశిలానగరదుర్గములోఁ బ్రవేశించిరి. మహమ్మదీయు లుత్సాహపూరితులై యేకశిలా నగరదుర్గమును ముట్టడించిరి. ఇట్లు మాసములకొలఁది ముట్టడి సాగించిమహమ్మదీయులు తెంపఱులైపోరాడ నాంధ్రపురుష సింహులును బ్రాణంబులు తృణప్రాయంబులుగా నెంచి శాత్రవులు సయితము వేనోళ్ళ గీర్తించునటుల నద్భుతపరాక్రమమును జూపి యుద్ధముచేయుచుండిరి. ఉభయపక్షములయందును వేలకొలఁది సైనికులు నాశనమైరి. ఉభయపక్షములను సేనాపతు లనేకులు వీరస్వర్గమును జూఱఁగొనిరి. దుర్గముమాత్రము శత్రువులయధీనమ్ము

కాలేదు. మహమ్మదీయ సైనికుల కుత్సాహము తగ్గెను. వేలకొలఁది సైన్యము నాశనమైనను కోటగోడ రవంతబెల్లయిన నూడిపడక దృఢముగానుండెను. అక్కాలము మండువేసవి కాల మగుటచేత ప్రచండములయిన వేఁడిగాడ్పులు వీవఁదొడంగెను. అనేకులు వడ గొట్టువడి ప్రాణములఁ గోల్పోవుచుండిరి. కలరా మున్నగు వ్యాధులు శత్రువులఁ బీడింపఁ దొడంగెను. మహమ్మదీయ సైనికులఁ బిఱికితనము హెచ్చి ముట్టడిమాని స్వదేశమునకు మరలిపోవఁదలంపుగలిగెను. తురుష్కస్కంధా వారమున భీత్యావహము లగు వదంతులు వ్యాపింపఁ జేయబడుచుండెను. అదివఱకు నెలనుండి ఢిల్లీసమాచారములు తెలియకుండుటచేత అలూఫ్ఖాను మిత్రులును, డెమాస్కస్ పురవాసియైన షెకుజడా యను నాతఁడును, ఓబీదను ప్రసిద్ధకవిశిఖామణియును, ఢిల్లీచక్రవర్తియైన గ్యాస్ఉద్దీనుతుఘ్లఖ్ మరణముఁ జెందెననియు, ఢిల్లీనగరమున విప్లవము సంభవించెననియు వదంతులు పుట్టించిరి. అంతటితోఁ దృప్తినొందక ముద్రాధికారియైన మలిక్ కాఫుర్, మఱియొక యధికారియైన మలిక్తుగ్గే యనువారల కడకుఁ బోయి ఢిల్లీ సమాచారములఁజెప్పిరి. మఱియు సింహాసనముపై తనకుంగల హక్కును వారు నిరాకరింపవచ్చునని సంశయించుచు అలూఫ్ఖాను తమ్మును విడిచిపోవ నిశ్చయించినాఁడని చెప్పిరి. ఈ యసత్యవాక్యములను విశ్వసించి యా సేనాధిపతులు తమతమ యనుచరులతో నారాత్రియె స్కంధావారమును విడిచి తొలఁగి పోయిరి. ఇట్లు తరువాత కొందఱు తన్ను విడిచిపోవుటచేత అలూఫ్ఖాను ముట్టడి మానుకొని దేవగిరికిఁ బాఱిపోయెను. ఆంధ్రుల గుఱ్ఱపుదళము వెంబడించివచ్చి పైఁబడి వేలకొలఁది శత్రుసైన్యంబును నఱికివైచెను. అలూఫ్ఖాను దేవగిరి చేరిన తరువాత ఢిల్లీసమాచారములనుగూర్చిన వదంతులు వట్టివని తెలిసికొని మిక్కిలి దుఃఖించెను. చెదరిపోయిన

సైనికులఁ జేర్చుకొనుటకుఁ బ్రయత్నించుచుండెను. అలూఫుఖాను విడిచిపోయిన మహమ్మదీయ సేనాధిపతులు మార్గమధ్యమున నాంధ్రులచే మార్కొనఁబడి యనేకులు సహరింపఁబడిరి. ఆంధ్రసైనికులు శత్రువులయొక్క యేనుఁగులను గుఱ్ఱములను, ఒంటెలను సర్వస్వమును సంగ్రహించుకొని పోయిరి. మలిక్ తైమూరు తుగ్గీను అను మహమ్మదీయ సేనాపతు లిరువురు ప్రాణములం గోల్పోయిరి. మొదటివాఁడొక యాంధ్రసైన్యాధిపతిచేఁ జెఱఁబెట్టఁబడి యాచెఱలోనే మృతినొందెను. రెండవవాఁడు నఱికివేయఁబడియెను. "మల్లిక్ గూల్ అఫీఘన్, మల్లిక్ కాఫుర్" అను వారలనిరువురనుతమ సైనికులే చెఱఁగొని. దేవగిరికిఁ దీసుకొని పోయిరి. అప్పుడు వీరలదుష్టప్రవర్తనమునుగూర్చి విచారణజరిగి నేరము చేసిన వారిని కనిపెట్టి వారిని ఢిల్లీ నగరమునకుఁ బంపించిరి. ఈ యధికారులా ఢిల్లినగరము ప్రవేశించిన తోడనే బాదుషా "పరిహాసమునకై బ్రదికియుండగానే నన్ను పాతిపెట్టినారు గనుక బ్రదికియుండఁగానే వీరిని నేను పాతిపెట్టించుచున్నా" నని చెప్పి యాయధికారుల నందఱను ప్రాణములతోఁ బాతిపెట్టించెను.

అలూఫుఖాను దేవగిరినుండి ఢిల్లీనగరమును జేరునప్పటికి నతనితోఁ గూడ నున్నది మూఁడువేల గుఱ్ఱపుదళము మాత్రమే. ఇట్టి మహాపరాభవమునకుఁజక్రవర్తియు, వానితోపాటుమహమ్మదీయ ప్రపంచమును మిక్కిలిగ దుఃఖించిరి. ఇట్టి పరిభవమును దురుష్కులంతకుఁ బూర్వమెన్నఁడనుభవించి యుండ లేదు.

తురుష్కుల కడపటిదండయాత్ర.

ఇట్టి పరిభవమును భరియింపఁజాలక చక్రవర్తి యాగ్రహ మహోదగ్రుఁడై యెట్లయినఁ బగదీర్చుకోవలయునని సంకల్పించి రెండుమాసములలో సైన్యమును సమకూర్పించి అలూఫుఖానునే

మరల నాంధ్రదేశముమీఁదికిఁ బంపించెను. ఇంతత్వరలో తురుష్కు-లు మరల దాడివెడలివత్తురని యాంధ్రులు తలంచి సిద్ధముగనుండ లేదు. ప్రసిద్ధ సేనానాయకులు గొందఱింతవఱకే యుద్ధమున మరణమునొంది యుండుటచేత సైన్యములోఁ గ్రొత్తమార్పులను జేయవలసి యుండెను. అట్టిమార్పులు చేసికొనుట కవకాశము లేకపోయినది. కాలము మీఱి వచ్చినప్పు డెవ్వరును జేయునది యుండదు. కాకతీయ సామ్రాజ్యము భగ్నమగుకాలము సంభవించెను. ఈశ్వరాజ్ఞ నెవ్వరు గడవనేర్తురు? కమ్మవారికిని పద్మనాయక వెలమలకును అంతః కలహములు మెండయ్యెను. అయినను నెల్లశాఖలవారును స్వామిభక్తిపరాయణులై యొప్పియుండిరి. మొగలులగు తురకలు ధైర్యసాహసములు ముప్పిరి గొన బీడరు (విదర్భాపురము) దుర్గమును ముట్టడించి కైవశము చేసికొని క్రమముగా రాజధానీనగరమును ముట్టడించిరి. పూర్వమువలెనే యాంధ్రులు మొక్కవోని పౌరుషముతోఁ దురుష్కులను మార్కొని ఘోరసంగ్రామమును గావించిరి. మహమ్మదీయులు పెక్కుదినములు ముట్టడివేసి చలముపట్టి సాధించి గోడ బ్రద్దలుచేసికొనిపోయి "హుజ్జాహుజ్" ఖుజ్జాఖుజ్" అను భీకర ధ్వని సెలంగ నాంధ్రవీరులతోఁ బిశాచములరీతి హోరాహోరిఁ బోరాడి యెట్టకేలకు నంకుల సమరంబునఁ బ్రతాపరుద్రునిం బట్టుకొనిరి. అతని విడిపింప పద్మనాయకులు, కమ్మవారు, రెడ్డినాయకులు, రాచవారు ప్రయత్నించి యెందఱెందఱో పోరాడిరి గాని యందఱును రణభూమికి దేహములర్పించుకొని వీరస్వర్గమును జూఱఁగొనవలసినవారయిరి. రాజ్యలక్ష్మి కాకతీయులను విడనాడి పోయెను. దైవబలము లేని వట్టిపౌరుషముతో నేమి ప్రయోజనము. శత్రువులు ప్రతాపరుద్రుని కుటుంబ సహితముగా కదర్ఖాన్, ఖ్వాజాహాజీ అను వారివెంట ఢిల్లీనగరమునకుఁ బంపెననియు, అచ్చటివారు పరమానందమగ్నులై మహోత్సవము గావించిరనియు మహ

మ్మదీయ చరిత్రకారులు కొందఱు వ్రాసియున్నారు. కాని యది యంతగా విశ్వసింపఁదగినదిగాఁ గనఁబడదు. ఏకశిలానగరము మహమ్మదీయుల వశమయ్యెను. అమ్మహానగరమునకు సులతానుపురమని అల్లాఫుఖాను పేరు పెట్టెను. ప్రతాపరుద్రుని చెఱనుండి డిల్లీచక్రవర్తి విడిపించెనని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియుండలేదు గాని హిందువులగాథలుమాత్రము ప్రతాపరుద్రుఁడు కారాగృహవిముక్తుఁడై వచ్చి గోదావరీతీరమునఁ దపస్సుచేసి కొనుచుండి మరణముఁ జెందెనని చెప్పుచున్నవి. ఈతని కారావిమోచనమును గూర్చి యొకచిత్రమైన కథ కలదు. ప్రతాపరుద్రుని బ్రాహ్మణమంత్రియగు యుగంధరుఁడను వాఁడు పిచ్చివాని వేషమును ధరించి డిల్లీనగరమున విహరించుచు చక్రవర్తిని మాయఁజేసి ప్రతాపరుద్రుని విడిపించుకొని వచ్చెనని చెప్పుదురు. కాని యిదియును విశ్వాసపాత్రమైనది కాదు. ఎందులకన మారనకవి తన మార్కండేయ పురాణములోఁ గృతిపతియైన నాగయగన్నమంత్రిని నీతికి యుగంధరునివంటి వాఁడని యభివర్ణించి యుండెను. కనుక యుగంధరుఁడనువాఁ డనువాఁ డెవ్వఁడో ప్రతాపరుద్రునకుఁ బూర్వము నందే ప్రసిద్ధికలిగి యుండవలయును. కాఁబట్టి యాకథ కవికల్పనమై యుండును. ప్రతాపరుద్రుని సేనానాయకులలో నొక్కఁడగు రేచెర్ల సింగమనాయని పుత్త్రుఁడు అనపోతానాయఁడు క్రీ. శ. ౧౩౬౯ వ సంవత్సరములో అయ్యనవ్రోలు దేవస్థానములో వ్రాయించిన శిలాశాసనములో "రాయబందీవిమోచక" యను బిరుదము వహించినటులు చెప్పఁబడి యున్నది. ఇతఁడు రాయబందీవిమోచకుఁడని చెప్పుట కాధారమేమియును లేదు. ఆకాలమునకు నీతఁడు రాయనిరాజ్య మాక్రమించుకొని పరిపాలించుచున్నవాఁడు. కనుక నీతఁడు తన తండ్రియైన సింగమనాయఁడు వహించిన "రాయబందీ

విమోచక” యను బిరుదమును అనపోతానాయఁడు వహించి యుండును. కాఁబట్టి రేచెర్లసింగమనాయఁడు, అతని సోదరులగు పద్మనాయక వీరులు ప్రతాపరుద్రుని డిల్లికిఁ బంపుటకుఁ బూర్వమె శత్రువులను జయించి చెఱనుండి విడిపించి యుండవచ్చును. అట్లు కాదేని డిల్లీచక్రవర్తిచేతఁ బడినప్రతాపరుద్రుఁడు బ్రతికి యెట్లు వచ్చును? ప్రతాపరుద్రుని యంతటి వాని చెఱనుండి విడిపించునంతటి యుదారచిత్తుఁడగునేని డిల్లీచక్రవర్తి ప్రతాపరుద్రుని మరల రాజ్యమున కభిషిక్తునిఁ గావించియే యుండును. అట్లు జరిగియుండలేదు. కనుక మేము వ్రాసినదే నిజమైయుండవలయును. ప్రతాపరుద్రుఁడు రేచెర్లసింగమనాయఁడు మొదలగు వారివలన చెఱనుండి విముక్తుఁడైనను ఏకశిలానగరము తురుష్కుల యధీనమగుటచేత గోదావరీ తీరమున నెక్కడనో నివసించియుండి యత్యల్పకాలములోనేస్వర్గస్థుఁడై యుండునని మేము తలంచుచున్నాము.

సమాప్తము.

---

# అనుబంధము.

## మున్నూఱు కాపులు—విమర్శనము.

మున్నూఱుకాపువారిలో నొక కొందఱు దమకుఁ గలిగిన యపవాదులను బోఁగొట్టుకొనఁగోరి మున్నూఱు శబ్దమును మున్నీరుగా మార్చుకొనుటకు గట్టి ప్రయత్నము చేయ సమకట్టిరి. మున్నూఱు మున్నీరుగా మార్చుకొన్నను వీరి నీయపవాదు విడిచిపెట్టునటుల గన్పట్టదు. భీమేశ్వరపురాణంబున,

"చందురుని తోడఁ గల్పవృక్షములతోడఁ
దారతో లక్ష్మితో నమృతంబు తోడఁ
గౌస్తుభముతోడ మున్నీటఁ గలిగి నారు
విబుధగంధర్వ జాతు లవ్వేటి సతులు."

"నిలింప గంధర్వాప్సరో జాతులగు సానికూతు"లనియు, వీరు మున్నీటఁ బుట్టినవారని చెప్పుచుండుటచేత నియ్యది నిష్ప్రయోజనమైన మార్పుగాని వివేకముతోఁ జేయునట్టిమార్పు కాదు. మున్నూఱు కాపుసంఘమువారే మున్నీరు కాపుకులముగా స్థిరపఱచుకొన్న యెడల నితరులేమో యన్నారని నిందింపఁ బనియుండదుగదా. పరి[illegible] పడవలసినపని యంతకుముందే లేదు.

భాస్కరాచార్యవిరచితమైన కన్యకాపురాణమునందు (వైశ్య పురాణము) విష్ణువర్ధన మహారాజు (రాజమహేంద్రిపురము నేలిన రాజు) దాడికి భయపడి ౭౧౨ గోత్రముల వైశ్యులు తమ వైశ్యత్వము విడిచి పలాయనులైనట్లుగా నీ క్రింది పద్యములోఁ జెప్పినాఁడు.

"కమ్మటవారని కమ్మవారను జేర
నిన్నూఱు గోత్రాల హీనమతులు,
గోల గొల్లలమంచు గోపులై మున్నూఱు
గోత్రాల వారేగి రాష్ట్రపడునఁ
బడమటకేగియు భగ్నమై దుష్టత
మూరి పాఱుటఁ జేసిఁ దూర్పులనఁగ
తూఱుపు నాటికి దుర్మార్గులై యేఁగి
రెనబడి గోత్రాల హీనమతులు,
దక్షిణంబున నెడపెను దరణి యనుగు
నూఁడి రొకనూట ముప్పదిమూఁడు గోత్ర
ముల దురాత్ములు త్తరమున కెలమి తోడ
ప్రాణభయమున నంతంతఁ బరువు లిడుచు."

ఇందు రెండవ పాదమున మున్నూఱుగోత్రాల వైశ్యులు తమ వైశ్యత్వమును విడిచి విష్ణువర్ధనుని దుష్టత్వమును దూఱి పడమటకు గోపవేషములు దాల్చి బాఱిపోయినవారు మున్నూఱు కాపులేమైయుందురా యని యొకరు ప్రశ్నించినారు. కాని, అట్లయిన మున్నూఱు కాపుకులము వారి సంప్రదాయముల ననుసరించి వీర కులముగా కనుపట్టునుగాని పిఱికిపందల కులముగా గనుపట్టదు. ఏమన, వీరిలో పెండ్లి ౪ వరోజు రాత్రి కంకణవిసర్జనము తరువాత నాకబలి యనంతరము, ఇష్టదేవతయగు వేంకటేశ్వర ప్రీత్యర్థమై దీపారాధనయు, పూజయు, చేయుదురు. అటుపిమ్మట "వీరుల కొలుపు" లేక "వీరబలుకు" అను నొక యుత్సవమును జరుపుదురు. అది మున్నూటివంశము వారి పూర్వీకులగు వీరనాయకుల జ్ఞాపకార్థము జరుపఁబడును. వీరులపలుకులఁ బలుకుచు, కరవాలములఁ ద్రిప్పుచు కొందరు బంధువులు పెండ్లిదంపతుల కడకువచ్చి వారిని దీవించి దిష్టితీయుదురు. వీరకులమని చెప్పుట కింతకంటె సంప్రదాయ కథల దృష్టాంతమేమి యుండును? ఇట్లు వీరకుల మనుదృష్టాంతమున్నను మున్నూర్వారు తమ ప్రభువు బలవంతుఁడై దుష్టుఁడై దుండగము

లాచరించునపుడు దుష్టునకు దూరముగా నుండుమని మారువేషము లతో దేశమును విడిచి పడమటికి వలసి పోయిన మాత్రిన పిటికి పందలన వచ్చునా? కావున నిప్పుడు మున్నూరు కాపుకులమునకు మూడుగాథలు చుట్టఁబెట్టుకొన్నవి. ఒకటి రామాయణము నాటిది. ఒకటి దక్షారామాయణము నాటిది. ఒకటి కన్యకాపురాణము నాటిది. కడపటిది నవీనతను దెలుపుచున్నది. రామాయణము గాక దక్షారామాయణ మేమిటని కొందఱ కచ్చెరువు కలుగవచ్చును. కాని రామాయణము లెన్ని లేవు? వానిలో దక్షారామాయణము వ్యాసకవి ప్రణీతమైన దొకటి కలదని తన భీమేశ్వరపురాణమున శ్రీనాథకవిసార్వభౌముఁ డిట్లు చెప్పినాఁడు.

"శ్రీ రామాయణమును, ద
క్షారామాయణముఁ గలిమలాప హములు స
త్సారమతులు వాల్మీకికిఁ,
బారాశర్యునకు వినుతి పాత్రములయ్యెన్."

మున్నూఱ్వారను వారు హైదరాబాదు రాష్ట్రములోని "తెలంగాణము" లోనే యుండుటనుబట్టి గోదావరిమండలములో నుండియే వలసపోయి యుందురని నిశ్చయింపవచ్చును.

పైమూఁడు గాథలలోను మొదటిది విశ్వసింపఁ దగినదనియె నా యభిప్రాయము. రెండవదైన భీమేశ్వరపురాణగాథలు వీరికి బట్టునవగునో కావో మనుష్యమాత్రులమైన మనకు బోధపడుట కష్టము. శ్రీనాథుఁడు "దక్షపురి సానికూతుల దవిలినాఁడు, విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు" అనియు, "సాని యీసానియై" అనియు, ఉత్తమ నాయికా నాయక గర్భజనితలైన యీసానులు, అనియు,

" పదునాల్గు మహాయుగముల
ముదుకగు భీమేశ్వరునకు మొగచాటై యుం

డదు సానిపెండ్లి యెప్పుడు
నది దక్షారామ మహిమ మగనో కాదో"

అనియు,

"...........గన్నెలు కాదారి ప్రొ
ద్దున భీమేశుఁడు సానివాడకరుగుఁ భూర్తప్రకారంబునఁ."

అనియు,

"మోక్షస్థానము భోగభూమియునై మున్నూలు క్షేత్రములఁ
సాక్షాద్బ్రహ్మ పదంబనంగ నపరస్వర్గంబు నా నొప్పుగుఁ
దక్షారామము భీమనాయక మహాధామంబు లోకత్రయీ
చక్షుఃప్రాహుణకాయసుషమా సంపత్సముద్దాసమై."

అనియు నీరీతిగా నభిప్రాయములు గ్రుమ్మరించి యున్నప్పుడు ఆత్మగౌరవముగల నెట్టిమానవుఁడైనను, ఎట్టిపండితుఁడైనను, యుక్తాయుక్తవిచక్షణ జ్ఞానమును బోవిడిచి "మున్నూ" అను సంఖ్యావాచక శబ్దమును గ్రహించి యున్నంత మాత్రముచేత నాప్రత్యేక కులమున కిట్టి కళంకమును నంటకట్టఁ బూనుట దుస్సాహస మనిపించుకొనును.

ఇంతకును దక్షారామసానుల యుత్పత్తియేమి? వీరెందులుగాఁ జెప్పఁబడినారు? ఆభీమేశ్వరపురాణమే,

"గీత వాదిత్ర నృత్యంబు కేవలంబు
శంభునకు సార్వకాలంబు సంభ్రమింప
నప్సర స్త్రీల నర్పించె నాలునూలు
బాలలను, యువతుల జంభ భంజనుండు"

ఆవంశంబున సానికూతులయి దివ్యస్త్రీలు దుగ్ధాబ్ధి మధ్యావిర్భూతలు ......" అని ఘోషించుచుండఁగా నాలుమూఁడు చేయుట హాస్యాస్పదముగాదా?

ఆంధ్రదేశమునందు "ఆఱుమూఁడు" చేయుట" యను నపహాస్యభాజనమైన తెలుఁగుసామెత సమస్తప్రజల చేతను, సమస్త వ్యవహారముల యందును వ్యవహరింపఁబడుట నెరుఁగని వారెవరు? నాల్గనఁగా రెండనుట యెట్లో ఆఱనఁగా మూఁడనుట అట్లే. భీమేశ్వర పురాణము శ్రీనాథకవిసార్వభౌముఁడు తన కాలమునాటి దుర్మత దురాచరణముల నపహసించుటకై రచించిన యొక యుత్తమహాస్య ప్రబంధముగాని మఱియొండు గాదు. దీనినిబట్టి మున్నూరుకాపుకుల తత్త్వము బోధపడునది కాదు. ఆపురాణగాథ నీతికి న్యాయమునకు, ధర్మమునకు, లోకాచారమునకు, సంబద్ధవిషయము గాదు.

చేబ్రోలు శాసనమున స్వామికైంకర్యాదులకయి పోషించుట నిమిత్తము మున్నూరు సానులు, మున్నూరు అయ్యనులు నియోగింపఁబడినారని యున్నంత మాత్రమున మున్నూరు కాపుకులతత్త్వము బోధపడు చున్నదా? మున్నూరుశబ్దము సంఖ్యావాచక శబ్దమగుట చేత పెక్కు విషయములలో పెక్కుసందర్భములలో గాననగును. త్రిపురాంతక శాసనములలో నొక దానియందు నొక మంత్రి పెఱికి వాండ్రకు మున్నూఱు నివేశనముల నొసంగినట్లుగలదు. అప్పుడు మున్నూరు కాపులు పెఱికీలగుదురా? దక్షిణాపథమును బరిపాలించిన యాంధ్రశాతవాహనుల కాలమున పశ్చిమసముద్ర తీరమునుండి యొడలమీఁద ప్రాక్సముద్రతీరమున ఉత్తరపినాకినీనదీముఖద్వారము నందలి యొక రేవుపట్టణమునకు మున్నూరు మంది తమ కుటుంబముల తోడ వలసపోయినట్లు బౌద్ధుల గాథలలోఁగలదు. వారినే మున్నూరు కాపులందమా! దక్షిణాపథమునందు "మున్నూటిగుంపను నొక గుంపు వారు (బలిజలకు భోగమువాండ్రకుఁబుట్టిన అశాస్త్రీయసంతానము) కలరని "థర్స్టను" అనువారు దక్షిణదేశజాతులు, తెగలు అను గ్రంథములో వ్రాసియున్నారు. అది కులముపేరుగాదు. దానికి ముడిపెట్టుట

ధర్మమగునా? కుంభకోణమునుండి మున్నూరు వెళ్ళాల తెగవారు ట్రావెన్కూరు రాజ్యమునకు వలసిపోయి "మున్నూటిల్కరు" అని వ్యవహరింపఁబడుచున్నారు. వారినే వీరందురా? ప్రాణ్ తెగలో నొక శాఖవారగు "వేల్ణ్" అనువారు "మున్నుత్తాన్" అని వ్యవహరింపఁబడుచున్నవారు గలరు. "పాణ్" శాఖలలోఁ జేరి "వేల్ణ్" శాఖవంటి వారేయైన "అంజుత్తాను" (ఏనూఱుమంది) మలబారులోఁ "మున్నుత్తాన్" గా వ్యవహరింపఁబడుచున్నారని తెలియుచున్నది వీరినెల్లరను మన మున్నూరు కాపులని వ్యవహరింపవచ్చునా? ఇట్టి వెన్నోకలవు. మనము యుక్తాయుక్త విచక్షణ జ్ఞానముతో పరిశీలించవలయును గాని మున్నూరు శబ్దము గాన్పించినంతమాత్రమునఁ దెలియనప్పుడు దేనికో ముడివెట్టఁ జూచుట న్యాయముకాదు.

## మున్నూరుకాపుల వర్తమాన స్థితి.

హైదరాబాదు రాష్ట్రమున "తెలంగాణము" అను భాగములో "మున్నూఱు కాపు" లనువారు లక్షలకొలది నివసించుచున్నారు. వీరిలో 100కి 70 మంది వ్యవసాయమె వృత్తిగాగలవారుగానున్నారు. కొందఱు గ్రామములలో 'పటేలులుగను, గొప్పగొప్ప భూస్వాములుగను, మఱికొందఱు జమీందారులుగను పెంపొంది సుఖజీవనము చేయుచున్నారు. అధికసంఖ్యాకులు కాపులుగనుండి భూజీవనము చేయువారుగా నున్నారు. వీరిలోఁ గొందఱు భూములు లేనివారు భాగ్యవంతుల యిండ్ల నౌకరులుగనుండియు, మఱికొందఱు దినకూలీలుగ నుండియు, జీవించుచున్నారు. నవీనముగా చాలమంది తమ స్వవృత్తులను విడిచిపెట్టి దొరతనములో నుద్యోగస్థులుగాగాని వర్తకులుగాఁగాని యుండి జీవనము జరుపుకొనుచున్నారు. వీరెవ్వరును జందెములను ధరింపరు. 1931 జనపరిగణన ప్రకారము 2 లక్షల 6 వేలకుఁ బైనఁగలరు.

1901 వ జనపరిగణనాధికారిగా నియమింపఁబడిన మెహదీ ఖానను వారు మున్నూరు కాపులను గూర్చి వ్రాయుచు వీరు కాపులతో "సమానసాంఘిక స్థితియందు" తులతూగుచున్నారనియు, వీరెల్లరు 'తెలంగాణా' భాగములో మాత్రమె గనుపట్టుచున్నారనియు వ్రాసియున్నారు 1

సెంట్రల్ ప్రావిన్సెసు జనపరిగణనాధికారులగు ఆర్. వి. రస్సల్ గారు "త్రైలింగులు, మున్నూఱువారు తెలుఁగు దేశములో వ్యవసాయము వృత్తిగాగల గొప్ప కాపు కులములోని వారుగా నున్నారు. (P.19)

హైదరాబాదు రాష్ట్రమునందుండెడు 'జాతులు, తెగలను' గూర్చి 1920 సంవత్సరమునందు వ్రాసిన గ్రంథమునందు 'మున్నూఱు' కాపులనుగూర్చికూడ వ్రాసియున్నారు. 2

వీరు తమ గ్రంథముయొక్క యుపోద్ఘాతములో నిట్లు వ్రాసియున్నారు. అది చదువరులు గ్రహింపఁదగిన ప్రథమవిషయము.

"కేవలము నామూలమునఁ గాకపోయినను నిశ్చయముగా ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులోని వారగు "కాళే" యను వారి నాయకత్వముక్రింద నేర్పడిన భక్తిపరులగు సంఘముద్వారా మిక్కిలి యభినివేశముతో నీ గ్రంథము తయారుచేయఁబడినది. కాళె మున్నగు వారు రాష్ట్రమునందంతటను సంచారముచేసి దక్కనులోని హైదరాబాదు రాష్ట్రమున నివసించు "జాతులను గూర్చియు, తెగలను గూర్చియు విలువయైన విషయములను మొదట సమకూర్చి పెట్టిరి. నేనును కాళేగారుచేసిన పరిశోధన విషయములను నాకు సాధ్యమగు

(1) 1891 Vol XXIII. Page 179, Census Report.

(2) The Castes and Tribes of H. E. H. The Nizam's Dominions by Syed Siraj- Hassan of Merton College, Oxford, Trinity College, Dublin and Middle Temple, London, One of the Judges of H. E. H. The Nizam's High Court of Judicature: Lately Director of Public Instruction.

నంతవఱకు నాశక్తికొలది ప్రతిస్థలమునందు గాకపోయినను సరి చూచి వానినే యనుకరించితిని. అప్పుడు మొత్తమున నదృష్టదేవత మాకెదురు నడచుచుండెను. నాకు దృష్టిమాంద్యదోషముపట్టి నారాజకీయోద్యోగ సంబంధకార్యజాలము మాట యటుండ నీ గ్రంథము పుటలెప్పుడైన వెలుతురును జూడఁగల్గునా యని యనుకొనునంత నిరుత్సాహము గలిగినది. కడపట నీ గ్రంథముయొక్క కడపటి చిత్తుపుటలను దమముందు నుంచునప్పటికి కాళేగారు మృతినొందుట సంభవించి యెక్కువ నష్టము పాలుగావించెను. దయగల నామిత్రులు నాకు సహాయముఁ జూపకున్న యెడల నన్నీకార్యమునఁ బ్రవేశ పెట్టిన ఫైనాన్సు డిపార్టుమెంటు (Finance Department) వారి యొత్తిడి యెంతవేగిర పెట్టినను నేనీ గ్రంథమును బ్రకటించుట కెప్పుడు నిష్టపడియుండను. అయినప్పటికి, నా యీ గ్రంథములో సమకూర్చిన సాధనసామాగ్రి సరిగా నుపయోగించుకొని జాతిచరిత్ర సాహిత్యమునకుఁ జేరిన యీ గ్రంథమునకు మంచిరూపమును గన్పించుట కితరుల కవకాశము గల్పించునన్న యాసతో నున్నాను."

వీరు గొప్ప విద్వాంసులై యుండియు, ఉన్నతోద్యోగములలోనుండియు నిట్టి ఘనకార్యము నిర్వహించినందుకు నేను వీరినభినందించుచున్నాను.

కాని వీరీ కార్యము నిర్వహించుటలో "కాళే" గార్ల మహారాష్ట్రులయియుండుట చేతను, తెలుగు జాతులు, తెలుగు తెగలు గూడ నుండుటచేత కాళేగారితో సమానుఁడగు నొక తెలుఁగు నాయకునిగూడ జతచేసికొని నిర్వహించిన యెడల తెలుఁగువారి కసంతృప్తికలుగక యుండునేమోయని తలంచు చున్నాను.

"కాళే"గారు కేవలము మహారాష్ట్రులగుటను, తెలుఁగు తెగల సంప్రదాయ చరిత్రము నెఱుంగని వారగుటచేతను, ఈ గ్రంథములో వారినిగూర్చిన ప్రశంసలలో గొప్ప ప్రమాద విషయ

ములు చొప్పింపఁబడినవి. వీనిని సవరింపవలసిన బాధ్యత గ్రంథకర్త గారికిఁ గలదని మనవి చేయుచున్నాను.

ఈసందర్భమున నామిత్రులను గొందఱిని నేను ప్రశ్నించి నప్పుడు వారివలన నాకీ క్రిందివిషయము జరిగినట్టు తెలియవచ్చినది. కాళెగారితోగూడ (1) శ్రీనివాసరావుగారు, (2) శ్రీసీతారామ రావుగారు, మల్లేపల్లి రంగారావుగారు, అనువారిని పంపిరట. మున్నూటు వారినిగూర్చి నల్లగొండలో (దేవరకొండ తాలూకా) నొకసభ జరిగెననియు, ఆసభలో మున్నూటు వారిపక్షమున బ్ర॥ శ్రీ॥ బిన్నూరు రామయ్యశాస్త్రులవారు కాళె మొదలగు వారితో వాదించి మున్నూటి వారి విషయమున వ్యాపకములయిన గాథలన్ని యుఁ గల్పితములనియు, వారతిప్రాచీనులనియు, అందు కాధారము భాగవతములో శ్రీరామచరిత్రమునందలి పద్యమును జదివి వ్యాఖ్యా నముచేసి యిప్పటి మున్నూటుశాఖవారు ఆపద్యమునందలి మున్నూటి వీరుల (త్రిశతుల) సంతతులవారే యని సిద్ధాంతముఁజేసిరఁట కాని కాళె మొదలగువారు వారిసిద్ధాంతము నఱుకుగొనక తమ దారినే తాము త్రొక్కుకొని పోయిరట.

వీరిగ్రంథమున భర్తృహరికి మున్నూర్వురు భార్యలు వేశ్యాటు జాతికి సంబంధించినవారుండిరనియు వారు స్వేచ్ఛగా విహరించు టవలనఁ గలిగిన సంతానమె మున్నూర్వా రయినారను మొదలుగా గల యబద్ధపు గాథలను నుదాహరించుట తప్పని వేఱచెప్పనక్కఱ లేదు. వీరిలో భర్తృహరిని పూజించుపద్ధతి లేదని నేనువిని యున్నా ను. కాపులలో నితరశాఖలవారిలో నెట్టిసదాచారములు గలవో వీరిలోను నట్టి సదాచారములు గలవు. గ్రంథవిస్తరభీతిచేత వాని నిట నుదహరించుట మానితిని. అవసరముపట్టినప్పుడు మఱియొక సంపుటములో వీరి చరిత్రము విస్తరింపఁబడును.

---

శ్రీ సుజనరంజనీ ముద్రణాలయం, రాజమహేంద్రవరము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 10 | 19 | ... | పరిశోధన | ... | పరిశోధన |
| 13 | 24 | ... | తీర్థాములను | ... | తీర్థాలను |
| 15 | 20 | ... | నిర్థారణ | ... | నిర్ధారణ |
| 16 | 12 | ... | ప్రప్రధమమున | ... | ప్రప్రథమమున |
| 23 | 14 | ... | కాకర్త | ... | కాకర్త్య |
| 24 | 8 | ... | బట్టారక | .. | భట్టారక |
| 24 | 11 | ... | 945 | ... | 955 |
| 25 | 5 | ... | కాకర్తుఁడా | ... | కాకర్త్యుఁడా |
| 25 | 6 | ... | గుండ్య | ... | గుండ్య |
| 26 | 14 | ... | యోధా | ... | యోధా |
| 31 | 14 | ... | శత్రుపరపరంపరల | ... | శత్రుపరంపరల |
| 45 | 7 | ... | పృధ్వీ | ... | పృథ్వీ |
| 46 | 13 | ... | సుశీల | ... | శీల |
| 47 | 18 | ... | చిక్కులంపెట్టి | ... | చిక్కులంబెట్టి |
| 48 | 4 | ... | మనోరధుఁడు | ... | మనోరథుఁడు |
| 48 | 21 | ... | విష్ణువర్ద | ... | విష్ణువర్ధ |
| 50 | 1 | ... | ౧౧౧౬ | ... | ౧౧౧౯ |
| 51 | 22 | ... | అని | ... | అను |
| 52 | 18 | ... | పంధా | ... | పంథా |
| 55 | 6 | ... | ౧౧౧౮ | ... | ౧౦౭౯ |
| 64 | 1 | ... | సుప్రసిద్ద | ... | సుప్రసిద్ధ |
| 70 | 9 | ... | దనంజయ | ... | ధనంజయ |

| పుట | పంక్తి | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 72 | 12 | ... | కథల సత్య | ... | కథల సత్య |
| 74 | 28 | ... | గృహు | ... | గృహ |
| 85 | 23 | ... | న నేకద శ్వాసమున | | నేకాదశా శ్వాసమున |
| 92 | 20 | ... | త్రమ్బుకసఖో | ... | త్ర్యంబకసఖో |
| 96 | 14 | ... | వర్ణించి | ... | వర్ణించి |
| 103 | 20 | ... | సామ్రాజ్యవిచ్ఛిన్న | | సామ్రాజ్యము విచ్ఛిన్న |
| 104 | 4 | ... | వారందఱునుత్ఖ్యాకుని | | వారందఱును నిత్ఖ్యాకుని |
| 105 | 17 | ... | మహాలీర | ... | మహావీర |
| 105 | 20 | ... | పార్శ్వ | ... | పార్శ్వ |
| ,, | 21 | ... | ,, | ... | ,, |
| ,, | 24 | ... | ,, | ... | ,, |
| 106 | 2 | ... | ,, | ... | ,, |
| ,, | 11 | ... | ,, | ... | ,, |
| ,, | 18 | ... | ,, | ... | ,, |
| 107 | 1 | ... | ,, | ... | ,, |
| 108 | 5 | ... | కృతిమ | ... | కృత్రిమ |
| 136 | 7 | ... | మండము | ... | మండలము |
| 144 | 4 | ... | పాలొనుచు | ... | పాల్గొనుచు |
| 167 | 4 | ... | రాజిపత్రి | ... | రాజప్రతి |

168 పుటలో 9దవపంక్తిలో "సామంత మండలేశ్వరుఁడుగా నుండినో లంబవాడి విషయమును బరిపాలించు" నను వఱకు విడిచిపెట్టిచదువు కొనవలయును.

| పుట | పంక్తి | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 171 | 29 | ... | ఇదిపాఠా | ... | ఇందుపాఠాం |
| 183 | 6 | ... | దాను | ... | దాసు |
| 195 | 18 | ... | యనర్థము | ... | యనర్థముల |
| 208 | 6 | ... | నాయనిని | ... | నాయని |
| 212 | 11 | ... | వల్నాటి | ... | పల్నాటి |
| 214 | 4 | ... | తి్రభుసన | ... | త్రిభువన |
| 214 | 10 | ... | పృధ్వీ | ... | పృథ్వీ |
| 230 | 3 | ... | శాననముల | ... | శాసనముల |
| 235 | 22 | ... | చరి్రము | ... | చరిత్రము |
| 245 | 12 | ... | రాష్టము | ... | రాష్ట్రము |
| 248 | 6 | ... | స్పష | ... | స్పష్ట |
| 251 | 3 | ... | సంవత్సరలో | ... | సంవత్సరములో |
| 251 | 13 | ... | రుదు్రదేవుఁడు | ... | రుద్రదేవుఁడు |
| 252 | 2 | ... | జద్దేవుని | ... | జగద్దేవుని |
| 252 | 7 | ... | జగద్దేడు | ... | జగద్దేవుఁడు |
| 254 | 20 | ... | జద్దేదేవుఁడు | ... | జగద్దేవుఁడు |
| 268 | 2 | ... | శౌననము | ... | శాసనము |
| 274 | 9 | ... | హిందూ | ... | హిందూ |
| 303 | 8 | ... | పర్యర్త | ... | పర్యన్త |
| 305 | 20 | ... | దభిమానముతిపా | ... | దభిమానము |
| ,, | ,, | ... | పండితపక్షమై | ... | పండితపక్షపాతిమై |
| 320 | 8 | ... | చూటకై | ... | చూచుటకై |
| 331 | 11 | ... | లెవ్యరు | ... | లెవ్వరు |

| పుట | పంక్తి | | తప్పు | | ఒప్పు |
|---|---|---|---|---|---|
| 333 | 14 | ... | వివేషణము | ... | విశేషణము |
| 344 | 6 | ... | నేల్యు | ... | నేలు |
| 349 | 7 | ... | వామిరెడ్డి | ... | నామిరెడ్డి |
| 361 | 21 | ... | సమకూర్చుటికై | ... | సమకూర్చుటకై |
| 373 | 12 | ... | విబ్రాంతి | ... | విభ్రాంతి |
| 375 | 1 | ... | 1195లా నొకసారియు | | 1195లో నొకసారియు |
| | | | క్రీ. శ. 1195లో | ... | క్రీ. శ. 1198లో |
| 382 | 9-13-15 | ... | పండ్రెండు | ... | పది |
| 386 | 23 | ... | పురముల | ... | పురమున |
| 387 | 2 | ... | వచ్చిన సేనను సేనాధి | ... | వచ్చిన సేనాధి |
| 387 | 9 | ... | తెగనే | ... | తెగగనే |
| 402 | 10 | ... | హనుమసిది | ... | మనుమసిద్ధి |
| 409 | 4 | ... | జరిగెంచె | ... | జరిగించె |
| 432 | 9 | ... | భావిప | ... | భావింప |
| 435 | 3 | ... | ప్రయతము | ... | ప్రయత్నము |
| 455 | 4 | ... | విస్మృతికై | ... | విస్తృతికై |
| 463 | 25 | ... | సిద్దాంత | ... | సిద్ధాంత |
| 468 | 10 | ... | లక్కాబా | ... | లక్కాంబా |
| 489 | 6 | ... | సాలకొలను | ... | పాలకొలను |
| 489 | 20 | ... | సినఉదయామహా | ... | పినఉదయమహా |
| 503 | 12 | ... | బుద్దారాజు | ... | బుద్ధరాజు |
| 519 | 11 | ... | విడిచె | ... | విఱిచె |

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
|---|---|

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | REH130214L05 |
| పుస్తకం పేరు | ఆంధ్రుల చరిత్రము |
| తారీఖు | 4, 1, 2024 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 655 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | CI, 6, ii, VI |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Rakshitha |
| పేజీలు విడదీసినది | Rakshitha |
| స్కాన్ చేసినది | poothyusha |
| పరీక్ష చేసినది | NANDHU |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | no |
| పరిస్థితి | good |